# శ్రీ కాళికా పురాణం



పురిఘళ్ళ శ్రీఫణి సీతారామన్

# శ్రీ కాళికా పురాణము

గ్రంధకర్త

పురిఘళ్ళ శ్రీ ఫణి సీతారామన్





# అంకితం

శ్రీ సీతారామచంద్రుల పాదపద్మములకు





# శ్రీరామ స్థుతి

దిక్కెవరని తలచెడి వారల చుట్టము
దశదిక్కుల నిండియున్న ధరణిజ పతికిన్
దినకర వంశాంబుధి దివ్యదీప్తి
నిక్కంబుగ నీవె నాకు దిక్కు మహాత్మా ॥

# శ్రీ సీతా స్థుతి

పలికిన ముత్యాల సరుల వానట
చిలికిన చిరునగవుల సిరుల పంటట
కులికిన రఘురాముని చిత్తము ఝల్లనునట
తలచిన తరుణీమణి మా యమ్మ సీతట ॥





# గమనిక

ఈ గ్రంథంలో ఎన్నో జంతుబలుల గూర్చి ప్రస్తావింపబడినది. జంతుబలులు కావింపమని రచయిత ఉద్దేశ్యం ఎంతమాత్రం కాదు. వామాచారమందు తెలుపబడిన ఆ సాధనా రహస్యాలను కేవలం యధాతథముగ తెలుపడమే నా ఉద్దేశ్యము. అట్లే ఎన్నో నిగూఢమయిన మంత్రములు సహితము ఈ గ్రంథములో తెలుపబడినవి. వానిని వేటినైననూ, ఎవరైన సాధించుటకు యత్నింపదలచిన, దయచేసి గురుముఖతా వానిని నేర్చుకొనప్రార్ధన. తెలిసీ తెలియక వీనిని ప్రయత్నించిన ఎడల అవి ప్రమాదమునకు గురిచేయును. పాఠకులు దయార్ద్ర హృదయముతో వీనిని అర్ధము చేసికొన వలెనని కోరి ప్రార్ధించుచున్నాను.

–రచయిత



# విషయ సూచిక



## అనుబంధము

వర్ణ కవచము
యోగినీ కవచము
దేవౌఘ కవచము
దేవీ కవచము
అభేద్య కవచము
అష్టాక్షర కవచము
కామాక్షీ కవచము
త్రిపురా కవచము



#  ముందుమాట 

"వేదో నిత్యం". వేదం నిత్యం, అనంతం, ఆద్యంత రహితం. ఘూర్ణిల్లే వేద ఘోష నుండి ఉత్పన్నమయిన సుధాభాండం పురాణం. వేదమందలి నిగూఢ రహస్యాలను సుందర, సుమధుర ఉపాఖ్యానాలతో మనసుకు హత్తుకొనేలా వివరించి ప్రవచించింది పురాణం. పురాణ వాఙ్మయం సర్వం వేదవ్యాస మహర్షి ప్రోక్తం. ఆ మహానుభావుడు పద్ధెనిమిది పురాణాలను విరచించి మానవాళికి అందించాడు. ఆయ్యది లోక విదితం. "మద్వయం బద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం, అనాపలింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్ ". వ్యాస భగవానుడు పద్ధెనిమిది ఉప పురాణాలను కూడా రచించాడు. ఈ పురాణాలు మిగిలిన పురాణాలంత ప్రఖ్యాతం కాదు.

గర్గ సంహిత రచించిన తరువాత మనసులో చాలా శూన్యం ఆవరించింది. ఈ శూన్యాన్ని అత్యంత పవిత్రమైన కార్యాలతో పరిపూర్ణం చేయాలి అనే భావం హృదయంలో అంకురించింది. ఆ మధనంలో స్ఫురించిన భావం, పరిపూర్ణ దైవ నిర్ణయం ఈ పద్ధెనిమిది ఉప పురాణాలను తెలుగున తెనిగించి శ్రీ సీతారామచంద్రమూర్తికి అంకితం చేస్తే నా జన్మ సాఫల్యం కలుగుతుంది అని అనిపించింది. ఆ బృహత్ పథకంలో భాగంగా ప్రప్రధమంగా ఆవిర్భవించిన పూజా కుసుమం "శ్రీ కాళికా పురాణం".

ఈ మహాగ్రంథాన్ని అనువాదం చేయడానికి నాకు సహకరించిన మహానుభావుల్ని, పుస్తక రచయితలను ఇక్కడ తలచుకోవాలి. ప్రప్రధమంగా శ్రీ నీలేష్ జత్వా. ముద్రలన్నింటినీ అర్థం చేసుకొనడంలో నాకు సహకరించటమే కాకుండా, వాటిని తన చేతులతో విన్యాసమొనర్చి, ఛాయాగ్రహణం కావించి, కంప్యూటర్‌లో వాటిని రేఖాయుతం చేసిన మహానుభావుడు. ఆయన సహకారానికి ఎంతో కృతజ్ఞుడిని. అంతేకాక తన మేధ, సమయస్ఫూర్తి నుపయోగించి AI (Artificial Intelligence) సహాయముతో కాళికా ముఖ చిత్రమును హృద్యముగ, సర్వాంగ సుందరముగ తీర్చిదిద్దిన మహానుభావుడు. ఆయనకు హృదయ పూర్వక పాదాభివందనము చేయుచున్నాను. చాలాకాలం క్రితం మా ఇంటికి విచ్చేసి, నాకు నర్మదబాణ లింగములను పంపించి, సరస్వతీ కటాక్ష సిద్ధికై, నాకు సరస్వతీ స్తోత్రమును ప్రసాదించిన మాన్యులు, మహానుభావులు, గురువులు, శ్రీ విష్ణు తుల్యులు శ్రీశ్రీశ్రీ గోరుగంటు అక్కుభట్ల శర్మగారు. నన్ను వెన్నుతట్టి ప్రోత్సహించిన మహానుభావులు. ఆయనకు శిరసు వంచి సాంజలిబంధకముగ పాదాభివందనం చేయుచున్నాను. తన సహృదయతతో, పవిత్రమైన ఆశీశ్శులతో నన్ను దీవించే మా పిట్స్‌బర్గ్ పురోహితులు శ్రీ ధర్మతేజ గారు. వారి పాదములకు సాంజలి బంధకముగ నమస్కరించుచున్నాను. చివరగా నాకు ఎల్లప్పుడూ ప్రోత్సాహాన్ని ఇచ్చి, నాలో ఉత్సాహాన్ని నింపే నా శ్రీమతి ఉమ. ఆమె సహాయ సహకారములకు నేను ఎల్లప్పుడూ కృతజ్ఞుడను.

ఈ గ్రంథాన్ని ఆంధ్రీకరించడానికి నాకు ఎంతో తోడ్పడిన గ్రంథములు హిందీలో విరచితమయిన శ్రీశ్రీ ఎన్.ఎన్.ఖండేల్‌వాల్, ఆచార్య మృత్యుంజయ త్రిపాఠీ ల హిందీ అనువాదము మరియు ప్రొఫెసర్ బి.ఎన్.శాస్త్రి గారు రచించిన ఆంగ్లానువాదము. వీరందరికీ శిరసు వంచి సాంజలి బంధకముగ పాదాభివందనము కావించుచున్నాను.

నాకు పురాణాలు అత్యంత అవగతం కావు. భాషమీద పట్టు సహితము అంతంత మాత్రమే! అయినా నా సాహసానికి కారణం నా సామర్థ్యం మీద నాకున్న నమ్మకం కాదు. నా వెనుకనున్న అనంత శక్తి పై అచంచల విశ్వాసం. వ్రాసేది, వ్రాయించేది, వ్రాయబడేది సర్వం శ్రీ సీతారామచంద్రమూర్తి మాత్రమే!!!

**ఈ గ్రంథంలోని తప్పులన్నీ నావి. ఒప్పులన్నీ పరమేశ్వరునివి.**

రామన్.

# శ్రీ కాళికా పురాణం

## ఒకటవ అధ్యాయం
## (కామదేవ జననం)

శుక్లాంభరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే ॥
అగజానన పద్మార్కం గజాననం అహర్నిశమ్
అనేకదం త్వం భక్తానాం ఏకదంత ఉపాస్మహే ॥

సరస్వతీ నమస్తుభ్యం
వరదే కామరూపిణీ
విద్యారంభం కరిష్యామి
సిద్ధిర్భవతు మే సదా ॥

పరమ కళ్యాణ స్వరూపుడయిన నారాయణునకు, పరమ పుణ్యమూర్తి అయిన నరునకు, పురుషోత్తముడయిన విష్ణు భగవానునకు, చదువుల తల్లి అయిన సరస్వతీ దేవికి, వేద, పురాణ, ఇతిహాస దురంధరుడయిన వ్యాసదేవునకు వందనమొనర్చి అటు పిదప పురాణ పఠనము నొనర్ప వలెను.

అత్యంత పుణ్యప్రదులు, వివేకశీలురు, ప్రశాంత చిత్తులు అయిన యోగులు తమ హృదయాంతరాళములందు ఎవరి పదకమలములను నిరంతరము ధ్యానించుచుందురో, ఎవరి పదకమలములనుండి ధరిత్రి మొదలు పదునాల్గు భువన భాండములు ఆవిర్భవించినవో, అట్టి కళ్యాణ గుణాకరుడు విష్ణు భగవానుని పదాంభోజములు మమ్ము రక్షించు గాక! ఎవరు సర్వజీవుల హృదయాంతరాళములందు నిబిడీకృతమై యున్న అజ్ఞానాంధకారము పారద్రోలు సూర్య స్వరూపిణియో, ఎవరు యతీశ్వరులకు ముక్తిదాతయో, ఎవరు సమస్త జీవరాశినీ మోహము నందు ముంచెత్తుచున్నదో, ఎవరు శుద్ధబుద్ధిని ఉత్పన్నమొనర్చి, కుబుద్ధిని నాశము చేయుచున్నదో, ఎవరు పరమాత్ముని మాయాశక్తి అయిన పరమేశ్వరియో, ఆ శక్తి మమ్ములను రక్షించుగాక! సంసారమునకు ఆదిభూతుడయిన చతుర్ముఖ బ్రహ్మదేవునికి, పురుషోత్తముడయిన విష్ణు భగవానునికి, లయకారకుడయిన శంకరునికి ప్రప్రథమముగ ప్రణామము లాచరించి నేను నిత్య జ్ఞానమయమయిన శ్రీకాళికా పురాణమును ప్రవచించుచున్నాను.

ఒకనాటి మాట! పరమ పవిత్రము, ప్రశాంతము, ఏకాంతమయిన హిమాలయ శృంగ సానువుల పరిశర ప్రాంతమందు వేదజ్ఞుడు, త్రికాలవేత్త అయిన మార్కండేయ మహర్షిని సమీపించి కమఠాది మునీశ్వరులు సాంజలి బంధకముగ ప్రణామములాచరించి, ఇట్లు ప్రశ్నించిరి "ఓ! మహానుభావా! మీరు సర్వ శాస్త్ర విశారదులు. మీరు సమస్త వేదరాశిని షడంగ సహితముగ మథించి అద్దాని సారాంశమును వ్యాఖ్యారూపముగ మాకందరకు అందించిరి. మార్తాండుడు తమోరాశిని విచ్ఛిన్నము చేయునటుల సమస్త వేద శాస్త్రముల యందలి మా సంశయములను మీరు మీ ఉపదేశము చే నివృత్తి గావించిరి. ఓ! ద్విజోత్తమా! దీర్ఘజీవాగ్రణీ!!! బ్రహ్మదేవ ప్రతిపాదితమయిన ధర్మశాస్త్రమును మీ శుభకటాక్షము

చే సాంగోపాంగముగ అధ్యయనము చేసి కృతార్థులమైతిమి. ఈనాడు మా మనసులందు ఒక ఆఖ్యానమును వినవలెనను కోరిక పొడసూపినది. అయ్యది "ప్రాచీన కాలమందు భగవతి కాళికాదేవి ఏ ప్రకారముగ సతీరూపము ధరించి శంకర భగవానుని మోహితుని కావించినది? సద్దైవధ్యానస్థితుడు, యమనియమాది దీక్షలందు సర్వదా స్థితిగతుడు, సంసార విముఖుడు, అయిన ఆ కామదహనుని ఆ తల్లి ఎట్లు వ్యాకులుని గావించినది? సతీదేవి దక్షపత్నీ గర్భము నుండి ఎట్లు ఉత్పన్నమయినది? శంకర భగవానుడు దారాగ్రహణమునకు ఎట్లు అంగీకరించెను? దక్షునిపై కోపించి సతీదేవి ఎట్లు శరీరత్యాగము కావించినది? తిరిగి హిమపుత్రిక అయిన హైమవతిగా ఎట్లు జన్మించెను? ద్విజోత్తమా! ఆ తల్లి తిరిగి ఎట్లు కామారి అయిన శంభుని అర్ధాంగి గా ప్రాప్తించెను?" ఈ విషయములన్నియు రహస్య సహితముగా, విస్తారముగ వివరింపవలసినది. ఎందుకనగా ఈ సంశయకార్యమందు మీకు తుల్యులు వేరొకరు లేరు. ఇకముందు ఉండబోరు. ఓ! ఆత్మజ్ఞాన స్వరూపా! విప్రేంద్రా! మాకు సులభముగ అర్థమగురీతిని ఈ వృత్తాంతమును వినిపింప కోరి ప్రార్థించుచున్నాము."

మార్కండేయుడు "మునిసత్తములారా! మీ ప్రశ్న కడు శ్లాఘనీయము. కానీ ఈ వృత్తాంతము అత్యంత గోపనీయములకు కూడా గోపనీయుము. అతి పవిత్రము, శ్రేష్ఠము, సర్వ శుభ సంయక్ జ్ఞాన ప్రదాయకము. ఇయ్యది సమస్త కామనలను (కోరికలను) ఈడేర్చు శ్రీకాళికా పురాణము. దీనిని అత్యంత శ్రద్ధాభక్తులతో ఆలకింపవలసినది. దీనిని తొలుత బ్రహ్మదేవుడు మహాత్ముడయిన నారదునకు ఉపదేశించెను. నారదుడు వాలఖిల్యులకు, వారు యవక్రీతునకు, యవక్రీతుడు అసితునకు ఉపదేశించిరి. పుణ్య ప్రదుడయిన అసితుడు విస్తారముగ నాకు ప్రసాదించెను. నేను సమస్త బ్రహ్మాండములకు స్వామి, చక్రధరుడయిన విష్ణు భగవానునకు సాంజలి బంధకముగ ప్రణామములు గావించుచు ఈ ఆఖ్యానమును మీకు వినిపించెదను".

"సదసద్రూపుడు, వ్యక్తావ్యక్త స్వరూపుడు, స్థూల, సూక్ష్మ రూపములతో అన్నిటా, అంతటా వ్యక్తమగుస్వామి, విధాత, శాశ్వతుడు, నిత్య జ్ఞానానంద స్వరూపుడు, నిర్వికారుడు, విద్యావిద్యా స్వరూపుడు, సర్వ చైతన్యమూర్తి, కాలరూపి అయిన పరమాత్మునకు నమస్కారము. నిర్మలుడు, షడూర్ములు (పుట్టుట, ఉండుట, పెరుగుట, మార్పు చెందుట, వృద్ధాప్యము, మరణించుట) లేనివాడు, షడ్వికార రహితుడు (కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యములు), విరాగీ, సర్వవ్యాపకుడు, విశ్వసృష్టి, స్థితి, లయలకు కారకుడు, సర్వప్రాణుల అంత:కరణము నందు ప్రకాశించు పరంజ్యోతి, యోగి జనుల ఆత్మచింతనకు హేతువయిన పరమేశ్వరునికి నమస్కరించుచున్నాను.

ఇటువంటి పరమేశ్వరునికి ఆరాధన మొనర్చి లోకపితామహుడయిన చతుర్ముఖ బ్రహ్మ దక్షాది దశ ప్రజాపతులను, దేవతా, దైత్య, మనుష్యాది జీవులను సృష్టించెను. అటు పిదప "మరీచి, అత్రి, పులహుడు, అంగిరుడు, క్రతువు, పులస్త్యుడు, వశిష్ఠుడు, నారదుడు, ప్రాచేతసుడు, భృగువు" మొదలగు పదిమంది మానస పుత్రులను సహితము సృష్టించెను. అటు పిమ్మట ఒక విచిత్రము జరిగినది. ఆయన మనసు నుండి అత్యంత సుందర శరీరిణి, కోమల మృదులాంగి, సాయం సంధ్యా స్వరూపిణి అయిన ఒక కన్యకామణి ఉద్భవించెను. ఆ తరుణీమణి "సంధ్య". ఆమెతో సమానమయిన రూప, యవ్వన, గుణశాలి మూడు కాలముల యందు, దేవ, మనుష్య, రసాతలాది లోకములందు లేరనిన అతిశయోక్తికాదు.

ఆ కన్యక తన స్వభావ సిద్ధ రూపముతో, ఒత్తైన నల్లని కురులతో, వర్షాకాలపు మయూరము వలె భాసించుచుండెను. ఆమె లలాటము ఇంద్ర ధనువు వలె వంపు తిరిగి, లాలిత్యభరితమై, ఆకర్ణాంతము విస్తరిల్లిన కనుబొమలు గూడి బాలచంద్రుని వలె శోభించుచున్నది. ఆ చపలనయన రమణీయ కనుబొమలు కామదేవుని ధనువును తోపించుచున్నవి. భ్రూమధ్యము నుండి బయలుదేరిన నాసిక నువ్వుల పుష్పము వలె కొనదేరి మూర్తీభవించిన లావణ్యము అధికమై లలాటము నుండి క్రిందికి జారినదా అన్నట్లుయున్నది. ఆ ఇందువదన ముఖము ఎర్రకలువ వలె భాసించుచూ, పూర్ణ

చంద్రుని ప్రభను దీప్తించుచున్నది. ఎర్రని పెదవుల కాంతి ముగ్గిన దొండపండ్లను పరిహసించుచున్నది. ఆ ఇంతి వక్షోజములు పుష్టియై, కమల కోశముల వలె ఉవ్వెత్తున ఉబికి, ఉన్నతములై యుండి మునులను సహితము మతిభ్రమణము కావించుచున్నవి. ఆమె నడుము పట్టు వస్త్రము వలె త్రివళీయుక్తమై, పిడికిట పట్టునంత సన్నమై, ఎల్లరకు మదన మందిర దర్శనము కావించుచున్నది. ఏనుగు తొండముల వంటి తొడలు, ఆ గజరాజగమన కదలికకు మరింత సొంపు చేకూర్చుచున్నది. ఆ లలన చరణ ద్వయము ధరిత్రి పై అంకురించిన అరుణ కమలముల వలె గోచరించుచూ, సున్నితమయిన వేళ్ళు కాముని అస్త్రముల వలె భాసించుచున్నవి. ఆ మరాళగమన వదనము సుందర దంత పంక్తియుతమై, సుచిస్మితయై, సుతిమెత్తని రోమావళి, అలతి అలతి స్వేదబిందు యుక్తమై, విశాల నేత్రముల తో విరాజిల్లుచున్నది. చిబుకము, నాభి, యోని మండలము మొదలగు మూడు అంగములు లోతుగా యుండి, కపోలములు, స్థనద్వయము, శ్రోణిమండలము ఎత్తుగా యున్న ఆ అరాళకుంతలను గాంచి చతుర్ముఖ బ్రహ్మ చిత్తమున కలిగిన చాంచల్యము చే చింతితుడై ఒక్క ఉదుటున పైకి లేచెను. ఈ విధముగా సృష్టింపబడిన వరవర్ణినిని కాంచిన దక్షాది ప్రజాపతులు, చతుర్ముఖ బ్రహ్మ, మరీచాది మునులు నిష్ఠేశ్చితులై ఇట్లు యోచింప దొడంగిరి "సృష్టి యందు ఈ కాంతామణి చే కాగలిగిన కార్యము ఏమున్నది? ఈ మగువ ఎవరిని వరించును?"

ఆ సమయమున బ్రహ్మదేవుని మనసు నుండి మరియొక మహాతేజస్వి అయిన మనోహర పురుషుడుదయించెను. ఆతని దేహఛాయ పుటము పెట్టిన బంగారు చూర్ణము వలె భాసించుచుండెను. శిరసుపై ఉంగరములు తిరిగిన నల్లని ఒత్తైన కుంతలములు, చంచలములయిన విశాల కనుదోయి, భ్రూమధ్యమున కలిసిన కనుబొమలు, ప్రఫుల్ల కమలదళముల వంటి నేత్రములు, సుందర దంతపంక్తి కలిగి ముఖ కమలము పూర్ణచంద్రుని పోలియుండెను. గళము శంఖము వలె యుండి, క్రింద వక్షస్థలము విశాలమై, రోమావళితో సుసంపన్నమైయుండెను. బాహుద్వయము ఐరావత తొండము వలె పుష్టిగా, దీర్ఘములుగాయుండి, భుజములు మదించిన గోళాకారము పోలియుండెను. సన్నని నడుముపై విశాల వక్షస్థలము సుస్థిరముగ యుండెను. ఆ సుందర పురుషుని ముఖము, నేత్రములు, కాళ్ళు, చేతులు, వేళ్ళు రక్త వర్ణముతో శోభించుచున్నవి. ఆ కమల లోచనుని అంగముల నుండి పుష్పపరాగ సుగంధము వెలివడుచున్నది. మీనధ్వజుడై ఆ విశాలకాయుడు మొసలి వాహనము పై ఏతెంచెను. ఆ యువకుడు భుజముపై పుష్పధనుయుతుడై, పుష్పబాణ సదృశుడై తన మధుర కటాక్ష వీక్షణములతో ఎల్లరనూ పరికించుచుండెను. సుగంధభరిత వాయు సమేతుడు, శృంగార రస సేవితుడు అయిన ఆ సుందర పురుషుని వీక్షించగనే బ్రహ్మ, దక్షాది ప్రజాపతులు, మరీచాదిమునులు, తమ మనసులు వివిధ వికారము లొంద విస్మితులైరి.

ఆ పురుషుడు జగత్పతి, సృష్టికర్త అయిన చతుర్ముఖ పరమేష్ఠిని గాంచి వినమ్రుడై అంజలి ఘటించి ఇట్లనియె "హే! బ్రహ్మన్! విధాతా!! నేనేల సృష్టింపబడితిని? నా కార్యమేమి? నా వంటి పురుషునకు ఉచితమయిన, న్యాయమయిన వృత్తిని నిర్ణయింవవలసినది. ఓ! లోకేశ్వరా! మీరు జగత్ సృష్టి దాయకులు, మరియు నియామకులు. అందువలన నా నామధేయము, యోగ్యమయిన స్థానము, నాకు కాగలిగిన పత్నీ నిర్ణయము దయచేసి నిర్ధారింప వలసినది."

ఈ విధముగ పలికిన పలుకులు వినియునూ, తన సృష్టిచే నిశ్చేష్టితుడయిన బ్రహ్మ ఒక్క క్షణ పర్యంతము మాటలు రాక మూగబోయి, ఇంతలో తేరి, తన ఆశ్చర్యమునూ, చిత్త చాంచల్యమునూ పూర్ణముగ విడనాడి మనసున సంయముడై, ఇట్లనియె "ఇప్పటి వరకూ బ్రహ్మ మానస సృష్టి జరిగినది. ఇక నుండి నీవు సుందర రూపుడవై, పుష్పబాణ సహితుడవై, స్త్రీ పురుషులను మోహింపజేయుచూ సనాతనము, పారంపరికము అయిన సృష్టికార్యమును నెరవేర్పుము. ఇకనుండి నీ బాణధాటికి దేవ, గంధర్వ, కిన్నెర, కింపురుష, మహాసర్ప, అసుర, దైత్య, దానవ, విద్యాధర, రాక్షస, యక్ష, వినాయక, భూత, పిశాచ, గుహ్యక, సిద్ధ, సాధ్య, మనుష్య, పశు, పక్షి, జంతు, కీట, పతంగ, జల చరములన్నియునూ

తలఒగ్గ వలసినదే!! ఒక్క మాటలో నీ పుష్ప బాణములకు మోహింపబడని వారుండరు. వేయేల! నేను, వాసుదేవుడయిన విష్ణువు, స్థాణుడయిన శివుడు కూడా నీకు వశ్యులగుదురన, మిగిలిన ప్రాణుల గూర్చి తర్కించనేల?"

"నీవు ప్రాణుల మనసును నీ బాణ లక్ష్యముగ ఎంచి సమస్త ప్రాణులందు కామోద్రేకము గావించి సురతానందము ఉత్పన్నము కావింపుము. ఈ విధముగ సృష్టి ప్రవర్ధన కార్యము నీ విధి. ఇపుడు నీకు యోగ్యమయిన నామమును వచించెదను." చతుర్ముఖ బ్రహ్మదేవుడు ఈ విధముగ పలికి తన మానస పుత్రుల మనోభావముల గమనించుచూ, వారిని పరికించి చూచుచూ నెమ్మదిగా తన పద్మాసనమందు సుస్థితుడాయెను.

**(శ్రీ కాళికా పురాణమందలి కామ ప్రాదుర్భావ వర్ణనమను ప్రథమోధ్యాయము సమాప్తము)**

# రెండవ అధ్యాయము

**(కామదేవుని ద్వారా బ్రహ్మదేవుడు మోహింపబడుట)**

తమవంక సాభిప్రాయముగ చూచిన బ్రహ్మదేవుని అభిప్రాయమును గ్రహించి మరీచాది మహర్షులు ఆ నూత్న పురుషుని నామధేయమును, దక్షాది ప్రజాపతులు ఆతని వాస స్థానమును మరియు పత్నిని నిర్ణయించిరి. తొలుత మహర్షులు ఆ మనోహర సుందరాకృతుని గాంచి "ఓయీ! నీవు ఆవిర్భవించిన నంతనే చతుర్ముఖ బ్రహ్మదేవుని యొక్క మరియు మా యొక్క మనస్సులను మథించితివి. అందువలన నీవు "మన్మథ" నామముతో ప్రసిద్ధుడవగుదువు. నీవు అనన్య సామాన్య సౌందర్యశీలుడవు. నీకు తుల్యులు సౌందర్యమున మరియొకరు లేరు. అందువలన నీవు "కాముడు" అను పేర సహితము ప్రఖ్యాతుడవగుదువు. నీ ప్రభావము చే మనుష్యులు మత్తులగుదురు. అందుచేత నీవు "మదనుడు" వగుదువు. ఒకానొక సమయమున నీవు మహాదేవుని దర్పమును నాశము  చేయుదువు. (శివుని కామమోహితుని కావింతువు). అందువలన నీవు "కందర్పుడవు".  నీ పంచబాణముల యందు యున్న శక్తి వైష్ణవ, రౌద్ర, బ్రహ్మాస్త్రములను మించి యుండును. నీవు సర్వ వ్యాపకుడవగుదువు. బ్రహ్మలోకము మొదలుకొని స్వర్గ, మర్త్య, పాతాళాది సమస్త లోకములు నీకు శాశ్వత స్థానములగును, వేయేల? సమస్త సృష్టి యందు నిన్ను ఎదుర్కొను శక్తి కద్దు. ఎక్కడెక్కడ ప్రాణులు, చెట్లు, వనస్పతులు యుండునో, అక్కడి నుండి బ్రహ్మలోకము వరకు సర్వము నీ పరిగణనలోనికి వచ్చును. ఓ! పురుషప్రవరా! ఈయన ప్రథమ ప్రజాపతి అయిన దక్షుడు. వీరందరూ బ్రహ్మమానస పుత్రులయిన ప్రజాపతులు. మేము ఋషి గణము. ఈ లోకోత్తర సుందరి బ్రహ్మ దేవుని మానసము నుండి ఉద్భవించిన మానిని. చతుర్ముఖుని తప: ఫలితముగ ఆవిర్భవించినది కావున ఈమె "సంధ్య" అను పేర విఖ్యాతినొందును. ఈ దక్ష ప్రజాపతి నీకు అనురూప, సౌభాగ్యవతి, అతిరమణీయ తరుణీలలామను భార్యగా ప్రసాదించును." అని పలికి తిరిగి బ్రహ్మదేవుని వంక తిరిగి అతివినీతులై, నమ్రభావులై, మౌనము వహించిరి.

అంత కామదేవుడు సుందర మదవతుల కనుబొమల పోలు ధనువును ధరించెను. అయ్యది పుష్ప నిర్మితము, సుకుమారము, నల్లని తుమ్మెదలు నారిగా గలది.  "ఉన్మాదనము" నామమున విఖ్యాతి కాంచినది. ఆ ధనువు తో పాటు మునుల జ్ఞానమును సహితము సంపూర్ణముగ హరించు పంచ బాణములు – "హర్షణము, రోచనము, మోహనము, శోషణము, మారణము" కాముని మరింత ఉద్భట బలశాలిని కావించినవి.   ఇచటనే ఋషిగణము, ప్రజాపతులు, స్వయముగ బ్రహ్మదేవుడు, ఈ శ్రేష్ఠ వనిత సంధ్య యుండిరి. మారుడు వానిని గ్రహించి ఇట్లు తలచెను "చతుర్ముఖ బ్రహ్మ నాకు కర్తవ్య నిర్దేశ్యము కావించెను. స్వయముగ బ్రహ్మ "త్రిమూర్తులు సహితము నీకు వశులగుదురు" అని

వాగ్దానము కావించెను. ఈ బ్రహ్మదేవుని వాక్కులు సార్ధకమగునా? ఈనాడు వీరందరూ నాకు వశవర్తులవవలె" అని తలచి, నిశ్చయించి, వీరాసనమును గ్రహించి, ధనువు సారించి, అర్ధచంద్రాకృతిగ త్రిప్పి, నారిని ఆకర్ణాంతము లాగి తన బాణ పరంపరను వారందరిపై ప్రయోగించెను.

తక్షణమే ఆ ప్రదేశమంతయు మలయమారుత వీవనచే సుగంధభరితమయినది. తిరిగి మదనుడు బ్రహ్మదేవునిపై, మరియు మిగిలిన, ఋషి, ప్రజాపతి గణములపై వేరు వేరుగా శర పరంపర ప్రయోగించెను. వారందరూ అకస్మాత్తుగా మోహితులై, కామ పీడితులై, వికారచిత్తులైరి. వెంటనే వారందరూ నిరాటంకముగ నిర్లజ్జులై "సంధ్యను" తేరిపార చూచుట నారంభించిరి. వారందరి మనసునందు విశేష కామవృద్ధి జనించుట నారంభించెను. ఇదే అదనుగ దుష్టుడయిన కాముడు తిరిగి పుష్పబాణ ప్రహారము కావించి వారి బాహ్యేంద్రియములను సహితము కామవికారగ్రస్తము కావించెను. ఆ కారణముగ సంధ్య యందు అరువది నాలుగు రకముల కామ చేష్టితములు (పురుషులను ఉత్తేజ పరుచు సంకేతములు, ప్రియులను ఆమంత్రించు చేష్టలు) ఆవిర్భవించినవి. ఆమె సహితము అచట గల పురుషుల యందు కందర్ప మోహితయై, తన మదన కటాక్ష వీక్షణములను వారిపై ప్రసరింపసాగెను. సహజముగనే అనన్య సామాన్య సౌందర్యరాశి అయిన సంధ్యాదేవి కామపీడితయై మరింత శోభాయమానముగ ప్రకాశింపసాగెను. ఆ సమయమున కందర్ప బాణ ప్రచోదితుడై చతుర్ముఖ బ్రహ్మ సహితము తన ఉనికిని మరచి తన తనూజ అయిన సంధ్య వంక కళ్ళార్పక నిస్తేజుడై చూచుచూ, శరీరము నుండి ధారాపాతముగ స్వేదము కారుచుండగా, ఆ తన్వంగిని సొంతము చేసికొనుటకు ఉవ్విళ్ళూరు చుండెను. ఆ సమయమున ఆయనే కాక దక్షాది ప్రజాపతులు, మరీచి, అత్రి మొదలగు ఋషి సత్తములు సహితము కాముని బాణ పరంపరకు వశీభూతులైరి. అంత మదనుడు తన కొసగిన వరములు సార్ధక మాయెనని ధృఢ నిశ్చయుడై, బ్రహ్మ దేవుని చే తనకీయబడిన కార్యమును చేయగలనను ఆత్మ విశ్వాసము నొందెను.

ఇంతలో ఆకాశమార్గమున ప్రయాణము చేయుచున్న మహాదేవుడు, రుద్రుడు, ఈ పరిస్థితిని గమనించి, వారిని అపహాస్యము చేయుచూ ఈ విధముగ పలికెను, "విధాతా! మీ యందు మీ పుత్రికపై కామభావన ఎట్లు కలిగినది? మీ వంటి వేదవిధులకు ఇది పాడిగాదు. తన సోదరి, పుత్రిక, కోడలు మొదలగు ఆ వరుస స్త్రీ జనము మాతృసమానులని మీరు వేదము నందు ఉద్ఘాటించిరి కదా! మీచే వచింపబడిన వేద ధర్మములను మీరు ఈ కాముని ప్రభావముచే మరచుచున్నారు. ఓ! చతురాననా! బ్రహ్మదేవా! మీరు త్రికాలద్రష్టలు, ఏకాంత యోగి పుంగవులు, కానీ కామ ప్రభావమున ఈనాడు ధైర్యము సడలి సామాన్య మర్త్యుని వలె ప్రవర్తించుచున్నారు. ఇప్పుడే కార్య నిర్దిష్టుడయిన, పెద్దా, చిన్నా, తారతమ్య మెరుగని మందబుద్ధి మదనుడు, సమయజ్ఞానము లేక మిమ్ములను లక్ష్యము కావించెను. సడలని ధైర్యము గల ముని ప్రవరులు సహితము ధైర్య విలోలురై, స్త్రీ లోలురగుట దూష్యము."

గిరీశుని వచనములు వినిన లోకేశుడు బ్రహ్మ, కించిత్ లజ్జితుడై, తన ఇంద్రియ వికారములను నియంత్రించి, కామ స్వరూపిణి అయిన సంధ్యను పొందవలెనన్న ఇచ్ఛను విడచెను. ఆ సమయమున ఆ పరమేష్ఠి శరీరము నుండి ఉద్భవించిన స్వేదము నుండి అరువది నాలుగు వేల "అగ్నిష్వత్తులు", అరువది వేల "బర్హిషదులు" అను పితృగణములుదయించెను. వారందరూ కాలాంజన వర్ణులు, ప్రఫుల్ల కమల నేత్రులు, అత్యంత పవిత్రులు, నియంత్రిత మనస్కులు, సంసార విముఖులు. దక్షుని స్వేదము నుండి నిఖిల గుణవతి, కుసుమ కోమలాంగి, సింహ మధ్యమ, సువర్ణ దేహ ఛాయిని అయిన మనోహర సుందరాంగి ఉదయించెను. క్రతువు, వశిష్ఠుడు, పులస్త్యుడు, అంగిరుడు తప్ప మిగిలిన ఋషులందరూ తమ కామ వికారమును వదలి నిర్మలులైరి. ఈ నలుగురు ఋషిసత్తముల చెమల బిందువుల నుండి ఇతర పితృగణములుదయించినవి. క్రతువు నుండి "సోమపులు", వశిష్ఠుని నుండి "సుకాలినులు", పులస్త్యుని నుండి "ఆజ్యపులు" అంగిరుని నుండి "హవిష్మంతులు" ఆవిర్భవించిరి. ఈ అగ్నిష్వదాది కవ్యవాహులయిన పితృగణములు

ఉత్పన్నమయిన కారణమున చతుర్ముఖ బ్రహ్మ అప్పటి నుండియు ప్రాణికోటికి "పితామహుడయ్యెను. సంధ్య పితృ గణములకు తల్లిగ పిలువబడినది. పితృగణములు ఆమె గర్భము నుండి ఉద్భవించనప్పటికీ, ఆమె వారి ఉత్పత్తికి (పుట్టుక) కారణము కావున ఆమెకు ఆ స్థానమీయబడినది.

తదనంతరము బ్రహ్మదేవుడు పరమేశ్వరుని పలుకులకు లజ్జితుడై వెంతనే కాముని యెడ మిక్కిలి క్రోధము వహించెను. దానిచే ఆయన ముఖము జేవురించి, భృకుటి ముడిపడెను. మన్మధుడు సృష్ఠి, లయకారుల ఎడ మిక్కిలి భయము నొంది ప్రచ్ఛన్న రూపము ధరించి అచటి నుండి వెంతనే పలాయన మొనర్చెను.

**(కాళికాపురాణ మందలి బ్రహ్మ మోహనమను రెండవ అధ్యాయము సమాప్తము)**

# మూడవ అధ్యాయము

**(రతీ పరిణయము)**

సంసారోత్పత్తికి మూల కారకుడయిన బ్రహ్మదేవుడు, ఒక్క ఉదుటున పద్మము నుండి లేచి, ప్రజ్వరిల్లుచున్న మహాగ్ని వలె మండిపడుచూ శంకరుని చూచి ఇట్లనియె "త్రినయనా! మీ సమక్షమున కాముడు నాపై విరిశరముల ప్రహారము కావించెను. ఈ దుష్కర్మమునకు తగిన శాస్తి చేయవలెను. ఓ! మహాదేవా! ఈ దుర్మదాంధుడు, మదనుడు ఒకానొక తరి అత్యంత దుష్కర్మయుతుడై మీ మూడవ నేత్రాగ్నిచే భస్మీభూతుడగుగాక!" ఈ విధముగ శంకరుడు, ముని ప్రవరులు చూచుచుండగా పితామహుడు మారునికి తీవ్రశాపమునిచ్చెను. ప్రచ్ఛన్నరూపమున దీనిని వీక్షించుచున్న మన్మధుడు అత్యంత భయభీతుడై, తన ప్రత్యక్ష రూపము ధరించి, ధనుర్బాణములు విడచి, దక్ష, మరీచాదుల సహితుడై యున్న పితామహుని వద్ద కేతెంచి, అంజలి ఘటించి, పదముల పడి, గద్గద వాణితో ఇట్లనియె "ఓ! లోకేశా! పితామహా! నేను న్యాయమార్గమును ఆచరించుట వలన నిరపరాధిని. ఎందువలన మీరు నన్ను శపించితిరి? నా కార్య నిర్దేశ్యమును మీరే నిర్ణయించిరి. నేను మీ ఆదేశమును శిరసావహించితిని. "బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సహితము నీకు వశవర్తులని" మీ వరము కదా! నేను ఆ వరమును పరీక్షించితిని. అందువలన ఈ కార్యము అనుచితము కాదు. అందువలన అపరాధ రహితుడనయిన నాకు శాప విముక్తి కలిగింప వలసినది."

కందర్పుని కరుణాక్రందనమును వినిన దయాళువు, పరమేష్ఠి బ్రహ్మ, సంశయచిత్తుడయిన మదనుని వంక సాదరముగ వీక్షించి, క్రోధము వీడి, ఆనంద తత్పరుడై ఇట్లనియె "మన్మధా! ఈ సంధ్య నా పుత్రిక. నీవు దుర్మదాంధుడవై ఈమె యందు నన్ను మోహపరవశుడను గావించితివి. అందువలన నిన్ను శపించితిని. ఇపుడు నా క్రోధము శమించినది. ఈ శాపవిముక్తి ఎట్లగునో తెలిపెదను. వినుము. నీవు మహాదేవుని నేత్రాగ్నిచే భస్మీభూతుడవగుదువు. అయ్యది అవశ్యము. కానీ తదుపరి మహాదేవుడు పత్నీ పరిగ్రహణము కావించినపుడు, ఆ కామారి కృపాకటాక్ష వీక్షణములతో నీకు పున: దేహప్రాప్తి కలుగును".

ఈ విధముగ పలికి పితామహుడు సర్వులు చూచుచుండగనే అంతర్హితుడయ్యెను. తదుపరి పినాకపాణి సహితము తన వృషభవాహన మధిరోహించి వాయువేగమున పయనమయ్యెను. ఈ విధముగ వారిరువురు వెడలిన పిదప దక్షప్రజాపతి మదనునకు పత్నీ నిర్దేశ్యము కావించెను. ఆయన పంచబాణుని కాంచి "మనసిజా! నా శరీర స్వేదము నుండి ఉత్పన్నమయిన ఈ కన్యక నా గుణ రూపములతో నిండినది, మరియు పరమ కళ్యాణ ప్రదాయిని. గుణ, రూప, లావణ్యములందు నీకు తుల్యమయినది. నీవు ఈమెను వివాహము చేసికొనుము. ఈ మహాతేజస్విని, అతిలోక సుందరి

నీకు సహధర్మచారిణి అగును. ఈమె ధర్మముగ, ఇచ్ఛానురూపముగ, నీకు ఎల్లప్పుడు వశవర్తియై యుండును." ఈ విధముగ పలికి దక్ష ప్రజాపతి తన స్వేదజలము నుండి ఉత్పన్నమయిన కలకంఠిని ముందునకు తీసికుని వచ్చి, "రతి" అను నామధేయమిచ్చి, కుసుమశరునకిచ్చి వివాహమొనర్చెను. అనంగుడు మెరుపు తీగ వంటి శరీర సౌష్ఠవధారిణీ, పుటము పెట్టిన బంగారు ఛాయ మేని కలిగిన మృగనయన అయిన రతీదేవిని కాంచి ఆమె యందలి అనురాగముచే ముగ్ధుడయ్యెను.

మదనుడు రతీదేవి కనుబొమలు కాంచి, కొంత తడవు తన పుష్పధనువును బ్రహ్మదేవుడు ఈమె కనుబొమల రూపములో మార్చెనేమో అని భ్రమ పడెను. ఆమె శరీరము నుండి వెలివడుచున్న దివ్య సౌరభము మలయానిలము కంటె మిక్కుటముగ యుండుటచే అనంగుని అంగములు అదుపు తప్పెను. కందర్పుడు రతీదేవి ముఖము నవలోకించి శశాంకుడు ధరిత్రిని పడెనేమో! అని తర్కించెను. పుష్పబాణుడు ఆమె స్తనద్వయ రోమావళి కాంచి, తన వింటినారి తెగిపడనదని భ్రమించెను. మన్మథుడు రతీదేవి యొక్క ఎర్రని అరిచేతులను, సుతిమెత్తని, సన్నని వేళ్ళను కాంచి, ఈమె నా పుష్ప బాణములను గ్రహించి, తిరిగి నాపై ప్రయోగించుచున్నదని తలపోసెను. అత్యంత కోమలమయిన ఆమె బాహు ద్వయము చూచి అవి లావణ్యరూప జల ప్రవాహములని అభిప్రాయపడెను. నీలనీరద మేఘము వంటి ఆమె ఒత్తైన, నల్లని కురులు కామునికి చమరీవాలమును తలపించెను. విరక్తులయిన ఋషుల హృదయములను సహితము ఛిద్రము చేయు మదనుడు, శంభుడు గంగా ప్రవాహమును గ్రహించినటుల రతీదేవిని గ్రహించెను. ఆ తరుణీలలామ సహితము అనంగుని ఎడల మిక్కిలి ప్రేమాస్పదయై, అయన యందు గాఢానురక్త ఆయ్యెను.

ఆ సమయమున మన్మథుడు తనకు ఈయబడిన దారుణ శాపమును సంపూర్ణముగ మరచి ఇట్లనియె "మహాత్మా! ఈ సర్వాంగ సుందరీ రమణీలలామ నా సహచరి అయిన ఎడల సామాన్య ప్రాణుల నేల, మహాదేవుని సహితము మోహింపచేయుదును. నేను దేనిని లక్ష్యముగ ధనువును సారింతునో, అచట రతీదేవి సహితము తన మాయ ద్వారా నా కార్యమును పూర్ణమొనర్చవలెను. నేను స్వర్గ, మర్త్య, పాతాళ లోకములందు ఎచటికేగిననూ, ఈ అరాళకుంతల నాతో సహగమనము చేయవలెను. లక్ష్మీదేవి నారాయణుని, సౌదామిని నీలిమేఘమును ఎట్లనుసరించునో, అట్లే రతీదేవియునూ నన్ను అనుగమింపవలెను." ఈ విధముగ మదనుడు వచించి, పరమ లావణ్యమూర్తి అయిన రతీదేవిని గ్రహించి, అత్యంత శోభాయమానుడయ్యెను. యోగి జనులు తత్వజ్ఞానము నెట్లు హృదయమునందు పదిలపరచుకొందురో, అట్లు పంచశరుడు రతీదేవిని హృదయమునందుంచుకొనెను. సాగర నందిని లక్ష్మీదేవి నారాయణుని భర్తగా పొంది ఎట్లు సంతుష్ఠి నొందినదో, అట్లే రతీదేవియునూ, కందర్పుని పతిగా పొంది పరమ సంతుష్టాంగతరంగ అయ్యెను.

**(కాళికా పురాణమందలి రతీపరిణయమను మూడవ అధ్యాయము సమాప్తము)**

# నాల్గవ అధ్యాయము

**(మహాదేవుని కామవశుని కావించుటకై బ్రహ్మ ప్రయత్నము, వసంతోత్పత్తి)**

తదుపరి అంతర్హితుడయిన బ్రహ్మదేవుడు అవమానము నొంద తనలో తాను ఇట్లు తలచెను. "నా మనసు నందు పత్నీప్రాప్తి నొందవలెనను కోరికను గమనించి ఈ వృషధ్వజుడు ఋషుల సమక్షమున నన్ను హేళన చేసెను. తన బ్రహ్మచర్యముపై, మనో నిగ్రహము పై ఇంత అహంకారమా? ఈతనిని స్వయముగ దారాగ్రహణము కావించుట ఎట్లు? ఈతనికి పత్నికాగల స్త్రీ ఎవరు? ఎవరు ఈతని యోగత్వమును కాలరాసి మోహమునందు ముంచగలరు? కాముడు ఈ

కార్యము చేయ నశక్యుడు, అసమర్థుడు. ఎందుకనగా ఈయన అద్వితీయ యోగి పుంగవుడు, మరియు స్త్రీ నామము సహితము సహింపనోపడు. భగవానుడయిన శంకరుడు దారా పరిగ్రహణము కావింపక, సృష్టి/లయ కార్యమును సహితము ఉపేక్షించినచో, ఈ సంసార చక్రభ్రమణము ఎట్లు కొనసాగును? పృథివి యందు జననమొందిన మహాబలులయిన ఖలులు త్రిమూర్తులచే కడదేర్పబడుదురు. కపర్ది సంసారము పట్ల విముఖుడై, విరాగి అయిన ఎడల ఈ కార్యము మరియొకరిచే కావింపబడదు." ఈ విధముగ యోచించి పితామహుడు అంతరిక్షము నందు స్థితిగతుడై, భూమిపై యున్న దక్షాది ప్రజాపతులను, రతీ సహితుడైయున్న పుష్పబాణుని చూచి, వారికడకు ఏతెంచి, మన్మథునితో స్వాంతన వచనములు ఇట్లు పలికెను.

"ఓ! కామదేవా! నీవు ఈ శుభలక్షణ లక్షితాంగిని పత్నిగా పొంది మిక్కిలి శోభనొందియున్నావు. ఈమె కూడా నీ వంటి ఉత్తమ పతిని పొంది సంపూర్ణ సంతుష్ట యై యున్నది. లక్ష్మీనారాయణులు, నిశాచంద్రులు ఒండొరులకు శోభనిచ్చెదరు. అట్లే మీరిరువురు కూడా దాంపత్యము యొక్క శోభను మిక్కిలి ఇనుమడింపజేయుట యందు అగ్రగాములైయుందురు. నీవు జగత్తుకు కేతనము వంటివాడవు. అందుచేత నీవు నేటినుండి "విశ్వకేతుడు" అను పేర కూడా ప్రసిద్ధినొందెదవు. వత్సా! నీవు జగత్కళ్యాణమునకై పినాకపాణి అయిన శంభుని మోహపరవశుని కావించి, ఆయన సుఖపరవశుడై పరిణయమునకు ఉపయుక్తుని గావింపుము. వ్యోమకేశుడు నదులు, పర్వతములు, ఎక్కడెక్కడికేగిననూ నీవు రతీ సహితుడవై ఆయనను అనుసరించి స్త్రీ విముఖుడయిన శివుని మోహింపజేయుము. నీవు వినా మరెవ్వరునూ ఆయనను మోహింపజేయ సమర్థులు గారు. ఓ! మనోభవా! మహేశుడు రమణీమోహితుడయిన మరుక్షణము నీకు శాప విమోచనము కలుగును. ఈ కార్యము కావించినచో నీవు విశ్వము నందు విశిష్టుడవగుదువు. అందువలన ఈ సర్వలోకహితకర కార్యము వెంటనే ప్రారంభింపవలసినది. నీకు శాప విమోచనమెందుకనగా తన పత్నియందు అనురాగము వలన శివుడు కామోపభోగములకు నిన్ను తప్పక ఉత్పన్నము చేయవలెను.

పరమేష్ఠి పలుకుల నాలకించిన మన్మథుడిట్లనియె "మహాప్రభో! నేను మీ వచనానుసారముగ శంకరుని మోహితుని కావింతును. కానీ ప్రకృతిరీత్యా స్త్రీయే నా పరమాస్త్రము. అందువలన మీరు తొలుత ఆయన కొరకై తుల్యమయిన స్త్రీ మూర్తిని సృష్టింపవలసినది. ప్రస్తుతము శంకరుని మోహింపచేయగల శక్తిమతి, మరియు సౌందర్యశాలిని అయిన స్త్రీ నాకు కానరావట్లేదు. అందువలన ఓ! విధాతా! మీరు యథాయోగ్యమయిన యోచన చేసి కార్యము సానుకూల పరుచవలసినది. కామదేవుని పలుకులు విని పితామహుడు అనన్య సామాన్య సౌందర్యశీల అయిన మదవతిని సృష్టించుటకై తీవ్రముగ యోచన చేయుచూ దీర్ఘ నిట్టూర్పును వదలెను. ఆ నిశ్వాసము నుండి పుష్పశోభితుడు, నానా పుష్పపరివృతుడు అయిన వసంతుడు ఉత్పన్నమయ్యెను. ఆతడు సుతిమెత్తని నూతన పల్లవసహితము, మరియు ఘుంకారము చేయుచున్న తుమ్మెదలతో పరివేష్ఠితమయిన, విరబూసిన పూతగల రసాల వృక్షము (మామిడి చెట్టు) వలె శోభించుచుండెను.

విరసిన ఎర్రకలువ వంటి నేత్రములు, సంధ్యాకాలమున ఉదయించు సన్నని చంద్రరేఖ వంటి సుందరమయిన నాసిక, సాయం సంధ్యా సూర్యుని పోలు మెరయుచున్న కుండలములు కలిగిన ఆలుచిప్పల వంటి కర్ణములు, నల్లని ఒత్తైయిన, ఉంగరములు తిరిగిన ముంగురులు, శంఖము వంటి కంఠము, విశాల వక్షస్థలము, గుండ్రని బలిసిన భుజములు, కఠోరమయిన చేతులు, సన్నని నడుము, సర్వ శుభలక్షణ సంపన్నుడై మదగజము వంటి నకడతో పరిపూర్ణుడై శోభిల్లుచుండెను. వసంతుని ఆగమనమును సూచించుచూ మత్తకోకిలలు పంచమ స్వరములో కుహుకుహురావములు గావించుచుండెను. సరోవరములన్నియు నిర్మలములై, విరిసిన కమలయక్తములయినవి.

పరమేష్ఠి అప్పుడే ఉత్పన్నమయిన మనోహరాకారుని గూర్చి మన్మథునితో ఇట్లనయె "ఓ! కామదేవా! ఈతడు సదా, సర్వదా, నీకు మిత్రుడై, సహచరుడై, నీకనుకూలమయిన కార్యములాచరించును. ఎల్లప్పుడూ గుప్తముగ, లోపల

వసించు కారణమున ఈతనిని "వసంతుడు" అని పేర్కొందురు. అగ్నికి వాయువు ఎట్లు మిత్రుడో, అట్లు వసంతుడు నిన్ను ఎల్లప్పుడూ అనుగమించును. వసంతుడు శృంగార రస సాధకుడు. ఈతని యందు గల మలయమారుతము నీకు వశీభూతమై యుండును. కోమలాంగుల అరువదినాలుగు విధముల శృంగార హావభావములు రతీదేవిని అనుసరించి యందుటచే, మీరిరువురు నీకు వశవర్తులు గాన ఇక నుండి నీవు మహాదేవుని మోహింపజేయుము. అంతేకాక ఎక్కడెక్కడ కామము/కోరిక కలవో అక్కడికి పోయి సృష్టి ప్రవర్ధనము కావింపుము.

దేవతలకు కూడ సంపూజ్యుడయిన పితామహుని పలుకులు విని కాముడు ప్రసన్నుడై, తన పత్నీ, సుహృద్, పరివార సహితుడై, అక్కడయున్న ప్రజాపతులకు, ఋషివరులకు వందనములిడి పరమేశ్వరుడున్న దరికి తరలెను. అనంతరము పరమేష్ఠి మరీచాదిమునులు, ప్రజాపతులతో పరివేష్ఠితుడయిన దక్షుని చూచి మృదు మధురముగ ఇట్లనియె.

**(వసంతోత్పత్తి అను నాల్గవ అధ్యాయము సమాప్తము)**

# అయిదవ అధ్యాయము

**(బ్రహ్మదేవుని ద్వారా కాళీస్తుతి)**

"ఓ! దక్షా! శంభుని పత్ని కాగల స్త్రీ ఎవరు? ఈయనను ఎవరు సమ్మోహితుని కావింపగలరు? ఎంత శోచించిననూ శివపత్ని కాగల యోగ్యత ఎవరియందునూ కానబడుట లేదు. సంధ్య మరియు సావిత్రిల ఆరాధ్య దేవత అయిన జగన్మాత విష్ణుమాయ మినహా వేరెవరునూ ఈ కార్యము సాధింపలేరు. అందువలన నేను జగజ్జనని, యోగనిద్ర, విష్ణుమాయ యొక్క స్తవము కావింతును. ఆ తల్లి శంభుని మోహింపజేయగలదు. నీవు ఆ విశ్వజనయత్రి యొక్క పూజ చేయవలసినది. ఆమె నీ ఇంట పుత్రికగా జన్మించి హరపత్ని కాగలదు.

అంత దక్షుడు మరీచాది మహర్షులను సంప్రదించి పరమేష్ఠితో ఇట్లనియె "భగవాన్! మీరు జగత్తు యొక్క శ్రేయోభిలాషులు. విష్ణుమాయ తప్ప వేరొక వనిత శంభుని మోహింపజేయుట అసంభవము. అందువలన విష్ణుమాయ మా ఇంట పుత్రికగా జన్మించుటకువలయు ప్రయత్నములన్నియు నేను త్రికరణ శుద్ధిగా కావింతును." అంత మరీచాది మహర్షులు "తథాస్తు"! అట్లే అగుగాక!!" అని దీవించిరి. అంత దక్షుడు క్షీరసాగరపు ఉత్తర తటమున సుస్థిరాసన స్థితుడై, జగదంబను హృదయమందిరమున స్థాపించి తీవ్రతపమాచరించుట నారంభించెను. దక్షుడు ధృఢవ్రతుడై, మనసును నిగ్రహించి, సంయమియై జలము, రాలిన ఆకులు, వాయు భక్షణము కావించుచూ, మూడువేల దివ్య సంవత్సరములు తీవ్ర తపమాచరించెను. దక్షుడు తపమునకు ఏగిన పిదప సర్వ జగత్పతి అయిన బ్రహ్మ పరమ పవిత్రము, పుణ్య జనకము అయిన మంధర పర్వత సానువుల యందలి ఒక ప్రసిద్ధ క్షేత్రము చేరి జగన్మాత యొక్క స్తవము కావింప నారంభించెను. బ్రహ్మ "ఎవరు విద్య, అవిద్య స్వరూపమో, స్థూల సూక్ష్మ రూపధారియో, నిరాధారా, నిరాకులా, మరియు పరమ విశుద్ధయో, ఆ సనాతనమయిన జగద్ధాత్రిని నేను స్తోత్రము చేయుచున్నాను. జగత్తు సర్వము ఎవరి అంశీభూతమో, ఎవరి కదలికచే సర్వ జగత్తు కదులుచున్నదో ఆ సనాతన రూపమయిన నిద్రాదేవిని స్తుతించుచున్నాను."

"అమ్మా! నీవే చిత్‌శక్తి, పరమానందదాయినీ, మరియు పరమాత్మ స్వరూపిణివి. నీవు సర్వులను పవిత్రము కావించెదవు. సావిత్రీ, జగద్ధాత్రీ, సంధ్య, రతి, ధృతి మొదలగువారందరూ నీ రూపములే!! నీవే జ్యోతి స్వరూపిణివై సంసారమును ప్రకాశమానము కావించెదవు. అట్లే తమోరూపముతో జగత్తును నిద్రావశులను కావించెదవు. నీవే సృష్టి రూపముతో సంసారమును సృజించి, స్థితి రూపములో విష్ణుసహితవై పోషించి, అంత్యమున మృత్యురూపములో

సంసారమును లయము కావించెదవు.

తల్లీ! నీవే తుష్టి, పుష్టి, ధృతి, మైత్రి, కరుణ, ముదిత, లజ్జ, శాంతి, కాంతి, జగదీశ్వరీ, మహామాయా, స్వాహా, స్వధా, మరియు పితృదేవతవు. నా యొక్క సృష్టి శక్తి, విష్ణువు యొక్క స్థితి శక్తి, మరియు భర్గుని లయ శక్తి కేవలము నీయొక్క సనాతన శక్తి మాత్రమే!! నీవు ఏకమాత్ర వయ్యునూ, నీవే విద్య, అవిద్య, వెలుగు, చీకటి మొదలగు ద్వంద్వ రూపముల ధారణ కావించుచూ సంసారము యొక్క బంధమోక్షములకు కారణమగుచున్నావు.

జగన్మాతా! సర్వభూతములందలి లక్ష్మీ, ఛాయా, సరస్వతీ స్వరూపమునవు నీవే! సర్వ యజ్ఞముల సమిధ, వేదులు నీవే! జగన్మయీ! పరమాత్మ యొక్క అవ్యక్తము, అనిర్దేశ్యము, అనుచ్ఛరిత రూపము, సమస్త జగత్ స్వరూపము, సమస్త జగదాధారము, విశ్వభరణము, పోషణము, ప్రాణులకు సర్వ శక్త్యైశ్వర్య ప్రదాయకము నీవే!!

ఓ! దేవీ! సర్వులకు సుఖ భోగ ప్రదాయినీ! నీవు భవసాగర తరణము చేయునౌక! సమస్త బ్రహ్మాండమునకు ఏకమాత్ర గతివి నీవే!! నీవు నిత్యానిత్య స్వరూపిణివి. స్థావర జంగమాత్మక జగత్తును మోహింపజేయు మహాశక్తివి.

చతురుల యందలి కీర్తి, యతిగణముల ధ్యానము, మరియు యోగమార్గము యొక్క సాంగోపాంగ ప్రవర్తన కర్తవు నీవే! అష్టాంగ యోగమందు విరాజ మానమగు జ్ఞానము నీవే! నీవు ఖడ్గ, శూల, చక్రధారిణివి. జగత్తు నందలి ఘోర, అఘోర రూపము, మరియు జగత్తుయొక్క ఆది నీవే! కానీ నీకు ఆది లేదు. నీవు జగత్తు యొక్క ఉత్పత్తికి కారణ భూతము. కానీ నీకు ఉత్పత్తి లేదు. నీవు విశ్వయోనివి, కానీ అయోనిజవు. నీవు ప్రళయ కాలమందు జగత్తును లయము కావించెదవు. కానీ నీకు నాశము లేదు. నీవు సంపూర్ణ నిర్మల స్వరూపిణివి. నీవే శుద్ధసత్వము మరియు తామసీ రూపము, హింస అహింసలు, మొదలగు ద్వంద్వ రూపిణివి మరియు ద్వంద్వాతీతవు.

నీవు స్వాభావికముగ ఆనందమయి మరియు ఆనంద ప్రదాతవు. నీవు నేత్రహీనవు కానీ నీకు అత్యుత్తమ దృష్టి కలదు. నీవు కర్ణ రహితవు కానీ నీ శ్రవణ యుగళి అతి రమణీయము. నీకు చేతులు లేవు కానీ సర్వమును గ్రసించెదవు. నీకు కాళ్ళు లేవు. కానీ నీ గమన శక్తి అతులితము. వ్యోమ, వాయు, తేజస్, జల, పృథివీ, మనో, బుద్ధి, అహంకారములు సర్వము నీవే!!! ప్రపంచమున గల అష్ట ప్రకృతులు నీవే! నీవే మేరు పర్వత రూపమున జగత్తుకు నాభి స్థానమునయుంటివి. శుద్ధ స్వరూపిణివీ మరియు సర్వమునూ మోహగ్రస్తము కావించు మహామాయ కూడా నీవే! కార్యము, కారణము, సత్యము, శాంతము, మంగళ అమంగళములు, ఇవన్నియు రాగ (Attachment) రూప వృక్ష ఫలములు. ఈ రూపములన్నియు విశ్వ సంరక్షణార్థము నీవు తీసికొనినవే!

అష్టాంగ యోగము ద్వారా వివిధ రకములుగ విచారణ చేసి ఏ తత్వము నందు యోగి జనము స్థిరపడుదురో ఆ తత్వము నీవే! బాహ్యాంతరములు, సుఖ దు:ఖములు, జ్ఞాన అజ్ఞానములు, జీవన్మరణములు, శాంతి అశాంతులు మొదలగు ద్వంద్వములన్నియు నీవే! యోగనిద్ర, మోహనిద్ర, మూల ప్రకృతి, విష్ణుమాయ మొదలగున వన్నియు నీ దివ్య శక్తి స్వరూపములే! నీవు జగదీశ్వరుని యొక్క ఏకమాత్ర శక్తివి."

"ఎవరి నుండి త్రిమూర్తుల శరీరములు ఉత్పన్నమయినవో, ఎవరు త్రిమూర్తుల అస్తిత్వమునకు కారణభూతమో, ఆ శక్తి యొక్క స్వరూపమును, గుణసమూహ వర్ణనమును ఎవరు కీర్తించగలరు? స్థావర జంగమాత్మకమయిన బాహ్య జగత్తు, సూర్య, చంద్రాగ్నుల యందలి అంతర్జ్యోతి, స్వరూపమునవు నీవే! మాతా! నీవు సమస్త జగత్తు యొక్క జనని. ఓ! విశ్వరూపా! విశ్వమయీ! సనాతనీ! దయచేసి నాయందు ప్రసన్నురాలివి కమ్ము". బ్రహ్మదేవునిచే కావింపబడిన స్థవమును వినిన జగన్మాత, మనోహర రూపిణియై, చతుర్భుజములతో, అందు వజ్ర, ఖడ్గ, నీలి కమలములు ధరించి సింహారూఢయై, భగవతి చతుర్ముఖ బ్రహ్మదేవుని ఎదుట సాక్షాత్కరించెను. ఆ తల్లిని చూచి బ్రహ్మ సాంజలి బంధకముగ వందన మాచరించి ఇట్లనియె "తల్లీ! నీవు జగత్తు యొక్క ప్రవృత్తి మరియు నివృత్తి రూపము, అంతేకాక సృష్టి, స్థితి, లయ

కారణము. నీకు మరల, మరల సమస్కారము. నీవు చరాచర జగత్తునంతటినీ మోహింపజేయు సనాతన స్వరూపిణివి.

నీవు కేశవుని అర్ధాంగివయిన లక్ష్మీదేవి మరియు సర్వులకు అధారమయిన పృధివీ స్వరూపవు. యోగినుల చే ఎల్లప్పుడూ పూజింపబడు "లజ్జ" స్వరూపిణివి. యోగి జనులు శ్రవణ, మనన, నిధి ధ్యాసనముల ద్వారా సమాధి స్థితి నొంది శుద్ధసత్వమయము, స్వయం ప్రకాశము, అయిన ఏ శక్తిని భావన చేయుదురో ఆ శక్తి నీవే! నీవు కాల స్వరూపిణివై కూటస్థ (మార్పులేని) స్థితియందుండి, అనేక అవ్యక్త, అచింత్య రూపధారణము చేసి జగత్తు యొక్క పరివర్తనకు కారణభూతమగుచున్నావు. నీవే సత్వ, రజస్, తమో గుణముల ఉత్పత్తి కారణము. జగత్తు కేవలము ప్రకృతి జనకము. ప్రకృతియే పురుషుని బాహ్యాంతరముల యందలి ఆసక్తిని ఉపసంహరించి బీజ రూపముగ పురుషుని యందు లీనమగును. ఆ బ్రహ్మాండ బీజరూపము నీవే! ఓ! జ్ఞాన జ్ఞేయ స్వరూపా! జగత్ హితము కావింపవలసినది. ఓ! విష్ణుమాయా! నీకు నమస్కారము".

బ్రహ్మ దేవుని వచనములు వినిన కాళీమాత మేఘ గంభీర స్వరముతో ఇట్లనియె "లోక పితామహా! నీవు నన్ను ప్రార్ధించుటకు కారణమేమి! ఏ కార్యసిద్ధి కొరకు ఈ యత్నము? త్వరితముగ తెలుపవలసినది. నేను ప్రత్యక్షమయిన పిదప నీకు కార్యసిద్ధి అవశ్యము జరుగును. నీ అభిలాష ఏమి?" బ్రహ్మ "దేవీ! భూతేశుడు, మహాదేవుడు సతీపరిగ్రహణము నొల్లక ఏకాంతముగ రమించుచున్నాడు. మీరు అయనను స్వయముగ తాను పత్నీ పరిగ్రహణము కావించునటుల మోహింపజేయవలసినది. ఈ కార్యము మీచే తప్ప అన్యులకశక్యము. మీరు ఏ విధముగ లక్ష్మీ రూపధారణ కావించి నారాయణుని మెప్పించిరో, అట్లే మహాదేవుని సహితము ఆనంద పరవశుని కావింప వలసినది. నాకు కలిగిన కొద్దిపాటి పత్నీగ్రహణ మోహమును వృషధ్వజుడు నిందించెను. అందువలన స్వేచ్ఛగా పత్నీ స్వీకరణకు ఇచ్ఛగింపడు. సృష్టి, స్థితి, లయములందు లయకార్యము రుద్రుని విధి. వైరాగ్యము చే ఆయన ఉదాశీనుడయినచో ఈ సృష్టి చక్రము ఎట్లు నడుచును? అందువలన నేను మిమ్ము శరణుజొచ్చితిని. ఈ విపత్తు నుండి నన్ను మీరు వినా వేరెవరూ రక్షింపలేరు. జగత్తు యొక్క హితార్ధము ఈ కార్యమును మీరు సుసంపన్నము చేయవలసినది. ఈ కార్యము, లక్ష్మీ నారాయణులు, కాముడు, నేను, మేమెవరమూ చేయ నశక్యులము. జగత్ హితార్ధము ఎన్నో రూపములు తీసికొనిన మీరు నారాయణునికై లక్ష్మీ రూపమును, సర్వ భూతములకు కీర్తి స్వరూపమును తీసికొన్నటుల ఈ శంభుని కోసమై ఒక విలక్షణ రూపము స్వీకరించి ఆయనను మోహింపజేయవలసినది."

**(శ్రీ కాళికా పురాణమందలి కాళీస్తుతి యను అయిదవ అధ్యాయము సమాప్తము)**

# ఆరవ అధ్యాయము

**(యోగనిద్ర స్తుతి, దేవి ద్వారా ఆశ్వాశన)**

బ్రహ్మదేవుని పలుకులు వినిన యోగమాయ ఇట్లనియె "ఓ! బ్రహ్మదేవా! నీవు పలికినది ముమ్మాటికీ సత్యము. నేను వినా వేరెవరూ శంకరుని మోహింపజేయలేరు. అంతేకాక శంకరుడు దారాగ్రహణము కావింపని ఎడల సనాతన సృష్టి క్రమము సాగదను మీ అభిప్రాయము కూడ పూర్ణ సత్యము. జగత్పతి అయిన శశిశేఖరుని మోహింపజేయుటకు నేను ఇది వరలో బహు ప్రయత్నము కావించితిని. కాని నేడు మీ పలుకులచే ఆ యత్నము సఫలీకృతమగునని సునిశ్చితమయినది. నేను సహితము తనంతట తానుగా వివశుడై, మోహితుడై, దారాపరిగ్రహణము కావించు ఉపాయమునన్వేషించెదను. ఓ! మహాభాగా! నేను సహితము సుందర రూపము ధరించి ఆయనకు వశీభూతురాలినై,

లక్ష్మీదేవి నారాయణునితో సుఖించునటుల అనగి పెనగి తరించెదను. అంతేగాక శివుని సహితము సామాన్య మానవుని వలె నా వశీభూతుని కావించెదను. ఓ! విధాతా! పున: సృష్టి కార్యములందు ఏ మాత్రము అలజడి లేని శివ భగవానుని స్త్రీ రూపములో ఎల్లప్పుడు అనుగమించెదను. పితామహా! నేను దక్షపత్ని యొక్క గర్భము నుండి బహు సుందర రూపముతో ఉత్పన్నమయి, శ్రీకంఠునకు అర్ధాంగినై, ఆయనకు నిత్య సహకార మందించెదను. అపుడు దేవ గణములన్నియు నన్ను యోగనిద్ర, విష్ణుమాయ, జగన్మయి, శాంకరీ, రుద్రాణీ అని సంభోదించెదరు. ఏ విధముగ ప్రాణికోట్లను జన్మమందగనే మోహము నందు ముంచెత్తుదునో, అట్లే ప్రమధుల ప్రభువయిన భవుని సంపూర్ణముగ మోహితుని కావించెదను. ధరిత్రి యందు సర్వ ప్రాణులు ఎట్లు పత్నీ వశులై యుందురో అంతకంటె ఎక్కువగా శంభుని  పత్నీవశుని కావింతును. ఎల్లప్పుడూ తన హృదయమందిరమందు ఆత్మరతి గావించుచూ సమాధి స్థితి యందు యుండు శర్వుడు, నాపై ముగ్ధుడై, నన్ను హృదయమునందుంచుకొని సమాధి స్థితికి పరాకాష్ఠ గా నన్ను గ్రహించును." ఈ విధముగ పలికి మహామాయ పరమేష్ఠి చూచుచుండగనే అంతర్ధానమయ్యెను.

తదుపరి చతుర్ముఖ బ్రహ్మదేవుడు మహామాయ యొక్క వచనములు స్మరించుచు, మిక్కిలి ప్రసన్నుడై, కృతకృత్యుడనైతినని అమిత మోదము నొంది కామదేవుడుయున్న స్థలమున కేగెను. కాముడు హంసవాహనుడు తన యొద్దకు అరుదెంచుట గాంచి, వెంతనే లేచి, ప్రణామములాచరించెను. అంత బ్రహ్మదేవుడు మిక్కిలి ప్రసన్నుడై, వాత్సల్యపూరిత దృక్కులతో చూచుచూ, తన మృదు మధుర వాణితో మదనునితో ఇట్లనియె "వత్సా! నీవు ఇత: పూర్వము శంకరుని మోహింపజేయు స్త్రీని సృష్టింపమని కోరితివి గదా! అందువలన నేను మంధరాచల కంధరము నందు జగన్మయి అయిన యోగనిద్రా దేవిని గూర్చి నితాంత ఏకాంత ధ్యాన మాచరించితిని. ఆ తల్లి నన్ననుగ్రహించి, నాకు ప్రత్యక్షమై శంకరుడు తన ద్వారా మాత్రమే మోహితుడగునని, తాను దక్షగృహమున అవతరించి శర్వుని సమ్మోహితుని గావించి, ఆయన పత్ని నౌదునని వక్కాణించినది. అందువలన ఈ కార్యము సిద్ధించుట తధ్యమని తలంపుము."

అంత మన్మధుడు "పితామహా! బ్రహ్మదేవా! జగన్మాత, యోగనిద్ర మొదలగు నామములతో ప్రసిద్ధమయిన ఈ స్త్రీమూర్తి ఎవరు? ఎక్కడ నివసించును? ఆమె ప్రభావమెట్టిది? నిరంతరము తపస్సులో మునిగి యుండు కామారిని ఆమె ఎట్లు వశీభూతమొనర్చుకొనును? కపాలి సమాధి నుండి బహిర్గతమయిన పిదప ఒక్క క్షణ పర్యంతము అయిననూ ఎవరినీ వీక్షింపడు. అట్టి భవుని ఈ స్త్రీ ఎట్లు విమోహితుని కావించును? పరమేష్ఠీ! జ్వలించుచున్న అగ్ని వంటి నేత్రములు కలవాడు, అప్రతిహతమయిన త్రిశూలధారి, భయంకర జటాజూటధారి అయిన త్రినేత్రుని సమ్ముఖమునకు ఎవరు పోగలరు? నా కార్యము సంపూర్ణము చేయగలిగినది, పైన వివరించిన రూపముగల విరూపాక్షుని మోహింపజూచుచున్న ఈ స్త్రీ మూర్తి యొక్క విషయము సర్వము నాకు తెలియజేయ వలసినది."

ఈ విధముగ అత్యంత నిరుత్సాహముగ పలికిన మదనుని పలుకులు ఆలకించి పరమేష్ఠి చింతనొందక "ఆమె సమర్ధురాలు" అని ఆశ్వాశన మొసంగి ఒక దీర్ఘ నిశ్వాసము నొదలెను. ఆ నిశ్వాసము నుండి అత్యంత బలశాలురు, చంచల స్వభావులు, అనేక రూపములు ధరించిన భయంకర గణములు ఉత్పన్నమయినవి. అందు కొందరు హయ, గజ, సింహ, వ్యాఘ్ర, శునక, వరాహ, గార్దభ, భల్లూక, మార్జాల, శరభ, గొర్రె, గోమాయువు (నక్క), సరీసృప (జెర్రి, రోకలిబండ) వంటి ముఖములు కలవారు. అందు కొందరు దీర్ఘకాయులు, కొందరు మురగుజ్జులు. కొందరు స్థూలదేహులు, కొందరు అతి సన్ననివారు. కొందరు రక్త లేక భస్మనేత్రులు. కొందరు ఏకాక్షులు మరికొందరు త్రినేత్రులు. కొందరు ఏక, త్రి చతుర్ కర్ణులు. కొందరు పెద్ద పెద్ద చెవులు, మరికొందరు అతి చిన్న చెవులు కలవారు. కొందరికి అసలు చెవులు శూన్యము. కొందరు విశాల నేత్రులు. కొందరు పొడవయిన నేత్రములు కలవారు, మరికొందరు నేత్రహీనులు. ఈ విధముగ కాళ్ళు, చేతులు కూడా వివిధముగయున్న వికృత రూపులు. శరీర ఛాయ కూడా ఎరుపు, పసుపు, నలుపు,

మిశ్రిత వర్ణయుక్తులు. ఈ గణములన్నియు రథారూఢులై, శూలము, పాశము, ఖడ్గము, ధనుస్సు, శక్తి, అంకుశము, గద, బాణము, పట్టిశము, మొదలగు ఆయుధములు ధరించిరి. ఈ విధముగ శస్త్రధారులై "కొట్టు", "చంపు" అని గర్జనలు చేయుచూ బ్రహ్మ సమ్ముఖమునకు ఏతెంచిరి. ఈ విధముగ గర్జనలు చేయుచున్న గణములను చూచి యోగనిద్ర ప్రభావమున బ్రహ్మదేవుడు మిన్నకుండెను. కానీ మదనుడు వారిని వారించి, సమాధాన పరిచి, వారందరూ శాంతించిన పిదప చతుర్ముఖునితో ఇట్లనియె.

"పరమేష్ఠీ! ఈ గణముల కార్యమేమి? వీరందరూ ఎక్కడ నివసింపవలెను? వీరి నామధేయమేమి? వీరందరికి యుక్తమగు కార్యమొసంగి, తగిన నామమిడి, వారి వారి కార్యకర్మలయందు నియుక్తులను గావించి అటు పిదప మహామాయ జగదంబ యొక్క మాహాత్మ్యమును నాకు తెలుపవలసినది. అంత బ్రహ్మదేవుడు కాముని పలుకులు విని, సాలోచనగా గణములను వీక్షించుచూ ఇట్లనియె "వీరు ఉత్పన్నమయిన వెంటనే "మార, మార" అని అరిచిరి. అందువలన వీరు "మార గణములు" అను పేర ప్రసిద్ధి నొందెదరు. వీరందరూ నీ (మదనుని) ఆధీనమునందుండి ఎల్లప్పుడూ సర్వ ప్రాణుల కార్యములను విఘ్నమొనర్చెదరు. వీరి ముఖ్య కార్యము ఎల్లప్పుడూ నిన్ను అనుగమించుటయే! నీవు నీ కార్యసాధనకు ఎక్కడెక్కడకు ఏగెదవో, వీరు నీ సహాయార్ధము అక్కడక్కడికి ఏతెంచెదరు. నీవు ఎవరిని వశీభూత మొనర్చుటకు ధనువు సారించెదవో, ఈ గణములు ఆ ప్రాణి యొక్క చిత్త విభ్రమణము కావించెదరు. జ్ఞానుల జ్ఞాన మార్గమును సదా విధ్వంసన మొనర్చెదరు. ప్రాణుల సర్వ మార్గములకు విఘ్నములొనర్చి, వారిని సంసార కర్మ యందు బంధితులను కావించెదరు. అత్యంత వేగవంతులు, ప్రచ్ఛన్నరూపధారులు అయిన మారగణములు అన్ని స్థలముల యందు నివసింపగలరు, మరియు నివసించెదరు. వీరికి పంచ యజ్ఞములందు అంశభోగము (వాటా) కలదు. అంతేకాక ప్రాణులర్పించు జలము, అర్ఘ్యములచే లభించు పుణ్యఫలమును సహితము గ్రహించెదరు. వీరికి గణాధ్యక్షుడవు నీవే!!!

ఈ విధముగ పితామహుని పలుకులాలకించి మారగణము పరమేష్ఠి, మదనులకు పరిక్రమ గావించి యధాస్థానములకు చనిరి. మార్కండేయుడు మునులను చూచి "ఋషిసత్తములారా! ఈ గణములను వర్ణించుట అనితరసాధ్యము. వీరి మహాత్మ్యము సహితము వర్ణింపనలవికానిది. ఎందుకనగా వీరందరూ తపస్వులు, ఇచ్ఛారహితులు (కోరకలు లేనివారు), సన్యాసులు, ఊర్ధ్వ రేతస్కులు. అందువలన పత్నీ, పుత్ర, పుత్రికలు లేనివారు. ఇపుడు తిరిగి బ్రహ్మ, మదన సంవాదమును వినుడు."

మారగణములు వెడలిన పిదప బ్రహ్మదేవుడు ప్రసన్నమనస్కుడై మదనునకు జగన్మయీ మాహాత్మ్యమును తెలుపసాగెను "వ్యక్తా, అవ్యక్త రూపముల నొంది, సత్వ, రజస్, తమో గుణముల సహాయముతో సర్వ సృష్టిని కార్య కర్మముల యందుంచి, ఎవరు తన అర్ధ సిద్ధిని (కార్య సాధనము) పొందుచున్నదో ఆ శక్తి యే "విష్ణుమాయ" అని పిలువబడుచున్నది. ఎవరు మంత్రముల యొక్క సర్వోత్కృష్ణ భావమో, ఎవరు పరమానంద స్వరూపమో, ఎవరు పరమయోగుల అంత:కరణము నందున్న ఆత్మవిద్యయో, ఆమెయే జగన్మయి! జీవుడు గర్భము నందు యున్నపుడు జ్ఞాన సంపన్నుడై యుండును. కానీ ప్రసవ సమయమున "శఠము" అను వాయు రూపము ఆవరించి జీవుని సంపూర్ణ జ్ఞాన రహితుని కావించి నిరంతరము జన్మ మృత్యుచక్రమున సంచరింపజేయు దివ్య శక్తియే మహామాయ. పురాతన కాలమందు (పూర్వ జన్మముల యందు) జీవునికి సంక్రమించిన సంస్కారముల ద్వారా తొలుత ఆహారాది విషయములందు, తదుపరి అజ్ఞానము కామ,క్రోధ మోహాది అరిషడ్వర్గములందు తిరిగి, తిరిగి విసరవైచి, నిరంతరము కోరికల వలయమందు బంధించి, రాత్రింబవళ్ళు చింతా, మోదము, వ్యసనాదులందు నియుక్తుని చేసి జీవుని బద్ధుని, భ్రష్టుని గావించు విచిత్ర శక్తియే మహామాయ.

మహత్తత్వము, అహంకారము మొదలగు సృష్టి కారణములకు కూడా కారణ స్వరూపిణి జగన్మాత. అందువలన ఆమె "అనంతరూపిణి, ఉత్పత్తి శక్తి" అని కూడా పిలువబడును. ఎట్లు మేఘము నుండి జాలువారిన నీరు, బీజము

నుండి ఉద్భవించిన అంకురమును క్రమ వికాసమొనర్చునో, అట్లే పుట్టిన ప్రతి ప్రాణి ఈ జగన్మాత, మహామాయా శక్తి వలననే పోషింపబడుచున్నది. ఈ తల్లియే సృష్ఠించునపుడు సృష్ఠిశక్తి, పోషించునపుడు ఖ్యాతి రూపమయిన ఈశ్వరి, క్షమాశీలుర యందలి క్షమ, దయాపరుల యందలి కరుణ. ఈ దేవి సమస్త ప్రపంచము, ప్రాణి కోట్ల యందలి అభ్యంతరమున నిత్యము ప్రకాశించుచుండును. ఈ వైష్ణవీ దేవియే యోగి జనుల యందు విద్యా స్వరూపిణియై మోక్ష కారకమై యుండి, సంసారిక జనుల యందు అవిద్యా రూపమున సంసార బంధనమునకు కారణభూత మయినది. ఓ! మనోభవా! ఈ సుందరియే లక్ష్మీ స్వరూపమై విష్ణుదేవునికి సహచరియై యున్నది. వేదత్రయా (వేదములు నాలుగు అయిననూ, అందు ఉపయోగించు మంత్రములు (ఋుక్, యజుస్, సామ) మూడు కావున వేదత్రయా, మూడు వేదములుగ ప్రసిద్ధి నొందినది) రూపమున ఎల్లప్పుడూ నా కంఠము నందు స్థితిగతయై యున్నది. ఈ జగన్మాత సర్వ జగత్తు యందునూ విరాజమానమై యున్నది. ఆమె సర్వగమన శీల, నిత్యనూతన, ఎల్లప్పుడూ యుండునది, నాశము లేనిది, సర్వరూపధారిణి, పరాశక్తి అని కూడా పిలువబడును. ఆమె స్త్రీ రూపము ధరించి సర్వ ప్రాణులను, త్రిమూర్తులను సహితము మోహింపజేయును.

**(శ్రీ కాళికా పురాణము నందలి యోగ నిద్రాస్థుతి యను ఆరవ అధ్యాయము సమాప్తము)**

# ఏడవ అధ్యాయము

**(మదన కదనము - మదన బ్రహ్మ సంవాదము)**

బ్రహ్మదేవుడు ఈ విధముగ మహామాయ, జగన్మయి యొక్క స్వరూపమును మదనునకు వివరించి, తదుపరి శంకర మోహనమును గూర్చి ఈ విధముగ పలుకసాగెను, “వత్సా! జగన్మాత మహాదేవుని దారా పరిగ్రహణము గూర్చి ఇది వరలోనే యోచించి, తాను అవతార స్వీకరణ గూర్చి నిశ్చయించెను. ఆమె తాను దక్ష పుత్రిక గ జన్మించి శంభుని అర్థాంగి నౌదునని నాకు నిశ్చయాత్మకముగ తెలిపినది. అందువలన మనోభవా! నీవు నీ గణములను, వసంతుని, రతీదేవిని తీసికొని మహాదేవుని మోహితుని చేయుటకు వలసిన ఉచితమయిన ఉపాయము నాలోచింపుము. శివుడు వివాహితుడయిన అనంతరము మనమందరము కృతార్థులమగుదుము. సృష్ఠి అవిచ్ఛిన్నముగ సాగును. ఇందు సందియము లేదు.”

అంత కాముడు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. “పరమేష్ఠీ! రుద్రుని మోహింపజేయుటకు మాచే ఆచరింపబడిన ప్రత్యక్ష, పరోక్ష కార్యకలాపములను ఆలకింపవలసినది. లోకేశా! పినాకపాణి తన ఇంద్రియములను స్థబ్దము చేసి సమాధిస్థితి నొందునపుడు, నేను శీతల, సుగంధిత మలయ మారుతమును వీవన చేసితిని. అనంతరము నా పుష్ప ధనువును సారించి పంచ పుష్ప బాణములను గుప్పించితిని. నేను దివారాత్రములు అచట గల మానస, సిద్ధ దంపతులను సురత కార్యమందు రమింపజేసితిని. నా ఈ ప్రయత్నము చే ఏ ప్రాణి అయిననూ ద్వంద్వ భావమొందకుండునా? కానీ శశిశేఖరుడు, ఆయన వృషభము (నందీశ్వరుడు) సహితము కించిత్ మనోవికారము నొందలేదు. వామదేవుడు హిమాలయ శిఖరమున కేగినపుడు, నేను రతీ, వసంతుల సహితుడనై ఆయనను వెంబడించితిని. ఆయన మేరు పర్వతము, నాటకేశ్వరము, కైలాసము, ఇట్లు ఏ ప్రదేశమున కేగిననూ ఆయనను అనుసరించితిని. విరూపాక్షుడు ఒక్క క్షణమే సమాధి నుండి బయల్వెడలిననూ, ఆయన సమ్ముఖమునకు చక్రవాక పక్షులనంపి వాటి కామ, హావభావముల చే దాంపత్య కర్మలనాచరింప జేసితిని. అంతేకాక ఆయనను పరివేష్ఠించిన పశుపక్ష్యాదులను, నీలకంఠ పక్షులను, సహితము మోహింప జేసితిని. మారుని శరజాలము నందు పడి విచిత్ర, మధుర, మదన బాధ నెవరు అనుభవింపకుందురు? సర్వలోకాధారా!

పితామహా! నేను పత్నీ, మారగణముల సహితుడనై, పుష్పబాణుడనై, వలయు ప్రయత్నమంతయు అచరించితిని. నా పుష్పశరములన్నియు నిష్ఫలమైనవి.

వసంతుడు సహితము తన శక్తివంచన లేక యత్నించెను. ఎక్కడెక్కడ నీలలోహితుడు స్థితిగతుడయ్యెనో అచట వనమంతయు సంపెంగి, కుంకుమపువ్వు, అశోకము, మామిడి, కరుణ, కలిగొట్టు, నాగకేసరము, పున్నాగము, పలాశము, మొగలి, చిరుమాను, మాధవీ, మల్లిక, పర్ణధార, బొగడబంతి, ఎర్రతోటకూర పుష్పములతో వెల్లివిరిసెను. శూలపాణి పరిశర సరోవరములన్నియు స్వచ్ఛమై, అలజడి లేక నీలి ఛాయలు వెదజల్లుచూ, అరవిరిసిన పుష్పయుక్తములై, మంద సుగంధ, మలయమారుతమును వెలువరించు చుండెను. అచల గల దేవతలు, సిద్ధులు, సాధ్యులు, నిష్ఠుర తపోనిష్ఠులు, అంత్యమున శివగణములు సహితము సున్నిత, సురత భావములందు సంలగ్నులయిరి. ఏ ఋషి, ముని, చివరకు ఏ ప్రాణి సహితము ఇటువంటి వాతావరణమున కామమోహితుడు కాకుండును? విష్ణువల్లభుని "యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి" అను అష్టాంగ యోగమును విఘ్నమొనర్చుటకు నేను, నా వేలాది మారగణములు నిష్ఫలమైనవి. శ్రీకంఠుడు కించిత్ మాత్రము భ్రంశము నొందలేదు. ఇక మా వద్ద వేరు ఉపాయములు లేవు. అందువలన నేను సంపూర్ణముగ విఫలుడనైతిని. కానీ ఇపుడు మీ ఉపదేశమును విని, మహామాయ యొక్క ఉద్దేశ్యము నాకళించి, తిరిగి పత్నీ, సృహృద్ గణముల నిడుకొని పున: ప్రయత్నమును ఆరంభించెదను. త్రిలోకేశా! యోగనిద్ర శివపత్ని అగు వ్యవస్థను మీరు సహితము మీ వంతు కార్యము నాచరింపవలసినది."

**(శ్రీ కాళికాపురాణమందలి మదన - బ్రహ్మ సంవాదమను ఏడవ అధ్యాయము సమాప్తము)**

# ఎనిమిదవ అధ్యాయము

**(దక్షునికి దేవీ వరప్రసాదము - సతీ జననము)**

ఈ విధముగ పలికిన మదనుని, చతుర్ముఖుడు "జగన్మయి శివపత్ని తప్పక కాగలదు" అని నిశ్చయాత్మకముగ పలికి అనేక విధములుగ రతీపతిని ఆశ్వాశించి, ఆఖరుగ ఇట్లనియె "మనోభవా! దివారాత్రములందలి నాలుగు భాగములందు ఒక భాగము సృష్టిసంతతినీ, మోహ పరవశుల గావించి, మిగిలిన మూడు భాగముల సమయము నీల లోహితుని వద్ద కాపుండి, ఆయనను మోహితుని కావించుటకు యత్నించుము." ఈ విధముగ పలికి పరమేష్ఠి మదనాదులు చూచుచుండగనే అంతర్హితుడయ్యెను. మదనుడు తన పరివార సహితముగ శిపివిష్టుని కడకేగెను.

ఇక పాలకడలికి ఉత్తర తటమున అత్యంత నియమ నిష్ఠాగరిష్ఠుడై, దక్ష ప్రజాపతి దీర్ఘ కాలము నుండి తీవ్ర తప:శ్చర్యకుపక్రమించెనని చెప్పుకుంటిమి కదా! ఆయన కఠోర తపము ఫలించు శుభ సమయమాసన్నమయినది. ఒకానొక శుభదినమున విష్ణుమాయ, సర్వ జగన్మాత దక్షుని ఎదుట సాక్షాత్కరించెను. కాలమేఘ స్వరూపిణి, ఉన్నత పీన వక్షధారిణి, చతుర్భుజ, చతుర్బాహువుల యందు ఖడ్గము, నీలికమలము, ధరించి ఎర్రని కనుకొలకులు గల విశాలనయన, సర్వగుణశాలిని, మనోహారిణీ, సర్వమంగళ, అయిన ఆ భోగవతి సింహవాహనయై, తన ఎదుట ప్రత్యక్షమవ్వగనే దక్షుడు తాను కృతార్థుడనైతినని తలంచి, వినయ పూర్వకముగ తలవంచి, అత్యంత ప్రీతితో ఇట్లు స్తుతించెను.

"ఓ! ఆనందమయీ!! నీవు సంసారము నందు సర్వులకూ సంతోషము నిచ్చు ఆనంద స్వరూపిణివి. నిరంతరము సృష్టి, స్థితి, లయలను కావించెదవు. మహాలక్ష్మీ దేవి వంటి నిరంతర మంగళ ప్రదవు. మహేశ్వరీ! జగత్తుకు ఆశ్రయమగు సుప్రకాశ, శుద్ధ సత్వమయ, జ్యోతి స్వరూపము నందు ఏ పరతత్వము యున్నదో, అయ్యది కేవలము నీ యొక్క అంశ

మాత్రమే!! ఓ! దేవీ! రజోగుణాధిక్యత చే ప్రకాశించు కామము (కోరిక) యొక్క మూల హేతువయిన రాగము (నేను/నాది అనుభావము) కేవలము నీ యొక్క అంశాంశము. అంతేకాక తమోగుణాధిక్యత చే ప్రాణుల చైతన్యమును ఆవరించు మోహము సహితము నీ యొక్క అంశాంశ సంభూతము. తల్లీ! నీవు నిర్మలవు, లోకమోహినివి, మరియు విశుద్ధ రూపిణివయిన పరమాత్మ స్వరూపమునవు. నీవు త్రిగుణాత్మిక. అనగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపిణివి. ఋక్, యజుర్, సామవేదములు నీ మూర్తులే!! నీవు సర్వ జగత్తుకు ఏకమాత్రమయిన గతివి. మాధవుడు ఈ పృధివిని ధరించి సర్వులకు ఉపకారము నొనర్చుచున్నాడు. కానీ ఆయన ఆధారశక్తివి నీవే! నీవు స్థూలము, సూక్ష్మము, మరియు జయింపనలవి గాని మహాద్భుత విశ్వశక్తివి. నీవు బ్రహ్మాండము యొక్క సర్వమును ఆవరించుట వలన వాయువు వీచుచున్నది. ఓ! పరమాత్మ స్వరూపిణీ! సమస్త పదార్ధముల ఉత్పత్తి హేతువయిన శుద్ధసత్వము, నిరాలంబము (అలంబన అవసరము లేని/స్వయంసిద్ధము) నిష్కళంకము, నిర్మలము, అయిన నీ జ్యోతి స్వరూపమును యోగులు నిరంతరము ధ్యానించుచుందురు. అ పరంజ్యోతి నీ యందు పరిలక్షితమై యున్నది. నీవు విద్య, అవిద్యా స్వరూపిణివి. నీవు సృష్టి సర్వమునకు ఆలంబన నిచ్చెదవు, కానీ నీవు నిరాలంబ, ఆద్యాశక్తి మరియు జగదీశ్వరివి. నీవే సరస్వతీ స్వరూపమున విరించి యొక్క కంఠస్థానమున యుండి వేద ప్రకాశినిగ, జగత్తును ఉద్భాసితము గావించు వాణిగా వెలివడుచున్నావు. మాతా! నీవే అగ్ని, ఆకాశము, స్వాహా, స్వధా, పితృగణములు, కాలము, దిక్కులు, బాహ్య ప్రపంచము. నీవు అవ్యక్తము, అచింత్యము, అనిర్దేశ్యము, కాళరాత్రి మరియు శాంతి రూపమయిన పరా ప్రకృతి. నీవు సంసారము నందలి ప్రాణుల పరిత్రాణార్ధము బాహ్య రూపమును ధరించితివి. బ్రహ్మాది దేవతలు సహితము కేవలము ఆ రూపమునే తెలియగలరు. అవ్యక్త, పరమాత్మ స్వరూపమయిన నిన్ను ఎవరు తెలియగలరు? ఓ! భగవతీ! ఘోర, అఘోర రూపిణీ! నాయందు ప్రసన్నము కమ్ము! నాయందు ప్రసన్నము కమ్ము!! నాయందు ప్రసన్నము కమ్ము!!! బ్రహ్మదేవునిచే కావింపబడిన స్థవమును వినిన జగన్మాత, మనోహర రూపిణియై, చతుర్భుజములతో, అందు వజ్ర, ఖడ్గ, నీలి కమలములు ధరించి సింహారూఢయై, భగవతి చతుర్ముఖ బ్రహ్మదేవుని ఎదుట సాక్షాత్కరించెను. ఆ తల్లిని చూని బ్రహ్మ సాంజలి బంధకముగ వందన మాచరించి ఇట్లనియె "తల్లీ! నీవు జగత్తు యొక్క ప్రవృత్తి మరియు నివృత్తి రూపము, అంతేకాక సృష్టి, స్థితి, లయ కారణము. నీకు మరల, మరల నమస్కారము. నీవు చరాచర జగత్తునంతటినీ మోహింపజేయు సనాతన కళ్యాణకారము మరియు త్రిమూర్తులకు సహితము శుభప్రదము." మహామాయ "ఓ! దక్షప్రజాపతీ! నేను అతి శీఘ్రముగ నీ పత్ని గర్భము ప్రవేశించి నీకు పుత్రిక గ జన్మించి, తదుపరి శంకర సహధర్మచారిణి అగుదును. నీవు నన్ను ఆదరించి, ప్రేమించినంత తడవు నీ కుమార్తెగా, దాక్షాయణి గ సర్వులకు తెలియుదును. కానీ ఎప్పుడు నాయందు అనాదరణ చూపెదవో, తక్షణము నీకు దూరమగుదును. అందువలన ఈ ప్రతి సృష్టి సమయమున (సృష్టి – బ్రహ్మ మానస సృష్టి; ప్రతి సృష్టి – ప్రాణులు మైధునము ద్వారా కావించు సృష్టి) నీ కన్యగ జన్మించి శివ పత్నిని అగుదును. ఈ వరమును నీకు ప్రసాదించుచున్నాను." ఈ విధముగ పలికి జగన్మాత దక్షుడు చూచుచుండగనే అంతర్ధానమొందెను.

మహామాయాదేవి అంతర్ధానమయిన పిదప దక్షుడు తన ఆశ్రమమునకు చనెను. జగన్మాత తనకు పుత్రికగ జన్మించునని మిక్కిలి ముదమునొంది స్త్రీ సంపర్కము లేకుండా అనేక మంది పుత్రులను ఉత్పత్తి చేసెను. కానీ వారందరూ నారదుని ఉపదేశము చే పృధివీ పర్యటనకేగి తిరిగి రాకుండిరి. దక్షుడు అనేకమార్లు ఇట్లు పుత్రోత్పత్తి కావించెను. అన్ని సార్లు వారు నారదుని చే ఉపదేశమునొంది, నివృత్తి మార్గము ననుసరించి దేశాటనకేగి ఇప్పటికినీ రాకుండిరి. దక్షుడు మైధునము చే ప్రజోత్పత్తి కావించుటకు నిశ్చయించి, వీరణుని పుత్రిక అయిన వీరిణి లేక అసిక్తను తన పత్నిగ గ్రహించి సంతానోత్పత్తికి సంకల్పించెను. వారి ప్రధమ సంగమముననే సద్యోగర్భముగ మహామాయ ఉత్పన్నమయ్యెను. దక్షప్రజాపతి అత్యంత ప్రసన్నుడై ఆ బాలిక యొక్క ఉజ్వల దివ్యదీప్తిని కాంచి, జగన్మాత జననమొందినదని సంతసించెను.

దేవి జననమొందగనే దేవతలు పుష్పవృష్టినీ, మేఘమాల జలవర్షమును కురిపించిరి. దిశలు ప్రశాంతత నొందినవి. దేవగణములు ఆకాశమున మంగళవాద్యములు మ్రోగించిరి. అగ్ని ప్రజ్వరిల్లినది. దక్ష ప్రజాపతి తన భార్యకు తెలియని

విధముగ మహామాయ ను ఈ విధముగ ప్రార్థించుట నారంభించెను. "సర్వవ్యాపినీ, శివా (సర్వమంగళదాయినీ), శాంతా, యోగనిద్ర, జగన్మయీ, నీకు ప్రణామములు. ఎవరి అనుగ్రహము చే బ్రహ్మ సృష్టినీ, విష్ణువు స్థితినీ, రుద్రుడు సంహారము కావించునో, అట్టి మహాయశా! నీకు నమస్కారము. నిర్వికారము, నిర్మలము, అప్రమేయము, ప్రమాణ, ప్రమేయ స్వరూపము, ప్రకాశవంతము అయిన చైతన్యశక్తికి ప్రణామము అర్పించుచున్నాను. ఏ మానవుడు విద్య, అవిద్య స్వరూపమయిన నీ పరాత్పర స్వరూపమును ధ్యానించునో వానికి భోగమోక్షములు కరతలామలకములు. ఏ ప్రాణి నీ దివ్య దర్శనమును ఒక్కసారి పొందిననూ వానికి ముక్తి తథ్యము. ఓ! యోగనిద్రా! మహామాయా! జగన్మయీ! విష్ణుమాయా! ప్రమాణ ప్రమేయవతీ! జగదంబా! ఎవరు నిన్ను ఈ విధముగ స్తుతించెదరో వారికి సర్వ శుభములు ప్రాప్తించును."

మహామాయ దక్షుని స్థవమును విని తన మాయచే అచట గల సర్వులను మోహము నందు ముంచి, దక్షుడు వినా దక్షపత్నితో సహితము ఎవరికినీ తన పలుకులు వినబడనటుల మోహితులను గావించి ఇట్లనియె "ఓ! మునివర్యా! నీవు ఏ కార్యము కొరకు నా గూర్చి కఠోర తప మాచరించితివో ఆ కార్యము సిద్ధించుట తథ్యము. ఇది నమ్ముము." ఈ విధముగ పలికి దక్షుని సహితము తన మాయ చే మోహితుని గావించి, శైశవ భావమును వహించి తన తల్లి ప్రక్కన రోదించుట నారంభించెను.

అటు పిమ్మట దక్ష, వీరిణిలు అత్యంత ప్రేమతో తన పుత్రికను పెంచ నారంభించిరి. భగవతి శుక్లపక్ష చంద్రుని వలె దినదిన ప్రవర్ధమానమయ్యెను. పువ్వు పుట్టగనే పరిమళించును కదా! ఎట్లు చంద్రుని యందు కళలు వృద్ధినొందునో అట్లే అతిశయ గుణములు భగవతి యందు శైశవముననే ప్రస్ఫుటముగ ప్రకటితమయ్యెను. సఖులతో కూడి తన బాలక్రీడలందు తన సర్వమును మహాదేవుని కర్పితము చేయును. గానము నాలపించునపుడు ఇతర నామముల నొల్లక ఉగ్ర, స్థాణు, హర, రుద్ర, స్మరమానస మొదలగు నామోచ్చరణ గావించుచూ గానము చేయును. సర్వగుణ సంపన్న అయిన తన కుమార్తె యొక్క సాత్విక నిష్ఠను, నీతి పరాయణత్వమును గమనించి దక్షుడు ఆమెకు "సతి" అని నామకరణము చేసెను. బాల్యము నుండి క్షణ క్షణ పర్యంతము వీరిణి, దక్షుడు సతీదేవి పట్ల వాత్సల్యము ప్రోది చేసికొనిరి. సతీదేవియును తన మాతా పితరులకు అత్యంత ఆనందమును ప్రసాదించినది.

ఒకానొక దినమున సతీదేవి తన తండ్రి యొక్క చెంతన కూర్చొని యుండెను. ఆ సమయమున చతుర్ముఖ బ్రహ్మదేవుడు నారద సహితుడై, దివ్య ప్రభలతో వెలుగొందుచున్న సతీ దర్శన నిమిత్తమేతెంచెను. పరమ పవిత్ర చరిత్ర అయిన సతీదేవి వారిరువురికి సవినయముగ నమస్కరించెను. అంత వారిరువురు "నీవు ఎవరిని ఆపేక్షించుచున్నావో, నిన్ను ఎవరు అపేక్షించుచున్నారో అట్టి సర్వజ్ఞుడు, జగదీశ్వరుడు నీకు పతి అగుగాక! కళ్యాణీ! ఆయన నిన్ను వినా వేరెవరినీ పత్నిగా గ్రహింపడు. నీవు కూడా అద్వితీయుడయిన ఆయనను తప్ప మరెవరినీ పతిగా గ్రహింపనేరవు " అని ఆశీర్వదించి, దక్షునితో కొంత తడవు ముచ్చటించి తమ యథా స్థానములకు చనిరి.

**(కాళికాపురాణ మందలి సతీజననమను ఎనిమిదవ అధ్యాయము సమాప్తము)**

# తొమ్మిదవ అధ్యాయము

**(దాక్షాయనీ దేవి వ్రత పాలనము)**

(ఈ అధ్యాయము నందు శివుని వివిధ నామములు ఈయబడినవి)

నెమ్మదిగా కాలచక్రము నడుచుచున్నది. మాసములు, ఋతువులు, ఆయనములు, సంవత్సరములు గడచి సతీదేవి

బాల్యావస్థను అతిక్రమించి యవ్వనమున పదార్పణము కావించెను. సహజముగనే అమిత సుందరి అయిన సతీదేవి యవ్వన మంకురించగనే ఆమె రూపరాశి ద్విగుణీకృతమయ్యెను. దక్ష ప్రజాపతి యవ్వనవతి అయిన తన పుత్రికను గాంచి "ఈమెను మహాదేవునికిచ్చుట ఎట్లా?" అని తర్కించుట నారంభించెను. అటు పిదప సతీదేవి మహాదేవుని పతిగా నొందుటకు తన తల్లి అయిన వీరిణి యొక్క అనుమతి పొంది తన గృహమునందున్న కైలాసవాసుని చిత్తరువు నారాధించుట నారంభించి నందావ్రతము కావించెను.

ఆశ్వయుజ మాసమున నందకమను అష్ఠమీ తిథి నందు "కవచి" కి గుడాన్నము (బెల్లము పాయసము) మరియు లవణము సమర్పించి పూజించెను. కార్తీక చతుర్దశి నాడు "కఠోరుని" వివిధ పాయసములతో అర్చించెను. మార్గశీర్ష మాసము కృష్ణాష్ఠమి నాడు నువ్వులు, యవలు, నీలమణులతో "త్రిపురాంతకుని" అనుష్ఠించెను. పుష్యమాసము కృష్ణ సప్తమి నాడు రాత్రి జాగరణ గావించి మరునాడు ఉదయము అష్ఠమీ దినము "వృషాంకు" ని కిచిడీ (బియ్యము, పెసరపప్పు మిశ్రమము) తో అర్పించెను. మాఘ పూర్ణిమ నాడు రాత్రి జాగరణ మాచరించి మరునాడు ఉదయము నదీస్నానమాచరించి, ఆ తడి వస్త్రములతో నదీ తీరముననే శివార్చన మొనర్చెను. మాఘమాసమందు ఉత్పన్నమగు ఫల పుష్పములతో "వృషభారూఢు" ని ఆ మాసమంతయు పూజించి ఆహార నియతి పాటించి మానసిక శివారాధన కావించెను. ఫాల్గుణ మాసమందలి కృష్ణ చతుర్దశి నాడు సతీదేవి జాగరణ మొనర్చి బిల్వ పత్రముల ద్వారా "భస్మ ధూళిత విగ్రహుని" అర్చించెను. చైత్ర శుక్ల చతుర్దశి నాడు దివా రాత్రములు పలాశ పుష్పములతో "సామప్రియు" ని అర్చించి తదుపరి శివనామోచ్చారణతో మిగిలిన సమయము గడపెను. వైశాఖ శుక్ల తృతీయనాడు యవలు మరియు నానబెట్టిన బియ్యము తో "సర్వమయు" ని అనుష్ఠించి తదుపరి వైశాఖ మాసమంతయు సంపూర్ణముగ ఘృతము (నేయి) భుజించుచూ అన్య భోజనము నొల్లక, నిరంతరము "త్రయీమూర్తి" ని స్మరణము చేసెను. జేష్ఠ పూర్ణిమ నాటి రాత్రి సతీదేవి "అనీశ్వరు" ని వస్త్రములు, మరియు బృహతీ పుష్పములు ("పెద్ద మునగ లేక తెల్ల మునగ) తో పూజించి ఆ రాత్రి ఉపవాసముండెను. ఆషాఢ శుక్ల చతుర్దశి నాడు సతీదేవి "సర్వజ్ఞుని" తిరిగి బృహతీ పుష్పములతో పూజించినది. శ్రావణ మాసపు శుక్ల అష్ఠమి, మరియు శుక్ల చతుర్దశి నాడు "పరమాత్ముని" కి వస్త్రము, యజ్ఞోపవీతము, కుశలు సమర్పించి అర్చించెను. భాద్రపద కృష్ణ త్రయోదశి నాడు "సోమసూర్యాగ్నిలోచనుని" సతీదేవి వివిధ పుష్పములతో పూజించి మరునాడు ఉదయము ఉదక పారణ కావించెను.

సతీదేవి ఈ నందావ్రత మారంభించిన సమయమున సావిత్రీ సహితుడై బ్రహ్మ, లక్ష్మీ నారాయణులు, శివుడు తన గణములతో పరివేష్ఠితుడై యున్న హిమాలయమున కేతెంచిరి. తమ పత్నీ సహితులై ఏతెంచిన సుర ప్రముఖులను చూచి శివుడు సాదరముగ వారిని ఆహ్వానించి, అర్ఘ్య పాద్యముల నిచ్చి, కుశల మాకళించి పిదప వారొచ్చిన కారణమరసెను. మహాదేవుడు సృష్ఠి, స్థితి కారకులిరువురు సంపూర్ణముగ పత్నీ ప్రేమ యందు బద్ధులగుట కాంచి, తనకు సహితము పాణిగ్రహణాభిలాష కలిగి, తిరిగి వారి రాకకు కారణమడిగెను. అంత విష్ణువు చే ప్రేరితుడై చతుర్ముఖ బ్రహ్మ ఈ విధముగ పలికెను.

"త్రిలోచనా! మేమొచ్చిన కార్యము నివేదించెదము. "వృషభధ్వజా"! అయ్యది దేవగణములు, మీదుమిక్కిలి సృష్ఠి రక్షణార్ధము మేమేతించితిమి. ఓ! "యజ్ఞమయా"! ప్రతీ యుగము నందు నేను సృష్ఠి, విష్ణుదేవుడు పోషణ, మీరు సంహారము కావించుచున్నారు. మీ ఇరువురి సహాయము చే నేను, మన ఇరువురి సహాయముచే విష్ణువు, మరియు మా ఇరువురి సహాయము చే మీరు, మన కార్యములు సాధించుచుంటిమి. అందువలన మన పరస్పర సహకారము లేక ఈ సృష్ఠి నడువదు. అసురులు కొంతమంది మనచేత, మరి కొంత మంది మన పుత్రులచే వధింపబడుదురు. కానీ పంచవక్త్రా! సదాశివా! నీవు సర్వదా యోగరతుడవై, రాగద్వేష రహితుడవై, దయాపూర్ణుడవై యుంటివి. అందువలన అసురవధకు

ఆస్కారము లేదు. వారు వధింపబడని చో పరంపతాగతముగ ఆవిర్భవించు సృష్టి, స్థితి, లయలు జరుగక సృష్టి చక్రము ఆగిపోవును. అది జరిగిన ఎడల మాయ ద్వారా మనకు శరీరధారణ సహితము అనావశ్యకము. మనము ముష్వరము ఒక స్వరూపమే! అది సనాతన తత్వము. కానీ కార్య భేదము చే రూప భేదము ఏర్పడినది. మరి కార్యము సిద్ధింపనపుడు ప్రయోజనమేమున్నది? మహామాయ సహితము కార్య భేదము చే విభిన్న రూపములు స్వీకరించి లక్ష్మీ, సరస్వతీ, సావిత్రీ, సంధ్యలుగ రూపాంతరము చెందినది."

"మహేశ్వరా! స్త్రీ యొక్క ప్రవర్తన యే అనురాగమునకు మూలము. స్త్రీ పరిగ్రహణానంతరము కామక్రోధములుద్భవించును. వాని చే రాగద్వేషములు అంకురించి ప్రాణి గణములు ప్రయత్న పూర్వకముగ వైరాగ్యమును విడచెదరు. అనురాగ రూప వృక్షమునకు మహత్ఫలము సంగము (Attachment). సంగము చే కామము, దానిచే క్రోధము ప్రాప్తించును. వైరాగ్యము, నివృత్తి శోకము చే కూడా సంభవించును. సాధారణగా వైరాగ్యము ఈ విధముగనే సంభవించును. సంసార విముఖులైన ప్రాణులు ఎన్నడు సంగము నందు పడరు."

శశిశేఖరా! ఈ వైరాగ్యము చే దయ, శాంతి కలిగి, జీవులు అహింస, క్షమ పాటించి, జ్ఞానమార్గానుసరణ కావింతురు. విశ్వేశ్వరా! మీరు తపోనిష్ఠులు, దయార్ద్రులు, సంగహీనులు, అహింస, శాంతి మార్గము ననుసరించు వారు. అపుడు అసుర వధ ఎట్లు సాధ్యపడును? పత్నీ పరిగ్రహణము చేయని ఎడల ఏఏ దోషములు సంభవించునో అవన్నియు మీకు తెలిపితిని. అందువలన సర్వ జగత్ హితార్థము మీరు కూడా ఒక సర్వ శుభలక్షణ సంపన్న నారీ రత్నమును వివాహము చేసుకొన వలెను. నారాయణునకు లక్ష్మీ; నాకు సావిత్రి ఎట్లు యుండిరో అట్లే మీకునూ ఒక సహచరి ఆవశ్యకము. బ్రహ్మదేవుని ప్రసంగము వినిన అనంతరము "గణనాధుడు" చిరునవ్వు చిందించి, విష్ణుదేవుని కడకేగి ఇట్లనియె " బ్రహ్మదేవా! మీ పలుకులు మిక్కిలి ఉచితములు. కానీ సంపూర్ణ బ్రహ్మ చింతనయే నా ధ్యేయము. ఈ బ్రహ్మ చింతనమునకు విఘాతము కలుగును కావున, జగత్ హితార్థ కార్యములందు నా మనసు నొల్లుట లేదు. అయితే ఈ జగత్‌హితార్థ కార్యము నేనెట్లు నొనర్తునో తెలిపెదను. వినుడు. ఏ స్త్రీ తన సర్వేంద్రియముల యందు నా తేజస్సును గ్రహింపగలదో, అటువంటి యోగిని అయిన వనితను నేను పాణిగ్రహణము చేయుదును. ఎవరు నేను యోగాశక్తుడనైనపుడు, తాను సహితము యోగమునవలంబించునో, నేను కామాసక్తుడనైనపుడు, తన దివ్య సౌందర్యముతో నన్ను అలరించునో, అటువంటి వరవర్ణిని లభించిన ఎడల వివాహమాడెదను. వేదవిదులు, పండితాగ్రగణ్యులు, ఎవరిని అక్షయము, అవినాశి, అని తెలిపెదరో, నేను ఆ సనాతన పరంజ్యోతిని సంతతము చింతించుచుందును. ఆ చింతన చే ఎల్లప్పుడూ గాధ సమాధి స్థితిగతుడనై యుందును. ఏ రమణి ఈ నా ధ్యానభంగము కావించదో, అట్టి స్త్రీని అవశ్యము చేపట్టెదను. పరమేష్ఠీ! మనము ముష్వరము పరబ్రహ్మ యొక్క అంశలము. ఆ పరబ్రహ్మ ను ధ్యానించుట మన కర్తవ్యము. నేను ఆ ధ్యానము నుండి విరహము క్షణకాలము సహితము భరింపనోపను. అందువలన నా కర్మల కనుగుణముగ అనుసరించు ఆ రమణీలలామను మీరు చూపిన ఎడల నేను అవశ్యము వివాహము చేసుకొందును."

బ్రహ్మదేవుడు "మహాదేవా! మీరు అడిగిన, మీకు కావలసిన గుణగణములన్నియు పుష్కలముగ యున్న స్త్రీ రత్నము యున్నది. పరమ బుద్ధిశాలినీ, శుభానన, దక్షకన్యక. ఆమె నామధేయము "సతి". ఆమె మిమ్ములను ప్రాప్తించుటకు, మీ ప్రసన్నత కొరకై తపమాచరించుచున్నది. స్వామీ! మీరు సర్వజ్ఞులు మరియు సర్వాంతర్యామి." అంత మధసూదనుడు శివునితో "మహాదేవా! బ్రహ్మదేవుని వాక్యములు ఉచితములు. మీరు వానిని పాటింపవలసినది." శివుడు వారితో "అట్లే చేయుదును" అని వాగ్దానము చేసెను.

శివుని వచనములు వినిన మదనుడు, రతీదేవి, మరియు వారి అనుచర వర్గము మిక్కిలి హర్షాతిరేకము నొందిరి. తదనంతరము మదనుడు శివుడు యున్న ప్రదేశము నకు ఏగి, వసంతుని ఆతని కార్యమునందు నియోగించి, ప్రచ్ఛన్న

రూపమున అచట నివసింపదొడంగెను.

**(దాక్షాయణీ వ్రతపాలనము; శివుడు పత్నీ గ్రహణమునకు ఒప్పుకొనుట అను తొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# పదియవ అధ్యాయము

**(సతీ యాచన; దాక్షాయణి కి శివుడు వరమొసగుట)**

ఈ రీతిగ సురప్రముఖుల సమాలోచన పూర్తియగు సరికి సతీదేవి మొదలిడిన నందా వ్రతము ఒక సంవత్సరము పూర్తియగు సమయమాసన్నమయినది. మరుసటి సంవత్సరపు ఆశ్వయుజ శుక్ల అష్టమి తిథి నాడు సతీదేవి నందా వ్రతమునకు ఉద్యాపన పలికినది. ఆ మరుసటి దినము అనగా నవమి నాడు త్రిపురాంతకుడు, త్రిశూలధారి, బాల చంద్రమౌళి, యోగీశ్వరేశ్వరుడు, మహాదేవుడు, పండ్ల భారము చే వంగిన ఆమ్ర వృక్షము వలె అత్యంత భక్తి భావముతో వినీతురాలైన సతీదేవికి దర్శనమిచ్చెను. మహాదేవుని గాంచి సతీదేవి అమందానంద కందళిత హృదయారవిందయై, స్త్రీ సహజమయిన సిగ్గు క్రమ్ముకొనగా, అవనిత వదనయై, నీలలోహితుని పదయుగళికి ప్రణమిల్లెను. నందావ్రతము చే సంతసిల్లిన గిరీశుడు సతీదేవిని తన పత్నిని చేసుకుందుకు పూర్ణముగ నిశ్చయించుటకొని ఈ విధముగ పలికెను "ఓ! దక్షపుత్రీ!! నీ వ్రత దీక్ష చే నేను అత్యంత ప్రసన్నుడనైతిని. నీ మనోవాంఛను నాకు తెలియపరుచవలసినది. తప్పక నీకది ప్రసాదించెదను." దుర్దర్శునికి సతీదేవి అభిప్రాయము తెలిసినప్పటికీ, ఆమె అభిప్రాయము ఆమె నోటి వెంట వినుటకు ఉత్సుకుడై "వరమడుగుము" అని తిరిగి పలికెను. కానీ స్త్రీ సహజమయిన సిగ్గు చే ఆమె నోట మాట రాకుండెను.

ఆ సమయమున పొంచియున్న కామదేవుడు గిరీశుని ముఖ కవళికలను, కనులను, అవలోకించి ఆయనకు పత్నీ పరిగ్రహణాభిలాష కలిగెనని తెలిసి, తన ధనువు సారించి హర్షణ బాణము చే అనఘుని హృదయము భేదించెను. ఆ మధుర ఘాతము చే భుజంగ భూషణుడు బ్రహ్మ చింతన మరచి చూపులతో సతీదేవి యొక్క ముఖారవిందామృతమును గ్రోలుట నారంభించెను. తదుపరి మదనుడు మోహన బాణము సంధించి విడచెను. అత్యంత హర్షయుతుడయిన భర్గుడు సంపూర్ణముగ మోహితుడయ్యెను. ఆ సమయమున గిరిధన్వి మనోభవుని బాణముల చేతనే కాక మహామాయ యొక్క అనంఘుల్లీయమయిన దుర్జయ మాయ చే కూడా మోహితుడయ్యెను. అంత అవనిత శిరస్క అయిన సతి "ప్రభూ! నాకు వాంఛిత వరమీయవలసినది" అని పలికెను. ఆమె పలుకులు సంపూర్ణమవకుండగనే కృత్తివాసుడు "నీవు నా పత్నివగుదువు" అని శెలవిచ్చెను. తన అభీష్ఠ ఫలసిద్ధి కలుగగనే సతీదేవి మిక్కిలి సంతుష్టాంగ తరంగయై, మౌనము నాశ్రయించి, మనసున కలిగిన కామభావనా ప్రకంపనల చే పురారాతుని ఎదుట తన శృంగార హావభావ ప్రకటనము కావించెను. పెల్లుబికిన శృంగార రసము జగత్ మాతా పితరుల హృదయములను సంపూర్ణముగ ముంచివైచెను. నిష్కళంక స్పటికము వలె విరాజిల్లు ప్రమథాధిపుని చెంత దళితాంజనము (అతి నల్లని కాటుక) వలె ప్రకాశించు సతీదేవి అత్యంత శోభాయమానముగ యుండిరి.

అంత కామమోహితుడయిన పరమేశ్వరుడు "సతీ! నీవు నా పత్నివి కమ్ము" అని ఉల్లేఖించగా, సతీదేవి "జగదీశ్వరా! మీరు నా తండ్రి అనుమతి తో నన్ను వివాహము చేసికొనవలసినది" అని లోకమర్యాదను పాటించెను. రతీ, వసంతుల సహితుడై ఈ దృశ్యమును కాంచిన మన్మధుడు తాను యత్నశీలుడను, కృతార్ధుడనైతినని సంతసిల్లి తనను తాను అభినందించుకొనెను. తదుపరి మృత్యుంజయుని మోహ పరవశుని గావించిన సతీదేవి తాను సహితము హర్ష, మోహ,

పరితృప్త అయి తన తల్లివద్దకు చనెను. వ్యోమకేశుడు సతీ విరహ దు:ఖము చే తప్తుడై, హిమాలయమునున్న తన ఆశ్రమమునకు భారముగ, నెమ్మదిగ వెడలెను.

భవుడు అంతకుమున్ను విరించి యొక్క పత్నీ పరిగ్రహణము గూర్చి తాను పలికిన పలుకులు గుర్తుకు తెచ్చుకొని, విరహ దు:ఖము చే కొంచెము భయభీతుడయ్యెను. కానీ కేవలము జగత్కళ్యాణార్ధము పద్మయోని అయిన బ్రహ్మదేవుని వాక్యములు తిరిగి తలంచి వృషధ్వజుడు పరమేష్ఠిని మనమున స్మరించెను. తక్షణము తన ఇష్టసిద్ధి చే కలిగిన ఆహ్లాదము చే బ్రహ్మదేవుడు సావిత్రీ సహితుడై త్రిశూలి కడకేతెంచెను. అంత మహాసేన జనకుడు (శివుడు) బ్రహ్మ దేవునితో ఇట్లనియె "విరించీ! ఇది వరలో మీరు నన్ను పత్నీగ్రహణము లోకహితార్ధము కావింపమని ప్రేరేపించిరి. కానీ నేడు అయ్యది స్వార్ధ కార్యమై నిలచెను. దాక్షాయణి, సతీదేవి నన్ను అత్యంత భక్తితో సేవించినది. నేను సంప్రీతుడనై అమెకు వరమొసంగితిని. దక్ష కన్యకకు సహితము నా యందు మిగుల ప్రీతి యున్నదని నా అభిప్రాయము. ఆ సమయమున మదనుడు తన బాణ పరంపర చే నన్ను విదీర్ణుని కావించెను. నేను మాయా మోహితుడనైన కారణమున మదనునికి ప్రతీకారము కావింపనైతిని. అందువలన పరమేష్ఠీ! మీరు జగత్కళ్యాణార్ధము దక్షుడు నన్ను పిలచి కన్యాదానము ఒనర్చునట్లు ఎట్టైన సమకూర్చవలసినది. మీరిరువురు నా తరపున దక్ష గృహమున కేగి ఈ కార్యము సఫలీకృతమొనర్చి నాకు సతీ విరహమును దూరము కావింప ప్రార్ధన." బ్రహ్మదేవుడు తాను కృతకృత్యుడనైతినని తలంచి మనసు ఆనంద డోలికల యందు ఊగిసలాడుచుండగా భూతపతితో ఇట్లనియె "భగవాన్! మహాదేవా! మీ పలుకులు, తలంపు నిశ్చయముగా లోకహితార్ధమే! మన ఇరువురి యందు స్వార్ధము ఆవగింజంతయు లేదు. దక్షుడు స్వయముగ మీకు కన్యాదానము సలుపును. నేను కూడా మీ వైపు కధనమును దక్షునకెరింగింతును."

తక్షణము అక్కడ నుండి బయలుదేరి పరమేష్ఠి రధారూఢుడై దక్ష భవనమునకేగెను. అక్కడ దక్షుడు సహితము సతీదేవి చే సర్వము తెలిసికొని మనసున ఇట్లు తర్కించుచుండెను. "నేను ఏ ఉపాయముచే అష్టమూర్తికి నా కన్యను ఈయగలను? ఆ శుద్ధ విగ్రహుడు తనంత తాను వచ్చిన అది సరే! లేనిచో ఏమి చేతును? ఆయన వరమిచ్చి తిరిగి వెళ్ళిన పిదప తిరిగి ఏ రకమయిన కబురు లేదే? ఆయన నా కన్యక నిమిత్తము ఏదైన కార్యము చేయునా? పోనీ ఆయన వద్దకు ఒక దూతను పంపిన ఎడల కార్యము చక్కబడును కదా! కానీ ఒక వేళ దూతను అవహేళన చేసిన ఎడల కార్యము విఫలమగును. పోనీ నా కన్యక "శివుడు పతికావలెనని" వ్రతము చేసినది కదా! నేను కూడా ఏదేని శివ వ్రతము నాచరింప వలెనా? ఈ విధముగ మనసు నందు తర్క వితర్కములు చేయుచున్న దక్ష ప్రజాపతి వద్దకు సావిత్రీ సహితుడయిన పరమేష్ఠి, చతుర్ముఖ బ్రహ్మదేవుడేతెంచెను. వారిని చూడగనే దక్షుడు ఆనంద మనస్కుడై, మనసున యున్న ఆంధోళనను ఒక్క తడవు ప్రక్కన పెట్టి, వారికి వందనమొనర్చి, అర్ఘ్య పాద్యాదులనిచ్చి, సుఖాశీనుల గావించి, వారొచ్చిన కార్యము గూర్చి ఇట్లు ప్రశ్నించెను.

"ఓ! జగద్గురూ! మీ ఆగమునకు కారణమేమి! కేవలము పుత్రవాత్సల్యము చే ఇచటకేతెంచితిరా! లేక వేరొక ఉపలక్ష్యము తో ఉపస్థితులైరా?" అంత విరించి చిరునవ్వు చిందించుచూ ఇట్లనెను "వత్సా! నేను వచ్చిన పని పరమ జగత్కళ్యాణ హేతువు మరియు నీకు కూడ అత్యంత అభిలషితము. నీ కన్యక అయిన సతి మహాదేవుని అరాధించి వర రూపమున పతిగా బడసినది. అందువలన ఆమె గ్రహణార్ధము శాశ్వతుడు ఇచటకు ఏతెంచును. తత్ నిమిత్తము నన్ను నీ యెద్దకు పంపెను. ఇపుడు నీకు ఏది ఉచితమని తలంతువో అద్దానిని ఆచరింపవలసినది. శంకరుడు నీ కన్యకకు వరమిచ్చిన నాటి నుండి క్షణమొక యుగముగ, విరహ వేదనతో జ్వలించుచున్నాడు. మదనుడు సహితము తన పుష్ప శరపరంపర చే త్రినేత్రుని హృదయమును గాయపరచెను. పాశవిమోచనుడు కామబాణ గాయముల చే ఆత్మచింతన మరచి తనకు తాను పాశబద్ధుడయ్యెను. ప్రస్తుతము ఆయన సామాన్య మానవుని వలె వ్యాకులుడైయున్నాడు. ఆయన

తన ప్రమథులతో సంభాషించుచు, వాక్యమధ్యమున మతిమరుపు కలిగి పార్షదులతో "సతి ఎక్కడ?" అని ప్రశ్నించుచుండెను. పూర్వము నేను, నీవు, మదనుడు, మరీచాది మహర్షులు ఏది వాంఛించితిమో అయ్యది సిద్ధి ప్రాప్తి నొందు సమయమాసన్నమయినది. నీ కన్యక ఎంత భక్తి ప్రపత్తులతో శివుని గూర్చి వ్రతమాచరించినదో, అంతే గాఢముగ శివుడు నీ కన్యకను వాంఛించుచున్నాడు. ఇక కార్య విలంబన చేయక శివునకు నీ కన్యకను కన్యాదానము చేయుము. శివుని ధనమును శివునకు ప్రదానము కావించిన ఎడల నీవునూ, నీ కులమును ధన్యమగును. నేను నారద సహితుడనై మహాదేవుని మీ ఇంటికి తీసికొని వచ్చెదను. నీవు కన్యాదానమునకు సర్వాయత్తము కావింపుము. దక్షుడు "మీ ఆజ్ఞ మాకు శిరోధార్యము. అట్లే అగుగాక!" అని పలికెను. అంత సావిత్రి సహితుడై బ్రహ్మ అంతర్హితుడయ్యెను. వారు వెడలిన పిదప దక్షుడు, ఆయన పత్నీ మరియు దక్షతనయ అమృతానందము నందు గ్రుంకులిడిరి.

సావిత్రీ సహితుడయిన బ్రహ్మదేవుడు సరాసరి హిమాలయమునందున్న పశుపతి వద్ద కేతెంచెను. కామపీడితుడయిన కపర్ది మనసున అనేక ఆంధోళన, సంశయాత్ముడై పరమేష్ఠిని ఇట్లు ప్రశ్నించెను. "సురప్రముఖా! సతీ సంబంధమున నా విషయమై మీ సుపుత్రుడు ఏమి పలికెను? విరహము సంసారమునందలి సర్వ ప్రాణులను వదలి ఊకుమ్మడిగా నాపై దండెత్తినది, అని అనిపించుచున్నది. అందువలన ఆ విషయములన్నియు శీఘ్రమే నాకు తెలియపరుచవలసినది. అంత బ్రహ్మ "వృషధ్వజా! నా పుత్రుని పలుకులు వినిపించెదను. మీకు అభీష్టసిద్ధి కలిగినది. నా పుత్రుడు "మా కన్య సతి కేవలము మహాదేవుని కొరకై జన్మించినది. ఆమెను ఆయనకే ఇవ్వదగును. ఈ కార్యము నాకు సంపూర్ణముగ ఇష్టదాయకము. అందువలన ఓ! విధాతా!! శంభుని ఒక శుభ ముహూర్తము, మరియు శుభలగ్నమున ఇచటకు తీసికొని రావలసినది. నేను నా కన్యను బిక్షారూపముగ ఆయనకు ప్రసాదించెదను.

దక్షుడు ఈ పలుకులను అత్యంత ప్రీతితో పలికెను. అందువలన ఒక శుభ లగ్నమందు మీరు దక్ష గృహమును కేగవలసినది". అంత గిరీశుడు "విధాతా! మీరు నారదుని, మరీచాది ఋషి గణములను స్మరించి మనవద్దకు పిలువవలసినది. నేను మీ అందరి సహితుడనై దక్ష గృహమునకేగుదును." అంత విరించి వారిని స్మరించిన తక్షణమే వారందరూ ఏతెంచిరి. వారు అవ్యయునిపై కామదేవుని ప్రభావమును కాంచి కొంత తడవు చింతాక్రాంతులైరి.

**(శ్రీ కాళికా పురాణమందలి సతీదేవికి శివుడు వరమిచ్చుట అను పదియవ అధ్యాయము సమాప్తము)**

# పదకొండవ అధ్యాయము

**(శివ వివాహము మరియు త్రిమూర్తుల ఏకత్వ ప్రతిపాదన)**

మగ పెళ్ళి వారందరూ హిమాలయమున కేతెంచి వివాహ ముహూర్తమునకు ముందు వారందరూ దక్ష గృహమునకు ఆనందముగ, వైభోగపేతముగ బయలుదేరిరి. ప్రమథ గణములన్నియ శంఖము, పటహ, డిండిమ, తూర్యము, మురళి మొదలగు వాద్యములు మ్రోగించుచూ శంకరుని అనుగమించిరి. కొంతమంది ప్రమథులు తప్పట్లుతోనూ, మరికొందరు పాదఘట్టనతోనూ, శబ్దము కావించుచూ వృషధ్వజుని వెనుక విమానము నందు అనుసరించిరి. వీరందరి వాయద్యములతో అద్భుత కోలాహలము నెలకొన్నది. వారి వెనుక దేవతలు, అప్సరసలు, గంధర్వులు, నృత్య, గీత, వాద్యములతో అలరించుచు కదిలిరి. ఈ ప్రమథుల మరియు గంధర్వుల వాద్యముల వేడుకతో భూనభోంతరాళములు నిండినవి. కందర్పుడు సహితము తన నిజరూపముతో ఆయన వెంట తన పరివారము మరియు గణములతో అనుసరించెను. మహేశ్వరుని వివాహమును పురస్కరించుకొని బ్రహ్మాది సమస్త దేవతలు తలకొక వాయిద్యమును ధరించి మనోహరముగ

సంగీతోత్పత్తి కావించిరి. ప్రకృతి సర్వము పులకించినది. దిశలు ప్రసన్నమయినవి. త్రేతాగ్నులు ప్రశాంతముగ ప్రజ్వలించినవి. సుగంధ భరిత మలయ మారుతము నెమ్మదిగ వీవ నారంభించెను. వృక్షములు కుసుమములతో వికసించినవి. అస్వస్థతతో యున్న ప్రాణులు స్వస్థతనొందినవి. హంస, కారండవ, సారస, మయూర, చాతకము మొదలయిన పక్షిగణములు సుమధుర శబ్దముతో కుహుకుహు గానములాలపించుచున్నవి. మహాదేవుడు కేవలము సర్పములు, వ్యాఘ్రచర్మము, జటాజూటము, బాల చంద్రరేఖను ధరించి అతిశయ శోభాయమానముగ ప్రకాశించెను. అంత పరమ శివుడు అత్యంత శీఘ్రగామి అయిన నందీశ్వరుని అధిరోహించి పరివార సహితముగ క్షణములో దక్ష గృహమున కేతెంచెను.

మహాతేజస్వి అయిన దక్షుడు తన గృహమున కేతెంచుచున్న మగ పెళ్ళివారిని చూచి, లేచి, సాదరముగ ఆహ్వానించి, యధాయుక్త పూజలాచరించి, తనతోటి బ్రహ్మ మానస పుత్రులయిన మహర్షుతో ఇష్టాగోష్ఠి జరిపి అటు పిదప శుభ ముహూర్త, శుభలగ్న సమయమున, అత్యంత సంతోషముతో తమ అనుంగు పుత్రికను పరమశివునికర్పించెను. ఆ సమయమున వృషధ్వజుడు మహదానందముగ వైదిక విధులననుసరించి, దాక్షాయణిని వివాహమాడెను. చతుర్ముఖ బ్రహ్మ మరియు నారదాది మునీశ్వరులు ఋగ్, యజుస్, సామవేద మంత్రములను సుశ్రావ్యముగ పాడి మహేశ్వరునికి సంతుష్టిని కలిగించిరి. ప్రమధులు కొందరు వాద్యములు వాయించగా మరికొందరు గానమునాలపించిరి. మేఘములు ఆకాశము నందు ప్రతిష్ఠితమై పుష్పవృష్టి కురిపించినవి. పిదప గరుడధ్వజుడయిన విష్ణుదేవుడు మహేశుని చేరి ఇట్లనియె "సదాశివా! నేను నీలిమేఘ ఛాయా శరీరుని అయినప్పటికీ, ఈ కమలా దేవిని కూడి మిక్కిలి శోభాయమానముగ యున్నాను. అట్లే మీరు ఈ స్నిగ్ధనీలాంజన అయిన శ్యామలాదేవిని కూడి మిక్కిలి శోభాయుతులైయున్నారు. మీరు ఈ దాక్షాయిణి సహాయముతో దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, ధర్మ పరిరక్షణ కావించి సంసారులకు మంగళములనీయ వలసినది. ఎవరేని వ్యక్తి ఈ దక్ష కన్యక యొక్క రూప లావణ్యములను చూచి లేక విని ఈమెను పొందవలెనని అభిలషించిన ఎడల వానిని వెంఠనే వధింపవలెను. ఈ విషయము నందు తర్క వితర్కములనవసరము. సర్వజ్ఞుడయిన మహాదేవుడు "తథాస్తు" అని దీవించెను.

ఇంతలో ఒక విచిత్రము జరిగెను. వివాహము చేయించుచున్న బ్రహ్మదేవుడు సతీదేవిని చూచి, ఆమె సౌందర్యాతిశయమునకు ముగ్ధుడై, ఆశ్చర్య చకితుడై, నిగ్రహము కోల్పోయి, కామ వికారము మనసునందు నిండ సమస్త మునిగణ సమక్షమున ఆయనకు వీర్య స్కలనమయ్యెను. తక్షణమే ఆ వీర్యము నుండి సంవర్తము, ఆవర్తము, పుష్కరము, ద్రోణము అను నాలుగు ప్రళయకాల మేఘరాశులు ఉత్పన్నమై ఆకాశమునిండి ఘోర గర్జనము కావించుట నారంభించెను. ఆ సమయమున మహాదేవుడు సహితము సతీదేవిని కాంచి మోహపరవశుడయ్యెను, కానీ నారాయణుని పలుకులు జ్ఞప్తి చేసికొని, త్రిశూలము నెత్తి బ్రహ్మను వధించుటకు ఆయత్తుడయ్యెను. అంత ద్విజశ్రేష్ఠులు, నారదుడు, మరీచాది మునులు, హాహాకారములు గావించిరి. దక్షుడు సహితము సంశయచత్తుడై ముందుకురికి "చంపవలదు", "చంపవలదు" అని శంకరుని వారించెను. అంత కపర్ది దక్షుని గాంచి "ఓ! విప్రశిఖామణీ! దక్ష ప్రజాపతీ! నారాయణుడు తొలుత ప్రతిపాదించిన నియంత్రణను నేను స్వీకరించితిని. నారాయణుడు స్వయముగ "అన్యులు ఎవరు ఈ దక్ష కన్యకను కామభావనతో వాంఛించెదరో వారికి మృత్యుదండన ప్రసాదించవలసినది" అని నుడివెను. బ్రహ్మ ఈమెను సకామ భావన తో వీక్షించుట వలన ఆయనకు వీర్య స్కలనము అయినది. అందువలన బ్రహ్మ వధ అవశ్యకము."

శంకరుడు ఈ విధముగ పలుకుచుండగా జగత్ప్రభువు విష్ణుదేవుడచటికి ఏతెంచి, బ్రహ్మ వధను నిషేధించి, మహాదేవునితో ఇట్లనియె "ఓ! భూతనాధా! జగత్స్రష్ఠ, జగత్పూజ్యుడు అయిన బ్రహ్మదేవుని వధింపవలదు. ఈయనే నీకు సతీదేవిని భార్యగా చేసెను. మహానుభావా! శుద్ధ విగ్రహా! ఈ చతురాననుడు కేవలము జగత్తు యొక్క సృష్టి కోసమే ప్రాదుర్భూతుడయినాడు. ఈయన కాక మరి ఏ ప్రాకృత పురుషుడు ఈ కార్యము చేయ సమర్ధుడు కాడు. మన ముగ్వురి

సామరస్యము చేతనే సృష్టి, స్థితి, లయలు జరుగుచున్నవి. మన ముప్వురి లో ఒకరు లేనిచో ఎవరు ఆ కర్మమును పూడ్చగలరు? అందువలన వృషభధ్వజా! ఈ విధాతను సంహరింపవలదు." ఈశ్వరుడు "నేనే నా ప్రతిజ్ఞానుసారము చతురాననుని సంహరించెదను. తదుపరి నేను సృష్టికర్తనై, స్థావర జంగమాత్మకమయిన ఈ జగత్తును సృష్టించెదను. లేని ఎడల నా తప:శక్తి చే వేరొక బ్రహ్మను సృష్టించి ఆతని చే ఈ సృష్టి కార్యము నడిపించెదను. ఓ! ప్రభూ! విష్ణుదేవా! నన్ను నా ప్రతిజ్ఞాపాలనమునకు అనుమతించి ఈ బ్రహ్మవధను ఆపవలదు." అంత నారాయణుడు శంభుని మాటలు విని మందస్మితుడై "ఈశ్వరా! ఈ ప్రతిజ్ఞా పాలనము ఉచితము కాదు. మీరు మీ ఆత్మపై ఎట్లు ఘాతము చేసికొందురు?" అది విని ఈశ్వరుడు "స్వామీ! ఈ విధాత నా ఆత్మ ఎట్లయ్యెను? ఈయన ఎదురుగా యుండి, ప్రత్యక్షముగ నానుండి వేరుగా యుండెను కదా! అంత నారాయణుడు సుచిస్మితుడై మునుల సమక్షమున ఇట్లనియె.

"ఈ బ్రహ్మ మీ నుండి కానీ, మీరు ఈ బ్రహ్మ నుండి కానీ, వేరుకాదు. నేను సహితము మీ ఇరువురి నుండి వేరు కాదు. ఖండాఖండములు, సాకార నిరాకార, జ్యోతిర్మయి స్వరూపముగ మనము ముప్వురము ఒకటియే! రూప, క్రియా భేదము చే మనము మూడు భాగములుగ విభజింపబడి యున్నాము. మనము ముప్వురము ఎవరు? పరమాత్మ స్వరూపినైన నా నుండి వెలువడిన మూడు అంశలమే మనము. క్రియాభేదము చే మనము సృష్టి, స్థితి, లయలను ఆచరించుచున్నాము. ఒకే మానవునికి మస్తకము, గ్రీవము, ఇతర అనేక అంగములు యుండును. అట్లే మన మూడు అంశలు కూడుకొనుయున్నవి. ఈ జగన్మండలము ఆత్మపై ప్రతిష్ఠింపబడినవి. మీరు ఒక్కమారు ధ్యాననిరతులై ఆత్మ చింతన చేయవలిసినది. అపుడు మనముప్వురి అభిన్నతత్వము గోచరమగును. స్వయం ప్రకాశము, కూటస్థము, అవ్యక్తము, అనంతము, నిత్యము, ద్వంద్వరహితము అయిన ఏ పరంజ్యోతి యున్నదో అదియే ఆత్మ. అందు భిన్నత లేదు. శంకరుడు మహాజ్ఞాని. ఆయనకు ఆత్మ తత్వము సంపూర్ణముగ ఎరుకయే! కానీ మహామాయా ప్రభావమున విమోహితుడై, విస్మృతుడై త్రిమూర్తులను భిన్నముగ చూచుచూ, తిరిగి గోవిందుని పున: త్రిమూర్తుల ఏకత్వమును ప్రశ్నించెను. నారాయణుడు తిరిగి త్రిమూర్తుల అభిన్నతను పూర్ణముగ వర్ణించి, వారి ఏకత్వమును ప్రదర్శించెను. అంత మహాదేవుడు నారాయణుని ముఖ కమలము నుండి వెలివడిన జ్ఞాన సుధావాహినిని ఆలకించి, ఆకళించి, ఎఱ్ఱకలువ వర్ణము గల విరించిని, విధాతను వధించక వదిలెను.

**(శ్రీ కాళికా పురాణము నందలి శివ వివాహమను పదకొండవ అధ్యాయము సమాప్తము)**

# పన్నెండవ అధ్యాయము

**(త్రిమూర్తు అభేదతత్వ వర్ణన)**

కమఠాదిమునులు మార్కండేయుని పున: ప్రశ్నించిరి "ద్విజోత్తమా! విష్ణు దేవుడు త్రిమూర్తుల ఏకత్వమును మహాదేవునికి ఎట్లు ప్రతిపాదించెను? ఆ వృత్తాంతము సర్వము మాకు సవిస్తారముగ తెలుపవలసినది. అమిత దాహార్తులకు స్వల్ప జలముచే దాహము తీరదు కదా! ఈ సంపూర్ణ సంవాదమును వినవలెనని మాకు మిక్కిలి కుతూహలము కలుగుచున్నది. అంత మార్కండేయుడు తిరిగి ప్రసంగించుట నారంభించెను "కపర్ది ప్రశ్నించిన మీదట గోవిందుడు ఆనంద పూర్వకముగ ఇట్లనియె "సృష్ట్యాది నందు సర్వము తమోమయము. నిరాకార నిరంజనము. భువనముల చిహ్నములే లేవు. దివా రాత్రములు కానీ, పృథివి, జలము, వాయువు, అగ్ని, ఆకాశములు లేవు. ఏకమాత్రము, అతిసూక్ష్మము, ఇంద్రియాతీతము, అవ్యక్తము, శాశ్వతము, హర్షశోకాది ద్వంద్వముల రహితము. అపుడు పరబ్రహ్మ, పరమాత్మ కేవలము

జ్ఞాన రూపమున యుండెను. ఓ! భూతనాథా! ఆ సమయమున సర్వగతము, సనాతనము అయిన ప్రకృతి పురుషులు మాత్రమే యుండిరి. మహేశ్వరా! ఆ పరబ్రహ్మ యే మన ముచ్వురిగా విభజింపబడెను. ఆ జగదీశ్వరుని వేరొక రూపమే కాలము. ఈ కాలమే సర్వ ప్రాణుల వినాశనమునకు హేతువు.

ప్రాచీనకాలమందు ఈ పరబ్రహ్మయే సృష్టిని చేయుటకు స్వయం ప్రకాశుడై ప్రకృతిని సంక్షుబ్ధము గావించెను. ఆ సంక్షుబ్ధమయిన ప్రకృతి నుండి మహత్తత్వము, ఉత్పన్నమయ్యెను. తదుపరి ఆ మహత్తత్వము నుండి మూడు రకముల అహంకారము ఉదయించెను. ఈ అహంకారము నుండి పంచభూతములు ఈ విధముగ ఉత్పన్నమయ్యెను. మొదట శబ్ద తన్మాత్ర నుండి నిరాకారమయిన అనంతాకాశమును విష్ణుదేవుడు ఉద్భవింపజేసెను. అనంతరము రసతన్మాత్రనుండి శివుడు నిరాధారమయిన జలతత్వమును సృష్టించెను. తాను నిరాధారుడయినప్పటికీ ఈ ఆపసీ (నీరు) తత్వమును తనమాయచే ధరించెను. అంత పరమేశ్వరుడు, పరబ్రహ్మ, సత్వ, రజస్, తమస్సులను మూడు అహంకారముల చే స్థిరప్రకృతిని మథించెను. ఆ మధనము చే అంతకు ముందు జనించిన జలముల యందు చేతనా రూపమయిన జగద్బీజము ఉత్పన్నమయ్యెను. ఈ బీజము క్రమముగా పెద్దదై సువర్ణాండముగ మారినది. దీనినే "బ్రహ్మాండ" మందురు. ఈ బ్రహ్మాండము యొక్క నలుప్రక్కలా జలము, అగ్ని, వాయువు, ఆకాశము లోపల, వెలుపల సంపూర్ణముగ మొహరించెను. సముద్రములు, నదులు మొదలగు జల స్థావరములకు వలయు నీరు బ్రహ్మాండ గర్భము నందుండి మిగిలిన నీరు బయటకు వదలబడెను.

అనంతరము పరబ్రహ్మమయిన విష్ణువు, చతుర్ముఖ బ్రహ్మ రూపము ధరించి ఒక దివ్య వర్షము (మూడు వందల అరువది మానవ వర్షములు) ఆ అండ గర్భమున యుండి అద్దానిని ఛిద్రము చేసెను. పర్యవసానముగ మేరు పర్వతముత్పన్న మయ్యెను. ఈ అండము యొక్క వెలుపలి ఆవరణము నుండి పర్వతములు, మరియు జలము నుండి సముద్రములు వెలువడెను. ఈ అండ మధ్య భాగమున గంధ తన్మాత్ర చే భూమి ఉత్పన్నమయ్యెను. ఈశ్వరుడు ఈ భూమిని త్రిగుణాత్మకమయిన ప్రకృతితో లయించెను. ధరిత్రి పర్వతములతో పుట్టినది, కానీ ఈ బ్రహ్మాండము యొక్క అధోభాగము/ అధోఖండము యొక్క సంయోగము చే అయ్యది మరింత దృఢపడినది. ఈ సువర్ణ బ్రహ్మాండమును లోపల, వెలుపల పరబ్రహ్మ ధరించెను. కానీ ఆయన అవ్యక్త రూపుడగుటచే ఈ బ్రహ్మాండ మధ్యము నుండి రూప తన్మాత్ర చే తేజము (అగ్ని) ఆవిర్భవించెను. అనంతరము ప్రకృతి యొక్క నియోగము చే స్పర్శ తన్మాత్ర నుండి సర్వ ప్రాణుల ప్రాణ భూతమయిన వాయువు వెలువడి అంతటా వ్యాపించెను. ఆకాశము, వాయువు, అగ్ని, జలము ఆ బ్రహ్మాండము యొక్క లోపల, వెలుపల వ్యాపించెను. సమస్త వస్తు ప్రపంచము పంచభూతముల చే నిండి, అవి లేని ప్రదేశము లేదయ్యెను.

తదుపరి పరబ్రహ్మ త్రిగుణాత్మకమయిన తన శరీరమును మూడు భాగములు చేసెను. తన పై భాగము చతుర్భుజములు, చతర్ముఖములు, కమల కేసరము వంటి ఎర్రని శరీరముగల చతుర్ముఖ బ్రహ్మగా మారెను. మధ్య భాగము చతుర్భుజములు, ఏకముఖము, చతుర్బాహువుల యందు శంఖ, చక్ర, గదా, పద్మములు ధరించిన విష్ణువు గా మారెను. క్రింది భాగము అయిదు ముఖములు, నాలుగు చేతులు, స్ఫటికము వంటి శరీరము గల రుద్రుని గ రూపాంతరము చెందెను. తన సృష్టి శక్తిని పరబ్రహ్మము చతుర్ముఖుని దేహము నందుంచి, ఆయనను సృష్టికర్తను గావించెను. తదుపరి పరబ్రహ్మము తన మాయాశక్తిని, మరియు జ్ఞానశక్తిని విష్ణ శరీరము నందు చొప్పించి విష్ణువును స్థితికారుని చేసెను. ఈ విధముగ పరబ్రహ్మ విష్ణువు యందు సర్వ శక్తులను నియోగించెను. అనంతరము శంభుని యందు ప్రళయశక్తిని నియోగించి ఆయనను లయకారకుని గావించెను. యదార్ధమునకు జ్ఞాన స్వరూపుడు, అనాది, పరంజ్యోతి అగు పరబ్రహ్మమే ఈ మూడు రూపములు తీసికొని తన శక్తి చే ఈ సృష్టి చక్రమును నడిపించుచున్నది. కానీ త్రిమూర్తులు తమ కార్య

భేదము ననుసరించి బ్రహ్మ, విష్ణువు, శివుడు అను మూడు రూపములతో కనిపించుచున్నారు.

అమిత తేజ: స్వరూపుడయిన విష్ణు భగవానుని ముఖతా ఈ విశ్లేషణ వినిన శివుడు శాంతించి, ప్రసన్నముఖుడై జనార్ధనునితో ఇట్లనియె "గోవిందా! నిర్వికార, నిరంజన జ్యోతి స్వరూపుడయిన పరమాత్ముడు ఒక్కడే అయినప్పుడు మాయ మరియు కాలము ఎవరు? ప్రకృతి అని ఎవరిని పిలువవలెను? పురుషుడు ఎవరు? పైన తెలిపినవన్నియు పురుషునకు అభిన్నములా? ఈ విషయములన్నియు విశిదముగ విపులీకరించి నాకు పరమాత్మ జ్ఞానమును కలుగజేయ వలసినది."

అంత నారాయణుడు "స్వామీ! మీరు ఇంతకు ముందు ఎల్లప్పుడూ ధ్యానమగ్నులై, మీ లోనే మీరు ఆత్మ స్వరూపి, జ్యోతిరూపి, అవినాశి అయిన పరబ్రహ్మను చూచుచుండెడివారు. విభో! మాయ, ప్రకృతి, కాలము, పురుషుడు మీరే అయి యున్నారు. ఈ విషయమును దయచేసి ధ్యానము ద్వారా తిరిగి తెలిసికొన వలసినది. ప్రమథేశ్వరా! మీరు ఏ ప్రకృతి, మాయ మొదలయిన వాటిని గూర్చి ప్రశ్నించుచున్నారో అయ్యది కేవలము నా మాయా స్వరూపము. దాని వలననే మీరు ఆత్మ స్వరూపమును మరచి  స్త్రీ ప్రేమ పరవశులై క్రోధవిష్టులైరి." అంత శివుడు విష్ణువు యొక్క సందేశమును విని మునులు, సర్వప్రాణులు చూచుచుండగనే బద్ధ పర్యంకాసనమును ఆశ్రయించి, నిమీలిత నేత్రుడై, ధ్యానమగ్నుడయ్యెను. పరమాత్మ స్వరూప ధ్యానము చే శివుని శరీరము అత్యంత తేజోవంతమై, మునిజనులకు సహితము చూడ నశక్యమయ్యెను. అదే సమయమున తన ఉజ్వల తప: ప్రభావము చే పరమశివుడు విష్ణుమాయా విముక్తుడయ్యెను. ఆ సమయమున మహేశ్వరుడు మధ్యందిన మార్తాండుని వలె తేజరిల్లుచూ, తన ప్రమథ గణములకు సహితము తేరిపారజూడ నశక్యుడయ్యెను. అంత అతిగాఢ తపస్సు నందు మునిగిన ఈశ్వరుని శరీరము నందు విష్ణువు జ్యోతి స్వరూపుడై విలీనుడయ్యెను. అంత అవినాశి అయిన విష్ణుదేవుడు పరమేశ్వరుని జఠరము నందు ప్రవేశించి ప్రాచీన కాలమందు జరిగిన సృష్టి క్రమమును శివునకు చూపించెను.

బాహ్య ప్రపంచ స్పర్శ లేక, ఆత్మ నిమగ్నుడయిన పరమేశ్వరునకు జనార్ధనుడు "స్థూల సూక్ష్మ రహితము, ఇంద్రియ జ్ఞానము చే తెలియనది అయిన ఇంద్రియాతీతము, నిత్యానందమయము, ఏక వస్తువు, శుద్ధము, తాను అదృశ్యమయియునూ సర్వమునూ, సర్వులనూ చూచునది, నిర్గుణము, సమస్త సంసార హేతువయిన పరమాత్మ తత్వమును చూపెను. ప్రకృతి కూడ పరమాత్మ రూపమే! కానీ సృష్టి లేక జగత్తు యొక్క ఉత్పత్తి కోసమై భిన్నమైనది. కానీ మహాదేవుడు ధ్యాన స్థితి యందు వారి ఏకత్వమును చూసెను. మహాగ్నియందు నిప్పు కణములు ఎట్లు సూక్ష్మముగ ఎగురు చుండునో అట్లే పరమాత్మ యందు సమస్త ప్రాణులను మహేశుడు కాంచెను. తదుపరి అనేక పర్యాయములు సృష్టి, స్థిత్యంతములు జరుగుట మరియు అద్దాని కాలరూప గణణము సహితము ఆయన విలోకించెను. చంద్రశేఖరుడు భిన్నాభిన్న రూపముల యందు ప్రకృతి, పురుష, కాలములను అనేకమార్లు సృష్టి చక్రమందు కాంచి, పరబ్రహ్మము మినహా వేరేదియునూ లేదని రూఢియెందెను. పరబ్రహ్మము ప్రకృతి రూపములో బాహ్య ప్రపంచముగ వ్యక్తమై, కాలరూపముగ గణించుచూ, పురుష రూపమున సర్వులనూ ప్రవర్తిల్ల జేయుట శివుడు వీక్షించి అనుభవ పూర్వకముగ తెలిసికొనెను. ఆ పరమాత్మ శాశ్వతుడయిననూ, భోగించుటకు (అనుభవించుటకు) ప్రాణులుగ ప్రాణుల శరీరమందు ప్రవర్తిల్లు చుండును. పరమాత్మ యొక్క మాయ లేక ప్రకృతి త్రిమూర్తులనే కాక జననమందిన ప్రతి ప్రాణినీ మోహింపజేయును. ఆ మహామాయయే త్రిమూర్తుల పత్నులయిన లక్ష్మీ, సావిత్రి, సతీదేవి. అంతేకాక మదనుని రతీదేవి మరియు దక్షుని వీరిణి కూడా ఆమెయే!! ఆమె స్వయముగా బుద్ధిరూపిణి, కానీ కార్యములాచరించినపుడు చండిక. ఇవన్నియు   శంకరుడు ధ్యానమగ్నుడై

చూచెను. ఇవియే కాక పరబ్రహ్మము నుండి మూల ప్రకృతి, మహత్తత్వము, అహంకారము, పంచభూతములు, తన్మాత్రల ఉత్పాదనము సహితము వీక్షించెను. మార్కండేయుడు "ముని సత్తములారా! మహానుభావుడయిన విష్ణువు, రుద్రునకు ఈ పరమాత్మ దర్శనము కావించి, తదుపరి తన దర్శనమును కావించెను.

**(శ్రీ కాళికా పురాణ మందలి త్రిమూర్తుల అభేదత్వ వర్ణనమను పన్నెండవ అధ్యాయము సమాప్తము)**

# పదమూడవ అధ్యాయము

**(పరమేశ్వరునకు విశ్వరూప సందర్శనము మరియు హర కోపోపశమనము)**

పురుషోత్తముడు విష్ణువు మహాదేవునికి సృష్టికి పూర్వము జరిగిన బ్రహ్మాండ ప్రాదుర్భావమును చూపెను. అతి సూక్ష్మమయిన అండము జలరాశి నందు పెరిగి పెద్దదై, బ్రహ్మాండముగ మారెను. అద్దాని మధ్యమున పరమాత్మ తొలుత జ్యోతిరూపమున ప్రకాశించుచూ పిదప సృష్టించుటకు కమలగర్భ సమాన భాసము (ఎర్రని తేజస్సు) గల జగత్పతి బ్రహ్మగా మారెను. ఆయన చతుర్ముఖుడు, చతుర్భుజుడై, జ్యోతిర్మయుడై, కమలాసనాస్థితుడై యుండెను. ఈ శరీరము నందే ఊర్ధ్వ, మధ్య, అధో భాగములందు బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపములు కాంచెను. తనయందే సంపూర్ణముగ అంతర్గతమై యున్న ఒక జగత్శరీరమునే అనేక మార్లు మూడు, మూడు భాగములుగ విభజించుట కాంచెను. శివుడు ఒక్కొక్కమారు విష్ణువు బ్రహ్మ యందు, బ్రహ్మ శివుని యందు, శివుడు విష్ణువు యందు, లేక వేరు వేరు విధములుగ త్రిమూర్తులు ఒకరి యందు వేరొకరు లీనమగుట కాంచెను. ఈ విధముగ పరమాత్మయే అందరిగ మారుట, తిరిగి విభిన్నులందరూ కలసి ఏకరూప పరమాత్మ అగుట గమనించెను. శివుడు ఆ బ్రహ్మాండ మధ్యమున జలరాశి చే చుట్టియుండి అనేక మహాపర్వత శ్రేణులు గల పృథ్విని సహితము చూచెను. తదుపరి బ్రహ్మదేవుడు స్వర్గాది లోకములు నిర్మించుటను; గరుడాసనారూఢుడయిన విష్ణు భగవానుని, అత్యంత ఆశ్చర్యముగ తనను తాను వేరుగా చూచెను. అంతేకాక దక్ష ప్రజాపతి, బ్రహ్మ మానస పుత్రులయిన మరీచాది ఋషులను, ప్రమథగణములను, వీరిణి, సతీదేవిని సహితము కాంచెను.

ఆయన గ్రహములను, సూర్య చంద్రులను, మేఘములను, పతన మగుచున్న తోకచుక్కలను, ఉల్కలను, దేవ, దానవ, యక్ష, రాక్షస, గంధర్వ, విద్యాధర, కిన్నెర, కింపురుష, మనుష్య, వివిధ ప్రాణికోట్లను, మత్స్య, కూర్మాది జంతుజాలమును, క్రిమి కీటకములను, వృక్షములు, లతలు, తృణములు మొదలయిన వెన్నింటినో చూచెను. పిదప లోకమున స్త్రీ పురుషులను మైథున క్రియయందు చూచెను. ప్రాణులు పుట్టుచూ, పెరుగుచూ, మృత్యుద్వారమున పడి చచ్చుట కాంచెను. కొందరు అలంకారయుక్తులు; కొందరు పుష్పమాల, చందనధారులు; కొందరు ఆడుచూ పాడుచూ క్రీడా తత్పరులైయుండిరి. కొందరు విలాస తత్పరులు, మరికొందరు అవమాన భరితులు. కొందరు తపోధనులైన ఋషులు. కొందరు మునులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను విశేషముగ స్తుతించుచుండిరి. మరికొందరు నదీతటముల యందు, కొండ గుహల యందు తీవ్ర తపో నిరతులై యుండిరి. కొందరు వేద పఠనము కావించుచుండిరి. ఈ రకముగ సప్తసాగర, నదీనద, సరోవర, పర్వత దేవతా సహితముగ తనను కూడా ఆ సృష్టి యందు శంకరుడు కాంచెను.

మహామాయ లక్ష్మీరూపమున శ్రీహరినీ, సతీరూపమున తననూ (శివుని) సమ్మోహనము గావించుట శంకరుడు చూచెను. అంతేకాక తాను సతీసహితుడై, మంధరాచలము, హిమాలయము, మేరు పర్వతము, కైలాసము, నందన వనములందు శృంగార రసయుక్తుడై సతీదేవితో విహారము చేయుట కాంచెను. ఇంకా విచిత్రము!!! ఏ విధముగ సతీదేవి తన దేహమును వీడి, తిరిగి హిమవత్పుత్రికగా జన్మించి, తిరిగి తనను చేపట్టుట; తాను అంధకాసుర సంహారము

గావించుట, కార్తికేయ జననము, కార్తికేయుడు తారకాసురుని సంహరించుట. ఇవన్నియు శంభుడు విస్తారముగ కాంచెను. విష్ణువు నరశింహావతారము స్వీకరించి హిరణ్యకశపుని సంహరించుట; కాలనేమి, హిరణ్యాక్ష వధ; పురాతన కాలమందు అనేక మంది దానవ వీరులు ఎట్లు శ్రీహరిచే మట్టుబెట్టబడిరో, వారి మధ్య ఏ విధముగ సమరము జరిగినదో, అవన్నియు వృషధ్వజుడు విస్తారముగ వీక్షించెను. తదుపరి బ్రహ్మదేవుని నుండి నక్షత్ర, గ్రహ, దేవ, గంధర్వ, విద్యాధరాది జగత్ప్రపంచ సర్వమునూ వేరువేరుగా చూచి, తిరిగి తాను సర్వులనూ, సర్వమునూ సంహరించుట కూడా శివుడు వీక్షించెను. అపుడు ప్రపంచము/జగత్తు, సర్వము శూన్యమయినది. బ్రహ్మ విష్ణుదేవుని యందు లీనమయ్యెను. తాను సహితము అదే శరీరము నందు లీనమయ్యెను. అప్పుడు కేవలము విష్ణువు ఒక్కడే ఉపస్థితుడై యుండెను. విష్ణువు వినా వేరొకటి లేకుండెను. తదుపరి విష్ణువు కూడా స్వయంప్రకాశము, జ్యోతిస్వరూపము, సనాతనము, పరబ్రహ్మ స్వరూపమయిన పరమాత్మ యందు లీనమయ్యెను. అపుడు నిత్యము, జ్ఞానమయము, ఆనంద స్వరూపము, కేవలము జ్ఞానము చే మాత్రమే తెలియదగిన పరబ్రహ్మము వినా వేరొకటి లేకుండెను.

మహాదేవునికి పరమాత్మ, జగత్తుల ఏకత్వము మరియు భిన్నత్వము, మరియు తన శరీరము నందే సృష్టి, స్థితి, లయలు దృష్టిగోచరమయ్యెను. అంత శంభుడు నిత్యము, శాంతము, అతీంద్రియము, స్వప్రకాశము "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అను వాక్యము సార్ధకమగు రీతిని పరబ్రహ్మమును తప్ప వేరొకరిని కానకుండెను. శివుడు పరమాత్మ నుండి త్రిమూర్తులు, జగత్తు భేదము కాదని తెలిసికొనెను. ఈ విధముగ తీవ్ర ధ్యాన నిమగ్నుడై ఏకాగ్రముగ పరమాత్మను చూచుచున్న కపర్ది శరీరము నుండి విష్ణుదేవుడు బయల్వెడలెను. మరుక్షణము మహామాయ శంభుని శరీరమున ప్రవేశించెను. శంభుడు ధ్యానము వీడి, మోహ పరవశుడై, సతీదేవికై అశ్రులు చాచుచు, అర విరిసిన పద్మము వంటి ముఖమండలము గల దాక్షాయనీ దేవిని నిరాటంకముగ దృష్టిపాతమొనర్చెను. తదుపరి బ్రహ్మ విష్ణువులను, దక్షుని, మరీచాది మునులను, సర్వులను కాంచి విస్మితుడయ్యెను. మహాదేవుని విస్మయమును గమనించిన విష్ణుదేవుడు శంకరుని చూచి "పరమేశ్వరా! త్రిమూర్తుల భిన్నత్వము మరియు ఏకత్వము గూర్చి మీరు అడిగితిరి కదా! మీకు అర్ధమయినదా? అంతేకాక ప్రకృతి, పురుషుడు, కాలము, మాయ వీటి ఆంతర్యము గూర్చి కూడా మీరు ప్రశ్నించిరి కదా! మీ అభ్యంతరము నందు మీరు సర్వము వీక్షించి తెలిసికొనిరి కదా? మీరు నిత్య ప్రశాంతుడు, అద్వితీయుడు అయిన పరబ్రహ్మ యొక్క తత్వము మరియు అనేకత్వము మీరు కాంచిరి గదా!!" అంత మహేశుడు ఈ విధముగ బదులిచ్చెను. "పరమ మంగళ స్వరూపుడు, అనంతుడు, శాంతుడు అయిన అచ్యుతుడు ఒక్కడే ఉపస్థితుడై యున్నాడు. అయన తప్ప వేరొకరు లేరు. సమస్త జగత్తు ఆయన నుండి అభిన్నము. కేవలము సృష్టి చక్రము నడుపుటకు ఆయన "కాలము" మొదలగు రూపములను ధరించెను. ఆ నిరంజనుడే సమస్త భూతకోటి యొక్క ఉత్పత్తి హేతువు. మనము త్రిమూర్తుల ముష్వరము ఆయన అంశలమే!! సృష్టి, స్థిత్యంత్యముల కొరకై ఆయనే వివిధ రూపములతో విరాజమానుడయ్యెను. నేను, మీరు, బ్రహ్మ, కాలము, ప్రకృతి అనేక అన్య స్వరూపములన్నియు ఆయన రూపములయినప్పటికీ, ఆయన ప్రేరణ లేక మనము అశక్తులము."

అంత పురుషోత్తముడు విష్ణువు "మహేశ్వరా! మీరు త్రిమూర్తుల ఏకత్వమును తెలిసికొంటిరి కదా! మరి ఇక బ్రహ్మ హత్య చేయదగునా?" శంభుడు సహితము "లేదు" అని బదులిచ్చెను. "బ్రహ్మ వధ జరుగలేదు" అని పలికి మార్కండేయుడు "మునులారా! తరువాయి వృత్తాంతమును వినవలసినది" అని వక్కాణించెను.

**(శ్రీ కాళికా పురాణమందలి హర కోపోపశమనము అను పదమూడవ అధ్యాయము సమాప్తము)**

# పదునాల్గవ అధ్యాయము

**(శివ సతీ విహార వర్ణనము)**

తదనంతరము మేఘమాలికల మృదు గర్జనల మధ్య సతీపతి అయిన పరమేశ్వరుడు విష్ణ్వాదులకు వీడ్కోలు పలికి, సతీదేవిని తన ఉత్తుంగ వృషభవాహనమును అధిరోహింపజేసి, రమణీయ నికుంజసహిత హిమాలయముల వయిపు ప్రస్థానము కావించెను. కమలపత్రాక్షి, సుదతి అయిన దాక్షాయిణి, సతీదేవి వృషభవాహనమందు మహేశ్వరుని కూడి శశిధరుని సమీపమున మేఘమాలిక వలె శోభిల్లెను. బ్రహ్మాది సుర ప్రముఖులు, బ్రహ్మ మానస పుత్రులు, మరీచాది మహర్షులు ఈ దృశ్యమును చూచి అత్యంత ముదితులైరి. ప్రమథగణముల యందు కొందరు శంఖములు, తాళములు పట్టి, ఉచ్ఛస్వరమున గానము చేయుచూ, సతీశివులను అనుగమించిరి. పరమేశ్వరుడు సురప్రముఖులకు, మహర్షులాది సర్వులకు వీడ్కోలు పలికినప్పటికీ, వారు ఆయనను విడువజాలక కొంత దూరము వారి వెంట నడచి, సుమధురముగ సంభాషించి, అనంతరము జగత్ మాతాపితరులకు వీడ్కోలుపలికి తమ తమ స్థావరములకు చనిరి. దేవతలు, సిద్ధులు, యక్ష, విద్యాధరులు, అప్సరసలు సహితము కొంచెము దూరము ఆయనను మర్యాదా పురస్సరముగ వెంబడించి, తదుపరి వారిరువురికి నమస్కరించి తమ ఇండ్లకు వెడలిరి. నెమ్మదిగ నీలలోహితుడు సతీసహితుడై తన ప్రియ గృహమయిన కైలాసమున కేతెంచి, అక్కడికి చేరుకొన్న ప్రమథగణములను, నంది, భైరవాదులను ఉద్దేశ్యించి, ఇట్లనియె "ప్రమథులారా! నేను ఎప్పుడు మిమ్ములను తలంతునో తక్షణము మీ మనసులు చంచలములగును. తక్షణము మీరు నా యొద్దకు రావలెను." భైరవాదులు "అట్లే" యని మహాదేవుని ఆజ్ఞను శిరసావహించి, అక్కడి నుండి హిమాలయమందున్న "మహాకౌశీ" నదీ జలపాతము వద్దకేగి అచట నివసింపసాగిరి.

అందరూ వెడలిన పిదప, ఏకాంతమున సతీశివులు మోహాతిరేకము చే అనేక నిర్జన ప్రదేశములందు అతిశయ మదన క్రీడా తత్పరులై ఆనందడోలికల యందు ఓలలాడిరి. ఒక్కొక్కప్పుడు మహేశుడు అనేక సుందర వన పుష్పములు సేకరించి, వాటితో మనోహరమయిన మాలలల్లి సతీదేవిని అలంకరించును. మరియొకనాడు సతి దర్పణము నందు తన ముఖము కాంచునపుడు, నెమ్మదిగ సవ్వడి చేయక ఆమె వెనుక నిలబడి, తన ముఖమును సహితము ఆ దర్పణము నందు ప్రతిబింబించును. ఒక్కొక్కసారి అతిమెత్తని, ఒత్తైన ఆమె కేశపాశమును సుతారముగ పట్టి, వాటితో అడుచూ, ఘ్రాణము చేయుచూ, నెమ్మదిగ వానిని ముడివేయును. సహజరక్త వర్ణమున శోభించు సతీదేవి యొక్క కబరీ బంధము నందు మితిమీరిన అనురాగము చే లతాకుసుమములను ముకుళించును. ఏ విధముగనైననూ సతీదేవి ముఖకమల పరిస్పర్శ కావించుటకు మామూలుగ మాటలాడు పలుకులు సహితము రహస్య ధోరణిలో తెలుపుచుండును. మహాదేవుడు తన ప్రక్కన లేనపుడు సతీదేవి విరహసహిత అగుటచే పరమేశ్వరుడు నెమ్మదిగ వెనుకనుండి అరుదెంచి ఆమె కనులను తన అరచేతులతో మూయను. ఒక్కొక్కనాడు తన మాయాబలము చే అంతర్హితుడై, అదృశ్యముగ సతీదేవిని బిగికౌగిట బంధించి, ఆలింగన మొనర్చి, ఆమె భయవిహ్వల అగునపుడు తిరిగి ప్రకటితుడగును. ఒక్కొక్కప్పుడు శితికంఠుడు సతీదేవిని రక్తవర్ణ పుష్పములతోకానీ, వికసించిన పద్మములతో కానీ సంపూర్ణముగ అలంకరించి, పుష్పభూషిత అయిన సతీదేవి సౌందర్యమును నేత్రములతో పానము చేయును. సతీదేవి తన యొద్ద లేని యెడల కృత్తివాసుడు గమనము, విశ్రాంతి, శయనాది చేష్టలందు ఏ విధమయిన సుఖానుభవము పొందకుండెను. ఈ విధముగ కైలాస నికుంజములందు చిరకాలము సంచరించి, హిమాలయము చేరి అచట వివిధ నిర్జన ప్రదేశములందు విహరించుచూ, సతీశివులు మహాకౌశీ నదీజలపాతము వద్ద కేతెంచిరి.

అదే సమయమున కామదేవుడు రతీ మరియు సహచర సహితుడై, ఆ ప్రదేశము చేరెను. అంత వసంతుడు సతీశంకరుల పరిశరమున యున్న జల, వృక్ష, భూమండల మంతటినీ తన స్వకీయ అనితర శోభచే శింగారించెను. వృక్షములు సంపూర్ణ పుష్ప భరితములయినవి. లతలు కుసుమయుక్తములయినవి. సరోవరములు స్వచ్ఛజలములతో కూడి, అరవిరిసిన పద్మములతో నిండినవి. కమలములు భ్రమరయుక్తములయినవి. వసంతాగమనముచే సర్వ స్త్రీ గణములనూ మోహింపజేయు పుష్ప సుగంధిత మలయ మారుతము వీవసాగెను. యదుకుల వనితలు దధిమంథనము గావించి, వెన్నను వెలికితీయునటుల, వసంతుడు ముని గణముల మనసులు మథించి వారిని కామ ప్రవృత్తి యందు గ్రుంకులిడజేసెను. పలాశ వృక్షములు విరబూసి వాడి మదనాస్త్రముల వలె విరాజిల్లు చుండెను. దేవగణములు సంతుష్టినొందినవి. సరోవరములు వికసించిన పద్మములతో నిండి మనోహర జలదేవతల వలె దీప్తించుచున్నవి. బంగారు వన్నెగల పుష్పములతో నిండిన నాగకేసర వృక్షములు కామదేవుని రథ పతాకము వలె శంకరుని వద్ద విరాజమానమయినవి. బారులు తీరిన చంపక (సంపెంగి) వృక్షములు విరబూసి, హేమపుష్పములను తమ నామమును సార్థకమొనర్చుకొన్నవి. పాటల (కలిగొట్టు) వృక్షములు తమ శాఖల నిండా పుష్పములను వికసించి ఎటు చూసిననూ వనము అంతయు మదనజ్వరము చే భగభగ మండుచున్నట్లున్నది. కుసుమించిన లవంగలతలను స్పర్శించి వీచుచున్న మలయమారుతము ప్రేమికుల హృదయములను మోహింపజేయుచున్నది. పృథివి సర్వమూ మాధవీ పుష్ప సుగంధముతో నిండి నిబిడీకృతమై, మెల్లగా ఘంకారము చేయుచూ ఎగురుచున్న భ్రమరములతో అత్యంత శోభాయమానముగ దీప్తించుచున్నది.

మామిడి చెట్ల అగ్రభాగములు పచ్చని పూత పూసి మదనబాణ సదృశముగ తేజరిల్లుచున్నవి. హృదయమునందు పరంజ్యోతి ప్రకాశము తో శాంతియుతమయిన మునిగణముల చిత్తముల వలె సరోవరములన్నియు నిర్మలమై శోభించెను. తత్వజ్ఞానుల హృదయములందు దూరమగు మమత్వము (నేను–నాది అనుభావన) వలె, ఉదయకాలపు సూర్యరశ్మిచే పొగమంచు సర్వము గగనతలమున కెగసి అదృశ్యమయ్యెను. మత్తకోకిలలు మదనుని పుష్పధనువు యొక్క నారీ నాదమును అనుకరించుచూ కుహుకుహు నాదములతో నిరంతరము వనమును మారుమ్రోగించుచుండెను. సుందర మదవతుల అందమును ఆకలిచే పీడింపబడుచున్న కామశార్దూలముల వలె మధుపములు ఘంకారము గావించుచు మధువును గ్రోలుటకు పుష్పముల నాక్రమించుచుండెను. ఈ సమయము నందు పతులతో కూడిన సతులయందు వెలుగొందు శృంగార, లాలిత్య, రమణీయతలను ప్రోది చేసుకొని, రాత్రి కన్యక రేరేడుతో సురత సుఖమనుభవించుటకు ఆ ప్రదేశమును తుషారరహితము కావించెను.

మదనకదనమునకు అనువయిన ఇటువంటి సమయమున మహాదేవుడు హిమాలయ గుహలు, మరియు పుష్ప నికుంజములందు సతీదేవిని కూడి నిరతిశయ ప్రణయానందమును అనుభవించెను. సతీదేవి పరమేశ్వరుని సురత క్రీడలందు మునిగి తేల్చుచూ, మధుర శృంగార రసపానము చేయించుచూ, నెమ్మదిగ ఆయన హృదయపీఠమలంకరించెను. మహాదేవుడు సహితము తన చేతులతో గుచ్చిన పుష్పహారములతో సతీదేవి దేహమును సంపూర్ణముగ అలంకరించి, అతి సున్నితముగ ఆమెను తాకుచూ ఆనందించుచుండెను. సంయమి అయిన పురుషుని యందు ఆత్మజ్ఞానము ఉదయించునటుల, మహాదేవుడు తన పలుకులు, చూపులు, చతుర సంభాషణల ద్వారా సతీదేవి అంతరంగ మందిరమున ప్రవేశించి ఆమె హృదయ పీఠమున సుస్థిరుడయ్యెను. దాక్షాయిణీ దేవి యొక్క ముఖకమల సౌరభము, అనన్యసామాన్య సౌందర్యము, మరియు లీలానైపుణ్యములనెడు సంకెలలచే మహాదేవుడు సంపూర్ణముగ బందీకృతుడయ్యెను. ఈ విధముగ సతీశివులు హిమాలయ కంధరములందు, నిర్జన ప్రదేశములందు, పుష్ప నికుంజములందు ఎడతెగక విహారము సలుపుచుండగా, నెమ్మది నెమ్మదిగా ఇరువది నాలుగు దివ్య సంవత్సరములు గడచెను.

**(శ్రీ కాళికా పురాణము నందలి సతీ శివ విహారమను పదునాల్గవ అధ్యాయము సమాప్తము)**

# పదిహేనవ అధ్యాయము

**(హిమాలయము నందు సతీశివుల నివాస ప్రస్తావన)**

మార్కండేయుడు తిరిగి పలుకుట నారంభించెను "ఈ విధముగ అనేక దివ్య వత్సరములు గడచిన పిమ్మట ఒకానొకనాటి వర్షాకాలపు సాయంత్రపు వేళ సతీశివులు ఒక పర్వత శిఖరముపై ప్రతిష్ఠితులై యుండగా సతీదేవి మహాదేవునితో ఇట్లనియె "స్వామీ! అతి దు:సహమయిన వర్షాకాలము ఏతెంచుచున్నది. నానా విధములయిన మేఘములు దశ దిశలను, ఆకాశమును సంపూర్ణముగ కప్పివైచినవి. కదంబపుష్ప పరాగయుక్తమయిన వర్షపు బిందువులు, వాయు ప్రవాహము తో కలసి హృదయ కంపనము కావించుచున్నవి. విద్యుత్ పతాకములతో నిండిన పూర్ణ జలయుక్త నీలి మేఘముల భయంకర గర్జన చిత్తక్షోభ గావించుచున్నది. సూర్యుడు ప్రకాశించుట లేదు. చంద్రుడు మేఘముల వెనుక దాగుకొని యుండెను. దివారాత్రముల భేదము తెలియకున్నది. ఈ సమయము విరహాతురులకు ప్రాణాంతకము. తీవ్రమయిన వాయువేగము చే గర్జన చేయుచున్న మేఘములు సహితము ఒకచోట స్థిరముగ యుండలేక లోకుల శిరములపై పడునట్లు పరుగులిడుచున్నవి. పవనుని తీవ్ర వేగముచే మహా వృక్షములు సహితము గగనము నందు నాట్యము చేయుచున్నటుల ఊగుచూ, భీరువులకు భయము, కాముకులకు హృదయానందమును కలుగజేయుచున్నవి. స్నిగ్ధ నీలాంజనము వంటి నీల నీరద మేఘముల క్రింద తెల్లని సారసపక్షుల వరుస, యమునానది యందు పైకి ఉబుకు ఉత్తుంగ తరంగముల వలె దీప్తించు చున్నది. మేఘమాలికలందు మెరయుచున్న మెరుపుతీగలు లోతైన సముద్ర జలములందు ప్రకాశించు బడబానలము వలె యున్నవి. క్షీరసాగరమందలి మందర పర్వత వృక్షముల నల్లని పత్రములు ఎట్లు శోభించునో, అట్లే, ఆ వెండి కొండయగు హిమాలయము వద్ద నీలిమేఘములు శోభించుచున్నవి.

లక్ష్మీదేవి కలికాలమందు సజ్జనులను త్యజించి ఎట్లు అన్యులను ఆశ్రయించునో, అట్లే అతులిత పుష్పశోభ పలాశ వృక్షములను వీడి కుటజ (కొడిసెపాల) వృక్షములను ఆశ్రయించినది. మయూరములు నిరంతర మేఘ గర్జన చే ఆనందోల్లాసము నొంది వర్షాగమనమును సూచించుచూ వనమంతటినీ తమ క్రేంకారములతో నింపివైచినవి. మేఘ దర్శనమునకు ఉత్సుకులైన మదమత్త చాతకములు వర్షాభావ సూచకములయిన మయూర క్రేంకారములను వినుచున్నవి. ఇంద్రధనువులు ఆకాశమంతయు పరిలక్షితములై యున్నవి. ఓ! దేవాధిదేవా! ఈ మేఘముల అఘాయిత్యమును గమనింపవలసినది. ఇవి తమ శబ్దముల చే మయూర, చాతకములను పీడించుచున్నవి. అంతేకాక మయూర, చాతకముల మిత్రత్వము గమనించి హంసలు అత్యంత దూరమునున్న మానస సరోవరమునకు పరుగులు తీయుచున్నవి. ఈ విషమ సమయమందు కాకి, చకోరము సహితము తమ గూడును నిర్మించుకొనుచున్నవి. మరి ఈ ఋతువులందు మీరు గృహ పరాన్ముఖులై యుండుట పాడికాదు. ఓ! పినాకపాణీ! నేను ఈ మేఘ గర్జన చే మిక్కిలి భయభీతనై యుంటిని. అందువలన నా పలుకులు మన్నించి, వెంటనే మనకొక నివాస స్థానమును ఏర్పరుచ వలసినది. కైలాసము నందలి మహాకౌశీ నదీ తటమందు కానీ, భూమిపై గానీ, మనము నివసించుటకు యోగ్యమయిన ప్రదేశమును ఎంచి అచట మన గృహమును ఏర్పాటు చేయవలసినది."

సతీదేవి పలుకులాలకించిన బాలశశాంక మౌళి, లేత చంద్రకిరణములు తన ముఖముపై పడుచుండగా, శుచిస్మితుడై ఈ విధముగ పలికెను "ఓ! మనోహరీ! నీ కొరకు ఒక దివ్య సౌధమును ఏర్పాటు చేయుదును. ఆ ప్రదేశమున మేఘములు ప్రవేశింపజాలవు. హిమాలయ శిఖరములందు మేఘములు సంచరించుచుండును. కానీ అవి కైలాస పర్వతపు మధ్య ప్రదేశము వరకే పరిమితమగును. కానీ పుష్కలావర్త మేఘములు సహితము సుమేరు పర్వతపు మోకాలి

వరకు మాత్రమే తిరుగాడును. అంతకు పైకి పోజాలవు. అందువలన ప్రియా! ఈ పర్వతముల నడుమ నీకు ఏ ప్రదేశము నచ్చిననూ నాకు శీఘ్రముగ తెలుపవలసినది."

"రెపరెపలాడు స్వర్ణమయమయిన రెక్కలతో లలిత నూతన పల్లవములపై కుహుకుహు నాదములు కావించుచూ తిరుగాడు విహంగములు హిమాలయముల వినా వేరెక్కడా కానరావు. నీ సేవ యందలి చిరకాల కోరిక చే సిద్ధాంగనలు ఫలాది దానములు సలుపుచూ మణిరత్న పర్వతమందు నిన్ను చేరగలరు. దేవ, నాగ, కిన్నెర, పర్వత కన్యకలు సహితము నీ క్రీడా విలాసముల నిమిత్తము నీకు సహాయము నొనర్చెదరు. దేవ సుందరీమణులు సహితము నీ రూప లావణ్యములను అవలోకించి, తమను తాము చూచుకొని అవహేళన కావించుకొందురు. రూప గుణాతిశయములందు త్రిలోక ప్రఖ్యాత అయిన హిమాలయ పత్ని మేనాదేవి సహితము తన అభ్యర్థనల చే నీకు మానసికానందము కలుగజేయును. గిరిరాజ వంశమందలి పుణ్యస్త్రీల ప్రవర్తన చే నీకు అమలానందము కలిగి, నీకు సహితము పత్నీ ధర్మాదులు తెలియును. హిమాలయ నికుంజములన్నియు కలకోకిలల విచిత్ర రావములతో నిత్యానందమును కలిగించును. ఇచట ఎల్లప్పుడూ వసంత ఋతువు విరాజిల్లు చుండును.

అమలములై, స్వచ్ఛమయిన నీటితో నిండిన సరోవరములు వందలాదిగ ఈ పర్వతములందు కలవు. కమలములు నిండిన పుణ్య పుష్కరిణులు సహితము అనేకములు గలవు. అందువలన ప్రియా! నీవు హిమాలయము నందు నివసింపవలెనను కోరిక యున్నదా? అంతేకాక ఇచట సర్వకామ ప్రదమయిన కల్పతరువు ఛాయల యందు మొలకెత్తిన పచ్చని వృక్షరాశి విస్తరిల్లి యున్నది. మహాభాగా! హిమాలయము దేవగణముల క్రీడాభూమి. ఇచట క్రూర జంతువులు సహితము ప్రశాంత జీవనము నవలంబించును. ఇయ్యది అనేక ముని, ఋషి, యతి గణముల నివాస స్థానము. ఇచట మానస సరోవరము మొదలగు స్వర్ణ, రజిత, స్ఫటిక మయమయిన సరోవరములు అనేకములు కలవు. ఈ సరోవరములు రత్నమయ నాళదండములు కలిగి, స్వర్ణమయ రేకులు కలిగిన నీలి కమలములతో శోభించుచూ, వివిధ శఫర, శంఖ, కచ్ఛప, మరకములతో నిండి, వందలాది దేవ స్త్రీ అంగరాగములు, మరియు పుష్పమాలల సౌరభముల చే పరివేష్ఠితమయినవి. ఈ సరోవరముల తీరమున ఎత్తైన పచ్చని వృక్షములు పవన వేగము చే ఉల్లాసముగ ఊగుచూ తమ సంపదను సర్వులకూ తెలియజేయుచున్నవి. ఈ సరోవరములన్నియు కలహంస, కారండవ, సారస, చక్రవాకములతో నిండి పరమ సుందరముగ వెలయుచున్నవి. యమ, అగ్ని, వరుణుల వంటి దిక్పాలురు ఇచట సదా నివసించుటకు ఇచ్ఛగింతురు.

దేవగణములకు ఆలవాలము, రంభా, శచీ, మేనకాది దేవకాంతలచే పరిసేవితము అయిన ఈ సుమేరు శిఖరములందు నివసించుటకు ఎవరు ఇచ్ఛగింపరు? ఇచట వందలాది దేవీ, అప్సరోగణ పరివృత అయిన ఇంద్రపత్ని శచీదేవి ఎల్లప్పుడూ నీకు సహాయకముగ యుండును. లేని యెడల కుబేరుని పురమయిన అలకాపురి వలె శుశోభితము, గంగాజలము కంటె పవిత్రము, పూర్ణచంద్రుని దివ్యదీప్తులను మించిన శ్వేత ధామము నా నివాసమయిన కైలాస పర్వత మందు నివసించుటకు నీ మనసు మొగ్గు చూపుచున్నదా? కైలాస పర్వత గుహల యందు యక్ష కన్నియలు నివాసముందురు. నానా మృగగణ పరివృతము, అరవిరిసిన కమలయుత సరోవర సుశోభితమయిన కైలాసగిరి సుమేరువు కంటె ఎంతమాత్రము తక్కువకాదు. ఈ ప్రదేశములందు దేనినయిననూ నీవు నివాస స్థలముగ ఎంచుకొనుము. అది ఏది అయననూ నేను నీతో అచటనే నివసింతును. మహాదేవుని పలుకులు వినిన దాక్షాయణి నెమ్మది నెమ్మదిగ మధుర స్వరముతో ఇట్లనియె "మహాత్మా! హిమాలయమందు నివసింపవలెనని నా మనోభిప్రాయము". తదనంతరము మహాదేవుడు మహానంద పరవశుడై సిద్ధగణ సేవితము, మేఘ విహంగములకు అగమ్యమయిన సర్వోత్తుంగ హిమాలయ శిఖరమునకు ప్రస్థానము కావించెను.

**(శ్రీ కాళికా పురాణమందలి శివ విహారమను పదిహేనవ అధ్యాయము సమాప్తము)**

# పదహారవ అధ్యాయము

**(దక్ష యజ్ఞము; సతీ దేహ త్యాగము)**

ఉదయభాను సంకాశము, సువర్ణ, స్ఫటిక నిర్మితము, విచిత్ర రత్న యుక్తము అయిన గుహలతో కూడిన గొప్ప హిమాలయ శిఖరము పైకి సతీదేవిని కూడి పరమేశ్వరుడు ఏతెంచెను. ఆ ప్రదేశమంతయు స్ఫటిక శిలా నిర్మితమై, ఆకుపచ్చని వృక్ష పరివృతమై, ఆపై నిర్మల జలములు నిండిన సరోవర సహితమై యున్నది. విరిసిన నీలి కమలములపై భృంగములు ఘుంకారము చేయుచున్నవి. స్వచ్ఛమయిన జలాశయములందు కలహంస, కారండవ, చక్రవాకములు, సారస, క్రౌంచ, నీలకంఠ పక్షులు తమ తమ గొంతెత్తి కమనీయ స్వవనము తో కుహుకుహు రావములు కావించుచున్నవి. ఆ ప్రదేశము హయముఖులయిన గంధర్వులు, సిద్ధ, గుహ్యక, అప్సర, విద్యాధరాది కన్యకలు, పరమ పవిత్రులయిన దేవ పత్నులు, చెంచులు మొదలగు వారిచే నిండియున్నది. లయతప్పని మృదంగ, పటహ యుక్తమయిన సుమధర వీణానాదము మంద్రముగ వినిపించుచున్నది. ఆ వాదనలకు అనుగుణముగ అప్సరాంగనలు అద్భుతముగ నాట్యము చేయుచుండిరి. దివ్యగంధ భరితమయిన లతలయందు వికసించిన పుష్పములు అధో భాగమున యుండగా, విరబూసిన పుష్పరాశి వృక్షముల ఉపరిభాగమున వెల్లి విరియుట చే ఆ హిమాలయ శృంగ సౌందర్యము ఇంతింతని వర్ణింపనలవికాకున్నది.

ఈ విధమయిన స్వర్గతుల్య హిమాలయ గిరి శిఖరము నందు మహాదేవుడు సతీదేవిని కూడి పదివేల దివ్య సంవత్సరములు అమృతమయానందమును అనుభవించెను. ఒక పర్యాయము కైలాసము, మరియొక మారు దేవతలు వసించు సుమేరు పర్వతము, ఒకతూరి దిక్పాలురు వసించు కాననములందు, మరియొకమారు పృధివి పైకి, ఈ విధముగ సతీశివులు విహరించుచుండిరి. సతీగత్త హృదయుడయిన మహాదేవునికి దివారాత్రముల భేదము తెలియదయ్యె; పరబ్రహ్మ, తపము, శమాది గుణములు, ఈ జ్ఞానమంతయు శూన్యమయ్యె!! ఆయన ఏకైక కర్తవ్యము సతీదేవి యొక్క ప్రసన్నత. సతీదేవి సహితము సర్వ ప్రదేశములందునూ నలు దిక్కులనూ, శివుని తప్ప మరొకరిని కానదయ్యె! శివుడునూ సతీదేవిని తక్క జగత్తునందు వేరొకరిని చూడడయ్యె!! ఈ విధముగ వారిరువురి మధ్య బద్ధ ప్రేమానురాగము చే బలిష్ఠమయిన అనురాగ రూప వృక్షము ఊడలు దించి వృద్ధి అయ్యెను.

కాలము ఎల్లప్పుడూ ఒక రకముగ యుండదు కదా! ఆ సమయమున దక్ష ప్రజాపతి త్రిభువన హితకరమయిన "సర్వ జీవన మహా యజ్ఞము" ను తలపెట్టెను. ఆ యజ్ఞమునకు ఎనభై ఎనిమిది వేల మంది హోతలు, అరువది నాలుగు వేల మంది ఉద్గాతలు, నారదాది ఉద్దండ ఋషులు ఆధ్వర్యువులు. సర్వ దేవతా సహితుడై విష్ణు దేవుడు అధిష్ఠాత. సాక్షాత్ చతుర్ముఖ బ్రహ్మ దేవుడు ఆ యజ్ఞమునకు బ్రహ్మయై నిలచెను. దిక్పాలకులే ద్వారపాలురు కాగా యజ్ఞము మూర్తీభవించి అచట ఉపస్థితమయినది. సాక్షాత్ పూర్ణ ధరామండలమే యజ్ఞవేది. ఈ మహాయజ్ఞ మహోత్సవము నందు హవిస్సు గ్రహించి, అద్దానిని వేల్పులకు చేర్చుటకై కుతవాహుడు వేల నాలుకలు చాచి మహాద్భుతముగ ప్రకాశించుచుండెను. సప్తఋషులు స్వయముగ భూనభోంతరాళములు, దిక్కులు, విదిక్కులు నిండునటుల ఉచ్చ స్వరముతో సామగానము చేయుచుండిరి. ఈ యజ్ఞమునకు పిలువనివారు, రాని వారు లేరనిన అతిశయోక్తి కాదు.

దేవ, దేవర్షి, మృగ, పశు, పక్షి, తృణ, ఉద్భిజ, సిద్ధ, సాధ్య, విద్యాధర, యక్ష, గంధర్వ, నాగ, ఆదిత్య, ఋషిగణ, స్థావర, జంగమ మండలి నంతటినీ దక్ష ప్రజాపతి ఆహ్వానించెను. మహర్షి, రాజర్షి, దేవర్షి గణములు, మరియు రాజపుత్ర, సచివ, సైన్య, సైన్యాధ్యక్ష సహిత సమస్త రాజగణములు, వసుగణములు సహితము ఆహ్వానింపబడిరి. కీట,

పతంగ, జలచర, వానర, మేఘ, పర్వత, నదీ, సాగర, సరోవర, కాలువలను సహితము ఆహ్వానించెను. అంతేకాక పాతాళవాసులైన అసుర, నాగ జాతులు సహితము సతీ సమేతముగ సవినయముగ ఆహ్వానింపబడిరి. చిత్రమేమన, ఒక్కరుకూడా కాదనక సర్వులు ఏతెంచిరి. ఈ విధముగ ఆహూతులైన స్థావర, జంగమాత్మక సమస్త జగత్తును దక్షుడు యధావిధిగ అర్చించి, సర్వులను వరణము చేసి, సర్వదక్షిణ సహితముగ యజ్ఞారంభము కావించెను. "వినాశకాలే విపరీత బుద్ధి:" అను వాక్యము ననుసరించి "మహాదేవుడు కాపాలికుడు. అందువలన యజ్ఞార్హుడు కాడు. సతీదేవి తన ప్రియతమసుత అయినప్పటికీ, ఇపుడు కపాలి యొక్క భార్య అయినందు వలన ఆమెను సహితము పిలువ తగదు" అని తలచి దక్షుడు బుద్ధిహీనుడై సతీశివులను ఆహ్వానింపకుండెను.

శివపత్ని దక్షయజ్ఞము గూర్చియు, మరియు తమను పిలుకుండు కారణమును తెలిసికొని దక్షుని ఎడల మిక్కిలి కృద్ధురాలై, ముఖము జేవురించి, రక్తనయనయై, దక్షుని శాపదగ్ధుని కావింపనెంచెను. కానీ పూర్వము తానిచ్చిన వరమును జ్ఞప్తికి తెచ్చుకొని శాపమును ఈయక ఆ అవశ్యకత లేదని గ్రహించెను. తాను పూర్వమే ఎప్పుడు దక్షుడు తన పట్ల అవజ్ఞుడగునో, తక్షణము తాను ప్రాణ త్యాగము చేయుదునని తెలిపిన వృత్తాంతమును గుర్తుకు తెచ్చుకొనెను. భగవతి సతీదేవి ఈ విధముగ యోచించి, జగన్మయము, నిష్కామము, నిరుపమము, ఘోరతరము అయిన తన స్వస్వరూపమును ఒకసారి స్మరించెను. అయ్యది సంపూర్ణముగ శ్రీహరి యొక్క యోగనిద్రా స్వరూపమే!! తదుపరి సతీదేవి తిరిగి ఇట్లు యోచించెను. "బ్రహ్మ ఏ కారణమున నన్ను స్థవము చేసెనో, ఆ కార్యము సఫలమవలేదు. ఎందుకనగా శంకరుడు ఇంకనూ పుత్రహీనుడు. ఇంతదనుక దేవకార్యము ఒక్కటియే సఫలమయినది. అది శివుడు పత్నీ గ్రహణము కావించుట. నేను వినా వేరే ఏ స్త్రీయునూ పినాకపాణి యందు అనురాగము నుత్పత్తి చేయలేదు. శంభుడు సహితము వేరే ఏ స్త్రీ యందు అనురక్తుడగుట కల్ల. అందులన నేను నా పూర్వ ప్రతిజ్ఞానుసారము ప్రాణ త్యాగము కావింతును. తిరిగి త్రైలోక్య హితార్ధము హిమాలయము నందు అవతరించెదను. అనేక దివ్య వర్షములు శంభుడు స్వర్గతుల్యమయిన హిమాలయమందు దీర్ఘకాలము నాతో విహరించినందు వలన నా యొడ మిక్కిలి ప్రసన్నుడై యుండెను. హిమాలయ పత్ని అయిన మేనాదేవి నిత్య వ్రతచారిణి, సుశీల, మరియు పర్వత వంశజుల యందు అతి ప్రధానమయినది. ఆమె నా సొంత తల్లి వలె సర్వ కార్యములు ఆచరించినది. ఆమెపై నాకునూ అత్యధిక అనురాగమున్నది. ఆమెను తల్లిగా గ్రహించి, అనేక పర్వత బాలికలతో బాలక్రీడలాడుచూ మేనకాదేవికి అత్యంత ఆనంద ప్రదము కావింతును. అటు పిమ్మట తిరిగి శివునికి ప్రియపత్నిని అగుదును."

ఈ విధముగ తలచి, తిరిగి దక్షుడు కావించిన అకృత్యము మదిని మెదలగనే అత్యంత రోషభూయిష్ఠ, రక్తనయనయై, యోగబలము చే నవరంధ్రములను నిరోధించి, కుంభక మవలంబించి, ప్రాణ వాయువును బంధించి, ఊర్ధ్వ గమనము గావించి, బ్రహ్మ రంధ్రము భేదించి, ప్రాణములను బహిర్గతమొనర్చి, అనంత వాయువులందు లీనమొనర్చెను. ఈ విపరీత కృత్యమును కాంచి ఆకాశమునందున్న దేవగణములు శోకము చే అశృతర్పణులై హాహాకారములు కావించిరి.

ఇంతలో సతీదేవి యొక్క సోదరి పుత్రిక అయిన విజయ అచటికి ఏతెంచి "హా! సతీ!! ఏమి జరిగినది? ఎట్లు ఈ దుర్దశ ప్రాప్తించినది" అని ఆర్తనాదము కావించినది. "ఓ! సతీ! నీవు అప్రియము విని ప్రాణత్యాగము కావించితివి. నేను ఈ దారుణమును కనులార కాంచి ఎట్లు జీవించగలను?" ఈ విధముగ రోదించుచూ తిరిగి తిరిగి తన అరచేతులతో సతీదేవి ముఖమును తాకుచూ, విలపించుచూ, తన అశ్రుధారల చే సతీదేవి శరీరము నంతటినీ తడిపి వైచినది. ఈ విధముగ విజయ తీవ్ర శోకము నొంది, గుండెలు బాదుకొనుచూ "ఈ విషయమును వినిన నీ తల్లి వీరిణి ఈ వార్తను తెలిసి ఎట్లు జీవించును? ఆమె సహితము ప్రాణత్యాగము కావించును. నీ తండ్రి నిర్దయుడు, క్రూరుడు అయినప్పటికీ నీ మరణ వార్త వినినంతనే ఆయన సహితము జీవింపనోపడు. దక్షుడు నిశ్శంశయముగ నీ పట్ల అమర్యాదగ ప్రవర్తించెను.

ఈ విషయము జ్ఞప్తికి తెచ్చుకొని తరువాత దినముల యందు ఆయన అత్యంత శోకతప్తుడగును. దక్షుడు యాజ్ఞికుడయ్యూనూ మూర్ఖుడు, శ్రద్ధా రహితుడు, మరియు బుద్ధిహీనుడు. తల్లీ నేను ఇంత విలపించిననూ నీవు బదులు పలుకుట లేదు. ఈ శోక సమయమందు, నాకు ప్రాణము సహితము శల్యము వలె తోచుచున్నది. నీ విప్పారిన నేత్రములు, చతురమయ సంభాషణ, లావణ్యమయ నాసిక, నీ మనోహర హాస్యము నేడు ఏమైనవి? ఈ విధముగ నిన్ను చూచి శశిశేఖరుడు ఏమగును? నేను తిరిగి ఈ శివాశ్రమమునకు ఏతెంచినపుడు నాకు మందహాసముతో మధుర సత్యముల నెవరు ఎరింగింతురు? నీ వంటి పతిసేవా పరాయణురాలు, బంధువుల పట్ల కల్పతరువు అయిన అతివ బ్రహ్మాండమందు వేరొకరు యుండునా? ఓ! దేవీ! మహాదేవుడు నీ విరహము చే అత్యంత దు:ఖితుడై, శోకాకులుడై, నిరుత్సాహముతో నిశ్చేష్టితుడగును.” అ విధముగ పలికి సతీ శరీరముపై బడి అత్యంత శోకాకులయై, విజయ అత్యంత దీనురాలై విలపింపసాగెను.

మార్కండేయుడు ఒక్కతడవు దీర్ఘ నిశ్వాశమునొనర్చెను.

**(శ్రీ కాళికా పురాణమందలి సతీదేహ త్యాగమను పదహారవ అధ్యాయము సమాప్తము)**

# పదిహేడవ అధ్యాయము

**(దక్షయజ్ఞ ధ్వంసము)**

మార్కండేయ మహర్షి తిరిగి పలుక సాగెను “ఆ సమయమున శంభుడు మానస సరోవరమందు సంధ్యాదులు పూర్ణమొనర్చుకొని తన ఆశ్రమమునకు తిరిగి బయలు దేరుచూ విజయాదేవి యొక్క ఆక్రందన విని ఒక్క క్షణము భయచకితుడయ్యెను. వాయు, మనో వేగముతో పయనించగల నందీశ్వరునధిరోహించి, తన ఆశ్రమమున కేతెంచి, సతీమృతదేహమును కాంచి, నిరుపమ ప్రేమ కారణమున మోహపరవశుడై భుజములు పట్టి పదే పదే “సతీ! నీవు ఏల నిద్రించుచున్నావు?” అని ప్రశ్నింప సాగెను. అంత సతీ సోదరీ సుత అయిన విజయ సతీ మృత్యుకారణమును ఇట్లు చెప్పదొడంగెను “మహాదేవా! దక్ష ప్రజాపతి దేవాసుర సిద్ధ, విద్యాధర జాతులననేల! సంసారము నందలి సర్వులను యజ్ఞమున కాహ్వానించెను. ఆ విషయము తెలిసి సతి మిమ్ములను పిలువని కారణ మరసెను. నేను దక్షుని ద్వారా వినిన సమాచారము “శివుడు కాపాలికుడు. సతి ఆతని భార్య. అందువలన వారిరువురు యజ్ఞార్హులు కారు ” అని మధుర వాక్కులతో తన పత్నిని సమాధాన పరచెను. ఈ విషయము నా ద్వారా వినిన సతి కొంత సమయము మౌనము వహించి, విషణ్ణవదనయై చతికిల పడినది. తదుపరి ఆమె చల్లని నయనములు క్రోధము చే అరుణ వర్ణము దాల్చి, భృకుటి ముడివడి, మిక్కిలి బాధ, ఆంధోళనకు గురియై గగనమున తోకచుక్క వలె భాసించెను. మరుక్షణము మహాకుంభకమవలంబించి, ప్రాణవాయువులచే బ్రహ్మ రంధ్రము భేదించి పంచత్వము నొందెను.”

విజయ ద్వారా విషయమును వినిన వృషభధ్వజుడు ప్రళయాగ్ని వలె భగ్గుమని మండెను. ఆ సమయమున ఆయన ముఖము కళ్ళు, ముక్కు, మొదలగు అవయవముల నుండి భయంకర ధ్వానములు చేయుచూ కల్పాంత సూర్యకిరణముల వోలు అగ్ని కణములు ఆవిర్భవించుట నారంభించెను. ఆయన హిమాలయము నుండి కదలి మహాతపస్వి అయిన దక్షుని యజ్ఞశాల కడకేతెంచెను.

అచట హోమ గుండమునందు పోయబడుచున్న ఘృతము చే అగ్ని ప్రజ్వరిల్లుచున్నది. దిక్పాలురందరూ ధ్వజాస్త్ర శస్త్రధారులై తమ తమ ఆసనములందు సుఖాసీనులైరి. ఇంద్ర, భగ, సూర్యాదులు, భార్యాగణ పరివృతుడయిన శశాంకుడు,

గౌతమ మహర్షి ఆ యజ్ఞము యొక్క తూర్పు భాగమున ఆసీనులైరి. అగ్ని, సాధ్య, మరుద్గణములు, గరుడుడు, ఆత్రేయ, భార్గవులు ఆగ్నేయము నందు స్థితిగతులైరి. యముడు, చిత్రగుప్తుడు, విశ్వేదేవ, అగ్నిష్వత, కవ్యవాహాది సమస్త పితరులు, చతుర్విధ భూత సమూహములు, కుజుడు, సిద్ధ, ప్రేత, మహర్షి గణములు, అగస్త్య, గాలవాది మహర్షులు దక్షిణమున ఉపస్థితులైరి. నిరృతి, రాక్షస, పిశాచ, భూత, పశుపక్షి, క్షుద్రజంతువులు, రాహువు, కిన్నెరులు, మౌద్గల్యమహర్షి నైఋతి కోణమందు విశ్రమించిరి. మహాసర్పములు, మకర, మత్స్య, కచ్ఛప, సప్త సాగరములు, నదీనదములు, గుప్త తీర్థములు, మానసాది హ్రదములు, గంగా మరియు జాంబూనదులు, మన్మథుడు, అనుచర సహితుడయిన వసంతుడు, శనైశ్చరుడు, సమస్త పర్వత రాజములు పశ్చిమమున ఆశీనులైరి. గణముల సహితుడయిన వాయుదేవుడు, పంచ వాయువుల (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన), కల్పవృక్షము, హిమాలయము, కశ్యపాది ఋషులు, వాయుకోణ మందు ఉపవిష్ఠులైరి. నలకూబర, స్థూలకర్ణ సహితుడయిన యక్షరాజు కుబేరుడు, సుమేరువు మొదలగు పర్వతములు, కమల బృందములు, ఫలములు, అరువది నాలుగు కళలు, పద్మాది నిధులు, నానారత్నములు, స్వర్ణము, మనుష్యులు, ధృవ, యజ్ఞ, సోమ, విష్ణు, అగ్ని, వాయు, ప్రత్యూష, ప్రభాతములు, ఉత్తర దిశ యందు కూర్చుండిరి. వృషధ్వజుని వినా మిగిలిన ఏకాదశ రుద్రులు, బీజములు, మంత్రములు, వివిధ క్షత్రియ, వైశ్య, శూద్రులు, వివిధ అన్నములు, మరియు నువ్వులు ఈశాన్య కోణమున స్థితిగతులైరి. తూర్పు, ఈశాన్య మధ్య భాగమున కఠోర వ్రతులైన బ్రహ్మర్షి గణములు ఉపనిష్ఠులైరి. అచట చతుర్వేదములు, వేదాంగములు కూడ యున్నవి. నైఋతి, పశ్చిమ దిశల మధ్య శ్వేత పర్వతము, సహస్ర ఫణుడయిన అనంతుడు, కూష్మాండ ఢాకినీ గణముల సహితుడయిన సప్తభోగి కేతువు, సౌదామినీ సమేతములయిన వివిధ మేఘములు, అడ ఏనుగులు కూడి ఐరావత గజరాజమును సహితము రుద్రుడు కాంచెను.

తొలుత దూరము నుండే సముజ్వలముగ యున్న యజ్ఞస్థలిని కాంచి రుద్రుడు వీరభద్రుని అచటకు పంపెను. అంత మహాబలి అయిన వీరభద్రుడు అనేక గణములతో దక్షయజ్ఞ ధ్వంసము కావించెను. కానీ దేవ గణములు, విష్ణువు ఆయను నిరోధించిరి. అంత రోషభూయిష్ఠుడయిన కపర్ది తాను యజ్ఞ ధ్వంసము నారంభించెను. శివుడు యజ్ఞశాల యందు ప్రవేశించుట గాంచిన భగుడు తన రెండు చేతులు సాచి ఆయనను ఆపుటకు ప్రయత్నించెను. అంత వ్యోమకేశుడు భగుని రెండు కన్నులను తన బొటన వ్రేళ్ళతో పెరికెను. అంత దివాకరుడు భగునికి అండగా ఏతెంచెను. అంత విరూపాక్షుడు దివాకరుని రెండు చేతులు పట్టి దూరముగ విసరవైచి యజ్ఞస్థలి కేతెంచెను. అంత మార్తాండ సూర్యుడు ముందునకేతెంచి నవ్వుచూ, నీలలోహితుని ద్వంద్వ యుద్ధమున కాహ్వానించెను. క్రోధోద్రిక్తుడయిన ఖట్వాంగుగు ఒక్క పెట్టున నవ్వుచున్న మార్తాండుని దంతములన్నియు క్రిందపడునట్లు తన చేతిని ప్రహరించెను. మార్తాండుడు దంత శూన్యుడయ్యె! భగుడు నేత్రహీనుడు, మార్తాండుడు దంతహీనుడగుట గమనించి సమస్త దేవతానీకము పలాయన మొనర్చిరి.

ఆ సమయమున యజ్ఞము జింక రూపము ధరించి పారిపో మొదలిడెను. మహాదేవుడు ఆ మృగము వెనుక పరిగెత్తెను. అయ్యది బ్రహ్మలోకమున కేగినది. రుద్రుడు దానిని వెంబడించుచూ తానునూ బ్రహ్మలోకము ప్రవేశించెను. అంత యజ్ఞము తన మాయాబలము చే సతీదేవి శరీరమున ప్రవేశించి తిరిగి యజ్ఞ స్థలి కేతెంచెను. అంత శూలపాణి సహితము తిరిగి యజ్ఞస్థలి కేతెంచి, మృతి చెందిన సతీదేహమును, యజ్ఞమును కాంచెను. సతీదేవి దేహము చూచినంతనే శ్రీకంఠుడు యజ్ఞము మాట మరచి, ఆ మృత శరీరము వద్ద కూర్చొని అత్యంత శోక నిరతుడయ్యెను. శర్వుడు సతీదేవి యొక్క సుందర దంత పంక్తి యుతమయిన ముఖమండలము, మెలి తిరిగిన కనుబొమలు చూచుచూ వ్యాకుల చిత్తుడై విలపించుట నారంభించెను.

**(శ్రీ కాళికా పురాణ మందలి దక్షయజ్ఞ ధ్వంసమను పదిహేడవ అధ్యాయము సమాప్తము)**

# పద్ధెనిమిదవ అధ్యాయము

**(శివ విషాద వర్ణనము)**

మార్కండేయుడు తిరిగి పలుకసాగెను "ఆ సమయమున వృషధ్వజుడు సామాన్య మానవుని వలె విలపించుచూ, దక్ష పుత్రిక యొక్క గుణగణములు కీర్తించుచూ, దు:ఖ పరవశుడాయెను. ఈ దృశ్యమును వీక్షించిన రతీ మన్మధులు వసంత సమేతులై ఆయన వద్ద కేతెంచి, చేతనా భ్రష్టుడై, హృదయవిదారకముగ విలపించుచున్న స్థాణునిపై ఒకే సారి దుష్టుడయిన మకరధ్వజుడు మన్మధుడు భ్రష్ఠచిత్తుడై పంచసాయకములను ప్రయోగించెను. ఆ సమయమున శివుడు ఒక ప్రక్క శోకగ్రస్తుడయ్యునూ, మిక్కిలి కామపీడితుడయ్యెను. కామ, శోక భావములు ఆయన హృదయమును సంపూర్ణముగ ఆవరించెను. మహాజ్ఞాని అయిన మహేశ్వరుడు ఉన్మత్తుడై "సతీ, సతీ" అని బిగ్గరగ అరుచుచూ, ఆమె శరీరమును పట్టి బలముగ ఊపుచూ, ఒక్కొక్కమారు పరుగెత్తుచూ, క్రిందపడుచూ, భూతలము పై పొర్లుచూ, కన్నులు మూసుకొని సతీదేవిని జ్ఞప్తికి తెచ్చుకొనుచూ, సతీ శరీరమును ఆలింగనము చేసికొనుచూ, ఆమె శరీరముపై యున్న అలంకారములను తీసి మరల అలంకరించుచూ సంపూర్ణముగ ఉన్మాదుడయ్యెను. ఇంత ప్రయాసపడిననూ సతీదేవి ఉలకలేదు. పలుకలేదు. అంత రుద్రుడు కంటికి మింటికీ ఏకధారగా రోదించుట మొదలిడెను. దీనిని వీక్షించుచున్న బ్రహ్మాది దేవగణములు అత్యంత చింతితులై హాహాకారము లొనర్చిరి. ఎందుకనగా శివుని అశ్రుకణములు భూమిపై పడిన ఎడల ధరిత్రి సమస్తము దగ్ధమగును. అంత దేవతలు అత్యంత దు:ఖ భావావేశమునున్న శంకరుని భాష్ప నివారణార్ధము శనైశ్చరుని ఈ విధముగ ప్రార్ధించిరి.

"ఓ! త్రైలోక్యానుగ్రహకారీ! మహాభాగా! శనైశ్చరా! మహాశక్తి సంభూతా! సూర్యపుత్రా! నీకు నమస్కారము. నీవు చతుర్బాహువుల యందు శూల, పాశ, ధనుస్సు మరియు వరద ముద్రాంకితుడవు. ఛాయా గర్భ సంభూతా! నీకు నమస్కారము. ఓ! నీల నీరద మేఘ సదృశ వర్ణా! కాటుక కొండ వంటి నల్లని స్వరూపము కలవాడా! నీవు సమస్త ప్రాణి కోట్ల ప్రాణాధారహేతువు. నీకు ప్రణామములు. ఓ! గృధ్రధ్వజా! మా యందు ప్రసన్నుడవై శివుని భాష్పములు నుండి ధరిత్రిని కాపాడవలసినది. ఇత: పూర్వము నీవు మేఘము లందలి సమస్త జలములను ఒక సంవత్సరము హరించి అనావృష్ఠి కావించితివి. అట్లే ఇపుడు లోకహితార్ధము హరుని భాష్పములను హరింపవలసిదని. ఈ కార్యము నీకు వినా వేరొకరికి అసాధ్యము. ఈ భాష్పములు క్రిందపడిన ఎడల దేవ, గంధర్వ, బ్రహ్మ లోకముతో సహా సమస్త పర్వత సహిత మేదిని సహితము భస్మీ పటలమగును. అందువలన నీవు నీ అతులిత మాయాజాలముచే ఆ శివాశ్రువులను గ్రహింపవలసినది. దేవ గణముల చే ఈ విధముగ ప్రార్ధింపబడిన శనైశ్చరుడు అత్యంత ప్రసన్న చిత్తుడై ఇట్లనియె.

"సురశ్రేష్ఠులారా! నేను యధాశక్తి మీ కార్యము నెరవేర్చెదను. కానీ నేను ఈ కార్యము నాచరించునట్లు శివునకు తెలియకుండునట్లు మీరు చేయవలెను. ప్రస్తుతము అత్యంత దు:ఖాతురుడు మరియు శోకతప్తుడయిన కపర్దికి అతి చేరువలో యుండి నేను ఆయన అశ్రుకణములను గ్రహించెదను. దాని వలన నా శరీరము నష్ఠమగును. సందేహము లేదు. కానీ ఈ కార్యము ఎట్టి పరిస్థితుల యందునూ మహాదేవునికి ఎరుక లేకుండ యుండవలెను. తదుపరి సమస్త దేవ గణము శంకరుని వద్ద కేగి ఆయనను మోహింపజేసిరి. ఆ సమయమున ఛాయా మార్తాండ సంభూతుడు శివుని వద్ద కేగి ఆయన భాష్పములను గ్రహించెను. కానీ శనైశ్చరుడు ఆ భాష్పములను భరింపనోపలేక "జలధార" అను మహా పర్వతమందు విడచెను. జలధారా పర్వతము లోకాలోక పర్వత సమీపమున పుష్కర ద్వీపమునకు వెనుక, జలసాగరమునకు పశ్చిమమున యున్నది. ఈ పర్వతరాజము సర్వ విధముల సుమేరు పర్వత తుల్యము. ఈ పర్వతము సహితము ఆ

భాష్పముల తేజస్సును భరింపలేక అద్దాని మధ్య భాగము సంపూర్ణముగ విదీర్ణమయినది. తదుపరి ఆ అశ్రుజలము ఆ మహాపర్వతమును భేదించి సాగరము నందు ప్రవేశించెను. సాగరమునకు సహితము అశ్రువులను భరింపనశక్యమై తన పూర్వ తీరము నందు విడచెను. ఆ భాష్పజలము తటమును సహితము భేదించి పుష్కర ద్వీప మధ్య భాగమున వైతరణీ నదిగా ప్రవహించి పూర్వ సాగర సంగమ ప్రదేశమున కేగెను. అప్పటికే జలధార పర్వత భేదనము మరియు సముద్ర ప్రవేశము చేయుటచే అద్దాని శక్తి కొంచెము క్షీణించి పూర్వ సాగర సంగమము వద్ద పృధివిని భేదింపలేక పోయినది. ఈ శివనయన భాష్పములు రెండు యోజనముల విస్తారము కలిగి యమపురి (నరకము) యొక్క ద్వారము వరకూ ప్రస్థానమయినది.

తదనంతరము మోహావశుడయిన మహేశుడు సతీదేవి యొక్క శరీరమును తన భుజముపై వేసికొని తూర్పు దిక్కునకు పయనమయ్యెను. పరమ ఉన్మత్తుడయిన శివుని భుజముపై యున్న సతీ శరీరమును అచట నుండి క్రిందకు దింపు ఉపాయమునకై బ్రహ్మాది దేవతలు యోచింపదొడంగిరి. బ్రహ్మ, విష్ణు, శనైశ్చరులు తీవ్రముగ యోచించి యోగమాయా సహాయమున అదృశ్యముగ సతీ శరీరమున నందు ప్రవేశించి, అద్దానిని ఖండ ఖండములుగ విభజించి, పుణ్య తీర్థ నిర్మాణార్థము వివిధ ప్రదేశముల యందు పడవైచిరి. పృధివి పై "దేవకూట" స్థానమున సతీదేవి రెండు పాదములు, "ఉడ్యాన" పీఠమున ఆమె ఊరువులు, "కామరూప" పర్వత మందు ఆమె యోని మండలము, అక్కడి తూర్పు భాగమందు ఆమె నాభి మండలము, "జలంధరము" నందు స్వర్ణహార సహిత స్థన మండలము, "పూర్ణగిరి" యందు ఆమె స్కంధ గ్రీవములు, "కామరూపము" యొక్క చివరి భాగమందు మస్తకము పడినవి. మహాదేవుడు సతీశరీరమును భుజముపై ధరించి ఎంత దూరము తూర్పు దిశకు ఏగెనో, ఆ భాగము అంతటినీ "యాజ్ఞిక దేశము" అని పిలువబడును. మిగిలిన సతీ శరీర భాగములను దేవగణములు నువ్వుగింజలంత పరిమాణమున ఖండములు కావించిరి. అవన్నియు ఆకాశగంగా ప్రవాహము నందు కలిసినవి. ఏఏ ప్రదేశములందు సతీదేవి అంగములు పడినవో, ఆ ప్రదేశములందు మహేశుడు సహితము ప్రేమ విహ్వలుడై లింగరూపము ధరించెను. బ్రహ్మ, విష్ణు, శనైశ్చరులు, ఇతర దేవతా గణములు అత్యంత ప్రీతితో ఆ ప్రదేశము లందు పూజన కావించిరి.

చరణద్వయము పడిన స్థానమయిన దేవీ కూటమందు జగదంబ "మహామాయ" గా పిలువబడును. ఉడ్యాన పీఠమందు "కాత్యాయిని," కామరూప మందు "కామాఖ్య," పూర్ణగిరి యందు "పూర్ణేశ్వరీ," మరియు జలంధర మందు "చండీ" నామములతో సుప్రసిద్ధమయినది. కామరూప పూర్వ భాగమందు "ధిక్కరవాసినీ" చివరి భాగమందు "లలిత కాంత" గా యోగమాయ ప్రసిద్ధి నొందినది. ఎక్కడ సతీదేవి శిరస్సు పడినదో, శివుడు అచటకు చేరి, మిక్కిలి శోకాకులుడై, దీర్ఘ నిశ్వాసములు విడుచుచూ కూలబడి పోయెను. అది చూచిన బ్రహ్మాది దేవతలు ఆయనను స్వాంతన పరుచుటకై నెమ్మది నెమ్మదిగ ఆయనను సమీపించిరి. శివుడు దేవతాగమనమును గాంచి లజ్జా శోకములు ఒక్కమారు క్రమ్ముకొనగా, అక్కడే లింగమూర్తియై అంతర్ధాన మొందెను. బ్రహ్మాది దేవతలు ఆ లింగమూర్తి కడకేతెంచి, అత్యంత భక్తియుతులై, ఆయనను ఈ విధముగ స్థుతించుట నారంభించిరి.

"మహాదేవా! మీరు శివ, ఉగ్ర, రుద్ర, స్థాణు, వృషధ్వజులు. మీరే శ్మశానవాసి, సృష్టి సంహారకర్త అయిన శంకరులు. ఓ! భర్గా! నీలలోహితా! మీరే భూతవాహన, అవ్యయ, వరద, గిరీశులు. మేము భక్తి మేర మీకు ప్రణామములు అర్పించుచున్నాము. మీరే అనాది మధ్యలయులు, వేదవేద్యులు, యోగ సిద్ధులు, శివుడు, శాంతుడు అయిన పరబ్రహ్మామునకు ప్రణామములు. మీరే జటాధారి, కపర్ది, విద్యాశక్తి సంపన్నులయిన గిరీశులు. మీ అంత: స్వరూపము సాక్షాత్ జ్ఞానామృతము. మీ మనోదేహములు విశుద్ధములు. మీరు ఆది మద్యాంత రహితులు మరియు అగ్నిదేహులు. మీరు ప్రళయసముద్ర జలములందు విరాజిల్లు సంహారరూపులు. మీరు జ్వాలాజ్వల సంవృతాంగులు, జ్వలించుచున్న అగ్నిరూపులు. "ఓం"

కార ప్రణవము చే తెలియనగు పరమ పదార్థ స్వరూపులు, లింగరూపధారులు, శాంతులు, శివులు, మృడా! శర్వా! మీకు వేలకొలది ప్రణామములు. దయచేసి ప్రసన్నులు కండు. లోకనాథా! మహేశ్వరా! భూతనాథా! సర్వకారణ కారణా!! మీకు ప్రణామములు. దయచేసి ప్రసన్నులు కండు. మమ్ములను రక్షింపవలసినది. మీకు వేల వేల ప్రణామములు."

ఈ విధముగ దేవతలు ప్రార్థించిన మీదట పరమేశ్వరుడు అత్యంత శోకవిహ్వలుడై, చైతన్యహీనుడై వారి ఎదుట ప్రాదుర్భూతుడయ్యెను. ఈ విధముగ కనిపించిన హరుని గాంచి, విరించి స్వాంతన వచనములు ఈ విధముగ పలికెను "ఓ! హిరణ్యబాహూ! నీవే బ్రహ్మ మరియు విష్ణురూపము. సృష్టి, స్థిత్యంతములు కేవలము ఏకమాత్రముగ నీవే చేయుచున్నావు. అష్టమూర్తుల ద్వారా చరా చర ప్రపంచమంతయు వ్యాప్తి నొందినది నీవే! ఓ! మహాదేవా! కేవలము నీ ఆరాధన చే జీవి రాగద్వేషాది రహితుడై, సంసార విముఖత నొంది తత్వజ్ఞానము నొందును. మీ సేవనము ద్వారా ముముక్షువులు మోక్షలాభము నొందెదరు. ఓ! మహేశ్వరా! పంచ భూత వర్ధితము, సూర్య చంద్ర సమాన్వితము, నాడీత్రయ మధ్యమమునున్న పరతత్వము కేవలము నీ వశము నందున్నది. జ్ఞాన జలము చే వృద్ధి నొందు ఎనిమిది శాఖల ప్రకృతి వృక్షము యొక్క "తపస్సు" అనెడి పుష్పము కేవలము నీకు మాత్రమే ప్రాప్తము. యోగులు మూలాధారము నుండి అజ్ఞాచక్రము పర్యంతము వ్యాపించిన వాయువును అనాహతము నందు బంధించి, తమ హృదయ కమలము మధ్యన, రజ:తమో గుణాతీతమయిన ప్రసన్న తేజమును అవలోకింతురు. పరమ శివా! ఆ తేజము నీవే సుమా!! పూరక, కుంభక, రేచక రూప ప్రాణాయామము చే యోగులు సమస్త ఇంద్రియములు నిరోధించి, ప్రపంచాతీత శుద్ధ సత్వస్వరూపమయిన ఉజ్వల తేజమును అవలోకించెదరు. ఆ తేజము నీ నుండియే ఉద్భవించినది. తత్వజ్ఞానులకు అన్వేషణీయము, సాధ్యసాధన గుణగుణ వర్జితము, ఇంద్రియరూప చోరులచే అపహరింపబడినది అయిన అమూల్య నిధి నీవే!! ఈ నిధి కేవలము అరిషడ్వర్గాది దుర్గుణ త్యాగము చే మాత్రమే పొందదగినది. శంకరా! నీవు మాయా మోహితుడవైనావు. నీవు నీ హృదయమందున్న పరమాత్మను విస్మరించితివి. నీవు మాయను నీ నుండి వేరుగా తెలిసికొని, ఆత్మ సహాయత చే ధైర్యము వహింపుము. మహేశ్వరా! పూర్వము నేను మహామాయను ప్రార్థించి, అత్యంత ధ్యానరతుడవైయున్న నిన్ను అనేక యత్నములచే మాయాధీనుడను కావించితిని. కామ, క్రోధ, శోక, మోహ, లోభ, పరాత్మత (వేరొకరిని కోరుకొనుట), ఈర్ష్య, అహంకారము, సందేహము, దయ, అసూయ, నింద – ఈ పన్నెండు గుణములు చిత్తము నందలి మలములు. బుద్ధి నాశనమునకు ప్రధాన కారణములు. ఇవి మీ వంటి వారికి తగదు. శంకరా! క్రోధమును, శోకమును విడువవలసినది."

శంభుడు ఈ విధమయిన స్వాంత వచనములు విని, తన కర్తవ్యమును స్మరించుయు, సతీవిరహము చే ధైర్యము చిక్కబట్టలేక, అధోముఖుడై, బ్రహ్మ దేవుని చూచి హీన స్వరముతో "బ్రహ్మా! ప్రస్తుత కర్త్యమేమి? తెలుపవలసినది."

అంత దేవగణములు ఒక్కమారు శోక వినాశన వాక్యములు పలికిరి "మహాదేవా! మీరు శోకమునకు పాత్రులు ఎంతమాత్రము కారు. దయచేసి శోకమును విడువ వలసినది. మీ శోకముచే సమస్త దేవగణములు భయభీతులగుచున్నారు. శనైశ్చరుడు మీ అశ్రుకణములను గ్రహింపని ఎడల వానిచే భూమి సర్వము ఛిద్రమయ్యెడిది. మీ అశ్రువులను గ్రహించుట చే ఆయన సహితము కాలాంజన సదృశ కృష్ణవర్ణుడయ్యెను. పరమేశ్వరా! లోకాలోక పర్వత సమీపమున "జలధార" యను మహాపర్వతమున్నది. అయ్యది సుమేరు పర్వత సదృశము. పుష్కలావర్తాది ప్రళయకాల మేఘములు సహితము పద్మదళముల వలె ఆ పర్వతము చుట్టూ ఆవరించి యుండి జలపానము చేయుచుండును. ఇత: పూర్వము సముద్ర జలములన్నింటినీ పుక్కిట బట్టిన అగస్త్య మహర్షి సహితము మందరకంధరములనుండి ఇచటకు ఏతెంచి తపమాచరించును. అంతటి మహత్తర పర్వతముపై ఛాయామార్తాండ సంభూతుడు, శనైశ్చరుడు మీ భాష్పములను ధరింప లేక వదలెను. దానిచే ఆ పర్వతము విదీర్ణమయినది. అక్కడి నుండి సముద్ర తటము మరియు భూమి బీటలు వారి, ఆ భాష్పజలము నదిగా మారి తూర్పు సముద్రము వైపు పరుగులెత్తినది. ఏ విధమయిన నౌక, ద్రోణి, రథ, విమానముల ద్వారా పొంగులువారుచున్న

ఈ నదీ ప్రవాహమును దాటుట అసాధ్యము. ధరణి సహితము ఈ నదిని అతి కష్టముతో సహించుచున్నది. తన ఉత్తుంగ తరంగముల ద్వారా ఈ సరిత ఆకాశగమనలైన విహంగములను సహితము నాశనము కావించుచున్నది. ఈ నది రెండు యోజనముల విస్తీర్ణము కలదై తప్తజలకుల్యమై యున్నది. ఇయ్యది త్రిభువనములనూ భయభీతులను గావించు యమద్వారము వరకూ పరగులిడుచూ "వైతరిణి" గా పేరొందినది. మీ తీవ్ర నిశ్వాస రూప జ్వలన కారణమున, పర్వత, అరణ్య, ద్వీప, వృక్షములు సర్వనాశనమయినవి. ఇప్పటికీ అవి మెరుగునందలేదు. మీరు సతీశరీరమును భుజమునిడుకొని నడుచుచున్నప్పుడు మీ పదఘట్టనల చే ప్రతి అడుగునకూ ధరిత్రి విదీర్ణమై వ్యాకులమగుచున్నది. మీ క్రోధ, బాధలచే వ్యాకులత నొందని ప్రాణి ముల్లోకముల యందు లేదనిన అతిశయోక్తి కాదు! అందువలన మీరు ఒక్కమారు అంతర్దృష్టి గాంచి, మిమ్ములను మీరు తెలిసికొని, ఆత్మస్మృతి చే ధైర్యయుక్తులై, శోక, క్రోధ వర్జితులై, మాకందరకూ శాంతిని ప్రసాదింపమని ప్రార్థన." అంత చింతాకులుడు, అధోముఖుడయిన కపర్ది చతుర్ముఖ బ్రహ్మ దేవునితో "బ్రహ్మన్! నేను ఎంత వరకు సతీ విరహ శోక సముద్రము నందు మునిగియుందునో, అంత వరకు మీరు నా సహచరులై నా శోకమును నాశము కావింప ప్రార్థన. నేను ఎక్కడికి ఏగిననూ మీరు నాతో పయనించి, నాకు ఉపకారము చేయవలసినది." అంత బ్రహ్మదేవుడు "అట్లే అగుగాక" అని అంగీకరించి, ఆయనతో హిమాలయ పర్వతమునకు బయలుదేరెను. అది గమనించి నంది, భృంగి, ప్రభృతులు, సహితము వారిని అనుగమించిరి. వాసుకి మొదలగు అష్టనాగులు వివిధ ప్రాంతముల నుండి ఆక్కడి కేతెంచి శివుని శరీరమును అలంకరించినవి. అంత వారందరూ కలసి హిమాలయమున కేగిరి. హిమాలయము వారందరినీ చూచి అతిథి స్వాగత సత్కారములు ఆచరించెను. అంత పరమేశ్వరుడు గిరిరాజపురమున, ఔషధి ప్రస్తమున, ఆశీనుడై గౌతమ పుత్రి అయిన విజయపై దృష్టి సారించెను. అంత విజయ పరమేశ్వరాది దేవగణములందరికీ నమస్కారాదులర్పించి, తన పినతల్లి అయిన సతీదేవిని తలచుకొని ఇట్లనియె.

"మహాదేవా! మీ సతీదేవి ఎక్కడ? ఆమె లేమిచే మీరు ఇంచుక శోభించుట లేదు. ఓ! తండ్రీ! సతీదేవిని మీరు మరచిపోవచ్చుగాక! కానీ నా హృదయమందు ఆమె యొక్క స్మృతిని ఇంచుక కూడా మరువలేను. ఆమె క్రోధాన్వితయై, నా సమక్షముననే ప్రాణత్యాగము కావించినది. నేను శోకశూలము చే విదీర్ణమయితిని," అని పలికి తన పమిటను ముఖముపై కప్పుకొని తీవ్రముగ విలపింప సాగెను. భూతనాథుడు ముందుకు శోలి మూర్ఛితుడాయెను.

**(శ్రీ కాళికా పురాణమందలి శివ విషాద వర్ణనమను పద్ధెనిదవ అధ్యాయము సమాప్తము)**

# పంతొమ్మిదవ అధ్యాయము

**(శిప్రానదీ ఉత్పత్తి మరియు సంధ్య యొక్క తపస్సు)**

మార్కండేయుడు తిరిగి పలికెను "ఈ విధముగ అత్యంత దయనీయముగ విలపించుచున్న విజయను, స్మృతిని కోల్పోయిన భూతపతిని, ఇరువురినీ స్వస్థత కావించి, చతుర్ముఖ బ్రహ్మదేవుడు ఇట్లు స్వాంతన వచనములు పలికెను. "ఓ! పురాతన యోగి పుంగవా! ఇది మీ వల్ల ఉచితము కాదు. మీచే పొందదగిన వస్తువు కేవలము పరమాత్మ, పరంజ్యోతి మాత్రమే! మీరు రమణీధ్యానము నందు పున:సహితులగుచున్నారు. మీ స్వభావము పరమ శాంతము. అది స్థూల సూక్ష్మములకు అందనిది. యతీశ్వరులు అతీంద్రియ ధ్యానావస్థయందు దర్శించు ధ్యేయము, పరాత్పరము, నిర్మల, నిరంజన, రాగద్వేషాది గుణ వర్జితము, సర్వత్ర గమనశీలము అయిన పరంజ్యోతి ఏదియున్నదో, ఆ జ్యోతియే మీరు. అందువల్ల అంతర్దృష్టి ప్రసరించి, ఒక్కమారు మీరు మీ స్వస్వరూపమును తిలకింపవలసినది. శోక, లోభ, క్రోధ, మోహ,

హింస, అహంకార, దంభ, మద, ఆమోద, ప్రాపంచిక వస్తు ఆకర్షణ, ఈర్ష్య, అసూయ, సహింపులేకుండుట, అసత్యము, ఈ పదునాలుగు దోషములు బుద్ధి నాశకములు. యోగులు నిరంతరము మీ చింతనయే చేయుచుందురు. మీరే విష్ణు స్వరూపులు మరియు భువన విధాత. సతీరూపమున మిమ్ములను సహితము మోహపరచిన స్వరూపము లోకమోహనకారిణి అయిన మీ మాయాశక్తియే!! మహామాయ సర్వ ప్రాణులనూ గర్భస్థ దశ నుండియు పూర్వజన్మ జ్ఞానమును లుప్తపరిచి మోహితులను కావించును. ఈ శక్తియే ప్రస్తుతము మిమ్ములను శోకాతురులను కావించినది. పూర్వ కాలమందు ప్రతి కల్పము నందు ఈ పరిణామము జరిగినది. ఇప్పటికి మీరు వేలాది కల్పములందు వేలాది సతీదేవిలు నిర్జనమగుట కాంచిరి. వేలాది సతీదేవిలు మరణించిరి. మీరు జగత్ హితార్థము ప్రతియొక కల్పమందు మరియొక "సతి" ని స్వీకరించుచునే యున్నారు. ఎన్నిసార్లు సతీదేవి మరణించినది, మరియు ఎన్నిమార్లు మీరు విరహవేదనను అనుభవించితిరో, ఆ ఘటనలన్నింటినీ, మీరు అంతరావలోకనము చే పరిశీలింప వలసినది. ఆమె తిరిగి ఎక్కడ ఉద్భవించునో, ఎప్పుడు మీకు తిరిగి ప్రాప్తించునో, ఇవన్నియు కూడా మీరు ధ్యానమున తెలిసికొనవలసినది. ఈ విధముగ స్వాంతన వాక్యములు పలికి పరమేష్ఠి, పరమేశ్వరుని ఒక ఏకాంత నిర్జన ప్రదేశమునకు తీసికొని వెడలెను. అయ్యది హిమాలయ నగరమయిన ఔషధిప్రస్థమునకు పడమర యున్న "సిప్రా" సరోవర ప్రాంతము. నిర్మలము, మనోహరము, శీతల జలపూర్ణము, సర్వగుణ సంపూర్ణమయిన మానస సరోవర తుల్యము అయిన ఆ సరోవరమును చూడగనే సర్వదేవతా గణ హృదయములు కొంత తడవు స్వస్థత నొందినవి. జనులకు తృప్తి, ఆనందమును కలుగజేయు సిప్రా నది ఈ సరోవరము నుండే ఆరంభమయి, దక్షిణముగ పయనించి దక్షిణ సముద్రమునందు ఐక్యమగును. అనేక రకముల పక్షిగణములు ఆ సరోవర ఉపరిభాగమున విరాజమానమైయున్నవి. చక్రవాక పక్షుల జంటలు నాట్యము సలుపుచున్నవి. ఈ పక్షుల గమనము చే సరోవరము సమస్తము తరంగ యుక్తమగుచున్నది. సరోవర తీరము నందు కలహంసలు, సారస, కారండవములు, బారులు తీర్చి యున్నవి. సరోవరము నందలి పెద్ద పెద్ద చేపల కదలిక చే ఏర్పడిన తరంగముల తాకిడికి కొన్ని రకముల పక్షులు మనోహర భావ యుక్తముగ నాదములు కావించుచున్నవి. సరోవరము నందు వికసించిన కమలములు నాళికల గూడి, గగనమండలము తల్లక్రిందులై తారలు నేల రాలెనా? అన్నట్లు తోచుచున్నది. తెల్లని శతదళ పద్మముల మధ్య అక్కడక్కడ నీలికమలములు నక్షత్రమండల మందలి నీలిమేఘముల తోపించుచున్నవి. అక్కడక్కడ ప్రస్తుతించిన హంసలు కమలసహితములై చూపరులకు సర్వము కమలములమయమని తోచుచున్నది. విరించి సహితము అచటగల ఎరుపు, తెలుపు కమలముల గాంచి తన అరుణిమను, తన శ్వేత పద్మమును దిగదిడుపుగా భావించెను. శశాంకమౌళి సహితము ఆ శతదళ శ్వేత పద్మముల శుద్ధతను కాంచి, తన జటాజూటమునందున్న బాలచంద్రుని సహితము మలినమని తలచెను. చక్రధారుడు సహితము నలుదిక్కులా యున్న పద్మముల కాంచి అవన్నియు తన చక్రాయుధ కిరణములని తలపోసెను.

వివిధ పక్షిగణములకు ఆలవాలము, శత, సహస్రదళ శ్వేత పద్మయుతము, నీలి కమల సంయుతము, శుద్ధ స్ఫటికము వంటి జలరాశి మండితము అయిన సరోవర తీరమంతయు దేవదారు వృక్ష పరివృతమై, దేవదారు పుష్పపరాగ సుగంధ పరిలక్షితమైనది. అనేక ఔషధ, వనస్పతులతో నిండిన ఆ సరోవర తీరప్రాంతమును సరోవర సహితముగ వీక్షించిన పరమేశ్వరుడు క్షణ పర్యంతము శోకరహితుడై, చంద్రమండలము నుండి గంగ, సుమేరు పర్వతము నుండి జాంబూనది జాలువారునట్లు ఈ సరోవరము నుండి ఉద్భవించుచున్న సిప్రానదిని కాంచెను. ఆ సమయమున ఈ ఆఖ్యానమును వినుచున్న కమఠాది ఋషులు మార్కండేయుని "స్వామీ! ఈ సిప్రా సరోవరము ఎట్లు ఏర్పడినది? సిప్రానది ఎట్లు ఉద్భవించినది? ఈ సరోవర ప్రభావమేమి? ఈ విషయములన్నియు విస్తారముగ మాకు తెలుపవలసినది." అంత మార్కండేయుడు "ఋషులారా! మీరడిగిన వన్నియు వివరించెదను. వినవలసినది.

వశిష్ఠ మహర్షి అరుంధతీ దేవి వివాహసమయమున వాడిన నీరు సిప్రానదిగా ఉద్భవించినది. విష్ణుపదము

నుండి ఉద్భవించిన పుణ్యసరిత గంగ సాగరమున కలసినట్లు విధివశమున, పూర్వ నిర్దేశానుసారముగ సిప్రానది ఈ సరోవర ప్రవేశము కావించినది.

పూర్వకాలమందు విధాత దేవతల ఉపయోగార్ధము హిమాలయములందు "సిప్రా" అను సరోవరమును నిర్మించెను. వశిష్ఠారుంధతీ వివాహ సమయమున త్రిమూర్తులు "గాయత్రీ మంత్రము" "ద్రుపదాదివ" మొదలగు మంత్రోచ్ఛారణ కావించుచూ శాంతి కర్మాంతర్గతముగ జలప్రోక్షణ కావించిరి. ఆ జలమంతయు కలసి మానస పర్వత గుహలనుండి, సాగరము వంటి సిప్రా సరోవరము నుందు ప్రవేశించెను. ఇంద్రుడు ఇప్పటికీ శచీ, అప్సర సహితుడై ఈ సరోవరమందు క్రీడార్ధము విహరించును. ఇప్పటికీ దేవతలు ఈ జలాశయమును కంటికి రెప్పలా కాపాడుచుందురు. కొద్దిపాటి మహామునులు మినహా మానవమాత్రులెవరికీ అచట కేగుట అసాధ్యము. ముని గణములు తమ అనన్య సామాన్య తపఃప్రభావము చే ఆ సరోవరము చెంతకేగి, ఆ జలమే సేవించి, స్నానాదికములు కావింతురు. పరమ భాగ్యవశమున ఎవరేని మనుష్యుడు ఈ హ్రదము యొక్క నీటిని త్రాగినా, లేక స్నానమాచరించినా ఆతడు అద్వితీయ ఇంద్రియ శక్తియుతుడై అమరత్వము నొందును. ఈ జలాశయము వర్షాకాలమున ఉప్పొంగదు, మరియు గ్రీష్మమున క్షీణింపదు. అన్ని ఋతువుల యందునూ ఒకే విధముగ యండును."

వశిష్ఠ వివాహ సమయమున వారిచే ప్రోక్షణ చేయబడిన జలము ఈ సరోవరమందు ప్రవేశించినదని తెలిపితిని కదా! ఈ జలము నెమ్మదిగ వృద్ధినొంద నారంభించెను. అంత విష్ణుదేవుడు తన చక్రము చే ఈ గిరి శిఖరమును భేదించి ఆ జలమును ధరిత్రి పై ప్రవహింపజేసెను. అయ్యది పుణ్యసరితయై ధరణిపై ప్రవహించుచూ, మహేంద్ర పర్వతమును ప్రదక్షిణ గావించి సర్వులకు పుణ్య ప్రదానము గావించుచూ దక్షిణ సముద్రమందు కలియుచున్నది. ఈ నది సిప్రా సరోవరము నుండి ఉద్భవించిన కారణమున దీనికి "సిప్రానది" అని బ్రహ్మ దేవుడు పురాతన కాలమందే నామకరణము చేసెను. ఏ మనుష్యుడు కార్తీక పూర్ణిమ నాడు సిప్రానదీ స్నానము కావించునో, ఆతడు నిర్యాణానంతరము ఉజ్వల విమానారూఢుడై విష్ణులోకమున కేగును. ఎవరు కార్తీకమాసమంతయు ప్రతిదినము సిప్రానదీ స్నానము కావించిన ఎడల, దేహాంతరమున తొలుత బ్రహ్మలోకమున కేగి పిదప ముక్తినొందును.

అంత ఋషులు మార్కండేయుని "మహానుభావా! వశిష్ఠుడు అరుంధతిని ఎందుకు వివాహమాడెను? అరుంధతి ఎవరి కన్యక? ఈ తల్లి లోకమునందు అత్యంత పవిత్రతా శిరోమణిగా ప్రసిద్ధినొందినది. ఈమె తన పతియొక్క చరణద్వయము వినా వేరొక దృష్టి లేని శుద్ధాంతరంగ. ఈమె చరిత్ర, మాహాత్మ్యము వినినంత మాత్రమున స్త్రీలకు ఇహపరలోకములందు శుభపరంపరలు వర్షించును. ఈమెను అపవిత్ర జనులు మరియు మృత్యువు సహితము తేరిపార చూడలేరు. అందువలన ఆ వృత్తాంతమంతయు మాకు ఎరింగింపవలసినది." అంత మార్కండేయుడు సంతసించి ఇట్లు పలికెను.

"పూర్వ కాలమందు పరమేష్ఠి తన మనసు నుండి "సంధ్య" అను కన్యకను ఉత్పన్నము చేయగా, కాముడు తన బాణ ప్రయోగము కావించెనని తెలిపితిని కదా! ఆ సమయమున బ్రహ్మ మరియు ఆయన మానస పుత్రులు ఆమెను చూచి కామోద్రేకము నొందిరి. అంత పరమేశ్వరుని అధిక్షేపణము వలన తిరిగి స్వస్థతనొందిరి. అంత సంధ్యాదేవి తన వలన పరమేష్ఠి మరియు పరమ పవిత్రులయిన ఋషులు చిత్తచాంచల్యము నొందిరని భావించి మిక్కిలి దుఃఖము, లజ్జనొందినది. ఇంతలో శాపభయమున మారుడు, అధిక్షేపణమయిన పిదప శివుడు తన దారిన తాము చనిరి. అంత సంధ్య కోపోద్రిక్తత నొంది కన్నులు మూసుకొని క్షణకాలము ధ్యానించెను. ఆమె జన్మించుట తోడనే ప్రౌఢ వనితగా పరిఢవిల్లుట, బ్రహ్మ మరియు ఆయన మానస పుత్రులు ఆమెను వాంఛించుట, తాను సహితము వారి యందు కామ భావన పొందుట, ఇవన్నియు మన్మధ బాణ ప్రభావములని గ్రహించెను. తండ్రిని, సోదరులను చూడరాని చూపు తన

మనసునందు ఉద్భవించుట చే తనంత పాపచారిణి మరియొక స్త్రీ యుండదని తలంచి, ఈ పాప ప్రక్షాళణకై వేదవిధి ననుసరించి, అగ్నియందు ఆత్మాహుతి చేసికొందుకు నిర్ణయించెను. అంతేకాక ఈ సృష్టి యందు ప్రాణి గణములు పుట్టిన వెంతనే కామునికి వశీభూతము అవకుండునట్లు నియమము స్థాపించవలెనని నిర్ణయించి, ఇట్లు చేయవలెనన్న తొలుత తాను అత్యంత కఠోరతపమాచరించి, ఆ తప: ఫలితముగ నియమమును స్థాపించి అపుడు ఆత్మాహుతి కావించెదనని నిశ్చయించెను. తండ్రి, సోదరులను భర్తగా వాంచించిన ఈ శరీరమునకు ప్రయోజనము లేదని, అంతేకాక తాను చేసిన పాపకారణమున ఈ శరీరము పుణ్యసాధనకు ఉపయుక్తమవదని, పరిపరి విధములుగ యోచించి, నిశ్చయించి, చంద్రభాగానది ఉత్పన్నమయిన చంద్రభాగా పర్వత శిఖరమున కేగెను.

**(శ్రీకాళికా పురాణమందలి శిప్రానది యొక్క ఉత్పత్తియను పంతొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువదియవ అధ్యాయము

**(చంద్రుని శాప మోక్షములు; అరుంధతి ఉపాఖ్యానము)**

మార్కండేయుడు “ఈ విధముగ సంధ్యాదేవి చంద్రభాగా పర్వతమునకు ఏగిన పిదప, చతుర్ముఖ బ్రహ్మ తన సమీపమున ఆసీనుడయిన తన మానస పుత్రుడు, వేద వేదాంగ పారంగతుడు, కఠోర వ్రత పరాయణుడు, జ్ఞానయోగి, సర్వజ్ఞుడు అయిన వశిష్ఠుని తో ఇట్లనియె “వశిష్ఠా! ఈ కళ్యాణరూపిణి, సంధ్య, తపోభిలాష చే ఎక్కడికేగినదో అచటికి నీవునూ ఏగి ఆమెకు సవిధ దీక్షనిమ్ము. ఈమెకు మనపట్ల కలిగిన మనోచాంచల్యమునకు మిక్కిలి లజ్జితయై ప్రాణత్యాగము సహితము చేయగలదు. ఈమె తన తపశ్చర్య చే యమనియమ రహిత ఈ జగత్తుయందు తిరిగి ఆచార వ్యవహార నిమయపాలనాది కృత్యములను స్థాపించును. ప్రస్తుతము ఆమె చంద్రభాగ పర్వతమునకు తపశ్చర్యార్ధము ఏగినది. కానీ ఆమెకు తపస్సు నందు కొంచెము కూడా జ్ఞానము లేదు. అందువలన నీవు నీ ప్రస్తుత రూపము విడచి, ప్రచ్ఛన్న రూపము ధరించి, ఆమె వద్దకేగి తపస్సు యొక్క నియమములు, విధి విధానములు తెలుపవలసినది. నీవు ఇదే రూపముతో ఏగితివేని తిరిగి మిక్కిలి న్యూనత నొంది నీ నుండి ఏమియునూ నేర్చుకొనలేదు.”

వశిష్ఠుడు “వల్లె” యని, తనరూపు మార్చుకొని జటాధారియై, తరుణ బ్రహ్మచారి రూపు ధరించి, సంధ్యయున్న ప్రదేశమున కేగెను. ఆ సమయమున సంధ్య చంద్రభాగా పర్వతసానువుల నడుమ, మానస సరోవరమును పోలు ఒక స్వచ్ఛ సరోవర తీరమున కూర్చొని యుండెను. ప్రదోషవేళ చంద్రోదయము చే గగనమండలము ఎట్లు శోభించునో, అట్లే అరవిరిసిన కమలసహిత అయిన ఆ సరోవరము, సంధ్యాదేవి ఆ తీరమున కూర్చొని యుండుటచే అట్లే శోభించుచున్నది. వశిష్ఠముని సహితము ఆ సమీపమున కూర్చొని ఆమెతో సంభాషించుచూ కౌతుకముతో “లోహితము” అను ఆ సరస్సును తిలకించెను. అంతేకాక ఆ బ్రహ్మర్షి ఆ సరోవరము నుండి బయలుదేరి, విశాలగిరి సానువులను భేదించుచూ దక్షిణ సముద్రము వైపు పయనించు చంద్రభాగానదిని కాంచెను. అయ్యది హిమాలయ శృంగ సానువులను భేదించి బయల్వెడలిన గంగానది వలె సాగరోన్ముఖముగ ప్రవహించుచున్నది. ఈ వృత్తాంతమును వినుచున్న కమఠాది ఋషులు మార్కండేయుని “మహాత్మా! ఈ మహానది మరియు లోహిత సరస్సు ఎట్లు ఉత్పన్నమయినవి? దీనికి “చంద్రభాగ” అను నామధేయము ఎట్లు కలిగెను? ఈ వృత్తాంతమును మరియు ఈ పర్వత, సరితల మాహాత్మ్యమును మాకు తెలుపవలసినది.”

మార్కండేయుడు ‘‘మునులారా! మీరడిగిన విషయములన్నియు వివరించెను. దయచేసి వినవలసినది. హిమాలయముల సమీపమున నూరు యోజనముల పొడవు, ముప్పది యోజనముల ఎత్తు కలిగిన పర్వతము కలదు.

అయ్యది కుంద పుష్పము లేక చంద్రుని వలె శ్వేతవర్ణము కలిగినది. పూర్వకాలమందు పరమేష్ఠి జగత్కళ్యాణమునకై సుధానిధి అయిన చంద్రుని ఈ పర్వతముపై శుద్ధుని గావించి, దేవతలకు, పితరులకు హవ్య కవ్యార్థము విభజించెను. అందువలన అప్పటి నుండి చంద్రునకు వేరు వేరు తిథులందు వృద్ధి క్షీణతలు ఏర్పడినవి. ఈ విభజన జరిగిన కారణమున ఈ పర్వతమునకు "చంద్రభాగ" అని నామకరణము గావించిరి.

ఋషులు "మహాత్మా! కమలాసనుడయన చతుర్ముఖ బ్రహ్మ క్షీరసాగరము నుండి ఉత్పన్నమయిన అమృతము మరియు శశాంకుని దేవతాన్నము (హవ్యము) గ ఎందుకు మలచెను? అట్లే పితరుల కొరకై ఆయన కవ్యమును ఎందుకు సృష్ఠించెను? కమలాకరునికి వృద్ధి, క్షయములు ఎందుకు కలుగుచున్నవి? సూర్యుడు అంధకారమును పారద్రోలునట్లు మీరు మా సంశయములను రూపుమాపుట యందు తత్తుల్యులు. అందువలన మాఈ సంశయములను దూరమొనర్చ ప్రార్థన." మార్కండేయుడు తిరిగి పలుకుట నారంభించెను. "పూర్వకాలమందు దక్షప్రజాపతి తన ఇరువది ఏడు మంది కన్యలను చంద్రునకిచ్చి వివాహమొనరించెను. క్రతువు పూర్ణమయిన పిదప చంద్రుడు తన భార్యలను తీసికొని, దక్షుని అనుమతి నొంది తన స్థానమునకు చనెను. తదుపరి ఆయనకు రోహిణి యందు అనురాగమంకురించి నిరంతరము ఆమెతో కామకేళీ విలాసములందు మునిగి తేలుచూ, మిగిలిన పత్నుల వంక కనీసము కన్నెత్తి చూడకుండెను. అంత మిగిలిన దక్ష కన్యకలు చంద్రునికి మిక్కిలి సేవా భావముతో పరిచర్యలు కావించుచుండిరి. తాము ప్రతిదినము పరిచర్య అత్యంత ప్రేమాతిశయముతో కావించినప్పటికీ తమను ఎప్పటికీ గుర్తింపని చంద్రుని ఎడల వారు మిక్కిలి క్రోధితులైరి.

తదనంతరము వారి యుందు తొమ్మిది మంది దక్షపుత్రికలు – "ఉత్తర ఫల్గుణీ, భరణీ, కృత్తికా, ఆర్ద్రా, మఘ, విశాఖా, ఉత్తరాభాద్రా, జేష్ఠా, ఉత్తరాషాఢ" అత్యంత క్రోధము వహించి చంద్రుని కడకేగి నలుదిక్కులా మొహరించిరి. ఆ సమయమున చంద్రుని ప్రక్క వామభాగమున అనేక అలంకార శోభితయైన రోహిణిని కాంచిరి. శశాంకుడు రెప్పలార్పక కేవలము రోహిణిని మాత్రమే వీక్షించుచుండెను. రోహిణి యొక్క సౌభాగ్యమునకు మిక్కిలి రోసిల్లి, ఘృతము చే ప్రజ్వరిల్లు అగ్నివలె భయంకరముగ మండిపడిరి. అంత భరణీ, కృత్తిక, మఘ, ఉత్తరఫల్గుణీ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర కలసి రోహిణీదేవిని చంద్రుని ఒడి నుండి బయటకు లాగి క్రోధోద్రిక్తులై ఈ విధముగ కఠోర వాక్యములు పలికిరి. "ఓ! దుర్బుద్ధీ! నీవు జీవించి యుండగా ఈ శశాంకుడు మాపట్ల అనురాగ యుక్తుడవడు. అందువలన మా అందరి మంగళార్థము నిన్ను వధించెదము. నీవు ఋతుమతివి కానప్పటికీ, మా యందు ఋతువులు ఉన్నప్పటికీ ఈ కమలకాంతుడు మమ్ము కన్నెత్తి చూచుటలేదు. అందువలన నీవు మా అందరి గర్భదారణకు ప్రతి బంధకవై మహా పాపమును మూటగట్టుకొనుచున్నావు. అందువలన నిన్ను వధించుట చే మాకు ఇసుమంత పాపము అంటదు. ఈ విషయమై పూర్వకాలమందు బ్రహ్మ దేవుడు తన పుత్రులకు నీతి శాస్త్రము నుపదేశించుచూ పలికిన పలుకులు తెలిపెదము. వినుము. ఎవరేని ఒక దురాచారిని వధించిన ఎడల అనేక లోకులకు మంగళములు ప్రాప్తించునెడల, ఆ దురాచారిని వధించుట పుణ్యప్రదము. "సువర్ణ చౌర్యము, సురాపానము, బ్రహ్మహత్య, గురుతల్పగమనము, ఆత్మఘాతి" అను పంచ మహాపాతకములు కావించిన వానిని వధించుట పుణ్య ప్రదము."

సుధాకరుడు తన ప్రియపత్ని బందీకృతురాలై, ఆత్యంత భీతిల్లుట, మఘాది ఇతర పత్నులు మిక్కిలి క్రోధోద్రిక్తులగుట, అంతేకాక అన్నిటికీ మూలముగ తన తప్పిదము సహితము యుండుట, ఇవన్నియు ఆకళించుకొని, తొలుత రోహిణిని వారి నుండి విడిపించి, గాఢాలింగనము చేసికొనెను. అంత రోహిణీ దేవి సోదరీమణులు, సపత్నులయిన మఘాది పడుతులు చంద్రుని చూచి మండిపడి ఈ విధముగ పలికిరి. "ఓ! నిశానాథా! మీరు మేము చేయుచున్న కార్యమును ఆపితిరే! మీకు సిగ్గు గానీ, పాపభీతి కానీ లేదా! ఛీ! మీరు పూర్ణముగ అధములైరి. మేము నిరంతరము భక్తి భావముతో పతివ్రతాధర్మము ఆచరించితిమి. మీరు మమ్ములనందరినీ వదలి కేవలము ఒక పత్ని యందే రతులైరి. మీకు వేదమూలము

అవగతము కాలేదా? ధర్మ వాక్యములను ఒక్క పర్యంతము వినలేదా? వినినచో సజ్జనులకు విరుద్ధమయిన ఈ కార్యములను ఎట్లు చేయుచున్నారు? మేము మీకు ధర్మ సమ్మతముగ పెండ్లాడిన ధర్మపత్నులము. యథోచిత ధర్మకార్య నిరతులము. మాకు మాత్రము పతిసంగ సేవా ఇష్టములుండవా? ఓ! సుధాకరా! మేము దక్షపుత్రికలము."

"దక్షుడు నారదునితో ధర్మ ప్రసంగము కావించినపుడు మేము కూడా వినియుంటిమి. ఈ ధర్మ విశేషములను మీకు తెలిపెదము. వినుడు. ఎవరు అనేకులను వివాహమాడి, కేవలము ఒకరిపై మాత్రమే అనురాగము చూపించునో, ఆ పురుషుడు అత్యంత పాపి, అశౌచుడు, అయి వైదిక కర్మాచరణమునకు అనర్హుడగును. ఏ స్త్రీ తన భర్త నుండి సంభోగ సుఖమందదో, అటువంటి కష్టమునకు సాటి వచ్చునది మరి లేదు. ఏ అధముడు తన భార్య ఋతుమతి అయినపుడు ఋతుకాల సంభోగమాచరింపడో, వానికి భ్రూణహత్య పాతకము సంక్రమించును. పురుషుడు తన భార్య "ఆత్రేయ" అయినపుడు (ఋతు ఆరంభము నుండి మూడు దినముల వరకు) సంగమించునో ఆతడు విహిత కార్యాధికారము కోల్పోవును. పతివ్రత అయిన స్త్రీని పురుషుడు ఎల్లప్పుడూ సంతుష్టను కావింపవలెను. అందుచే భర్తకు అనేక మంగళములు ప్రాప్తించును. భార్య యొక్క దు:ఖము అత్యంత అమంగళహేతువు. ఏ గృహము నందు పతీపత్నులు ఎల్లప్పుడూ ఒకరినొకరు సంతోషపరచెదరో అచట నిత్యమంగళములు నిలిచియుండును. ఏ స్త్రీ సౌభాగ్యమదగర్వితయై, తన భర్తను సవతులతో సంగమము చేయనీయదో, ఆ స్త్రీ మరుజన్మము నందు వేశ్య అగును. అంతేకాక ఈ జన్మము నందు లోకనిందకు గురియై అధర్మమమును ప్రాప్తించును. ఆమె పుట్టింటి వారు, మెట్టినింటివారు సహితము స్వర్గము నొందలేరు. ఇటువంటి దుష్కార్యముల నాచరించిన సతీపతులు ఇరువురు అమంగళములు మూటగట్టెదరు."

రోహిణీదేవి తన సోదరీమణులు ఈ విధముగ అత్యంత నిష్ఠుర వాక్యములు కోపోద్రిక్తలై పలుకుట గాంచి, మరి మాటలాడ లేక మౌనము వహించెను. కానీ చంద్రుడు క్రోధ తామ్రాక్షుడై ఇట్లు శపించెను. "నా ఎదుట అత్యంత ఉగ్రభాషణము కావించిన కృత్తికాది నక్షత్రములు దేవ సమాజమందు ఉగ్ర లేక తీక్షణ కలహ కారిణులగుదురు. నా సమక్షమున అవినయ కారణమున మీరు తొమ్మిది నక్షత్రములు యాత్రా వర్జితములు అగును (ఈ నక్షత్రముల కాలమందు యాత్ర జరుపుట నిషిద్ధము). దేవతా, మర్త్యులు ఎవరైననూ ఈ సమయమున యాత్ర కావించిన ఎడల తద్దోష కారణమున వారు కార్యసిద్ధి నందక నష్టపడెదరు." ఇతర చంద్ర పత్నులందరూ ఈ విషయము నంతయు వీక్షించుచూ "ఈతని హృదయము కడు నిష్ఠురము. ఈతడు పాప హృదయుడు" అని రూఢి కావించుకొని, వారందరూ కలసి తమ తండ్రి అయిన దక్షుని కడకేగి గద్గద స్వరముతో ఇట్లనిరి "తండ్రీ! సుధాకరుడు ఎల్లప్పుడూ రోహిణీ ప్రియుడై విలసిల్లుచున్నాడు. మేము అత్యంత ఆదరముగ సేవ చేసిన పిదప కూడా మా వంక ఒక్క చూపు చూడడు. మేమందరము ఆయనకు పరస్త్రీల ముయితిమి. కూర్చొనినప్పుడు, విశ్రమించునపుడు, హాసలీలాకేళియందు, భోజన సమయమందు ఆయన కేవలము రోహిణితోనే సమయము గడపుటకు ఇష్టపడును. మేమెవరిమైననూ ఆయనకు ఎదురుపడిన మా వంక చూడక వేరొక వైపు చూచును. సాదర, సద్భావ, హాసముల మాటలేల? మా విభుడు మా ముఖము సహితము చూచుట కిచ్ఛగించుట లేదు. ఈ స్థితి యందు మా కర్తవ్యమేమి? మేము చాలా అనునయముగ సర్వము ఆయనకు విన్నవించితిమి. కానీ ఆ నిష్ఠురుడు మమ్ము శపించెను."

తన పుత్రికల దీనస్థితిని గ్రహించి, దక్షుడు వారిని వెంటబెట్టుకొని చంద్రుని వద్ద కేగెను. దూరము నుండే మహాముని అయిన దక్షుని ఆగమనము గాంచి, చంద్రుడు లేచి, ఆయనకు ఎదురేగి పాదాభివందనము కావించెను. అంత దక్షుడు ఒక సుఖాసనమున ఆసీనుడై నిశాపతిని గాంచి మధుర వాక్యములు ఇట్లు పలికెను. "తారాపతీ! నీవు బహుభార్యాయుతుడవు. అందువలన సర్వుల యందునూ సమాన గౌరవము చూపవలెను. ఎవరి యందునూ వైషమ్యము కూడదు. అందువలన నీవు దోషయుక్తుడవగుదువు. పత్నికి పతియొక్క కామానురక్త చే రతిసుఖము మరియు పుత్రఫలము

కలుగును. కామము సంసర్గము చే కలుగును. సంసర్గము ఆసక్తిచే, ఆసక్తి స్త్రీ చింతన చే, అయ్యది స్త్రీని చూచుటచే కలుగును. అందువలన నీ భార్యలందరినీ నీవు ప్రేమపూర్వకముగ ఆదరింప వలసినది. నీవు నా ధర్మపన్నములను ఆలకించి, ఆచరింపవేని సమాజము నందు నింద కు గురియై పాపివగుదువు." మహాత్ముడయన దక్ష ప్రజాపతి పలుకులు విని "అట్లే" అని ఆయనకు నమ్మబలికెను. దక్షుడు తన పురమునకు చనెను. దక్షుడు చనిన తక్షణము చంద్రుడు తిరిగి తన పూర్వ ప్రవర్తనను ఎంత మాత్రము మార్చుకొనక ఎప్పటివలనే ఎల్లప్పుడూ రోహిణీ కక్ష్య యందే గడుపు చుండెను. అంత మిగిలిన చంద్రపత్నులు తమ దుర్భాగ్యమునకు నిందించుకొని, కుపితలై, తిరిగి తమ తండ్రి వద్ద కేగి "చంద్రుడు తమ వద్దకు వచ్చుట లేదని, సదా రోహిణీ ఆసక్తుడై కాలము గడుపుచుండెనని" ఆక్రోశించిరి.

అంత మహాముని దక్షుడు కుపితుడై, హుటాహుటిన చంద్రుని వద్ద కేగి "నిశానాథా! నీవు సర్వపత్నుల ఎడల పతివలె సమానముగ వ్యవహరింపవలసినది. లేని ఎడల నిన్ను శపించెదను." అంత చంద్రుడు దక్షభయమున తిరిగి "వల్లె" యని, తాను తప్పక సర్వులనూ సమానముగ చూచెదనని వాగ్దానము కావించెను. తిరిగి దక్షుడు తన పురమునకు చనెను. చంద్రుడు తన వాగ్దానమును సంపూర్ణముగ మరచి తిరిగి రోహిణీ దేవితో విహరించుట నారంభించెను. అశ్వనీ మెదలగు ఇరువది ఆరు నక్షత్రములు చంద్రునికి అత్యంత అనురక్తలై ఆయనకు సర్వసేవలు కావించుట మొదలిడిరి. ఆయిననూ చంద్రుని మనసు ఇసుమంతయు మారకుండెను. ఈ నిరాదరణ, నిర్లక్ష్యమును కాంచి, చంద్రపత్నులు భయగ్రస్థులై, తిరిగి తన జనకుని కడకేగి "ముని ప్రవరా! సుధాకరుడు మీ ఆజ్ఞను సంపూర్ణముగ ధిక్కరించెను. ఇపుడు ఇది వరకటి కంటె మా పట్ల మరింత నిర్దయుడు, నిరాదరణుడయ్యెను. ఇక మాకు చంద్రుని వలన ప్రయోజనము లేదు. మేమందరము తపస్వినుల మగుదుము. మాకు తపోనియమములు తెలువవలసినది. లేనిచో మా శరీరములు శుష్కింపజేసికొని ప్రాణత్యాగము కావించెదము. ఇదంతయు మాఖర్మ. మాకు జీవించుట వలన కలుగు లాభమేమి?"

దక్ష ప్రజాపతి దు:ఖ విహ్వలులు, మలినాకృతి తో యున్న తన పుత్రికలను చూచి అగ్రహోదగ్రుడయ్యెను. ఆయన నాసికాగ్రభాగము నుండి భీషణమయిన యక్ష్మ రోగము ఉద్భవించినది. అయ్యది శరీరమంతయు రసికారుచున్న వ్రణములతో, నల్లని రంగుతో, స్వల్ప కేశములతో, భీషణ ముఖాకృతితో, హస్తమున దండము నిడుకొని, దక్షునికి నమస్కరించి ఇట్లనియె "మునివరా! నా కర్తవ్యమేమి? శలవీయవలసినది." అంత దక్షుడు "నీవు శీఘ్రమే చంద్రుని శరీరము నందు ప్రవేశించి అచట నివాసముండుము." అంత యక్ష్మరోగము చంద్రుని సమీపించి, సర్పము చీమలపుట్ట యందు ప్రవేశించునటుల ఆయన హృదయమును చేరి తుదకు శరీరమంతయు వ్యాపించెను. అంత చంద్రుడు అమిత మోహమున పడి శరీరమున అత్యంత దుర్బలతను అనుభవింప నారంభించెను. ఉద్భవించిన తక్షణము ఆ యక్ష్మరోగము రాజ లేక చంద్రుని యందు ప్రవేశించినది కావున అయ్యది "రాజయక్ష్మ" రోగమని ప్రసిద్ధి నొందినది. అంత చంద్రుడు గ్రీష్మము నందు కృశించు నదీ జలముల వలె దినదినమునకు క్షీణించి కృశించెను. చంద్రుడు ఓషధీపతి గావున, చంద్రుడు క్షీణించుట మొదలిడగనే ఓషధులు సహితము లుప్తమయ్యెను. ఓషధులు లేక యజ్ఞానుష్ఠానములు కరువయ్యెను. యజ్ఞములు లేక హవ్యములు లేవు. హవ్యము లేక దేవతలు క్షుధార్తులైరి. అందువలన మేఘములు వృష్టి హీనములు అయినవి. వృష్టి (వర్షము) లేక సస్యములు పండలేదు. అందువలన జనులకు తిండి లేదు. సమస్త లోకము దుర్భిక్షము చే నిండినది. దానధర్మములు మాటే లేదు. అంత ప్రజలందరూ సత్వహీనులై, దుర్బలులై, ఇంద్రియ లోలురై, దుష్కర్మయుతులై యుండిరి.

లోకుల యొక్క ప్రవర్తన గని ఇంద్రాది దేవతలు, దిక్పాలురు, నవగ్రహములు సప్త సాగరములు, క్షోభించిరి. సమస్త జగత్తు వ్యాకులమై దస్యు పీడితమగుట (దొంగల చే బాధింపబడుట) గాంచి ఇంద్రాది ప్రముఖ దేవతలు పరమేష్ఠి అయిన చతుర్ముఖ బ్రహ్మ దేవుని వద్దకు ఏగి, వందనమాచరించి, యథా యోగ్యమయిన ఆసనములందు ఆసీనులైరి.

విధాత సమస్తము కోల్పోయి, మ్లానవదనులైన ఇంద్ర, భృహస్పతి, అగ్ని, ఆదిగా గల దేవతలను చూచి ఇట్లనియె "దేవ ప్రముఖులారా! మీ ఆగమనమునకు కారణమేమి? ఎందువలన మీరందరూ దు:ఖితులై యుంటిరి?" అంత దేవ ప్రముఖులు "లోక పితామహా! ఎవరునూ యజ్ఞములు ఆచరించుట లేదు. ఇది వరలో బాధా, భయరహితులై యుండెడి ప్రజానీకమంతయు క్షయవ్యాధి పీడితులైరి. దానము, ధర్మము, తపము, వర్షము లుప్తమయినవి. భూమండలమంతయు జలహీన మయినది. ధాన్యములు, సస్యములు, ఔషధములు, ఓషధులు నష్టమయినవి. విప్రులందరూ దొంగలచే పీడింపబడు చున్నారు. ఎక్కడా వేద ధ్వని వినబడుట లేదు. అన్నము లేక జీవులు మృత్యువు నొందుచున్నారు. యజ్ఞ భాగములు లేక మేము క్షీణించుచున్నాము."

"చంద్రుడు వక్రగతిన నడచి, దీర్ఘకాలము నుండి రోహిణీ సహితుడై యుండి, వృషభరాశి యందు స్థితిగతుడై యున్నాడు. ఆతడు క్షీణించి జ్యోత్స్నారహితుడు అయినాడు. దేవతలు సహితము ఆతనిని వెదకి నప్పటికీ కానరాకుండెను. దేవసభకు సహితము దూరమయ్యెను. ఆతడు రోహిణిని విడచి ఎక్కడికీ కదలకుండెను. అప్పుడప్పుడు బయటకు వచ్చినప్పటికీ, ఆతడు సంపూర్ణ కళారహితుడై, కాంతి రహితుడై కానపట్టుచున్నాడు. ఆతని యందు కేవలము ఒక్క కళ మాత్రమే మిగిలియున్నది. అందువలన మేము దిక్కుతోచక మీ కడకు ఏతెంచితిమి. కాలకేయాది రాక్షసులు ఈ దుర్బలత తెలిసికొని, మాపై దాడి చేసి పీడింపక మునుపే మమ్ములను కాపాడవలసినది. స్వామీ! ఈ నియోమోల్లంఘనము, బాధ, అవరోధము ఎందువలన కలుగుచున్నవి? ఈ ఉపద్రవమునకు కారణమేమి?"

దేవతల యొక్క కథనము వినిన పరమేష్ఠి క్షణ పర్యంతము కన్నులు మూసికొని, అంతర్చక్షువుతో సర్వమునూ చూచి, గ్రహించి, సురశ్రేష్ఠునితో ఇట్లనియె "శచీపతీ! ఏ కారణము చే ఈ ఉపద్రవము ఆవిర్భవించినదో, ఎట్లు దీని నుండి బహిర్గతము అవగలరో అవన్నియు తెలిపెదను. వినవలసినది, అని చంద్రుడు యొక్క ఘాతుకము, చంద్ర పత్నుల విచారము, తొలుత దక్షుని అనునయము, పిదప దక్షుని శాపము, సర్వ వృత్తాంతమును వారికి వినిపించెను. రాజయక్ష్మము చే చంద్రకళలు క్షీణించుట, తత్ పర్యవసానముగ ఓషధులు మరియు సస్యముల లేమి, దానిచే యజ్ఞనాశనము, తద్వారా సమస్త ప్రజాక్షయము అగుట; ఈ సర్వము విరించి ఇంద్రాదులకు వివరించెను. బ్రహ్మదేవుడు "ఇపుడు ఏ ఉపాయముతో ఈ విపత్తు నుండి విముక్తులగుదురో అద్దానిని తెల్పెదను. వినుడు."

**(శ్రీ కాళికా పురాణమందలి చంద్రుని శాపమను ఇరువదియవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువది ఒకటవ అధ్యాయము

**(రాజయక్ష్మ రోగము నుండి చంద్రునికి ముక్తి)**

బ్రహ్మ దేవుడు "ఓ! సురగణములారా! మీరు తక్షణము దక్ష భవనమునకేగి ఎట్లయిననూ శశాంకుని తిరిగి పూర్ణుని గావించుటకు దక్షుని ప్రసన్నము కావింపవలసినది. చంద్రుడు పూర్ణుడయినచో తిరిగి ఓషధులు, సస్యములు వృద్ధియై, జనుల క్షుధా పీడనము తొలగి, యజ్ఞయాగాదులు తిరిగి ప్రారంభింపబడును. అందువలన మీకు శాంతి లభించును." మార్కండేయుడు తన ప్రసంగము కొనసాగించెను. "ఇంద్రాది దేవతలు ప్రసన్నచిత్తులై, వినీతభావులై దక్ష ప్రజాపతి గృహమున కేతెంచి, ప్రణామము లాచరించి మృదుమధురముగ ఇట్లు పలికిరి "మహానుభావా! పరమాత్మ ఒక మూర్తి రూపము స్వీకరించునపుడు, ఆయన యందలి జ్యోతి విప్రరూపిగా వెలుగొందును. అటువంటి విప్రరూపులయిన మీకు సాదర ప్రణామములు. మీరు సర్వ జగద్రక్షకులు, మరియు దక్షులయిన పరిపాలకులగుటచే "ప్రజాపతి" అను

నామము మీకు సార్ధకమయినది. అతీంద్రియులైన యోగి జనులు ఏ పరమాత్మను సంతతము చింతించుచుందురో, ఆ పరమాత్మ యొక్క సారభూతము మీరే!! స్వామీ! మమ్ము ఈ ఉపద్రవము నుండి ఉద్ధరింపవలసినది. మహాప్రభో! మమ్ము రక్షించండి! రక్షించండి!! రక్షించండి!!!

దేవతల స్థవము విని మిక్కిలి ప్రసన్నుడై దక్షుడు ఇంద్రుని చూచి "ఓ! మహాబాహూ మీ దు:ఖమునకు కారణమేమి? నా వలన ఏదేని కార్యము కావలెనన్న నిస్సంకోచముగ తెలుపవలసినది. నా శక్తి వంచన లేక ఆ కార్యమును పూర్ణము కావింతును." బ్రహ్మ తనయుడు, మహాముని అయిన దక్షుని పలుకులు విని ఇంద్ర, అగ్ని, బృహస్పతులు ఇట్లనిరి "ఓ! ద్విజవరా! మీ శాపవశమున మీ జామాత అయిన శశాంకుడు క్షీణించెను. దాని వలన ఓషధులు లేకుండెను. అందుచే యజ్ఞములు కొరవడినవి. యజ్ఞలేమి చే అనావృష్టి ఏర్పడి సస్యములు పండకుండెను. దాని వలన సమస్త ప్రజానీకము, జంతుజాలము ఖేదమునొందుచున్నారు. కొందరు క్షుదాబాధ నోర్వలేక ఆత్మాహుతి కావించుకొనుచున్నారు. దాని వలన సంసారము సర్వము నాశనమగుచున్నది. ద్విజోత్తమా! సప్త సాగరములు, సురమండలి, సమస్త పశుపక్షి గణములు, ఒకరేల? ఈనాడు సృష్టి మొత్తమున క్షోభరహితులు లేరనిన అయ్యది అతిశయోక్తి కాదు! యజ్ఞము లేక తపస్సు లేదు. మీరు శశాంకుని శపించిన మీదట సర్వ జగత్తుకు ఈ విధమయిన ఆపద ఏతెంచినది. అందువలన ఏదేని ఉపాయము చే లేక మీ అద్వితీయ తపోబలము చే చంద్రుని పూర్ణుని గావింప ప్రార్థన. చంద్రుడు పూర్ణుడు అయిన ఎడల తిరిగి సృష్టి చక్రమందు మున్ను చెప్పిన కార్యములు తిరిగి జరిగి ధరిత్రి సస్యశ్యామలమై జనులు, సురలు, సర్వులు సుఖానుభవము నొందెదరు.

అంద దక్షుడు ఆ సురల పలుకులు విని తీవ్రముగ యోచించి ఇట్లునియె "సుర ప్రముఖులారా! నేను చంద్రునికిచ్చిన శాపమును సంపూర్ణముగ తీసివేయలేను. కానీ నా పలుకులు సత్యమగునట్లు, శశాంకుడు వృద్ధి యగు ఒకే ఒక ఉపాయమున్నది. కానీ అది నెరవేరవలెనన్న సుధాకరుడు తన సర్వ పత్నులను సమానముగ చూచి గౌరవించవలెను. అపుడు శుక్లపక్షమందు వృద్ధి, మరియు కృష్ణపక్షమందు క్షయము కలుగును." దక్షుని పలుకులు విని సుర ప్రముఖులు ఆనందించి, దక్షుని అభినందించి, చంద్రుని గృహమున కేగి, చంద్రుని, ఆతని పత్నులను తీసికొని, పరమేష్ఠి వద్దకు పయనమయిరి. అచట బ్రహ్మదేవునకు దక్షుని ఆశ్వాశనమును వినిపించిరి. అంత చతుర్ముఖ బ్రహ్మ వారందరినీ తీసకొని చంద్రభాగా పర్వతమునకేగి సర్వజనుల హితార్ధమై "లోహిత సరస్సు" నీటిచే చంద్రుని స్నానమొనరించెను. భూత భవిష్యత్ వర్తమాన కాలద్రష్ఠ అయిన చతుర్ముఖ బ్రహ్మ ఇందువలననే పూర్వకాలమందు ఈ స్వచ్ఛ సుందర సరోవరమును సృష్ఠించెను. ఈ సరోవరమందు స్నానమాచరించుట చే ప్రాణులు సర్వరోగ శూన్యులై, చిరంజీవులగుదురు. స్నానమాచరించిన తక్షణము రాజయక్ష్మ రోగము శరీరము నుండి తొలగుట చే సుధాకరుడు తన పూర్వ తేజస్సును సంతరించుకొనెను.

అంత రాజయక్ష్మము నిస్పృహతో బ్రహ్మ దేవునికిట్లనియె "ఓ! పరమేష్ఠి! మీరు సృష్ఠికర్తలు. ఇపుడు నా కార్యమేమి? నాకు ఉండదగిన స్థానము, మరియు నాకు అనురూప అయిన భార్యను ప్రసాదింపవలసినది." ఆ సమయమున రాజయక్ష్మము చంద్రుని శరీరము నందు యుండుటచే, ఆయన శరీరమునందున్న అమృతమును పానము చేసి మిక్కిలి పుష్ఠి గా యుండెను. అంత బ్రహ్మ తన రెండు చేతులతో రాజయక్ష్మము రెండు భుజములు పట్టుకొని పర్వతముపై బలముగ విసరెను. అంత అద్దాని నుండి సమస్త అమృతము బయటకు వెడలెను. ఆ అశుద్ధ అమృతమును బ్రహ్మ క్షీర సాగరమున ఒక రహస్య ప్రదేశమున నిక్షిప్తమొనర్చెను.

రాజయక్ష్మ రోగము చే కేవలము నామమాత్రముగ మిగిలియున్న చంద్రుని పదిహేను కళలు, మరియు వెన్నెల, మరియు చంద్రుడు సేవించిన అమృతము, ఇవి అన్నియు రాజయక్ష్మ రోగము యొక్క గర్భము నుండి, బ్రహ్మ దేవుడు ఆ రోగమును విదిలించినపుడు బయటకు వచ్చినవి. చంద్రుని కళలు ఆ రక్కసి ఉదరమున చూర్ణమయినవి. అంత పరమేష్ఠి

దేవగణములన్నింటినీ తీరము వద్ద వదిలి, ఏకాకిగా క్షీరసాగరము ప్రవేశించి, చంద్రుని కళలను, వెన్నెలను, అమృతమును, సముద్ర జలములతో ప్రక్షాళన మొనర్చి, వానిని తీసికొని, చంద్రభాగా పర్వతముపైకి తిరిగి ఏతెంచెను. పిదప రాజయక్ష్మమును చూచి "నీవు ఏ వ్యక్తి రాత్రింబవళ్ళు, సంధ్యా సమయములందు, స్త్రీ లోలుడై, కామసుఖమును అనుభవించుచుండునో, వాని శరీరము నందు నివశింపుము. ఏ వ్యక్తి రొంప, దగ్గు, శ్వాశకోశముల రోగముతో యుండియు, మైధునము నందు ఆసక్తి కలిగియుండునో వాని శరీరము నందు సహితము నివాసముండుము. మృత్యుదేవత పుత్రిక అయిన "కృష్ణ" అను అతివ నీకు అనురూప. ఆమె నీకు నిత్యానపాయిని. ఆమెయే నీకు భార్య. మనుష్యులను క్షీణింపజేయుటయే నీ వృత్తి. నీవు ఎక్కడ నివసించెదవో వారందరూ క్షీణించెదరు. ఇక నీవు యదేశ్ఛగా ఎక్కడికయిననూ పొమ్ము. చంద్రుని జోలికి మరి రావలదు." బ్రహ్మ దేవుని పలుకులు విని రాజయక్ష్మము ఆయన ఆజ్ఞను ఔదల దాల్చి, ప్రణామ మాచరించి వారందరూ చూచుచుండగనే అంతర్థితమయ్యెను.

తదుపరి పరమేష్ఠి నామమాత్రావశేషముగయున్న చంద్రునికి చూర్ణమయిన పదిహేను కళలు, ఆతని జ్యోత్స్న (వెన్నెల) మరియు అమృతరాశిని సమర్పించెను. అంత సుధాకరుడు షోడశకళా పరిపూర్ణుడై, అత్యంత ఆనందముతో పితామహునికి ప్రణామము కావించి ఇట్లనియె "పరబ్రహ్మ స్వరూపా! పితామహా! నా శరీరము నందు ఇది వరకు ఉన్న ఉత్సాహము, బలము, వీర్యము లేకున్నవి. నా అంగ సంధులు విదీర్ణమయినవి. నేను ఇది వరకు వలె కార్యములు చేయలేను. ఈ విధముగ చేష్టా రహితుడనై ఎట్లుండగలను?" అంత బ్రహ్మదేవుడు "రాజయక్ష్మ రోగము చే నీ అంగ సంధులు శిధిలమయినవి. ఇప్పటికీ నీవు సంపూర్ణశక్తి లేదు. ఎందుకనగా రాజయక్ష్మము యొక్క ఉదరమునున్న నీ కళల చూర్ణము, వెన్నెల మరియు అమృతము, నేను బయటకు తీసి ప్రక్షాళన గావించినపుడు కొంత భాగము క్షీర సంద్రము నందు పడినది. ఆ భాగము నీ శరీరము నందులేదు. అందువలన నీకు ఇంకనూ అంగసంధులు శిధిలమై పూర్వ వీర్యబలములు లేకుండెను. ఏదయిననూ నీకు ఒక ఉపాయము తెల్పెదను. వినుము. దాని వలన నీకు నీ కష్ఠము దూరమగును. యజ్ఞము నందు మొదట ప్రాజాపత్యము, ఐంద్రము, ఆగ్నేయము, పురోడాశము అను నాలుగు ఆహుతులు ఈయవలెను. ఇవి యజ్ఞ నియమములు. ఇకపై నీ భోగార్ధము సహితము పురోడాశము ఈయవలెనని నియమమును ఏర్పరుతును. ఆ యజ్ఞ భోజనము చే నీకు తిరిగి శక్తి, ఉత్సాహము, వీర్యము, బలము కలుగను.

క్షీరసాగరమునందు పడిన నీ కళలు, జ్యోత్స్న (వెన్నెల) మరియు అమృతము వారి సంసర్గము చే పెరిగి వృద్ధి చెందును. స్వారోషిత మన్వంతరమందలి రెండవ సత్య యుగమున శంకరాంశ సంభూతుడు, ప్రచండ మార్తాండ సమానుడు, అత్యంత ఉగ్ర స్వభావుడు అయిన "దుర్వాసో" అను ఋషి పుంగవుడుదయించును. ఆయన దేవరాజయిన ఇంద్రుని అవినయ కారణమున సురాసుర పరివృతమయిన సమస్త భూమండలమును శ్రీహీనము (లక్ష్మీ సంపదనాశము) కావించును. నీ క్షయవ్యాధి చే ఎట్టి ఉపద్రవము వాటిల్లినదో, అప్పుడునూ దుర్వాసో శాపముచే అట్టి మహోపద్రవము సంభవించును. ఆ సమయమున త్రిమూర్తుల సహితముగ దేవదానవులు మంధర పర్వతమును కవ్వముగ చేసి, వాసుకిని తాడుగా చుట్టి, క్షీరసాగర మధనము కావించెదరు. నీ శరీరము నుండి విడివడిన అమృతాది భాగములు వృద్ధి నొందునని తెల్పితిని కదా! ఆ సమయమున అనేక ఓషధి సహితమై నీ శరీరమును సహితము క్షీరసంద్రము నందు పడవేయుదుము. ఆ మంధన సమయమున అమృతము బయల్వెడలును. అమృతోదయము తో పాటు నీవు కూడా పూర్ణారోగ్య వంతుడవై, పూర్వము వలె శోభింతువు. నీ శరీరము పూర్వ తేజస్సు, వీర్యము, బలమునొంది, అక్షయ సుధామయమై ధృఢ సంధి యుక్తమగును."

అటుపిదప దక్షుని పలుకులు జ్ఞప్తికి తెచ్చుకొని చంద్రుని పదహారు భాగములుగ విభజించి, మాసమును కృష్ణ, శుక్ల పక్షములుగ విభాగించి, శుక్లపక్షమందు వృద్ధినొందునట్లు, కృష్ణపక్షమందు క్షీణించునట్లు ఏర్పాటు కావించి

దేవగణములతో ఇట్లనియె "చంద్రుని పదహారవ కళ ఎల్లప్పుడూ శివుని శిరమున యుండును. అన్యకళలు కృష్ణపక్షము నందు క్షయరోగము లేకున్ననూ క్షీణంచును. ఆ సమయమున దినదినము తరుగుచున్న కళలు శశాంకమౌళి శిరమును చేరును. తేజస్సు సూర్యమండలమునకేగును. అమృతమును మీరు సేవింపవలిసినది. అమావాస్య నాడు మిగిలిన ఒక కళ ప్రథమ పాదమందు ఆకుపచ్చని ఆకుల యందుండి, ద్వితీయ పాదమందు రోహిణి వద్దకు ఏగును. తృతీయపాదము నందు సరస్వతీ నదికి ఏగి, స్నానమాచరించి సముజ్వలుడగును. చతుర్ధపాదమందు బలయుక్తుడై, రథహయ, సహితుడై సూర్యమండలము ప్రవేశించును. కృష్ణ పక్షము నందు ఎంత సమయము కళాక్షయము అయినదో, అంతే సమయము శుక్లపక్షము నందు కళా వృద్ధికి పట్టును. శుక్ల పక్షమునందు తిరిగి కళలు శివుని శిరము వద్ద నుండి, మరియు తేజస్సు సూర్య మండలము నుండి ఏతెంచును. శుక్లపక్షము నందు శశాంకుడు తన జోత్స్నా సహాయముతో తిరిగి అమృతమును ఉత్పత్తి చేయును. ప్రతి దినమునందు ఒక చంద్రకళకు వృద్ధికి గానీ, క్షయమునకు గానీ ఎంత సమయము పట్టునో ఆ సమయ పర్యంతము ఒక తిథి యుండును. ఈ క్షయ వృద్ధుల సమయము వేరువేరుగా యుండును. కొన్ని దినములు క్షయము/వృద్ధికి బహుసమయము పట్టును. లేదేని స్వల్ప సమయము పట్టవచ్చును. ఆ సమయము నాధారము చేసికొని తిధుల సమయమందు ఎక్కువ తక్కువలు యుండును.

చంద్రుని వినా హవ్య కవ్యములుండవు. అందువలన దేవతలందరూ చంద్రునిరక్షింపవలెను. పితృగణములు ప్రతిమాసము అమావాస్య నాటి అపహార్ణవేళ చంద్రకళాశ్వాదనము రోహిణీ గృహమందు చేయుదురు. ఈ కవ్యము చే పితృగణములు మిక్కిలి తృప్తి నొందెదరు." మార్కండేయుడు తిరిగి చెప్పదొడంగెను "తదనంతరము సమస్త దేవతలు చంద్రుని వృద్ధి, క్షయానుసారము సర్వ కార్యములు ఆచరింపదొడంగిరి. చతుర్ముఖ బ్రహ్మ మరియు దేవగణముల అత్యంత వినీత ప్రార్ధన మేర మహాదేవుడు శశికళాధారణ కావించెను. జన్మమృత్యు రహితము పరివర్తన శూన్యమయిన పరమతేజము (పరబ్రహ్మ స్వరూపము) ఏదియున్నదో, అదియే ఈ శంభుని శిరంబందున్న శశిరేఖ. యోగి జనులు అక్షయపరమానంద ప్రవేశమొనర్చునపుడు, వారి మనస్సు ఈ శశిరేఖ యందు లీనమగును. "శివశిరమందున్న శశిరేఖ యందు చిత్తము లీనమయిన ఎడల అయ్యది ముక్తి హేతువు," అనునది శృతి వాక్యము. అందువలన చంద్రుడు ముక్తి ప్రదాత. మహాదేవుడు సహితము ఈ విధముగ వివేచన చేసి క్షయవృద్ధి లేని శశిరేఖను తన జటాజూటము నందు ధరించెను.

చంద్రుని వెన్నెల స్పర్శచే ఓషధులు వృద్ధి అగును. ఓషధుల వలననే యజ్ఞము సంభవమగును. యజ్ఞము ద్వారా దేవతలు, పితరులు తమతమ హవ్య కవ్యములు గైకొనదరు. యజ్ఞము నందు ఉత్పన్నమయిన అమృతము కేవలము వెన్నెల ద్వారానే వృద్ధినొందును. లేనిచో క్షయమునొందును. అందువలన సుధాకరుడు యజ్ఞ, అమృతములకు అసామాన్య కారణము. దక్షశాపముచే బ్రహ్మదేవునికి ఇంత కర్మకాండ నాచరింపవలసి వచ్చెను.

ఇప్పటికీ కృష్ణ పక్షమునందు దేవతలు చంద్రుని సుధాపానము కావింతురు. చంద్రకళలు, తేజస్సు పైన తెలిపిన విధముగ ప్రవర్తిల్లును. మునిగణములారా! నేను (మార్కండేయుడు) మీకు (కమఠాదిమునులకు) చంద్రుని వృద్ధి, క్షయ కారణములు, దేవ పితరులకు భోజ్యములు, అన్నియు సవిస్తరముగ తెలిపితిని. ఏ మానవుడు ఈ ఉపాఖ్యానమును ఒక్కసారి వినునో, వారి వంశమందు రాజయక్ష్మ రోగము రాదు. ఒకవేళ ఆ రోగము ప్రాప్తించిన రోగి ఈ ఆఖ్యానమును వినిన ఎడల అతడు శీఘ్రమే రోగరహితుడగును. ఏ మానవుడు గుహ్యాతి గుహ్యమయిన పరమ పవిత్ర ఆఖ్యానమును ఒక్క పర్యంతము ఏకాగ్రముగ చదువునో ఆతడు అత్యంత పుణ్యమును మూటగట్టుకొనును.

**(శ్రీ కాళికాపురాణమందలి రాజయక్ష్మ రోగము నుండి చంద్రుని ముక్తి అను ఇరువది ఒకటవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువది రెండవ అధ్యాయము

**(అరుంధతీ దేవి జన్మ)**

మార్కండేయ మహర్షి తిరిగి చెప్పదొడంగెను "ఏ ప్రదేశము నందు పరమేష్ఠి దేవగణముల గూడి శశాంకుని పునర్నిర్మలుని గావించెనో అచట నుండి "సీత" అను దేవనది ఉత్పన్నమయినది. దేవగణములు బ్రహ్మదేవుని ఆదేశానుసారము శశాంకుని ఆ సీతా సరితయందు స్నానమాచరింపజేసి, అద్దాని నీరు త్రావించిరి. ఆ సీతా సరిత యొక్క నీరు చంద్రుని స్పర్శ తొడనే అమృతముగ మారి లోహిత సరోవరము నందు పడెను. ఆ సరోవరము నందలి అమృత జలము వృద్ధి పొందుట పరమేష్ఠి స్వయముగ కాంచెను. ఆయన దృష్టి తగులగనే ఆ జలము నుండి ఒక అపురూప సౌందర్యరాశి ఆవిర్భవించెను. చతుర్ముఖ బ్రహ్మ ఆ కోమలికి "చంద్రభాగ" అని నామకరణము చేసెను. ఆమెను సూర్య భగవానుడు పరమేష్ఠి అంగీకారముతో పత్నిగా స్వీకరించెను. తదుపరి చంద్రుడు తన గదాగ్ర భాగముచే ఆ పర్వతపు పశ్చిమ భాగమును భేదించెను. అంత లోహిత సరస్సు నుండి నీరు చంద్రభాగా నది రూపేణ సముద్రము వయిపు ప్రవహించెను. అంత సముద్రుడు ఆ సరితను తన పత్నిగా గైకొనెను. సాక్షాత్ గంగా సదృశము, అత్యంత గుణ యుక్తము అయిన చంద్రభాగానది ఈ విధముగ ఉత్పన్నమయినది.

పర్వతములకు, నదులకు కూడా రెండు రూపములు యుండును. సర్వసాధారణముగ అందరకు కనిపించు రూపమయిన పాషాణములు, నీరు. అది "స్థావరరూపము". కానీ వాని అంతరము నందు వాటికినీ మూర్తి రూపము యుండును. వానిని "జంగమము" అందురు. పర్వతముల యొక్క పాషాణ బాహ్యరూపము అంతరమూర్తి రూపమునకు పుష్టి, తృప్తి ఇచ్చును. పూర్వకాలమందు విష్ణుదేవుడు నదీ, పర్వతములకు కామరూపము ప్రసాదించెను. నదులందు జలము శూన్యమగుట చే నదులు దు:ఖితములు అగును. అట్లే పాషాణములు విదీర్ణమయిన ఎడల పర్వతములు సహితము క్షోభించును.

మార్కండేయుడు తిరిగి సంధ్యాదేవి చరిత్రను ఉటంకించుట నారంభించెను. ఈ లోహిత సరస్సు తీరమున వశిష్ఠుడు కామరూపుడై సంధ్యతో ముచ్చటించు చుండెనని తెలిపితిని కదా! వశిష్ఠుడు పలుకుచుండెను "భద్రా! నీవు ఎవరి కన్యకవు? నిర్జనమయిన ఈ పర్వతము పై నీ రాకకు కారణమేమి? గౌరాంగీ! నీవు ఏమి సాధించదలుచుకుంటివి? నీవు పూర్ణచంద్ర వదనవు అయినప్పటికీ, నీ ముఖము కాంతి హీనమై, విషణ్ణమై కానపట్టుచున్నది. ఈ విషయములు అతి రహస్యములు కానిచో దయచేసి నాకు తెలుపవలసినది." మూర్తీభవించిన బ్రహ్మ చర్యముతో, అగ్ని వలె జ్వలించుచున్న జటాధారి, మహాత్ముడు, తపోధనుడు అయిన వశిష్ఠ మహర్షిని కాంచి, సంధ్య సాదర దండ ప్రణామములు సలిపి ఇట్లనియె "మహానుభావా! ద్విజోత్తమా! మీ దర్శనము చేతనే నేనొచ్చిన కార్యము సఫలమయినదని తలంచుచున్నాను. హే! బ్రహ్మన్! నేను బ్రహ్మ మానసపుత్రికను. సంధ్యా నామధారిణిని. ఈ పర్వతము పై తపస్సు చేయుటకు ఏతెంచితిని. కానీ నేను తపో నిమిత్తమై ఏ దీక్షయు పొందలేదు. తపోదీక్ష గోపనీయము కానిచో దయచేసి నాకు తపోదీక్షను ప్రసాదింపవలసినది. తపస్సు వినా నాకు వేరొక ధ్యాస లేదు. ఆ విషయమునకై నా హృదయము ఆందోళితమగుచున్నది.

బ్రహ్మ మానస పుత్రుడయిన వశిష్ఠుడు తనకు మిగిలిన విషయములన్నియు ఏకరువు గనుక మరి ప్రశ్నలడగక, ఆమెను శిష్యురాలిగ గైకొని, తాను గురువై తపోవిషయములు ఇట్లు బోధింప మొదలిడెను. "కళ్యాణీ! ఎవరు మహాతపస్వియో, ఎవరు జ్యోతి స్వరూపుడో అట్టి పరమ ఆరాధ్యుడయిన విష్ణుదేవుని చింతింపుము. ఎవరు ధర్మార్ధ, కామమోక్ష చతుర్విధ పురుషార్ధములకు ఆదికారణమో, ఎవరు జగత్తుకు సహితము ఆదియో, ఆ అద్వితీయ పురుషోత్తముని భజింపుము. ఓ!

శుభాననా! చతుర్బాహువులందు శంఖ, చక్ర, గదా, పద్మధారి, శ్రీవత్స వక్షాంకితుడు, వనమాలి, కిరీట, కుండల, కేయూర, వలయాది భూషణ భూషితుడు, గరుడుని మూపుపైయున్న శతదళ శ్వేత పద్మాసీనుడు, సూర్య మండలాంతరస్థమయిన శుద్ధ స్ఫటిక సమానము లేక నీలిమేఘచ్ఛాయా స్వరూపుడు, సాకార నిరాకారమయుడు, నిత్యానందుడు, జ్ఞానగమ్యుడు అయిన విష్ణు భగవానుని ఈ మంత్రముతో ఉపాసింప వలిసినది॥" **॥ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం॥"** సర్వదా ఈ మంత్ర జపము కావించుచూ మౌనివై తపారంభము కావింపుము. ఇపుడు తపోవిధానమును వర్ణించెదను. నిత్యము మౌనివై స్నానము, పూజ కావింపవలెను. మొదటి ఆరుదినములు నిరాహారిగ యుండవలెను. కేవలము మూడవ నాటి రాత్రి, మరియు ఆరవ నాటి రాత్రి కొంచెము పర్ణజలము తీసికొనవలెను. తదుపరి మూడు దినములు జలపానము సహితము చేయరాదు. ఈ విధముగ తపస్సు మొదలుపెట్టి ప్రతి మూడవ రోజు రాత్రి కొంచెము భోజనము చేయవలెను. ఈ సమయము నందు వృక్ష వల్కలములు ధరించి భూ శయనము కావింపవలెను. ఇవన్నియు తపస్సు యొక్క అంగములు. ఇదియే మౌనతపము. దీనిచే అతి శీఘ్రముగ ఫలితము నొందెదవు. ఈ తపో సమయము నందు మాధవుని ధృఢముగ చింతన చేయుము. ఆయన ప్రసన్నుడై తొందరగా మనో వాంఛితమును ఈడేర్చును."

ఈ ప్రకారముగ వశిష్ఠుడు సంధ్యకు సవిధి తపోవిధిని ఉపదేశించి, అచటనే అంతర్హితుడయ్యెను. సంధ్య సహితము తపస్సు యొక్క భావభంగిమలను ఆకళించుకొని ప్రసన్నమయ్యెను. ఆ తన్వి బృహల్లోహిత సరోవర తీరమున వశిష్ఠుడు ఉపదేశించిన మంత్రమును అత్యంత భక్తి భావముతో అనుష్ఠించెను, అమిత ఏకాగ్రతతో గోవిందపూజనము తో నారాయణగత చిత్తయై తపము నందు మగ్నమయ్యెను. ఈ విధముగ చతుర్యుగములు గడచినవి. ఈ అద్భుత తపస్సు గాంచి లోకులు విస్మయులయిరి. ఇంతటి కఠోర తపము మున్నెన్నడూ ఎవరు చేసి ఎరుగరు. మానవ కాలమాణ ప్రమాణమున నాలుగు యుగములు గడచిన పిమ్మట మధుసూదనుడు సంధ్య ఏ విధముగ తనను భావించుచున్నదో, ఆ రూపము గైకొని ఆమె ఎదుట సాక్షాత్కరించెను. అంతేకాక ఆమె హృదయమున ప్రవేశించి, ఆమెకు దివ్యజ్ఞానము, దివ్య చక్షువులు, దివ్య వాచకము నిచ్చెను. అంత ఆ సాధ్వి కనులు విప్పి, ఆ మహానుభావుని గాంచి ఈ విధముగ స్థుతించెను.

"ఓ! పరాత్పరా! స్థూల సూక్ష్మ శరీరా! నిరాకారా! జ్ఞానగమ్యా! యోగిజనులు ఎవరిని తమ హృదయమందు ధ్యానించు చుందురో, అట్టి ఆత్మ జ్యోతి స్వరూపునకు నమస్కరించుచున్నాను. ఎవరు శివుడు, శాంతుడు, నిర్మలుడు, నిర్వికారుడు, జ్ఞానాతీతుడు, స్వయం ప్రకాశుడు, మార్తాండ స్వరూపుడు, తమస్సు యొక్క ఆవలి తీరమయిన శుద్ధ సత్వ స్వరూపుడు, అట్టి ప్రసన్నమూర్తికి నమస్కరించుచున్నాను. ఎవరు శుద్ధుడు, అత్యంత దీప్తిమానుడు, మనోహరుడు, చిదానందమయుడు, లక్ష్మీప్రదుడో, ఆ శ్రీమూర్తికి ప్రణామములర్పించు చున్నాను. పరమాత్మా! యోగిజనులు నీ నిత్య అజరామర అవ్యక్త సర్వవ్యాపక రూపమును అష్టాంగయోగ ప్రక్రియ ద్వారా చింతించుచూ, జ్ఞానయోగమరసి, అద్దానిచే పరమపదము నొందుచున్నారు. ఎవరు సాకారముగ గరుడనిపై సంస్థితులై, మనోహర నీల నీరద సన్నిభులై, శంఖ, చక్ర, గదాపద్మధారియై, యోగయుక్తులై పావనములకు సహితము పావనములై యున్నారో అట్టి నీకు ప్రణామములు. ప్రకృతి పురుషులు ఎవరి కార్యమునకు అంగములో ఎవరు స్వయముగ పంచభూతములు మరియు వాని గుణములో, ఎవరు జగత్తు సర్వమునకు ఆధారమో, అట్టి పరాత్పరుడవయిన నీకు మరల నమస్కారము. ప్రభూ! నీవు బ్రహ్మరూపమున సృష్టి, విష్ణు రూపమున స్థితి, రుద్రరూపమున సంహారము కావింతువు. ఎవరు పరమాత్ముడు, జగన్మయుడు, అక్షయుడు, అవ్యయుడు, పురాణపురుషుడు, కారణములకు కారణము, దివ్యామృత జ్ఞాన విభూతి ప్రదాత, సమస్త లోకములను మోహాంధకారమున ముంచు స్వయం ప్రకాశుడవయిన నీకు నమస్కారము. ఎవరి చరణముల నుండి ధరిత్రి, నేత్రముల నుండి సూర్యుడు, మనసు నుండి చంద్రుడు, ముఖము నుండి అగ్ని, నాభి నుండి అంతరిక్షము, ఆవిర్భవించినవో ఆ హరి స్వరూపము నీవే!! పరమాత్మా! శుద్ధ బ్రహ్మ స్వరూపమయిన పరతత్వవిద్యనీవే! నీవు ఆది మధ్యాంత రహితుడవు.

మనోవాక్కులకు పరమయిన అతీత తత్త్వమును నేను ఎట్లు స్తుతింపగలను? దేవ, దానవ, ఇంద్ర, బ్రహ్మాది దేవతలు, తపస్వులయిన ఋషి గణము, సహితము దర్శింపజాలని నీ మహద్రూపమును నేనెట్లు దర్శింపగలను? మహాప్రభూ! నీవు నిర్గుణుడవు. నేను సామాన్య స్త్రీని. నీ గుణములను నేను ఎట్లు కీర్తింప గలను? ఓ! జగన్నాథా! నీకు ప్రణామములు! ప్రణామములు!! ప్రణామములు!!!

అంత నారాయణుడు మృగచర్మ వల్కధారిణి, జటాజూటశోభిని, అయిన సంధ్యను అత్యంత కరుణార్ద్రత దృష్టితో వీక్షించి ఇట్లనియె "ఓ! బుద్ధిశాలినీ! నీ తీవ్ర తపము మరియు సుమధుర స్తవము చే నేను అత్యంత ప్రసన్నుడనైతిని. మనోవాంఛిత వరమేదైననూ నీకు ప్రసాదించెదను. కోరుకొనుము." అంత సంధ్య "మహాప్రభూ! నా తపస్సు చే నీవు ప్రసన్నుడవైతివేని తొలుత ఈ వరము ప్రసాదింపుము– "ప్రాణులు జన్మనొందిన మరుక్షణము నుండి కామభావన నొందురు గాక! కాలక్రమమున వారు యుక్తవయస్కులయిన పిదపనే వారికి కామభావము ఉత్పన్నమగు గాక!" నా ద్వితీయ వరము – నేను త్రిలోకములందుననూ అతి గొప్ప పతివ్రతగా ప్రసిద్ధి నొందవలెను. నాకు పతియందు తప్ప వేరెవరి పైననూ సకామభావన ఉద్భవించుకుండు గాక! నా భర్త నా యందు అత్యంత సహృదయుడై యుండుగాక! ఏ పరపురుషుడు నన్ను కామభావనతో చూచిననూ, ఆతని పురుషత్వము నశించి నపుంసకుడు అగుగాక!" అంత భగవానుడు "సాధ్వీ! ప్రాణులకు శైశవము, కౌమారము, యవ్వనము, వార్ధక్యము అను నాలుగు అవస్థలు యుండును. వారు కేవలము తృతీయావస్థ అయిన యవ్వనమందు ప్రవేశించు వరకు కామభావన నొందకుందురు. కొందరికి ద్వితీయావస్థ అయిన కౌమారము అంతమున ఈ భావన ప్రవేశించును. ఈ నియమమును నేను స్థాపించెదను. ఈ జగత్తు నందు నీకు అద్వితీయ పాతివ్రత్యము ప్రాప్తించును. నీ భర్త తప్ప వేరొక ఏ పురుషుడు నీపై కామభావన నొందిన తక్షణము ఆతడు నపుంసకుడు అగును. నీ పతి ఒక గొప్ప తపస్వి, మహాభాగుడై, నీ సహితుడై ఏడు కల్పములు జీవించును. ఈ విధముగ నీవు అడిగిన వరములన్నియు నీకు అనుగ్రహించితిని. అంతేకాక నీ మనసునందున్న నీ పూర్వ కోరికలను సహితము పూర్ణము కావించెదను."

"నీవు పూర్వకాలమందు నీ శరీరమును అగ్నికి ఆహుతి కావింపదలచితివి. సంధ్యా! నీవు తపస్సు నారంభించి చతుర్యుగముల కాలము గడచినవి. ఆ సమయమున సత్యయుగము గడచి, త్రేతాయుగము ప్రథమ భాగమన దక్షునికి కన్యలుదయించిరి. ఆయన ఒక ఇరువది ఏడు మంది కన్యలను చంద్రునికి భార్యలుగ సమర్పించెను. తదనంతరము ఆ కన్యకల కారణమున దక్షుడు చంద్రునికి శాపమొసంగెను. ఆ సమయమున సమస్త దేవగణము పరమేష్ఠి సహితులై ఇచట కేతెంచిరి. నీ తపోబలము వలన బ్రహ్మ వినా మిగిలిన దేవతలు నిన్ను దర్శింప లేకుండిరి. చంద్రుని శాప విమోచన హేతువు చే పరమేష్ఠి చంద్రభాగా నదిని సృష్టించెను. ఈ సమయమున "మేధాతిథి" అను మహర్షి ఆ సరితా తటమున "జ్యోతిష్టోమ యజ్ఞము" కావించుచుండెను. మేధాతిథి వంటి ఋషి నభూతో న భవిష్యతి. నీవు నా అనుగ్రహము వలన ఎవరికీ కనబడవు. అందువలన నీవు అక్కడకు చేరుకొని, నీ మనసుకు నచ్చిన పురుషుని మనువాడుటకై మనసున తలచుకొని, ఆ యజ్ఞకుండము నందు ప్రవేశించి దేహ త్యాగము చేయవలసినది." ఈ విధముగ పలికి నారాయణ ప్రభువు తన కళ్యాణ కరమయిన కరకమలము చే సంధ్యను తాకెను. అంత ఆమె శరీరము పురోడాశముగ మారెను. ఎందుకనగా మేధాతిథి మహాముని తన పవిత్ర యజ్ఞాగ్నిహోత్రము నందు మాంసమును అంగీకరింపడు. అందుచేత నారాయణుడు సంధ్య శరీరమును పురోడాశముగ మార్చెను. తదుపరి శ్రీహరి అంతర్హితుడయ్యెను.

సంధ్య మేదాతిథి యొక్క యజ్ఞమును చేరెను. నారాయణ వరప్రభావము చే ఎవరునూ ఆమెను దర్శింపలేకుండిరి. పూర్వకాలమందు తనకు తపోనియమములు నేర్పిన బ్రహ్మచారిని తనకు పతినొనర్పమని సంకల్పము చేసి ఆమె యజ్ఞాగ్ని యందు ప్రవేశించెను. తక్షణము ఆమె దేహము దగ్ధమై పురోడాశము యొక్క సువాసన నలుప్రక్కలా విస్తరిల్లెను. అగ్ని

ఆమె శరీరమును దగ్ధ మొనర్చి, విష్ణుదేవుని అనుమతితో సూర్యమండలమున స్థాపించెను. సూర్యుడు ఆ శరీరమును రెండు భాగములుగ విభజించి పూర్వ భాగమును ప్రాత:సంధ్య, అధో భాగమును సాయం సంధ్యగా మార్చెను. ప్రాత:సంధ్య సూర్యోదయ కాలమునకు పూర్వము ఆవిర్భవించి అరుణ వర్ణముతో ప్రకాశించుచూ దేవతలకు ప్రసన్నత కలిగించును. సాయం సంధ్య ఎర్ర కలువ వలె భాసించుచూ పితరులకు ఆనందము నిచ్చును.

విష్ణుదేవుడు సంధ్య యొక్క ప్రాణ వాయువును పట్టి, ఒక దివ్యశరీరమును తన మన:సంకల్పముతో సృష్టించి, అందు ఆ ప్రాణవాయువు ప్రవేశపెట్టి, మేధాతిథి యొక్క యజ్ఞాగ్ని యందు స్థాపించెను. తదుపరి మేధాతిథి యజ్ఞావసాన సమయమున తప్తస్వర్ణదేహినియై యజ్ఞాగ్ని మధ్య నుండి ఉద్భవించిన బాలికను తన కుమార్తెగా స్వీకరించెను. అంత ఆ మహాముని ఆ బాలికను యజ్ఞ జలము చే శుద్ధము గావించి అత్యంత ఆదరముతో తన ఒడిలోనికి తీసికొనెను. అంత ఆయన తన శిష్య సహితుడై ఆ బాలికకు "అరుంధతి" అని నామకరణము గావించెను. ఈ కన్య ఏ కారణము చేతనూ ధర్మ విరోధము కావింపదు. అందువలన అరుంధతి సార్ధక నామధేయురాలైయ్యెను. అనంతరము మేధాతిథి యజ్ఞమును పూర్ణము గావించి, అరుంధతిని పుత్రికగా పొందుట చే తాను కృతార్ధుడనైతినని సంతోషించి, శిష్య సమేతుడై తానే ఆ బాలిక యొక్క ఆలన, పాలన కొనసాగించెను.

**(శ్రీ కాళికా పురాణమందలి అరుంధతీ జన్మము అను ఇరువది రెండవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువది మూడవ అధ్యాయము

**(వశిష్ఠారుంధతుల వివాహము)**

మార్కండేయ మహర్షి తిరిగి పలుకుట నారంభించెను. "తదనంతరము అరుంధతీ దేవి చంద్రభాగా నదీ తీరమున గల "తాపసారణ్యము" అను ఆశ్రమమున శుక్లపక్ష చంద్రుని వలె దిన దిన ప్రవర్ధమానమగుచూ, పౌర్ణమి నాటి వెన్నెల వలె సర్వులనూ ఆనందింప జేయ సాగెను. నెమ్మదిగ అరుంధతీ దేవి బాలోచిత క్రీడలు సల్పుచూ, మేధాతిథి మహామునికి మహదానందము కలుగజేయుచూ, తన ప్రవర్తన చే ఆ ఆశ్రమ ప్రాంగణమును, నదీ తీరమును సహితము పరమ పవిత్రమొనరించెను. ఇప్పటికీ తపసారణ్య ప్రాంతమున అరుంధతీ కుండము నందు స్నానమాచరించు లోకులు విష్ణుపథము నొందెదరు. సంపూర్ణ కార్తీకమాస పర్యంతము విష్ణుభాగా నది యందు స్నానమాచరించు మానవుడు మరణానంతరము తొలుత విష్ణులోకమున కేగి తదుపరి ముక్తి కేగును. ఏ మనుష్యుడు మాఘ పూర్ణిమ, అమావాస్య తిధుల యందు ఒక్కమారు ఈ పుణ్య సరిత యందు స్నానమాచరించెనేని వారి వంశమందు ఎవరికినీ రాజయక్ష్మ రోగము సంభవింపదు. ఆ వ్యక్తి మరణించిన పిదప చంద్రలోకమునకేగి, తదుపరి విష్ణు లోకమున కేగును. అచట పుణ్యక్షయమయిన పిదప భూమి యందు తిరిగి పుట్టి గొప్ప వేదజ్ఞబ్రాహ్మణుడు అగును. చంద్రభాగా నదీ జలము త్రాగినచో చంద్రలోక ప్రాప్తి కలుగును. ఒక్కమారు విధి విధానముగ ఈ దివ్య సరిత యందు స్నానమాచరించిన యెడల వారికి అశ్వమేధ ఫలము లభించును.

కాలము ఎవరి కొరకు ఆగదు కదా! ఈ విధముగ బాలోచిత క్రీడలతో కాలము గడుపుచున్న చిన్నారి అరుంధతికి అయిదేండ్ల వయస్సు వచ్చెను. ఒకనాడు ఆ చిట్టితల్లి చంద్రభాగా నది యందు స్నానమాచరించి, పవిత్ర వల్కలములు ధరించి వచ్చి, తండ్రి చెంతన కూర్చుండెను. ఆ సమయమున ఆకాశమున పయనించుచున్న పరమేష్ఠి, బ్రహ్మ, ఆ చిరుతప్రాయమునున్న అరుంధతి కాంచి, ఆమెకు ఉపదేశము తీసుకొను సమయమాసన్న మయినదని గ్రహించి, భూమిపై

కేతెంచి, తపసారణ్య ఆశ్రమము ప్రదేశించెను. బ్రహ్మదేవుని గాంచి, అత్యంత వినీతులై మేధాతిధి మొదలగు ఋషులు ఆయనకు ఎదురేగి, ఆర్ఘ్య, పాద్య, ఆసనాదులు ఇచ్చి గౌరవించిరి. అంత పరమేష్ఠి ఇట్లనియె "మునిసత్తమా! ఈ అరుంధతికి ఉపదేశ సమయమాసన్న మయినది. స్త్రీ యోచిత యుక్తకర్మలు కేవలము స్త్రీలు మాత్రమే తెలుపగలరు. మీ ఆశ్రమమందు స్త్రీలు లేరు. అందువలన ఈ చిన్నారిని సతీ బహుళ, మరియు సతీ సావిత్రి వద్దకు పంపవలెను. మహామునీ! నీ కన్యక ఆ స్త్రీ మూర్తుల సంసర్గము చే అతి త్వరలో మహాగుణ సంపత్తిని ప్రాప్తించును. అంత మేధాతిధి "అట్లే" అని అంగీకరించి, బ్రహ్మదేవుడు చనిన పిదప, అరుంధతీ సహితుడై సూర్యలోకమున కేగి, అచట సూర్య మండలాతర్గత, పద్మాసనాశీన, అక్షమాలాధారిణి, అయిన సావిత్రీదేవిని చూచెను. ఆ సమయమున బహుళాదేవి మానస సరోవరమునకు చనెను. అంత సావిత్రీదేవి అరుంధతీ సహిత మేధాతిధిని కాంచి, లేచి, ఎదురేగి, వారిరువురినీ తీసికొని మానస సరోవరమున కేగెను.

ఆ సమయమున ఆ సరోవర తటమున సావిత్రీ, గాయత్రీ, బహుళా, సరస్వతీ, చారుపదా, ఈ అయిదుగురు దివ్యాంగనలు ధర్మోపాఖ్యానములను ఒకరికొకరు తెలుపుకొనుచూ, లోక హితమును అభిలషించు చుండిరి. తపోధనుడయిన మేధాతిధి సర్వలోకజననీ స్వరూపులయిన ఆ మహనీయమూర్తులను కాంచి, వేరు వేరుగా వారందరికీ నమస్సుమాంజలులు సమర్పించి, విస్మయుడై, వినమ్రుడై, భయపూర్వకముగ ఇట్లనియె "అమ్మా! సావిత్రీ, బహుళా! ఈ యశస్విని నా అనుంగు పుత్రిక. అరుంధతి నామధేయురాలు. ఈమెకు ఉపదేశము తీసికొను సమయము ఆసన్నమయినది. అందువలన ఇచటకు తీసికొని వచ్చితిని. ఈ మాట నాకు బ్రహ్మ నిర్దేశితము. ఏ ఉపదేశము చే ఈ బాలిక పరమ పవిత్ర సచ్ఛరిత అగునో అటువంటి శిక్షణ ఈ నా పుత్రికకు ప్రసాదింపవలసినది. అమ్మా! సావిత్రీ! బహుళా! మీరిరువురికీ శతకోటి ప్రణామములు. అంత ఆ దేవీ ప్రముఖులు ఇరువురు అరుంధతీ మేధాతిథులతో ఇట్లనిరి "ముని ప్రవరా! ఈ బాలిక చతుర్ముఖ బ్రహ్మ, మరియు విష్ణుదేవుల అనుగ్రహము చే తొలుతనే పుణ్య చరిత్ర. అయిననూ బ్రహ్మ దేవుని ఆజ్ఞానుసారము మేమిరువురము నీ కన్యకు శిక్షణ నిత్తుము. అందువలన ఈమె మరింత ధీరత్వమును సంతరించుకొనును. ఈమె తొలుత బ్రహ్మ మానస పుత్రిక. కానీ మీ తపో బలము చే మరియు నారాయణానుగ్రహముచే నీకు పుత్రికగా యజ్ఞము నుండి ఉ ద్భవించినది. ఈ కన్యక నీ కులమును పవిత్రమొనరించి, యశస్సును వృద్ధి నొందించును. ఈమె సమస్త దేవగణములననేల? సర్వ జగత్తుకు మంగళములనిచ్చును. అంత మేధాతిధి ఇరువురు మంగళ స్వరూపిణులకు వందన మొనర్చి, అరుంధతిని ఆశీర్వదించి, తన ఆశ్రమమునకు చనెను.

ముని ప్రవరుడు తన ఆశ్రమమునకు చనిన పిదప అరుంధతి ఆ మాత లిరువురితో అచటనే నివసింపదొడంగెను. అచట ఆమె అత్యంత ప్రేమతో సంరక్షింపబడుచూ, అమితానందముతో నివసింపసాగెను. ఒక్కొక్కమారు ఆమె సావిత్రీ దేవితో సూర్య లోకమునకు, బహుళా దేవితో ఇంద్ర లోకమునకు వెళ్ళెడిది. అరుంధతి ఆ దేవీ ప్రముఖుల వద్ద అత్యంత త్వరితముగ స్త్రీ కర్తవ్య కార్యములను, అత్యంత శ్రద్ధతో నేర్చుకొని వారిరువురి కంటెను శ్రేష్ఠవనితగా పరిణమించెను. కొంత కాలమునకు వికసించిన కమలము వలె అరుంధతి యవ్వనవతి అయ్యెను. ప్రౌఢ యవ్వన సంపన్న అయిన అరుంధతి ఒకనాడు మానస పర్వతమున ఏకాంతముగ చరించుచూ, పరమ మనోహర తేజ: సంపన్నుడయిన వశిష్ఠ మహర్షిని కాంచెను. నిష్ఠుర బ్రహ్మచర్య తేజోరాశి, బాలసూర్య సదృశ తేజశ్శాలి, అయిన వశిష్ఠుని చూచినంతనే ఆమె ఆయనను పతిగా వాంఛించెను. ఇంతలో వశిష్ఠుడు సహితము అద్వితీయ సౌందర్యరఖని అయిన అరుంధతిని కాంచి మనసునందు కామ భావనలు ముప్పిరిగొన తపము మరిచి, మరల మరల ఆమెనే వీక్షింప నారంభించెను. ఇట్లు వారిరువురు ఒకరినొకరు చూచుకొనుచూ సామాన్య మానవుల వలె మాన మర్యాదలు మరచిరి. అటు పిమ్మట తొలుత అరుంధతి, తదుపరి వశిష్ఠుడు తమ మనో ధైర్యమును చిక్కబట్టుకొని, మదోన్మాదమును అణచి, స్వస్థచిత్తులై వారి వారి

ప్రదేశములకు తరలి వెళ్ళిరి.

అరుంధతి మునిని వదలి తన కామోన్మాదమును నిందించుకొనుచూ సావిత్రీదేవి వద్దకు ఏతెంచెను. ఆమె తన మనమున "నేడు నా పాతివ్రత్యము మంటగలసినది." అని తలచు చుండెను. ఈ దు:ఖము చే ముఖము మ్లానమై శరీరమున కంపిత యై నడక గతి తప్పుచుండెను. ఆమె తన మనమున "సతీధర్మము కమలనాళము వలె సూక్ష్మము, మరియు కోమలము. ఇయ్యది కొంచెము వాయుభారము సహింపనోపదు. ఈ మర్యాద అల్పచంచలత్వము వలన కూడా నష్ఠమగును. ఇదియే సతీధర్మమని సావిత్రీ దేవి తెలిపినది. నేడు నేను పర పురుషాభిలాష చే అత్యంత ధర్మలోపము కావించితిని. నా ఇహ పరలోక గతులు ఏమగును?" ఈ విధముగ మనసున పరిపరి విధముల పరివేదన నొందుచూ మేధాతిధీ పుత్రి సావిత్రీ, బహుళాదేవిల వద్దకు ఏతెంచెను. వారిరువురు అరుంధతీ దేవి వదనము వివర్ణమగుట గమనించిరి. అంత వారిరువురూ ధ్యానము చే అంతర్ముఖులై అరుంధతీ వశిష్ఠుల పరస్పర దర్శనమును, కామోద్రేకమును, అరుంధతి యొక్క చింతనూ తెలిసికొని ఆమెతో ఇట్లనిరి "వత్సా! సూర్యకిరణ తాపము చే వాడిపోయిన కమలము వలె ఏల నీ ముఖ పద్మము వివర్ణ మయినది? నీల నీరద మేఘావృతమయిన చంద్రుని వలె ఏల నీ శరీరము మ్లానమయినది? ఏల నీ మనస్సు చింతాక్రాంతమయినది? ఒక వేళ అయ్యది రహస్యము కాని ఎడల, నీ మనస్సున గల సందియమును మాకు తెలుపవలసినది."

అంత అరుంధతీ దేవి లజ్జా భారము చే అవనిత శిరస్కయై మాతృతుల్య గురుజనని అయిన సావిత్రీదేవికి ఉత్తరువీయకుండెను. అంత సావిత్రీదేవి ఇట్లు పలికెనువత్సా! నీవు చూచిన మార్తాండ తేజశ్శాలి అయిన ఋషిసత్తముడు, బ్రహ్మ మానస పుత్రుడయిన వశిష్ఠుడు. ఆయన నీకు పతి అగును. మీ ఇరువురి దాంపత్య బంధనము విధాత ఇది వరకే నిశ్చయించెను. అందువలన నీవు వశిష్ఠుని కాంచినందున సతీత్వ లోపము జరుగదు. అందువలన నీ మనసున జనించిన కామోద్రేకము దోషము కాదు. అందువలన దు:ఖము విడువుము. ఓ! శోభనా! నీవు పూర్వ జన్మమందు కఠోర తపమాచరించి వశిష్ఠుని పతిగా వాంఛించితివి, అని పలికి ఆమెకు ఆమె యొక్క పూర్వ జన్మ రహస్యమంతయు విపులముగ విశిదీకరించినది. అంత అరుంధతి ఆ తల్లు లిరువురికి తన మనోభావములు పూర్ణముగ ఎరుక అని తెలిసి మరింత సిగ్గుతో తలవంచు కొనినది. అంతేకాక అదే సమయమున అరుంధతి తన జ్ఞాన బలముచే సావిత్రీ దేవి ఉటంకించిన తన పూర్వ జన్మమంతటినీ తిలకించెను. విష్ణుకృప చే పూర్వ జన్మమందు ఆమె దివ్య దర్శిని. కానీ ఈ జన్మమందు బాల్యావస్థ చే కొన్ని వత్సరములు తన దివ్యత్వమును విస్మరించెను. ఇపుడు దేవి కృప చే సర్వము అవగతమయినది. ఆమెకు పూర్వజన్మమందు విష్ణుదేవుడు ప్రసాదించిన జ్ఞానమంతయు స్ఫురణకు వచ్చెను. ఆమె మనస్సు అత్యంత ప్రమోదము నొంది, తొలుత మనసునందు యుంచిన చింతను సంపూర్ణముగ విడచెను. అంత సావిత్రీదేవి చింతారహిత అయిన అరుంధతి సహితయై సూర్య లోకమున కేగి, సూర్య భవనమందు ఆమెను యుంచి, తాను బ్రహ్మ సదనమునకేగి, పరమేష్ఠికి ప్రణామము లొసంగి ఇట్లనియె "జగదీశ్వరా! అరుంధతి మానస పర్వత శిఖరమందు మీ మానస పుత్రుడయిన వశిష్ఠుని కాంచెను. వారిరువురికీ పరస్పరము ప్రేమ అంకురించెను. వారిరువురూ కామోద్రేకమునకు లోనయినప్పటికీ, అకార్యము కావించుటకు మనసొల్లక, అన్యమనస్కులై, దు:ఖితులై, తమ తమ స్థానములకు చనిరి. ఓ! సురశ్రేష్ఠా! జరిగిన కార్యమిది. ఇపుడు జరుగవలసిన కార్యమును లోకహితార్ధము శుభప్రదమగునట్లు జరిపింప ప్రార్ధన."

లోక పితామహుడయిన బ్రహ్మ తన దివ్య చక్షువులతో భవిష్యత్ ను వీక్షించి, వశిష్ఠ, అరుంధతుల వివాహ శుభ ఘడియలు ఏతెంచెనన్న విషయము తెలిసికొని సావిత్రీ సహితుడై, వశిష్ఠ అరుంధతులు పరస్పరము వీక్షించుకొనిన మానస పర్వత శిఖరమునకు ఏగెను. పితామహుడేతెంచెనన్న విషయమరసి వృషధ్వజుడు, నందీ, భృంగి, సహితుడై

తానునూ ఏతెంచెను. బ్రహ్మదేవుని భక్తియుత ప్రార్థన చే శంఖ, చక్ర, గదా ధారి అయిన విష్ణుదేవుడు సహితము ఏతెంచెను. అంత చతుర్ముఖ బ్రహ్మ సంధ్యను సహితము రావించెను. అంత త్రిమూర్తులు నారదునితో "వత్సా! నీవు శీఘ్రమే చంద్రభాగా పర్వత సానువుల కేగి, అచట తపమాచరించుచున్న మేధాతిథిని మా ఆదేశానుసారముగ ఇచటకు తోడ్కొని రమ్ము." వెంటనే దేవర్షి నారదముని వాయువేగమున మేధాతిథి కడకేగి, త్రిమూర్తుల సందేశమును వినిపించి, ఆయనను తోడ్కొని వచ్చెను. ఇంతలో మానస పర్వత శిఖరమునకు ఇంద్రాది దేవతలు, మహాతపస్వులయిన ఋషులు, యక్ష, గంధర్వ, సిద్ధ, సాధ్య, విద్యాధర, కిన్నెర, కింపురుషులు, అన్య దేవగణములు తమ పత్నీ, అనుచరగణ సహితులై, సర్వులు అచటకు పిలువబడగా ఏతెంచిరి.

ఇంద్రాది దేవముఖ్యుల సభయందు పరమేష్ఠి మేధాతిథిని చూచి "ముని వర్యా! అత్యంత కఠోర వ్రత చారిణీ, నిర్మల మనస్క అయిన నీ సుతను వశిష్ఠున కిచ్చి వివాహమొనర్ప వలసినది. వారిరువురి దాంపత్య బంధనమునూ నేను ఇది వరలో నిశ్చయించితిని. ఈ శుభకార్యము మా త్రిమూర్తులకు ఆమోదయోగ్యము. ఈ కార్యము నీకు, నీ వంశమునకే కాక, సర్వలోకమునకు సహితము హితార్థము. అందువలన ఇక విలంబము చేయక వెంటనే ఈ కన్యాదాన మొనర్పుము". అంత మేధాతిథి అత్యంత ఆనందము నొంది "మీ ఆజ్ఞ ను నేను శిరసా వహింతును" అని పలికెను.

అంత మేధాతిథి దేవగణ పరివృతుడై, తన కన్యకను వెంటబెట్టుకొని, ప్రజ్వలించుచున్న అగ్ని వంటి తేజసంపన్నుడు, మూర్తీభవించిన బ్రాహ్మణ్యము చే శోభిల్లువాడు, బాలాదిత్య తేజస్వీ, అయిన వశిష్ఠుని వద్దకేతెంచెను. ఆయన ఆ సమయమున మానస పర్వత కంధరమందు తపమాచరించు చుండెను. అంత మేధాతిథి ఇట్లనియె "ఓ! బ్రహ్మనందనా! మహానుభావా! నేను ఈ సర్వలక్షణ లక్షితాంగి, సుధర్మవ్రత, కుసుమకోమలి అయిన నా కన్యకను మీకు కన్యాదానమున సమర్పించుచున్నాను. దయచేసి గ్రహింప వలసినది. ఈమె పరమ పతివ్రత. మిమ్ము ఛాయవలె అనుగమించి, మీరు ఏ ఆశ్రమమునకేగిననూ, అచట మీతో నివసించుచూ, అత్యంత వ్రతచారిణియై మీకు సేవలు చేయును." మేధాతిథి యొక్క పలుకులు విని వశిష్ఠుడు అచటకు త్రిమూర్తులు దేవగణ సహితులై, ఏతెంచుట గాంచి, కొంచెము విస్మితుడై, అరుంధతిని కాంచి, మనమున మోదము నొంది, అంతర్చక్షువుతో సర్వము గ్రహించి, అనంతరము తన జనకుడయిన బ్రహ్మదేవుని అనుమతి గ్రహించి "అవశ్యం భావి" అని అంగీకరించెను. వశిష్ఠుడు బ్రహ్మపద్ధతి ద్వారా అరుంధతిని పరిణయమాడెను. అరుంధతి పతిదేవుని చరణయుగళికి నమస్కరించెను.

అంత బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారము సావిత్రీ ఆది దేవీ ప్రముఖులు, ఇంద్రాది దేవతలు, దక్ష కశ్యపాది మహా ఋషులు, ప్రజాపతులు వశిష్ఠుని జలములందు శుభ స్నానము చేయించిరి. అనంతరము త్రిమూర్తులు సర్వతీర్థ జలములను స్వర్ణ కలశములందు తెప్పించి, మహర్షులు, దేవర్షులు ఉచ్చస్వరముతో గాయత్రీ మంత్రోచ్చాటనము, ద్రుపదాది ఆశీర్వాద మంత్రములు, ఋక్, యజుస్, సామవేద మంత్రములు ఉచ్చరించు చుండగా, ఆ సర్వతీర్థజలములు వారిపై ప్రోక్షించి అవభృత స్నానమును ఆచరింప జేసిరి. అనంతరము అరుంధతీ వశిష్ఠులను పట్టు వస్త్రములతో, అనేక మనోహర స్వర్ణమయ దివ్య హారాదులతో దివ్యముగ అలంకరించిరి.

నూతన వధూవరులకు బ్రహ్మదేవుడు సర్వలోకములకు అనాయాసముగ పయనించగలుగు దివ్య విమానములు, ఎల్లప్పుడూ స్వచ్ఛమయిన నీటితో నిండి యుండు కమండలమును బహూకరించెను. విష్ణువు వారికి సర్వదేవతలకు ఊర్ధ్వమున మరీచాది ప్రభృతులు యుండు దివ్యస్థలమును నివాసముగ ఇచ్చెను. మహేశ్వరుడు సప్త కల్పముల ఆయువును, అదితీ దేవి బ్రహ్మదేవుడు తన కొసంగిన దివ్య కుండలములను ఇచ్చెను. సావిత్రీ దేవి పరమ పాతివ్రత్యమును, బహుళా దేవి బహుపుత్ర లాభమును, ఇంద్ర కుబేరాదులు దివ్యరత్న సహిత రత్న రాశులను, మిగిలిన దేవతా గణము యథా యోగ్యమయిన బహుమతులు బహూకరించిరి. ఈ విధముగ దివ్యానంద దాయకముగ వశిష్ఠారుంధతులు వివాహమైన

పిదప పరమ సంతోషముతో పవిత్ర దాంపత్య జీవనము నారంభించిరి.

వీరి వివాహ సమయమున వీరు అవభృత స్నాన మాచరించితిరని తెలిపితిని కదా! ఆ శాంతి జలము తొలుత మానస పర్వత శిఖరములు, మరియు కంధరములందు పడి అచట నుండి ఏడు పాయలుగ చీలి, వివిధ హిమాలయ లోయలలో, గుహలలో, సరోవరములలో, ప్రవహించినది. విష్ణుదేవుడు ఈ జలమును ధరిత్రి పైకి పంపనెంచెను. అదిగో అప్పుడే కొంచెము జలము దేవభోగ్యమయిన శిప్రా సరోవరమందు పడి, అచటనే "శిప్రానదీ" ఉద్భవించినది. మరియొక పాయ మహాకౌశీ జలపాతము ప్రవేశించి ధరణిని చేరినది. ఇచట నుండే తదుపరి కాలమందు విశ్వామిత్ర మహర్షి కారణమున "కౌశికీ నది" ఉద్భవించినది. కొంచెము జలము ఉమాక్షేత్రమందలి మహాకాల సరోవరము నందు పడి, అచట నుండి "కావేరి నది" ఆవిర్భవించినది. హిమాలయముల దక్షిణ పార్శ్వము నందు పడిన జలము పరమ శివుని ప్రసాదము వలన గోమతీ శిలాఖండము నుండి ప్రవహించుట చే "గోమతీ నది" గా ప్రసిద్ధి నొందెను. మేనకా గర్భ సంభవుడయిన మైనాకుడు సహితము తన తండ్రి అయిన హిమాలయ శృంగ సన్నిభుడు, అత్యంత పవిత్రుడు. కొంచెము జలము ఈ మైనాకుని పై పడి అయ్యది "దేవిక" అను మహానది అయ్యెను. మహాదేవుడు ఈ నదిని సాగరోన్ముఖముగ దక్షిణముగ ప్రవహింపజేసెను. హంసావతార సమీప కంధరములందు పడిన జలము పరమ పవిత్ర సరిత అయిన "సరయు" నది గా రూపాంతరము చెందెను. ఖాండవ వన సమీపమున హిమాలయ దక్షిణ పార్శ్వపు కంధరములందు పడిన జలము "ఇర" అను సరోవరము నందు పడి "ఐరావతి" అను పుణ్యనదిగా భాసిల్లెను. దక్షిణ సముద్ర గామినులయిన ఈ నదులు మర్త్యలోక నివాసులకు (మానవులకు) స్నాన, పాన, సేవనార్థము పుణ్య సరిత అయిన "జాహ్నవీ" సమానములు. ఈ సమస్త నదీమ తల్లులు చిరకాలము ధరిత్రిపై ప్రవహించి ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థ ప్రదాయకములై యుండును. ఈ విధముగ ఏడు పాయలైన అవభృత స్నాన జలము నుండి ఏడు మహానదులు ఉత్పన్నమయినవి. ఇవి దేవతలకు సహితము సదా వందనీయములు.

అనంతరము వశిష్ఠుడు అరుంధతీ సహితుడై తన కొసగిన దివ్యవిమానము నధిరోహించి, తనకీయబడిన స్థానమునకు చనెను. కానీ ఆయన త్రిమూర్తుల ఆదేశానుసారము త్రిభువనముల హితార్థము, యుగ యుగముల యందునూ వేషభాషలు యథాయోగ్యముగ మార్చుకొనుచూ త్రై లోక్యములందునూ సంచరించుచుండెను. ఏ మానవుడు ఈ పరమ పవిత్ర ధర్మసాధకమయిన ఉపాఖ్యానమును ప్రతి దినము పఠించుచుండునో ఆ జీవి సర్వమంగళములు పొంది, చిరజీవియై, భోగ భాగ్య సంపన్నుడగును. ఏ స్త్రీ ఈ ఉపాఖ్యానమును శ్రవణము చేయునో, ఆమె ఈ లోకమునందు పతివ్రతయై, పరలోకము నందు స్వర్గలాభము నొందును. ఈ ఆఖ్యానము సర్వులకూ యశస్సు, కీర్తి, స్వస్థత కలిగించి పుణ్యవర్ధనము కావించును. ఈ ఉపాఖ్యానమును ఇతరులకు వినిపించు స్త్రీ, పురుషులకు దీర్ఘ జీవనము ప్రాప్తించును. పుంసవనము నందు దీనిని వినిపించుట చే పుత్ర జననము, యాత్రా కాలమందు కార్యసిద్ధి, శ్రాద్ధకాలమందు పితరుల ప్రసన్నత కలుగును.

మార్కండేయుడు "మునులారా! మీకు పుణ్యప్రదము, పాప నాశకము, ఆయుర్వర్ధకము, ఆరోగ్యకరము, గుహ్యాతి గుహ్యము అయిన అరుంధతీ ఉపాఖ్యానమును వినిపించితిని. ఏ మానవుడు విప్రసభ యందు ఒక్కమారైననూ, ఈ మహాపుణ్య చరితమును వినిపించిన ఎడల, ఆతడు పాపరాశి నుండి ముక్తి నొంది మరణాంతరము మునిగణ సహాయమున అమరత్వము నొందును.

**(శ్రీ కాళికా పురాణ మందలి అరుంధతీ వివాహమను ఇరువది మూడవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువది నాల్గవ అధ్యాయము

**(సంహార కధనము; శివుని అంతరము నుండి మాయతొలగుట మరియు శివుని తపము)**

మార్కండేయుడు “శివుడు సిప్రా సరోవర తీరమున ఆసీనుడై సిప్రా సరోవరమును అవలోకించుచున్నాడని తెలిపితిని కదా! ఆ సమయమున పరమేష్ఠి, పురుషోత్తములు ఇరువురు పరమేశ్వరుని ధ్యానమాచరింపమని పున: పున: అభ్యర్థించిరి. అంత మహాదేవుడు అంతర్చక్షువై ఆత్మ దర్శనార్థము ధ్యానము చేయుటకు యత్నించెను. బ్రహ్మాది దేవతలు ఇదిగాంచి పరమశివుని వ్యాకులతకు కారణము జగజ్జనని యొక్క మహామాయ అని తలంచి, శివుని చిత్తమును ధ్యానరక్తుని చేసి, శాంతుని, నిరంజనుని కావింపవలెనన్న మాయను నిర్వీర్యము కావింపవలెను. అందుకొరకు మనము జగన్మాయను ప్రార్థించి, ఆ కార్యము సాధించి, తిరిగి సతీదేవిని పున: జన్మింపజేయవలెను. ఎంతవరకు ఆమె శివుని అంకపీఠము చేరదో, అంతదనుక శివుడు శోకరహితుడై, నిర్గుణ పరబ్రహ్మమును ధ్యానింప వలెను. ఈ విధముగ తీర్మానించి, తమ కార్యసాధనకు జగన్మాయను ఈ విధముగ స్థవము చేయనారంభించిరి.

“ప్రకృతి స్వరూపా! స్థూల సూక్ష్మ కారణ శరీరా! జ్ఞానాజానా స్వరూపా! తుష్ఠి పుష్ఠి రూపిణీ! పరమపావనీ, క్షేమంకరీ! నిన్ను భక్తి శ్రద్ధలతో పూజించుచున్నాము. తల్లీ! నీవే శివా, శివకరీ, శుద్ధా, స్థూల సూక్ష్మ స్వరూపిణీ; నీవే విద్యా, అవిద్యా రూపిణివి మరియు ఏకమాత్ర యోగినివి. నీవే ధైర్యము, స్థైర్యము, మేధా, లజ్జారూపిణివైన సర్వవ్యాప్తి. నీవే ఆత్మ మరియు ప్రపంచరూపిణి. జగత్తుకు కాంతి రూపిణివి అయిన దివాకరుని కిరణ రూపిణివి నీవే. నీవే జగత్తు, జగత్కారణము మరియు జగదాధారము. నీవే జలము, నది, సాగరము. సర్వ జగత్తుకు ప్రాణాధారమయిన వాయువు నీ అంశయే! సర్వ ప్రసిద్ధము, వ్యాపకము, జగత్కారణమయిన పరంజ్యోతి నీ రూపమే! బ్రహ్మలోకము మొదలుకొని పాతాళము వరకు వ్యాపించిన ఆకాశము నీవే! కులపర్వత సహితము, అచలము అయిన ధరిత్రి నీవు మాత్రమే!! నీవే బుద్ధి, ఛందస్సు, వేదమాత గాయత్రీ, సావిత్రి, సరస్వతీ!!! వేదత్రయము, స్వర్గాది లోకములందు నివసించు దేవతల సుఖము, నీవే సుమా!!!!

తల్లీ! పుణ్య కర్మఫలమయిన లక్ష్మీ, పాపకర్మ ఫలమయిన అలక్ష్మీ, యాతన నీవే! నీతిజ్ఞుల యందలి తెలివి, శౌర్య స్వరూపుల ధైర్యము, సర్వుల యందలి శాంతి, శశాంకుని యందలి కాంతి, నీవే! నీవు సర్వ జీవుల జనని మరియు నారాయణుని సహితము మోహింపజేయు లక్ష్మీస్వరూపము. అమ్మా! నీవు పంచ భూతముల యందలి సారరూపమయిన తత్వరూపిణి మరియు త్రై లోక్యముల యందలి మహామాయ. సమస్త జనులను మోహమునందు ముంచెడు నిద్రా స్వరూపిణివి. పరమేశ్వరుడు సమస్త భూత కోటినీ, నీ సహాయము చేతనే సంసార చక్రమందు పరిభ్రమింపచేయుచున్నాడు. నీవు జయశీలుర యందలి జయము, పతివ్రతల యందలి లజ్జ, నీతిజ్ఞుల యందలి నీతి, సామవేదము నందలి గీతము/గేయము, మరియు యజుర్వేదము నందలి ఆహుతి. నీవు సర్వ దేవ గణముల జ్యోతిర్మయ శక్తి రూపిణివి. ఎవరు రజోగుణము చే ప్రపంచోత్పాదనము కావించెదరో, సత్వ గుణము చే సాక్షాత్కరించి వరములను ప్రసాదించెదరో అట్టి దివ్య మాతను మేము స్థవము చేయుచున్నాము. ఆ తల్లి మాకు మంగళములు ప్రదానము చేయుగాక! తల్లీ! నీవు మూల ప్రకృతివి. సంసార సాగర భీషణ తరంగముల చే జనులకు దు:ఖము కలిగించునది, మరియు అష్టాంగ యోగమను నౌకచే ఆ సాగర తరణము చేయించునది కూడా నీవే! నిద్రారూపములో త్రై లోక వాసులందరికీ వారి వారి జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు తుష్ఠి, పుష్ఠులు ప్రసాదించు శక్తివి నీవే! ఎవరు సృష్ఠి, స్థితి, లయలను లీలారూముగ, అవలీలగా కావించుచున్నారో, ఆ పరాశక్తి మమ్ములను ఎల్లప్పుడూ రక్షించుగాక! ఆమె మా యందు

ప్రసన్నమగు గాక!!"

అంత యోగమాయ దేవగణ స్థుతిని ఆలకించి, మహాదేవుని మది నుండి వెడలినది. మాయ తొలగిన అనంతరము మధుసూదనుడు శాంతి స్థాపనార్ధము పరమశివుని మనసు ప్రవేశించి ఆయనకు ప్రతి సృష్టి యందునూ కలుగు సృష్టి, స్థితి, లయలను ప్రదర్శించెను. సతీదేవి యొక్క ఆవిర్భావము, దేహత్యాగము, ఎట్లు ప్రతి కల్పము నందునూ జరుగుచుండునో, ఆ దృశ్యము నంతయు అంతరము నందు ఆయనకు చూపెను. ఈ విధముగ జగత్తు యొక్క బాహ్యాంతర స్థితి, వ్యక్తావ్యక్త స్వరూపము, సారరహిత వ్యవహారమంతయు, నెమ్మది నెమ్మదిగ, మరల మరల, మాధవుడు మృడునకు అవగతము కావించెను. అంత మహాదేవుడు సహితము సర్వమును కాంచి, సత్యమును తెలిసి, పరతత్వమును పరమాత్మ యందు మహానివేశము కావించెను. జగన్మాయ సహితము దేవతల అభ్యర్ధనను అంగీకరించి, అంతర్హిత మాయెను. అంత నారాయణుడు మహేశ్వరుని మనసును పరమపదమందు సుస్థిరమొనర్చి, సూర్యమండలము నుండి పూర్ణచంద్రుడు ఉదయించినటుల బయటకు ఏతెంచెను. అంత దేవగణ సహిత బ్రహ్మ, విష్ణులు తాము కృతకృత్యులమయితిమని తలంచి ప్రేమపురస్సరముగ మహాదేవునికి వీడ్కోలు పలికి తమ తమ స్థానములకు వెడలిరి. వారందరూ వెడలిన పిదప పినాకపాణి, వృషవాహనుడు ఒక వేయి దివ్య సంవత్సరములు తీవ్రతపము నందు మునిగెను.

అంత ఋషులు మార్కండేయుని ఇట్లు ప్రశ్నించిరి "మహాత్మా! పురుషోత్తముడు పినాకపాణి హృదయమున ప్రవేశించి ఏ ఏ విధములుగయున్న సృష్టి, స్థితి, లయలను దర్శింపజేసెను? కైటభహంత అయిన నారాయణుడు రజోగుణ సంభవమయిన సృష్టిని, మరియు అద్దాని సారశూన్యతను ఎట్లు ప్రదర్శించెను? ఆయన శివునకు సనాతన పరంజ్యోతి దర్శనము ఎట్లు కావించెను?"

మార్కండేయుడు "ఋషి సత్తములారా! సృష్టి ప్రతి కల్పము నందూ ఇంచుమించు ఒకే విధముగ జరుగును. నేను వరాహకల్పమున జరిగిన వృత్తాంతమును వివరించెదను. ఒక కనురెప్ప పాటు కాలము "నిమేషము". పద్దెనిమిది నిమేషములు ఒక "కాష్ఠ". మూడు కాష్ఠలు ఒక "కళ". మూడు కళలు ఒక "క్షణము". పన్నెండు క్షణములు ఒక "ముహూర్తము". మూడు ముహూర్తములు ఒక "అహోరాత్రము" (రోజు). పదిహేను అహోరాత్రములు ఒక "పక్షము". రెండు పక్షములు ఒక "మాసము". పన్నెండు మాసములు ఒక "వర్షము" (సంవత్సరము). రెండు మాసములు ఒక "ఋతువు". మూడు ఋతువులు ఒక "ఆయనము". ఆరు ఋతువులు, రెండు ఆయనములు లేక ఒక వర్షము (సంవత్సరము). ఆయనములు ఉత్తర మరియు దక్షిణ. వసంత ఋతువు – చైత్ర, వైశాఖ మాసములు; గ్రీష్మ ఋతువు – జేష్ఠ, ఆషాఢ మాసములు; వర్ష ఋతువు – శ్రావణ, భాద్రపద మాసములు. శరదృతువు – ఆశ్వియుజ, కార్తీక మాసములు; హేమంత ఋతువు – మార్గశీర్ష, పుష్య మాసములు; శిశిర ఋతువు – మాఘ, పాల్గుణ మాసములు. మానవుల ఒక మాసము పితరులకు ఒక అహోరాత్రము (రోజు). కృష్ణ పక్షము పితరులకు దినము మరియు శుక్ల పక్షము రాత్రి. అందువలన పితృకార్యములు కృష్ణ పక్షమందే చేయవలెను. మానవుల ఉత్తరాయణము దేవతలకు పగలు. దక్షిణాయనము వారికి రాత్రి.

మానవ కాలమానము ప్రకారము సత్యయుగము పదిహేడు లక్షల ఇరువది ఎనిమిది వేల సంవత్సరములు. ఇందు నాలుగు వందల వర్షములు యుగసంధి మరియు నాలుగు వందల వర్షములు సంధ్యాంశముగ వర్ధిల్లును. త్రేతా యుగము పన్నెండు లక్షల తొంభై ఆరువేల వర్షములు. ఇందు మూడు వందల వర్షములు యుగ సంధి మరియు మూడు వందలు సంధ్యాంశము. ద్వాపర యుగము ఎనిమిది లక్షల అరువది నాలుగు వేల వర్షముల పరిమాణము. ఇందు రెండు వందల వర్షముల యుగసంధి మరియు రెండు వందల వర్షములు సంధ్యాంశము. కలి యుగము నాలుగు లక్షల ముప్పది రెండు వేల వర్షములు. ఇందు వంద వర్షములు యుగ సంధి మరియు వంద వర్షములు

సంధ్యాంశము. ఈ నాలుగు యుగములు కలిపి ఒక మహాయుగము అనబడును. అద్దాని పరిమాణము నలుభై మూడు లక్షల ఇరువది వేల మానవ సంవత్సరములు. మానవుల ఒక వర్షము దేవతలకు ఒక అహోరాత్రము (రోజు). ఈ గణన ప్రకారము మానవుల ఒక మహాయుగము దేవతలకు పన్నెండు వేల దివ్య వత్సరములు. మనుష్యుల కాలమానమందు యుగసంధి, సంధ్యాంశలు యుండును. వారి వారి పాప పుణ్యములను బట్టి సత్య, త్రేతా, ద్వాపర, కలియుగములు, మరియు వాని విధి విధానములు యుండును. కానీ యుగభేద పరిణామము, యుగసంధి, సంధ్యాంశలు దేవ గణములందు, దివ్య వర్షములందు యుండవు.

మానవుల మహాయుగము దేవతలకు ఒక యుగము, అనగా పన్నెండు వేల దివ్య వత్సరములు ఒక "దేవయుగము". డెబ్బది యొక్క దేవయుగములు ఒక మన్వంతరము. రెండు వేల దేవయుగములు బ్రహ్మ దేవునికి ఒక అహోరాత్రము (రోజు). బ్రహ్మ దేవుని ఒక్క పగలు నందు పదునాల్గు మన్వంతరములు యుండును. అంతే సమయము బ్రహ్మ యొక్క రాత్రి కూడా యుండును. ఆ సమయమున ఆయన విశ్రమించును. బ్రహ్మ దేవునకు మూడు వందల అరవై అహోరాత్రములు (రోజు) ఒక సంవత్సరము. పరమేష్ఠి బ్రహ్మకు ఏబది వత్సరములు ఒక "పరార్ధము". బ్రహ్మ యొక్క ఒక పరార్ధము ఈశ్వరునకు ఒక పగలు. అట్లే మరియొక పరార్ధము ఆయనకు రాత్రి. బ్రహ్మదేవునకు వంద సంవత్సరములు అయిన పిదప ఆయన లయీభూతుడగును. పరమేష్ఠి పరబ్రహ్మము నందు విలీనమయినపుడు జగత్తుకు ప్రాకృతిక ప్రళయ మేతెంచును. జగత్స్వరూపుడు, అక్షయుడు, అవ్యయుడు, స్థూలమునకు స్థూలుడు, సూక్ష్మము కంటె సూక్ష్మతముడు, అయిన పరమాత్మ యందు పగలు, రాత్రి, సంవత్సరము అను వ్యవహారము పొసగదు. కానీ మానవుల మనుగడ కొరకై పూర్వీకులు ఈ ఏర్పాటును కావించిరి.

బ్రహ్మ, పరబ్రహ్మము నందు లీనమయినంతనే జగత్తు అంతయు పరబ్రహ్మమందు విలీనమగును. బ్రహ్మ కాలము పూర్ణమయినంతనే రుద్రరూపి అయిన జనార్ధనుడు జగత్సంహారము కావించి తానునూ పరబ్రహ్మమందు లీనమగును. ఆ సమయమున ప్రధమత: ఒక్క ఆదిత్యుడు, ద్వాదశాదిత్యులుగ మారి, తన కిరణముల తీవ్రతను పెంచి, సమస్త జగత్తు నందలి జలమును పీల్చి వేయును. ఒక వంద దివ్య వర్షముల అనంతరము స్థావర, జంగమాత్మక ధరిత్రి మరియు స్వర్గము సర్వము జలహీనమై శుష్కించి చూర్ణమగును. అంత రుద్రరూపి అయిన జనార్ధనుడు త్రిశూల ధారియై, పాతాళము ప్రవేశించి సమస్త దేవ, ఋషి, నాగ, గంధర్వ, రాక్షసాదులను వధించును. వీరినే కాక సమస్త ప్రాణి కోట్లను దునుమాడి సంహరించును. అంత రుద్రుడు తన ముఖము నుండి అతి తీవ్రమయిన మహావాయువును సృష్టించును. ఆ వాయువు మహావేగమున వంద సంవత్సరములు పరిభ్రమించి అంతకు మునుపే చూర్ణమయిన బ్రహ్మాండమును ద్వాదశాదిత్యుల యందు ప్రవేశపెట్టును. అంత ఆ మహాప్రభంజనము ఆదిత్యుల యందు ప్రవేశించి విశేష, విశాల, నీలనీరద మేఘములను ఉత్పన్నము చేయును. అంత భయంకర దళితాంజన సమాన మేఘములు కొన్ని రక్తవర్ణ, ధూమ్రవర్ణ, నీలి వర్ణ యుతములు, పర్వత సమానములై, భీషణ, భీకర గర్జనలు కావించుచూ, ఉరుముల, మెరుపులతో వంద సంవత్సరములు ఏనుగు తొండముల వంటి జలధారలు వర్షముగ కురిపించి, త్రిలోకములను జలమయము కావించును.

ధృవ లోకము వరకు సర్వము నీటిచే నిండిన పిదప రుద్రరూపి అయిన జనార్ధనుడు తిరిగి తన ముఖము నుండి వాయువును పూరించును. అద్దానిచే అలుముకొన్న మేఘములన్నియు పటాపంచలగును. మేఘములు వినష్టమయిన పిదప రుద్రుడు కఠోర రూపియై సత్యలోకము (బ్రహ్మ లోకము) మరియు జన లోకములను సహితము సంపూర్ణము నాశమొనర్చును. పిదప ద్వాదశాదిత్యుల యందు ప్రవేశించి, వానిని గ్రహించి, ఉదరస్థలమొనర్చి, తన ముష్టి ఘాతముల చే మిగిలిన బ్రహాండమునంతటినీ పిండి పిండి కావించును. సమస్త బ్రహ్మాండము రుద్రుని చే చూర్ణము కావింపబడిన

పిదప మధుసూదనుడు తన యోగ బలము చే సమస్త జలమును ధారణ చేయును. అందువలన ఆ సమయమున బ్రహ్మాండము యొక్క బాహ్యాంతరములు సర్వము ఏక పరమాత్మ యందు సమ్మిళితమయినది. చూర్ణమయిన ధరిత్రి మరియు ఇతర బ్రహ్మాండము ఆ నీటిపై తేలియాడుచున్నవి. నెమ్మదిగ నీరు పృధివి యొక్క గంధ తన్మాత్రను గ్రసించుటచే పృధివి గంధహీనమయినది.

అటు పిదప రుద్రుడు తన గర్భస్థమయిన ద్వాదశాదిత్యుల తేజమును బహిర్గత మొనర్చును. జగత్తునందు మిగిలిన తేజమంతయు ఈ మహాతేజమందు సమ్మిళితమగును. ఈ తేజోరాశి బ్రహ్మాండ ఖండ చూర్ణమును దగ్ధమొనర్చి, తిరిగి తేజోవంతము కావించి, జలమందలి గంధ తన్మాత్రను తిరిగి గ్రహించి ఈ చూర్ణమందు ప్రవేశపెట్టును. ఈ ప్రక్రియ యందే తేజోరాశి జలమును నాశనమొనర్చును. అంత మహా వేగమున వాయువు ఈ తేజోరాశి యందు ప్రవేశించి ఆ తేజము యొక్క రూప తన్మాత్రను గ్రహించును. రూప తన్మాత్ర నశించుట చే తేజోరాశి నష్ఠమగును. అంత వాయువు అత్యంత బలిష్ఠమై ప్రభంజనమగును. ఘోర శబ్దము గావించుచున్న వాయువును చూచి రుద్రుడు ఆకాశమును విక్షోభము కావించును. అంత ఆకాశము సంక్షుబ్ధమై వాయువు యొక్క స్పర్శ తన్మాత్రను గ్రహించును. అంత పవనము నష్ఠమగును. అంత రుద్రుడు ఆకాశము నుండి స్పర్శ తన్మాత్రను తనయందు వినీల మొనర్చుకొనును. దానితో ఆకాశము నశించును. ఈ విధముగ పంచభూతములు నష్ఠమై రుద్రుని యందు లీనమగును. అంత రుద్రుడు బ్రహ్మ దేవుని యందు లీనమగును. బ్రహ్మ విష్ణుని యందు లీనమగును. అపుడు విష్ణువు శంఖ చక్ర గదా పద్మములు, ఖడ్గము ధరించి సమస్త పాంచ భౌతిక పదార్థముల నుండి సారము గ్రహించి, తదుపరి తన దేహమును సహితము తన శక్తిచే సంహరించి, నిరాకార, నిరాధార, నిస్సంగ, విశేషణరహిత, నిర్మల, స్థూల సూక్ష్మ రహిత, సర్వవ్యాప్తి, సచ్చిదానంద స్వరూప పరమాత్మగా "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అను శృతి వాక్యానుసారముగ మారి వ్యవహరించును. అపుడు దివారాత్రములు, పృధివ్యాకాశములు, అంధకార ప్రకాశములు, మొదలగు ద్వంద్వములు లేవు. అయ్యది ఇంద్రియాతీతము, బుద్ధికి అగోచరము, అయిన ప్రకృతి జటిత పరబ్రహ్మ స్వరూపము. బ్రహ్మ దేవుని సృష్ఠికి వలెనే, సృష్ఠి హీనమయిన నిర్వికార స్థితి మరియొక వంద బ్రహ్మ వత్సరములు యుండి తిరిగి సృష్ఠి ప్రారంభింపబడును.

మార్కండేయుడు "ఋషులారా! ఇప్పటి వరకూ ప్రాకృతిక ప్రళయమును వర్ణించితిని. ఇపుడు పున:సృష్ఠిని వర్ణించెదను. వినవలసినది.

**(శ్రీ కాళికా పురాణమందలి శివుని తపము మరియు ప్రాకృతిక ప్రళయమును ఇరువది నాల్గవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువది అయిదవ అధ్యాయము

**(వరాహకల్ప సృష్ఠి యొక్క వర్ణనము)**

మార్కండేయుడు "పరమాత్ముడు కాల రూపముగనే సృష్ఠి, స్థితి, సంహారములు కావించును. ప్రళయము సహితము కాలాంశయే! ప్రళయము సంభవించిన పిదప పరబ్రహ్మకు సృష్ఠించవలెనన్న కోరిక జనించును. పరబ్రహ్మ సర్వకార్యములు ప్రకృతి సహాయము చేతనే కావించును. అందువలన పరబ్రహ్మ మూల ప్రకృతిని విక్షోభము కావించును. గంధము సన్నిహితమయినపుడు జీవుల యందు ఎట్లు పరివర్తన కలుగునో, అట్లే పరమాత్ముడు నిమిత్త మాత్రుడయినప్పటికీ

ఆయన సంసర్గము చే ప్రకృతి వికసించుట నారంభించును. పరమాత్మ ప్రకృతిని క్షేత్రము చేసి, జీవాత్మలను ఇచ్ఛామాత్రముగ ప్రవేశపెట్టుటతో గుణవైషమ్యములు ఉత్పన్నమగును. అంత త్రిగుణాత్మకమయిన ప్రకృతి జీవాత్మలను సంపూర్ణముగ ఆవరించును. మూల ప్రకృతి నుండి మహత్తత్వము, దాని నుండి అహంకారము ఉద్భవించి మూడు (సత్వ, రజస్, తమస్సు) విధములుగ విభజన చెందును. ఇందలి తామసిక అహంకారమే పంచ భూతములు మరియు ఇంద్రియముల ఉనికికి హేతువు. ఈ ఆవరించిన మహత్తత్వము నుండి తన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు) ఉత్పన్నమగును. అంత అహంకారము తన్మాత్రలను తిరిగి వేరు వేరుగ ఆవరించును.

తొలుత శబ్ద తన్మాత్ర ద్వారా శబ్దమునకు ప్రధమ ఉపాదానమయిన ఆకాశము ఉద్భవించును. అంత అహంకారము శబ్ద తన్మాత్ర నే కాక ఆకాశమును సహితము ఆవరించును. ఆకాశము మరియు స్పర్శ తన్మాత్ర చే స్పర్శకు ప్రధమ ఉపాదానమయిన మరియు శబ్ద గుణ సహితమయిన వాయువు ఉత్పన్నమై సర్వదిశలు నిండును. తదుపరి ఆకాశము, వాయువు రూప తన్మాత్ర చే రూపమునకు ప్రధమ ఉపాదానము మరియు శబ్ద, స్పర్శ సహితమయిన అగ్ని ఉద్భవించి నలుదిక్కులా విస్తరిల్లును. ఆకాశము, వాయువు, అగ్ని, సమన్వితమై రస తన్మాత్రకు ప్రధమ ఉపాదానమయిన జలము ఉత్పన్నమయినది. పరమ బలిష్ఠము, ఉత్కృష్ఠము అయిన విష్ణువు యొక్క ఆధారశక్తి వాయువు చే ప్రేరేపింపబడి నిరాధారమయిన జలరాశిని ధారణ చేయును. ఈ జలము నందే తదుపరి సమయము నందు పరమాత్మ బీజధారణ కావించును. నెమ్మదిగ ఆ బీజము సూర్య సన్నిభమయిన స్వర్ణమయ అండముగ పరిణమించును. ఈ అండము మహత్తత్వాది పదార్ధముల చే నిర్మితమై, అదే పదార్ధముల చే నలుప్రక్కలా నిండియున్నది. జలము, అగ్ని వాయువు, అకాశము, అహంకారము, మహత్తత్వము ఒకదాని కంటె ఒకటి పదిరెట్లు అధికముగ యుండును. ఈ పదార్ధముల చే సమస్త బ్రహ్మాండయు నిర్మితమయినది.

పరమేశ్వర స్థాపితమయిన బ్రహ్మాండము ఈ పదార్ధముల మధ్య తేలుచుండును. విష్ణు భగవానుడు స్వయముగ పరమేష్ఠి అయిన చతుర్ముఖ బ్రహ్మ స్వరూపమున ఒక దివ్య వర్షము అనగా మూడు వందల అరవై మానుష సంవత్సరములు ఈ అండము నందు స్థితిగతుడై, సమస్త బీజములను ఈ అండము లోనికి సంగ్రహించును. తన ఇచ్ఛామాత్రముగ ఆ అండమును రెండుగా భేదించి, అచట క్షణకాలముండి గంధ తన్మాత్ర చే ధరణిని సృష్ఠించును. అందువలన పృధివి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రలచే నిర్మితమయినది. ఈ ధరిత్రి యందు ఈ తన్మాత్రలన్నియు ఉపస్థితమయినవి.

పృధివి ఉత్పన్నమయిన పిదప అండము యొక్క మధ్య భాగము నుండి సుమేరువు, గర్భము నుండి పర్వత సమూహములు, గర్భ జలము నుండి సప్త సముద్రములు, పార్శ్వముల నుండి స్వర్గ లోకము, పార్శ్వముల క్రింద భాగము నుండి ఏడు అధోలోకములు, మరియు అత్యంత విలాసవంతము, సుఖదాయకము, నాగులకు ఆలవాలమయిన పాతాళము ఉత్పన్నమయినది. అద్దాని అధోభాగమున స్వయముగ పరమేశ్వరుడు విరాజమానుడై యుండును. ఈ బ్రహ్మాండము యొక్క తేజోరాశి నుండి మహర్లోకము, వాయువు నుండి జనలోకము, పరబ్రహ్మ యొక్క ధ్యానము నుండి తపోలోకము, అద్దాని ఊర్ధ్వమున సత్యలోకము యుండి, వీటన్నిటికీ ఊర్ధ్వమున స్వయముగ అచ్యుతుడు, విష్ణువు నివాసముండును. ఈ విష్ణు లోకమునే విజ్ఞులు, ధీరులు జ్ఞానగమ్యము లేక పరమపదమని పేర్కొందురు.

పరబ్రహ్మమే చతుర్ముఖ బ్రహ్మ రూపము లో ఈ జగత్తును సృష్ఠించి విష్ణురూపుడై రక్షించి, పోషించుచుండును. స్వయముగ ఉత్పన్నమగుట చే విష్ణువు "స్వయంభూ" అని కీర్తింపబడెను. ఆ సమయమున భూమి జలముల యందు మునిగి యుండెను. అందుచే విష్ణువు శక్తిశాలి అయిన యజ్ఞవరాహ రూపము ధరించి, సముద్ర జలముల యందు ప్రవేశించి, తన కోర యొక్క అగ్రభాగమున ధరణిని యుంచి, అద్దానిని జలముల ఉపరి భాగమునకు తీసికొని వచ్చి, స్వయముగ తాను ఏడు పడగలు గల అనంత శేషనాగునిగా అవతరించెను. అనంతుడు తన ఏడు పడగలను విప్పార్చి,

మధ్యనున్న పడగపై ధరణిని సుస్థిరముగ ఊన్చెను. అంత యజ్ఞవరాహము తన కోరలను ఉపసంహరించెను. అనంతరము అనంతుడు తన మిగిలిన ఆరు పడగలను తూర్పు, పశ్చిమ, ఉత్తర, దక్షిణ, ఈశాన, ఆగ్నేయ కోణములు వైపు ప్రసరించెను. మధ్యపడగ నైఋతి దిక్కున యుండెను. వాయువ్య కోణము శూన్యము. అందువలన పృధివి వాయువ్య కోణమున కొంచెము క్రిందికి వంగి యుండును. అత్యంత బలశాలి, దీర్ఘకాయుడు అయిన అనంతుడు జలముల యందు ఆలంబనము లేక యుండుట చే, విష్ణువు కూర్మ రూపము ధరించి, అనంతుని భరించును. ఈ మహా కచ్ఛపము తన పదముల చే బ్రహ్మాండము యొక్క అధోభాగమున నిలిచి, వీపుపై అనంతుని నిలిపి, శూన్యముగయున్న వాయువ్య కోణమున తన గ్రీవమును యుంచును. అతులిత బలశాలి అయిన అనంతుడు కచ్ఛపము యొక్క వీపుపై తొమ్మిది చుట్టలు చుట్టుకొని అనాయాసముగ పృధివిని భరించినప్పటికీ, ధరణి సుస్థిరముగ యుండలేక పోయినది. అంత యజ్ఞవరాహుడు పర్వతముల చే ధరణిని ఈ విధముగ ధృడమొనర్చెను.

ఆయన తొలుత సుమేరు పర్వతమును తన గిట్ట చే ప్రహరించెను. అంత సుమేరువు పృధివిని ఛేదించుకొని ఇరువది ఆరు వేల యోజనములు క్రిందికి దిగి రసాతలమున కేగెను. ఆ ప్రహారము చే పర్వత శిఖరము సమతలమై ముప్పది రెండు వేల యోజనములు విస్తరిల్లెను. పృధివిని పట్టి అచలము గావించు సుమేరువునకు సహాయముగ నలుదిక్కులా హిమాలయాది పర్వతములు యొక్క ఆయిదవ భాగమును ప్రతిష్ఠించెను. అనంతరము బ్రహ్మదేవుడు మహాతేజస్వి అయిన యజ్ఞవరాహమునకు ప్రణామమొనర్చి, దేవాధి దేవుడు, మరియు అర్ధనారీశ్వర రూపమయిన ఈశ్వరుని తన దేహము నుండి వెలువరించెను. ఆ మహా పురుషుడు జన్మించుట తోడనే మహాశబ్దము తో రోదించుట నారంభించెను. పరమేష్ఠి ఆ బాలుని రోదనమునకు కారణమేమని ప్రశ్నింపగా "నాకు నామకరణము చేయవలిసినది" అని పలికెను. అంత పరమేష్ఠి నీవు రోదనము కావించుచూ జన్మించితివి కావున "రుద్రుడు" అని పిలువబడుదువు అని పేర్కొనెను. అది వినినంతనే రుద్రుడు మరి ఏడు సార్లు రోదించెను. అంత బ్రహ్మ ఆ బాలునికి "శర్వ, భవ, భీమ, మహాదేవ, ఉగ్ర, ఈశాన, పశుపతి" అను మరియొక ఏడు నామములు ప్రసాదించెను.

అంత రుద్రుడు బ్రహ్మతో "ఓ! ప్రజాపతీ! ఏ విధముగ మీరు నన్ను విభజించిరో, అదే విధముగ మిమ్ములను మీరు సృష్టి హితార్థమై విభజించుకొనవలసినది," అని పలికెను. అంత బ్రహ్మ తనను తాను రెండుగా విభజించుకొనెను. ఒక భాగము నుండి విరాట్పురుషుడు మరియొక భాగము నుండి ఆతని పత్ని ఉద్భవించిరి. అంత బ్రహ్మ ఆ విరాట్పురుషునితో "ఓ! ప్రజాపతీ! నీవు సృష్టి చేయవలసినది," అని పలికెను. అంత విరాట్పురుషుడు తపమాచరించి స్వాయంభవ మనువును సృష్టించెను. ఆతడును తీవ్ర తపమాచరించి బ్రహ్మ దేవుని మెప్పించెను. అంత బ్రహ్మ తన మనసు నుండి దక్షుని ఉద్భవింపజేసెను. దక్షావిర్భావము అయిన పిదప స్వాయంభువమనువు పదిమార్లు బ్రహ్మను ప్రార్థించెను. అంత బ్రహ్మ తిరిగి "మరీచి, అత్రి, అంగిర, పులస్త్య, పులహ, క్రతు, ప్రచేతస, వశిష్ఠ, భృగు నారదాది" పది మానస పుత్రులను సృష్టించెను. పిదప పరమేష్ఠి ఆ పన్నెండు మందినీ చూచి "మీరు సృష్టి చేయవలసినది." అని ఆదేశించి అంతర్హితుడయ్యెను. అనంతరము వరాహ భగవానుడు తన ముట్టెతో పృధివిని తొలచి వలయాకారముగ ఏడు సముద్రములను నిర్మించెను. అంత తాను వాని యందు ప్రవేశించి, ఏడుమార్లు పరిభ్రమించి, ఏడు ద్వీపములు సహితము నిర్మాణము గావించెను. ఎట్లు గృహమునకు నలు దిక్కులా, గోడలు యుండి రక్షించునో, అట్లే పృధివికి నలు ప్రక్కలా రెండు లక్షల యోజనముల ఎత్తుగల లోకాలోక పర్వతములు సృష్టించి పృధివిని సుధృఢము గావించెను.

మార్కండేయుడు "ఋషులారా! మీకు ఆది సృష్టి తెలిపితిని. ఇప్పుడు ప్రతి సృష్టి యొక్క వర్ణన కావింతును.

**(శ్రీ కాళికా పురాణమందలి వరాహకల్ప సృష్టియను ఇరువది ఐదవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువది ఆరవ అధ్యాయము

## (ప్రతిసర్గ సృష్టి వర్ణనము)

మార్కండేయుడు "ఈ మన్వంతరమునకు వరాహదేవుడు అధిష్ఠాత కావున ఇయ్యది "వరాహకల్పమని" పిలువబడినది. బ్రహ్మ సృష్టి గూర్చి మీరు వినియుంటిరి. ఇపుడు బ్రహ్మ మానస పుత్రులయిన దక్షుడు మొదలగు ప్రజాపతులు, మరియు ఋషుల ద్వారా మరల మరల కావింపబడిన సృష్టిని వినిపించెదను. వీనినే "ప్రతిసర్గ" మందురు. విరాట్పురుషుని నుండి స్వాయంభువ మనువు ఉత్పన్నమయ్యెనని తెలిపితిని కదా! ఈ స్వాయంభువుడు ప్రజాసృష్టి కొరకై ఆరుగురు పుత్రులను ఉత్పన్నము చేసెను. వారందరూ మునులే! వారే వరుసగా "స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుస, మహాతేజ, వివస్వాన్". యక్ష, రాక్షస, పిశాచ, నాగ, గంధర్వ, కిన్నెర, విద్యాధర, అప్సర, సిద్ధ, నానా భూత, విద్యుత్, మేఘ, లత, గుల్మ, తృణ, మత్స్య, పశు, కీట, జలచర, స్థల, ప్రాణులందరూ స్వాయంభవ మనుసంతతి చే ఉత్పన్నము చేయబడిన వారే! దీనినే స్వాయంభువ ప్రతిసర్గమందురు. స్వాయంభువ మనుపుత్రులు తమ తమ అధికారము నందు యధాశక్తిగా ప్రాణోత్పాదనము కావించి చరాచర జగత్తు నంతటినీ, నింపిరి. వారాహదేవుడు జగత్తునందు యజ్ఞద్రవ్యములు, యూప స్థంభములు, ప్రాగ్వంశము, ధర్మాధర్మములు, సమస్త గుణములను సృష్ఠించెను. దక్షుడు ప్రధాన దేవర్షి, మహర్షి గణములను ఉత్పాదనమొనర్చెను. ఇది దక్ష ప్రతిసర్గము. బ్రహ్మదేవుని ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు, పదముల నుండి శూద్రులు, ఉదయించిరి. నాలుగు ముఖముల నుండి నాలుగు వేదములు ఉదయించెను.

మరీచి మహర్షి కశ్యపునకు జన్మ నిచ్చెను. కశ్యపుడు దేవ, దానవ, దైత్యాదులకు జన్మనిచ్చెను. ఇది మరీచి ప్రతిసర్గము. అత్రి మహర్షి నేత్రములు నుండి సోముడు ఉదయించెను. ఆయన చంద్ర వంశమునకు ఆదిపురుషుడై జనులను విస్తరించెను. ఇది సోమసర్గ లేక అత్రి ప్రతిసర్గము. అధర్వ వేద ప్రచారకుడయిన అంగిరునకు అనేకమంది పుత్రులు కలిగిరి. ఆయన మంత్రములను, యజ్ఞములను సృష్ఠించెను. ఇది అంగిర ప్రతిసర్గము. పులస్త్య పుత్రుడు అయిన ఆజ్యపుడు పితృగణములను, అత్యంత బల, వీర్య సంపన్నులయిన రాక్షసులను, ఉత్పాదన మొనర్చెను. ఇది పులస్త్య ప్రతిసర్గము. పులహుడు అనేకమంది ప్రజలను, సర్పములను, గజ, అశ్వములను పుట్టించెను. ఇది పులహ ప్రతిసర్గము. క్రతువు భాస్కరతేజ సమానులు, సర్వజ్ఞులు అయిన అరువది ఆరు వేల వాలఖిల్యులు అను ఋషులను ఉత్పాదన మొనర్చెను. ఇది క్రతు ప్రతిసర్గ. ప్రాచేతస మహర్షి అరువది వేల మంది స్వకీయ తేజ సంపన్నులయిన పుత్రులను బడసెను. ఇయ్యది ప్రచేతస ప్రతి సర్గము. వశిష్ఠునికి అరుంధతి యందు ఏబది మంది యోగులు ఉత్పన్నమయిరి. ఇది వశిష్ఠ ప్రతిసర్గ. భృగు మహర్షి భార్గవ వంశమునకు ఆదిపురుషుడు. వీరందరూ దానవకుల గురువులు మరియు పురోహితులు, కవులు, మరియు మహాప్రాజ్ఞులు.

నారదుడు నక్షత్రములు, విమానములు, ప్రశ్నోత్తర విద్య, నృత్య, గీత, గాయకాదులను ఉత్పాదన మొనర్చెను. ఇది నారద ప్రతిసర్గము. దక్షాది ఋషి గణము అనేకమంది పుత్ర పుత్రికలను ఉత్పాదనమొనర్చి, వారికి యధాయోగ్యమయిన వివాహములు కావించుట చే, వారికి సంతతి కలిగి వారిచే స్వర్గ, మర్త్యలోకములు నిండినవి. వారి పుత్ర, పౌత్రాది సంతానము, వంశములు ఇప్పటికీ భువన మండలమందు వర్ధిల్లు చున్నవి. విష్ణువు యొక్క నేత్రముల నుండి సూర్యుడు, మనసు నుండి చంద్రుడు చెవుల నుండి వసువులు, మరియు దశ దిశలు, ముఖము నుండి అగ్ని ఉత్పన్నమయిరి. ఇది విష్ణు ప్రతిసర్గము. ఈ విధముగ ఉద్భవించిన అనంతరమే తిరిగి చంద్రుడు అత్రి మహర్షి యొక్క నేత్రముల నుండి,

సూరుడు కశ్యప పత్నిచే ప్రార్థింపబడి తిరిగి ఆమె గర్భము నుండి ఉత్పన్నమయిరి. తదనంతరము రుద్రుడు చతుర్విధ భూత గణములను ఉత్పన్నము కావించెను. ఇందు కుక్క, వరాహము, ఒంటె రూప ధారులు ఒక విధము. నక్క మరియు వానర ముఖులు మరొక విధము. ఎలుగుబంటి, పిల్లి ముఖము వారు వేరొక విధము. సింహ, వ్యాఘ్ర ముఖులు చివరి వారు. వీరందరూ సమస్త శస్త్రాస్త్ర కోవిదులు. మహాబలులు, పరాక్రమశీలురు. ఇది రుద్ర ప్రతి సర్గము.

**(శ్రీ కాళికా పురాణ నందలి ప్రతిసర్గ సృష్టి అను ఇరువది ఆరవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువది ఏడవ అధ్యాయము

**(దైనందిన ప్రళయ వర్ణనము)**

మార్కండేయ మహర్షి తిరిగి చెప్పదొడంగెను "మునులారా! మనువు యొక్క అధికారము ఎంతకాలము వర్ధిల్లునో ఆ సమయమున నంతటినీ "మన్వంతరము" అని పిలిచెదరు. వారి వారి నామముల మీదుగ ఆ మన్వంతరములు ఏర్పడును. స్వాయంభువ మన్వంతరము, స్వారోషిత మన్వంతరము ఈ విధముగ ఏర్పడినవే! డెబ్బది ఒక్క దేవ యుగములు ఒక మన్వంతరమగును. పదునాలుగు మన్వంతరములు పరమేష్ఠికి ఒక పగలు. బ్రహ్మకు ఒక పగలు అయిన పిదప అనేక ఉత్పాతములు కలుగును. మహామాయ అయిన యోగనిద్ర బ్రహ్మను ఆశ్రయించును. బ్రహ్మ, పరమ తేజస్వి అయిన విష్ణువు యొక్క నాభికమలము జొచ్చి సుఖ నిద్రావశుడగును. అపుడు విష్ణువు రుద్రరూపుడై సమస్త భువన భాండమును నశింపజేసి, మహా ప్రళయకాలమున ఎట్లు త్రై లోక్యములను వినష్ఠము గావించెనో, అదే విధముగ బ్రహ్మాండము సర్వమును దహించును. తదుపరి నానావర్ణ సహితము ఘోర గర్జనలు గావించు పర్వత సమాన నీల నీరద మేఘరాశిని ఉత్పత్తి చేసి, వానినుండి ఏనుగు తొండముల వంటి జలధారలను వర్షముగ కురిపించి, ధృవలోక పర్యంతము బ్రహ్మాండము నంతటినీ జలమయము కావించును. అంత పురుషోత్తముడు, జగన్నాధుడు, విష్ణుమూర్తి, జగముల నన్నింటినీ తన ఉదరము నందు యుంచి, బ్రహ్మను నాభి కలమలను నందు ప్రతిష్ఠించి, లక్ష్మీ సహితుడై శేష పర్యంకము పై శయనించును.

భువన బ్రహ్మాండమంతయు దగ్ధమయిన పిదప శేషుడు పృధివిని వదలి విష్ణువును చేరును. అంత పృధివి జలరాశి యందు పడి, కూర్మ పృష్ఠము చేరి ఖండఖండములు అగును. అంత ఆదికూర్మము పృధివీ ఖండములను తన మూపుపై పున: సృష్టి వరకూ ధారణ చేయును. శేషుడు క్షీరసాగరమున శయనాభిలాషి అయిన నారాయణుని వద్దకు ఏతెంచెనని తెలిపితిని కదా! భూమిని వదలిన శేషుడు లక్ష్మీ నారాయణులను తన మధ్య పగడపై ధరించును. మిగిలిన పడగలను విప్పార్చి తలడగయగును. ఉత్తర ఫణము జ్యోతివలె ప్రకాశించి వెలుగునిచ్చును. పశ్చిమ ఫణము వీవనయై వీచును. ఈశాన్య ఫణముపై నారాయణుని శంఖము, చక్రము, మరియు నందక ఖడ్గము తూణీరములు, మరియు గరుడుని సహితము వహించును. గద, పద్మము, శాంగము, మిగిలిన అస్త్ర శస్త్రములు, ఆగ్నేయ ఫణముపై ఉపస్థితమగును. ఈ విధముగ శేషుడు తన శరీరాంతరమును శయ్యగా చేసి జగత్కారణ కారణము, జగదీశ్వరుడు, నిత్యానందుడు, వేదమయుడు, బ్రహ్మణ్యుడు, భూత భవ్య భవన్నాధుడు, లక్ష్మీ సహితుడయిన నారాయణుని ఫణము పై ధరించి, ఖండ ఖండమయి, కూర్మపృష్ఠము పై యున్న పృధివీ చూర్ణమందు తన అధో దేహమును స్థాపించి సుస్థిరుడగును. ఆ సమయమందు బ్రహ్మ దేవుడు శౌరి నాభికమలమందు, త్రైలోక్యములు మాధవుని ఉదరమందును ఊరట నొందును.

ఎంత సమయము బ్రహ్మ దేవుడు మెలకువగ యుండి సృష్టి చేయునో, అంత దనుక సమయము ఆయన

విశ్రమించి శయనించును. ఈ ప్రక్రియ అంతయు బ్రహ్మదేవుని ఒక (పగలు + రాత్రి) యందు జరగును కావున విజ్ఞులు దీనిని దైనందిన ప్రళయమని వక్కాణించిరి. రాత్రి గడచిన పిదప తిరిగి బ్రహ్మ నిదురలేచి పున:సృష్టి కావింప దలచెను. కానీ బ్రహ్మాండమంతయు జలమయమై, విష్ణువు నిద్రావశుడై యుండుట కాంచి, నారాయణుని అంగము లందు ప్రతిష్ఠితమయిన వైష్ణవీ దేవి, మహామాయా, జగన్మయి, అయిన యోగ నిద్రను ఇట్లు స్థవము గావించెను.

"ఓ! చిశ్చక్తీ, నిర్వికారా, పరబ్రహ్మ స్వరూపా, మహామాయా, జగన్మయి, సనాతనీ అయిన యోగనిద్రకు ప్రణామము లర్పించు చున్నాను. తల్లీ! నీవు గతి, స్థుతి, సృష్టి, స్థితి, స్వాహా, స్వధా, మరియు సంగీత రూపిణివి. సామగానము, నీతి, లజ్జ, లక్ష్మి, సరస్వతి రూపములు నీవే! ఓ! ఈశ్వరీ! యోగనిద్ర, మహానిద్ర, మోహనిద్ర కూడా నీవే! సమస్త బ్రహ్మాండ వాస్తవమయిన మహాశక్తి, కాంతి, శివకేశవ రూపము నీవే! సర్వలోక ధాత్రి మరియు అవిద్య, విద్యయు నీవే! బ్రహ్మాండ ధారిణి అయిన ఆధారశక్తి, సర్వ జగత్తు యొక్క త్రిగుణాత్మక ప్రకృతి, గాయత్రీ, సావిత్రీ, సౌమ్యా, భీషణ, శోభనశక్తి నీవే! నీవు నారాయణుని సృష్టి, స్థితి, లయలు కావించు ఇచ్ఛాశక్తివి. సుషుప్సా (శయనించ వలెనన్న కోరిక), సుషుప్తి (శయనము లేక నిద్ర) కూడా నీవే! ఓ! పరమేశ్వరీ! తుష్టి, పుష్టి, క్షమ, శాంతి, ధృతి మొదలగు ద్వంద్వములు నీవే! అంతేకాక ధరణీ రూపమున బ్రహ్మాండము నంతటినీ నీవే ధారణ చేయుచున్నావు. అమ్మా! నీవు జలము మరియు జలములకు కారణము. సమస్త ప్రాణుల అంతరమున చరించు ప్రాణ శక్తివి నీవే! నీవే స్థుతి, స్థుతిశక్తి, స్థుతికారిణి, మరియు స్థుతియోగ్యవు. ఈ విధమయిన నిన్ను నేను ఏమని స్థుతించెదను? ఏ విధముగ స్థవము కావించెదను? అందువలన నా అసమర్ధతను మన్నించి నా యందు ప్రసన్నురాలివి కమ్ము. నీకు ప్రణామము గావించుచున్నాను. దయచేసి నారాయణుని జాగృతుని కావింపుము."

పరమేష్ఠి ప్రార్ధనను ఆలకించిన మహామాయ దయామయియై, నారాయణుని ముఖ, నేత్ర, నాసిక, బాహు, హృదయములు వీడి, బయటకేతెంచి, రజోగుణ స్వరూపయై బ్రహ్మకు దృష్టి గోచరమైనది. యోగనిద్ర వీడుట తోడనే నారాయణుడు మెలకువ గొని సృష్టికి పూనుకొనెను. అంత ఆ మహానుభావుడు వరాహరూపమును గొని జలరాశి యందు మునిగిన ధరిత్రిని తిరిగి తన ముట్టెపై ధరించి జలముల ఉపరిభాగమునకు గొనివచ్చెను. ఆ సమయమున పృధివి అనంత జలరాశిపై ఒక బృహత్ నౌక వలె భాసిల్లెను. తదుపరి కూర్మరూపుడై పృధివిని తన మూపుపై ధరించెను. వేరొక రూపమున పృధివిపై కేతెంచి అధికముగ యున్న జలరాశిని తొలగించెను. అంత పరమేష్ఠి బ్రహ్మ, ప్రజాపతులను ఉత్పన్నము కావించి, వారి ద్వారా ప్రాణోత్పత్తి, జగత్సృష్టి కావించెను. బ్రహ్మ మరియు దక్షాది ప్రజాపతులు కావించిన సృష్టి అంతయు సంపూర్ణముగ పరమేశ్వరి యొక్క ఇచ్ఛానుసారమే జరిగినది. అంతేకాక మహత్తత్వము, అహంకారము, పంచభూతములు, ఇంద్రియములు, బ్రహ్మ, కాలము, ప్రకృతి, జగత్తు, ప్రాణికోట్లు, స్థావర, జంగమ స్వరూపములు, స్థిరాస్థిరముల ఉత్పత్తి, సర్వము పరమేశ్వరుని ఇచ్ఛారూపమయిన పరమేశ్వరి ద్వారానే జరిగి పరమేశ్వరుని యందు సుస్థిర మయినది.

మార్కండేయుడు ఈ విధముగ కమఠాది ఋషులకు నారాయణుడు పరమశివునికి దర్శింపచేసిన కల్పాంత సంహారము మరియు సృష్టి క్రియలను పూర్ణముగ వినిపించెను.

**(శ్రీ కాళికా పురాణమందలి సృష్టి కధనమను ఇరువది ఏడవ అధ్యాయము సమాప్తము)**

# ఇరువది ఎనిమిదవ అధ్యాయము

**(జగత్తు యొక్క సార, అసార నిరూపణము)**

మార్కండేయ మహర్షి చెప్పదొడంగెను. "ఋషులారా! అనిత్యము, తత్వహీనము, సారరహితము, అయిన జగత్తు, క్షణభంగురమైనది. ఏ శాశ్వత సారవస్తువు నుండి ఇయ్యది ఉత్పన్న మయినదో, అదే వస్తువు నందు తిరిగి ఈ జగత్తు విలీనమగును. భగవానుడయిన విష్ణువు జగదుత్పత్తి మరియు వినాశనమును మహాదేవునికి ప్రదర్శించి జగత్తు యొక్క నిస్సారతను నిర్ధారించెను. ఈ జగత్తునందు శాంతుడు, అనంతుడు, అచ్యుతుడు, పరాత్పరుడు, జ్ఞానమయుడు, భేదరహితుడు, అచింత్యరూపుడు, అయిన పరబ్రహ్మమొక్కటే సారమయినది. మిగిలిన సర్వము నిస్సారము. ఎవరి వలన సృష్టి, స్థితి, లయలను ప్రక్రియ జరుగుచున్నదో, ఎవరు మేఘ మండల సహిత గగన మండలమును విశ్వసహితముగ ధారణ చేయుచున్నాడో, యోగి పుంగవులు అష్టాంగ యోగమును అవలంబించి ఏ ఆత్మతత్వమయిన పరమాత్మను ప్రాప్తించు చున్నారో, దేనిని పొందిన ఎడల మాయాజటిల సంసారము నందు తిరిగి జన్మింపరో, ఆ సార స్వరూపమే పరబ్రహ్మ; మిగిలిన దంతయు అసారమే!! అయ్యది కేవలము నిష్కామకర్మ వలన మాత్రమే సాధ్యము. సకామకర్మ అసారము! నిస్సారము!! మరియు బంధహేతువు!!!!

చీమలు నెమ్మదినెమ్మదిగ మృత్తికను సంగ్రహించి, పుట్టను కట్టి తమ కార్యసిద్ధిని పొందును. అట్లే బుద్ధిమంతులు పూర్వ సంచిత పాప రాహిత్యమునకు, పుణ్యసంచయముచే పారలౌకిక ఆనందము కొరకు ధర్మము నే ఆశ్రయింపవలెను. సంసారము నందలి మంగళములకు హేతువు ధర్మమే! అర్ధ, కామ, మోక్ష పురుషార్థములు ధర్మము వలననే పొందదగును. త్రై లోక్యములను ధర్మమే ధారణ కావించుచున్నది. సృష్ట్యాది సమస్త కార్యములు ధర్మము వలననే పొసగుచున్నవి. పూర్వకాలమందు దేవతలు ధర్మము వలననే దైవత్వము నొందిరి. ఏ వ్యక్తి ప్రయత్న పూర్వకముగ స్వధర్మ పాలననుండి చ్యుతుడు కాడో ఆతడు "అక్షరుడు" అని పిలువబడును. ధర్మచ్యుతుడు "క్షరుడు" అని తెలియనగును. మునులారా! నేను మీకు సారరూప పరబ్రహ్మను, అసారరూప జగత్తును వర్ణించితిని. దీనినే మహావిష్ణువు మహాదేవుని ఆంతరమున దర్శింపజేసెను. తదనంతరము మహాదేవుడు తన ఆత్మ ధ్యానము ద్వారా స్వయముగ, ప్రత్యక్షముగ ఈ విషయము సర్వము గ్రహించెను.

పరబ్రహ్మము నిరాకారమయినప్పటికీ జగత్సృష్టి యందు మూర్తీభవించిన మాయారహిత రూపము ప్రధమ సారము. ధర్మము ద్వితీయ సారము. మిగిలిన వన్నియునూ అసారములే! అందువలన ధీయుతులు ఈ సారవస్తువును గ్రహించి, నిత్యము, శాశ్వతము అయిన మోక్షమును ప్రాప్తించెదరు.

**(శ్రీ కాళికా పురాణమందలి సార, అసార నిరూపణమను ఇరువది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము)**

# ఇరవై తొమ్మిదవ అధ్యాయము

**(యజ్ఞ వరాహుని క్రీడ మరియు వరాహ శంకర సంవాదము)**

మహర్షులు "మహాత్మా! మార్కండేయా! ఇంతకు మునుపు నీవు మహాదేవుడు నాలుగు విధములయిన భూతగణముల (ప్రమధులు) సృష్టి కావించెనని నుడివితివి కదా! ఈ వివిధ రూపముల ఆవశ్యకత ఏమి? వీరు ఏ కారణమున క్రూరకర్ములైరి!

వీరి ఆహారము ఏమి! దీనిని గూర్చి దయచేసి మాకు తెలుపవలసినది." అంత మార్కండేయుడు మునిగణములారా! శివుడు ఏ ప్రకారముగ ప్రమధులను ఉత్పత్తి చేసెనో, వారు తదనంతరము ఏఏ కార్యములు సాధించిరో అది అంతయు తెలిపెదను. ఇయ్యది పరమ గోపనీయము, పరమ తప:స్వరూపము, మరియు దర్మార్ధ కామ ప్రదము. అంతేకాక ఇయ్యది ఆయువు, యశస్సు, పుష్టి, సంతోషములను సహితము ప్రసాదించును. ఈ అధ్యాయము శ్రవణ మాత్రమున ఇహ, పర లోకములందు సహితము సుఖ ప్రదము మరియు కష్ఠ నాశకము.

ఆదివరాహ సర్గము పరిసమాప్తి చెందిన పిదప మహాదేవుడు జగన్నాధుని తో ఇట్లనియె "హే! మహాప్రభూ! మీరు ఏ కార్యము సాధించుటకు యజ్ఞవరాహ రూపము స్వీకరించిరో, ఆ కార్యము సంపూర్ణముగ సఫలమయినది. పృధివి యధాస్థానము నందు ప్రతిష్ఠిత మయినది. మీ కృప చే సాగరములన్నియు ప్రకృతికి అనుగుణముగ, స్థిరముగ నిలచినవి. పృధివి ఉద్ధరింపబడి, పరమేష్ఠి చే సృష్ఠి సహితము కావింపబడినది. ప్రభూ! మీరు తేజోమయులు, సర్వులు, మరియు యజ్ఞస్వరూపులు. సంసారము నందు ఎంతమంది గురువులుండిరో మీరు వారందిరికీ సహితము గురువులు. స్వామీ! మిమ్ములను వహించుట చే ధరిత్రి విదీర్ణమగుచున్నది. మిమ్ము వహించుట ధరణికి అశక్యము. పూర్వము మీ వలన స్థాపింపబడిన పృధివి, పర్వత సంఘాతము చే స్థిరముగ యున్నది. అందువలన ఓ! పృధివీపతీ! మీరు వరాహదేహమును విడువవలసినది. స్వామీ! మీరు జగద్రూపులు, జగదాత్మ స్వరూపులు, మరియు జగత్కారణ కారణులు. ఈ వరాహ దేహమును మీరు వినా వేరొకరు వహింపలేరు. అంతేకాక మీరు స్త్రీ రూపిణి అయిన పృధివితో జలములందు సంపర్కము కావించిరి కావున ధరణి దారుణ గర్భమును దాల్చినది. ఓ! జగన్నాధా! రజస్వల అయిన పృధివి గర్భధారణ చేయుట వలన భవిష్యత్ నందు ఈమెకు జన్మించు శిశువు అసురభావము నొంది, దేవ గంధర్వ జాతులన్నింటినీ హింసించి, అపఖ్యాతి పాలగునని పరమేష్ఠి నాకు దక్షప్రజాపతి సమక్షమున నివేదించెను. ఓ! లోకేశా! ఈ దూషిత రతి కార్య మాచరించుట చే మలినమయిన ఈ వరాహ శరీరమును దయచేసి వదులవలసినది. స్వామీ! మీరే సృష్ఠి, స్థితి, లయ కారకులు. అందువలన లోక కళ్యాణార్ధము మీరు ఈ మలిన శరీరమును వదులవలసినది. తిరిగి ఆవశ్యకత ఏర్పడినప్పుడు మీరు అవశ్యము వరాహ రూపము తిరిగి గైకొన వలసినది."

భగవానుడయిన వరాహదేవుడు మహాదేవుని పలుకులు విని ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "మహేశ్వరా! మీ కధనానుసారము నేను అవశ్యము ఈ వరాహ దేహమును వదలి, తిరిగి ఆవశ్యకత ఏర్పడినపుడు మరొక వరాహ దేహమును గైకొందును." జగద్గురువు, జగత్స్రష్ఠా, లోక నియంత, మహాకాయుడయిన యజ్ఞ వరాహుడు పై విధముగ పలికి తక్షణము అంతర్ధితుడయ్యెను. అటు పిదప దేవాధిదేవుడయిన మహాదేవుడు సహితము నిష్క్రమించెను. కానీ ఇచట అంతర్ధితుడు అయిన వరాహదేవుడు లోకాలోక పర్వతము చేరి, అచట వరాహరూపిణి, పరమ మనోహరి అయిన పృధివితో రమించుట నారంభించెను. అత్యంత కామమోహితుడయిన వరాహదేవుడు, చిరకాలము ధరణితో కామోపభోగములు అనుభవించినప్పటికీ ఆయనకు తృప్తి కలుగలేదు. తదుపరి వారిరువురికీ "సువ్రతుడు, కనకుడు, ఘోరుడు" అను ముప్వురు పుత్రులు కలిగిరి. వారు ముప్వురూ మహాబలులు, పితృతుల్య పరాక్రమోపేతులు. వీరు ముప్వురూ సుమేరు పర్వత స్వర్ణమయ శిఖరములందు, కంధర, సరోవరములందు క్రీడించుట మొదలిడిరి. వరాహదేవుడు వరాహరూపిణి అయిన పృధివితో కామోపభోగములను, మరియు పుత్రుల యందలి ప్రేమ, స్నేహముల కారణమున, తన శరీర త్యాగమునకు ఇంచుట నొల్లకుండెను. ఒక్కొక్కప్పుడు వరాహరూపి అయిన విష్ణువు బురదనందు దుమికి, ఆ బురదనందే పత్నీ, పుత్రులతో క్రీడించు చుండెను.

సంధ్యా కాలమందు రక్త, పీత వర్ష మేఘముల చే ఆవృతమయిన ఆకాశము ఎట్లు శోభించునో, అట్లే పింగళవర్ణుడయిన యజ్ఞవరాహుడు, బురద శరీరమంతయు అంటుకొనుట చే మిక్కిలి శోభించుచుండెను. ధరిత్రి

యొక్క మధ్య ప్రదేశమంతయు వరాహ దేవుని క్రీడా విక్రమము చే సొట్టలు పడినది. ఆ సమయమున ఆదికూర్మ పృష్ఠము పై స్థితిగతుడయిన మహాబలి అనంతుడు సహితము వరాహుని భరింపనశక్యుడై భగ్నమస్తకుడు అయ్యెను. పూర్వకాలమందు దేవతలు సర్ణమయ సుమేరు పర్వత శిఖరములందు రమ్యమయిన స్థానములు నిర్మించిరి. అవన్నియు శిఖరసమేతముగ వరాహుని పుత్రత్రయపు మోవి ఘట్టనలచే చూర్ణమయినవి. మానస సరోవర సమాన స్వచ్ఛమయిన జలరాశులు గల సుమేరు పర్వత సరోవరములన్నియు వీరి ముఖాఘాతముల చే కలుషితమయినవి. అంతేకాక వనితారూపిణి అయిన పృధివి ఆయనతో రమించున్నప్పటికీ, ఆయన దేహభారము చే మిక్కిలి దు:ఖిత అగుచున్నది. సరోవరములయిన పిమ్మట వరాహపుత్రులు సముద్రమున లంఘించి, రత్నాకరుని  తమ ముఖా ఘాతములతో కల్లోలమొనర్చి వ్యాకులుని గావించిరి. ఈ విధమయిన క్రీడలతో పర్వతసహితమయిన భూమి నుండి, కల్పవృక్షము వరకు యున్న సమస్తము భగ్నమయినది. జగత్కర్త, జగర్భర్త అయిన వరాహరూప శ్రీహరి, జగత్తుమొత్తము తన పుత్రత్రయము చే నాశనమగుట తెలిసియు, తన పుత్ర వాత్సల్యము చే వారిని వారింపకుండెను. ఒక్కొక్కప్పుడు ఈ పుత్రత్రయము స్వర్గమున కేగుదురు. వీరిని చూచిన తక్షణము దేవతానీకము భయాతురులై దిగంతముల వరకు పరుగులిడు చుండిరి.

ఈ విధముగ దేవదేవుడు ఎడతెరిపి లేక పుత్ర, భార్య సహితుడై, అత్యంత క్రీడారతుడై యున్నప్పటికీ, ఆయనకు పూర్ణ సంతోషము లేకుండెను. అనుభవించిన కొలది ఆయనకు కామవృద్ధి పెరుగుచునే యుండెను. కామత్యాగము ధ్యాసయే ఆయనకు లేదాయె!!!

**(శ్రీ కాళికా పురాణమందలి వరాహ శంకర సంవాదమను ఇరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పదియవ అధ్యాయము

**(వరాహ శరభుల యుద్ధము)**

ఈ విధముగ బ్రహ్మాండము నందు క్షోభము జరుగుచుండగా, లోకహితార్థము దేవేంద్రాదులు మంత్రణమారంభించిరి. ఇంద్రాది దేవతలు యుక్తియుక్తముగ దేవాధి దేవుడు, శరణాగతవత్సలుడు, ఆద్యంత రహితుడు, అయిన భగవానుని శరణమొందుట శ్రేయస్కరమని తలంచి, మునిగణ సహితులై, వాసుదేవుడు, గరుడధ్వజుడు, గోవిందుని వద్దకు ఏగి, ప్రణామములు అర్పించి ఇట్లు ప్రస్తుతించిరి "ఓ! దేవాధిదేవా! మీరు జగత్ సృష్టికి మూలీభూతమయిన కారణములకు సహితము కారణము. కాలస్వరూపా! మహా పురుషా! మీరు స్థూల రూపమున జగత్తుగా వ్యాపించి, సూక్ష్మ రూపమున అందు ప్రకాశించు చుండిరి. ఓ! పురుషోత్తమా! మీరు మీ మాయచే సర్వ జగత్తును మోహింపజేయు చున్నారు. ఓ! జగత్ప్రభూ! భూత, భవిష్యత్, వర్తమాన కాలములందలి సర్వ స్థావర, జంగమాత్మకమంతయు నీ రూపమే! అర్ధ కాంక్షులు మిమ్ము పొందుటతోనే క్షుద్రాభిలాషలను వదలి కృతార్థులగుదురు. కాముక గణము మిమ్ము గాంచి క్షుద్ర కామము నుండి విముఖులగుదురు. ధర్మ పరాయణులు మిమ్ము పొంది, కృతార్థులమైతిమని తలంతురు. ముముక్షువులు మీ దర్శనము చే మోక్షలాభము నొందెదరు. ప్రభూ! అర్థ, కామ, ధర్మ, ముముక్షువులు సర్వము నీ రూపమే!! స్వామీ! మీ ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు , ఊరువుల నుండి వైశ్యులు, పదముల నుండి శూద్రులు ఉత్పన్నమయిరి. మీ నేత్రముల నుండి సూర్యుడు, మనసు నుండి చంద్రుడు, కర్ణముల నుండి ప్రాణ, అపానాది వాయువులు, మస్తకము నుండి స్వర్గాది ఊర్ధ్వ లోకములు, నాభి నుండి ఆకాశము, చరణముల నుండి పృధివి, కర్ణాగ్ర

భాగముల నుండి దిక్కులు, జఠరము నుండి జగత్తు ఉత్పన్నమయినది. మీరు నిర్గుణులు మరియు గుణయుక్తులు. అద్వితీయ స్వరూపా! అచ్యుతా! జగన్నాథా! మీరు దేహ ధర్మములయిన షడూర్ములు లేని పరమేశ్వరులు. ద్వాదశాదిత్యులు, అష్ట వసువులు, దేవతలు, సాధ్యులు, యక్షులు, మరుద్గణము, మరియు ముముక్షువులయిన యోగిజనులందరూ సమయము నంతయు మీ ధ్యానము నందే గడిపెదరు. మహానుభావులు, అత్యంత మతిమంతులు, నిస్పృహ ఋషిసత్తములు మిమ్ము చిదానందమయునిగ తలచెదరు. సంసార వృక్షమునకు మూలము మరియు ఫలపుష్పాదులు మీరే! మహాప్రభూ! మీరు గరుడారూఢులై చతుర్బాహువుల యందు కరవాలము, చక్రము, పద్మము, ధనుస్సు ధరించెదరు. ప్రభూ! దేవ ప్రముఖులైన త్రిమూర్తులు మీరే! ఓ! భక్తభయహారీ! మేము ప్రస్తుతము మిక్కిలి భయగ్రస్తులమై యున్నాము. మమ్ము రక్షింప వలసినది.” దేవతలచే కావింపబడిన స్థవము విని విష్ణుదేవుడు మేఘ గంభీర స్వరముతో ఇట్లనియె “దేవతలారా! మీ భయమునకు కారణమేమి? నా వలన కాగలుగు కార్యమేదైననూ, శీఘ్రమే తెలుపవలసినది”.

దేవగణములు “మహాప్రభూ! యజ్ఞ వరాహము యొక్క క్రీడలచే పృథివి సర్వము విశీర్ణము, విదీర్ణము అయినది. జనులందరూ భయవిహ్వలులై అశాంతికి లోనైయిరి. మిగులమ్రుగ్గిన పండు ఘాతము చే ఖండఖండములయినటుల, యజ్ఞ వరాహుని కోరలచే పృథివి సర్వము శీర్ణమగుచున్నది. అంతేకాక ఆయనకు సువ్రతుడు, కనకుడు, ఘోరుడు అను ముగ్గురు పుత్రులుదయించిరి. వారు సహితము పితృతుల్య పరాక్రములు, మరియు బలశాలురు. వారి ఘాతములచే కూడా ధరణి జీర్ణమగుచున్నది. ఓ! జగదీశ్వరా! మానసాది సరోవరములు సహితము ఈ వరాహములు క్రీడించుటచే బురదమయమై, శోభాహీనములైనవి. వరాహ పుత్రులు మంధరాది మహా పర్వతములను, వాని యందలి కల్ప వృక్షములను భగ్నము కావించిరి. విరిగిన పారిజాత వృక్షములు పత్ర, పుష్ప, ఫల హీనములయినవి. అంతేకాక వరాహ పుత్రులు అత్రిగిరి యందలి అత్యున్నత శిఖరము నుండి లవణ సముద్ర జలములందు లంఘించుట చే, జలరాశి ఒక్కసారి పైకిలేచి, త్రిభువనములను ముంచెత్తుచున్నది. అందువలన జనులు భయభీతులై దశదిశలు పారిపోయి ప్రాణరక్షణ కావించు కొనుచున్నారు. ఈ వరాహ పుత్రులు తమ ఇచ్ఛానుసారము స్వర్గమున కేతెంచెదరు. వారిని చూచుట తోడనే దేవతలు సహితము పలాయనమొనర్చుచున్నారు. క్రీడార్థము ఈ వరాహములు పర్వత శిఖరములు పెకలించి, విసిరివేయుచున్నారు. ఆ వేగమును, పర్వత పతనమును దరిత్రికి సహించుట దుస్సహమగుచున్నది. ఈ వరాహముల వలన త్రైలోక్యములు నష్టమగుచున్నవి. అందువలన మీరు ధరణిపై దయాళులై దయ చూపింపవలసినది.”

అంత పురుషోత్తముడు దేవతల మాటవిని పరమేశ్వర, పరమేష్ఠులతో ఇట్లనియె “దేవతా, మనుష్య సంఘములకు దు:ఖ కారణమగుచున్న వరాహదేవుడు దేహత్యాగము కావింపవలెను. కానీ కామాసక్తుడు, సుఖాసక్తుడు అగుట వలన ఆయన దేహత్యాగము కావింపలేకున్నాడు. కానీ, పరమేశ్వరా! మీరు మీ వంతు ప్రయత్నము ఆరంభింప వలసినది. చతుర్ముఖ బ్రహ్మ మరియు దేవతలందరూ మీమీ తేజమును పరమేశ్వరుని యందు ప్రతిష్ఠింపవలసినది. అపుడు మహాదేవుడు మహా తేజోసంపన్నుడై యజ్ఞవరాహుని సంహరించును. రజస్వలా సంగమము మరియు బ్రాహ్మణాది మనుష్యుల హత్య కారణముగ పాప పూర్ణమయిన దేహమును వరాహస్వామి విసర్జించును. అఖండ పాపకార్యమునకు ప్రాయశ్చిత్తమిదియే! ప్రాణ త్యాగము ద్వారా సమస్త పాపముల నుండి విముక్తి నొందెదరు. నా జన్మయే ప్రజాపాలనార్థము. అటువంటిది నా అంశ అయిన వరాహదేవుడు ఈ పాపకార్యమాచరించుట తగదు. ప్రజా, దేవతా హితార్థము నేను వరాహరూపమును విడిచెదను.”

అంత దేవ ప్రముఖులిరువురు నారాయణునికి ప్రణామమొనర్చి “మీ అభీష్టము చేయవలసినది” అని పలికిరి. అంత గోవిందుడు దేవతలను వారి వారి ప్రదేశములకు తిరిగి పొమ్మని ఆదేశించి యజ్ఞవరాహుని నుండి తేజమును సంగ్రహించుటకు ధ్యాన తత్పరుడయ్యెను. మాధవుడు నెమ్మదినెమ్మదిగ వరాహ దేహమందున్న తేజస్సు, సత్వము నంతటినీ

తనలోనికి తిరిగి తీసికొనెను. అంత వరాహ ప్రభువు సత్వ హీనుడయ్యెను. దీనిని గమనించి మహాదేవుడు పరమశివుడు ఇతర దేవతా సహితుడై వరాహదేవుని సమీపించెను. బ్రహ్మాది దేవగణములు మహాదేవుని తేజోవృద్ధి కొరకై ఆయనను అనుసరించి వచ్చి, తమ తేజస్సులన్నింటినీ ఆయన యందు నిక్షేపించిరి. దానిచే ఆయన అత్యంత బలీయుడయ్యెను. తదుపరి మహాదేవుడు ఎనిమిది చరణములు గల భయానక "శరభావతారము" ను స్వీకరించెను. ఆయన రెండు లక్షల యోజనములు ఎత్తు, ఒకటిన్నర లక్షల యోజనముల విస్తీర్ణము కలిగి యుండెను. వరాహదేవుని ఎత్తు ఒక లక్ష యోజనములు. అంత వరాహదేవుడు సహితము తన ఎత్తును మరియొక అరలక్ష యోజనములు పెంచెను. అంత యజ్ఞవరాహము యొక్క తల నెలవంకను తగులుచున్నది. కోరల సహితమయిన దీర్ఘనాశిక, కృష్ణవర్ణము, ఎనిమిది దంతములు కలిగిన విస్తృత ముఖము, శరీరమునకు అనురూపమయిన దీర్ఘ పుచ్ఛము కలిగి యజ్ఞవరాహము సహితము మిక్కిలి భయంకరముగ కానపట్టుచుండెను.

అంత వరాహము, మరియు వరాహ పుత్రులయిన సువ్రత, కనక, ఘోరులు ఒకేమారు వీపుపై నాలుగు మరియు క్రింద నాలుగు పాదములున్న శరభ మృగమును చూచి క్రోధాగ్ని సంభవులైరి. వరాహ పుత్రులు ఒకేమారు శరభమును ఎదుర్కొని తను ముఖములతో దానిని పొడిచి ఘాతము కావించిరి. అదే సమయమున యజ్ఞ వరాహము సహితము తన మాయచే శరీరమును మరింత విస్తృతమొనర్చి, శరభమును ప్రహరించెను. అంత చతుర్ వరాహముల ప్రతిఘటన మరియు ప్రహారముల చే శరభుడయిన భూతపతి క్రిందపడి సముద్ర గర్భమున మునిగెను. అంత సువ్రతాది వరాహపుత్రులు తీవ్ర వేగమున సాగరమున దుమికిరి. అది చూచి క్రోధాన్వితుడై యజ్ఞ వరాహము సహితము క్రోధాన్వితుడై భీకర కల్లోల తరంగ సహిత సాగరమున ప్రవేశించెను. ఈ మృగములన్నియు జలరాశి యందు ప్రవేశించుట చే జలమంతయు ఒక్కసారి పెల్లుబికి నక్షత్ర పర్యంతము ఎగసెను. అంత గ్రహ నక్షత్రములు భగ్నమయ్యెను. గొప్ప గొప్ప దేవతలు సహితము భీతినొంది మహర్లోకమున తలదాచుకొనిరి. నక్షత్రములు రాశి చక్రము నుండి భ్రంశమై, పృధివి పై బడి ధరణిని తమ దీప్తి చే నింపివైచినవి. ఈ నక్షత్ర పతనముచే తీవ్ర వేగమున వాయువు వీచి గిరి శిఖరములు కూలినవి. కొన్ని కొన్ని పర్వతములు సముద్రమున పడి మునిగినవి; మరికొన్ని సాటి పర్వతములపై బడి వానియందలి జీవ, జంతు, వృక్షజాలములను విధ్వంసము కావించినవి. వాయు వేగమున పర్వతములు భ్రంశము నొందుట చే, అవి తిరిగి రెక్కలు మొలిచి కదలాడుచుండెనని అనిపించినవి.

శరభ, వరాహములు శృంగ, పర్వత సహితములై, సాగరమున పడుటచే అందలి జలమంతయు పైకిలేచి, ఒక్క క్షణము సాగరమంతయు నిర్జలమయినట్లు కానిపించెను. అశేష జలరాశి పృధివిపై బడి, సమస్త ప్రజావళి నష్ఠమయ్యెను. ప్రజలందరూ జలములందు మునిగి తేలుచూ హా! తండ్రీ! హాతల్లీ! హా! సుతా! అని సంభోదించుచూ రోదింపసాగిరి. శరభ వరాహములు పడిన చోట భూమి క్రిందకు ఒరిగి, రెండవ ప్రక్క పర్వత సహిత అయిన పృధివి జనలోకము వరకు ఎగసెను. శరభమునకు వరాహముల యొక్క బలము, తీవ్రత, వేగము, విక్రమము, కాంచి ఇంచుక భయము, విస్మయము కలిగెను. ఇంతలో వరాహములు తమ ముట్టెతో, కోరలతో, దంతములతో, శరీరముతో శరభమును తీవ్రముగ గాయపరుచుచూ, భయంకర సంగ్రామ మొనరింపసాగెను. శరభము సహితము తన తీవ్ర ముఖాగ్రముతో, తీక్షణ దంతములతో, వాడి అయిన కోరలతో, వేగతరమయిన పుచ్ఛముతో, ఆ వరాహ చతుష్ఠయము నెదుర్కొని తీవ్ర సంగ్రామ మారంభించెను. అంత వారి మధ్య సహస్ర వర్ష పర్యంతము తుముల యుద్ధము కొనసాగినది. ఈ మృగముల యొక్క వేగయుక్త ప్రహారములు, భ్రమణము, గమనము, ఆగమనము, ఆస్ఫోటనము, వికటాట్టహాసముల చే మిక్కిలి భయగ్రస్తులై కద్రువ పుత్రులయిన నాగ, పన్నగములు పాతాళమునకు పారిపోయినవి. అంత ఆ మృగ సమూహము జలము నందు సమరము చాలించి, భూమిపై కేతెంచినవి. ఆ లోపల అనంత దేవుడు ఆదికూర్మము పై ఊన్చుకొని, అతి కష్ఠముతో

పృధివిని సహింప సాగెను. కానీ తన అనంత బల సంపత్తి చే విప్పిన పడగపై ధరిత్రిని ధరించుట చే అత్యంత బాధా సంతుప్తుడయ్యెను.

అంత సుర ప్రముఖుడయిన పరమేష్ఠి బ్రహ్మ అత్యంత చింతా క్రాంతుడై శ్రీహరి తో ఇట్లనియె "హే! ప్రభూ! త్రిభువనవాసులైన దేవ, దైత్య, మానవులు ఎందరో మరణించుచుండిరి. స్థావర జంగమాత్మకమయిన పృధివి సర్వము ధ్వంసమయినది. అంతేకాక యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష, సరీసృప, తపస్వీ గణములన్నియు అకాలమృత్యువు నొందుచుండిరి. ఓ! జగత్పతీ! మీరు సర్వులకు పాలకులు మరియు ప్రభువులు. అందువలన మమ్ము మరియు పృధివిని రక్షింపవలసినది. వరాహదేవుని ఉపసంహరించి సమస్త జగత్తును కాపాడవలసినది. "అంత త్రిభువన సంరక్షణార్ధము శ్రీహరి కంకణము కట్టుకొని సప్తర్షులయిన వశిష్ఠ, విశ్వామిత్ర, అత్రి, కశ్యప, గౌతమ, జమదగ్ని, భరద్వాజులను ఒక ఉత్తమ నౌక యందు యుంచి, తాను వేదములను ధరించి, మహాదేవునికి సంతుష్ఠి నొసరించుటకై, తాను రోహిత మత్స్య దేహమును ధరించి, యుద్ధ ప్రదేశమున కేతెంచెను. వరాహ గణముల ముఖాగ్రముల ఘాతముల చే అత్యంత పీడితుడయిన మహాదేవుని, యుద్ధము నందలి పరిశ్రమ చే కలిగిన బడలిక చే దీర్ఘ నిశ్వాశములను విడుచుచున్న శరభ దేవుని నికటముగ గాంచి, శ్రీహరి తన నృశింహ స్వరూపమును స్మరించెను. తక్షణము నృశింహ దేవుడు ప్రత్యక్షమయ్యెను. అంత విష్ణువు లోకహితార్ధము నృశింహుని తేజస్సును తన లోనికి ఆకర్షించెను.

వరాహ, శరభులిరువురు నృశింహుడు నిస్తేజడగుట, ఆయన తేజస్సు విష్ణువు యందు నిక్షిప్తమగుట కాంచిరి. కానీ నృశింహుడు వరాహ దేవునికి అండగా నిలచి, శరభుని తో సంగ్రామమునకు సిద్ధపడెను. అంత వరాహుడు ఒక దీర్ఘ నిశ్వాసము విడచెను. దాని నుండి అనేక తీక్షణ దంష్ఠ్రలు గల వరాహములు ఉత్పన్నమై, నిర్భయ చిత్తము తో అనేక మాయాజాలములల్లి, శరభాకృతి తో యున్న మహాదేవుని పై ప్రహారములు కావింప దొడంగెను. అంతేకాక ఆ వరాహములు తమ మాయచే భయంకర అశ్వ, పక్షి, మనుష్యాది కామరూపములు ధరించి, మహాదేవుని సహితము భయయుక్తుని గావించెను. అంత శ్రీహరి శరభుని చేరి తన పరమ పావనమయిన హస్తము తో ఆయనను స్పృశించి, తన తేజస్సును ఆయన యందు నింపెను. అంత మహాదేవుడు పురుషోత్తముడయిన విష్ణు స్పర్శచే, శారీరక, మానసిక వ్యధ, అలసటను విడచి, ఆనందానుభవము నొంది, తన పూర్వ బల, పరాక్రమములను తిరిగి పొందెను.

అంత శరభుడు అత్యుత్సాహముతో పదునాలుగు భువన భాండములు వణుకునట్లు తీవ్ర నాదమును కావించి, ఒక తీవ్ర నిశ్వాశము నుత్పన్నము కావించెను. దాని నుండి ప్రచండమయిన ప్రమధగణములు ఉత్పన్నమయినవి. మహాదేవుని పూత్కారము నుండి వెలువడిన ప్రమధగణములు వరాహ గణముల కంటె అధిక బలతీవ్రతలు గలిగినవి. అవి వరాహము, కోతి, నక్క, తోడేలు, ఎడ్లు, ఎలుగుబంట్లు, పిల్లి, ఏనుగు, మొసలి, సింహము, పులి, సర్ప, మూషిక, హయగ్రీవ, హయముఖ, మహిష, మనుష్య, మృగ, మేఘ, మస్తకహీన, పాదహీన మనుష్యగణములు, హస్త రహిత, అనేక హస్త, శరభ, బల్లి, మత్స్యముఖ, ఏకపాద, ద్విపాద, త్రిపాద, చతుష్పాద, భూరిహస్త, యక్ష, కిన్నెర, అశ్వముఖ, పంఖయుక్త, లంబోదర, మహోదర, దీర్ఘోదర, స్థూలకేశ, వికర్ణ, బహుకర్ణ, దీర్ఘదంతాది – ఈ సృష్ఠిలో ఎన్ని జంతువులు యున్నవో, అన్ని మిశ్రితావయవములు కలిగిన జీవులు తమ తమ పదునాలుగు నుండి పదహారు పుత్ర సంతతితో పుట్టుకొచ్చినవి. ఈ బ్రహ్మాండము నందు ప్రమధగణ స్వరూపము లేని జంతువు లేదనిన అతిశయోక్తి కాదు. అవన్నియు ఖడ్గ, పరిఘ, తోమర, భిందిపాలములను, అంకుశ, కరవాల, పాశ, శంఖు, ఖట్వాంగ, త్రిశూల, కపాల, శక్తి, శూల, యష్ఠి, కంటక, అస్త్ర సహిత కోదండములు ధరించి, ఏతెంచినవి. అంతేకాక ఆ ప్రమధగణములన్నియు జటాజూటము, చంద్రలేఖ, కపాలము మొదలగు శైవ లక్షణమలు ధరించి వెలువడినది. వాని వేషభాషలు సహితము మహాదేవుని అనుకరించుచూ, యుండగా మరికొన్ని అర్ధ నారీశ్వర రూపము ధరించి తన రమణి యందు ఉత్సుకత తో యున్నవి.

ఈ మహేశ్వర ప్రమథ గణములన్నియు స్వేచ్ఛగా ఆకాశము నందు విహరించు శక్తి కలిగినవి. అవి అన్నియు తెలుపు, ఎరుపు, పసుపు, నీలి వర్ణము, మరియు మిశ్రిత వర్ణములు కలిగియుండి ఢిండిమ, పటాహ, శంఖ, భేరీ, వేణువు, జర్జరము, మృదంగము, వీణ, తంత్రీవాద్యములు గోముఖము, కుండము మొదలగు వాద్యముల సహితులై, అట్టహాసములు కావించుచూ, లోకములకు ఆంధోళన కలిగించుచూ యజ్ఞవరాహుని ముందు కేతెంచిరి. అంత శరభుడు వారందరికీ "మీరందరూ క్రూరకర్ములై ఈ వరాహములపై దండెత్త వలసినది." అని ఆదేశించెను. నానా శస్త్రధరులయిన ప్రమథ గణములు మహాదేవుని ఆజ్ఞను అనుసరించి ఘోర సంగ్రామ మారంభించిరి. ప్రమథ వరాహములు భూమిని వీడి ఆకాశచరులై భయంకర తుముల యుద్ధము జరుపుచుండిరి. అద్దానిచే ప్రళయకాల వాయువు సాగర తరంగములను కల్లోల పరుచునట్లు, వీరి సమరము సర్వసాగరమును అతలాకుతలము గావించెను. ప్రమథ గణములు అధిక సంఖ్యలో వరాహ గణములను పంచత్వము నొందించిరి. తన గణములు నాశనమగుట గాంచి, వరాహదేవుడు ఆత్మావనాలోకియై, పూర్వాపరముల విచారించుట నారంభించెను. అది గమనించిన విష్ణుదేవుడు వరాహునికి సమస్తము ప్రత్యక్ష మొనరించెను. అంత వరాహుడు సహితము దేహత్యాగమే శ్రేయస్కరమని తలచెను. అదే సమయమున శరభమయిన మహాదేవుడు తన దంతములతో నృశింహుని నర, పంచాస్య రూపమును రెండుగా ముక్కలు గావించెను. ఆ రెండు ముక్కల యందలి నరాకృతి మహాతపస్వి, దివ్యాకృతుడయిన నరమహర్షి, సింహరూపము నుండి పరమతపస్వి నారాయణ మహర్షి ఉత్పన్నమయిరి. బుద్ధిశాలురు, మహామతులయిన ఈ మహర్షులిరువురు, వారి అలౌకిక ప్రభావము చే వేద, శాస్త్ర, తపస్యాది క్రియలందు సర్వులకు మార్గ దర్శకులయిరి.

తదుపరి అచ్యుతుడు నరనారాయణు లిరువురినీ, సప్తర్షులు యున్న నౌక యందు కూర్చుండబెట్టి, వరాహ, శరభులున్న చోటికి ఏతెంచెను. అంత వరాహ దేవుడు వారిరువురినీ చూచి "లోక హితార్ధము నేను అవశ్యము దేహత్యాగము కావింతును." అని పలికి, శరభుని కాంచి ఓ! మహాదేవా! నేను దైవ, ఋత్విజ, లోక హితార్ధము శరీర త్యాగము కావించెదను. నా సమస్త అంగముల చే యజ్ఞయూప నిర్మాణము కావింపవలసినది. నా వివిధాంగముల చే యజ్ఞ పరికరములైన సమిధలు, స్రుక్, స్రువములు, చేయవలసినది. నా దేహము నుండి ఉత్పన్నమయిన యజ్ఞ ద్రవ్యములన్నియు పృధివిపై స్థాపింపవలసినది. జగత్తు సర్వము యజ్ఞరూప మగుట వలన, నా నుండి ఉత్పన్నమగు ఇతర ద్రవ్యములు సహితము మిక్కిలి ఉపయోగకరములు అగును. మహాదేవా! నా వలన రజస్వల అయిన పృధివి గర్భము ధరించినది. ఆ గర్భము నుండి పుట్టు బిడ్డ చిరకాలము నివసించును. ఆతనిని నీవు రక్షింపవలసినది. ధరణి సర్వము భారాక్రాంతమై తన పుత్ర వదార్ధము మిమ్ములను ప్రార్ధించినపుడు మీరు ముప్వురు వానిని నాశనము చేసి పృధివికి భారహరణము కావింప వలసినది. పృధివి భారము చే వంద యోజనములు పాతాళమునకు క్రుంగినపుడు, తిరిగి నేను శృంగ విరాజితుడనై ధరిత్రిని ఉద్ధరించెను. మీ వీర్యము చే ఉత్పన్నమగు షణ్ముఖుడు దేవ సేనాపతియై అసుర సంహారము కావించిన అనంతరము, నా వరాహ దేహమును నాశము చేయును." వరాహదేవుడు ఈ విధముగ పలికిన పిదప ఆయన దేహము నుండి కోటి సూర్యుల దీప్తివంతము, జపాకుసుమ సంకాశము, అయిన తేజస్సు వెలువడి శ్రీ మహా విష్ణువు యందు లీనమయ్యెను. ఇది ఒక అద్భుత ఘటన. అంత భగవానుడు ముప్వురు వరాహ పుత్రులయిన సువ్రతుడు, కనకుడు, ఘోరుని వద్ద నుండి తేజస్సును గ్రహించెను. వరాహ పుత్రుల దేహము నుండి అగ్ని వంటి తేజస్సు వెలువడి శ్రీహరి యందు ప్రవేశించెను. అటు పిదప శరభుడు వరాహ దేవుని కంఠమును తన తీక్షణ దంతముల తో కొరికి, ఆయన దేహమును సముద్రమున పడవైచెను. తదుపరి శరభుడు వరాహ పుత్రుల శిరములు శరీరము నుండి కొరికి వేరుపరిచి సముద్రము నందు విసరివైచెను. ఈ సమస్త మృగ శరీరములు సాగరము నందు పడగనే ప్రచండ శబ్దముదయించెను. ఈ విధముగ పుత్రసహితుడయిన వరాహుడు నిహతుడయిన పిదప త్రిమూర్తులు తిరిగి పున:సృష్టికై మంత్రాలోచన

మొదలిడిరి.

ఆ సమయమున ప్రమధ గణములన్నియు నాలుగు భాగములై మహాదేవుని వద్ద కేతెంచి ఆయనను అర్చించిరి. అందలి ఒక భాగము జటాజూటధారులై, అర్ధచంద్ర యుక్తులై, భోగవిముఖులైన ధ్యాన పరాయణులై, యోగులై, అరిషడ్వర్గ రహితులై, మహాదేవునికి అత్యంత ఆనందము కలుగజేసిరి. ఈ వ్రత పరాయణులు, పరమేశ్వరుని నలుప్రక్కలా మొహరించి, నిరాహారులై, క్లేశరహితులై, పరమేశ్వరుడు బ్రహ్మ చింతనా మగ్నుడయినప్పుడు ఆయనను సేవించుట మొదలిడిరి. వేరొక భాగము అణిమాది అష్టసిద్ధియుతులై, సింహ, వ్యాఘ్రరూపధారులై, పదహారు కోట్ల మంది ప్రమధులు వ్రతశీలురై నిలిచిరి. మిగిలిన ప్రమధులు వివిధాభరణ అలంకృతులై, శివుని వలె శ్వేతవర్ణులై, వృషభారూఢులై, పార్వతీ సదృశ సుందర మదవతీ సేవితులై, విచిత్రమాలా శోభితులై, ఉమాసహిత క్రీడారతుడయిన మహాదేవునికి సహాయకులుగ యుండిరి. వీరి స్వరూపము అర్ధ నారీశ్వర శివుని పోలియున్నది. మహాదేవుడు పార్వతీసహితుడై సుఖ విలాసము లందు తేలియాడునపుడు ఈ అర్ధనారీశ్వర స్వరూపులు వారికి ద్వారపాలురు అగుదురు. పార్వతీ పరమేశ్వరులు సంచారమున కేగునపుడు ఈ ప్రమధులు వారిని అనుసరించెదరు. పరమేశ్వరుడు ధ్యానమగ్నుడయినపుడు వీరు జలములాది వస్తువులు సేకరించి, పరిచర్యలు కావింతురు. మిగిలిన ప్రమధులు దాదాపు తొమ్మిది కోట్ల మంది మహావీరులు, స్వేచ్ఛా కామరూపులు, యుద్ధ కుశలురు,  సంగరమందు ప్రత్యర్థులను మధనము కావించెదరు. మరి కొంతమంది ప్రమధులు నృత్య, సంగీత కుశలురు. వారు మృదంగ పణవాది వ్యాదములు మ్రోగించుచూ, మధుర స్వరముతో ఆలపించుచూ, పరమేశ్వరుని ఎదుట నృత్యము కావించెదరు. కొంతమంది ప్రమధులు మూడు కోట్ల మంది నానారూపములు ధరించి, అప్రమత్తులై పరమేశ్వరుని అనుగమింతురు. ఆ ప్రమధులు సర్వజ్ఞులు, సర్వ సమర్థులై, తమ మాయా బలము చే పరమేశ్వరుని సర్వ కార్యములు సమర్ధవంతముగ నిర్వహించు చుండిరి. అణిమాది అష్టసిద్ధియుతులైన ప్రమధులు, ఒక్క ముహూర్త కాలములో త్రిభువనములను తిరిగి రాగల బలయుతులు. "రుద్రులు" అనబడు ప్రమధులు జటాజూటము చంద్రరేఖ ధరించి ఇంద్రుని ఆదేశము చే సర్వదా స్వర్గము నందు నివసించెదరు. ఒక కోటి మంది ప్రమధులు అప్రమత్తులై, ఎల్లప్పుడూ మహాదేవుని సేవ కొరకు నియుక్తులై యుందురు. ఈ ప్రమధుల పూర్ణ సంఖ్య ముప్పది ఆరు కోట్లు; వీరు తమ మహిమ చే ధార్మికులను పరిపాలించుచూ, పాపులను విస్మయాన్వితులను కావించుచూ, పాశుపత దీక్ష స్వీకరించిన మానవులను అనుగ్రహించుచూ, జితేంద్రియులైన యోగుల యొక్క విఘ్నములను వినాశనము కావించెదరు.

ఈ గణములన్నియు వరాహ గణముల నాశనార్థము, జగత్తు యొక్క హితార్థము, శంకరుని యొక్క సేవార్థము, ఉత్పన్నమయినవి. ఈ గణములు శరభుడు వరాహ, నృశింహ, వరాహ గణములను వీక్షించిన మీదట ఆయన విడిచిన నిశ్వాసము నుండి ఉత్పన్నమై, అనేక రూపములు స్వీకరించినవి. ఇవి చూచుటకు మిక్కిలి క్రూరముగ, భయంకరముగ కనిపించినప్పటికీ, యదార్ధముగ ఈ గణములు అమిత తేజస్వులై, క్రూరత్వమును విడచి సాధుస్వభావులై యుందురు. వీరు వన, పర్వతములందు అర్పింపబడిన ఫల, జల, పత్ర, పుష్ప, వ్రేళ్ళను ఆహారముగ స్వీకరించెను. అంతేకాక చైత్ర చతుర్ధశి మినహా మిగిలిన దినములన్నియు మాంసాహారమును స్వీకరించెదరు. కానీ మహాదేవుడు ఆ రోజు సహితము వేట భోజన మారగించును. వారాహ గణములను సంహరించిన పిదప ఈ గణములన్నియు మహాదేవుని లో కలసి మాంసాహారము స్వీకరించుట నారంభించినవి.

ఏ వ్యక్తి సాంఖ్యయోగాంర్గతమయిన ఈ ప్రబంధమును శ్రవణము కావించునో,  ఆ జీవి దీర్ఘాయుష్కుడై, సర్వదా ఉత్సాహముతో నిశిత యోగవిద్యా రహస్యములను ఆకళించుకొనును.

**(శ్రీ కాళికా పురాణమందలి వరాహ శరభుల సమరమను ముప్పదియవ అధ్యాయము  సమాప్తము)**

# ముప్పది ఒకటవ అధ్యాయము

**(వరాహ దేవుని యజ్ఞ స్వరూపము, వరాహ శరీరము నుండి యజ్ఞోత్పత్తి)**

పరమ రసవత్తరముగ సాగుచున్న మహత్తర కాళికాపురాణమను వినుచున్న కమఠాది ఋషులు మార్కండేయుడుని ఆపి ఇట్లు ప్రశ్నించిరి "భగవాన్! వరాహ భగవానుని దేహము యజ్ఞ స్వరూపముగ ఎట్లు మారినది? సువృతాది వరాహ పుత్రులు అగ్ని రూపులుగ ఎట్లు మారిరి? మహాత్ముడయిన వరాహ దేవుడు జనక్షయకరమయిన అకాల ప్రళయమును ఎందుకు సృష్టించెను? శాంగ ధన్వి అయిన హరి రోహిత మత్స్య రూపుడై ఎందువలన వేదరక్షణ గావింప వలసి వచ్చినది? పున: జగత్తు ఏ విధముగ సృష్టింపబడినది? పాతాళమునకు ఒరిగిన ధరణిని ఏ మహాత్ముడు తిరిగి ఉద్ధరించెను? మహాదేవుడు శరభదేహమును ఎట్లు త్యజించెను? ఆయన శరభ దేహమును త్యాగ మొనర్చిన పిదప ఆ దేహము ఎట్లు పరిణతి చెందెను? మహాత్మా! మీరు ఈ పరిణామముల నన్నింటినీ కన్నులతో కాంచిరి. మాకు ఈ విషయములను దయచేసి తెలుపవలసినది. మమ్ములను కరుణతో కటాక్షింప వలసినది."

అంత మార్కండేయుడు "ఋషి ప్రవరులారా! ఈ ప్రశ్న అత్యుత్తమము. ఈ ఆఖ్యానము సర్వ ఫల ప్రదాయకము. దయచేసి వినవలసినది. యజ్ఞము సర్వులకు, సర్వములకు మూలము. జీవులు అన్నగత ప్రాణులు. అన్నము వర్షము వలన కలుగును. వర్షము యజ్ఞము చే ఉత్పన్నమగును. యజ్ఞము చే దేవతలు సంతసించి, సంతుష్టి నొంది వర్షమును ప్రసాదించెదరు. దీనిని మరింత విశేషముగ వర్ణించెదను. శరభుని ద్వారా వరాహుడు విదీర్ణుడయిన పిదప ఆయన దేహము జలములందు విసిరివేయబడినదని వింటిరి కదా! తదుపరి త్రిమూర్తులు ప్రమధుల సహాయముచే వరాహ దేహమును జలముల నుండి వెలికి దీసి, ఆకాశము నందు ప్రతిష్ఠించి, అద్దానిని శ్రీహరి సుదర్శన చక్ర సహాయముతో ఖండఖండములుగ ఖండించెను. తత్కారణ మేమన వేరువేరు భాగములయిన వరాహ శరీరపు ఖండముల సంధి భాగములు వివిధ యజ్ఞములుగ పరిణతి చెందినవి.

వరాహ శరీరపు భ్రూద్వయ, నాసికా మధ్య భాగము "జ్యోతిష్ఠోమ" మను మహాయజ్ఞ మయినది. కపోల పై భాగము నుండి కర్ణమూలము వరకు "బర్హిష్ఠోమ" మను యజ్ఞమయినది. నేత్ర, భ్రూద్వయ సంధి భాగము "వ్రాత్యష్ఠోమ" యజ్ఞముగ మారినది. ముఖాగ్రము మరియు పెదవుల సంధి భాగము "పౌనర్భవష్ఠోమ" యజ్ఞముగ పరిణమించినది. జిహ్వామూల సంధి భాగము "వృద్ధి ష్ఠోమము" మరియు "బృహష్ఠోమ" యజ్ఞములుగ మార్పు చెందినది. జిహ్వా యొక్క అధోభాగము "అతిరాత్రము" మరియు "వైరాగ్య" యజ్ఞము లయినది. వేదాధ్యయనమే "వైదిక యజ్ఞము" పితృ గణములకు తర్పణ ఏ "పైతృక యజ్ఞము". దేవతలను తృప్తి పరచుటకు చేయు హోమము "దైవయజ్ఞము", మరియు మేషాది జంతువులను బలి ఇచ్చు కార్యము "భౌతిక యజ్ఞ" మనబడును. మనుష్యుల చే గావింపబడు అతిథి పూజ "నృయజ్ఞ" మనబడును. ప్రతి దినము చేయబడు స్నాన, తర్పణములు "నిత్య యజ్ఞము" లగును. యజ్ఞ వరాహపు కంఠసంధి మరియు జిహ్వా నుండి ఈ తెలుపబడిన యజ్ఞములు మరియు వాని విధులు ఉత్పన్నమయినవి. "అశ్వమేధ", "నరమేధ", మరియు "మహామేధ" ములను ప్రాణి హింసాత్మక యజ్ఞములు వరాహుని చరణ సంధులు నుండి ఉద్భవించినవి. "రాజసూయము", "వాజపేయము" అన్ని "గ్రహ యజ్ఞములు" వరాహ దేవుని పుష్ఠ సంధుల నుండి ఉత్పన్నమయినవి.

"ఉపనయనాది" సంస్కారములు, 'ప్రాయశ్చిత్త'" యజ్ఞములు వరాహుని లింగ, వృషణ సంధుల నుండి వెలువడినవి. అన్ని విధములయిన "రాక్షస, సర్ప, అభిచార, గోమేధ, వృక్షజాప" యజ్ఞములు ఆయన గిట్టల నుండి ఉద్భవించినవి. "మయోష్ఠి, పరమేష్ఠి, గీష్పతి, భోగజ, అగ్నిష్ఠోమ" యజ్ఞములు ఆయన పుంఛము (తోక నుండి), "సంక్రమణాది కృత్యములు,

నైమిత్తిక మరియు ద్వాదశ వర్షీయ" యజ్ఞములు పుచ్ఛ సంధుల నుండి ఆవిర్భవించినవి. "తీర్థ ప్రయోగములు", "మాస సంకర్షములు", "ఆర్క" మరియు "అధర్వణ" యజ్ఞములు ఆయన యొక్క నాడీ సంధుల నుండి ఉత్పన్నమయినవి. "ఋచోత్కర్షము", "క్షేత్ర యజ్ఞము", "పంచ మార్గము", "లింగ సంస్థానము", "హేరంభము" అను యజ్ఞములు ఆయన మోకాళ్ళ నుండి ఉద్భవించినవి. "స్రుక్" "స్రువాది" అన్య పరికరములు ఆయన ముఖాగ్రమున యున్న నాసిక నుండి పుట్టినవి. ఓ! ద్విజోత్తములరా! ఈ విధముగ యజ్ఞవరాహుని దేహము నుండి ఒక వేయి ఎనిమిది యజ్ఞములు ఆవిర్భవించినవి. అంతేకాక ఆయన గ్రీవము నుండి "ప్రాగ్వంశము" (హోమగృహ పూర్వ భాగమందు యుండు గృహము), కర్ణ ద్వయము నుండి "ఇష్టా పూర్తములు", యజు ధర్మములు జన్మించినవి. దంతముల నుండి యూప స్థంభములు, రోమముల నుండి కుశలు (దర్భలు); ఎడమ వైపు ముందు, వెనుక కాళ్ళ నుండి "హోత, ఆధ్వర్యువు, కాష్ఠములు", మస్తిష్కము నుండి "పురోడాశము", మరియు "చరువు", నేత్రద్వయము నుండి కార్యసిద్ధికరము, పరమ సుందరమయిన "ప్రజ్వలించు అగ్ని", గిట్టల నుండి "యజ్ఞ కేతువు", (ధ్వజము), మధ్య ప్రదేశము నుండి "యజ్ఞవేది", "లింగ", వృషణ భాగముల నుండి "యజ్ఞ కుండము" ఉత్పన్నమయినవి. యజ్ఞ వరాహుని వీర్యము నుండి ఘృతము (నెయ్యి), కామ భావనల నుండి సర్వ మంత్రములు, పృష్ఠ దేహము నుండి యజ్ఞగృహము, హృదయ పద్మము నుండి 'యజ్ఞము'", కక్ష్య నుండి "ముంజగడ్డి" జన్మించినవి. ఆయన ఆత్మ ఏ "యజ్ఞ పురుషుడు". ఇదే విధముగ ఆయన దేహము నుండి "హవి", "భాండము" మొదలగు యజ్ఞ ద్రవ్యములు ఉద్భవించినవి.

సర్వ జగత్తు యజ్ఞరూపమే అని తెలుపుటకు వరాహదేవుని దేహము యజ్ఞరూపముగ పరిణతి చెందినది. తదుపరి త్రిమూర్తులు యజ్ఞసృష్టి జరిపి, వరాహ పుత్రత్రయము వద్దకు ఏతెంచి, ఆ ముప్వురి దేహములను ఒక దరికి చేర్చిరి. అంత జగత్‌స్రష్ఠ అయిన పరమేష్ఠి సువ్రతుని దేహమందు వాయు సంచలనము కావించెను. దానిచే "దక్షిణాగ్ని" ఉత్పత్తి అయినది. కేశవుడు కనకుని దేహము నందు వాయు పూరణము గావించెను. అద్దాని చే "గార్హ పత్యాగ్ని" ప్రాదుర్భావము నొందెను. మహాదేవుడు ఘోరుని దేహమును వాయువు తో నింపెను. దాని చే "ఆవహనీయాగ్ని" ఉద్భవించెను. ఈ అగ్నిత్రయము త్రిభువన మూలకారణము. ఈ అగ్నిత్రయము ప్రతిదినము ఎచ్చట ప్రజ్వరిల్లునో, అచట సకల దేవతలు నివాసముందురు. ఈ అగ్ని దేవతా స్వరూపము మరియు పరమ కళ్యాణ కారకము. ఏ ప్రదేశము/గృహము నందు నిత్యము ఈ త్రేతాగ్నుల చే హోమము చేయబడునో వారికి చతుర్విధ పురుషార్ధములయిన ధర్మార్ధ కామ మోక్షములు కరతలామలకములు అగును.

**(శ్రీ కాళికా పురాణము నందలి వరాహ శరీరము నుండియజ్ఞోత్పత్తి అను ముప్పది ఒకటవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పది రెండవ అధ్యాయము

**(మను, కపిల సంవాదము, ప్రళయ వర్ణనము, మత్స్య స్వరూప వర్ణనము)**

మార్కండేయ మహర్షి "ఋషి సత్తములారా! అకాలమున వరాహ భగవానుడు సర్వజన క్షయకారి అయిన ప్రళయమును ఎందుకు సృష్టించెనో తెలిపెదను. భగవానుడు మత్స్యరూపమున సమస్త వేదములను రక్షించెను. ఆ మహాపాప నాశక వృత్తాంతమును వినవలసినది. మహాముని, సాక్షాత్ విష్ణువు యొక్క అంశావ తారమయిన కపిలుడు సిద్ధుల యందు ప్రధానుడు. ఒకానొక సమయమున విష్ణు భగవానుడు ఒక మహా సిద్ధుడయిన పుత్రుని పొంద దలిచెను.

అంత ఆయన నుండి కపిలుడు ఆవిర్భవించెను. స్వాయంభువ మన్వంతరమున ఒకనాడు కపిల మహర్షి, స్వాయంభువ మనువు తో ఇట్లనియె "ఓ! మహామతీ! బ్రహ్మపుత్రా! ముని ప్రవరా! స్వాయంభువ మనూ! మీరు ప్రస్తుతము ఈ జగత్తుకు పాలకులు. స్వర్గ, మర్త్య, పాతాళ వాసులందరికీ మీరే ప్రభువు. రక్షకులు, వర ప్రసాదులు, ధాతా, విధాతా, సర్వేశ్వరేశ్వరులు మీరే! ఈ త్రిభువనముల యందు దుర్లభము, పాపనాశకము, పవిత్ర జ్ఞాన స్ఫూర్తి దాయకమగు జ్ఞానమును పొందుటకు తపమొనరించుటకై సరి అయిన స్థానమును నాకు తెలుపవలసినది. ఏ ప్రదేశమున తపమొనరించిన ఎడల నాకు త్వరితముగ జ్ఞాన ప్రాప్తి కలుగునో, అద్దానిని శలవీయవలసినది. నేను సర్వ జీవులకు జ్ఞాన నేత్రము చే ప్రత్యక్ష దర్శన మొనరించి, లోకులను ఉద్ధరించెదను. అజ్ఞాన జలధి యందు కొట్టిమిట్టాడుచున్న జనులకు జ్ఞానరూప నౌక ను ఆశ్రయముగ నిచ్చి వారిని ఒడ్డుకు చేర్చెదను. ఓ! జగదీశ్వరా! ఈ కార్యము నందు కృతకృత్యుడనగు యుక్తిని బోధింప వలసినది."

మహాత్ముడయిన కపిలసిద్ధుని పలుకులాలకించి స్వాయంభువ మనువు ఇట్లనియె "మహాత్మా! కపిలా! మీరు సర్వ జీవుల యందునూ జగత్ హితార్థమై జ్ఞానదీపమును వెలిగింప ప్రయత్నించు చున్నారు. దానికి స్థాన ప్రయోజనమేమి? పూర్వకాలమందు పరమేష్ఠి అత్యాశ్చర్య కరమయిన తపమాచరించెను. ఆయన ఎన్నడు స్థానము గూర్చి ఆలోచింపలేదే! మహాదేవుడు విషయవాంఛలు వదలి పదివేల దివ్య వత్సరములు తపము చేసెను. ఆయన సహితము ఎన్నడూ ఒక ప్రత్యేక స్థానము కొరకు ప్రయత్నింప లేదు. దేవేంద్రుడు, అగ్ని, శమనుడు, నైఋతి, వరుణుడు, వాయువు, కుబేరాది దిక్పాలురు సహితము అత్యంత కఠిన తప మాచరించిరి. వారు సహితము స్థాన యత్నము కావింపలేదు. ఓ! కపిలమునీ! ఈ విస్తారమయిన భూమండలముపై అనేక దేవాలయ, తీర్థ, క్షేత్ర స్థానములు యున్నవి. ఈ స్థానములందు దేనినయిననూ తపమునకు అనుకూలముగ తీసికొనవచ్చును. మీరు నన్ను తపోస్థానము నడుగుట కేవలము ఆత్మస్తుతియే! ఆత్మ శ్లాఘనము తపస్వులకు అత్యంత అనుచితము." స్వాయంభువ మనువు పలుకులు వినిన కపిలుడు క్రోధితుడై ఇట్లనియె "మీరు జగదధిపతులు అగుట వలన నేను వలయు తపోస్థలిని అరసితిని. కానీ మీరు నిష్ఠుర వాక్యముల చే నన్ను అవమానించిరి. త్రిభువనాధిపత్యము చే మీరు గర్వితులైరి. నేను కేవలము నియమిత ఘన తపోస్థలికై మిమ్ములను ప్రార్థించితిని. కానీ నా పలుకులు మీకు ఆత్మశ్లాఘనము వలె కానపట్టినది. మీ దారుణ, కఠోర వాక్యములు నన్ను మిక్కిలి అశాంతి కి గురిచేయుచున్నవి. శీఘ్రమే మీకు ఈ దుష్కర్మ యొక్క పలితము లభించును. దేవ, దానవ, మానవ సహిత ఈ త్రిభువనములు విధ్వంసమగును. ఎవరు ఈ పృధివిని ఉద్ధరించి, నియమించి, స్థాపించెదరో, వారే ఈ పృధివిని నాశమొనర్చెదరు. అంతేకాక ఎవరు ఈ సృష్టికి పోషకులో, వారే స్థావర, జంగమాత్మక మయిన ధరణిని నాశమొనర్చెదరు. ఓ! స్వాయంభువ మనూ! నా పలుకులు వినుము! నీ గర్వ కారణమున త్రిలోక సహిత బ్రహ్మాండమంతయు విధ్వంసమై, దేవ, గంధర్వ, మనుష్యులతో నిండిన జగము జలమయమగును."

ఈ విధముగ స్వాయంభువ మనువును శపించి కపిలుడు బ్రహ్మలోకము నకు ఏగెను. అంత స్వాయంభువుడు విషణ్ణ హృదయుడై, తానునూ భవిష్యత్‌ను తెలియును గావున మౌనము వహించెను. కానీ హృదయము అత్యంత ఆందోళనకు గురి అయ్యెను. అంత బుద్ధిమంతుడయిన మనువు జగత్ హితార్థమై, గరుడ ధ్వజుడయిన గోవిందుని దర్శనార్థమై తపము చేయ నిశ్చయించి, పవిత్ర సరిత, పరమ పావని అయిన గంగ బహిర్గతమయిన బదరికాశ్రమమున కేగెను. ఆ ఆశ్రమమంతయు పుణ్య ప్రదము, పాపనాశకము, సర్వ కాలమందు ఫలప్రదము, కోమలము, శీతల తరు ఛాయాయుక్తము, సంతాప నివారకమునై, పచ్చని ఆకులు గల బదరీ వృక్షములు చే నిండియుండెను. ఈ బదరీ ప్రదేశమంతయు గంగా ప్రవాహము చే వృద్ధి నొందుట చే అనేకమంది ముని, ఋషి గణములు ఇచటకు ఏతెంచి తపమాచరించెదరు. ఈ ప్రదేశము పుష్ప భరిత సరోవర యుక్తము, సర్వ మంగళాత్మకము, నానా మృగగణ శుశోభితము.

స్వాయంభువ మనువు మితాహారియై, దృఢ మనస్కుడై, నిశ్చయాత్మకుడై ఇచట తీవ్ర తపశ్చర్య నారంభించెను.

మనవు **"ఓం! నమో వాసుదేవాయ శుద్ధ జ్ఞాన స్వరూపిణే, హిరణ్యగర్భ పురుష ప్రధానావ్యక్తరూపిణే!"** అను మంత్రముతో జగత్కారణుడు, సర్వ కళ్యాణ నిధానుడు, జగన్నాధుడు, నవీన మేఘ వర్ణ సంజాతుడు, శంఖ, చక్ర, గదా పద్మధారి, కమలనయనుడు, పీతాంబరధారి, గరుఢారూఢుడు, లోకనాధుడు, వ్యక్తావ్యక్త స్వరూపుడు, సహస్రశీర్ష, సహస్రాక్షుడు, సర్వవ్యాపి, జగదాధారుడు, అజుడు అయిన నారాయణుని ధ్యానించుట ఆరంభించెను. అలతి కాలము లోనే కేశవుడు ప్రసన్నుడై ఒక ప్రచ్ఛన్నరూపము ధరించెను. అందు ఆయన ఒక అతి చిన్న మత్స్యరూపుడై, దూర్వాదళ శ్యామవర్ణుడై, కర్పూర కణముల వంటి ఉజ్వల నేత్ర ద్వయముతో, స్వాయంభువుని వద్ద కేతెంచి, రుద్ధ కంఠుడై ఇట్లనియె "ఓ! తపోనిధీ! ఒక బృహత్ మత్స్యము నాతో యుద్ధము సలిపి నన్ను భక్షింపదలచినది. నేను మిక్కిలి భయగ్రస్తనై యుంటిని. ఓ! మహాభాగా! ప్రతి దినము భయంకర మత్స్యములు నన్ను భుజించుటకై నా వెనుక పరుగులిడు చున్నవి. నేను ఆత్మ రక్షణార్ధమై మిక్కిలి భయభీతనై యున్నాను. మిమ్ములను శరణు జొచ్చుచున్నాను. నన్ను రక్షింపవలసినది!!" అత్యంత అనుకంపానిధి అయిన స్వాయంభువుడు వెంఠనే ఆ మత్స్యమునకు అభయమిచ్చి అద్దానిని తన దోసిలి లోనికి తీసికొనెను. చూచుచుండగనే ఆ మత్స్యము రోహిత వర్ణము లోనికి మారి దోసిలి నిండెను. అంత మనువు ఆ మత్స్యమును తన ఆశ్రమము నందలి ఒక పెద్ద కడవ యందు వైచెను.

**(శ్రీ కాళికా పురాణము నందలి మను కపిల సంవాదమను ముప్పది రెండవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పది మూడవ అధ్యాయము

**(మను మత్స్య సంవాదము, అకాల ప్రళయ వర్ణనము)**

మార్కండేయ మహర్షి చెప్పదొడంగెను "అతి తొందరగ ఆ మత్స్యము ఆ కడవ యందు పెరుగుట నారంభించెను. అంత స్వాయంభువుడు ఆ ముత్స్యమును తన నారాయణ ఆశ్రమమున యున్న ఒక కమలభరిత సరోవరము నందు వైచి, తన సొంత పుత్రిక వలె సాకసాగెను. అత్యంత కొద్ది సమయములో ఆ మత్స్యము ఆ సరోవరము నందు తిరుగుటకు వీలు లేనంత పరిమాణము నొందెను. అంత మత్స్యము తిరిగి "నన్ను రక్షింపవలసినది" అని రోదన మొదలు పెట్టెను. అంత మనువు సరోవరము చెంతకేతెంచి, అత్యాశ్చర్యముతో అద్దానిని కాంచి, తన రెండు చేతులతో ఆ మత్స్యమును అతి కష్టముతో పై కెత్తి, అతి జాగ్రత్తగా సముద్రము నందు విడచి "ఇచట నీవు నీ ఇచ్ఛానుసారముగ వృద్ధి నొందుము" అని పలికెను. అంత ఆ మాయామత్స్యము తన శరీరమును వృద్ధినొందించి సాగరమంతయు విస్తరిల్లెను. స్వాయంభువుడు సముద్రపు త్రుళ్ళనచి విస్తరించిన శిలాయుతమయిన మానస పర్వతము వలె సముద్రోపరితలమున ఎగసిన శరీరముతో విలసిల్లిన మత్స్యరాజమును కాంచి, ఇయ్యది సామాన్య మత్స్యము కాదని మనమున తలంచి ఇట్లనియె.

"మహాప్రభో! మత్స్యప్రవరా! మీ లఘుత్వము మరియు మహత్వమును కనుటచే మీరు సాధారణ మీనమని నేను తలంచుట లేదు. ప్రభూ! మీ నిజరూపమేమి? మీరు ఈ మీన రూపము ధరించిన పరమేష్ఠియో, నారాయణుడో లేక రుద్రుడో అయి యుండవలయును. గోపనీయము కాని ఎడల నా యందు దయయుంచి శలవీయవలసినది." అంత మత్స్యము "ఓ! ప్రజాపతీ! నీవు నిత్యము ఆరాధించు సనాతన విష్ణురూపమును నేనే!! నీవు ఏమి ప్రార్ధించితివో దానిని సంపన్నము కావించుటకు నేను అవతారము స్వీకరించితిని. నీ కోరికను తీర్చెదను" అని శెలవిచ్చెను.

అంత స్వాయంభువ మనువు మత్స్యరూప నారాయణుని ఇట్లు స్థుతించెను. "ఓ! సనాతనా! అగ్ని, సూర్య, చంద్ర

నేత్రస్వరూపా! స్థూల, సూక్ష్మ, కారణ శరీరా! పరమారాధ్యమయిన శ్రీహరీ! నీకు ప్రణామములు! నీకు ప్రణామములు!! నీవు జగదాధారుడవు. సర్వ జీవుల యందలి ఆత్మ, పవిత్ర శరీరుల యందలి పవిత్రత, సర్వ కారణముల జ్ఞాతవు నీవే! ఓ! త్రివిక్రమా! షడైశ్వర్య సంపన్నా! సర్వదేవమయా! నీవు ధరారూపుడవై సర్వ లోకములను ధారణ చేయుచున్నావు. దేవగణ పరమారాధ్యా! శ్రీమన్నారాయణా! నీవు జన్మ రహితుడవు అయినప్పటికీ సర్వ జగదోత్పత్తికి కారణభూతుడవగుచున్నావు. నీవు చరణ శూన్యుడవయినప్పటికీ సర్వదా గమన శీలుడవు. నీవు తేజస్వరూపుడవయినప్పటికీ ఇంద్రియములకు అగోచరుడవు. నీవు సర్వేశ్వరుడవు. నీపై వేరొకరు లేరు. నీవు ఆద్యంత రహితుడవు. నిత్యానందమే నీ మూలము. త్రిభువనములకు బీజ రూపమయిన స్వర్ణమయ బ్రహ్మాండము నీ తేజోరూపమే! నీవు సర్వకారణ కారుడవు. కానీ నీకు కారణము లేదు. నీవు సర్వులకు ఆశ్రయుడవు. నీవు ఎవరినీ ఆశ్రయింప పనిలేదు. నీవు సర్వులకు అధారమయినప్పటికీ, నీవు నిరాధారుడవు. ఓ! సర్వలోకప్రభూ! జగదీశ్వరా! నీవు బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపములతో సృష్టి, స్థితి, సంహారములు కావించుచున్నావు. ఓ! తేజోరాశి! దశావతారములు ధరించినప్పటికీ, నీవు కామ, క్రోధాది అరిషడ్వర్గ రహితుడవు. ఓ! పరేశా! స్థూలములకు స్థూలము, సూక్ష్మములకు సూక్ష్మమయిన నీ స్వరూపమును వర్ణించుటకు ఎవరితరము? ఓ! పృధివీవ్యాపీ! సహస్రపాద, సహస్రముఖ, సహస్రనేత్ర, సహస్ర శీర్షుడా! జగత్తుపై దశాంగుళములు విస్తరిల్లిన విశ్వరూపా! నీకు ప్రణామములు, ఓ! భక్తవత్సలా! నా యందు దయకలిగి, ప్రసన్నుడవై, నాకు దర్శనమిమ్ము! నాకు దర్శనమిమ్ము!! నాకు దర్శనమిమ్ము!!!

అంత మత్స్యరూపుడయిన విష్ణు భగవానుడు స్వాయంభువ మనువు యొక్క స్తోత్రమునకు సంప్రీతుడై మేఘ గంభీర స్వరముతో ఇట్లనియె "ఓ! సువ్రతా! నీ భక్తి ప్రపత్తులచే నేను సంతుష్టుడనైతిని. త్రిభువన హితము, నీ మనోరధము అయిన ఏదేని వరము కోరుకొనుము." అంత మనువు "మహాప్రభూ! ఇత: పూర్వము కపిలమహాముని ఎవరు ఈ పృధివిని సృష్టించి, పోషించెదరో, వాని చేతితో ఈ జగత్తు సర్వము నష్టమగునని శపించెను. అందువలన నేను భయాతురుడనై, మిమ్ము శరణుజొచ్చుచున్నాను. ఈ జగత్తు జల ప్రళయము చే నాశము కాకుండా వరమీయవలసినది." అంత శ్రీహరి "స్వాయంభువా! నేను, కపిలుడు అభిన్నులము. కపిలుని వాక్యము అసత్యమవదు. కానీ ఈ విషయమునందు నేను నీకు ఏ విధముగ సహాయమొనర్చెదనో తెలిపెదను. వినుము. అతి శీఘ్రముగ త్రిలోకములు జలమగ్నమగును. అందువలన నీవు యజ్ఞకాష్ఠము చే ముప్పది యోజనముల పొడవు, పది యోజనముల వెడల్పు గలిగిన ఒక నౌకను నిర్మింపవలసినది. అందు జగత్ సృష్టికి కావలసిన బీజములన్నింటినీ సేకరించి నింప వలసినది. నేను నా శక్తిచే ఈ నౌకను ధృఢమొనర్చెదను. ప్రళయకాల వాయు, జలతరంగముల వేగము ఈ నౌకను ఏమియునూ చేయజాలవు. అంతేకాక బాహుమూలము నండి బొటను వ్రేలు వరకు పరిమాణము గల ధృఢ రజ్జువును వృక్ష వల్కలముల నుండి, ఊడల నుండి సేకరించి మూడు పేటలుగ పేని, దానిని తొమ్మిది యోజనముల నిడివి గల ధృఢ రజ్జువుగ తయారు చేయవలసినది. సర్వ జీవులను మోహింపజేయు మహామాయ, జగజ్జనని ఈ రజ్జువును విఘ్నముల నుండి రక్షించును.

ప్రచండ వాయువు అఘాధ జలరాశి సర్వమును ఉత్తుంగ తరంగభరిత మొనర్చి జగత్తును పరమ భయావహమొనర్చునపుడు, నీవు భావి సృష్టికి కావలిసిన బీజసంపదను, సప్తర్షులను, దక్షుని, ఈ నౌక యందుంచి, ఏకాగ్ర చిత్తుడవై, నా నామ స్మరణ కావింపుము. స్మరించినంతనే నేను నీ ఎదుట ప్రత్యక్ష మగుదును. నా కృష్ణవర్ణ శృంగ దర్శనము చే నీవు నన్ను గుర్తు పట్టెదవు. ఎంతకాలము ఈ భయంకర ప్రళయము సంభవించునో, అంత కాలము ఈ నౌకను నా మూపుపై దాల్చెదను. ఇది అశంశయము. ఈ ప్రళయానంతరము, జలములు శాంతించిన పిదప నీవు మున్ను పేని యుంచిన ధృఢరజ్జువు చే ఈ నౌకను నా శృంగమునకు బంధింపుము. ఒక వేయి దివ్య వత్సరముల అనంతరము ఈ జలరాశి అంతరించును. అంత ఆ రజ్జువు చే ఈ నౌకను హిమాలయము యొక్క ఉన్నత శిఖరమునకు

ధృడముగ బంధించి, నా దర్శనమునకై ప్రతీక్షించుచూ, నన్ను స్మరించుచుండుము. ఈ అఘాధ జలరాశి అంతరించి సమాన జలరాశి సంస్థాపన మయినపుడు తిరిగి నేను నీ వద్దకు ఏతెంచెదను. అపుడు నీవు నా కృప చే పున:సృష్టి కావించి లోక దుర్లభమయిన సనాతన లక్ష్మీ సంపద నొందెదవు. అంతేకాక స్వాయంభువా! నీవు నన్ను ఏ మంత్రముతో పూజించి, ధ్యానించి సిద్ధి నొందితివో, ఆ మంత్రము చే ఎవరు నన్ను అర్చించిననూ, వారి మనోరథములు సఫలమగును." ఈ విధముగ పలికి మత్స్యరూప శ్రీహరి అంతర్హితుడయ్యెను.

అంత స్వాయంభువుడు శ్రీహరి ఆదేశానుసారముగ యజ్ఞకాష్ఠముతో నౌక నిర్మించి, వృక్ష వల్కలములతో రజ్జువును తయారు చేసి సమయము కొరకు నిరీక్షించెను. దీర్ఘ కాలానంతరము శరభ, వరాహముల తుముల సంగ్రామము జరిగి, జగత్తు ఛిన్నాభిన్నమయినది. అంత మనువు బీజములు, వేదములు, దక్ష, సప్తర్షి సహితుడై, నౌక యందు ఆశీనుడై మత్స్య భగవానుని చింతింప నారంభించెను. అంత పర్వత రూపుడు, ఏక శృంగయుతుడు, అయిన మత్స్య భగవానుడు, ఆ నౌకను తన పృష్ఠ మందు ధరించి సంరక్షించెను. ప్రళయ జలములు శాంతించిన పిదప నౌకను మత్స్య శృంగమునకు ధృఢముగ రజ్జువు సహాయమున బంధించి, ఒక వేయి దివ్య వత్సరములు జలములందు విహరించి తదుపరి సుమేరు పర్వత ప్రాంతమున కేతెంచెను. ఈ సమయమంతయు ఈ నౌక మరియు రజ్జువును జగద్ధాత్రి, యోగమాయ విఘ్నముల నుండి సంరక్షించెను. నెమ్మదిగ జలములు శుష్కమై, హిమాలయ పర్వత శిఖరములు నీటి నుండి బయటకు వచ్చి కనబడసాగెను. అంత భగవానుడు స్వాయంభువ మనువు చే ఆ నౌకను హిమాలయ పర్వత శిఖరమునకు బంధింప చేసి వేదరక్షణ గావించెను. ఆ హిమాలయ శృంగము రెండు వేల యోజనముల ఎత్తు, ఏబదివేల యోజనములు వెడల్పు కలిగి యుండెను. మార్కండేయుడు "మునులారా! ఈ విధముగ కపిల మహర్షి శాపము చే కల్పింపబడిన అకాల ప్రళయమును మీకు వర్ణించితిని."

**(శ్రీ కాళికాపురాణమందలి అకాల ప్రళయవర్ణనమను ముప్పదిమూడవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పది నాల్గవ అధ్యాయము

**(సృష్టి విస్తారము - పున: సృష్టి వర్ణనము)**

మార్కండేయుడు "ద్విజ ప్రవరులారా! ఈ విధముగ అకాల ప్రళయము ముగిసిన పిదప పున:సృష్టి యొక్క విస్తృత వర్ణనము మీకు వినిపించెదను. పరమేశ్వరుడయిన నారాయణుడు, శ్రీహరి, ప్రళయవేగ మంతరించిన పిదప, తిరిగి కూర్మరూపధారియై, ఒక ప్రక్కకు ఒరిగిన పర్వత సహిత పృధివిని తిరిగి యధాస్థానమున స్థాపించి, ఎత్తు పల్లములనంతటినీ సమతలము గావించి, యుద్ధకాలమందు శరభ, వరాహులు నాశము చేసిన ధరిత్రిని తిరిగి ఉద్ధరించెను. ఈ ప్రకారముగ ధరిత్రి సమతౌల్యము నొందిన పిదప, అనంతుని తిరిగి రావించి, ఆయనను కూర్మ పృష్ఠము పై ప్రతిష్ఠించెను. అనంతరము త్రిమూర్తులు ముప్వురు సప్తర్షి, నర నారాయణ, దక్ష సహిత స్వాయంభువ మనువు యున్న నౌక వద్ద కేతెంచి ఇట్లనిరి "ఓ! మహాభాగులారా! వరాహ, శరభుల సంగ్రామము చే ధరిత్రి సమస్తము ధ్వంసమయ్యెను. ఇపుడు పున:సృష్టి కావింపవలెను. ఏ ప్రకారముగ సృష్టి ప్రక్రియ జరుగునో వినవలసినది. నర, నారాయణులిరువురు దేవగణ సంస్థాపనార్ధము తీవ్రతప మాచరించెదరు. ఆ తపము ద్వారా జనలోక వాసులైన దేవగణములు సంతుష్టులై సూర్య, చంద్ర నక్షత్రాదులను పూర్వస్థితి యందు ఉపస్థితులను కావించెదరు.

'ఓ! మనూ! నీవు సేకరించిన బీజ రాశిని పృధివి యంతయు జల్లవలసినది. అందువలన ధరణి సస్యశ్యామల

మగును. అంతేకాక వాని యందు ఓషధులు, లతా, గుల్మములు, వృక్షములు, తీగలు, నానా విధములయిన ఇతర వనస్పతులను ఆరోపింపవలసినది. సప్తర్షులు దక్షసహితులై, ఈ సస్య, వృక్ష, ఓషదుల నుండి ఉత్పన్నమయిన వివిధ ఫలాదికములతో, వరాహ పుత్రుల నుండి ఉత్పన్నమయిన త్రేతాగ్నులనుపయోగించి హవనమొనర్చి, యజ్ఞేశ్వరుడయిన హరిని తృప్తి నొందించెదరు. ఈ యజ్ఞము చే సృష్టి తిరిగి ప్రారంభమగును. ఈ నరనారాయణాది ఋషి పుంగవులందరి సహాయత చే నీవు స్వర్గ, మర్త్య, రసాతలములను సృష్టింప వలసినది. ఈ సృష్టి ఉత్పత్తి కార్యమందు మేము నీకు తగిన సహాయమొనర్చెదము. సృష్టి కార్యసంపన్నమవ్వగనే పంచభూతములు తిరిగి పూర్వ తేజస్సును సంతరించుకొనును." త్రిమూర్తులు ఈ విధముగ ఆదేశమొసంగి, పర్వతములను తిరిగి యధాస్థానమందు యుంచుటకు వెడలి, మేరు, మంధర, కైలాస, హిమాలయ పర్వతములకు సరియైన స్థానములు నిర్ణయించి, నియమించిరి.

అనంతరము మనువు నౌక నుండి క్రిందికి దిగి బీజములు నాట నారంభించెను. కొలది దినములలో వాటి నుండి వృక్షములు, లతలు, తీగలు, గుల్మములు, తృణములు, వన్య సశ్యములు, ఓషధులు, అంకురములు, ఫలములు, కందమూలములు మొదలగునవి జల, స్థలముల నుండి ప్రపుల్లముగ ఉద్భవించెను. ఈ విధముగ వృక్షసంపత ధరిత్రి సమస్తము నందు ఫలించి, ధరణి శోభాయుక్తమగుటచే స్వాయంభువుడు మిక్కిలి సంతసిల్లెను. తదుపరి నరనారాయణులు దేవగణ సంతుష్టికై, తీవ్రతపమాచరించుచూ తేజోమయుడయిన బ్రహ్మను ఆరాధింప నారంభించిరి. వారు జనలోక వాసులైన దేవగణములను తమ తపఃప్రభావము చే పునర్జీవితులను కావించిరి. తదుపరి సూర్య, చంద్ర, ఇంద్రాది దిక్పాలకులను సృష్టించి, యధావిధిగ పూర్వ స్థానములందు నియమించి, దివా రాత్రములను తిరిగి స్థాపించిరి. దక్షప్రజాపతి యజ్ఞమునకు ఉపకరించు కాష్ఠ, లతా, సస్యములను సంగ్రహించి, దేవగణములను, దిక్పాలురను సమీకరించి, సప్తర్షుల సహాయముతో ద్వాదశ వర్ష ప్రమాణమున్న "జ్యోతిష్టోమ" యజ్ఞమును ఆరంభించెను. పవిత్ర ఋషి గణము త్రేతాగ్నుల ద్వారా హోమము సల్పి వరాహ దేవుని యజ్ఞము ద్వారా సంతృప్తుని గావించి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను చాతుర్ వర్ణములను ఉత్పత్తి చేసెను. అనంతరము దక్ష ప్రజాపతి పుత్ర పౌత్రాది జనోత్పత్తికై గుణ, రూప సంపన్నులైన పదమూడు మంది కన్యలను సృష్టించి వారిని కశ్యపునకు కన్యాదాన మొనర్చెను. వారి నామములు వరుసగా "అదితి, దితి, కద్రువ, వినత, దను, దనాయు, కాలా, క్రోధ, సింహిక, వరిష్ట, ముని, ప్రధా, కపిల." కశ్యపునికి ఈ పదముగ్గురు కన్యల ద్వారా ఉత్పన్నమయిన సంతతి చే ఈ ధరిత్రి సమస్తము నిండినది. ద్విజశార్దూలుడయిన కశ్యప ప్రజాపతియే సర్వులకు జనకుడు. ఈ జన్మించిన సంతతి తమ తమ మాతృనామముల చే ప్రసిద్ధులయిరి. దక్షుడు బ్రహ్మ దేవుని ధ్యాన సమయమున ఆయన కుడిచేతి బొటన వ్రేలి నుండి ఉత్పన్నమయ్యెను. అందువలన ఆయన త్రిలోకముల యందునూ "దక్షుడు" అను పేర సుప్రసిద్ధుడయ్యెను. బ్రహ్మమానస పుత్రులయిన పదిమంది ఋషుల యందు "మరీచి, అత్రి, అంగిరుడు, పులస్త్య, పులహ, క్రతువు" అను ఆరుగురు ప్రళయాంతమున జరుగు సృష్టి కార్యమందు ప్రవృత్తులయిరి. ఇందు మరీచి మహర్షి తనయుడే కశ్యపుడు.

కశ్యపుని చే అదితి గర్భమందు పన్నెండు మంది సుప్రసిద్ధ తనయులుదయించిరి. వారు వరుసగా "ధాత, మిత్ర, ఆర్యమ, ఇంద్ర, వరుణ, సోమ, భగ, వివశ్వాన్, పూష, సవిత, త్వష్ట, విష్ణు" నామధేయులు. వీరందరూ "ఆదిత్యులు" అని పిలువబడిరి. వీరందరిలో కనిష్ఠుడు అయిన "విష్ణు" (దివాకరుడు) ఈ ప్రస్తుత భూ ప్రపంచమందు కిరణ విస్తార మొనర్చుచున్నాడు. ధరిత్రి యందు ఆయన వంశము (సూర్య వంశము) వర్ధిల్లి, విస్తరిల్లినది. దక్షుని ద్వితీయ పుత్రిక దితి గర్భమున హిరణ్య కశిపుడను పుత్రుడుదయించెను. ఈతనికి మహా పరాక్రమవంతులయిన నలుగురు పుత్రులుదయించిరి. వారు "ప్రహ్లాదుడు, సంహ్లాదుడు, వాక్షలుడు. శిఖి." ప్రహ్లాదుని పుత్రులు ముువ్వురు. అందు "విరోచనుడు" జ్యేష్ఠుడు.

కుంభ నికుంభులు కనిష్ఠులు. విరోచనునికి దాతల యందు శిఖరాగ్రణి అయిన "బలి" జ్యేష్ఠ తనయుడు. బలికి అత్యంత బలిష్ఠుడయిన పుత్రుడు "బాణుడు". ఈ బాణుని బాగోగులు స్వయముగ శంకరుడే చూచెడివాడు. బాణుడు తదనంతరము శంకర కింకరుడయ్యెను. ఆ సమయమున ఆతడు "మహాకాలుడ"ని పిలువబడెను. బాణునికి "కుసుంభ", "మకరాది" వంద మంది పుత్రులు కలిగిరి. ఇట్లు వారి వంశము విస్తరించినది. "దనువు" గర్భము నుండి "విప్రచిత్తి, శంబర, నముచి, పులోమ, అసిలోమ, కేశి, దుర్జయ, అయ:శిర, అశ్వశీర్ష, క్షయ, శంకు, వియన్మూర్ధ, వేగవాన్, కేతుమాన్, స్వయం, స్వర్భాను, అశ్వ, అశ్వపతి, కుండ, వృషపర్వ, నియంత్ర, నికుంభ, కుపట, పటు, సురభ, సులభ, సూర్య, చంద్ర, దివాకర, నిశానాథ", అను వారలు ఆవిర్భవించిరి. ఈ దను పుత్రులయిన సూర్య, చంద్ర, దివాకరులు అదితి పుత్రులయిన సూర్య, చంద్రాదుల కంటె వేరు. అత్యంత బలవంతులయిన వీరి పుత్ర, పౌత్రాదుల చే కూడ జగత్తు నిండినది.

దనాయువు "వీరభద్ర, వీక్షర, రస, వృత్ర" అను నలుగురు పుత్రులకు జన్మ నిచ్చెను. వీరు ఒక్కొక్కరు వందమంది పుత్రులనుదయింపజేసిరి. "కాల" గర్భము నుండి "వినాశన, క్రోధ, క్రోధహంత, క్రోధశత్రు" అను నలుగురు పుత్రులుదయించిరి. వీరు నలుగురు అరివీర భయంకరులై "కాలకేయులు" అని ప్రసిద్ధి నొందిరి. "సింహిక" సూర్య, చంద్ర మర్దనులయిన "రాహువు, సుచంద్ర, చంద్రహంత, చంద్ర విమర్దను" లను నలుగురు పుత్రులకు జన్మనిచ్చెను. తదుపరి దక్ష కన్యక అయిన "క్రోధ" గర్భము నుండి అత్యంత క్రూరకర్ములయిన పుత్రులు ఉదయించిరి. దక్ష కన్యకలందరి యందునూ "సింహిక" మరియు "క్రోధ" అతిక్రూరులు. వీరిరువురి గర్భ సంజాతులందరూ మాతృదోషము చే అత్యంత క్రూరకర్ములయిరి.

తదుపరి దక్షకన్య "ముని" గర్భము నుండి "శుక్రుడు" అను మహాకవి ఉద్భవించెను. ఆతడు దైత్య, దానవ, కాలకేయులకు గురురూపుడై, పౌరోహిత్య కర్మములందు నియుక్తుడయ్యెను. శుక్రునికి "త్వష్ఠ, వర, సౌకల, అత్రి" అను నలుగురు పుత్రులుదయించిరి. వారును తండ్రి వలె పౌరోహిత్యము ఆచరించుచూ, పైతృక కార్యములయిన అపరకర్మములందు నియుక్తులయిరి. ఈ విధముగ ఈ వంశములు వృద్ధినొంది వర్ణింప నశక్యములైనవి. "వినత" గర్భము నుండి "అరిష్ఠ నేమి, గరుడ, అనూర, ఆరుణి, తార్క్ష్య, వారుణి "మొదలగు పక్షి జాతులుద్భవించినవి. "కద్రువ" అనంతుడు, వాసుకి, ఈశ, తక్షక, కుళిక, కూర్మ, సుమన మొదలగు సర్పములకు తల్లి ఆయ్యెను. "వరిష్ఠ" యొక్క గర్భము నుండి "భీమసేన, ఉగ్రసేన, సుపర్ణ, గరుడ, గోపతి, ధృతరాష్ట్ర, సూర్యచంద్ర, పుష్ఠవాన్, ఆర్యపుష్ఠ, ప్రముక్త, విసృత్, సుసృత్, భీమ, చిత్రరథ, విఖ్యాత, సర్వవిధ, బలి, శాలిశీర్ష, పర్జన్య, కలి, నారద" అను పుత్రులుదయించిరి. వీరిలో కొందరు దేవతలు, మరికొందరు గంధర్వులైరి. దక్షకన్య దితి "అనవద్య, సానురాగ, ససురా, మార్గణీ, ప్రియ, అసూయ, సుభగ" అను ఎనిమిది మంది కన్యలకు సహితము జన్మనిచ్చెను. "ప్రధాదేవి" గర్భము నుండి "విశ్వావసు, సుచంద్ర, సుపర్ణ, సిద్ధ, బర్హి, పూర్ణ, పూర్ణాంగ, బ్రహ్మచారి, రతిప్రియ, భాను" అను పదిమంది పుత్రులుదయించిరి. వీరిలో కొందరు దేవతలు, మరికొందరు గంధర్వులు. గంధర్వులు పుణ్యలక్షణ సంపన్నులు. ఈ ప్రధాదేవి పుత్రులు దేవర్షి శ్రేష్ఠులు. ఆమె కొంతమంది ప్రధాన అప్సరసలకు సహితము జన్మనిచ్చెను. వీరు "అలంబుస, మిశ్రకేశి, దామిని, మనోరమ, విద్యుత్పన్నా, రంభ, అరుణ, రక్షిత, తుల, సుబాహు, సురత, తిలోత్తమ." అంతేకాక దేవతుల్య గంధర్వులయిన అతిబాహు, తుంబురు, హాహా, హూహూ లు సహితము ప్రధాపుత్రులే! కపిల గర్భము నుండి అమృతము, బ్రాహ్మణులు, గోవులు, భూమి, అప్సరసలు, ఉత్పన్నమయిరి. ఈ విధముగ కపిలుని వీర్యమును బడసి ఈ దక్ష కన్యకలు ఉత్పత్తి

చేసిన పుత్ర, పుత్రికా, పౌత్రాదులచే ధరిత్రి సమస్తము నిండినది. సర్వ భూతాత్ముడయిన శ్రీహరి ఈ విధముగ వరాహ పుత్రత్రయము నుండి ఆవిర్భవించిన త్రేతాగ్నులు, సుప్రసిద్ధుడయిన స్వాయంభువ మనువు, కశ్యపాది ఋషి గణము, నరనారాయణు ద్వారా, అకాల ప్రళయానంతరము పున:సృష్టి కావించి త్రిభువనములను పూర్వము వలె పునరుద్ధరించెను. ఈ విధముగ నరనారాయణ స్వరూపముల తో జగన్నాధుడయిన హరి సమయమాసన్నమయినపుడు సృష్టి మొదలయిన కార్యములు సంఘటితము చేయును.

**(శ్రీ కాళికా పురాణమందలి సృష్టి విస్తారమను ముప్పది నాల్గవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పది ఐదవ అధ్యాయము

**(శరభ దేవుని దేహ త్యాగము)**

మార్కండేయ మహర్షి "ఋషి గణములారా! వరాహ దేవునితో యుద్ధానంతరము శరభదేవుడు తన దేహమును త్యాగము చేసిన వృత్తాంతమును వివరించెదను. వరాహ పుత్రుల శరీరములు త్రేతాగ్నులు గ పరిణితి నొందిన పిదప, లోకపితామహుడు, పరమేష్ఠి జగత్‌హితార్ధము శరభరూపుడయిన మహాదేవునితో ఇట్లనియె "దేవా! స్వర్గ, మర్త్యలోకవాసులు, ఖేచరులు సహితము అమిత తేజస్వరూపుడవయిన నిన్ను చూచి మిక్కిలి భయభీతులగుచున్నారు. ఓ! విశ్వనాథా! లోక హితార్ధము దయచేసి మీరు ఈ శరీరమును త్యజింప వలసినది." అంత సర్వలోక హితకారి అయిన శంభుడు, పితామహుని పలుకులు విని తన శరభ దేహమును జలముల యందు త్యజించెను. అంత ఆశరభపు ఎనిమిది చరణములు అష్ఠమూర్తుల యందు లీనమయ్యెను. మొదటి చరణము ఆకాశమునందు, ద్వితీయము సూర్యుని యందు, తృతీయము చంద్రుని యందు, చతుర్ధము అగ్నియందు, పంచమము క్షితి (భూమి) యందు, షష్ఠము జలమునందు, సప్తమము వాయువునందు, అష్ఠమము హేతురూప మూర్తి (యజమాన లింగము) నందు లీనమయ్యెను. దేహము నందలి తేజోమయ శక్తి నిత్య ధామము చేరెను.

మిగిలిన శరీరము భయంకర రూపుడు, కపాలాధారి అయిన భైరవ స్వరూపముగ మారెను. ఈయనను కాపాలికులు అనుసరించెదరు. వీరు మృతబ్రాహ్మణ కపాలము లందలి మేధ మరియు మాంసము చే అగ్ని యందు హోమమొనర్చి, మధ్యమును దేవదేవునికి అర్పించెదరు. వీరు మనుష్యబలి కావించి, సదా రక్తపానము చేయుచూ, సుర చే యజ్ఞాచరణము కావించుచూ, నర కపాలమును ధరించుచూ, వ్యాఘ్ర చర్మాంబరులై, అత్యంత మలినులై, భయానక కర్మల ద్వారా కపాల వ్రతులై నిత్య భైరవ పూజనమొనర్తురు. వీరి ఆరాధ్య దైవము కపాల భైరవుడు, లేక శ్మశాన భైరవుడు.

ఈ భైరవుడు బాలసూర్య ద్యుతిమంతుడై, పద్దెనిమిది బాహువులు కలవాడై, రక్తనేత్రుడై, భయంకర రవము కావించు ప్రచండ కాళీ ప్రకృతి యందు సదా క్రీడారుతడై యుండి, అత్యుష్ణముగ యున్న మానవ మాంస భోజనము స్వీకరించుచుండును. ఈయన కంఠమందు మృత మనుష్య హస్తముల మాల వ్రేలాడు చుండును. శరీరమంతయు రక్తచందన లేపితుడై, శవము పై స్థిరముగ కూర్చొని యుండును. వికృతమయిన ముఖము, పొడవయిన పెదవులు, సన్నని శరీరము, దీర్ఘ చరణములు కలిగి, నిరంతర క్రీడా వాద్య నిరతుడై, వికటాట్టహాసము చేయుచుండును.

ఈ విధముగ శరభదేహము నుండి కపాలి ఆదిగా ప్రమధుల సహితుడై, భైరవుడుదయించి, ప్రమధ సహితుడై ఆకాశము నందు నిత్య క్రీడారతుడై యుండును. మహాదేవుడే ఈ మహాభైరవ రూపమున ఆవిర్భవించెను. లోకులు ఈ మహాభైరవుని ఉపాసించి తమ ఈప్సితములను ఈడేర్చుకొందరు. ఏ మానవుడు చైత్రశుద్ధ (శుక్ల) చతుర్దశి నాడు

మధువు, మధ్యము, ఫలములు, మాంసము, మత్స్యము మరియు రక్తము చే ఒక్కమారు ఈ భైరవారాధనము చేసిన ఎడల, వాని మనోరధములన్నియు పూర్ణమై, అతులిత ఐశ్వర్యమునకు అధిపతి అగును. ఆ జీవి మరణానంతరము వృషభారూఢుడై శివలోకమును ప్రాప్తించును."

మార్కండేయుడు "ద్విజోత్తములారా! మీరడిగిన విషయములన్నింటినీ నేను క్రమముగా, విస్తారముగ తెలిపితిని. ఇక ఇంకేమి ఇతరములు వినదలిచితిరేని, అడుగవలసినది" అని పలికి మౌనము వహించెను.

**(శ్రీ కాళికా పురాణమందలి శరభుని దేహత్యాగమను ముప్పది ఐదవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పది ఆరవ అధ్యాయము

**(నరకాసుర ఉపాఖ్యానము, ధరాదు:ఖ విమోచనము)**

ఋషి గణములు "మహాత్మా! మార్కండేయ మహర్షీ! మీరు భూత, భవిష్యత్, వర్తమాన ద్రష్టలు మరియు మా గురుదేవులు. నరకాసురుడు వరాహదేవుని పుత్రునిగ, సాక్షాత్, దేవ గణముల ఔరసునిగ ఉత్పన్నమయిననూ అసురుడెట్లాయెను? ఆతనికి అంత దీర్ఘ జీవితము ఎట్లు ప్రాప్తించినది? ఆతడు పృధివీ గర్భమందు దీర్ఘకాలము ఎట్లు నివాసము చేయగలిగెను? మహాబలి అయిన నరకుడు ఎక్కడ జన్మించెను? ఏ విధముగ అసురాధిపత్యము నొందెను? ఆతడు ఏఏ నామములతో విఖ్యాతుడయ్యెను? ఆతని రాజధాని ఏది? ఈ నరకునకు లోకస్రష్ట అయిన పరమేష్ఠి ఏల వరములిచ్చెను? ఈ అద్భుత నరాకసుర వృత్తాంతమంతయు మాకు సవిస్తరముగ వివరింపవలసినది." అంత మార్కండేయ మహర్షి ఇట్లు చ్పెదొడంగెను. "ఋషి సత్తములారా! మీ సంశయములన్నింటినీ నిస్సందేహముగ నివృత్తి చేయుదును. వినవలసినది. వరాహ భగవానుడు పృధివీ దేవి రజస్వలయై యుండగా ఆమెతో సంగమించుట వలన నరకుడు అసుర ప్రవృత్తు డయ్యెను. వరాహుని తేజస్సుతో ఉత్పన్నమయ్యెడి శిశువు మహావీరుడగుననీ, మరియు రజస్వలా దోషము చే లోక కంటకుడగునని తెలిసిన దేవతలు తమ శక్తి చే పృధివీ గర్భమును కఠినము గావించి ప్రసవమును నిరోధించిరి. జగద్ధాత్రి అయిన పృధివీమాత తనకు ప్రసవసమయము ఆసన్నమయినప్పటికీ, ప్రసవము కలుగకుండుట, ఇంతలో వరాహ దేవుడు సహితము దేహము చాలించుట చే, మిక్కిలి దు:ఖార్తయై, శోకాకులయై, మరల మరల రోదింప నారంభించెను. అంత మధుసూదనుడు ఆమె వద్దకు ఏతెంచి ఆమెను ఓదార్చెను. ఆయనచే ఓదార్పబడినదై బహుకాలము పృధివి గర్భమును సహించెను. అయినప్పటికీ ఆమెకు ప్రసవము కాదయ్యెను. ఆమె తిరిగి శోకాకులయై, అచ్యుతుని కడకేగి అవనిత శిరస్కయై ఇట్లు ప్రార్థించెను.

"ప్రభూ! ఎవరు జగన్నియంతయో, ఎవరు అవ్యయుడో, ఎవని అనల్లంఘనీయ మయిన ఆజ్ఞచే సర్వులు తమ తమ కార్యములందు నియుక్తులైరో, ఎవరు సర్వ జగత్తును సృష్టి, స్థితి, లయమను చక్రమునందు భ్రమింపజేయుచున్నారో, ఎవరు జగత్తుకు పరుడో, ఆ జగన్నాధుని, భగవానుని స్థిరముగ చిత్తమునందు నెలకొల్పి ప్రణామము లర్పించు చున్నాను. ఎవరు యదువంశ విరాజితుడై, కామదేవునికి జన్మనిచ్చెనో, ఎవనిని జలము తడుపదో, అగ్ని మండింపదో, శీతలము చలితో బాధింపదో, సముద్రము ముంచెత్తదో, సూర్యడు శుష్కింపజేయజాలడో, మృత్యువు ఆవహింపలేదో, అట్టి పరమాత్మునికి ప్రణామములర్పించుచున్నాను. శుభ గుణాశ్రయులయిన ఋషిగణము ఎవరిని ఏకాగ్రమున ధ్యానము చేయుచుందురో, ఎవరు ధర్మ విరోధులయిన పాఖండులను నిర్మూలించునో, కేవల శుద్ధ సత్వదృష్టికి మాత్రమే గోచరమగు ఆ మహా పురుషుని ఈ విపత్తు నుండి రక్షింపమని ప్రార్థించుచున్నాను." అత్యంత దయనీయముగ ప్రార్థించుచున్న దరణీదేవి

వద్దకు ఏతెంచి మాధవుడిట్లనియె "దేవీ! వసుంధరా! నీవు అత్యంత దీనత తో, దు:ఖితవై రోదించుటకు కారణమేమి? నీవు దీర్ఘకాలిక వ్యాధి పీడితవైతివా? అవశ్యము తెలుపవలసినది. నీ ముఖము శుష్కమై, శరీరము కాంతిరహితమై, నేత్రములు వ్యాకులములై, దృష్టి కటాక్ష రహితమై యున్నది. నీ అతిలోక సౌందర్యము నేడు మిక్కిలి శోభారహితమై యున్నది. నిన్ను ఇటువంటి స్థితి యందు మున్నెన్నడూ నేను చూడలేదు. నీ విపరీత దు:ఖమునకు కారణమేమి? నాకు శీఘ్రమే తెలుపవలసినది."

అంత ధరిత్రి "మధుసూదనా! నేను ఈ దుర్వార గర్భ భారము సహించలేక మిక్కిలి డస్సి దు:ఖించుచున్నాను. నాడు రజస్వలా సంగమ కారణమున ఆవిర్భవించిన గర్భము ఇప్పటికీ నేను మోయుచున్నాను. స్వామీ! ఈ బాధ నేనోపలేను. నన్ను ఈ గర్భ ధారణ దు:ఖము నుండి రక్షింపవలసినది. లేని ఎడల నేను ప్రాణత్యాగము కావింతును. ఈ జగత్తునందు ఏ స్త్రీ ఇటువంటి గర్భవేదన  అనుభవింపలేదు. మదమత్త  మత్తేభము జలాశయమును కల్లోలమొనర్చునట్లు ఈ గర్భము నన్ను భయంకరముగ వేదించుచున్నది." అంత శ్రీహరి ధరణీదేవి దీనాలాపమును విని సూర్యదాహక శక్తి చే తప్తమయిన లేత లతకు లభించిన శీతల వృక్షఛాయవలె ఆమెను అత్యంత అనునయముగ ఓదార్చి, ఇట్లు పలికెను, "వసుంధరా! నీ దు:ఖము చిరస్థాయిగ యుండదు. సమయము ఆసన్నమయినప్పటికీ ప్రసవము జరుగుకపోవుటకు గల కారణమును వివరించెదనను. వినుము. నీ యందు పెరుగుచున్న పుత్రుడు రజస్వలా సంగమ దోషము చే అతిబలవంతుడగు అసురుడగునని గ్రహించిన బ్రహ్మాది దేవతలు ఆతడు పుట్టకుండ, దీర్ఘకాలము గర్భమునందే యుండునట్లు యోచన చేసి, ప్రసవమును ఆపిరి. సృష్ట్యాది నందే అంతటి పరాక్రమోపేతుడయిన అసురుడు ఆవిర్భవించిన ఎడల దేవదైత్యులు, స్వర్గ, పాతాళాది లోకములు సహితము నష్టమగును. అందువలన అలౌకిక పరాక్రమవంతుడయిన నీ పుత్రుని జన్మింపకుండ అడ్డుపడిరి. ఆది సృష్టి నుండి పద్దెనిమిదవ చతుర్యుగ మందలి త్రేతాయుగము నందు నీ శిశువు జన్మనొందును. ఓ! చంద్రముఖీ! సత్యయుగానంతరము వచ్చు త్రేతాయుగము సగభాగము గడచిన పిమ్మట నీవు ప్రసవము నొందెదవు. అంత వరకు నీకు గర్భదారణ, భారము, పీడ యుండవు."

ఈ విధముగ పలికి విష్ణు భగవానుడు ధరిత్రి యొక్క నాభి ప్రదేశమును తన పాంచజన్య శంఖము యొక్క అగ్రభాగము చే స్పర్శించెను. ఆ దివ్య స్పర్శచే ధరిత్రి యొక్క శరీరము నందలి భారము తగ్గి, తేలికై, ఆ పవిత్ర చరిత్ర సుఖానుభవము నొందెను. అంత జగదీశ్వరుడయిన విష్ణువు అత్యంత ప్రియానునయ వాక్యములచే ఆమెను ఆశ్వాశించి, ఆమెను ప్రసన్నము కావించుటకై ఇట్లు వచించెను "ఓ! మనస్వినీ! జగద్ధాత్రీ!! వసుంధరా!!!! నీవు సమస్త వస్తువులను ధరించి, భరించుట చే "ధరిత్రి"  అని పిలువ బడుదువు. నీ యంత ధైర్యవంతులు ఈ ప్రపంచమునందు కద్దు. నీవు సహించుట అను గుణమునకు ప్రతీకకై యుండుట చే నీవు "క్షమ" అను నామముతో  ప్రసిద్ధి నొందెదవు. నీ యందు సమస్త నిధులు నిక్షిప్తమై యుండును. అందువలన నీవు "వసుమతి" అను మరియొక నామము చే కూడా ప్రఖ్యాతి నొందెదవు. ఓ! ధరణీ! నీవు దు:ఖింప వలదు. నీ ప్రసవ సమయమున నన్ను స్మరింపవలసినది. నేను తప్పక ఏతెంచి నీ పుత్రుని రక్షించెదను. కానీ నేను నీతో పలికిన ఈ పలుకులు అత్యంత గోపనీయములు. వీనిని నీవు వేరెవరి వద్దనూ ప్రస్తావింపవలదు. త్రేతాయుగమున రావణుడు శ్రీరామచంద్రమూర్తి చే వధింపబడిన పిదప నీ బిడ్డ జన్మించును."

భగవానుడు ఈ విధముగ పలికి అంతర్హితుడాయెను. పృధివి సహితము ఆనంద మనస్కయై, గర్భహీన సుదతివలె బలము సంతరించుకొని యధాస్థానమునకు చనెను.

**(శ్రీ కాళికా పురాణము నందలి నరకాసురోపాఖ్యానము, దరాదు:ఖ విమోచనము**

**అను ముప్పది ఆరవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పది ఏడవ అధ్యాయము

**(నరకాసురో త్పత్తి)**

మార్కండేయ మహర్షి "ఋషి సత్తములారా! దీర్ఘకాలానంతరము మహాబలి, గొప్ప రాజనీతిజ్ఞుడు, సకల సద్గుణ సంపన్నుడు, సత్యవాది, సత్యస్వభావుడు, చతురుడు, బ్రహ్మ తేజస్వీ, స్థిరచిత్తుడు, శుద్ధుడు, దేవ, ద్విజ, గురుజన సేవా తత్పరుడు, ప్రజలను కన్న బిడ్డల వలె పాలించువాడు అయిన జనకుడు (సీరధ్వజుడు) విదేహ మహీపతిగ జన్మనందెను. ఈ జనక మహారాజుకు చిరకాలమయిననూ పుత్ర సంతతి కలుగకుండెను. ఆయన నారదుని ద్వారా దశరథ మహారాజు పుత్రకామేష్ఠి ద్వారా పుత్ర సంతతి నొందెనని వినెను. దశరధుడు అయోధ్య రాజ్యచక్రవర్తి. ఆయన అమిత తేజస్వులయిన ఋష్యశృంగాది మహర్షులను రావించి, పుత్ర కామేష్ఠి కావించి రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను నలుగురు ఇంద్రతుల్య సుతులను పొందెనని తెలిసికొనెను. అంత జనకుడు అంత:పుర ప్రవేశము కావించి, తన రాణులను రావించి, మంత్రాంగము నాలోచించి, యజ్ఞదీక్షను స్వీకరించెను. తదనంతరము తన పురోహితుడయిన గౌతముడు, మరియు ఆయన తనయుడు శతానందుల ఆదేశమును ఔదల దాల్చి యజ్ఞారంభమొనర్చెను. ఆ యజ్ఞభూమి నుండి పరమ సుందరులయిన ఇరువురు పుత్రులు, అత్యంత సౌందర్యశాలిని అయిన ఒక కన్యక ఉత్పన్నమయిరి. జనకుడు నారదుని ఆదేశానుసారము తాను స్వయముగ నాగలిపట్టి యజ్ఞభూమిని దున్నెను. అంత పృధివి నుండి సర్వలక్షణ సంపన్న, భూవనమోహిని అయిన ఒక కన్యక ఆవిర్భవించెను. ఆ కన్యకను కాంచినంతనే జనకమహీపతి హృదయము ఆనంద సాగరము నందు ఓలలాడెను.

ఈ కన్యక ఉద్భవించినంతనే అచట ధరణీదేవి ప్రత్యక్షమై గౌతమ, నారద, జనక మహీపతులతో ఇట్లనియె "మహారాజా! ఈ సకల సద్గుణ సంపన్న, విశ్వమోహిని అయిన ఈ కన్యకను నీకు అర్పించుచున్నాను. ఈమె నీ కులమును పావనము గావించును. ఈమె పరమ మంగళస్వరూపిణి. ఈ కన్య ద్వారా నా భారము దూరమగును. ఈమె వలన యమశాశకుడయిన రావణుడు, మహాబలులయిన కుంభకర్ణాది రాక్షసులు మృత్యులోక దర్శనము కావింతురు. దాని వలన దు:సహమయిన నా పీడ విరగడగును. ఓ! మహారాజా! ఈ ముగ్ధ నీకు పరమానందమును కలుగజేయుటయే గాక, ఈమె వలన నీవు దైవ, పితృ ఋణ విముక్తుడ వయ్యెదవు. కానీ జనక మహీపతీ! నీకు ఒక ప్రతిజ్ఞ స్వీకరింప వలసియున్నది. అయ్యది ఈ గౌతమ, నారద మహర్షుల సమక్షమున కావింప వలసినది. రావణ సంహారమయిన పిదప నేను భూభార పీడా రహితనై, ఈ యజ్ఞభూమి యందు ఒక సుపుత్రునకు జన్మ నిచ్చెదను. నీవు ఆ శిశువును అత్యంత ఆదరముతో శైశవావస్థ యుందు పెంచి, పోషించి, మానుషభావన ముత్పన్నమగునట్లు పెంచవలెను. బాల్యావస్థానంతరము ఆతని పోషణ నేను కావింతును."

జనక మహీపతి ధరణి పలుకులు విని, పరమ ప్రసన్నుడై "ఓ! జగద్ధాత్రీ! నేను మీ ఆజ్ఞను శిరసా వహింతును. కానీ నాదొక చిన్న విన్నపము. ఓ! పరమేశ్వరీ! నీవు జగజ్జనని మరియు శక్తిరూపిణివి. నా యందు ప్రసన్నురాలివై ఒక్కమారు నీ దివ్యమంగళ విగ్రహమును వీక్షించు అదృష్టము కలిగింపుము. నా యందు ప్రసన్నురాలివి గమ్ము! తల్లీ! నీకు సాంజలి బంధకముగ సాష్టాంగ దండ ప్రణామములాచరించు చున్నాను." అంత ధరిత్రి సంతసించి తన దివ్యరూపమును వ్యక్త మొనర్చెను. ఆ తల్లి నీలికలువ దేహ వర్ణధారిణి. దీర్ఘ బాహుయుగళి యందు పద్మము, అక్షమాల ధరించినది. అంత జనక మహీపతి తిరిగి ఆ ధరణీ దేవికి ప్రణామములు ఒనర్చెను.

అంత మేదిని అచట ఉత్పన్నమయిన సీతాదేవిని తన చేతుల యందు తీసికొని "ఓ! నృపవరా! ఈమె జగజ్జనని. ఈమెను అల్లారుముద్దుగా పెంచి మానుష భావములను ఉత్పన్నమొనర్పవలసినది. తదుపరి కార్యము లెట్లు జరుగునో

కాలమునకెరుక!" తదుపరి ధరిత్రి నారద, గౌతమాదులను అప్యాయముగ పలుకరించి, సమయానుకూలముగ సంభాషణ మొనర్చి అంతర్హిత అయ్యెను. జనకుడు సహితము తన పుత్ర, పత్రికలతో అమందానంద కందళిత హృదయారవిందుడై, తన అంత:పురమున కేగి, తన పత్ని అయిన "ధన్య" కు ఈ శిశువుల నొసంగెను. కాలము ఎవ్వరి కొరకు ఆగదు కదా! వత్సరములు గడచి, లీలామానుష దేహధారి, జగదేక దనుర్ధరుడు అయిన శ్రీరామచంద్రమూర్తి సీతా పరిగ్రహణము గావించి, రావణ వధ కావించి, వసుంధరను కంటక విహీనము కావించెను. అంత మేదిని సంతోష పరవశయై, జనకుడు యజ్ఞ భూమిని దున్నిన ప్రదేశమున కేతెంచి, తనకున్న విష్ణు భగవానుడిచ్చిన వరమును పురస్కరించుకొని, ఆ మహానుభావుని తలంచి, ఒక మహా వీరుడయిన పుత్రునకు జన్మనిచ్చెను.

స్మరించుట తోడనే దేవాధిదేవుడు, శ్రీమహావిష్ణువు అచట ప్రత్యక్షమయ్యెను. ఆ దివ్య మంగళ విగ్రహుని గాంచి, మేదిని నమస్కృతులిడి ఈ విధముగ పలికెను "మహాప్రభూ! ఈ బాలుడు మీ అత్యంత కోమలాకృతి నుండి ఉద్భవించెను. మీ ప్రతినానుసారము ఈ బాలుని సంరక్షింపవలసినది." అంత విష్ణుదేవుడు "దేవీ! ఈ నీ సుపుత్రుడు మహాపరాక్రముడై, మానుష భావముతో చిరకాలము విజ్ఞుడై సుఖించును. ఈతడు ఎంతకాలము ఈ మానుషభావముతో సత్కర్మాచరణము గావించునో అంతదనుక అత్యంత సుఖీభూతుడై జీవించును. ఏనాడు ఈతడు సత్కర్మను విస్మరించి, అన్య కార్యాచరణ కావించునో, అప్పటి నుండి ఈతని జీవితము క్షీణించును. ఈతడు షోడశ వర్ష ప్రాయుడయినప్పటి నుండి ధన, కనక, వాహన, ఐశ్వర్య, రథ, గజ, తురగ, పదాతి సమృద్ధుడై రాజ్యాధికారము నొందును. నీ సుపుత్రుడు అక్షయ రాజ్యలక్ష్మి నొంది భోగించును. మానవ భావాంతర్గతముగ ఏ యుగము నందు మనుష్యులు ఏ భావము నొందెదరో, ఆ భావము తదణుగుణముగ ఈతని యందు పెంపొందునట్లు నీవు నీ యత్నము కావింపుము. ఈతడు ప్రాగ్జోషితపురమను అత్యంత సుందర పురమును తన సుస్థిర రాజధానిగ చేసికొని చిరకాలము రాజ్య భోగములననుభవించును." ఈ విధముగ పలికి మేదినిని మిక్కిలి సంతుష్టాంగతరంగ ను గావించి శ్రీమహావిష్ణువు అంతర్హితుడయ్యెను.

పుత్రోత్పత్తి కార్యము అత్యంత నిగూఢముగ అర్ధరాత్రి జరిగెను. ఈ విషయము ధరణి అత్యంత గోప్యముగ జనక మహీపతి కెరింగించెను. అదివిని జనకుడు అత్యంత రహస్యముగ, అర్ధరాత్రమున ఏకాకియై యజ్ఞభూమి కరుదెంచెను. మహీపతిని కాంచిన తక్షణము ధరణి మరిమాటలాడక అంతర్ధానము చెందెను. అంత మహీపతి సూర్యచంద్రాగ్నుల వలె శోభించుచున్న ఒక బాలకుని, ధరణీపుత్రుని, కార్తికేయుని వలె ప్రకాశించుచూ, పదములు ఉపుచూ రోదించుచున్న శిశువును కాంచెను. ఆ బాలకుడు అత్యాశ్చర్యముగ కొంచెము కొంచెము కదులుచూ, యజ్ఞభూమి బయటకు వచ్చి, అచటయున్న ఒక మృత కళేబరము పై మస్తకము నుంచి కొంత తడవు రోదించెను. జనకుడు సహితము ఆ బాలకుననుసరించి, వెలుపలికి ఏతెంచి చంద్ర సమాన ద్యుతి, సూర్య సమాన తేజస్సు, శరవణవనమందు అగ్ని చే గ్రహింపబడిన కార్తికేయుని వలె ఆ బాలకుని తన ప్రతినానుసారము గ్రహించి, ఎత్తుకొని, తదుపరి ఆ బాలకుని మస్తకము వద్దనున్న మృత కళేబరమును గాంచి, సందిగ్ధావస్థకులోనై తన కుల పురోహితుడైన గౌతముని ప్రశ్నించెను. ఆ సమయమున గౌతముడు మిన్నకుండెను. తదుపరి ఆ బాలకుని తన అంత:పురమునకు గొనిపోయి తన పట్టపురాణి కిచ్చెను.

మహారాణి కార్తికేయ సమానుడు, విశాలనేత్రుడు, సింహస్కంధుడు, ఉన్నత బాహుద్వయుడు, విశాలవక్షుడు, కమనీయ నీలికమలదళ శ్యామలవర్ణుడు, అయిన పుత్రుని గాంచి, మహారాజు తో ఇట్లనియె "స్వామీ! మీ సంతోషార్థము ఈ బాలుని యొక్క ఆలన, పాలన నేను స్వీకరింపవలెనా?" అంత జనక మహీపతి "సుందరీ! ఈ బాలుడు యజ్ఞభూమి నుండి ఉత్పన్నమయిన మహాయశుడు. ఈ బాలుని నీ పుత్ర సమానముగ వాత్సల్యమును వర్షించి, పెంచి పోషింప

వలసినది," అని పలికెను. ఆతడు పృథివీ దేవి ఎడ నిర్జన ప్రదేశమున గావించిన ప్రతిజ్ఞను పాలించి, ధరణీదేవి నా పుత్ర, పౌత్రాదులను రక్షించునని తలంచి, ఈ బాలకునికి సంబందించిన ఏ రహస్యమును మహారాణికి ఎరింగింపకుండెను. మహారాణి సహితము సుర సమానుడయిన పుత్రుని గొని ఈతడు శత్రు మర్దనుడగునని పరమానందము నొందెను.

**(శ్రీ కాళికా పురాణము నందలి నరకాసురోత్పత్తి అను ముప్పది ఏడవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పది ఎనిమిదవ అధ్యాయము

**(నరకాసురుని పితృదర్శనము)**

తదుపరి జనక మహీపతి తన పుత్రునకు మానవోచిత కర్మ, సంస్కారములు కావించెను. గౌతమ మహర్షి ఈ బాలుడు మృత శరీరముపై తన శిరస్సును యుంచిన కారణమున ఆతనికి "నరకుడు" అని పేరిడెను. జనకుడు, గౌతమ, శతానందుల  ద్వారా ఋక్, యజుర్, సామవేద మంత్రోచ్చారణ గావించుచుండగా నరకునకు క్షత్రియోచిత శిరోముండనాది జాత సంస్కారములు పూర్ణము గావించెను. నరకుడు రాజభవనమందు శారదీయ శుక్లపక్ష చంద్రుని వలె దినదిన ప్రవర్ధమానుడగుచుండెను. ఆతనికి గురుకులమునకు ఏగు వయస్సు ఏతెంచిన పిదప గౌతమ పుత్రుడయిన శతానందుని ద్వారా క్షత్రియ, మానవోచిత శిక్ష, విద్యాభ్యాసము నొనరించెను. నరకుడు రాజభవనము ప్రవేశించిన నాడే వసుమతి, పృథివి "కాత్యాయనీ దేవి" అను పేర రాజాంత:పురమున రాణివాసము చేరి, నరకునకు దాదియై, ఆ బాలుని ఆలనా, పాలన స్వయముగ చూచుకొనెను. ఆతని విద్యాభ్యాసము సరియగు రీతిని జరుగునట్లు పర్యవేక్షించుచూ, తాను సహితము స్వయముగ నీతిశాస్త్రము ఆ బాలునికి బోధించెను. పృథివీపుత్రుడు ఈ విధముగ దినదిన ప్రవర్ధమానుడై, రూప లావణ్యములందు, బలవీర్యములందు, గదాయుద్ధము, ధనుర్వేదములందు ఆరితేరి, మిగిలిన రాజపుత్రులందరి యందు మేటియై పదునారేండ్లు నిండుసరికి సర్వులకు ఆజేయుడయ్యెను.

విదేహాధిపతి నరకుని అనన్య సామాన్య పరాక్రమమును, తన పుత్రుల యొక్క వీర్య హీనతను గమనించి, మనుసున ఆంధోళన నొందసాగెను. కాలక్రమమున ఈతడు తన పుత్రులను వంచించి, రాజ్యాక్రమణము గావించునన్న ఒక ఆలోచన ఆయన మనస్సును కృంగ దీయుట చే తన పుత్రులయందున్న మమకారమును ఆయన నరకునిపై చూపకుండెను. కొన్ని విషయములు దాచియుంచెదమన్ననూ దాగవు కదా! మహారాజు యొక్క మనో ప్రవృత్తిని మహారాణి, మరియు కాత్యాయినీ దేవి ఇరువురు గమనించిరి. అంత మహారాణి రాజు యొక్క ప్రవర్తనకు విస్మితయై, ఒక ఏకాంతమున ఈ విధముగ ప్రశ్నించెను, "ప్రాణనాథా! కొన్ని దినముల నుండి మిమ్ము ఒక విషయమై ప్రశ్నింపవలెనని  కోరికయున్నది. అయ్యది గోప్యము కాని ఎడల, నాకు దయచేసి తెలుపవలసినది. మన పుత్రులందరూ మీ సమక్షమున మసలుచున్నప్పటికీ, మీరు నరకుని ఎడల అన్యమనస్కులై యున్నారు. దీని వలన దివారాత్రములు నా మనసు భయాశ్చర్య సంశయములకు లోనగుచున్నది.  ఈ నరకుడు సౌందర్యశాలి, మహా పరాక్రమవంతుడు, గొప్ప బలశాలి, మీదు మిక్కిలి వినయశీలి, నీతిజ్ఞుడు, మరియు అపరాజితుడు. ఇటువంటి సుపుత్రుని మీరు ఎందుకు ప్రేమించుట లేదు. నా ప్రశ్న ఉచితమయిన ఎడల జవాబు శలవీయవలసినది." అంత మహారాజు "ప్రియా! నీ వడిగిన ప్రశ్నకు సమాధానము నేను మూడు మాసములనంతరము ఇచ్చెదను. నేను ఈ విషయము గుప్తముగ యుంచెదనని ఒక దేవతకు వాగ్దానము చేసియుంటిని. అందువలన ఈ సమయమున ఈ విషయమై వేరొక మాట మాట్లాడలేను."

మహారాజు పలికిన పలుకులు మహారాణియే కాక, చాటున యున్న కాత్యాయినీ దేవి సహితము విని ఇట్లాలోచించెను

– మహారాజు మూడు నెలలు గడువు కోరెను. అప్పటికి నరకునకు పదునారేండ్లు పూర్ణమగును. అపుడు రాజు రాణికి ఈ విషయము సర్వము ఎరుక పరచెనేని, నా సంగతి సహితము బహిర్గతమగును. ఈ విధముగ మనమున తలంచి, పూర్వాపరములాలోచించి, భవిష్యత్ కార్యక్రమము కొరకు ప్రణాళికను సిద్ధమొనర్చి, ఒకానొక దినము గౌతమ మహర్షిని తోడ్కొని జనక మహీపతి వద్దకు ఏకాంత సమయమున ఏగి ఇట్లు పలికెను. "ఓ! జనక మహీపతీ! నిష్పాపుడా! నీవు నేను కోరిన విధముగ, నేనడిగిన సమయము నా పుత్రుని యొక్క ఆలన, పాలన సంపూర్ణముగ నీవు పాలించితివి. నా పుత్రుడు మీ భవనము నందు, మీ కృపచే అత్యంత ఆదరముగ పెంచబడి గొప్ప నీతిజ్ఞుడయ్యెను. నరకుని ఎడ మీకున్న భయము మరియు శంక నేనెరుగుదును. అందువలన నేను నా పుత్రుని నా పూర్వ వచనానుసారముగ తీసికొని వెళ్ళెదను. ఈ విషయమై మీరు వ్యధనొందవలదు. మీకు ఒసగిన కార్యమును మీరు పూర్ణము గావించిరి. నేను నా పుత్రుని ప్రచ్ఛన్నముగ తీసికొని వెళ్ళెదను. ఈ విషయమై మీరు వ్యధనొందవలదు. ఈ విధముగ పలికి గౌతమ, జనకులు చూచుచుండగనే ధరణీదేవి అంతర్హితురాలైయ్యెను.

తదుపరి ధరిత్రి తన ప్రచ్ఛన్న రూపమయిన కాత్యాయినీ దేవి రూపము ధరించి, నరకుని కడకేగి నర్మగర్భముగ "ఓ! మహాబాహూ! నాకు గంగానది చూడవలెనని ఆకాంక్ష కలుగుచున్నది. ఒకవేళ నీవు అచటికి పోదలచిన ఎడల నేను సహితము నీ రథమునందు ప్రయాణించి గంగాతటమునకు ఏగుదును." అంత నరకుడు "మాతా! నేను పితృపాదుల ఆజ్ఞ లేక గంగాతటమున కేగలేను. ఆయన ఆజ్ఞ బడసి వచ్చెదను." అంత ధరణి "నాయనా! ఈ జనకుడు నీ తండ్రి కాదు. ఈయన కేవలము నీకు పాలకుడు మాత్రమే! నీ తండ్రి జగత్ప్రభువు. నీవు నాతో గంగాతటమున కేతెంచితివేని, నీకు నీ నిజ పితృపాదుల దర్శనము కావింతును. అంతేకాదు. నీవు ఇక్కడే యుండిన ఎడల నీకు రాజ్యము ప్రాప్తించదు. నీకు యదార్ధముగ క్షేమము కలుగజేసి, రాజ్యలాభము కలుగజేయు యదార్ధ పితృపాదులను దర్శింపవలసినది. కానీ ఈ ఘటన అతి రహస్యము, మరియు గోపనీయము. అందువలన ఈ కార్యము గంగాతటమున మాత్రమే జరుగును. అన్యధా రహస్య భంగమగును."

దాది యొక్క పలుకులు నరకుని కించిత్ విస్మితుని గావించినప్పటికీ, ఎందుకో విశ్వసనీయమై, తన వాహనమును విడచి, పాదచారియై గంగాతటమున కేగెను. తదనంతరము పృధివి ఆతనిని సవిధి పూర్వకముగా స్నానమాచరింపజేసి తన నిజరూపమును దర్శింపజేసెను. సర్వజీవులకు నిలయమయిన వసుంధర, ధరణీదేవి, ధరిత్రి, మేదిని, నీలమేఘశ్యామల శరీరిణియై, సర్వ శుభలక్షణలక్షితయై, నానాలంకార భూషిత అయిన తన స్వస్వరూపముతో నరకుని ముందు సాక్షాత్కరించి ప్రేమ పూర్వకముగ ఇట్లనియె "పుత్రా! నీవు జనకుని పుత్రుడవు గావు. అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుడయిన విష్ణుమూర్తి వరాహావతారము స్వీకరించినపుడు ఆయనకు, మేదినినయిన నాకు ప్రభవించిన సుపుత్రుడవు. నీవు విష్ణు పుత్రుడవయినప్పటికీ, రజస్వలా దోషముచే నీకు అసుర ప్రవృత్తి వాటిల్లునని తలచి దేవతలు నా గర్భమును కఠినమొనర్చిరి. నీవు నా గర్భము నందు అనేక యుగములు నిక్షిప్తమై యుంటివి. అందువలన నేను మిక్కిలి డస్సి, గర్భ బాధను సహింప లేక విష్ణు భగవానుని శరణ మొందితిని. ఆ నారాయణుని వాక్యానుసారము నీ జన్మము కలిగినది. ఇది సత్యము. నా పలుకులు విశ్వసింపుము." అంతేకాక ఆ తల్లి నరకుని మనమునందున్న సందేహములన్నింటినీ ఆశ్వాసన మొనర్చి, ఆతని సంపూర్ణ సందేహ రహితుని కావించుటకై జనకరాజ వృత్తాంతమంతటినీ – యజ్ఞభూమి యందు ఉత్పన్నమగుట, విదేహరాజ ప్రతిజ్ఞ, ఇత్యాదులన్నింటినీ ఆతనికి ఎరింగించెను. నరకుడు కొంచెము సంశయ సహితుడై తన తల్లితో ఇట్లనియె.

"మాతా! స్వయముగ జగత్ప్రభువు నారాయణుడు నా తండ్రి, సాక్షాత్ భూదేవివయిన నీవు నా తల్లి అయిన ఎడల నా హితార్ధమై విష్ణుదేవుడు ధరణికి ఏల ఏతెంచలేదు! నీవు ఈ సమయమున "నేనే నీ తల్లిని" అని పలుకుచుంటివి.

కానీ చిన్నప్పటినుండి జనక మహీపతి నా తండ్రి వలె, మహారాణి సుమతి నా తల్లి వలె ఎంతో ప్రేమగా పెంచిరి. విదేహ రాజపుత్రులు నా సహోదరులు. జనకనందిని సీత సాక్షాత్ నా సహోదరి. నేన నిన్ను కేవలము నా దాది వయిన కాత్యాయినీ దేవి గ ఎరుగుదును. నేనే కాదు! ఈ జగత్తు సర్వము ఈ విధముగానే ఎరుంగును. మీ పలుకులు నాకు నమ్మటకు శక్యముగ లేవు." అంత ధరణి తిరిగి విష్ణువు యొక్క వరాహ రూపము నందు జరిగిన విశేషములన్నియు పూసగ్రుచ్చినట్లు విస్తారముగ వివరింప మొదలిడెను. అంత ఋషి గణములు మార్కండేయుని "మహాత్మా! శ్రీమహావిష్ణువు ఎందుకు జనకునకు  అంత సమయము నిచ్చెను? మహానుభావుడయిన శ్రీరామచంద్రుని చే రావణవధానంతరము మాత్రమే ధరణికి పుత్ర జననము ఎందుకు కలిగినది? దయచేసి ఈ సందియము బాపవలసినది." మార్కండేయుడు "పృధివి గర్భిణి అయిన సమయమున రావణ జననము జరిగినది. ఈ మహాపాపి కారణమున పాపభారము చే పృధివి అయిదు యోజనములు క్రిందకు దిగినది. అందువలన రావణవధ అనంతరము కానీ పృధివి పాపరహిత యై తన కుమారునిపై దృష్ఠి సారింపనోపదు. అందువలన జనకునకు ఆ సమయము నీయబడినది. ధరణీదేవి తన దివ్య మంగళ రూపమును వర్జించి, దాది అయిన కాత్యాయినీ రూపమును తిరిగి స్వీకరించి, యజ్ఞభూమి యందు నరకుని ప్రసవము, రాజప్రతిజ్ఞ, జనక రాజమందిరమునందు ఆతని పెరుగుదల, మొదలగునవన్నియు తిరిగి వివరించెను. వసుంధర నుండి వినిన విషయములన్నియు తిరిగి కాత్యాయినీ దేవి నుండి వినుటచే నరకుడు సంశయ రహితుడయ్యెను. అంత ధరిత్రి తిరిగి తన దేవతారూపమును ధరించి, పూర్వము శ్రీమహావిష్ణువు తన కొసంగిన వరమును సంస్మరించి, ఆ జగత్ప్రభువును భక్తితో ప్రార్ధించెను. అంత వారి ఎదుట నీలిమేఘఛాయా శరీరుడు, శంఖ, చక్ర, గదాధారి, శ్రీవత్సాంకితుడు, పచ్చని పట్టు పీతాంబరధారి, జగత్ప్రభువు నారాయణుడు ఆవిర్భవించెను. ఆయనను కాంచుట చే పృధివి ఆయనకు సాష్టాంగ దండ ప్రణామములాచరించి "ప్రభూ! జగన్నాధా! జగత్కారణా! పరమేశ్వరా! నా యందు ప్రసన్నులు కండు! నా యందు ప్రసన్నులు కండు!!" అని పలికెను. నరకుడు ఆ దివ్య తేజము భరింపలేక ఒక్క క్షణము కన్నులు మూసికొని నేలపైబడెను. నరకుడు నేలపై పడిన అనంతరము  ధరణి అతని నిమిత్తమై విష్ణుదేవుని పరిపరి విధముల ప్రార్ధించెను. అంత నారాయణుడు సంతుష్ఠుడై, తన శంఖాగ్రము చే నరకుని స్పర్శించెను. నరకుడు ఆ స్పర్శ మాత్రముచే దివ్య నేత్రములంకురించి, అత్యంత హర్షోత్సాహము నొంది, మహాబలమును సంతరించుకొనెను. అంత ఆతడు పరమభక్తియుతుడై, సర్వజగత్కర్త అయిన నారాయణునికి పున: పున: నమస్కృతులిడెను. అంతేకాక పరిపూర్ణ విశ్వాసముతో తన నిజమాత అయిన ధరణీ దేవికి సహితము అత్యంత భక్తియుక్తముగ నమస్కరించెను. తదుపరి నరకుడు కించిత్ భయభీత చిత్తుడై ఒక ప్రక్కకు నిలబడెను.

అనంతరము పృధివి తన పుత్రుని హేతువై శ్రీమన్నారాయణుని ఇట్లు ప్రార్ధించెను. "ఓ! సర్వేశ్వరా! నారాయణా! మీరు మీ పుత్రుని ఎడ పూర్వము కావించిన ప్రతిజ్ఞను పాలింపవలసినది." నారాయణుడు "ఓ! ధరిత్రీ! నీవు పుత్రార్ధము కావించిన ప్రార్ధనను పూర్ణము గావింతును. అచ్యుత్తమ రాజ్యము సహితము నిచ్చెదను." అని పలికి వారిరువురినీ తీసికొని గంగానది యందు ప్రవేశించెను. మరుక్షణము వారు కామరూప దేశమునున్న ప్రాగ్జోషితపురమ చేరిరి. అయ్యది అత్యంత కర్కశ శరీరులయిన కిరాతుల స్థానము. వారు ముప్వరు స్వర్ణస్థంభ శరీరులు, ముండిత శిరస్కులు, మద్య, మాంస భోజన తత్పరులు, జ్ఞానహీనులయిన కిరాతులను అవలోకించిరి. వారి నాయకుడు దీర్ఘదేహుడు, అగ్ని శిఖను పోలు ఉజ్వలుడయిన "ఘటక" నామధేయుడు. ఘటకుడు సహితము ఆగంతకుల నవలోకించి, తక్షణము సేనల సిద్ధము కావించి, చతురంగబల సమేతుడై, వారిపై శరవర్షము కురిపించుట నారంభించెను. శ్రీహరి సమరార్ధము నరకుని సమరమున కంపెను. నరకుడు దీర్ఘకాలము వారితో సంగరము సలిపి, చివరకు ఒక భల్ల భాణము సంధించి, ఘటకుని శిరశ్ఛేదము కావించెను. ఆకలి గొన్న పంచాస్యము వనమధ్యమున హరిణముల వినాశమొనర్చునట్లు, నరకుడు

కిరాతుల యందలి ప్రధానులను, సేనాపతులను, వధించెను. అంత కొంతమంది కిరాతులు వెన్నుచూపి పారిపోయిరి. మిగిలినవారు నరకుని శరణుజొచ్చిరి. నరకుడు అత్యంత యుద్ధరతుడయినప్పటికీ, శరణు జొచ్చిన కిరాతులను రక్షించెను.

అంత నరకుడు శ్రీహరి వద్ద కేగి "తండ్రీ! ఘటకుని, వాని ప్రధానులు, సేనాపతుల సహితముగ హతమార్చితిని. ఇపుడు తగు కార్యము శలవీయవలసినది." అంత విష్ణువు "కుమారా! ఇచటి నుండి ధిక్కరవాసినీ క్షేత్రము వరకూయున్న భూమి నుండి కిరాతులను పారద్రోలి శరణాగతులను రక్షింపుము. ఎదిరించిన వారిని దండింపుము." అంత నరకుడు చతుర్దంతములు కలది, ఐరావత వంశమునకు చెందినది, బృహత్ కాయము, గరుడవేగము కలిగిన ఘటకుని శ్వేత మత్తేభమును అధిరోహించి ధిక్కరవాసినీ నిలయము ఆవలి వరకు కిరాతులను పారద్రోలెను. తిరిగి నారాయణుని కడకు ఏతెంచి "ప్రభూ! కిరాతులను పారద్రోలితిని. వారు సాగర సమీపమున యున్న భూమి యందు అశ్రితులైరి. కిరాతపతిని సంహరించితిని. ఇపుడు నా కర్తవ్యమేమి? మీరు ఆజ్ఞాపించిన కార్యమును ఈ శ్వేతనాగు నధిరోహించి ఆచరించెదను."

అంత విష్ణుభగవానుడు "పుత్రా! "కరతోయా", అను జలగంగ ఈ ప్రదేశపు పూర్వ భాగమునందు ప్రవహించుచుండును. అచట లలితకాంతాదేవి నివాసముండును. అక్కడి వరకు నీ పురము విస్తరిల్లును. అచట మహామాయ, యోగనిద్ర, జగన్మాత "కామాఖ్య" రూపిణియై విలసిల్లుచుండును. అచట బ్రహ్మపుత్ర నది "లౌహిత్య" నామముతో ప్రవహించుచుండును. ఆ ప్రాంతము నందు దిక్పాలురు, సూర్యచంద్రాదులు సహితము తమ నియమిత స్థానములందు నివసించుచుందురు. ఇయ్యది గోప్యమే కాక మహాభోగ స్థానము. ఒకానొకప్పుడు పరమేష్ఠి ఇచట నుండే పూర్వదిశా నక్షత్ర మండలమును సృజించెను. అందువలననే అమరావతిని తలపించు ఈ పురమునకు "ప్రాగ్జోషితపురము" అను నామమీయబడినది. నీవు పత్నీ పరిగ్రహణము కావించి, మంత్రుల, సేనానుల సహాయముతో ఈ విశాల సామ్రాజ్యమును పాలించి అనుభవింపుము. నేను నిన్ను ఈ పురమునకు రాజుగ అభిషేకించెదను.

తదనంతరము నారాయణుడు మహాదేవుని సంప్రదించి, ఆయన అనుజ్ఞబడసి, లలితకాంతారపు పూర్వభాగము నుండి సాగర తీరము వరకు యున్న భూమిని కిరాతులకు నివాసము గావించి, లలిత కాంతారపు పశ్చిమము నుండి కరతోయా సరిత వరకు గల ప్రదేశము కామాఖ్యాదేవి ఆవాసము గావించెను. అంతేకాక ఈ కామాఖ్యావాసము వేదశాస్త్ర నిధులకు, ఉత్తమ ద్విజులకు, బ్రాహ్మణులకు నివాసము గావించి, అచట వేదాధ్యయనము, దానము మొదలగు పుణ్య కర్మాచరణము జరుగునట్లు వ్యవస్థను స్థాపించెను. అచటి ప్రజలు వేదవిధులై, దయాదాన తత్పరులగుట చే దేవగణములు సహితము ఆ ప్రదేశము నుండి వెడలుటకు ఇచ్ఛగించరైరి. అంత శ్రీహరి నరకుని వివాహార్థము విదర్భరాజకన్యక అయిన "మాయ" అను సుగుణాలరాశిని వరణము చేసి, వారికి వివాహము జరిపి, తన పుత్రుని మహారాజుగ అభిషిక్తుని గావించెను. తదుపరి మాధవుడు ఆ పర్వతముల మధ్యమున ఒక అత్యంత రహస్య స్థలి యందు పరమగుప్తము, సుఖప్రదము అయిన గిరి దుర్గమును నిర్మించెను. ఆ పరిసరములందు దేవగణ నివాసముండుట చే ఆ దుర్గము సర్వులకు అగమ్యమయినది.

తదనంతరము నరకుడు హతుడయిన ఘటకుని సర్వసేనా సమూహమును, చతుర్దంతులయిన గజములను, రథాశ్వ పదాతి సైన్యమును, భూరి భూషణ సంపత్తిని కైవసము కావించుకొనెను. తదుపరి నారాయణుడు నరకునకు త్రిభువనములందు శ్రేష్ఠము, లోహమయ చక్ర సంయుతము, అర్థయోజన విశాలము, కాంచనమయము, వజ్రకఠినము, దండధ్వజ శోభితము, స్వర్ణ నిర్మిత ధ్వజ పతాకయుతము, వైఢూర్యమణి జటితము, సింహ వ్యాఘ్ర చర్మాచ్ఛాదితము, కింకిణీజాల మాలయుక్త భూషితము, నానా సర్వాస్త్ర శస్త్ర భరితము అయిన రథమును, అంతేకాక సర్వ శత్రువినాశకరమయిన

"శక్తి" అస్త్రమును, సహితము నరకునకు భగవానుడు బహూకరించెను. ఈ శక్తి అస్త్రము అగ్ని శిఖ వలె ప్రకాశించుచుండును. అటు పిదప జగన్నాధుడు నరకుని హితార్ధము వసుధా సమక్షమున నరకునికి కొన్ని నియమములు తెలిపెను. "పుత్రా! ఈ శక్తి ఆయుధమును కేవలము నీ ప్రాణ సంరక్షణార్ధము నీకు ప్రాణభయము కలిగినపుడు మాత్రమే మనుష్యులపై ప్రయోగింపవలెను. ఈ విధర్భ రాజపుత్రి గుణరూపముల యందు నీకు అనురూప. నీవు జీవించినంత కాలము ఈమె నీ యొద్దనే యుండును. నీవు త్రేతాయుగమందు పుత్రుల కొరకు యత్నింపుము. కానీ నీకు పుత్ర సంతతి ద్వాపరాంతమున మాత్రమే కలుగును. పుత్రా! నీకు చిరకాలము జీవింపవలెనన్న ఇచ్ఛ యున్న ఎడల మునుల, బ్రాహ్మణుల యందు, రాజుల, దేవతల ఎడల విరుద్ధాచరణము ఎన్నడునూ చేయకుందువు గాక! ఈ దుర్గము అజేయము. దివ్య స్త్రీ గణముల నొంది, అనేక సుఖముల ననుభవించుచూ, కాలయాపన గావింపుము. నరకా! నేను ఏర్పరిచిన నియమములను నీవు మీరిన ఎడల నీకు ప్రాణ నష్ఠము జరుగును. అందువల్ల ప్రయత్న పూర్వకముగ ఈ నియమములను పాలింపుము."

ఈ విధముగ నరకుని తో ప్రసంగించి, తదుపరి ధరణీదేవి తో అత్యంత రహస్యముగ ఈ విధముగ పలికెను "ఓ! లోకపావనీ! నేను ఏర్పరిచిన నియమములన్నియు నరకుని హితార్ధమే! అందువలన నీవు సహితము ఈ విషయములన్నింటినీ ఈతనికి తిరిగి ఉపదేశింప వలసినది. ఓ! జగద్ధాత్రీ! ఏ సమయమున నీవు ఈ నరకుని వినాశార్ధము నన్ను ప్రార్ధించెదవో, ఆ సమయమున ఒక మానవుడు వీనిని వినాశమొనర్చును." అంత పృధివి "ప్రభూ! నా యత్నమంతయు నా పుత్రుని కొరకే! కానీ పుత్రుడు నశించిన ఎడల లోకులు నన్ను నిందించెదరు. అందువలన వీనిని రక్షింపవలసినది." నారాయణుడు "వల్లె" యని, నరకునికి మరికొన్ని హితోపదేశములు కావించి, సర్వులు చూచుచుండగనే అంతర్హితుడయ్యెను. పృధివి సహితము హరి ప్రస్తావించిన నియమానుసారము నరకుని సామ్రాజ్యమున స్థాపించెను. నరకుడు వేద శాస్త్రపారంగతుడై, బ్రాహ్మణ భక్తుడై, వినమ్రుడై, దాన తత్పరుడై, నిరంతర కామాఖ్యా పూజా ధురంధరుడై, నీలకూట పర్వతమందు నానా భోగములు అనుభవించుచూ, శోభాయుక్తుడై, శత్రువులకజేయుడై, ఇంద్ర తుల్య భోగములననుభవించుచూ చిరకాలము రాజ్యపాలన కావించెను.

ఆ సమయమున విదేహరాజ్యాధిపతి జనకుడు నరకుని సుఖసంపత్తుల గూర్చి విని, తన స్త్రీ పుత్ర బంధువుల సహితుడై నరకుని చూచుటకేతెంచెను. దేవరాజతుల్య భోగములు అనుభవించుచున్న నరకుని గాంచి, తనతో పాటు ఏతెంచిన రాణుల, బాంధవుల ఎదుట జనక మహీపతి ఈ విధముగ పలికెను. "ఈ మహాత్ముడు, మహితాన్వితుడు అయిన నరకుడు కేవలము మన వద్ద పెరిగినవాడు మాత్రమే! ఈతడు సాక్షాత్ విష్ణువు చే ధరణి గర్భము నుండి ఆవిర్భవించిన మహానుభావుడు." ఈ విధముగ పలికి జనకుడు ఆ సమస్త వృత్తాంతమును సర్వులకు ఎరింగించెను. తదుపరి కొన్ని దినములు నరకుని తో ఆనందము ననుభవించి విదేహవాసులందరూ తమ రాజ్యమునకు తాము ఏగిరి. పృధివీ పుత్రుడయిన నరకుడు ప్రశాంత చిత్తుడై చిరకాలము ఒక ప్రక్క సుఖమయ రాజ్యపాలనము, మరియొక ప్రక్క విహారయుక్త విలాస జీవనము కావించుచూ ఆనంద డోలికల యందు ఓలలాడెను.

**(శ్రీ కాళికా పురాణ మందలి నరకుని పితృదర్శనము మరియు రాజ్యపాలనమనెడు ముప్పది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము)**

# ముప్పది తొమ్మిదవ అధ్యాయము

**(భౌమ తపస్సు)**

పరమ మనోహరుడు, శోభాయుక్తుడు, దీర్ఘజీవి అయిన నరకుడు దీర్ఘకాలము రాజ్యపాలన కావించెను. కాలచక్రము నెమ్మదిగ దొర్లి త్రేతాయుగము గడచి ద్వాపరము ప్రవేశించి, ద్వాపరయుగము సహితము చివరి దశ కేతెంచెను. కాలము బహుచిత్రమయినది కదా! భూదేవి, శ్రీమహావిష్ణువుల పుత్రుడగుట ఏమి? ధర్మవిరోధి అగుట ఏమి? విధి నెవ్వరునూ దాటలేరు కదా! ఈ విధముగ కాలము వ్యతీతమగుచున్నపుడు ఒక విచిత్రము జరిగినది. ద్వాపరాంతమున శోణ పురమున "బాణుడు" అను మహాబలి జన్మించెను. ఆతడు బలిచక్రవర్తి యొక్క తనయుడు. సహస్ర బాహుడు,. తన నిశ్చల భక్తి చే శంకరుని కింకరుని గ చేసికొని నిరంతరము నిర్భయముగ జీవించుచుండెను. బలి, నరకులు ప్రాణమిత్రులయిరి. అగ్ని, పవనుల వలె అత్యంత మైత్రీభావము నెరుపుచూ, వారిరువురూ ఒకరి గృహములకు వేరొకరు ఏతెంచుచూ, ఒండొరులు ప్రగాఢ మైత్రీ భావము నొంది యుండిరి. బాణుడు శంకరుని యందు భక్తి కలిగియున్ననూ, అసుర ప్రవర్తనను విడువకుండెను. నెమ్మదిగ నరకుడు సహితము బాణుని చేష్టలు వీక్షించుచూ, సంసర్గ దోషము చే తానునూ నెమ్మదిగ మారుట నారంభించి, బ్రాహ్మణ పూజ, వేదాధ్యయనము, ధర్మకార్యనిరతి, దానయజ్ఞములు మానివైచెను. అంతేకాక ఇంతకుమునుపు తాను కావించు విష్ణు, భూదేవి పూజ పూర్తిగ మానివైచి, కామాఖ్యదేవి పట్ల సహితము పెడముఖము పెట్టెను.

ఆ సమయమున బ్రహ్మ పుత్రుడయిన వశిష్ఠ మహర్షి కామాక్షీ దర్శనార్థము ప్రాగ్జ్యోషితపురమేతెంచెను. నీలకూట పర్వత దుర్గమందు నరకుడు వశిష్ఠునకు కామాక్షీ దర్శనమునకు ప్రవేశము నిషేధించెను. అంత వశిష్ఠుడు కుపితుడయినప్పటికీ, తనను తాను తమాయించుకొని "నరకా! నీవు విష్ణుదేవుని తేజమున పృథివీ దేవి గర్భము నుండి ఆవిర్భవించితివి. అయిననూ బ్రాహ్మణుడనైన నాకు దేవతాదర్శనము నిరాకరించుచుంటివి. ఇది నీ కులధర్మము కాదు. నీ కులోచిత ధర్మము పాటించి నాకు ప్రవేశము కల్పింపుము. నేను జగదంబ యొక్క పూజ చేసికొని వెడలిపోయెదను." కానీ నరకుడు మహాత్ముడయిన వశిష్ఠుని ఎడల మిగులకటు వాక్యములు పలికి, అవమానించి, ఆయనకు ప్రవేశమునొల్లకుండెను. అంత వశిష్ఠుడు అగ్రహోదగ్రుడై, "ఓరీ! పాపిష్ఠీ! వరాహపుత్రా! నీవు ఎవరి తేజము వలన జన్మనందితివో, ఆ మహాత్ముడు మానుషరూపము ధరించి, అతి శీఘ్రముగ నిన్ను వధించును. పాపాత్మా! నీ మృత్యువయిన పిదపనే నేను కామాఖ్యా పూజన మొనరింతును. నేను వెడలుచున్నాను. ఓ! దురాత్మా! నీవు జీవించియున్నంత కాలము జగజ్జనని కామాఖ్యాదేవి తన పరివార సమేతముగ అంతర్ధానమొందును." ఈ విధముగ పలికి వశిష్ఠుడు తన స్వస్థానమునకు చనెను.

ముని చనిన పిదప నరకుడు విస్మితుడై నీలకూట పర్వత గుహయందలి కామాఖ్యా మందిరమున కేగెను. అచట కామాఖ్యాదేవి కానీ, యోని మండలము కానీ, ఆ తల్లి యొక్క పరిజనులు కానీ కనబడరాయె. అంత నరకుడు తన తండ్రి అయిన నారాయణుని, తల్లి అయిన వసుంధరను మనసున స్మరించెను. కానీ నరకుడు నీతిమార్గమును, నియమపాలనమును వర్జించిన కారణమున వారిరువురు సహితము దర్శనమీయ లేదు. వజ్రధ్వజుడయిన నరకుడు దీర్ఘ కాలము వారివురురి కొరకు ప్రతీక్షించెను. కానీ ఆతని ఆశలు అడియాసలైనవి. అంత నరకుడు తిరిగి తన గృహమున కేగి, తన నగరమంతయు శోభహీనమగుట గమనించెను. కామాఖ్యాదేవి అంతర్హితమయిన పిదప అచటి జనులు వేదమంత్రోచ్ఛారణ చేయజాలకుండిరి. అంతేకాక ఎవరికినీ పుణ్యకార్యములు సహితము యత్నత: చేయుటకు

మనసొప్పకుండెను. ఏ దేవతా, మనుష్య, మహర్షిగణము నరక భవనమున కేతెంచకుండిరి. యజ్ఞక్రియలు, ఉత్సవములు సంపూర్ణముగ లుప్తమయ్యెను. విఘ్నముల కారణమున లోకులు నష్టమయిరి. లౌహిత్యనది ఇంకిపోయి శుష్కమయ్యెను. నరకుడు ఈ వైపరీత్యముల నన్నింటినీ అవలోకించి, తనకు మరణము ఆసన్నమయ్యెనని తలంచెను. ఆ సమయమున నరకుడు శోక సాగరమున మునిగి యుండి బలితనయుడు బాణుని తలంచెను.

బాణ, నరకులు ప్రాణమిత్రులు. ఎవరికి కష్టము కలిగిననూ, స్వర్గము నందున్న అశ్వనీ దేవతల వలె ఒకరినొకరు ఎల్లప్పుడూ సాయము చేసికొనెడివారు. అంత వజ్రకేతుడయిన నరకుడు ఈ సమయమున శంభు సఖుడయిన బాణుడు మాత్రమే తనకు సరి అయిన యోచన నిచ్చునని, అతడు ఎంతో ప్రాజ్ఞుడని తలచి, బాణుని వద్దకు శీఘ్రగామి అయిన దూతను వాయువేగమున పోగల రధమునిచ్చి శోణపురమున కంపెను. దూత బాణునకు నరకుని సందేశమయిన వశిష్ఠ శాపము, ప్రాగ్జ్యోషిత పురమందు విఘ్నములు, నియమభంగ కారణమున తన మాతా పితరులు తనకు దర్శనమీయకుండుట, మొదలగు సర్వమును ఎరింగించెను. బాణుడు తన మిత్రునకు జరిగిన పరాభవమును, దు:ఖమునకు సంబంధించిన విషయములందు ఉపదేశము నిచ్చి, స్వాంతన పరచుటకు ఒక దివ్యరధము నెక్కి బయలుదేరెను. ఆ అదరము కాంచనమయము, త్రిశత హయములచే పూన్చబడి, లోహమయమయిన కళ్ళెము, (వాఘ) మయూర ధ్వజయుక్తము, కింకిణీజాల మయము, మరియు ఛత్ర ఆచ్ఛాదితమై యుండెను. సహస్రబాహువయిన బాణుడు చతురంగబల సమేతుడై ప్రాగ్జ్యోషిత పుర ప్రవేశము కావించి, నరకుని కడ కేతెంచెను. బాణుడు తన మిత్రుడు, మరియు ఆతని నగరము పూర్వము యున్న శోభ, సొబగు లేకుండుట ప్రస్ఫుటముగ గమనించి ఇట్లనియె "మిత్రమా! నీ శరీరము పూర్వము వలె శోభాయమానముగ లేదు. మనస్సు సహితము ఆంధోళనతో డోలాయమానముగ యున్నట్లున్నది. కారణమేమి?" అంత నరకుడు జరిగిన వృత్తాంతమంతయు పూస గ్రుచ్చినట్లు బాణునికి వివరించెను.

అంత బాణుడు "మిత్రమా! నీ వంటి వానికి ఈ శోకము తగదు. జీవి శరీరమొందిన పిదప సుఖ దు:ఖములను చక్రము నందు తిరుగుచుండును. దు:ఖములరుదెంచునపుడు వ్యక్తి ధీరత్వము బూని ప్రతీకారమొనర్పవలెను. ఈ ప్రతీకారము మంగళ జనకము. నీవు ప్రయత్నపూర్వకముగ ఈ శోకముపై ప్రతీకార మొనర్పవలెను. ఈ పృధివి పై ఏ మానవ, దానవ, అసుర, రాక్షస, కిన్నెరాదులు, అసాధారణ ఐశ్వర్యవంతులయిన ఎడల ఇంద్రుడు దానిని సహింపనోపడు. అతడు ఇతర దేవతలతో కలసి ఎట్టైననూ వానిని ఐశ్వర్య భ్రష్టుని కావించును. ఈ ఇంద్రునికి పూజ్యుడయిన దేవత శ్రీమహావిష్ణువు. ఈ విష్ణువు ఇంద్రునికి అనిష్ఠమయిన ఏ కార్యమును కావింపడు. ఒకవేళ ఎవరేని ఇంద్రునికి అనిష్ఠమయిన కార్యముల హేతువై విష్ణువును పూజించిన ఎడల, ఆతడు మిక్కిలి కౌశలముతో అనిష్ఠ వరములు ప్రసాదించి వానిని నాశనమొనర్చును. ఎవరు చిరకాలము తనను ఆరాధించునో లేక అనేక కష్ఠ నష్ఠముల కోర్చి తనను పూజించునో వారికి శ్రీహరి వరములిచ్చును. తన ఇష్టదైవము కృప లేక ఎవరును అతులిత ఐశ్వర్యవంతులవలేరు. నీవు ఇదివరలో బ్రహ్మ, లేక విష్ణువు యొక్క నిత్యారాధనము కావింపలేదు. అందువలన నీకు అనేక విఘ్నములు అంకురించుచున్నవి. నీ పాలకుడయిన విష్ణువు సాధారణముగ ఎవరిపైననూ అనుగ్రహము చూపడు. కానీ పృధివీ దేవి వచనానుసారము నీవు ఆయనను ఆరాధించితివి. కానీ నీకు ఆ విష్ణువు ఛిద్రమయిన వరమొసంగెను (నీవు ఎంతకాలము బ్రాహ్మణ సేవ కావింతువో, అంత కాలము జీవింతువు). ఇందు వశిష్ఠుని అపరాధము ఇసుమంతయు లేదు. అందువలన పరమ తపస్వి అయిన వశిష్ఠుని పై నేరము మోపవద్దు. మిత్రమా! భౌమా! (భూమి పుత్రా!) ఇది అంతయు విష్ణువు యొక్క కుటిలత. ఇక నుండి నీవు "విష్ణువు నా తండ్రి" అను ధారణ, విశ్వాసము మానుము. ఈ విషయమై ఉదాశీనత కూడదు. నీ తండ్రి విష్ణువు కాదు. వరాహుడు. కానీ ఆయన ఇపుడు లోకము నందు లేడు. కానీ వరాహుడు విష్ణ్వాంశ అని నీవు వినియుంటివి. కానీ ఎవరు ఎవరి అంశ ఎవరికెరుక? నీవు ఈ వ్యవహారము నంతటినీ ప్రక్కకు నెట్టి బ్రహ్మ లేక శివుని

గూర్చి తపమొనరింపుము. వారు ప్రసన్నులై నీకు అభిలిషితములైన వరముల నీయలగరు. ఎటువంటి విఘ్నములు, ముని శాపములు, పీడలయిననూ పరమేష్ఠి, పరమశివులు ప్రసన్నమయిరేని అవన్నియు సంపూర్ణముగ వ్యర్థమయి నీకు శుభములు కలుగును.

భౌముడు (భూమి పుత్రుడు) బాణుని వాక్యములు విని అత్యంత హర్షితుడై, ధీరత్వమును వహించి గద్గద స్వరముతో ఇట్లనియె "ఓ! మిత్రవత్సలా! నీ పలుకులు నేను సంపూర్ణముగ విశ్వశింతును. ఇకనాకు విష్ణువు ఆరాధనీయుడు కాదు. దానికి గల కారణము నీవు నిర్వచించితివి. శంభుడు సహితము నాకు ఆరాధనీయుడు కాదు. ఎందుకనగా ఆయన గుప్తముగ నా నగరము నందే యున్నాడు. నీ కథనానుసారము పరమేష్ఠి, చతుర్ముఖ బ్రహ్మయే నాకు ఆరాధనీయుడు. నేను లౌహిత్యనది అయిన బ్రహ్మపుత్ర ఒడ్డున బ్రహ్మదేవుని ఆరాధించెను. మిత్రమా! ఏ విధముగా ఉత్తమమయిన గురువు శిష్యునకు సరియగు ఉపదేశము నొనర్చునో అట్లే సమయమునకు నాకు సరియగు ఉపదేశము నిచ్చితివి," అని బాణుని పరిపరివిధముల కొనియాడి సత్కరించెను. బాణుడు సహితము ముదమునొంది తన గృహమున కేగెను. ఆహా! వినాశకాలే విపరీతబుద్ధి: అనగా ఇదియే కదా!!

తదుపరి నరకుడు బ్రహ్మపుత్రా నదీ తీరమున గల బ్రహ్మాచలమందు పరమేష్ఠి గూర్చి వంద మానుష సంవత్సరములు పూజ, తపశ్చర్య కావించెను. ఆతని పూజకు ప్రసన్నుడై పరమేష్ఠి ఆతని ఎదుట ప్రత్యక్షమై ఇట్లనియె "ఓ! సువ్రతా!! నీ ఉపాసన చే నేను మిక్కిలి సంతుష్ఠి నొందితిని. ఏదేని వరము కోరుకొనుము." అంత నరకుడు అత్యంత వినయవంతుడై, అవనిత శిరస్కుడై, అంజలి ఘటించి ఇట్లనియె "ఓ! సురప్రవరా! ప్రథమత: నేను దేవాసుర, రాక్షసులచే అవధ్యుడనవవలెను. రెండు. ఎంతవరకు సూర్యంచంద్రులు ఈ జగతిని ప్రకాశించుచుందురో, అంతదనుక నా సంతాన పరంపర తంతువు వలె సాగవలెను. మూడు. తిలోత్తమాది దేవకన్య తుల్యమయిన పదహారు వేల మంది స్త్రీలు నాకు ప్రాప్తించవలెను. నాలుగు. నేను ఎవ్వరికినీ జయింప నశక్యుడనవవలెను. అయిదు. నేను సర్వదా శ్రీయుక్తుడనై, ఐశ్వర్యముతో ప్రకాశింపవలెను. ఏమి ఖర్మము!!!. ఈ భౌముడు మాయా మోహితుడై మునిశాపమును, శాప నివారణమును సంపూర్ణముగ విస్మరించెను. అంత పరమేష్ఠి "నీవడిగిన వరములన్నియు నీకు ప్రాప్తించును. నీవడిగిన అప్సరతుల్య కన్యలు నీకు ద్వాపరాంతమున లభించెదరు. కానీ నారదమహర్షి నీ పురమందు అడుగుపెట్టనంత వరకు నీవు వారితో మైధున కర్మమాచరింపతగదు." ఈ విధముగ పలికి బ్రహ్మ తక్షణము అంతర్హితుడయ్యెను. నరకుడు సహితము అత్యంత ఆనందితుడై తన నగరముక కేగెను.

తదనంతరము పరమేష్ఠి వరప్రభావము వలన లోకులు ఆనందయుక్తులయి, లక్ష్మీ సంపన్నులై, ఉత్సాహవంతులై, విప్లవరహితులైరి. దేశము సర్వము పశు, సస్య, ఆశ్వ, గజాది సమృద్ధమై, నగరము పున:పరిపూర్ణమయినది. ప్రాగ్జోషితము తిరిగి తన పూర్వ వైభవమును సంతరించుకొనినది. ఆ సమయమున బాణుడు నరకుని వద్దకేతెంచి, పురము, ప్రజలు, మహీపతి, పూర్వ వైభవముతో వెలుగుట గమనించి, మనమున సంతసిల్లి "మిత్రమా! నీవు పరమేష్ఠి కొరకై ఎచట తపమాచరించితివి? ఏ నియమములు, వ్రత పాలన, కావించితివి? ఏ వరములడిగితివి? అవన్నియు నాకు సవిస్తరముగ తెలుపవలసినది." అంత భౌముడు "మిత్రమా! పరమేష్ఠి బ్రహ్మ స్వయముగ ఒక పర్వతరూపము ధరించి ఈ కామేశ్వరీ దేవిని మోయుటకు ఇచట అవతీర్ణుడయ్యెను. వశిష్ఠుడు నాకు శాప మివ్వక మునుపు బ్రహ్మ ఈ కామాఖ్యా దేవిని స్వయముగా సేవించువాడు. నేను ఈ పర్వతము పై కేవల జలపానము కావించుచూ వంద సంవత్సరముల పర్యంతము తపము గావించితిని. ఈ లౌహిత్య తీరమున మలయ, మంద వాయు సేవితమున, మనోహర సుఖ ప్రద స్థానమున కావింపబడిన తపస్సు వంద సంవత్సరములు అయినప్పటికీ ఒక్క వత్సరము వలె గడచి పోయెను. అంత పరమేష్ఠి ప్రత్యక్షమై, నాపై హితవాక్యములు పలికి వరము కోరుకొనమనెను. నేను సురాసుర దేవతా యోని సంభవుల చే అవధ్యత,

అవిచ్ఛిన్న సంతాన పరంపర, ఇతరులచే అజేయత్వము, అఖండైశ్వర్య ప్రాప్తి, ఉత్తమ రూపవతుల యొక్క పతిత్వము, ఈ అయిదు వరములు వాంఛించితిని. ఆయన ఈ వరప్రదానము కావించి తన స్వస్థానమునకు చనెను. నేను తిరిగి నా నగరమున కేతెంచి, పురాతన బంధు, బాంధవులను రావించి ధన ధాన్యములచే వారందరినీ సంతృప్తి పరచితిని.

ఇవన్నియు వినిన బాణుడు పూర్ణ సంతోషము నొందక నరకునితో ఇట్లనియె "మిత్రమా! బ్రహ్మ సమక్షమున నీ బుద్ధి విచలితమయినది. నీవు వశిష్ఠశాపము గూర్చి ఆయనతో ఏల ప్రస్తావింపలేదు? నీకు మంగళములెట్లు సంభవించును? అవశ్యంభావి. ఏది ఎట్లు జరుగనున్నదో అది జరిగితీరును. దేవ కార్యములందు నియమమేమన రెండవమారు ఆ కార్యము కొరకై ప్రయత్నింపరాదు. దాని వలన హాని జరుగును. ఇక పరమేష్ఠి సహితము ఆ శాపము నాపలేడు. అందువలన ఇకముందు అగ్ని సమాన తేజస్వులయిన అసురులను నీ అమాత్యులుగ నియమింపుము. దేవతలకు సహితము దుర్జయులయిన వీరులను నీ ద్వారపాలురుగ నియుక్తులను కావింపుము. దేవేశ్వరుడయిన హరిని వదలి నీవు సత్కార్యము నాచరించితివి. ఇక బ్రహ్మ వరములు బడయుటకు ప్రయత్నింపుము. నీ నగరముననే నివసించుచూ, పత్నీ గర్భమందు పుత్రులను ఉత్పన్నము కావింపుము." ఈ విధముగ నరకుని బాణుడు సముదాయించి, ఆతని సత్కారములు పొంది, తిరిగి తన నగరము చేరెను. నరకుడు సహితము బాణుని సూచనలన్నింటినీ అమలు చేసెను.

**(శ్రీ కాళికా పురాణమందలి భౌమతపస్సు అను ముప్పది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# నలుబదియవ అధ్యాయము

**(నరకుని పుత్రోత్పత్తి మరియు నాశనము)**

కాలక్రమమున నరకుని పత్ని అయిన మాయ గర్భము దాల్చి భగదత్తుడు, మహాశీర్షుడు, మదవాన్, మరియు సుమాలి అను నలుగురు పుత్రులకు జన్మనిచ్చెను. వారందరూ అమేయ బలశాలురు, వీర్యవంతులు, మరియు ప్రత్యర్థులకు అజేయులు. తదుపరి బాణుని వచనానుసారము నరకుడు "హయగ్రీవుడు" అను అసురుని వెదకి, తెచ్చుకొని తన సేనాపతిగా నియమించెను. హయగ్రీవుని సమాచారమును వినిన మిగిలిన ప్రముఖ రాక్షసులు – మురాసురుడు, సుంద, నిసుందులు, మరియు విరుపాక్షుడు సహితము నరకుని చేరిరి. ఈ విషయము తెలిపి భూమండలమందున్న అసుర, రాక్షస జాతులన్నియు నరకుని ఆధిపత్యము నంగీకరించి, వాని వద్దకు చేరినవి. ఈ సేనలన్నియు ఏకత్రమయిన పిదప నరకుడు సభతీర్చి మురాసురుని పశ్చిమ ద్వారమునకు, నిసుందుని తూర్పు ద్వారమునకు, హయగ్రీవుని ఉత్తర ద్వారమునకు, విరూపాక్షుని దక్షిణ ద్వారమునకు అధిపతులుగ అభిషిక్తుల గావించి, సుందుని మధ్య స్థలమునకు సేనాపతిగ నియమించెను. మురాసురుడు అరువది వేల క్షురాంత పాశములను అస్త్రములచే ఆ ద్వారమును బంధించెను. నరకుడు పూర్వపు మంత్రులను, అమాత్యులను అవమానించుచూ, ఈ అసురులతో ఎల్లప్పుడూ సాంగత్యము చేయుచూ, వారితో ప్రొద్దుపుచ్చుట యందు అమలానందము ననుభవింపసాగెను. కాలము ఎంత బలీయమైనదో కదా! ఎక్కడి విష్ణుపుత్రుడు, ధరాగర్భ సంజాతుడు, మిక్కిలి వినయ సౌజన్యమూర్తి అయిన నరకుడు ఈ అసుర సాంగత్యము చే తన పూర్వ భావములన్నింటినీ విడనాడి, సంపూర్ణ అసురత్వమును బడసి, దేవతలను పీడింప మొదలిడెను.

మూర్తీభవించిన అసురత్వము చే ఇపుడు నరకుడు నరకాసురుడు ఆయ్యెను. నిరంతరము దేవతల, ఋషి, మునిగణములను అవమానించెను. హయగ్రీవుని సహాయమున దేవరాజు ఇంద్రుని పరాజితుని కావించి, అసురీభావము మరింత ప్రస్ఫుటమగు చుండగా, ధరామండలమును ఆక్రమించుట నారంభించెను. అగ్నికి పవనము తోడయినట్లు

బాణాసురుని యోచన మేరకు ఇంద్ర పరాజయానంతరము త్రైలోక దుర్లభము, సర్వదు:ఖహరము విఘ్ననాశకము, రత్నమయము, త్రిలోక ప్రసిద్ధములయిన అదితి కుండలములను హరించెను. ఈ విధముగ ముని శాపమును సహితము ఇంచుక ఖాతరు చేయక ముని, దేవతా గణములను పీడించుచూ అయిదు వేల సంవత్సరములు రాజ్యము చేసెను. నరకుని పాపకార్యములచే పృధివి మహా భారాక్రాంతమై, భారము మోయజాలక భ్రహ్మ, విష్ణువుల వద్దకేగి ఈ విధముగ మొరపెట్టుకొనెను. "హే! ప్రభూ! విష్ణుమూర్తి తొలుత దైత్య, రాక్షస, దానవ గణములను దునుమాడి పృధివీ భారహరణము కావించెను. వారందరూ తిరిగి నరకుని గృహమందు చేరి మహాబలము సంతరించుకొనిరి. ఈ దుస్సహ భారమును నేను సహింపలేను. ఈ అసురులు అసంఖ్యాకులు. గణింప నశక్యులు. వారందరిలో ఎనిమిది వందల మంది అతీవ బలాఢ్యులు. వారిలో కూడ అతిబలవంతులను పేర్కొందును. వారు బలి పుత్రుడయిన బాణుడు, మహావీరుడయిన కంసుడు, ధేనుక, అరిష్ఠ, ప్రలంబులు, మల్లులయిన చాణూర, ముష్ఠికులు, మహాబలి అయిన జరాసంధుడు, నరకుడు, హయగ్రీవుడు, సుంద నిసుందులు, విరూపాక్షుడు, పంచజనుడు, హిడింబుడు, బకుడు, జటాసురుడు, కిమ్మీరుడు, అలాయుధుడు, అలంబసుడు, సౌభుడు, ద్వివిదుడు, శతాయుధుడు, శృతాయుధుడు, శృష్యశృంగ పుత్రులు సుబాహు, అతిబాహులు, హిరణ్యాపురవాసి అయిన కాలజంఘుడు. వీరి పాపపు భారమును నేను మోయలేను. వీరి పదాఘాతముల చే నేను విదీర్ణ మగుచున్నాను. దేవ గణములు వీరిని నిర్మూలించుగాక! లేని ఎడల పాతాళమునకు తిరిగి పడిపోయెదను.

అంత త్రిమూర్తులు ధరణికి ఆశ్వాసన మొసంగి, తాము పృధివీ భార విమోచన కావించెదమని నమ్మబలికి, ఆమెను తిరిగి వెనకకు పంపిరి. అంత వారు ఆ బృహత్ కార్యమునకై మాధవుని ప్రసన్నుని గావించిరి. అంత భగవానుడు "దేవతలారా! మీరందరూ మీమీ అంశలతో పృధివీ భారవిమోచనకు ధరిత్రి పై జన్మింపవలసినది. నేను సహితము అవతరించెదనని" పలికి ఆ దేవదేవుడు దేవకీ గర్భ సంజాతుడై యాదవకులమున ఉధ్భవించెను. దేవతలు ఆ సమయమున పదహారు వేల మంది రంభా, తిలోత్తమాది సౌందర్య సదృశులయిన రాజకన్యలను ధరిత్రిపై ఉత్పన్నము కావించిరి. వారందరూ ఒక తరి హిమాలయ సానువులందు క్రీడించుచుండగా, నరకుడు వారిని క్షణములో వశము చేసకొనెను. వారితో సంభోగకాంక్షతో వారందరినీ ప్రాగ్జోషిత పురమునకు కొనివచ్చెను. అంత ఆ రమణీమణులు "ఓ! భూమిపుత్రా! దయచేసి నారదుల వారు ఇచటికి విచ్చేసి మాకు దర్శనమిచ్చు వరకు మాతో సంభోగింపక మమ్ము రక్షింపవలసినది. ఓ! మహావీరా! వారు అతి త్వరలో ఇచటకి ఏతెంచెదరు. అంతదనుక ప్రతీక్షించి, ఆపై మాతో సంభోగ సుఖానుభవమొందవలసినది." భౌముడు సహితము భ్రహ్మదేవుని పలుకులు గుర్తుకు తెచ్చుకొని వారి ప్రార్ధనను అంగీకరించెను. ఆ సమయముననే సనాతనుడు, కృష్ణ భగవానుడు దేవకీ గర్భము నందుత్పన్నమై, కంస, ప్రలంబ, కేశి ఆదిగా అసురులను సంహరించి, సముద్ర మధ్యమున ద్వారకను స్థాపించి, రుక్మిణి, కాళింది, నాగ్నజితి, సత్య, లక్షణ, చారుహాసినీ, శీలసంపన్నా, సుశీలా, మరియు జాంబవతి అను ఎనిమిది మంది కన్యకామణులను పత్నీ రూపమున వరణము చేసెను. వీరందరితో అత్యంతానురక్తితో సుఖించుచు భగవానుడు ముప్పది ఆరు వర్షములు గడిపెను. వారందరికీ ప్రద్యుమ్న, సాంబాది అనేకమంది పుత్రులు కలిగిరి. ఆ మహానుభావుడు తన పరాక్రమముచే పృధివీ భారరూపులయిన అనేక మంది దైత్యుల నంతమొందించి, క్రీడాతత్పరుడై ద్వారక యందు నివసించుచుండెను.

ఆ సమయముననే నరకుని చే పీడింపబడుచున్న ఇంద్రాది దేవతలు తమ గణముల సహితులై శ్రీకృష్ణ సందర్శనార్ధము ద్వారకకు ఏతెంచి, ఆయనకు సాష్టాంగ దండ ప్రణామము లర్పించిరి. దేవదేవుడు శ్రీకృష్ణుడు వారందరినీ ఆదరించి, స్వాగత సత్కారములు ఆచరించి, ఆశీనులగావించెను. అంత ఇంద్రాది దేవతలు నరకుడు ఆచరించుచున్న దుష్కృత్యములన్నింటినీ ఈ విధముగ ఏకరువు పెట్టిరి. "ఓ! మహాబాహూ! శ్రీకృష్ణా! మేమందరమూ ఏ కారణమున మిమ్ము శరణు జొచ్చితిమో తెలిపెదము. దయచేసి వినవలసినది. ఇందు అసత్యము ఈషణ్మాత్రము లేదు. భూమి

పుత్రుడయిన నరకుడు తొలుత శ్రీమహావిష్ణువు మరియు ధరణీదేవి చే పాలింపబడి, సహృదయుడై యుండెను. కానీ కాల పరిణామమున ఆతడు మిక్కిలి దుష్టుడై, సురపీడకుడై, ధరణీ, విష్ణువులను సైతము కృతఘ్నుడై మరచి, వారిని సహితము అవహేళన గావించుచుండెను. ఆతడు బాణుని సలహా మేరకు పరమేష్ఠిని మెప్పించి, వరములు బడసి, వరగర్వితుడయ్యెను. ఒకప్పుడు ఎంతో సజ్జనుడయిన నరకుడు అత్యంత మోహాంధకారమున బడి తన జననీ జనకులను సహితము స్మరింపడయ్యె! దేవతా ఋషిగణములను సర్వదా పీడించుచూ, బ్రాహ్మణ గణములకు అప్రియము గావించుచూ, సదా అమృతము స్రవించు అదితి కుండలములను హరించెను. ఈతడు దేవ, దైత్య అసురులకు అవధ్యుడు. ఈ కార్యము మీచే మాత్రమే జరుగను. సర్వ జగత్తుకు మంగళముగ ఈ పాపాత్ముని సంహరింపవలసినది. దేవతలు మీ కోసమై పదునారు వేల ఒక వంద మంది దేవ, గంధర్వ కాంతలను హిమాలయములందుంచిరి. ఈ పాపి హయగ్రీవుని సహాయముతో వారందరినీ చెరబట్టెను. అంతేకాక స్వర్గ, మర్త్య, పాతాళములందు, సాగరగర్భమున ఎన్ని రత్నములు, మణి మాణిక్యములు కలవో, వాటన్నిటినీ దేవ, దానవ, మానవులను పీడించి, గ్రహించి, లౌహిత్య నదీ తీరమున మణి పర్వతమును నిర్మించి, దానిపై "అలక" అను నగరమును సహితము కట్టి, ఈ దేవ, గంధర్వ కాంతలందరినీ అందు బంధించెను. ఆ స్త్రీ రత్నములందరూ ఏకవేణీ ధారణ వ్రతమాచరించి, సంభోగము నిరాకరించిరి. ఈ స్త్రీలందరూ నారదాగమనము వరకు సంభోగము కూడదని నరకునకు నిమయమేర్పరిచి, తమను తాత్కాలికముగ రక్షించుకొనిరి. ప్రభూ! మీరు వారందరినీ సనాథలను చేయప్రార్థన. నారదుడు ప్రాగ్జ్యోషిత పురమునకు పోవక మునుపే మీరు దేవమానవ కంటకుడైన నరకుని పరిమార్చవలసినది. నరకుని సంహరించుట చే ధరణి శోకిల్లదు. ఎందుకనగా స్వయముగా ధరణియే ఈ నరకుని సంహరింపమని దేవతలను వేడుకొన్నది. నరకుని సంహరించి, మణి రత్నాదులను తిరిగి యధాస్థానముల కంపి, బంధింపబడిన స్త్రీ రత్నములనెల్ల ఉద్ధరింప ప్రార్థన."

అంత దేవదేవుడు మాధుడు, తక్షణమే నరకుని హతమార్చెదనని ప్రతిజ్ఞ చేసి సత్యభామా సహితుడై, గరుడారూఢుడై, నరకపురికి చనెను. ఇంద్రాది దేవగణములు తమ యధాస్థానములకు వెడలిరి. సత్యా, మాధువులు క్షణములో అతి రమ్య నగరమయిన ప్రాగ్జ్యోషిత పురము చేరి, గుప్త రూపములతో ఆ నగరమును మృత్యు పాశముల వలె విస్తరించి రక్షించుచున్న మురాసురుని అరువది వేల క్షురాస్త్ర పాశములను వీక్షించిరి. ఆ సమయమున హరి లోనికి వెడలుచున్న నారదుని కాంచెను. నారద మహర్షి నరకుని వద్దకేగి, అతని చే సత్కరింపబడి, ఆశీనుడు కాగా, నరకుడు తన దేవకాంతా సంభోగము గూర్చి ప్రశ్నించెను. నారదుడు "భూమిపుత్రా! నేడు చైత్ర శుక్ల పంచమి. ఇయ్యది నీకు విపత్కాలము. నవమి నీకు మరింత విపత్తు కలుగజేయును. అందువలన నీవు ఈ విపత్తును దాటి చతుర్దశి నాడు ఈ స్త్రీలు ఋతుస్నాతలయిన ఎడల వారితో నీవు అత్యంత రతిసౌఖ్యమనుభవింపవచ్చు." నారదుని కధనము నాలకించిన నరకుడు అత్యంత భయభీతుడై, సర్వ సైన్యమును సన్నద్ధము కావించి, నలుదిక్కులా మొహరింపజేసి, భయ హాస్యములు ఏకతరిని ఆవరించగా, విపత్తు గూర్చి యోచన చేయుచూ ప్రతీక్షింపసాగెను.

అదే క్షణమున దేవాధిదేవుడు మాధవుడు సత్యభామా సమేతుడై, పశ్చిమద్వారమును ఆక్రమించి, అరువది వేల క్షుర పాశములను ఖండ ఖండములు గావించి, మురాసురుని బంధు, మిత్ర, పుత్ర, బాంధవ, సైన్య సమేతముగ యమపురికి అతిధుల గావించెను. తదుపరి అనేక శిలలను దాటి నిస్సుందుని సహితము పరివార సమేతముగ హతమార్చెను. పూర్వకాలమందు దేవతలకు అజేయుడు, అమేయ పరాక్రమునిగ పేరుగాంచిన హయగ్రీవుని నిర్వీర్యుని గావించి, ఆక్రమించి, వధించెను. పరామాత్ముడు, దేవకీ నందనుడు లౌహిత్యనదీ మధ్యభాగమున ప్రవేశించి విరూపాక్ష, సుంద, పంచజనులను పరిమార్చెను. తదుపరి జగన్నాధుడు మహాకాయులు, దురాసదులు, మహావీరులయిన దానవులను దునుమాడి ప్రాగ్జ్యోషిత పుర ప్రవేశము కావించెను. ఆ పురి అత్యంత ప్రదీప్తమై, ఎత్తైన ప్రాకారము చే పరిరక్షింపబడుచూ,

అంబర చుంచిత హర్మ్యములతో కూడి, ఇంద్రుని అమరావతిని తలపోయుచున్నది. తదనంతరము భీరువులకు భయము, సురలకు సంతోషము ఒనరించు, దేవదానవ సంగ్రామమును తలపించు మహా సంగ్రామమారంభమయినది. అంత భగవానుడు జనార్ధనుడు శాంగ ధన్వ విముక్త శర పరంపరచే పద్దెనిమిది వందల వేల దానవ గణములను చీల్చి చెండాడి, పీనుగుల పెంట కావించి చివరకు నరకుని చేరెను. నరకుడు సహితము తన సేన సర్వనాశనమయ్యేనని తెలిసికొని, వెలుపల కేగి, గరుడాసీనుడయిన అచ్యుతుడు శ్రీకృష్ణుని కాంచి, వశిష్ఠ శాపమును, శ్రీ మహావిష్ణు వచనములను, నారదుని పలుకులను, బ్రహ్మదేవుని చే తనకీయబడిన ఛిద్రవరమును సంస్మరించి, తనకు కాలమాసన్నమయ్యేనవి అవగత మొనర్చుకొనెను. కానీ బాణుని వాక్యములు తలచి, సంగరము నందు కృత నిశ్చయుడై, ఇత:పూర్వము శ్రీమహావిష్ణువు తనకిచ్చిన వజ్రధ్వజ, అష్ఠలోహ చక్రయుత, సహస్ర అశ్వయుక్త దివ్యరధమందు ఆశీనుడై సంగరార్ధము ముందునకేగెను.

ఆ సమయమున నరకుడు లీలామానుష దేహధారి అయిన హరిని వీక్షించి, తిరిగి తన శాపములను పున:తలచుకొనెను. ఆ సమయమున శ్రీకృష్ణుడు శంఖ, చక్ర, గదా, శాంగధారియై, నందకమను ఉత్తమ చంద్రహాసము ధరించి, కిరీట కుండలాంకృతుడై, కౌస్తుభమణి వక్షమందు ప్రకాశించుచుండగా, పీతాంబరధారియై శోభిల్లుచుండెను. ఆ సమయమున మరొక విచిత్రము జరిగినది. శ్రీకృష్ణ ప్రభువు సమీపమున కాలాంజన వర్ణమున యున్న కాళిక, రక్తవర్ణ, రక్తముఖ, దీర్ఘకాయము తో ఖడ్గపాణియై యున్న జగద్ధాత్రి, జగన్మోహిని అయిన కామాఖ్యాదేవి కూడ కనబడెను. నరకుడు ఏక కాలమున భయ విస్మయములకు లోనై, మనసున సంభాళించుకొని, యుద్ధమునకు కృతనిశ్చయుడయ్యెను. అంత మాధవుడు నరకుని తో దేవ, దానవ, మర్త్యులనకు అలవికాని అద్వితీయ సమరమారంభించెను. మాధవుడు దేవతల హర్షధ్వానములు మధ్య నరకుని నిహతుని కావించెను. చక్రము చే ఖండితుడయిన నరకుడు రక్త తప్త పర్వతము వలె శోభిల్లెను.

తన పుత్రుడు నిహతుడై, భూపతితుడవగనే పృధివీదేవి తన దు:ఖాశృవులను అణుచుకొని, నరకుని దేహము నుండి అదితి కుండలములను తీసి శ్రీకృష్ణునకు బహుమతిగ సమర్పించి ఈ విధముగ పలికెను. "మహాప్రభూ! వరాహావతార సమయమున మీరు నన్ను ఉద్ధరించిరి. మీ సంసర్గము చే నా గర్భాన్వితుడై ఈ నరకుడు ఆవిర్భవించెను. స్వామీ! దీర్ఘకాలము మీరు ఈతనిని సంరక్షించి, ధర్మవిరోధి అగుట చే నేడు సంహరించిరి. సర్వాభీష్ఠ ప్రదాయకములైన ఈ అదితి కుండలములను మీరు స్వీకరింపవలసినది. కానీ నరకుని సంతతిని, వంశమును మీరు సంరక్షింప వలసినది." అంత దేవదేవుడు "ఓ! దేవీ! నీవే భూభారహరణము కావింపమని వేడుకొనుట చే నేను ఈ నరకుని సంహరించితిని. నీ కధనానుసారముగ ఈ వంశమును రక్షించెదను. ఈ ప్రాగ్జోషిత పురమునందు మన పౌత్రుడు భగదత్తుని మహారాజుగ అభిషేకించెదను," అని పలికి తదుపరి మధుసూదనుడు నరకుని ధనాగారము ప్రవేశించెను. అచట పర్వతాకారములో పోయబడిన మణి, రత్న, మాణిక్య, వైఢూర్యాదులను, రజత పర్వతములను, స్వర్ణ భాండారములను, విచిత్ర వాహన, యాన, శయ్యా, మరియు అనేక బహూమూల్య వస్తు సమూహ సముదాయములను వీక్షించెను. అంతటి సంపద ధనాధిపతి అయిన కుబేరుని వద్ద కానీ, ఇంద్ర, దిక్పాలుర వద్ద కానీ యుండుట కద్దు.

మాధవుడు ఆ ధనరాశి యందు తనకు వలయు వస్తు, రత్న, స్వర్ణ, రజత ధనరాశులను గ్రహించి, మహావీరులను సహితము నిహతుల కావించు వైష్ణవాస్త్రమును సహితము తిరిగి స్వాధీన మొనర్చుకొనెను. తదుపరి అత్యంత భాగ్యనగరమయిన ప్రోగ్జిషిత పురమునకు భగదత్తుని మహారాజుగ అభిషేకించెను. ఆ సమయమున పృధివి భగదత్తుని కొరకై వైష్ణవాస్త్రమును తిరిగి యాచించెను. కేశవుడు నారదుని అనుమతి గైకొని, పృధివిని సంతుష్ఠినొందించుటకై, తిరిగి ఆ అస్త్రమును భగదత్తునకు బహూకరించెను. తదనంతరము నరకుడు వరుణుని వద్ద నుండి గైకొనిన స్వర్ణఛత్రమును తిరిగి వెనుకకు తీసికొనెను. అయ్యది ఒక యోజనము పొడవు, ఒక క్రోసు విస్తీర్ణము కలిగి దినమునకు ఎనిమిది

బారువుల బంగారము నిచ్చునది. మధుసూదనుడు నరకుని ధనాగారము నందలి ఉత్కృష్ట ధన, రత్నరాశిని కైవసము చేసికొని, అచట గల పదునాల్గువేల ఐరావత వంశపు గజములను ద్వారకకు పంపి, నరకుడు బలపూర్వకముగ అపహరించిన పదహారు వేల రమణీమణులను వేణీ బంధము నుండి విముక్తులగావించి, వారందరినీ ధగద్ధయామానమగు వస్త్ర భూషాదులచే అలంకరింపజేసి, దృఢసేననిచ్చి, నారద సహితముగ వారందరినీ ద్వారకకు పంపెను. తదుపరి నరకుడు సర్వుల నుండి అపహరించి తెచ్చి నిర్మించిన మణి పర్వతమును అవలీలగా ఒక చేతితో ఉట్టడగించి, లేపి, గరుడునిపై యుంచి, వరుణ ఛత్ర, సత్యభామా సహితుడై గరుడునిపై ఆసీనుడయ్యెను. పిదప ధరణీదేవి, భగదత్తులను సాదరముగ అనునయించి, వారికి వీడ్కోలు పలికి, తిరిగి ద్వారక చేరెను.

మార్కండేయుడు "ముని గణములారా! అనురాగ విరాగ కారణరూప అయిన మహామాయ, జగన్మయి, కాళిక మిత్రులకు అనుగ్రహము, అమిత్రులకు వినాశనము కావించును. మూఢులు స్త్రీల పట్ల కాముకులై, ఆ ద్వంద్వ భావము చే మోహితులగుదురు. మీకు నరకాసుర జన్మ, వృద్ధి, వరలాభము, తదుపరి మృత్యువు వివరించితిని. ఇంకను మీరు ఏమి తెలిసికొనదలచిరో తెలుపవలసినది."

**(శ్రీ కాళికా పురాణమందలి నరకుని నాశనమును నలుబదియవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది ఒకటవ అధ్యాయము

### (పార్వతీ జననము)

ఋషి గణములు మార్కండేయుని ఈ విధముగ ప్రశ్నించిరి "మహాత్మా! జగత్ప్రసవినీ, దాక్షాయినీ, ఎట్లు గిరిపుత్రి అయిన పార్వతిగ జన్మించినది? ఆమె తిరిగి హరుని ఎట్లు పతిగ పొందినది? ఎందువలన ఆమె పినాకపాణి అర్ధదేహమును గ్రహించినది? ఈ విషయములన్నియు మాకు సవిస్తరముగ తెలుపవలసినది." మార్కండేయుడు "ఋషులారా! మీరు మిక్కిలి సద్విషయము గూర్చి ప్రశ్నించిరి. దాక్షాయిని శివపత్నిగ యున్నపుడు హిమాలయ పత్ని మేనక ఆమెకు పరమభక్తురాలు. శివపత్ని సహితము తన ప్రాణత్యాగమునకు ముందు తాను మేనకగర్భమున జన్మింప వలెనని తీర్మానించుకొని, తన దేహమును విడిచిన పిదప ఆమె మానసికముగ మేనకాదేవి వద్దకు ఏగినది. సతీదేవి ప్రాణత్యాగానంతరము మేనక అత్యంత శ్రద్ధా భక్తులతో ఆర్యాదేవి ఆరాధన కావించినది. మేనక మహామాయ, జగద్ధాత్రి, సనాతనీ, యోగనిద్ర, సర్వ భూతమోహినీ, సర్వలోకైక శరణి అయిన జగదంబ యొక్క ఉపాసన చైత్రమాస అష్టమి నాడు ఉపవాసముతో మొదలిడి, నవమి నాడు నువ్వులపిండి కుడుములు, పాయసము, మరియు గంధ పుష్పాదులతో సంతానార్థమై భగవతి యొక్క పూజన కావించెను. ఆమె హిమాలయ రాజధాని అయిన ఓషధిప్రస్థము నందలి గంగాతీరమున మట్టితో భగవతి యొక్క విగ్రహమును నిర్మించి, ఒక్కొక్కనాడు నిరాహారియై, ఒక్కొక్కనాడు నియమితాహారియై, మనస్సును సంపూర్ణముగ మహామాయకర్పించి, మహదైశ్వర్య హేతువయిన సంతానార్థము తీవ్ర భక్తియుతమయిన ఆరాధన కావించెను. ఇట్లు ఇరువది ఏడు వత్సరములు గడచిన పిదప భగవతి కడు ప్రసన్నురాలై, ఆమె ఎదుట తన దివ్యమంగళ విగ్రహముతో ప్రత్యక్షమయి ఇట్లనియె "కశ్యాణీ! నీ మనోవాంఛితమయిన కోరిక ఏదైననూ తెలుపవలసినది." అంత మేనాదేవి "దేవీ! తొలుత మిమ్ము స్తుతించవలెనన్న కోరిక కలుగుచున్నది. మీ అనుజ్ఞ అయిన ఎడల మిమ్ము స్తుతించెదను. అంత మహాకాళి తన మృదు బాహువులతో మేనాదేవిని ఆలింగనము ఒనర్చి "అమ్మా! అని సంభోదించినది.

అంత మేనక మిక్కిలి సంతుష్టాంగతరంగయై ఇట్లనియె “జగద్ధాత్రీ! చండికా!! నీకు ప్రణామములు. సర్వకామ్యార్థ ప్రదాయినీ అయిన జగన్మాతకు ప్రణామములు. నిత్యానందమయి, జ్ఞానమయి, జగత్ప్రసవినీ, మహామాయకు రెండు కరములు జోడించి నమస్సుమాంజలులు అర్పించుచున్నాను. ఎవరు నిత్యశుద్ధ, బ్రహ్మరూపి, గౌరీ, మహామాయా మరియు భక్తుల శోక దు:ఖ నాశము కలిగించునో, ఎవరు శివపత్నియో, ఆ మహేశ్వరికి ప్రణిపాత మొనర్చుచున్నాను. ఎవరు చిత్స్వరూపిణి, సత్వగుణ సంపన్న, నిత్యానిత్య స్వరూపిణి, ప్రాణి గణముల బుద్ధి రూపిణియో, ఆ తల్లికి ప్రణామములర్పించుచున్నాను. యతీశ్వరుల యొక్క సంసారబంధమును ఛేదించు నీ గతి, ప్రభావములు వర్ణింపనశక్యము. అమ్మా! సామవేదమునకు సిద్ధిరూపమయిన ఉనికి, యజుర్వేదము నందలి అనుష్ఠింప దగిన యాగము, అధర్వ వేదోక్తమయిన అభిచార క్రియ నీవే! నిన్ను ఎవరు వర్ణింపగలరు? తల్లీ! నీవే ధరిత్రి, నీవే మూల ప్రకృతి; త్రిమూర్తుల యందలి ఆకర్షణ శక్తివి నీవే! అగ్ని, సూర్యరశ్మిల దాహక శక్తి, మరియు చంద్రుని యందు హ్లాదినీ శక్తి కూడా నీవే!! స్త్రీ ప్రేమికులకు నీవు స్త్రీ స్వరూపిణివి; ఊర్ధ్వ రేతస్కులకు విద్యా స్వరూపిణివి; సర్వజగత్తు యొక్క వాంఛారూపిణివి; హరి యొక్క మాయా శక్తివి. నీవే బహురూపములు ధరించి సృష్టి, స్థితి, లయములు కావించుచున్నావు. త్రిమూర్తుల కారణభూతవు నీవే!!! దేవీ! నీకు వేల కోట్ల ప్రణామములర్పించు చున్నాను.”

అంత కాళిక మేనక తో “ఓ! కళ్యాణీ! నీ మనోవాంఛిత వరమడుగ వలసినది.” అంత మేనక “తల్లీ! తొలుత నాకు ధన, వీర్య, ఆయు:సంపన్నులయిన వందమంది పుత్రుల ప్రసాదింపవలసినది. తదుపరి సుస్వరూపిణి, సర్వగుణ సంపన్న, మాతా పితృ వంశములను పరమానంద మొనరించు త్రిభువన దుర్లభ అయిన పుత్రికను ప్రసాదింప వలసినది.” అంత కాళీదేవి సుచిస్మితయై, ఇట్లనియె “నీకు వందమంది మహాబలులయిన పుత్రులుదయించెదరు. కానీ అందు ప్రధముడు అత్యంత బలిష్ఠుడగును. తదుపరి దేవ, దానవ, మానవ హితార్థము నేనే నీకు పుత్రికగా జన్మించెదను. నీవు సదా పతివ్రతవై, దుర్బలత, మలినత్వము లేని నిత్యశుచివై, అతులిత సౌందర్యరాశివై వెలుగొందెదవు.” ఈ విధముగ వరమొసగి జగద్ధాత్రి అంతర్ధానమొందెను. మేనక సహితము ప్రపుల్ల చిత్తయై తన నగరమున కేగెను.

కాలక్రమమున మేనక మైనాకునికి జన్మనిచ్చెను. అతడు వజ్రధరుడయిన ఇంద్రునితో స్పర్ధచే రెక్కల సహితుడై, సముద్రమధ్యమున నెలకొని యుండెను. తదుపరి మరి తొంభయితొమ్మిది మంది మహావీరులు, మహాసత్వసంపన్నులు, సర్వశుభలక్షణ లక్షితాన్వితులు అయిన పుత్రులు జన్మించిరి. సతీదేవి దేహమును త్యజించిన కాళిక, పునర్జన్మ హేతువై మేనకాదేవి చేరువనే యుండి, తగిన సమయమాసన్నమయిన తరుణమున ఆమె గర్భమున ప్రవేశించి, లక్ష్మీ జననము సాగరము నుండి ఉద్భవించినటుల, ఆకాశగంగ చంద్రుని నుండి జారిపడినటుల, వసంత ఋతువున, చైత్రమాసమున, మృగశిరానక్షత్రము ఉత్తమ యోగమున నవమినాటి అర్ధరాత్రి, దశదిశలను ప్రసన్నము కావించుచూ, హైమవతి, పార్వతి, మేనా ప్రియపుత్రి ఉద్భవించెను. ఆ సమయమున ఆకాశము నుండి జలబిందువుల వలె పుష్పవృష్టి కురిసెను. ఆ సమయమున మహా ప్రజ్వలుడయిన అగ్ని శాంతుడయ్యెను. మేఘములు మృదుగర్జన కావించెను. సమస్త వాయుమండలము ప్రశాంతమై జగత్తు స్వస్థత నొందెను. నీలి కమలము వోలు నవప్రసూత తనూజను కాంచి మేనా హిమవంతులు అమందానంద కందళిత హృదయారవిందులైరి. దేవ, గంధర్వ, అప్సరో గణములు మనో ఉల్లములందు హర్ష, సంతుష్టము నొందిరి. హిమవంతుడు తన నీలోత్పలదళము వంటి తనూజకు “కాళి” అను నామము నిడెను. బంధు, బాంధవులు “పార్వతి” అని నుడివిరి. తదితరులు “గిరినందిని” అని పలికిరి. ఆ గిరిరాజ గృహమున పార్వతి వర్షాకాలపు గంగానది వలె, శారద రాత్రపు చంద్రిక వలె, దినదిన ప్రవర్ధమాన మంది, శుక్లపక్ష చంద్రుని వలె నలుదిశలు తన మనోహర కాంతి చే దీప్తించుచుండెను.

బాల్యావస్థ యందు పార్వతి ముదిత మనస్కయై, తోటి కన్యలతో క్రీడించుచుండెడిది. ఉపనదులన్నియు కాళింది

యందు కలియునట్లు తదనువయోరూప సఖీగణము ఎల్లప్పుడూ క్రీడను హేతువుగా నుంచి ఆమెతో కాలము గడుపుటకు ఇచ్చగించెడి వారు. ఆ మహాజననికి తన పూర్వ జ్ఞానము సంపూర్ణముగ గలదు. అందువలన ఆమె యందు సద్గుణములు స్వాభావికముగ నెలకొన్నవి. అందువలన గుణ, రూప, సౌందర్య, సౌశీల్యములందు ఆమెకు సరులు లేరనిన, మించిన వారలెక్కడుందురు? ఆ తల్లి గానము చేయునపుడు ఆమె ముందు గంధర్వ గాయనులు సహితము దిగదుడుపే! ఆమె తన గుణరూప లావణ్యముల చే బంధువర్గమునకు, తల్లిదండ్రులకు ప్రసన్నదాయక మయ్యెను. నిత్యకృత్యముల చే తల్లిని, సత్ప్రవర్తన, సత్కారము చే తండ్రిని, ప్రేమ చే సోదరులను అమిత సంతోషదాయకులను చేసెను. సూర్యకన్యక అయిన యమున ఎట్లు సదా, సర్వదా, సూర్యునికి దగ్గరగ యుండునో, అట్లే పార్వతి సహితము కన్యారూపిణియై, తండ్రికి అనువర్తయై, చేరువనే యుండి ఆయనకు అమలానందహేతువయినది.

ఒకానొకనాడు హిమవంతుడు పుత్రీ పుత్రుల సహితుడై, ఇష్టాగోష్ఠి కావించుచూ సుఖానుభవము నొందు చుండెను. ఆ సమయమున నారదమహర్షి ఏతెంచి, సుఖాసీనుడయిన హిమవంతుని, ఆయన సమీపమునున్న శారదరాత్ర చంద్రబింబము వంటి పార్వతీదేవి ని కాంచెను. హిమవంతుడు ఆయనకు యథోచిత స్వాగత సత్కారములాచరించి, ఆశీనుని గావించి, నమస్కరించి నిలచెను. వక్తలయందు శ్రేష్ఠుడయిన నారదుడు తొలుత హిమవంతుని వృత్తాంత మరసి, పిదప మేనకాదేవి వంక తిరిగి ఇట్లనియె "కళ్యాణీ! ఈ మీ కన్యక అత్యంత రమణీయ స్వరూప. ఈమె పున్నమిచంద్రుని కిరణములను తిరస్కరించు సౌందర్యశాలిని. శైలరాజా! మీ ఈ కన్యక సర్వ సులక్షణ, ప్రథమ తనూజ శంభుపత్నియై సదా ఆయనకు అనుకూలవతియై మెలగును. ఈ తపస్విని ఆ మహాదేవుని చిత్తమును వశపరచుకొనును. శంకరుడు సహితము ఈమె యందు అనురక్తుడై, వేరొక తరుణిని పరిణయమాడడు. వీరిరువురి మధ్య పొసగు పరిపూర్ణ ప్రణయపూర్వక ప్రేమ నభూతోనభవిష్యతి. శివుడు ఈమె యందు అత్యంత సౌహార్ద్రుడై యుండును. వీరిరువురి సౌహార్ద్రము చంద్రుడు, వెన్నెల వలె యుండును. ఈ విశాలాక్షి శివ భగవానుని అర్ధ శరీరము గ్రహించి ఆయనకు ఆధారభూతమగును. ఈ శుభద తన పరమాద్భుత తపస్సు చే స్వర్ణ వర్ణమును ప్రాప్తించి "గౌరాంగి" లేక "సువర్ణాభ" యై, తన శ్యామల వర్ణమును వీడి "గౌరీ" అని పిలువబడును. ఈ కన్యకను శివునికి వినా వేరెవరికినీ సమర్పింప మనసునన్నైననూ తలుపవలదు. ఈ విషయము అత్యంత గోపనీయము. దీనిని దేవగణ సమక్షమున సహితము ఉటంకింపవలదు.

హిమవంతుడు "మహర్షీ! మహాదేవుడు మానవ సంగమును వర్జించి సంయమాత్ముడై, దేవగణములకు సహితము అగోచరమగు అగమ్య స్థానమున తపమాచరించుచుండెనని వింటిని. మహాత్మా! ధ్యానమార్గమందు సంపూర్ణముగ మునిగి పరబ్రహ్మమునకు మనసు నర్పించిన శంభుడు అచటి నుండి క్రిందకు అవతీర్ణుడవడు కదా! ప్రదీప్తకళవలె వెలుగుచున్న పరబ్రహ్మమును తన అంత:నేత్రము తో నిరంతరము వీక్షించుచున్న విరూపాక్షునకు బాహ్యదృష్టి ఎట్లు గోచరమగును? అంతేకాక ఆయన దాక్షాయిణి వివాహపూర్వము తాను సతీదేవిని తప్ప వేరొక స్త్రీని చేపట్టనని ప్రతిజ్ఞ పూనెనట. మరి ఇపుడు వేరొక ఇంతిని ఎట్లు పరిణయమాడును? ఈ విషయమందు నేను సందేహాస్పదుడనగుచున్నాను." అంత నారదమహర్షి "గిరిరాజా! నీవు చింతింపవలదు. ఈ మీ కన్య ఏ "సతి". ఈమె తిరిగి శివుని చేపట్టుటకై పున:జన్మించినది. ఇందు సంశయము వలదు. తదుపరి పుత్ర సహిత మేనకా, హిమవంతులకు నారదుడు సమస్త సతీ వృత్తాంతము నెరిగించెను. అది విని హిమవంతుడు, ఆయన కుటుంబము నిస్సంశయులైరి. ప్రక్కనే కూర్చొని ఈ వృత్తాంతమంతయు వినుచున్న మహామాయ పార్వతీ దేవి తన ముఖమునందు లజ్జా హాస్యములు తొణికిస లాడుచుండగా అవనిత శిరస్క అయ్యెను. అంత గిరిరాజు హిమవంతుడు తన రెండు అరిచేతులతో ఆమె ముఖపద్మమును పట్టి, నెమ్మదిగ లేవనెత్తి, శిరసును చుంబించి, తన ప్రక్కన కూర్చుండబెట్టు కొనెను. అంత నారద మహర్షి పుత్ర సహిత మేనకా హిమవంతులను ఆనందపరుచుచూ "ఓ! శైలరాజా! ఈ మహాదేవికి ఈ సామాన్య సింహాసనము ఏమి సరిపోవును? శివుని వామాంకమే

ఈమెకు సరి అయిన శుభ స్థిరస్థానము. అద్దానిని మించిన స్థానము వేరొకటి లేదు." ఈ విధముగ పలికి దేవర్షి తిరిగి స్వర్గమున కేగెను. హిమవంతుడు తన కుటుంబము తో హర్ష, చింత, మోదయుక్తుడై, తన గృహాంతర్భాగమున కేగెను.

**(శ్రీ కాళికా పురాణమందలి పార్వతీ జననము అను నులబది ఒకటవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది రెండవ అధ్యాయము

**(మదన దహనము)**

ఆ సమయమున పురారాతుడు, వృషభధ్వజుడు, శంభుడు సిప్రాసరోవరమును వదలి గంగ హిమాలయముపై అవతరించిన స్థలమున కేతెంచెను. ఆ ప్రదేశము హిమవంతుని ఓషధిప్రస్థ పుర సమీపముననే యున్నది. ఆ ప్రదేశము నందలి ఒకానొక శిఖరాగ్రమున శివుడు ఏకాకియై, ఏకాంతచిత్తుడై, పరాత్పరుడు, అచ్యుతుడు, జ్ఞానమయుడు, నిత్యజ్యోతి స్వరూపుడు, నిరంజనుడు, జగద్వ్యాపి, ద్వైతరహితుడు, అత్యంత ప్రదీప్తుడయిన పరమాత్ముని ధ్యానింప మొదలిడెను. సాధారణముగ ఆయనను అనుసరించు నంది, భృంగి, మరియు ప్రమధులు సహితము ఆయనకు ధ్యానభంగమొనర్పక, వారునూ ధ్యానమగ్నులయిరి. ఇంతకుముందు ద్వారపాలురుగ యుండిన ప్రమధులు తన పని యందు నిమగ్నులై యుండగా, ఆ ప్రదేశమంతటినీ ధ్యాన, నిష్కంళక నిశ్శబ్దమావరించినది. ఒకనాడు హిమవంతుడు ప్రమధగణసహిత శంకరుని గాంచి, మనసున ఆనందముప్పిరిగొన, తన గృహమున కేగి, బంధుమిత్ర పరివారసహితుడై, శంకరుడున్న ప్రదేశమున కేతెంచి, అత్యంత శ్రద్ధా భక్తులతో ఆయనను పూజించెను. మహాదేవుడు ఆయన పూజను స్వీకరించి, మందస్మితుడై "శైలపతీ! నేను మీ పర్వత శ్రేణియందు ఒక గుప్త స్థానమున తపమాచరించుటకు ఏతెంచితిని. మహాత్మా! మీరు మనులకు ఆశ్రయస్థానము. దేవ, దానవ, కిన్నెర యక్ష, బ్రాహ్మణులకు ఆవాసము. దివిజగంగ తొలుత మీ శిఖరముపై పడుటచే మీరు పరమ పవిత్రులు. మీ శైల శిఖరములందు గంగ అవతీర్ణమయిన శిల యందు నేను ఆశ్రయము స్వీకరించితిని. ఇచటకు వేరెవరూ రాకుండ మీరు కట్టుదిట్టము కావింప వలసినది." ఈ విధముగ పలికి పినాకి మౌనము వహించెను.

అంత గిరిరాజు ప్రేమతో ఇట్లనియె "జగన్నాధా! పరమేశ్వరా!!! మీ ఆగమనము నన్ను పరమ పవిత్రుని కావించినది. నాకు ఇంతకంటె సత్కారము ఏమున్నది? జన్మము నుండి తపమాచరించుచున్న దేవతలకు కూడా గోచరము కాని మీరు తమంతతాముగ ఇచటికి విచ్చేసిరి. నేడు నన్ను మించిన ధన్యజీవి, పుణ్యాత్ముడు వేరొకడు లేడు. నేడు నేను ఇంద్రుని కంటె శ్రేష్ఠునిగా భావించుచున్నాను. ఎందుకనగా మహానుభావులు, మహామహితాన్వితులయిన మీరు స్వయముగ, ప్రమధగణ సహితులై, నా గిరి శిఖరములపై ఉపస్థితులై యున్నారు." ఆ విధముగ ఆయనను ప్రార్థించి, వందనములిడి, శలవుగైకొని, తిరిగి తన భవనమున కేతెంచి, తన పరివార మంతటికినీ గంగావతరణ స్థలమున కేగవలదని కట్టుదిట్టము చేసెను. కొన్నాళ్ళు పోయిన పిదప హిమవంతుడు తన తనూజ అయిన హైమవతిని తీసికొని తిల, పుష్ప, కుశాశన సహితుడై వృషధ్వజుని వద్ద కేతెంచి, జగన్నాధుడయిన శివునికి, సర్వగుణ సంపన్న అయిన తన పుత్రిక చే వందనమాచరింప జేసెను. పిదప తాను తెచ్చిన ఫల, పుష్పాదులను ఆయన ముందుంచి, తన పుత్రికను ఎదురుగ నిలుచుండబెట్టి ఇట్లనియె "హే! భగవాన్! నా పుత్రిక మిమ్ములను ఆరాధించుటకు ఇచట కేతెంచినది. శంకర ప్రభో! ఈ తన్వి తన సఖుల సహితయై మిమ్ములను సేవించును. మీరు నాయందు కృపజేసి ఈ తలోదరి మీ ఆరాధన కావించుటకు అనుమతింప వలసినది." అంత శంకరుడు నవయవ్వన అయిన శైలజను ఒక్కమారు తేరిపార జూచెను. ఆ గిరికన్య వికసిత

నీలికలువ లావణ్యముతో, పూర్ణచంద్ర నిభాననయై, నల్లని కేశకలాపముతో, శంఖము వంటి కంఠము తో, అరవిరిసిన కలువ దళముల వంటి నేత్రములతో, ఉజ్వల కుండలీయుతమయిన మనోహర కర్ణద్వయము తో, దొండపండ్ల వంటి పెదవులతో, కమల నాళముల వంటి మృదువయిన బాహుద్వయముతో, ఉన్నత పీన పయోధరయై, సింహ మధ్యయై, రక్తవర్ణమున మృదువయిన అంజలితో, ఉన్నత, స్థూల, వృత్తాకారమునున్న జంఘలతో, గులాబీల వంటి చరణ ద్వయముతో, త్రిలోకదుర్లభమయిన సౌందర్యముతో, సర్వలక్షణ లక్షితయై యుండెను. శైలపుత్రి ధ్యానరూప యోగుల మనసును సహితము భగ్నమొనర్చు సౌందర్యాతిశయముతో యుండెను. ధ్యానయోగుల పాటి శాపము వలె యున్న ఆ దివ్య సౌందర్యరాశిని కాంచి శంభుడు హిమవంతుని తో "గిరిరాజా! నీ కన్యక తన సఖులతో నిర్భయముగ ఇచట యుండి నా సేవాతత్పరత యందు నిమగ్నమవ వచ్చును." విఘ్నకారకము, విఘ్నకారణము ఎదుటనే యున్ననూ, ఆ విఘ్నములు ఎవరిని బాధింపవో అతడే ధైర్యశాలి అనబడును. తదుపరి హిమవంతుడు తన పరివారము తో కలసి పురికి ఏగెను. శివుడు బ్రహ్మచింతన యందు మునిగెను. పర్వతకాంత "కాళి" తన సఖులతో కలసి చంద్రశేఖరుని సేవయందు ఉపస్థిత అయ్యెను.

ప్రతి దినము కాళి ఉదయమున స్నానాదులు కావించి జల, పుష్ప, సమిధలు సేకరించును. ఒక్కొక్కప్పుడు శివుని సమక్షమున పంచమ స్వరమున గానమాలపించును. ఒకప్పుడు శంకర చింతనముతో, ఆయన సమక్షమున కూర్చొని ఆయన శుభ ముఖారవిందమును అవలోకించును. శంకరుడు ఏదేని కార్యమందు మగ్నమగునేని, ఆ కార్య సాపల్యమునకు సాయము చేయును. పార్వతి మనసునందు పరమాత్ముడు, భూతేశుడు తనను ఎప్పుడు పరిణయమాడునని తలచుచుండెను. ఈ విధముగ చింతించుచూ పార్వతి స్వప్నము నందు సహితము శివార్చన చేయుచుండెను. కాళి ఈ విధముగ తన సమ్ముఖమున తీవ్ర తత్పరతయై యున్నప్పటికీ శివుడు ఆమెను భార్యగా ఎందువలన అంగీకరింప లేదనిన ఆమె శుక్లశోణిత సంయోగమయిన గర్భజనితయై పుట్టి మానుషదేహ ధారణ కావించినది. ఈమె అయోనిజకాని కారణమున, దూషణ శరీరయై యుండుట వలన, ఆ దోషము పోవుటకు ఏ తీవ్ర తపోవ్రతములు ఈమె చే ఆచరింపజేయవలెనని చింతించుచూ శంభుడు ధ్యానవిష్ఠుడాయెను. పార్వతీ దేవి యధావిధిగా శంభుని సేవనమాచరించుచూ, ఆయన రూపమును చింతించుచుండెను. శంభుడు ఒకమారు ధ్యానవిష్ఠుడయినచో, ఆయనకు మిగిలిన విషయములంటవు. అందువలన ఆయన పార్వతీదేవి విషయము సహితము సంపూర్ణముగ మరచెను.

ఆ సమయమున లోకమునకు వేరొక విపత్తు వాటిల్లెను. తారకుడను రాక్షసుడు బ్రహ్మ వరమున అతి బలిష్ఠుడై, లోక కంటకుడై, దేవ మానవులను ఉత్పీడనము కావించుచుండెను. అతడు త్రిలోకములు వశపరుచుకొని, ఇంద్రపదవిని ఆక్రమించెను. అట్లే దిక్పాలురందరినీ పదవీచ్యుతుల కావించి, తన అనుచరులను ఆ స్థానములందు నియమించెను. దాని వలన సూర్యుడు శోషింపజేయుట, యముడు ప్రాణములు తీయుట కూడ వర్జితమయ్యెను. చంద్రుడు ఆతనికి విదూషకునిగనూ, వాయువు వింజామరగనూ, కుబేరుడు తన సర్వ సంపత్తితో ఆతని సేవకునిగనూ, అగ్ని పాచకునిగనూ, నిఋతి ఆతని గజాశ్వ శిక్షకుని గనూ మారిరి. నిరంతరము తారకుడు వందిమాగధులచే తన స్తుతి పాఠములు వినుచూ, అప్సరోభామల నృత్యమును అవలోకించుచూ, గంధర్వ గానమును ఆస్వాదించుచూ, దేవగణముల ద్వేషించుచూ, వారివారి దుర్లభ సార వస్తువులను హరించి లోక పీడకుడాయెను. ఇంద్రాది దేవతలు దీనిని తాళజాలక పరమేష్ఠి బ్రహ్మదేవుని వద్దకు శరణాగతులై ఏగి ఇట్లు మొరపెట్టుకొనిరి.

"స్వామీ! తారకుడు మీ వరముల చే బలగర్వితుడై మమ్ములనందరినీ, మా స్థానముల నుండి గెంటివైచి, మా అధికారములను బలాత్కారముగ తీసికొనెను. మేము వాని చే దివారాత్రములు పీడింపబడి కాందిశీకులమైతిమి. ఏ మూల తలదాచుకొన్ననూ ఎప్పుడు తారకుడు కనిపెట్టునన్న బెంగ మమ్ములను నిరంతరము కలచివైచు చున్నది. అందువలన

పితామహా! అష్ట దిక్పాలకులమందరము పరివార సహితులమై క్లిష్ట పరిస్థితి యుందుంటిమి. మాకు ఇష్టము లేని, కష్టము కలిగించు కార్యము సహితము తారకుని ఆజ్ఞ మేరకు చేయవలసి వచ్చుచున్నది. స్వర్గమందున్న సమస్త దేవతా స్త్రీ గణములను, అప్సరసలను తారకుడు అపహరించెను. అతని అనుజ్ఞ లేక తపస్వులు తపమాచరించరాదు. లోకమునందు దానధర్మములు, సంపూర్ణముగ లుప్తమయినవి. తారకునకు క్రౌంచుడను సేనాధిపతి యుండెను. ఆతడు పాతాళలోకము వరకు వెళ్ళి అచట గల జనులను సహితము పీడించుచున్నాడు. అందువలన ఓ! లోకనాథా! జగద్గురు! పితామహా! మాకు ఈ తారకుని నుండి విముక్తి కలిగించి మాకు పున:జీవితము ప్రసాదింప వలసినది. మమ్ము తారకుడను అగ్ని నుండి కాపాడవలసినది."

అంత పరమేష్ఠి దేవతల పలుకులు విని వారిని సమయోచితముగ సముదాయించెను, "దేవతలారా! నా వర ప్రభావము వలన తారకుడు మిక్కిలి గర్వితుడయ్యెను. అందువలన నాచే ఆతడు అవధ్యుడు. మీరే ఆ ప్రతీకారము కావింపవలసినది. ఏ విధముగ తారకుని వధ జరుగునో ఆ ఉపాయమును తెలిపెదను. వినుడు. తారకుడు త్రిమూర్తులకు, ఇతర దేవతలకు అవధ్యుడు. శంభుని వీర్యము చే ఉత్పన్నమగు పుత్రుని ద్వారా మాత్రమే తారకుడు వధింపబడును. పూర్వకాలమున సతీదేవి ప్రాణత్యాగము కావించిన పిదప మేనకా దేవి వద్దకు ఏగి, మేనకా, హిమవంతులకు పుత్రిక గా జన్మించినది. ఏ విధముగ శివుడు పార్వతి యందు అనురక్తుడగునో దానికి ప్రయత్నింప వలసినది. ఊర్ధ్వ రేతస్కుడయిన మహాదేవుని వీర్యమును కదిలించగల శక్తి పార్వతికి వినా మరి సృష్టి యందు ఏ శక్తికి లేదు. ప్రస్తుతము ఆ గిరికన్య ధ్యాన తత్పరుడయిన శివునికి నిత్యసేవలు కావించుచున్నది. కానీ ధ్యానావస్థయందు యున్న పరమేశ్వరునికి ఏ ఇతర విషయముల యందు మనసొల్లుట లేదు. అందువలన మీమీ దేవతలందరూ ఏదేని ఉపాయమున శివుడు పార్వతీదేవి యందు గాఢానురక్తుడగునట్లు గావించితిరేని, మీ కార్యము సానుకూలమయి మీ కష్టములు తీరును. అందువల్ల మీరు వెళ్ళి పార్వతీ పరమేశ్వర కళ్యాణము జరుగునట్లు ప్రయత్నింపవలసినది."

అటుపిమ్మట పరమేష్ఠి తారకుని వద్దకేగి "తారకా! నీవు స్వర్గము పై శాశనము చేయవలదు. నీవు దాని కొరకై తపమాచరింప లేదు. పూర్వము నేను నీకిచ్చిన వరములన్నియు సత్యము. కానీ అందు స్వర్గ శాశనాధికారము లేదు. నీవు దీనిని వదలి మర్త్యలోకమునకు ఏగవలసినది. నీకు సమస్త దేవ భోగములు అచటనే ప్రాప్తించును." పరమేష్ఠి ఈ విధముగ పలికి అంతర్హితుడయ్యెను. తారకుడు స్వర్గము వీడి మర్త్యలోకమున కేగినప్పటికీ దేవతా పీడను మానలేదు. ఇంద్రుని తన సామంతుని కావించుకొని దేవ భోగ్యములన్నియు ఇంద్రుడు తారకునకు ఇచ్చునట్లు చేసెను. ఇంత ఊడిగము ఇంద్రుడు కావించిననూ తారకునకు శచీపతి పట్ల ఇంచుక దయ కలుగలేదు. అంత దేవతలు పీడితులై, క్రోధితులై "శివుడు పత్ని నెట్లు గ్రహించును?" అను విషయమై ప్రయత్నమారంభించిరి. ఇంద్రుడు దేవ గురువయిన బృహస్పతి తో సమాలోచన చేసి, మన్మధుని రావించి ఇట్లు పలికెను "మదనా! నీవు జగత్పాలకుడవు. సృష్టి నీ వలననే జరుగుచున్నది. పూర్వము పరమేష్ఠి వ్రతపరాయణ అయిన సావిత్రిని, మాధవుడు లక్ష్మిని, శంకరుడు దాక్షాయిణిని చేపట్టిరి. నీవు దేవతలందు సహితము ఈ కామమును ఉద్భవింపజేసితివి. స్వర్గ, మర్త్య, పాతాళము లందు నిన్ను ప్రేమించని వారు లేరు. దేవ, దానవ, యక్ష, రాక్షస, మర్త్యలోకములందు నీవే పాలకుడవు, కర్తవు. నీవే సర్వప్రాణి హృదయనివాసివి. అందువలన నీకు అసాధ్యము లేదు. నీవు సర్వసమర్ధుడవు. పూర్వము పరమేష్ఠి నీకా వరప్రదానము కావించెను. అందువల్ల దేవకార్యము సాధింపుము."

అంత మకరధ్వజుడు మన్మధుడు దేవరాజు యొక్క పలుకులకు అత్యంత ప్రసన్నుడై "దేవరాజా! మీరనుకున్న కార్యము నాచే సఫలమగునని మీరు తలచిన ఎడల అద్దానిని తక్షణము నాకు తెలుపవలసినది. నా వద్ద అయిదు పరమ కోమల బాణములు, భ్రమరములు నారిగ గల పుష్ప ధనువు యున్నవి. రతి నా పత్ని, వసంతుడు నా

మంత్రి పుంగవుడు, మలయసుగంధ మారుతము నా సారధి, చంద్రుడు నా మిత్రుడు, శృంగారము నా సేనాపతి, హావభావములు నా సైనికులు. ఇవన్నియు అతి మృదువయినవి. క్రూరత్వము ఇంచుక లేదు. ధీయుతులు ఎవరిని ఏ కార్యమునకు నియోగింపవలెనో, వారిని ఆ కార్యము నందు నియోగించెదరు. అందువలన మీ కార్యము నా చే సఫలమగునని మీరు తలచిన ఎడల దానిని సత్వరము ఆదేశింప వలసినది". అంత శచీపతి "ఓ! మనోభవా! నేను మీ ద్వారా పూర్ణమొనరించు కార్యము కేవలము మీ వలననే అగును. అన్యులకది దు:స్సాధ్యము. అందువలననే మిమ్ము ఇందు వినియోగించుచున్నాను. వృషధ్వజుడు ప్రస్తుతము ధ్యానరక్తుడై, పత్నీ పరిగ్రహణము నందు ఇంచుక ఆసక్తి లేక హిమాలయమునందు తపమొనరించు చున్నాడు. పితృ వాక్యానుసారము కాళి తన సఖీ సహితయై శివుని అనుమతి బడసి ఆయనకు పరిచర్యలు కావించుచున్నది. కానీ ధ్యానరతుడయిన శశిశేఖరుడు యవ్వనవతి, అత్యంత సుందరీ రత్నమయిన శైలజను మనసున కూడా తలచుట లేదు. ఎట్లయిననూ పినాకపాణి పార్వతీ కరగ్రహణము కావించునట్లు చేయము. ఇయ్యది దేవతలకు, సర్వ జగత్తుకు హితమొనరించును. పూర్వము నీకు వృషధ్వజుడు సతియందు అనురక్తుడయినట్లు, ఇపుడు ఆయన గిరిపుత్రి యందు రమణీయత నొందునట్లు కావింపుము. వారిరువురికీ ఉదయించు పుత్రుని చే మనకందరకూ తారకుని నుండి ముక్తి లభించును."

ఇంద్రుని పలుకులు వినినంతనే మదనునకు తనకు పూర్వము పరమేష్ఠి యొసగిన శాపము ననుభవించు సమయమాసన్నమయినదని అవగతమయినది. అంత మన్మథుడు భయభీతుడై ఇంద్రుని తో ఇట్లనియె "సహస్రాక్షా! నేను మీ ఆజ్ఞను శిరసావహింతును. పూర్వము సతీ శివులను కలిపినట్లు, ఇపుడు శంభు శైలజలను కలుపుటకు యత్నించెదను. కానీ నేను శివుని యందు మోహోత్పాదనము కావించునపుడు మీ సహాయము అవసరము. నేను శివునిపై సమ్మోహనాస్త్రము వేసి ఆయనను సంపూర్ణ మోహావేశుని కావించినపుడు మీరు నన్ను రక్షింపవలెను. ఈ సహాయము మీ దేవతలందరూ నాకు తప్పక చేయవలసినది. నేను తొలుత వసంతుని సహితుడనై శంకరాశ్రమమున ప్రవేశింతును. తదుపరి హర్షణాస్త్రము చే మనో వికారము నొనర్చి అనంతరము సమ్మోహనాస్త్రము ద్వారా వృషధ్వజుని మోహింపజేయుదును. ఈ విధముగ పలికి మదనుడు శంకరాశ్రమమునకు నిష్క్రమించెను. దేవరాజు దేవతలతో "కామదేవుడేగిన కార్యమునకు మనమందరము శక్తివంచన లేకుండ సహాయమొనరింప వలెను. నాతో పాటు మీరందరూ అచటికి ఏతెంచి సమయము కొరకు వేచియుండ వలసినది."

ఇంద్రాది దేవతలు, మన్మధుడు, వసంతుడు, సర్వులు హిమాలయమునున్న శివాశ్రమమున కేగిరి. వసంతుడేతెంచిన తక్షణము తరు, గుల్మ, లతాదులు చిగురించినవి. కింశుక, రంజన, కేసరాది పుష్పములు వికసించినవి. సరోవరములందు పద్మములు విరిసినవి. సమస్త జంతుజాలముల మది కామవికారము నొందినది. మలయ మారుతము పుష్పరేణు సమాన్వితమై, సుగంధ భరితమై వీవసాగినది. కాముడు సర్వ జీవులకు సుఖమయ వాతావరణము నేర్పరిచెను. మృగ, పక్షి, సిద్ధ, కిన్నెరలు సర్వులు కామోత్కంఠత నొంది మిధున భావము తో చరింపదొడంగిరి. మామిడి చెట్లు గుత్తులు గుత్తులుగ పూతవేసినది. అశోక, పాటల (కలిగొట్టు), నాగకేశర వృక్షములు విరబూసినవి. ఈ అకాల వసంతము చే ప్రమధులు సహితము వికృతభావము నొందిరి కానీ శంభుని భయమున వికారజనిత కార్యములందు ప్రవృత్తులవకుండిరి. మధుపములు పుష్ప సౌరభమును ఆఘ్రాణించుచూ, మధువును సేవించుచూ, సుమధుర గుంజనము కావించుచూ, తమ తమ పడతుల గూడి మదమత్తములయి సురత సుఖానుభవము నొందుచున్నవి. ఈ విధముగ ప్రకృతి సర్వము వసంతుని మహిమ చే శోభాయమాన మగుచుండగా, శృంగారము సహితము హావభావ యుక్తమై శంభుని సమీపమునకేగినది. మదనుడు సహితము తన పరివార జనులతో కలసి శివుని సమీపమునకేగి ఆయన యందు ప్రవేశించుటకు ఏ విధమయిన వీలు కానక, సమయము కొరకై నిరీక్షించుచుండెను. ఈ విధముగ మదనుడు దీర్ఘ

కాలము వేచియుండెను. కాలాగ్ని వలె జ్వలించుచు, ధ్యానయుక్తుడయిన శంభుని ఎవరు విచలితుని చేయగలరు?

ఈ విధముగ సమయము కొరకు సర్వులు, సర్వము నిరీక్షించుచుండ ఒకానొక దినము ఒక చిత్రము జరిగినది. ఒకనాటి ఉదయము గిరికన్య తన సఖులతో కూడి తన నిత్యకర్మానుష్ఠానమయిన శంభుని నిత్యావసరములు చూచుటకు ఏతెంచి, ఆయనకు ప్రణామములొనర్చి. ఎదురుగ కూర్చొనెను. అదే సమయమున శంభుడు తన ధ్యానము నుండి బయల్వెడలి క్షణకాలము నేత్రములు తెరచెను. మదనుడు అదే సమయమని తలచి, తన సహచరులను తమ తమ కార్యములందు నియోగించి, శివ పార్శ్వమున నిలబడి, పుష్పధనువుకు హర్షణ బాణమును సంధించి, ఆకర్ణాంతము లాగి విడచెను. అదే సమయమున శృంగార హావభావములు వసంతుని తో ఏతెంచి, తమ కార్యము నందు నిమగ్నమై, శంభుని చిత్తమును మరింత విచలితము గావించినవి. ఆ సమయమున శంకరుడు ఒక్క క్షణము హృదయము నందు కామము పెల్లుబిక, పూర్ణముగ శృంగార చింతనమునకు లోబడి కాళి యొక్క ముఖపద్మమును అవలోకించుట నారంభించెను. ఈ విధముగ శంకరుడు కామమోహితుడగుట కాంచి, మరుడు సమ్మోహనమను విరిశరమును పుష్పమాలాలంకృతము కావించి నిలచెను. ఆ సమయమున మరుని దక్షిణమున రతి, ఎడమవైపు ప్రీతి, వెనుక వసంతుడు యుండిరి. మదనుడు తిరిగి సావధానుడై, పుష్పధనువు సారించి, నారిని ఆకర్ణాంతము లాగి సమ్మోహనమును విడచెను. ఆ శరము మలయ సుగంధభరిత వాయువుపై తేలుచూ, వేగముగ పోయి శశిశేఖరుని తాకెను. దానిచే పినాకి మరింత తడబడి, ఇంద్రియనిగ్రహము కోల్పోయి, గిరిరాజపుత్రిక తో సంభోగము కావింపవలెనన్న కోరిక కలిగెను. దేవతలందరూ దేవకార్యము సుగమమయినదని తలంపసాగిరి. మరుక్షణము కపర్ది తనను తాను సంభాళించుకొని, ఒక్క క్షణము అంతరావలోకియై ఈ విధముగ తప:శ్చర్య చేయని కాళిపై నాకు వ్యామోహమెందుకు కలగినది? ఈమె తపోనియమములచే తన శరీరమును పవిత్రము కావించుకొనిన ఎడల ఈమెను స్వీకరింప వచ్చును. కానీ ఈ అకారణ మదన తాపమునకు కారణమేమి? ఎవరేని నన్ను ఈ వికృత కార్యమునకు పురికొల్పుచున్నారా?"

ఈ విధముగ తలచి ఇంద్రియములను నెమ్మదిగ నిమ్మళించి, మనసును ప్రశాంతము కావించి, చిత్తము ప్రశాంతము కాగా కనులు తెరచి నలుప్రక్కలా ఒక్కమారు గాలించెను. పుష్పబాణధారియై, నారి సారించి నిలుచున్న మదునుడు ఆయన కనుల ఎదుట కానబడెను. అదే సమయమున దేవతలకు హితమొనర్చుటకై పరమేష్ఠి సహితము అచట కేతెంచెను. తక్షణము శంభుడు క్రోధానలతప్తుడై, ఈ కాముని యమపురి కంపవలెనని నిశ్చయించెను. సమయానుకూలముగ ఆయన మూడవ నేత్రము గుండా దివ్యమయిన క్రోధాగ్ని మన్మధుని వైపు పయనించుట నారంభించెను. అంత చతుర్ముఖ బ్రహ్మ, శివనేత్రాగ్ని మరుని దగ్ధమొనర్పక ముందే మన్మధుని ధనువు, పుష్పబాణములు, శక్తి, ప్రాణములు, ఆత్మ, మరియు వసంతుని సహితము తన యొద్దకు ఆకర్షించెను. ఆ సమయమున ఆకాశము నందున్న అనిమిషులు పరమేశ్వరుని ఈ విధముగ స్తుతించిరి. "ఓ! జగన్నాధా! దయచేసి ప్రసన్నులు కండు. కాముని యందు కృప చూపించవలసినది. పూర్వము మీరే కాముని సృజించి ఈ కార్యము నందు నియుక్తుని గావించిరి. కామునిపై ప్రయోగించిన క్రోధాగ్నిని ఉపసంహరింప వలసినది. మేమందరము కలిసికట్టు ప్రార్ధించుచున్నాము. దయచేసి ప్రసన్నులు కండు!" దేవతలు ఈ విధముగ పలుకుచున్నప్పటికీశంభుని లలాట నేత్రము నుండి వెలువడిన అగ్ని కాముని చేరి ఆతనిని సంపూర్ణముగ దగ్ధమొనర్చినది. ఆ సమయమున శివుని క్రోధమును కాంచి పరమేష్ఠి సహితము శంకరుని వద్ద కేతెంచుటకు అసమర్ధుడాయెను. తదుపరి మహాదేవుడు కామదేవుడు దగ్ధమయినపుడు ఉద్భవించిన భస్మమును తీసికొని తన సర్వాంగములకు పూసుకొనెను. మిగిలిన భస్మమును తీసికొని మహాదేవుడు పార్వతీదేవిని అక్కడే వదలి అంతర్హితుడయ్యెను. శివుని నుండి విడువబడిన అగ్ని మిగిలిన దేవతలపైకి రాసాగెను. అంత బ్రహ్మ అర్ధానిని గ్రహించి, దానిని సర్వమును బడబాగ్ని గా మార్చి సముద్ర మధ్యమున భద్ర పరచుటకై సముద్రతీరము చేరెను. అంత సముద్రుడు ఆయనను పూజింపగా, పరమేష్ఠి "సాగరా! ఇది

పరమేశ్వరుని క్రోధాగ్ని. జ్వాలాముఖి వంటి ఈ క్రోధాగ్నిని తిరిగి నేను అడుగువరకు నీ గర్భమున యుంచవలసినది. అంతవరకు ఈ అగ్ని నీ జలపానము కావించుచూ స్వస్థత నొందును. నీవు ప్రయత్నపూర్వకముగ ఈ బడబాగ్నిని ఎటూపోకుండ జాగరూకత వహింపవలసినది.” బ్రహ్మ ఆదేశమును బడసి తనకు ఆ క్రోధాగ్నిని భరించుటకు శక్తి లేకున్ననూ సాగరుడు ఆ బడబాగ్నిని వహించెను. అంత ఆ క్రోధాగ్ని సాగర జలమును దగ్ధమొనరించుట నారంభించెను.

శివ నేత్రాగ్ని చే కాముడు దహింపబడినపుడు ఒక మహాశబ్దమంకురించి దశదిశలు నిండినది. ఆ శబ్దము విని సఖీ సహితయై శైలకన్య శోకాకుల అయినది. హిమాలయుడు విస్మయమొందెను. అంత హిమవంతుడు శివాశ్రమమున కేతెంచి, జరిగిన విషయములు తెలిసికొని, శంభు విరహము చే శోకాన్విత అయిన తన అనుంగు ముద్దుబిడ్డను ఒడిలోనికి తీసికొని, లాలించి “తల్లీ! భయము వలదు. రోదింప వలదు.” అని అనుంగు వాక్యములు పలికి తిరిగి తన భవనమునకు తీసికొని వెళ్ళెను. తదుపరి శైలపతి, మేనక, మైనాకుడు, పార్వతీదేవి చెలికత్తెలు శైలపుత్రికి ఎన్నో విధములుగ స్వాంతన వాక్యములు పలుకుచూ అనునయింప సాగిరి. కానీ పార్వతీదేవి నిరంతరము హరభగవానుని చింతన చేయసాగెను.

**(శ్రీ కాళికా పురాణ మందలి కామ దహనమును నలుబది రెండవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది మూడవ అధ్యాయము

**(శివుని ప్రసన్నత)**

తదనంతరము ఇంద్రుని పనుపున దేవర్షి నారదుడు హిమాలయమున కేగి, గిరి భవనమున ప్రవేశించి, హిమవంతుని చే యధావిధిగ పూజింపబడి, కుశలమరసి, పిదప ఏకాంతమున కాళిని కలసెను. ఆయన తన అనునయ, అమృతమయ వాక్కులతో జ్ఞానశీల అయిన శైలపుత్రికి స్వాంతన కలిగించుచూ ఇట్లనియె “దేవీ! కాళీ! నా వాక్కులు సత్యము. నమ్ముము. నీవు మహాదేవుని ఆరాధన కేవల వ్రతాచరణము చే తపము లేకుండ గావించితివి. తపస్సు చే నీ మనస్సు, శరీరము సంస్కరింపబడి మలినరహితమగును. అందువలననే మహాదేవుడు నీ యందు ప్రీతి యున్నప్పటికీ నిన్ను చేపట్టకుండెను. ఆయన నిన్ను వినా వేరొక స్త్రీని వరింపడు. నీవును ఆయనను వినా వేరొకరిని చేపట్టవు. నేను నీకొక దివ్య మంత్రోపదేశము గావింతును. **“ఓం నమ: శివాయ.”** ఈ మహామంత్రము శితికంఠునకు అత్యంత ప్రీతిపాత్రము. ఈ మంత్రము ద్వారా ఆయన శీఘ్రముగ దర్శనమిచ్చును. యమ, నియమములు పాటించుచూ, శంకరుని రూపము ధ్యానము చేయుచూ ఈ మంత్ర జపము నిరంతరము కావింపుము. అద్దాని చే కపాలి అత్యంత త్వరితముగ నీకు ప్రసన్నుడగును. ఈ విధముగ పలికి దేవర్షి ఊర్ధ్వ లోకములకేగెను. అంత శైలపుత్రి నారదమహర్షి వచనములను మనస్ఫూర్తిగా నమ్మి, తపమాచరించుటకు నిశ్చయించుకొని, తన తల్లి వద్దకేగి, ఈ సంవాదమునుటంకించి ఈ విధముగ పలికెను. “మాతా! నేను మహాదేవుని పతిగా పొందుటకై తపమాచరించుటకు వనమున కేగుదును. దీనికై నాకు అనుజ్ఞ నీయవలసినది. అంతేకాక పితృదేవులకు సహితము ఈ విషయము నివేదింప వలసినది.”

అంత మేనాదేవి “పుత్రీ! నీవు అత్యంత కోమలాంగివి. నీవు తపమాచరించిన ఎడల కుసుమకోమలమయిన నీ శరీరము మిక్కిలి కఠోరమగును. ముని గణముల శరీరములు కష్ట, నిష్ఠూరములు సహింపనోపును. కుసుమ కోమలివయిన నీవు ఈ కష్టముల నెట్లు నోపగలవు? అందువలన నీకు వనవాసము ఉచితము కాదు. నీకు అనుకూలమయిన తపము మాత్రమే చేయుము. అంత గిరిజ ఉద్విగ్నయై “తల్లీ! నన్ను తపస్సు నుండి ఆపవలదు. నేను పరిపూర్ణముగ తపము కావించుటకు నిశ్చయించితిని. ఒకవేళ నీవు అనుమతి నీయనిచో నేను గుప్తరూపమున తపోస్థలికి ఏగెదను. అంత

మేనక “పుత్రీ! త్రిమూర్తులు సహితము ఎల్లప్పుడూ గృహము నందు నివసింతురు. అందువలన నీవు గృహము నందే యుండి నీ కిష్టమయిన దేవతను ఆరాధింపుము. స్త్రీ గణములు తమ స్వామి (పతి) ని వినా వేరే వనములకు వెళ్ళుట వినలేదు. అందువలన దయచేసి వనమునకు పోవలదు. మేనకాదేవి కాళిని కాననమునకు వెళ్ళవలదని “ఉ,మ” అని సంభోదించెను. అప్పటి నుండి ఆమె “ఉమ” అని కూడ పిలువబడెను. తదనంతరము శైలపుత్రి తన సఖీ గణముల ద్వారా తన తండ్రికి సహితము తన తపశ్చర్య గూర్చి ఎరింగించెను. తన ప్రియతనూజ తపార్ధము కాననముల కేగుట తనకు అత్యంత అయిష్టమయినప్పటికీ, ఆమె మాట కాదనలేక చివరికి అంగీకరించెను.

అంత తండ్రి అనుమతినొంది శైలజ, కపాలి కాముని దగ్ధమొనర్చిన స్థలమున కేగెను. ఆ ప్రదేశమంతయు నీలలోహితుని లేమిచే నిర్జనమై, శూన్యముగ తోచి, మహేశుని విరహముచే శైలపుత్రి “హా! హరా!!” అని ఆక్రోశించుచూ చింతా, శోక, దు:ఖములు ఆవరింపగా బిగ్గరగా రోదింపనారంభించెను. కొంత తడవు ఈ విధముగ రోదించి, తుదకు ధైర్యమునంది, మోహమును విడచి, నియమ పాలనార్ధము దీక్షను స్వీకరించెను. ఆ తల్లి ప్రధమ నియమము ఫల భోజనము. ఆమె అద్దానిని మొదలుపెట్టి, పిదప నలుదిక్కులా నాలుగు అగ్నులను యజ్ఞీయ కాష్ఠము చే జ్వలింపజేసి, సూర్యుడు నడినెత్తిన తపింప జేయుచుండగా, పంచాగ్నుల మధ్య శంభుని ధ్యాన, జప, తపములు ఆరంభించెను. ఆమె ఆ నాలుగు అగ్నులమధ్య ఆసనముపై కూర్చొని, అగ్నులు కేవలము తన శరీరమునకు ఒక అడుగు దూరముండునట్లుగా అమర్చుకొనెను. ఆమె వల్కలధారియై, ఊర్ధ్వముఖియై, మధ్యందిన మార్తాండుని వీక్షించుచూ తపమాచరించుచుండెను. ఈ విధముగ వేసవికాలమంతయు గడిపి, శీతాకాలము పీకలోతు శీతల జలమందు మునిగి తపమాచరించెను.

దేవతలు శైలపుత్రి పర్ణములు తినుట వర్జించుట చే ఆమెను “అపర్ణ” అని పిలిచిరి. ఈ విధముగ సంపూర్ణ నిరాహారియై కొన్నాళ్ళు పంచాగ్ని మధ్యమున, కొన్నాళ్ళు అత్యంత శీత జలములందు శైలపుత్రి అద్భుత తపమాచరించెను. ఒక్కొక్కప్పుడు ఆమె ఒంటి కాలిపై నుంచొని తపమాచరించెడిది. ఈ విధముగ ఆమె దీర్ఘకాలము తపమాచరించుట చే ఆ మహాశైలపుత్రి వల్కలధారి, జటాజూటధారియై, కృశాంగియై, తపస్సునందు మహాతపస్వులను సహితము దాటి ముందునకేగెను. కానీ యదార్ధమునకు పరమేశ్వరుడు అదృశ్యరూపుడై ఆమెను సర్వ భయముల నుండి కాపాడుచూ, హృదయమున హర్షోల్లాసము కలిగించుచూ, స్వయముగ రక్షించుచుండెను. ఈ విధముగ కాళి చే తీవ్రతపమాచరింపబడు చుండగా నెమ్మదిగ పదునెనిమిది వేల సంవత్సరములు గడచెను. అంత అచటికి పరమేష్ఠి ఏతెంచి, శైలపుత్రికి దైవ విధిననుసరించి సంస్కరణము కావించెను. ఈ సంస్కరణము ద్వారా మర్త్య జన్మము వలన ఏతెంచిన మలినము మాయమయి, అయోనిజ వంటి దివ్యత్వము నొంది, శంకరుని చేపట్టుటకు తగిన శక్తిని గిరి తనయ సముపార్జించెను.

ఈ సంస్కరణము పూర్ణమయిన పిదప అపర్ణ కనులు తెరచి ఈ విధముగ తలచెను. “నేను నియమానుసారము దీర్ఘకాలము తపమాచరించితిని. అయిననూ మహాదేవునికి ఎరుక కలుగలేదా? మునిగణములు మహేశుడు ఈ జగత్తుయందు లేదని నుడువుచుండిరి. ఇది సత్యమా? దేవతలు మహేశుడు సర్వజ్ఞుడందురు. మహాదేవుడు సర్వజ్ఞుడు, సర్వ లోకాత్ముడు, సర్వ హృదయగతుడు అయిన ఎడల, నా తల్లి మేనక పతివ్రత అయిన ఎడల, నేను మహాదేవుని తప్ప వేరెవరినీ వాంఛించిన దానను కాని ఎడల, శంకరుడు నాయందు ప్రసన్నత నొందును గాక! నారదమహర్షి నాకుపదేశించిన షడక్షరి (ఓం నమ:శివాయ) సత్యమైనచో, నేను ఆ మంత్రమును భక్తి పూర్వకముగ జపతపములాచరించిన ఎడల పినాకపాణి నా యందు ప్రసన్నత నొందును గాక!! నేను నిజముగ తపశ్చర్య ఆచరించిన ఎడల, నా వలన కపాలి ఆరాధితుడు అయిన ఎడల, కృత్తివాసుడు నా యందు ప్రసన్నుడగుగాక!!! ఈ విధముగ జటావల్కల ధారియై, దీనవదనయై, అధోముఖియై, శైలపుత్రి అదే ప్రదేశమున నివసింప సాగెను.

ఆ సమయమున ఒక విచిత్రము జరిగెను. ఒకనాడు ఆ ప్రదేశమునకు కృష్ణమృగ చర్మధారి, దండకమండల

యుక్తుడు, స్వర్ణవర్ణదేహి, విస్తృత జటాజూటధారి, పరమేష్ఠిని తలపించు ప్రదీప్త శోభాయమానుడయిన ఒక బ్రాహ్మణ బ్రహ్మచారి అచటకేతెంచెను. ఆతడు సరాసరి శైలపుత్రి ఆసీనమయిన శిల వద్దకు ఏగి దగ్గర కూర్చొని, వాగ్విశారద అయిన గిరిజను నర్మగర్భమున ఇట్లడిగెను "దేవీ! నీవెవరవు? ఎవరి కన్యవు? ప్రయత్నశీలవై మునులకు సహితము దుర్భరమగు తపమేల ఆచరించుచున్నావు? చూడగా నీవు చిన్న బాలిక గానీ, వృద్ధురాలివి గానీ కావు. కానీ ఈ సమయము నందు పతిని విడచి ఈ తపమేల కావించుచున్నావు? ఓ! భద్రా! నీవు ఎవరి సహధర్మచారిణివి? నీ భర్త పూలకొరకు కాననముకేగలేదు కదా? ఈ విషయములు గోపనీయములు కాని ఎడల నాకు తెలుపవలసినది. ఒకవేళ నీ హృదయముందలి చింతకు ఏదయిన కారణము కలదేని, అద్దానిని నాకు తెలుపుము. దానిని నివారించుటకు నేను సమర్థుడను. అంత కాళి తన చెలియ విజయను ఆ బ్రహ్మచారితో మాట్లాడవలెనని సంజ్ఞ చేసెను. అంత విజయ "ఓ! ద్విజోత్తమా! ఈమె గిరిరాజకన్యక అయిన కాళి. పార్వతీ నామమున ప్రసిద్ధురాలు. ఈమె అవివాహిత. వృషభధ్వజుని వివాహమాడుటకై చిరకాలము నుండి తీవ్ర తపమాచరించుచున్నది. కానీ శివుడు ఈనాటి వరకు మా చెలిని పరిగ్రహించుటకు ఏతెంచలేదు. దేవ, ఋషి గణములు గిరీశుడు సర్వజ్ఞుడని ఘోషించుచుండిరి. అయిన ఆ సర్వజ్ఞుడు కాళి తపము నెరుంగడా? అందువలన శైలపుత్రి ఈనాడు మిక్కిలి దు:ఖితయై యున్నది. ఓ! సువ్రతా! మీరు దయచేసి అనుగ్రహించి మా చెలిని శంకరుని తో కూర్మి చేయవలసినది."

అంత బ్రహ్మచారి ఇంచుక సుచిస్మితుడై ఇట్లనియె "నా దర్శనము విఫలమవదు. నేను శివునినెరుగుదును. కానీ ఒక్కమాట నాది కూడా వినవలసినది. మహాదేవుడు వృషభవాహనుడు. భస్మలిప్తశరీరుడు. జటాజూటధారి. వ్యాఘ్రచర్మధారి మరియు గజచర్మమును ఉత్తరీయముగ ధరించును. కపాలి. శరీరమంతయు పాములు తిరుగుచుండును. ఆతని విషతప్త కంఠము నందు రుద్రాక్షలు యుండును. విరూపాక్షుడు భయంకరుడు. మరి ఆతని జన్మమందునా.......అజ్ఞాతుడు. బంధు, బాంధవ రహితుడు. ఆతనికి ఒక గృహము లేక నివాస స్థానము లేదు. నిరంతర శ్మశానవాసి. సత్సంగరహితుడు. నిరంతరము వికృత గర్జనలు చేయు వికటభూతగణ మధ్యమున నివసించును. పత్నీ పుత్ర రహితుడు. శృంగార రస మందునా.....సంపూర్ణ రహితుడు. ఇత:పుర్వము నేను వినిన ఒక విషయమును మీకు తెలిపెదను. అది వినిన తదుపరి సహితము నీకు ఇష్టమగునేని నీ చిత్తము వచ్చినట్లు చేయవచ్చు. దక్షప్రజాపతికి "సతి" అను అతిలోక సౌందర్యరాశి అయిన కన్య కలదు. ఆమె ఈ వృషభధ్వజుని పతిగా వరించినది. ఆ సాధ్వి ఈ విరూపాక్షుని తో ఏ విధమయిన సంభోగసుఖమందలేదు సరికదా, కపాలి భార్య అగుటచే ఆమె దక్షుని చే త్యజింపబడినది. దక్షుడు యజ్ఞమాచరించి ఈ కపాలికి యజ్ఞభాగమీయకుండెను. ఈ అవమానము భరింపలేక సతి ఈ కపాలినీ, తన ప్రియ శరీరమును త్యజించినది. నీవు చూడగా పర్వతరాజు పుత్రికవు మరియు స్త్రీల యందు రత్నస్వరూపిణివి. అటువంటి నీవు కోరికోరి ఆ కపాలిని ఏల వరించుచున్నావు? దేవేంద్ర, కుబేర, అగ్ని, అన్య సురణములు, లేక దేవ వైద్యులయిన అశ్వనీ కుమారులు, గంధర్వ, విద్యాధర, నాగ, మానవ జాతులందు ప్రసిద్ధ కులోత్పన్నులు, నవయవ్వన సంపన్నులు, శ్రీమంతులైన వ్యక్తులనేకులు నీకు యోగ్యమయిన వారు కలరు. వారితో నీవు సుందర ప్రసాదములతో చుట్టబడిన, మనోహర అంబర చుంబిత స్వర్ణ భూషిత మందిరములందు, ధూపచూర్ణ మలయానిలము నిండిన పరిశరములందు, రత్నజటిత హంసతూలికా తల్పములందు అనేక సుఖభోగములు అనుభవించవచ్చు. ఇవన్నియు తెలిసికూడా ఇంకనూ నీవు శంకరుని కోరితివేని, నేను నీకు శంభుని కూర్చెదను. అట్లయిన నీవు కావించిన తపమునకు ప్రయోజనము శూన్యము."

బ్రహ్మచారి యొక్క అప్రియ వాక్యములు విని శైలపుత్రి మిక్కిలి క్రోధోద్రిక్తయై ఇట్లు పలికెను "ఓ! ద్విజనందనా! నీకు హరుని విశేషరూపము తెలియదు. కేవలము బాహ్యరూపము గూర్చియే నీవు పలుకుచుంటివి. బ్రహ్మేంద్రాది దేవతలు సహితము ఆయనను తెలియరనిన, మీకేమి తెలియును? మీరు విప్ర పుత్రులయినప్పటికీ, ఏదో నీచుని నుండి

ఈ దుర్వాక్యములు విని వానిని వల్లెవేయుచున్నారు. నేను మహాదేవుని వినా వేరొకరిని పతిగా వాంఛించుట లేదు. అన్య వాక్యములు విను ఇష్టత ఇంచుక లేదు." తదుపరి తన చెలియతో "సఖీ! నేను మహాతపము ద్వారా శంకరుని ఆరాధించుచున్నాను. కానీ నా అరాధ్యదేవుని నా ఎదుటే ఈ విప్రపుత్రుడు నిందించుచున్నాడు. ఈతని ప్రార్థించి ఇచట నుండి వెంతనే పోవలయునని తెలుపుము. పూర్వము నేను నా తండ్రి నుండి మహాత్ములను దూషించుట, మరియు ఆ దూషణను వినుట, ఈ రెండునూ పరమ పాపకార్యములని వింటిని. అందువలన ఈ విప్రపుత్రుని శివనిందను ఆపుము. పిదప శివనిందాశ్రవణము వలన కలిగిన పాపము బాపుకొనుటకు ఇట్లు స్థవము కావించెను. జితేంద్రియుడు, కారణ త్రయమునకు కారణమయిన శంభునకు ప్రణామములర్పించుచున్నాను. మహేశ్వరా! సర్వులకు మీరే గతి! నేను మీకు ఆత్మ సమర్పణ కావించుచున్నాను. హిరణ్యబాహువు, హృదయగత ఉత్కృష్ఠ జ్ఞానమయుడు, నారాయణుని పద్మము నుండి ఉత్పన్నమయిన జగత్తు యొక్క హితైషి అయిన గిరీశునకు ప్రణామములర్పించుచున్నాను."

ఇంతలో ఆ బ్రహ్మచారి తిరిగి శివనింద చేయుటకు సంకల్పించి మాట్లాడుట మొదలిడెను. అంత కాళి తన చెలియతో "సఖీ! ఈ ద్విజుడు శంభుని తెలియడు. ఈతడు తిరిగి శివనిందకు ఉపక్రమించుచున్నాడు. అత్యంత ప్రాణనాశకమయిన శివనిందను నేను వినలేను. ఎంతదూరము వరకు ఈతని కటు వచనములు వినబడునో, అంతదనుక నేను వెళ్ళుటకు ఇచ్ఛగించుచున్నాను." ఈ విధముగ పలికి హటాత్తుగ లేచి గిరిజ సఖీ సమేతయై అచటి నుండి నిష్క్రమించెను. అంత శంభుడు తన ప్రచ్ఛన్న రూపమును విడచి, స్వస్వరూపము ధరించి పార్వతికి ఎదురుగ వచ్చి "ఓ! శాంకరీ! కాళీ!! నేనే శంకరుడను!!!" అని పలికెను.

ఈ హటాత్పరిణామమునకు గిరిజ ఒక్క క్షణము భయాన్వితయై తదుపరి అవనిత శిరస్క అయ్యెను. ముప్పిరిగొన్న ప్రేమ, అతిశయ లజ్జ మిశ్రితమవగా శైలపుత్రి స్థంభీ భూతురాలైయ్యెను. మాట్లాడుటకు ఇచ్ఛయున్ననూ మాటలు రాక మూగఅయ్యెను. భగవతి మనోరధము సిద్ధించి, శరీరము సుధాపూర్ణమై ఆనందసాగరమున ఓలలాడెను. పదెనెనిమిది వేల సంవత్సరములు కావించిన తపోక్లిష్ఠతనంతయు క్షణముతో మరచెను. ఈవల వృషధ్వజుడు సహితము కాళి యందలి మిక్కిలి అనురాగము, శరీరము పై కాముని భస్మలేపన కారణమున అత్యంత కామమోహితుడయ్యెను. అంత కపాలి ఉత్ఫుల్లచిత్తుడై కాళితో ఇట్లు పలికెను "సుందరీ! నీవు నాతో మాటలాడుకుండుటకు కారణమేమి? తప: క్లేశమును స్మరించి నా యందు క్రోధము వహింపలేదు కదా! ఓ! సుభగా! నేను సహితము నీ విరహతాపము చే తప్తుడనగుచున్నాను. నీవు నా నియమానుసారము తపము కావించి, సంపూర్ణ దేహ సంస్కరణము కావించుకొంటివి. నీకు నా చింతన, జపము మరియు తీవ్రతపము అనెడు మూల్యమునిచ్చి, నన్ను దాసుని వలె కొనుగోలు చేసితివి. ఇక నీవు అంగ, జట, వల్కల సంస్కారము కావించుకొని, మనోహర వస్త్రములు, హార, నూపుర, కేయూర, కంరణధారణ కావించి, నా యందు ప్రేమ, స్నేహము ప్రకటింపవలసినది. నా నేత్రాగ్ని చే దగ్ధమయిన మదనుడు భస్మరూపమున నా శరీరముపై నివసించుచూ, ప్రతీకారముగ నీ ఎదుట నన్ను మన్మధాగ్ని చే జ్వలింపజేయుచున్నాడు. ఓ! మనోహారిణీ! నీవు నీ అంగరూప అమృతమును నాకు దానమొనర్చి ఈ కామాగ్ని నుండి నన్ను ఉద్ధరింపవలసినది."

**(శ్రీ కాళికా పురాణ మందలి శివ ప్రసన్నత యను నలుబది మూడవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది నాల్గవ అధ్యాయము

**(శివ, పార్వతీ కళ్యాణము; కాళీ శివ సమాగమము)**

గిరిజాదేవి శంకరభగవానుని కధనము విని ప్రసన్నచిత్తయై, తాను కృతార్ధురాలినైతినని, తనకు మనసైన పతి లభించెనని అమందానంద కందళిత హృదయారవిందయై, శంకరుడు వినునట్లు తన చెలియతో ఇట్లనియె "సజ్జనులు మర్యాదనతిక్రమించరు. శంకరుడు సహితము ఆ మర్యాదననుసరించి నాతో పాణిగ్రహణము చేయవలెను. కన్య ఎల్లప్పుడూ తన తండ్రి యొక్క సొత్తు. తపోదత్తము కాదు. నేను భవుని చేరుట కొరకు తపమాచరించినప్పటికీ, నా తండ్రియే నన్ను కన్యాదానము చేయును. అందువలన పినాకి నా తండ్రిని అర్ధించి, వైవాహిక విధి విధానములన్నింటినీ అనుసరించి, నన్ను పరిణయమాడవలెను." ఆ విధముగ పలికి స్త్రీ సహజమయిన సిగ్గు ముంచుకురాగా అవనిత శిరస్కయై మౌనము నవలంబించెను. శివ భగవానుడు సహితము శైలపుత్రి యొక్క పలుకులు సత్యము, యోగ్యము మరియు హితకరమయిన కారణమున వాటిని అంగీకరించెను. తదనంతరము కాళి తన చెలుల సహితయై తన గృహమున కరిగెను. శివుడు తిరిగి ఆ గంగావతరణ స్థలమందు పూర్వము వలె నివాసముండసాగెను.

పార్వతి లజ్జాభరిత హృదయయై తన గురుజనములను సహితము చూడలేకుండెను. అంత చంద్రశేఖరుడు కాళి యొక్క మాతాపితరులను కన్యార్ధమై అర్ధించుటకై మరీచాది సప్తర్షులను స్మరించెను. తక్షణము ఇనుము అయస్కాంతము చే ఆకర్షింపబడినటుల వారు ప్రత్యక్షమయిరి. వశిష్ఠుడు తన ధర్మపత్ని అయిన అరుంధతీ సమేతుడై ఏతెంచెను. ప్రదీప్తమయిన అగ్ని శిఖలవలె తేజరిల్లుచున్న మహర్షులను పరమేశ్వరుడు అవలోకించెను. అంత సప్తర్షులు వృషధ్వజునికి సవిధిగా పూజనమొనర్చి హర్ష గద్గద స్వరముతో, ఇట్లనిరి "ఆహా! ఏమి మా పరమ భాగ్యము! నిర్మల కాంతిని విరజిమ్ము చంద్రవంకను శిరసుపై ధరించినవాడు, అగణిత ప్రజ్ఞా ధురంధరుడు, శుద్ధరూపుడు అయిన శంభుడు నేడు ప్రత్యక్షముగ దర్శనమిచ్చు చున్నాడు. ఈయన ధ్యానయోగుల యొక్క ధ్యేయము. కేవల దర్శనమాత్రమున ఈయన నేత్రములను దర్శించినవారు రక్షింపబడుదురు. సూర్య తుల్య తేజోమయము, నిత్యము అయన నీలలోహితుని దేహమునకు భక్తి, స్థుతులతో ప్రణామము లర్పించుచున్నాను. కాలరూపమున శశిశేఖరుని శిరంబందుండి ప్రకాశించుచున్న నెలవంక మమ్ము శుద్ధుల గావించుగాక!" ఈ విధముగ పలికి అత్యంత వినయ విధేయులై కపర్దితో "స్వామీ! మమ్ము పిలుచుటకు కారణమేమి! శలవీయవలసినది." అని పలికిరి.

వారి వచనములు విని నీలలోహితుడు శుచిస్మిత వదనుడై ప్రతిఒక్కరినీ ఉద్దేశించి ఇట్లు పలికెను "మునులారా! జగత్తు యొక్క హితార్ధము, నా భోగార్ధము, మరియు సంతాన వృద్ధి హేతువుకై నేను పత్నీ పరిగ్రహణము కావింపదలచితిని. ఈ విషయమై మీ సహాయము నర్ధించుచుంటిని. నా పనుపున మీరు హిమవంతుని వద్దకు ఏగి, ఆతని పుత్రిక కాళిని నాకు కన్యాదానమొనర్చునట్లు ప్రయత్నము కావింపవలసినది."

శంభుని పలుకులు వినిన పిదప సప్తర్షులు ఆయనను వీడ్కొని హిమాలయ భవనమునకు ఏతెంచిరి. హిమవంతుడు వారికి యధోక్త పూజాధికములు గావించిన మీదట, వారిట్లు పలికిరి "పర్వతరాజా! పరమేశ్వరుడు, చంద్రశేఖరుడు దేవగణములందు శ్రేష్ఠుడు, మరియు జగత్తుకు ఏకమాత్ర కర్త. శాపగ్రస్తులు, మిధ్యావర్ణులు ఆయనను తెలియలేరు. ఆయన ప్రళయము నందు జగత్సంహార కర్త. భక్త జనులకు కొంగుబంగారము మరియు ఐశ్వర్య ప్రదాత; అంతేకాదు! నానా రూపములతో శోభించు భక్త మనోహరుడు. ఆయన మీ పుత్రిక అయిన కాళిని పత్నీరూపముగ వరించవలెనని వాంఛించుచున్నాడు. ఓ! గిరిప్రవరా! మీరు చంద్రశేఖరుని యోగ్యవరునిగ అంగీకరించితిరేని, మీ కన్యారత్నమును

ఆయనకు ప్రదానము కావింప వలసినది." పర్వతరాజు తన పుత్రిక యొక్క మనసునెరింగియు, తిరిగి మరొకమారు ఆమె అంగీకారమును బడసి, చిరకాలము నుండి తన మనసునందున్న ప్రస్తావనను మహర్షులు ఆవిష్కరించుట చే ఆనంద పరవశుడై వారితో ఇట్లనియె "మహానుభావులారా! మీ రాక చే మా గృహము పావనమైనది. నా చిరకాల మనోరథము పూర్ణమయినది. మీ ప్రార్ధనానుసారము నేను మా కన్యను విష్ణువల్లభునకు పత్నీరూపముగ కన్యాదానము కావింతును. పూర్వము కాళి సహితము శివుని పతిగా ప్రాప్తించుటకు అత్యంత దుష్కర తపమాచరించినది. ఇది విధాత నిర్ణయము. దీనిని నిరాకరించు అధికారము వేరెవరికినీ లేదు. ఈ గిరి కన్యను వేరొకరు ఎవరు ప్రాప్తించగలరు? అయ్యది కేవలము హరునకు మాత్రమే సాధ్యము. కాళి మనసునందు హరుని ఎప్పుడో వరునిగా పరిగ్రహించినది." ఈ విధముగ పలికి మేనకా హిమవంతులు తమ అంగీకృతిని ఎరింగించిరి.

తదుపరి మరీచాది మునిగణము శ్రీకంఠుని వద్దకేతెంచి యధాతథముగ తమ సంభాషణమంతయు పూసగ్రుచ్చినట్లు ఆయనకు నివేదించి, హిమాలయ దంపతి యొక్క అంగీకృతిని తెలిపిరి. హరుడు సంతోషాంగతరంగుడై, ప్రసన్నాంత:కరణుడై, ఆ ఋషి గణమును యధాయోగ్యముగ సత్కరించి, తిరిగి కాళీ వివాహ సమయమునకు తిరిగి రావలసినదని వారిని ఆహ్వానించి, వీడ్కొనెను. వారును మనమున ముదమొంది ఆమోదించిరి. తదనంతరము హిమవంతుడు శివాశ్రమమున కేతెంచి, శివాదేశానుసారము వివాహ ముహూర్తమును వైశాఖ శుక్ల పంచమీ, బుధవారము చంద్రుడు ఫల్గుణీ నక్షత్ర యుతుడు, సూర్యుడు భరణీ నక్షత్రయుతుడై యున్నపుడు నిర్ణయించెను. ఆ సమయమున శివుని ఆజ్ఞను ఔదలదాల్చి సప్తర్షులు, బ్రహ్మాది దేవతా గణములు, దిక్పాలురు, మునిగణములు, లక్ష్మీ సహిత నారాయణుడు, శచీ సహిత ఇంద్రాదులు, బ్రాహ్మణీ ఆదిగా మాతృగణములు, నారదాది దేవర్షులు, పరివారజన సమేతులై దేవతలు, ప్రమధులు అచట కేతెంచిరి. ఆ పుణ్య సుముహూర్త సమయమున, వారందరి సమక్షమున పరమేశ్వరుడు, పర్వతనందినిని, పరమ వైభోగపేతముగ పరిణయమాడెను.

ఆ పరమపవిత్ర కళ్యాణ మహోత్సవ సమయమున మహేశుని అంగస్థితములైన ఎనిమిది సర్పములు జాంబూనద స్వర్ణమయ హారములుగ మార్పునొందెను. మహాదేవుడు ద్విభుజరూపుడై, జటాజూటము అద్భుత కేశపాశమై, శిరసున నెలవంక అత్యంత జ్వాలామానమై ఒప్పారెను. వ్యాఘ్రచర్మము విచిత్ర వసనముగ, దేహముపై భస్మము సుగంధభరిత మలయ చందనముగ, శరీరము గౌరవర్ణముగ, శంభుడు అత్యంత మనోహరమూర్తిగా రూపాంతరము చెందెను. ఆ సమయమున అక్కడ పరివేష్టితులయిన దేవ, గంధర్వ, సిద్ధ, సాధ్య, విద్యాధరులు ఆయన రూపము గాంచి విస్మయము నొందిరి. హిమవంతుడు, మేనక, వారి పుత్రగణములు, బంధు బాంధవులు సహితము శంకరుని రూపము గాంచి విభ్రమాశ్చర్యానందము నొందిరి. అంత పరమేష్ఠి శ్రీకంఠుని మనోహర దివ్య రూపమును గాంచి దేవతలతో "ఖేచరులారా! ఈయన జన్మము మొదలు సర్వము శుభకరము. అందువలన త్రిలోకముల యందు ఈయన "శివుడు" అని పిలువబడును. ఏ జీవి తన హృదయమునందు ఉమా మహేశ్వరులను స్మరించునో, వానికి సర్వ కళ్యాణములు ప్రాప్తించి వాంఛితార్ధములు సంపూర్ణమగును. మహామాయ తొలుత దక్షపుత్రి దాక్షాయణి యై, తదుపరి గిరికన్య అయిన పార్వతి గా జన్మించినది. కేవలము పార్వతీదేవియే శివుని మోహింప సమర్ధురాలు. శివుడు సహితము జగత్ హితార్ధము తీవ్రతపమాచరించెనని" వచించెను.

మార్కండేయుడు "ఓ! ద్విజసత్తములారా! ఏ జీవి ఈ పుణ్యమయ కాళికా చరిత్రను కీర్తించునో, వానిని ఆదివ్యాధులు బాధింపవు. ఆ జీవి దీర్ఘాయువగును. పరమ కళ్యాణకరమయిన ఈ కాళి చరిత్రమును ఒక్కసారి వినినను, ఆ జీవి శివలోకమును ప్రాప్తించును. శ్రాద్ధకాలమందు ఏ వ్యక్తి కాళి చరిత్రమును బ్రాహ్మణులకు వినిపించునో, ఆతని పితరులు కైవల్యము నొందెదరు. ఎవరేని సభాముఖముగా కాళికా చరిత్రమును వినిపించెదరో, అచటకు ఉమా మహేశ్వరులు

స్వయముగ ఏగి, ఆ సభయందు కూర్చొని వినెదరు. ఋషి గణములారా! పరమ పుణ్య చరితము, పాప ప్రణాశనము అయిన కాళి చరిత్రమును మీకు వినిపించితిని. ఇంకనూ మీరు ఏమి తెలిసికొన గోరుచున్నారు.?"

**(శ్రీ కాళికా పురాణమందలి పార్వతీ పరమేశ్వర కళ్యాణమను నలుబది నాల్గవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది ఐదవ అధ్యాయము

**(కాళి గౌరి అగుట మరియు శివుని అర్ధనారీశ్వర తత్వము)**

ఋషి గణములు "మహాత్మా! శ్రవణానందరకము, పుణ్యమయము, విచిత్ర లీలాన్వితము, ఉత్తమ ఉపాఖ్యానమయిన శైలపుత్రీ శ్రీకంఠుల వివాహమును వినిపించితివి. తదుపరి నీలి కలువ అయిన కాళి గౌరాంగి అయిన గౌరి ఎట్లైనది? ఆ మహామహితాన్విత శివుని శరీరార్ధభాగమును ఏల గ్రహించినది?" అని ప్రశ్నించిరి. అంత మార్కండేయుడు "ముని గణములారా! సర్వ శుభప్రదము, అద్భుత మహితాన్వితము అయిన ఆ ఆఖ్యానమును మీకు వినిపించెదను. ఈ విషయమై ఇత:పూర్వము సగర చక్రవర్తి ఔర్వ మహర్షిని పరి ప్రశ్నించెను. ఆ సగర, ఔర్వ సంవాదమును మీకు వినిపించెదను. సూర్యవంశ సాగరమున సముద్భవించిన ప్రదీప్త చక్రవర్తులలో సగరుడొకడు. ఆయన అనన్య సామాన్య బల పరాక్రమోపేతుడు, శోభాయుక్తుడు, క్షమయందు ధరిత్రీ సమానుడు మరియు సర్వశాస్త్ర పారంగతుడు. ఆయన రధారూఢుడై, ధరణి యందలి సమస్త రాజనీకమును పాదాక్రాంతుల చేసికొని సార్వభౌముడాయెను. ఆ శుభ సమయమున ఆయనను సన్మానించుటకు చతుర్దిశల నుండి అనేక ముని, బ్రాహ్మణ గణములు ఏతెంచిరి. అందు ప్రముఖుడు, ప్రదీప్త దీపశిఖ వలె జ్వాజ్వల్యమానముగ ప్రకాశించుచున్న ఋషి సత్తముడు "ఔర్వుడు." అంత సగరుడు యధావిధిగ సర్వులకు పూజోపచారములు కావించి, ఔర్వుని కూడ మిక్కిలి గౌరవించి, అర్ఘ్య, పాద్య, ఆచమనాదులు సమర్పించి, ఆశీనుని చేసి, ఆయన స్వస్థతనొందిన పిదప ఇట్లు ప్రశ్నించెను.

"మహాత్మా! మునివర్యా! మీరు కుశలముగ యున్నారా?" అంత ఔర్వుడు "మహారాజా! నేను కుశలము. నీ దర్శనమయిన పిదప నా కుశలము మరింత సుస్థిరమయినది. ధరాతలమున ఈనాడు నీవు సమస్త రాజనీకము పై విజయము సాధించి, సార్వభౌముడవై, శ్రీమంతుడవయితివి. నీకు మరింత శుభములు చేకూరి, నీ రాజ్యము సుభిక్షమై, నిరంతర వృద్ధి అగుగాక! ఓ! రాజశ్రేష్ఠుడా! నీతి తప్పని అద్భుత రాజనీతిజ్ఞత చే, ఎల్లప్పుడూ సత్య ధర్మములు వీడక ఈ పుడమిని పాలింపవలసినది. నిశాకరుని వృద్ధిచే ఎట్లు సాగరము వృద్ధినొందునో, అట్లే నీ వృద్ధిచే జగత్తు వృద్ధి అగును. తొలుత బంధువర్గము సర్వము తో సహృదయత పాటింపవలసినది. తదుపరి గుణరూప లావణ్యముల యందు అనురూప అయిన కన్యను పత్నిగా స్వీకరింపవలసినది. ఏ కన్య అత్యుత్తమ గుణముల ద్వారా నిత్య, నైమిత్తిక కర్మలు, వ్రతములు ఆచరించుచూ, తనంత తానుగ నిన్ను వరించునో, ఆమె ఏ "పత్ని" అనదగినది. పూర్వకాలమున హిమాలయనందిని అయిన కాళి శంభు సంగమము కోరి అద్వితీయ ఘోర తపమాచరించెను. అంత పినాకపాణి ఆమె కోరికను మన్నించి, ఆమె యందు అత్యంత ప్రేమపాశబద్ధుడై, ఆమెను తన అర్ధ శరీరముగ ధరించెను. అప్పటి నుండి ఆయన ఆర్ధనారీశ్వరుడయ్యెను. ఆయన తిరిగి ఏ పత్నీ గ్రహణము చేయకుండెను. అందువలన నృపవరా! నీవు కూడ గుణరూపవతి అయిన పత్నిని బడసి, గుణవంతులయిన పుత్రుల బడయుము."

అంత సగరుడు చిరునవ్వు చిందించుచూ "ముని ప్రవరా! గిరిజాదేవి శంకరుని అర్ధశరీరమును ఎందుకు గ్రహించినది? ఈ విషయమంతయు విస్తారముగ వివరింపవలసినది. అంతేకాగ ఓ! ద్విజోత్తమా! ఏ ఆచార వ్యవహారముల

చే స్వయముగ నన్ను, నా భార్యా పుత్రులను యోగ్యులుగ మలచుకోవలెను? సదాచారినైన నాకు ఈ నీతినంతటినీ వివరింప వలసినది. రాజనీతి, సత్పురుషుల నీతి, కృతార్థులైన కృతకర్ముల నీతి ఏ విధముగ యుండును? స్వామీ! ఈ విషయములు గోపనీయములు కాకుండిన, వినుటకు నాకు అర్హత యున్నదని మీరు తలచిన, మీకు నా యందు ఆప్యాయత యుండి నాకు ఈ అంశములు వినిపింపవలెనని ఆకాంక్ష యున్న, దయచేసి ఈ విషయములు మీ నుండి వినవలెనని కోరి ప్రార్థించు చున్నాను." అంత ఔర్వ మహర్షి "మహారాజా! నీవడిగిన విషయములన్నియు వివరించెదను. తొలుత అర్ధనారీశ్వర ఆవిర్భావము వినుము. భవుడు శైలపుత్రిని వివాహమాడిన పిదప కొంతకాలము హిమాలయ కంధరములందు, సమున్నత శిఖరములందు, జలపాతముల యందు వారిరువురు విహరించుచూ ప్రకృతి శోభను పూర్ణముగ అనుభవించుచూ, దినమొక క్షణమువలె గడుపుచుండిరి.

ఆ సమయమున వృషాంకుడు ధ్యానాదులు పూర్తిగ విడనాడి, నిరంతరము గిరిపుత్రికా వదనారవిందాస్వాదిత భృంగమై, శైలపుత్రీ ముఖ చంద్రమును చకోరము వలె అవలోకించు చుండెను. ఆమె యందుగల గాఢానురాగము చే అప్పుడప్పుడు వనమునందలి సుందర పుష్పములు పరిగ్రహించి, మనోహరమాలలు చుట్టి, మహేశ్వరీ దేవి శరీరమంతయు సజ్జితము చేయును. ఒకప్పుడు ఆ సునిర్మల లలాటముపై సుగంధిత  కస్తూరి, చందనములతో చేసిన లేపనమును చంద్రలేఖ వలె చిత్రించును. మరొకప్పుడు వృక్షముల నుండి స్రవించిన రసములను కస్తూరి, ఆగరు, చందనముతో కలిపి, ఆ అచలాదేవి కేశపాశమునకు అలది, చిత్ర విచిత్రముగ ఆమెకు జడలు అల్లును. ఒకసారి శుద్ధ జాంబూనద స్వర్ణము చే చేయబడిన మనోహర కుండలాది అభరణములతో ఆమె సర్వావయవములను అలంకరించును. సర్వ స్వర్ణాభూషణములు శరీరమంతయు మెరయుచుండగా ఆ శ్యామలాదేవి మేఘముల తోడి విద్యుల్లత వలె శోభించుచుండెడిది. దివ్య రత్న మణికుండల మేఖలాలంకృతయై, మనోహర మాల్యాంబరధారియై, ఆపాద మస్తకము మహోజ్వల మాణిక్య, మండితాభరణాలంకృత అయిన శివాణి, పుష్పించిన పూర్ణప్రకృతి వోలె భాసించుచుండెను. ఈ విధముగ జగత్పిత భవుడు జగన్మాతతో, జగత్ హితార్థము సదైవ క్రీడాతత్పరుడై యుండెను. విద్యావిద్యా స్వరూపిణి, పరామూర్తి, సృష్టి, స్థితి ప్రళయాత్మకమయిన మూలప్రకృతి అయిన జగన్మాత కాళి సహితము హర భగవానుని మోహింపజేయుచూ చంద్రుడు తన అభిన్నరూపమయిన చంద్రిక తో క్రీడించునటుల క్రీడించుచుండెను.

కళ్యాణము జరిగిన కొన్నాళ్ళు నూతన వధూవరులు దినమొక క్షణముగ ఆనంద సాగరమున ఓలలాడుచూ యుండగా ఒకనాటి సాయం సమయమున ఒక చిత్రము జరిగెను. మహేశుడు ఉమా సహితుడై కైలాస శిఖరమందు సరసగోష్ఠి జరుపుచుండగా అచటకు కొంతమంది అప్సరసలు ఏతెంచిరి. వారందరూ రూప యవ్వన సంపన్నులు మరియు సర్వసులక్షణ సంయుతులు. వారందరూ గౌరవర్ణముతో ప్రకాశించుచూ, సర్వాలంకార భూషితలై యుండిరి. వారు సర్వులను, ఘనీభవించిన మునిగణముల చిత్తములను సహితము క్షణములో మోహ సంద్రమున ముంచగలిగిన మనోహారిణులు. వారందరూ  ఉమా మహేశుల కాంచి, కించిత్ భయము నొంది, దగ్గరకు ఏతెంచి, అంజలి ఘటించి, అవనత శిరస్కులై నిలుచుండిరి. అంత భర్గుడు పార్వతీదేవిని ఆటపట్టించుచూ "ఓ! కాలాంజన సదృశ కాళీ! నీవు ఈ ఊర్వశీ మొదలగు అప్సరోభామలతో స్త్రీ సహజమయిన మాటలాడవలసినది." అంత ఊర్వశీదేవి తన చెలులతో కలసి అచటి నుండి నిష్క్రమించెను. కానీ పర్వత రాజపుత్రి వృషాంకుని "కాలాంజన సదృశ" అను పలుకుల యందలి వ్యంగ్యాత్మక శ్లేషను గమనించి, క్రోధాన్వితయై, ఇక కైలాసము నందు నిలువలేక, వృషభవాహనుని విడచి, ఆ హిమాలయములందలి ఒక శిఖరము పై గుప్తముగా నివసింప సాగెను. ఇచట పరమేశ్వరుడు కైలాసము నందు ఉమాదేవిని వెదకి, ఆమెను కానక వ్యాకులుడై హిమాలయముల సర్వమును వెదకి వెదకి వేసారెను. అనీశ్వరుడు తన కొరకై మిక్కిలి వ్యాకులుడయ్యెనని తెలిసి మహేశ్వరి ఆయనకు దర్శనమిచ్చెను.

అంత శంభుడు "ప్రియా! ఈ మనో మాలిన్య కారకమయిన కార్యమును నీవు ఎందుకు కావించితివి? ఓ! కమల లోచనా! నీవాచరించిన కార్యము నాకు మిక్కిలి బాధను కలిగించినది. శీఘ్రమే తెలుపవలసినది" అని ఆమెను ఆలింగనము చేసికొనుటకు యత్నించెను. అంత శివాణి ఆయను వారించి ఇట్లనియె "ఓ! భూతేశా! మీరు వివాహపూర్వము నన్ను అవలోకింపలేదా? నేను కాళినే కదా! మరి అప్సరసల సమక్షమున నన్ను "కాలాంజన సమాన" అని పరిహాసమాడనేల? ఎవరేని జాతి, ధన, రూప, ఉదారత, అంగహీనులు లేక అధికాంగులు ఉన్న ఎడల వారిని అధిక్షేపించుట సభ్యతకాదని పూర్వమే బ్రహ్మదేవుడు వేదములందు నిశ్చయాత్మకముగ శెలవిచ్చెను. కానీ మీరు ఆయన శాశనమును కాలరాసి నన్ను, నా రూపమును పరిహసించిరి. నేను నా శరీరము స్వర్ణతుల్య గౌర వర్ణమగువరకును మిమ్ము చేపట్టను. ఇది సత్యము." ఈ విధముగ పలికి మహాదేవి హిమాలయ శిఖరమునున్న "మహాకౌశీ" జలపాతము వద్ద కేగినది. భూత భవిష్యత్ వర్తమానముల నెరిగిన మహాదేవుడు ఆర్యాదేవి యొక్క వనాగమనమును ఆపలేదు. కాళీదేవి ఆ తపోస్థలి యందు పూర్వము వలె శంభుని మనసు నందు నింపుకొని తీవ్రతపమాచరించెను. ఆ సమయమున శాంకరీదేవి కుడికాలు పైకి పెట్టి, ఎడమవాలిపై నిలబడి, ఏకపాదయై, ముఖమును పూర్తిగా పైకెత్తి, వ్యాఘ్రచర్మధారియై, నిరాహారియై, జ్యోతిర్మయుడు, శాంతుడు, శుద్ధుడు, శ్రేష్ఠుడు, మంగళప్రదుడు అయిన శివుని ఆత్మయందు ధారణకావించి, జ్ఞానరూపముతో, ఆరాధించుట నారంభించెను. ఆ సమయమున ఆమె మనోశరీరములు ఎంత నిశ్చలమయ్యెనన, ఆమె కాళి అని తెలయని వారు ఆమెను శాఖాపల్లవ రహిత వృక్షమని భావించెడివారు. ఈ విధముగ వంద సంవత్సరములు గడచెను.

తదుపరి యోగ తత్పరుడయిన శివుడు అత్యంత లజ్జాయుక్తుడై ఆమెకు దర్శనమిచ్చెను. ఈ దర్శనము బహువిచిత్రముగ తొలుత బ్రహ్మరూపుడై, పిదప విష్ణురూపుడై, తదుపరి రుద్రరూపుడై, చివరగా త్రిమూర్త్యాత్మకముగ దర్శనమిచ్చెను. భగవానుని ఈ దివ్యరూపము జ్యోతిర్మయము, శుద్ధము, సర్వకారణ కారణము. అనంతరము కృత్తివాసుడు తన శంభుస్వరూపమును దర్శింప చేసెను. అదే సమయమున మహామాయ, యోగమాయ అయిన కాళికి తొలుత తన మహామాయా స్వరూపమును, తదుపరి తన మూల ప్రకృతి రూపమును, చివరగా పార్వతీ స్వరూపమును దర్శింపజేసెను. అంత కాళి, వంద సంవత్సరములు సలిపిన తీవ్ర తపఃప్రభావమున, అంతర్దృష్టిచే యదార్ధ జ్ఞానము నొంది, శంభుని జగత్పితగనూ, తనను జగన్మాతగనూ జ్ఞానము చే తెలిసికొనెను. ఆమెకు బ్రహ్మ, విష్ణు, రుద్ర, హర రూపములన్నియు శంభుడే అని రూఢి అయ్యెను. దేవి పార్వతి తనను కూడా యోగనిద్రాది సమస్త ప్రకృతి తనే అని గ్రహించి, రూఢి చేసకొని, తపు చాలించి, కన్నులు తెరచి, ఎదురుగ దేవదేవుడయిన వృషాంకునిగని, ప్రసన్నహృదయయై, ఆయనను ఈ విధముగ కీర్తించెను.

"ఓ! జగన్నాధా! నీవే కేశవ, అచ్యుత, అను నామములు గల ప్రధాన పురుషుడవు, సర్వాతీతుడవు, కారణ త్రయుడవయిన శంభుడవు. మహాప్రభూ! యోగ మోహములు, రాగ ద్వేషములు, ధర్మా ధర్మ, విద్యావిద్య ప్రభృతులు మీ స్వరూపములే! శ్రేయనిఃశ్రేయములు, దృశ్యాదృశ్యములు, మీరే! స్వామీ! నిరంతర మానస సంచరులయిన యోగమూర్తులు, తత్వరూపులు, శాంత, జ్యోతి స్వరూపులు మీరే! వృషభారూఢా! మీరే బ్రహ్మ, విష్ణు, హర, ఇంద్ర స్వరూపులు, ఆదిత్య, వాయు, అగ్ని, కుబేర, వరుణ, యమ, మరియు రాక్షసేశ్వరులు మీరే!! ఈ జగత్తు నందు మీరు వినావేరొకరు లేరు!!! ప్రభూ! పంచభూతములు, స్థావర జంగమములు, జ్ఞాన జ్ఞేయములు నీవే! ధ్యానగమ్యమయిన పరాత్పర తత్వరూపము నీవే! ప్రధాన పురుషుడవు, పరమాత్ముడవు, మూల ప్రకృతి నీవే! సృష్టి యందలి జేష్ఠుడవు, శ్రేష్ఠుడవు, జ్ఞానగమ్యుడవు నీవే! కార్య కారణ స్వరూపుడవు, పంచకృత్య (సృష్టి, స్థితి, లయ, తిరోధానము, అనుగ్రహము) పరాయణుడవు, కనిపించుచున్న జగత్తు సర్వము నీవే! సూక్ష్మము కంటె సూక్ష్మము, స్థూలము కంటె స్థూలము, సామ, దాన భేదాది ప్రయోగములు, నిత్యానిత్యములు, సంయోగ వియోగములు, ద్రష్ట దృశ్యములు, స్తుతి స్తవాది విషయములు, సర్వము

నీవే! సారాసారములు, నీతి న్యాయ, ఉదారములు, దాతా ధ్యేయములు, ఆర్యానార్యములు, పాలక ప్రజలు, ప్రాణము, ప్రాణుల యందలి చైతన్యము, వేదము, రూపారూపములు, సౌమ్య తీక్షణ స్వరూపములు నీవే! భావాభావములు, భ్రాంతాభ్రాంతములు, ద్వంద్వాద్వంద్వములు నీవే! ప్రభూ! నీవు ఏకస్థమయిన జగద్రూపుడవు అయినప్పటికీ, దేహశూన్యుడవు. నీవే స్థూల, సూక్ష్మ, నిర్వికార, జగద్రూప విశ్వాత్ముడవు మరియు నాస్తిక వాద రహితుడవు. ప్రకృతి పురుషులకు సహితము ఆధారము, కాలరూప ప్రధాన పురుషుడు, అత్యంత అగణిత ప్రతిభా ప్రభాపూర్ణుడయిన వర ప్రసాదకుడు, శ్రేష్ఠ చిత్తుడు, నీతికి మూలము అయిన ఈశ్వరునికి ప్రణామములర్పించు చున్నాను. ఓ! విశ్వాత్మా! వృషధ్వజా! మహేశ్వరా! నీవు అవ్యయుడవు, సర్వ సాక్షి, క్షేత్రజ్ఞుడవు మరియు క్షేత్రధారి అయిన నీకు అనేక వేల నమస్కృతులు అర్పించుచున్నాను. ఎవని చిత్తము నిరంతరము జ్ఞానామృతము చే తడుపబడుచుండునో, అట్టి మహానుభావుని నేను కేవల భక్తి చే ఎట్లు తెలియుదును? స్వామీ! నేను నా కరద్వయము జోడించి, అవనిత శిరస్కనై, నమస్కరించుచున్నాను."

మహేశ్వరుడు "దేవీ! నేను నీచే కావింపబడిన స్థవము చే సంతుష్ఠుడనైతిని. నీ తపఃప్రభావము చే త్రిమూర్తులము ముగ్గురము కూడా అత్యానందితులమైతిమి. ఏదేని వాంఛిత వరము కోరుకొనుము." నీతో సమానమయిన శీలతపో సచ్చారిత్ర వేరొకరు లేరు. ప్రియా! నీకు ప్రియమయిన వరము కోరుకొనుము." అంత హిమాలయనందిని తిరిగి మాయామోహితురాలై "స్వామీ! నా దేహమును స్వర్ణతుల్య గౌరవర్ణముగ మార్చుము. మీరు కూడ నా యందు కాక వేరొక ఏ రమణి యందు అభిలాష నొందకుందురు గాక!" ఈ పలుకుకు విని ఈశ్వరుడు కాళిని ఆకాశగంగ యందు స్నానమాచరింపజేసెను. ఈ జలముల నుండి బయల్వెడలిన మరుక్షణము ఆమె శరీరము పుటము పెట్టిన స్వర్ణము వలె మారెను. అంత శంభుడు "ప్రియా! నేను నిన్ను వినా వేరు అన్యస్త్రీని మనసునందు కూడా కోరలేదు/కోరను."

తదనంతరము వారిరువురు అమందానంద డోలికల యందు ఊగిసలాడుచూ తమ నగరమయిన కైలాసపురికి ఏగిరి. తిరిగి పరమేశ్వరుడు పార్వతిని పూర్వము వలె అనేక ఆభరణా భూషితను గావించుచూ, హాస భాషలచే ఆమెను అత్యంత ఆనందసాగరమున గ్రుంకులిడజేసెను. పార్వతీదేవి సహితము తన నూత్న, మనోహరశరీరమును గాంచి, మిక్కిలి ముదమొంది, సమయానుసారముగ శంభునికి సంపూర్ణానందము నొసగసాగెను. ఈ విధముగ వారిరువురు కైలాసము నందు క్రీడించిరి.

ఒకానొక రోజు పార్వతీదేవి పరమేశ్వరుని సరసన కూర్చొని యుండగా ఆమె ఛాయ (ప్రతిబింబము) శివుని వక్షస్థలమందు పడెను. శివుడు స్ఫటికము వంటి అమలిన శరీరుడు. ఆద్యాదేవి యోగిజనుల గమ్యస్థానమయిన వృషాంకుని వక్షస్థలమందు మనోహర కోమలాంగి, సుచిస్మిత, సుందరవదన అయిన తన ప్రతిబింబ రూపమును గాంచి, గిరీశుడు వాస్తవమునకు వేరొక స్త్రీని తన వామభాగమందు స్థాపించెనని భావించి, కుపితయై, కనులు ఎరుపెక్కి, కనుబొమలు ముడివైచి, గిరికుంజము ప్రవేశించెను. ఆ సమయమున ఆ మహాసాధ్వి సహితము విష్ణుమాయా మోహిత అయ్యెను. ఇంతలో త్రిపురాంతకుడు తన సతిని కానక వెదకుచూ చివరకు గిరికుంజమునందు మౌనముగ కూర్చొనిన ఉమాదేవిని గాంచి, ఆమె క్రోధమునకు కారణము తెలియక ఇట్లనియె "ఓ! వరారోహా! నీవు నా యందు కినుక వహించుటకు కారణమేమి? నేను నా మనో, వాక్య శరీరములతో నీ ఎడ అపరాధమేమియును కావింపలేదే? భామినీ! నీ కినుకకు కారణము ఇంచుక తెలుపవలసినది." అంత దేవి "స్వామీ! ఇతఃపూర్వము మీరు నన్ను వినా వేరొక స్త్రీని చేపట్టనని ప్రతిజ్ఞ చేసిరి. కానీ అద్దానిని వమ్ము చేసి పరస్త్రీని ఎట్లు చేపట్టిరి? నేను మీ వక్షస్థలి యందు మనోహరాంగి అయిన వేరొక స్త్రీని నా కనులారా కాంచితిని. పరమేశ్వరా! మీరు సర్వజ్ఞులు, మరియు సర్వగామి. నేను తీవ్ర తపము చే మిమ్ము ప్రసన్నుల కావించితిని. అయిననూ మీరు సంతుష్ఠులు కాలేదు కాబోలు!! అందువలన నేను మరల తపశ్చర్య కేగదలచితిని. అనుమతి నీయ వలసినది."

అంత సర్వమయుడు మందస్మితుడై ఆ అమృత ప్రదతో అత్యంత ఆదరముతో ఇట్లనియె "భద్రా! నేను ఏ ఇతర స్త్రీని వివాహమాడలేదు. నేను సత్యభ్రష్టుడను కాదు. నీవు మిధ్యానుభవము చే మోహగ్రస్థవైతివి. ఓ! మానినీ! కళాకులా! నీవు సత్యము నెరుంగ దలచితివేని, వెంటనే తెలిపెదను. తొలుత దురభిమానము వీడుము. నీవు కాంచినది దర్పణము వంటి నా విశాల వక్షస్థలమందు నీ రూపమునే! ఈ విషయమును నీవే నిశ్చితము గావించుకొనుము. నా హృదయస్థితవయిన గిరిజా! దురభిమానము వీడుము." అంత శైలపుత్రి వివాదము వీడక నా ప్రతిబింబము నా నుండి వేరుకాదు. నా ప్రతిబింబమే మీ వక్షస్థలమందు కలదని నెనెట్లు నమ్మగలను?" అంత కాలకాలుడు "నీవు గవాక్షము వద్దకేగి, భస్మము నుండి నీటి చే శుభ్రపడిన నా వక్ష స్థలమును, దర్పణము నందలి నీ ప్రతిబింబమును గమనింపుము. అపుడు నా వక్ష స్థలమందు కనబడినది నీ ప్రతిబింబమే అని నీకు రూఢియగును. ఈ విధముగ నీ దురభిమానమును వీడి నా యందు ప్రేమను వర్షింపుము."

భవపత్ని ఈ విధముగ గావించి, తన సంశయమును పూర్ణముగ తొలగించుకొని, తన కార్యమునకు అత్యంత లజ్జితురాలై, భవుని వద్ద కేతెంచి, తన బాహువులతో ఆయనను చుట్టి ముఖచుంబన కావించెను. అంత కవచి తన పత్నిని ఆశ్వాశించి "ప్రియా! నీవు సిగ్గుపడవలదు. ఎవరు భ్రాంతి నొందరు? స్త్రీలకు అభిమానము శ్రేష్ఠము, సుందరము, ప్రేమాస్పదము. కానీ విచారణ చేయక హఠాత్తుగ కోపించుట ఉచితము కాదు." ఈ విధముగ పలికిన తన ప్రియపతి పలుకులు విని మైనాక భగిని గిరిజ మృదుమధురముగ ఇట్లనియె "ప్రభూ! హరా! నేను నిరంతరము మీ ఆలింగన సుఖము, అవిచ్ఛిన్నమయిన మీ శరీర స్పర్శ వాంఛించుచున్నాను. ఈ విధముగ నేను మీ ఛాయనై మిమ్ములను సతతము అనుగమించెదను. అందువలన నన్ను మీ అర్ధశరీరము నందు భాగము కావింప వలసినది.

అంత శంకరుడు "ఓ! మనోహరీ! నీవు నా శరీరార్ధ భాగమును గ్రహించి, నాకు నీ శరీరార్ధ భాగమును ఈయవలసినది. భామినీ! అపుడు నా శరీరము సగము స్త్రీగా, సగము పురుషునిగా మార్పు చెందును." అంత గిరిజ "స్వామీ! నేను మీ శరీరార్ధమును గ్రహింతును. కానీ అవసరమయినపుడు నా శరీరార్ధము నన్ను చేరి పూర్ణ స్త్రీగా మారునట్లు అనుగ్రహింప వలసినది." అద్దానికి శంభుడు అంగీకరించెను. అంత పార్వతీదేవి తన తపో సమయమున కాంచిన మహామాయా స్వరూపమును చింతించెను. తదుపరి తొలుత హర భగవానునికి వందన మొనర్చి, పరమేష్ఠి, నారాయణులకు వందనములిడి, తన యోగనిద్రా రూపమును సంస్మరించి, తన శరీరపు కుడి భాగమున శివుని శరీరమును ధరించెను. భవుడు సహితము ప్రసన్నతతో తన వామ భాగమందు భవానిని ధరించెను. తదనంతరము శివ, శివాణి ఇరువురు ఏకదేహులై, విమల తేజోరూపులై విలసిల్లిరి. ఆ విచిత్ర రూపము నందు శిరమున ఒకవైపు ముడివైచిన కేశపాశము, మరియొక వైపు జటాజూటము ఒప్పెను. ఒక కర్ణము స్వర్ణ జటిత కుండలాలంకృతమై యుండగా, రెండవ కర్ణము రుద్రాక్షయుతమై శోభిల్లెను. ఒక నేత్రము లేడి కన్నుల వలె మెరయుచుండగా రెండవ నేత్రము వృషభనేత్రము వలె భాసిల్లెను. నాసిక ఒక ప్రక్క బలముగ యుండగా, రెండవ ప్రక్క తిలపుష్పము వలె నాజూకుగ యొప్పెను. ఒక ప్రక్క దంతములు మల్లె మొగ్గలు తలపించగా, వేరొక ప్రక్క దంతములు తెల్లగా ప్రస్ఫుటముగా వాటిల్లెను. మెడ ఒక ప్రక్క నీలవర్ణమందు యుండగా రెండవ వైపు హారయుక్తమై యుండెను. ఒక బాహువు స్వర్ణ కేయూర యుక్తమై యుండగా, రెండవ బాహువు నాగకేయూర యుక్తమై శోభిల్లెను. ఒక బాహువు కమలనాళము వలె కోమలముగా ఒప్పగా, రెండవ బాహువు ఏనుగు తొండము వలె భాసిల్లెను. వక్షము సగభాగము రోమయుక్తమై యుండి, రెండవ భాగము స్థనయుతమై యుండెను. ఒక ప్రక్క ఊరువు కదళీతరువును తోపించగా, రెండవ వైపు స్థూలమై, కఠినమై యొప్పెను. ఒక ప్రక్క శరీరము భస్మలిప్తమై, వ్యాఘ్ర చర్మధారియై యుండగా, రెండవ వైపు చందన చర్చితయై, మనోహర దివ్య దుకూలధారియై ఒప్పెను. ఒక ప్రక్క శరీరము కుసుమ కోమల స్త్రీ రూపమై యుండగా, రెండవ వైపు సుధృఢముగా పురుషాకృతి తో

యుండెను. ఈ విధముగ సర్వ జగత్ హితార్థము పార్వతీ దేవి శంభుని శరీరార్ధ భాగమును గ్రహించెను. ఈ అర్ధనారీశ్వర రూపమును పోల్చుటకు త్రిభువనముల యందు తగిన వస్తువు లేదనిన అతిశయోక్తి కాదు.

సర్వ జగత్పిత అయిన శంకరుడు శాంకరీదేవి తపము చేయకుండగనే గౌరవర్ణిని గ మార్చగలడు. కానీ సర్వ భూతోత్పత్తికి కారణభూతుడయిన మహాదేవుడు గిరిరాజ నందినిని తపము చే విశుద్ధాంగనను, స్వర్ణ దేహినిని గావించి, తుదకు శరీరార్ధభాగమును సహితము ప్రసాదించెను. అందువలననే మహాకాలుని అంతరంగ అనుచర వర్గమయిన నందీ, భృంగీ, మహాకాలుడు, కాలభైరవాదులు, మనుష్యదేహము నొంది, తమ అచంచల తపోబలము చే గణాధిపత్యము నొందిరి. ఈ సత్యము, తపోబలము, తత్వరహస్యము, కేవలము మహాదేవునికే ఎరుక. వేరొక ఏ ఇతర దేవతలకు తెలియుట అసాధ్యము. ఈ విధముగ మహాదేవుడు మానవ వనిత అయిన పార్వతీదేవికి సత్క్రియ, తీవ్ర తపోపాయము ద్వారా తన పత్నీత్వము నిచ్చెను.

ఏ మానవుడు గౌరీ హరులకు అత్యంత ప్రీతి పాత్రమయిన అర్ధనారీశ్వర వృత్తాంతమును నిత్య శ్రవణము కావించునో ఆతడు విఘ్న బాధల నొందడు. ఆతడు సుఖి, దీర్ఘాయువు, పుత్ర పౌత్రవంతుడు, శ్రేష్ఠ పుణ్యాత్ముడగును. ఎవరు ఈ అత్యద్భుత చరిత్రను జనులకు వినిపించునో, ఆతడు శివునికి అత్యంత ప్రీతిపాత్రుడై, శివలోక ప్రాప్తి నొందును.

**(శ్రీ కాళికా పురాణమందలి శివుని అర్ధనారీశ్వర తత్వమను నలుబది ఐదవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది ఆరవ అధ్యాయము

**(భేతాళ - భైరవ ఉపాఖ్యానము)**

ఈ విధముగ రసవత్తరముగ అర్ధనారీశ్వర చరిత్రము ముగియగనే సగరుడు తిరిగి ఔర్వ మహర్షిని ఈ విధముగ పరిప్రశ్నించెను. "భగవన్! నేను ఇత:పూర్వము నారద మహర్షి ముఖతా నందికేశ్వరుడు శివ సహచరుడై గణాధిపత్యము నొందిన గాధను వింటిని. కానీ భేతాళ, భైరవు లెవరు? వారు మానవ శరీరము నొందియు గణాధిపత్యము నొందిరి. మహాభైరవుడు సాక్షాత్ మృగరూపమయిన శంకరాంశ అని నేను వింటిని. ఆ భైరవుడు ఈ భైరవుడేనా? వీరిరువురు ఒకటేనా? వీరిరువురు మానవ లోకమందు ఎవరి పుత్రులుగ జన్మించిరి? ఏ కారణమున వీరికి వానర ముఖాకృతి లభ్యమయ్యెను? ఏ విధముగ వీరు గణాధిపత్యమ నొందిరి? ఈ విషయములన్నియు దయచేసి సవిస్తారముగ వివరింప వలసినది." అంత ఔర్వుడు ఒక శ్వాసను తీసికొని ఇట్లనియె "మహారాజా! ఆ అద్భుత చరితమును వివరించెదను. సావధానుడవై వినవలసినది. భృంగీ, మహాకాలులిరువురు శంకర భగవానుని పుత్రులే! వీరిరువురు గౌరీదేవి శాపము వలన మానవులుగ జన్మనెత్త వలసినది. భైరవ, మహా భైరవులు వేరు. మహాభైరవుడు మహాదేవుని శరభరూపము నందలి భాగము. భైరవుడు హరుని పుత్రుడు మరియు గణాధ్యక్షుడు.

తొలుత ఇంద్రాది దేవతలు తారకుని పీడా నివారణార్థము పార్వతీ పరమేశ్వర కళ్యాణము కొరకై నిరీక్షించిరని తెలిసికొంటిమి కదా! అటుపిదప దేవతలందరూ కైలాసమున కేగి పరమేశ్వర స్తుతి కావించిరి. కాలకాలుడు సహితము దేవతల కష్టనివారణార్థము నిశ్చితుడై, పుత్రహేతువై, శైలపుత్రితో సురతక్రీడ నారంభించెను. కానీ వారిరువురు ఈ

విధముగ మానవ కాలమాన ప్రకారము ముప్పది రెండు సంవత్సరములు క్రీడించినప్పటికీ తృప్తినొందలేదు. పరమేశ్వరునికి వీర్య స్కలనము కాలేదు. కానీ వీరిరువురి మహామైధున క్రీడ చే జగత్తు కంపింపనారంభించి, దేవతలు వ్యాకులులైరి. అంత వారు భయభీతులై సర్వులు పరమేష్ఠి వద్దకు ఏగిరి. సహస్రాక్షుడు ముందునకేగి ఈ విధముగ పలికెను "హే! బ్రహ్మన్! పార్వతీ పరమేశ్వర సంగమము చే జగత్తు కంపించుచున్నది. ఈ ఉత్పాతములను గమనించిన ఎడల వీరికి కలుగు పుత్రుడు మమ్ములను ధిక్కరించి, ఈ తారకుని కంటె భయంకరుడై మాకుత్పీడనము కావించునని భయము కలుగుచున్నది. అందువలన ఈ మహోత్పాతము నుండి మమ్ము కాపాడవలసినది." అంత పరమేష్ఠి "పరమేశ్వరుని తేజము ఉమాగర్భము నుండి ఆవిర్భవించిన ఎడల ఆ మహాభూతము యొక్క పరాక్రమము ముందు దేవతలందరూ దిగదుడుపే! ఏదేని ఉపాయము చే శివవీర్యము పార్వతీ గర్భమందు ప్రవేశింపకుండ, అదే విధముగ ఆ తేజో ప్రభావము చే తారకాసురుడు నాశనమయి, ఏకకాలమున రెండు కార్యములు సఫలమగు రీతిని పరిష్కరించెదను " అని బ్రహ్మ దేవతా సహితుడై కైలాసమందలి పార్వతీ పరమేశ్వర క్రీడా మందిరము వద్ద కేతెంచి ఈ విధముగ స్తుతించెను.

"ఓ! కాలకాలా! జన్మరహితా! ఎవరి హృదయమునందు కామము అలజడి  కల్పించదో, ఎవరి రతిక్రీడ విలాసార్థముకాదో, ఎవరు కేవలము లోకహితార్థము పత్నీ పరిగ్రహణము కావించెనో, ఆ త్రయంబకునికి నేను భక్తితో ప్రణామములర్పించు చున్నాను. కామదేవుడు లేకున్ననూ ఎవని యందు కాముని అనుచరవర్గము ఆశ్రయము నొందునో, ఎవరు హిరణ్యరూప, హిరణ్యబాహు, హిరణ్యరేతసుడో, ఎవరు సంహార కర్తయో, ఆ మహాదేవుడు మమ్ము అనుగ్రహించు గాక! సాక్షాత్ విష్ణుమాయ, జగన్మయి, యోగనిద్ర ఎవని పత్నియో, ఎవని పంచముఖముల నుండి పంచభూతములుద్భవించినవో, ఎవరు జగత్తు నందు ప్రధాన పురుషుడు అని పేర్కొనబడునో, ఎవరు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన ముఖాన్వితుడో, ఆ మహానుభావునికి వందనములర్పించుచున్నాను. ఎవరు మంగళ, అమంగళ స్వరూపుడయి భక్త జనులకు మంగళ స్వరూపుని గనూ, దుష్టులకు అమంగళ స్వరూపునిగనూ వ్యక్తమగునో, ఎవరు త్రిమూర్త్యాత్మకమై, సృష్టి, స్థితి, సంహార క్రియలాచరించు చుండునో, ఎవరు మృగ, ఖట్వాంగ, శూలధారియో, ఎవరు సర్వ శక్తిమంతుడో, అగ్నిరూపుడో, ఆ దివ్య రూపునకు ప్రణామములర్పించుచున్నాను. ఎవరు దుర్గుణనాశియో, సర్పధారియో, సకల బ్రహ్మాండదర్పహారియై, సర్వ లోకములను నియంత్రించుచున్నాడో, ఆ మహామహునికి ప్రణామములర్పించుచున్నాను. ఎవరు నిత్యుడు, అనంతుడు, నిత్యోత్సాహి, సకలరూపధారి, సకల జీవులయందు లీనమై యుండి, జ్యోతిగా ప్రకాశించుచు కానబడడో, ఎవరు నిరంతర ఆత్మభోగరతుడో, ఆ భర్గుడు, ఉమాపతి, గిరీశుడు, మంగళవర్ధనుడు, మహామాయాధారి, మహాదేవుడు, జగత్పిత, నిత్యశాంత స్వరూపుడు అయిన శివునకు మరల మరల సాంజలి బంధకముగ సాష్టాంగ దండ ప్రణామము లాచరించుచున్నాము."

మహామాయతో దివ్యసురతక్రీడ యందు అత్యంత ఆనందముననుభవించుచున్న మహాదేవుడు ఈ ప్రార్ధనను లీలామాత్రముగ ఆలకించి, సురత క్రీడను త్యజించి, వెలుపలికేతెంచి, బ్రహ్మాదులను గాంచి ఇట్లనియె "సురప్రముఖులారా! మీ రాకకు కారణమేమి?" అంత ఇంద్రాది దేవతలు "మహాదేవా! మీ మహాసురత క్రీడచే లోకములు, శైల కానన సహిత అయిన ధరిత్రి, కంపితములై, నదీ నద సాగరములు క్షోభించుచున్నవి. దేవగణములు, దిక్పాలురు భయభీతులగు చున్నారు. అందువలన మీరు ఈ మహామైధునమును త్యజించి ఆత్మరతులవ ప్రార్ధన." దేవ ప్రముఖుల పలుకులు మహాదేవునికి రుచింపక ఇట్లనియె "సుర ప్రముఖులారా! నా మహామైధున కార్యము మీ హితార్ధమునకే! కేవల రతి సంగమము చే ఉమా గర్భము నుండి పుత్రోత్పత్తి జరుగదు. అంతేకాక ఉమాగర్భ సంభూతుని చే శత్రు సంహారము కావింపబడి దేవతా ఉద్ధరణ జరుగును. అందువలన మీరు భయరహితులై మీమీ స్థానములకు చనవలసినది." అంత దేవగణము "ప్రభూ! ఉమాగర్భము నందు పుత్రుడు జన్మింపక పోయిననూ సరే! ఈ మహామైధున కార్యమును ఆపవలసినది."

అంత వృషధ్వజుడు దేవతల అభ్యర్ధనపై మహామైధున క్రియను ఆసి ఇట్లనియె "సురగణములారా! ఇప్పటి వరకు జరిగిన మైధున క్రియ చే నా రేతస్సు పతనమునకు సిద్ధమయినది. అందువలన ఎవరేని వికార రహితుడు, నిష్కాముడు, అయిన తేజోపురుషుని నా వద్దకు తీసికొని రావలసినది. ఆ తేజోమూర్తికి నా తేజస్సును దానమొనర్చెదను."

తదనంతరము దేవతలు మంత్రాంగమొనరించి, అగ్నిహోత్రుడే ఈ కార్యమునకు సమర్ధుదని నిర్ణయించి వీతిహోత్రుని కాలకాలుని ముందుంచిరి. అంత భర్గ భగవానుడు, మహా మహితాన్వితమయిన స్వకీయ తేజస్సును బ్రహ్మాండ దాహక శక్తి యందు నిక్షేపించెను. ఆ సమయమున పరమేశ్వరుని రేతస్సు నుండి రెండు పరమాణువులు పర్వత శిఖరముపై పడినవి. ఆ రెండు పరమాణువుల నుండి ఇరువురు మహా తేజస్వులయిన పుత్రులు ఉదయించిరి. అందు ప్రధముడు తుమ్మెదల వంటి నల్లని వర్ణము వాడు. పరమేష్ఠి వానికి "భృంగి" అని నామధేయము నొసంగెను. ద్వితీయుడు కాలాంజన సమానుడు. అందువలన బ్రహ్మ ఆతనికి మహాకాలుడు అను నామమిడెను. వారిరువురు తొలుత ప్రమధుల చే పెంచబడి తదుపరి ఉమాదేవి యొక్క ప్రేమ చే పెరిగి పెద్దవారయిరి. అనంతరము పార్వతీ పరమేశ్వరులు వారిరువురికి గణాధిపత్యము నొసంగి వారిని తమ ద్వారపాలురు గావించిరి.

అంత సగరుడు "మహర్షీ! అగ్ని యందు విడువబడిన శివరేతస్సు ఏమయినది? అద్దానిని గూర్చి వినవలెనని నాకు అత్యంత కుతూహలముగ యున్నది." ఔర్వుడు అగ్ని యందు తేజమును విడచి శంభుడు దేవతలతో ఇట్లనియె "సుర ప్రముఖులారా! ఈ నా తేజస్సును యోగమాయ అయిన శైలజ తప్ప వేరొకరు భరించలేరు. కానీ ఈ ఆకాశగంగ శైలజకు సోదరి. అందువలన అగ్ని తన ప్రభావము చే ఈ రేతస్సును గంగ యందు ప్రవేశపెట్టిన ఎడల, అనుపమ తేజో సంపన్నుడు, శత్రునాశకుడయిన సుపుత్రుడు ఉత్పన్నుడగును. అతడు తన అప్రతిహత మహావీర్యము చే దేవసేనాపతియై, మీ అందరి సమక్షములో తారకుని సంహరించి మీకందరకు విమోచనము కలిగించును." ఈ విధముగ పలికి దేవతలందరినీ తిరిగి యధాస్థానములకంపి, తిరిగి వెనుకకు వెళ్ళి, జరిగిన విషయములన్నియు పార్వతీదేవికి ఎరింగించెను. విషయమును వినిన పార్వతీదేవి తొలుత హతాశురాలై, తాను తల్లియగు భాగ్యమునకు నోచనని తెలిసి, కొంత తడవు మౌనము వహించి, సంభాళించుకొని, తిరిగి క్రోధానల జ్వాలాతప్తయై, పెదవులదురుచుండగా, కన్నుల రక్తవర్ణములై, శంభుని కాంచుచూ దేవతల పట్ల ఇట్లనియె "దేవతలారా! మీరు సురత కార్యమందు శంభుని నానుండి వేరుపరచి నన్ను గొడ్రాలిని చేసిరి. ఈనాటి నుండి మీరును మైధున భ్రష్టులగుదురు. దేవతల భార్యలందరూ నా వలెనే పుత్రోత్పత్తి నందక గొడ్రాలు లగుదరు. నేను పుత్రలేమి చే ఎట్లు పరితాపము నొందుచుంటినో అట్లే మీమీ పత్నులందరూ పుత్రలేమి చే పరితాపము నొందెదరు గాక! "ఈ విధముగ శాపము నొందుట చే, అప్పటి నుండి దేవతలెవరూ పుత్రోత్పత్తికి నోచరైరి.

కాలక్రమమున కుతవాహుడు (అగ్ని) స్వర్ణసన్నిభ శంభు తేజస్సును గంగ యందు విడచెను. గంగ తగిన సమయము గడచిన పిదప ఇరువురు పుత్రులకు జన్మనిచ్చెను. వారి యందు ప్రధముడు స్కంధుడు, మరియు ద్వితీయుడు విశాఖుడు. వారిరువురు పరమ మనోహరులు మరియు కాంతియుతులు. కొంత సమయమునకు వారిరువురు ఒక్కటై, ఒక్క శిశువు వలె రూపాంతరము చెందిరి. గంగాదేవి ఆ బాలుని శరవణ వనమందు విడచి, విషయమును బహుళాదేవికి తెలిపెను. బహుళ కొన్నినాళ్ళు ఆ బాలుని ఆలన పాలన చూచి, తుదకు పార్వతీ పరమేశ్వరుల వద్దకేతెంచి, సర్వము నివేదించి, పార్వతీ కరద్వయము నందు ఆ బాలుని సమర్పించెను. స్కంధుడు పార్వతీ పరమేశ్వరుల ప్రేమను పూర్ణముగ చూరకొని, మహా పరాక్రమశాలియై, దేవసేనాపతియై, తారకుని ఆతని సేనా సహితముగ నిర్జించెను. ఇయ్యది స్కంధ జనన రహస్యము. ఇపుడు మిగిలిన భేతాళ, మహాకాల చరిత్రమును వినిపించెదను సావధానులై వినవలసినది."

**(శ్రీ కాళికా పురాణమందలి భేతాళ భైరవోపాఖ్యానమను నలుబది ఆరవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది ఏడవ అధ్యాయము

**(భృంగి, మహాకాల శాపప్రాప్తి; చంద్రశేఖర చరిత్ర)**

ఔర్వుడు "దేవతల విన్నపము చే శంభుడు పార్వతీ దేవి తో మహామైథునము నందు పాల్గొనకపోయినప్పటికీ, ఆమెను సంతృప్తి పరచుటకు సమయాను సారముగ కేవల రతికేళి సలుపుచుండెను. ఒకానొకనాడు పార్వతీ పరమేశ్వరులు వ్యంగ్య, హాస్య, చతురోక్తులాడుచూ, మదనమందిరమున ఉపవిష్టులై యుండిరి. ఆ సమయమున భృంగి, మహాకాలురు ద్వార రక్షణ కావించుచుండిరి. అభ్యంతరమందిరమందు శివ, శివానిలు ఇరువురు మోహ పారవశ్యముతో రతి క్రీడలు సలిపి అలసి సొలసి పోయిరి. ఆ కారణమున పార్వతీదేవి కేశపాశము విడివడినది. వస్త్రములు వదులయినవి. హారములు గతి తప్పినవి. ధరించిన పుష్పములు శోభాహీనములైనవి. అలదిన కుంకుమాది అంగరాగములు లుప్తమయినవి. అధరములందు దంతఘాతముల చిహ్నములు ఉత్పన్నమయినవి. నేత్రములు మదఘూర్ణితములై, లలాటము స్వేదయుక్తమై, మనసున సంపూర్ణ మదమోహితయై, తరుణ శరీరము మరుని శరజాలము చే ఛిద్రమై, కేవలము శంభుడు కాక మరే పరపురుషుని ఆమె కాంచుటకు సంసిద్ధత లేని సమయమున, ఆమె కాల వశమున ఆ మదనమందిరమునుండి బయటకు ఏతెంచెను. ఆ సమయమున ద్వారపాలురయిన భృంగి, మహాకాలురు ఆ తల్లిని చూచి, అత్యంత దీన భావము వహించి, అవనిత శిరస్కులై, చింతాక్రాంతులై, దీర్ఘ నిశ్వాసము విడచిరి.

అంత పార్వతీ దేవి వారిరువురినీ చూచి "మీరు పుత్రులయినప్పటికీ, నన్ను చూడకూడని కాలమందు నిర్లజ్జులై చూచుట చేత, మీరిరువురూ మానవ యోనులందు జన్మమంది, వానరముఖులై ప్రవర్తిల్ల వలసినది." భృంగి, మహాకాలురు శాపగ్రస్తులైయ్యునూ ఆ తల్లి సమీపమున కేగి ఖిన్నులై ఇట్లనిరి "మాతా! మేము నిరపరాధులము. సాక్షాత్ శంకర భగవానుడు మమ్ము ద్వారపాలురుగ నియోగించెను. మేము కేవలము మా కర్తవ్యము నిర్వర్తించుచుంటిమి. మీరు అకస్మాత్తుగ అంతరగృహము నుండి బయటకేతెంచి, మమ్ము చూచిరి. ఇందు మా దోషము ఇంచుక లేదు. మీరు మమ్ము వ్యర్ధముగ శపించిరి. కానీ విధి నిర్ణయము, మీ వాక్కు వృధాపోదు. అందువలన జగజ్మాతా పితరులైన మీరిరువురు మానవులుగ జన్మించి, శంభుని తేజము వలన మీ గర్భాన్వితులమై మేమిరువురము జన్మించెదము. ఓ! గిరిరాజనందనీ!! మేము వాస్తవముగ శివపుత్రులము. మా వాక్కు సత్యమగుగాక!" ఈ విధముగ గిరిజా, శివపుత్రులు శాప ప్రతిశాపముల నిచ్చుకొనిరి. ఈ సంఘటన జరిగిన కొన్నినాళ్ళకు సర్వజ్ఞుడయిన ఉమాపతి భవిష్యత్ కార్యమును సాఫల్యమొనరించుటకై ప్రణాళిక రచించెను.

ఒకప్పుడు బ్రహ్మదేవుని కుడి బొటనవ్రేలి నుండి దక్షుడుదయించెను. దక్షుని పుత్రికలందు కడు ఉత్తమరాలు "అదితి". ఆమెకు పూష జన్మించెను. పూష యొక్క పుత్రుడు పౌష్యుడు. ఈ పౌష్యుని వంటి రాజు నభూతో నభవిష్యతి. ఈతడు ఎంతో ధర్మపరుడయినప్పటికీ, ముప్వురు రాణులున్నప్పటికీ, పుత్రహీనుడు. తన అనపత్య దోషముచే మిక్కిలి దు:ఖించి పౌష్యుడు పరమేష్ఠి కొరకై పూజనమాచరించెను. ఆతని పూజకు ప్రసన్నుడై బ్రహ్మ సాక్షాత్కరించి "మహారాజా! నీ పూజచే ప్రసన్నుడనైతిని. నీ మనోభిలాష తెలుపవలసినది." అని పలికెను. అంత పౌష్యుడు "పరమాత్మా! హిరణ్యగర్భా! నేను అనపత్య దోషము చే మిక్కిలి వ్యధితుడనైతిని. అపుత్రకులు పున్నామనరకము నందు పడి అత్యంత క్లేశములు అనుభవించెదరు. అందువలన నాకు సర్వ లక్షణ లక్షితుడైన ఒక సుపుత్రుని ప్రసాదింపవలసినది" అని అత్యంత వినీతుడై, పత్నీ సహితుడై ప్రార్ధించెను. అంత పరమేష్ఠి "పౌష్యా! నేను నీకొక ఫలమును ప్రసాదించెను. ఇది చిరకాలము శిధిలము నొందదు. ఈ రసయుక్తమయిన ఫలమును స్వీకరించి, రెండు సంవత్సరములు మహాదేవుని పత్నీ సహితుడవై,

పరమ ప్రీతి, భక్తితో ఆరాధింపుము. శంభుడు ఆశుతోషుడు. అల్పసంతోషి. ఆయన ప్రసన్నుడై తదితరకార్యమును ఉపదేశించును. ఈ కార్యమును నీవు నీ పత్నీ సహితుడవై ఆచరింపుము, అని పలికి అంతర్హితుడయ్యెను. తదుపరి పౌష్యుడు తన త్రిపత్నీ సహితుడై, కొన్నాళ్ళు నియమితాహారియై, కొన్నాళ్ళు నిరాహారియై, కొన్నాళ్ళు ఫలములు భుజించుచూ, మహాదేవుని అర్ఘ్య, ధూప, దీప నైవేద్యములతో పూజించెను. రెండు వర్షములు గడచిన పిదప జగత్పిత అయిన మహేశుడు సాక్షాత్కరించి "రాజా! నీ ఉపాసన చే ప్రసన్నుడనైతిని. నీ మనోవాంఛితమును కోరుకొనుము"

అంత పౌష్యుడు "మహాదేవా! మహానుభావా! నేను పుత్రహీనుడను. నాకు సర్వ శుభలక్షణ లక్షితుడయిన పుత్రుని ప్రసాదింప వలసినది." అంత శివుడు "రాజా! పరమేష్ఠి ద్వారా నీకీయబడిన ఫలమును మూడు ముక్కలు గావించి, నీ ముగ్గురు రాణులకు పంచి, వారు ఋతుస్నాతలయిన పిదప వారితో సంగమించుము. నీ ముప్వురు రాణులు ఒకేసారి గర్భవతులై ఒకే సమయమున మూడు శిశుభాగములను ప్రసవింతురు. నీవు ఆ మూడింటినీ కలుపుము. అవన్నియు కలసి ఒక అద్వితీయ శిశురూపమును పొందును. ఆ శిశువు శిరముపై స్వాభావికముగ చంద్రరేఖ యుండును. ఆ బాలుడు చంద్రశేఖరుడను నామమున జగద్విఖ్యాతుడగును." ఈ విధముగ పలికి తన గర్భస్థానమును సంస్కరించుటకై శివుడు బ్రహ్మఫలమును తన చేతులలోనికి తీసుకొని, తన శిరముపై యున్న పవిత్ర గంగ చే శుభ్రపరిచి, తాను అందు ప్రవేశించి, ఆ ఫలమును రాజున కిచ్చెను. శంభుడు ఆ ఫలమందు ప్రవేశింపగనే ఆ ఫలము మూడు ముక్కలైనది. అంత మహారాజు మహాదేవునకు పత్నీసహితముగ ప్రదక్షిణ నమస్కృతులాచరించి, ఆ ఫలమును స్వీకరించి, గృహమున కలిగి, ఒక సుముహూర్తమున ఆ ఫలమును తన రాణులచే భుజింప జేసెను. తత్ఫలితముగ ముప్వురు రాణులు గర్భము ధరించి మూడు పిండములను ప్రసవించిరి. మహారాజు ఆ పిండములను ఏకత్వమొనరించగనే అయ్యది ఒక అత్యద్భుత చంద్రరేఖా సహిత సుందర బాలకుని రూపము సంతరించుకొనెను.

ఆ బాలుడు విశాలనేత్రుడు, సుందర నాసికాయుక్తుడు, సింహస్కంధుడు, విశాలవక్షుడు, దీర్ఘ బాహువు. దరిద్రునకు ధనాగారము ప్రాప్తించినటుల రాజు అత్యానంద భరితుడయి, ఆ బాలునికి "చంద్రశేఖరుడ"ని నామకరణమొనర్చెను. ఆతడు శారదీయ శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడయ్యెను. ఆతడు త్రిమాతల గర్భము నుండి ఉద్భవించుట చే "త్రయంబకుడు" అని ప్రసిద్ధి నొందెను. ఆతడు నెమ్మదిగ పెరిగి యుక్త వయస్కుడై బల, వీర్య, తత్వ, శాస్త్ర జ్ఞానములందు విష్ణుతుల్యుడయ్యెను. ఇటువంటి నరశార్దూలుడు భువిని లేడనిన అతిశయోక్తి కాదు. పౌష్యుడు తనకుమారుడు పదిహేనేండ్ల వయసుకు సమస్త జ్ఞాన సంపన్నుడై, సర్వవిద్యా విశారదుడగుట గమనించి, ఆతనికి రాజ్య పట్టాభిషేకము చేసి, తన ముప్వురు రాణులతో వృద్ధ కాలోచిత కార్య కర్మానుష్ఠానమునకై, వానప్రస్థుడై, కాననములకు చనెను. తదుపరి చంద్రశేఖరుడు మంత్రుల సహితుడై, సర్వ రాజ్యములను జయించి సార్వభౌముడై త్రయంబకుడు, చంద్రశేఖరుడు దృషద్వతీనదీ తీరమునున్న కరవీరపురమందు నివసించుచూ అత్యానందము నందుచుండెను. కాలచక్రము తిరుగుచుండెను.

ఒకనాడు త్రయంబకుడు తన మాతా పితరులను సందర్శించవలెనన్న కోరిక తీవ్రమై, ఏకాకియై రథమధిరోహించి, ధనుర్బాణములు ధరించి, విషయవాసనారహితమయిన తపోవనము చేరెను. ఆ సమయమున ఒక విచిత్రము జరిగెను. త్రయంబకుడు మార్గమధ్యమున తపోభూములను అవలోకించుచుండగా ఆయన దృష్టి "నముచి" అను దివ్యముని పై బడెను. ఆ ఋషి మృగ చర్మధారియై, జటాజూటము ధరించి, కృశించిన కాయము కలవాడై, సూర్యమండలాంతర్గత తేజశ్శాలియై ఒప్పెను. చంద్రశేఖరుడు ఆ ఋషి వద్ద కేగి, దగ్గర నిలబడి, అత్యంత వినయ వంతుడై ఈ విధముగ స్తుతించెను "మహానుభావా! నేను రాజర్షి పౌష్యుని పుత్రుడను. చంద్రశేఖర నామధేయుడను. మీకు సాష్టాంగ దండ ప్రణామములాచరించు చున్నాను." అంత ఆ రాజశేఖరుడు పలుకులు చాలించి, అవనిత శిరస్కుడై, మిక్కిలి భక్తియుతుడై, ఆ ఋషి పాదముల వద్ద కూర్చొనెను అంతకుమందు పౌష్యరాజు తన పత్నీ సహితుడై తపోస్థలికేతెంచినపుడు ఈ ముని

సందర్శనము చేసి ఆయనను ఈ విధముగ ప్రార్థించెను "మహానుభావా! మీరు విషరూప విషయవాసనలను విసర్జించి ఈ కఠోర తపమాచరించుచున్నారు. మీకు నా యందు ప్రసన్నత యున్న ఎడల నాకు ఒక వరము ప్రసాదింప వలసినది. మునీశ్వరా! నేడు ఈ రాజ్యమునకు నా సుపుత్రుడు చంద్రశేఖరుడు రాజు. స్వాభావికముగ శిరముపై చంద్రరేఖాయుక్తుడు. బాలుడు కావున చంచలచిత్తుడు. ఎపుడయిననూ ఆతడు మీ ఎడల అవజ్ఞుడై, అపరాధము కావించిన ఎడల వానిని క్షమింప వలసినది". పౌష్యుని ప్రార్థనను ఆ ముని నముచి స్వీకరించెను.

ఆయన తన ధ్యానమయిన పిదప కనులు తెరచి, అత్యంత వినీతుడై, అవనిత శిరస్కుడై యున్న రాజును గాంచి, చంద్రరేఖను చూచి ఆతడు పౌష్యపుత్రుడని నిర్ధారించుకొని ఇట్లనియె "చంద్రశేఖరా! నీ వినయశీలత, స్వభావ సంపత్తి, నన్ను అత్యంత ప్రసన్నుని కావించినవి. ఏదేని మనోవాంఛ యున్న ఎడల కోరుకొనవలసినది. అద్దానిని వెంటనే నెరవేర్చెదను." అంత త్రయంబకుడు "ఓ! ద్విజప్రవరా! శరీర మనో వాక్యాదుల ద్వారా పొందదగిన వన్నియు మీ దయవలన నా వద్ద అనుకూలమై యున్నవి. మీరు స్వయముగ నాకు ప్రతిగ్రహణకు పనికివచ్చు సద్వస్తువు/వరము ఏదయిననూ ప్రసాదింపవలసినది." అంత నముచి చిరునవ్వు నవ్వి "రాజా! నీవు ప్రస్తుతము పదిహేనేండ్ల బాలుడవు. ఒక్క వర్షము గడచిన పిమ్మట నీకు ఒక ఉత్కృష్ట స్త్రీ పత్నీ రూపముగ ప్రాప్తించును. ఆమె గిరిపుత్రి అయిన పార్వతి శంకరుని, సాగరపుత్రి లక్ష్మీదేవి నారాయణుని, భృగు పుత్రి శచీదేవి ఇంద్రుని అలరించి, అనుసరించినటుల నిన్ను అనుగమించును''. ఈ విధముగ పలికి నముచి త్రయంబకునకు వీడ్కోలు పలికెను. తదుపరి మహారాజు కాననాంతరమునకేగి, తన మాతా పితరుల సందర్శించి, యధాయోగ్యమయిన పూజనమొనర్చి, వారిని ఆశ్వాశించి, వారిచే ఆశీర్వదింపబడి, కొన్ని దినములయిన పిదప తిరిగి తన రాజధాని అయిన కరవీరపురమున కేతెంచి, సచివ సహితుడై, రాజ్యమును సమర్ధవంతముగ ఏలుచూ వజ్రపాణి వలె వెలుగొందుచుండెను.

**(శ్రీ కాళికా పురాణమందలి చంద్రశేఖర చరితమను నలుబది ఏడవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది ఎనిమిదవ అధ్యాయము

**(చంద్రశేఖర పరిణయము)**

ఔర్వ మహర్షి "మహాదేవుడు స్వేచ్ఛాపూర్వకముగ పౌష్యరాజపత్నుల గర్భము నుండి ఆవిర్భవించిన రెండు సంవత్సరముల అనంతరము ఇక్ష్వాకు వంశజుడయిన కకుత్స మహారాజునకు గిరిజాదేవి పుత్రికగ జన్మించెను. ఆర్యావర్తాంతర్గతమయిన భోగవతీ నగరమును రాజధానిగ చేసికుని అతి ధార్మికుడు, శత్రుభయంకరుడు, బ్రాహ్మణ ప్రియుడు, సర్వ రాజలక్షణ లక్షితుడు, రాజలోకమునకు తలమానికము వంటి మహారాజు కకుత్సుడు రాజ్యపాలనము కావించుచుండెను. ఆయన ప్రియసతి మహారాణి మనోన్మధని. వారికి మహాబలులయిన నూర్గురు పుత్రులుదయించిరి. అంత రాణి తన ఏకాంత స్థలమందు చండికాదేవిని ఆరాధించెను. ఈ విధముగ మూడు సంవత్సరములు గడచిన పిమ్మట చండికాదేవి ప్రసన్నురాలై, స్వప్నమునందు సాక్షాత్కరించి సర్వ శుభలక్షణ లక్షిత అయిన ఒక కన్యక జన్మించునని వరము నిచ్చెను. మహారాణి సంతసించి తన గృహమున కేగెను. తదుపరి ఋతుస్నాతయై, పతి సంగమము చే చంద్రకళిక వంటి పూబోడికి జన్మనిచ్చెను. ఆ కన్యకకు "నక్షత్రమాలిని" అని నామకరణము చేసిరి. ఈ కన్య సహజ రత్నహార శోభితయై జన్మించెను. అందువలన తండ్రి ముద్దుగ "తారావతి" అని పిలిచెడివాడు. శరత్కాల చంద్రిక వంటి తారావతి ఆ మహా రాజగృహమున వర్షాకాల గంగానది వలె పెరిగి పెద్దదయినది. క్రమక్రమముగ బాల్య చిహ్నములంతరించి,

యవ్వన చిహ్నములంకురించినవి. ఆ సమయమున ఆ వరవర్ణిని మనోహారిణి లక్ష్మీదేవి వంటి శోభ, సతీదేవి వంటి శుద్ధత, దయ, శాంతుల యందు సుశీల, మరియు పార్వతీదేవి వంటి చారిత్రము కలిగి యుండెను. కకుత్సుడు తన పుత్రిక యవ్వనవతి అగుట గమనించి, తన పుత్రులతో చర్చించి, చివరకు స్వయంవరము ప్రకటించెను.

కకుత్సు మహారాజు వైశాఖమాస ప్రారంభమున స్వయంవరము ప్రకటించి, అంతకుమునుపే వేగవంతులయిన దూతలచే సర్వరాజనీకమునకు ఈ విషయము నెరుకజేసెను. ఆనాటి రాజనీకమంతయు తారావతి స్వయంవరమున కేతెంచిరి. రాజర్షి పౌష్యుని పుత్రుడయిన త్రయంబకుడు సహితము చతురంగబల సమేతుడై, ఆ స్వయంవరమునకేగి, సభామండపమున ప్రవేశించెను. రాజులందరూ రాజపుత్రులు ఏతెంచుచుండగా తారావతి తనకు అత్యంత ఆంతరంగికురాలు, జ్ఞానశీల అయిన "ధాత్రి" అను వృద్ధదాసిని స్వయంవర మండపమునకేగి మనోహర రూపగుణ యవ్వన సంపన్నుడు, సర్వ శుభలక్షణ లక్షితుడు అయిన రాజ కుమారుని గూర్చి తెలిసికొని రమ్మని పంపెను. తదుపరి తారావతి తన తల్లి చండికాదేవిని పూజించిన స్థలమున కేతెంచి చండికను అర్చించెను. మనుష్యభావము సంపూర్ణముగ యుండుట చే తారావతి తన స్వస్వరూపమును మరచి ఇట్లనియె "ఓ! జగన్మయీ! జగన్మాతా! నన్ను పుత్రికగా పొందుటకు నా తల్లి నిన్ను ప్రార్థించినది. ఆ సత్య ప్రభావము చే నేటి స్వయంవరము నందు నాకు ఉత్తమ పుణ్యపురుషుని పతిగా ప్రాప్తి నొందింపుము. అమ్మా! భక్తవత్సలా! చండికా! యోగనిద్రా! నా యందు ప్రసన్నురాలివి కమ్ము! నాయందు ప్రసన్నురాలివి కమ్ము!!

అంత హరమోహిని అయిన చండిక రాజపుత్రికను వాస్తావాస్తవములు తెలియకుండ మోహితురాలిని గావించి, తన వాస్తవికను గుప్తపరచి, అదృశ్యరూపిణియై ఇట్లు పలికెను "రాజపుత్రీ! పౌష్య రాజపుత్రుడయిన చంద్రశేఖరుడు గుణరూప సౌందర్యములయందు నీకు సరిజోడి. అతని శిరమందు చంద్రవంక యుండును. గిరికన్య వృషభధ్వజుని వరించినట్లు నీవు ఆ త్రయంబకుని వరింపుము." ఈ విధముగ పలికి పార్వతీదేవి మౌనము వహించెను. రాజపుత్రి సహితము పార్వతీదేవికి మనసునందే వందనములిడి, తన తల్లి యొక్క ఆజ్ఞను అనుసరించి మంగళగృహమందు ప్రవేశించెను. అదే సమయమున అజ్ఞాతముగ స్వయంవర మండపమున కేగిన ధాత్రి సహితము అచటకేతెంచి, రాజపుత్రిక ప్రశ్నించిన మీదట ఈ విధముగ పలికెను. "యువరాణీ! మీకు యుక్తమయిన మనోహర రూప సంపన్నులు, శాస్త్ర పారంగతులు అయిన రాజులను చూచితిని. కానీ వారందరిలో నలుగురు అత్యాధికులై యున్నారు. వారిలో ఇరువురు అశ్వనీ దేవతలు, దేవ వైద్యులు. ఇరువరు మనుష్యులు. దేవతలయిన అశ్వనీకుమారుల గుర్చి ఏమని తెలుపుదుము? మిగిలిన ఇరువురు మానవ రాజన్యులందు ఒకరు "సర్వాంగ కళ్యాణుడు", మరియొకరు "చంద్రశేఖరుడు". వీరిరువురు అశ్వనీ దేవతలకు ఏమాత్రము తీసిపోరు. ఈ రాజన్యులిరువురు రూప శరీరలావణ్యముల యందు తుల్యులు. మహావీరులు, మహాబలులు, సింహస్కంధులు, విశాలవక్షులు, సర్వలక్షణ లక్షితులు. వీరిరువురిలో చంద్రశేఖరుడు మిన్న. ఎందుకనగా సర్వాంగకళ్యాణుడు సపత్నీకుడు. అంతేకాక చంద్రశేఖరుడు సుశీలుడు, సత్యవాక్పరిపాలకుడు, సర్వశాస్త్ర పారంగతుడు. ఇంచుక రోమావళి తో కూడిన ఆతని ముఖము మృగాంకిత చంద్రబింబము వలె శోభించుచున్నది. ప్రదీప్తమయిన చంద్రరేఖ ఆతని శిరమున వెలుగుచున్నది. అందువలన ఆతడు నీకన్నివిధములుగ యోగ్యుడయిన పతి అని నాకు తోచుచున్నది. శిరశ్చంద్రరేఖను ఆనమాలుగ పెట్టుకొని ఆ మహారాజును వరింపవలసినది. అంత తారావతి "ధాత్రీ! నీవు నా ప్రక్కనేయుండి ఆ మంగళస్వరూపుని దర్శనము కావింప వలసినది."

ఈ విధముగ ధాత్రి, తారావతి మంతనములాడుచుండగా కకుత్స మహారాజు తన కన్యను సభాస్థలికి తీసికొని వెళ్ళుటకు ఏతెంచెను. అంతకు పూర్వమే ముత్తైదువలు తారావతి చే వివాహోచిత మంగళాచరణ కృత్యములు ఆచరింపజేసిరి. అంత కకుత్సుడు గంధపుష్ప మాల తన తనయకిచ్చి, ఒక్క క్షణమాగి తన తనూజతో ఇట్లనియె "పుత్రీ! నీవు స్వయంవర

మండపమునకేగి, ఏదేని శ్రేష్ఠ రాజన్యుని గానీ, బ్రాహ్మణుని గానీ పతిగా వరింపవలసినది.” ఈ విధముగ పలికి బలవంతులయిన శ్రేష్ఠ పురుషులు మోయు పల్లకి యందు ఆమెను కూర్చుండబెట్టి సభాస్థలికంపెను. ఆసభాస్థలి యందు ఇంద్రాది దేవతలు, దిక్పాలురు సహితము ఆశీనులైయుండిరి. తారావతి పల్లకీ దిగి, ధాత్రీ సహితురాలై, సభాస్థలి కేతెంచి, సభ అంతటినీ ఒక్క మారు కలియజూసి, చండికాదేవిని ప్రార్థించి, ఆమె కృపచే, గజగమనయై చంద్రశేఖరుని చేరి ఆయన గళమందు వరమాల వైచెను. మరుక్షణము బ్రాహ్మణులందరూ ఏకత్రమై, సామవేదసహితమయిన వివాహక్రతువును పూర్ణము చేసిరి. గాయకులు సుమధురగానము, వైతాళికులు ప్రశంశలు కావించుచుండగా, వాద్యకారులు వివిధ వాద్యములతో అలరించిరి. దేవగణములు అత్యంత ఆనందమునందిరి. కకుత్సరాజదంపతి హృదయసంతుష్ఠి నొందిరి. సుబాహు మొదలగు నృపతులు క్రోధితులైరి. కానీ అనన్య సామాన్య పరాక్రమోపేతుడయిన చంద్రశేఖరుడు వారి మదమును సత్వరము సంపూర్ణముగ అణచెను. దేవతలు యధాస్థానములకు చనిరి. ఇతర భూపతులు కకుత్సుని చే సత్కరింపబడి తమతమ రాజ్యములకేగిరి.

చంద్రశేఖరుడు కకుత్సుని అనుమతి గైకొని దైవజ్ఞులయిన బ్రాహ్మణుల ద్వారా తిరిగి వివాహ సంస్కారములు కావించుకొని, దేవఋణము తీరుటకై యజ్ఞము చేసెను. తదనంతరము తిరిగి కరవీరపురము కేగుటకు ఉపక్రమించెను. ఆ సమయమున కకుత్సుడు ఇరువది ఎనిమిది వేల దాస దాసీ జనమును, అరువది వేల గోవులను, అత్యంత ధన సంపత్తిని ప్రదానము చేసెను. కకుత్సునకు “చిత్రాంగద” అని మరియొక పుత్రిక కలదు. ఆమె ఈ దాసదాసీమణులకు అధీశ్వరియై, తన అక్కగారయిన తారావతికి సహాయార్ధము చనియెను. విశ్వావసువను కకుత్సరాజ జేష్ఠ తనయుడు ఒక వేగవంతమయిన రధమధిరోహించి, నవదంపతితో కరవీరపురము వరకు ఏగి వారిని వీడ్కొనెను. నృపశ్రేష్ఠుడయిన చంద్రశేఖరుడు రమణీయమయిన కరవీరపురమందు తారావతీ సహితుడై అనన్య భోగములు అనుభవించుచుండెను. ఈ విధముగ జగన్మాతాపితరులయిన పార్వతీ పరమేశ్వరులు తారావతీ చంద్రశేఖరులుగ మానుషలీలా ప్రదర్శనము చేయదొడంగిరి. ఇపుడు భృంగీ, మహాకాలుల జననము గూర్తి వినవలసినది.”

**(శ్రీ కాళికా పురాణమందలి తారావతీ చంద్రశేఖర పరిణయమను నలుబది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము)**

# నలుబది తొమ్మిదవ అధ్యాయము

**(భేతాళ, భైరవ జన్మ వర్ణనము, ఋషి దర్శనము)**

కాలచక్రము తిరుగుచున్నది. కొన్నాళ్ళు పోయిన పిదప మహారాణి తారావతి పుణ్యస్త్రీ సహితయై, శీతల మనోహర జలయుక్తము, వివిధ పాపరాశిని దగ్ధమొనర్పగల పుణ్య సరిత దృషద్వతి యందు స్నానమాచరించుటకు వెడలెను. ఆ సమయమున స్నానాదికములు కావించుట కై సగశరీరము నీళ్ళలో యున్న కపోతమహర్షి స్వర్ణగౌరాంగి అయిన తారావతిని కాంచెను. ఆయన చాలాకాలము క్రితమే ప్రాణులను వధించకూడదని నిర్ణయించుకొని, ఒక పావురము రూపు ధరించి తిరుగుచుండుట చే సర్వులు ఆయనను కపోతముని అని పిలువదొడంగిరి. కపోతముని శరత్కాల చంద్రిక వంటి మనోహరి తారావతిని కాంచి, మోహ పరవశుడై, ఆమెతో సంభోగ సుఖమునపేక్షించి, ఆమె వద్దకేతెంచి ఇట్లనియె “ఓ! దేవీ! నీవెవరి కన్యకవు? ఈ నిర్జనారణ్యమునందు నదీస్నానమునకు ఏల ఏతెంచితివి? నీ ముఖము చంద్రబింబమును తలపించుచూ, రూపము మనోహరమై ఆహ్లాదము కలిగించుచున్నది. నీ నయనద్వయము వాయువుచే కంపించుచున్న

పద్మదళముల వలె, నాసిక తిలపుష్పము వలె, బాహుయుగళి సుగోళాకృతినున్న తామరతూండ్లవలె, ఊరువులు ఏనుగు తొండముల వలె, నీ సన్నని నడుము యజ్ఞవేది వలె ఒప్పారుచున్నది. నీ సుమనోహర రూపము చే నీవు దేవ, దానవ అప్సరో భామవు అయివుండవచ్చు; లేక భోగ్యవస్తు భోగము కొరకు భువికేతెంచిన లక్ష్మీ, పార్వతి లేక శచీదేవివి అయివుండవచ్చు. నీ వెవరివో నాకు తెలియజెప్పుము."

తారావతి ఆ ముని పలుకులు విని, జలములనుండి బయల్వెడలి, ఆయనకు ప్రణామములర్పించి, "స్వామీ! నేను కకుత్స రాజ పుత్రికను. తారావతి నామధేయను. మహారాజు చంద్రశేఖరుని ధర్మపత్నిని. నేను మీరనుకొనినట్లు దేవ, దానవ, అప్సర స్త్రీని కాను. నేను కేవలము మానవ స్త్రీని. రాజపుత్రికను. పతివ్రతా ధర్మము నాచరించుట నా కర్తవ్యము." అంత కపోతుడు "ఓ! దేవీ! నేను నిన్ను చూచినప్పటినుండి కాముడు నా సర్వమును దహించుచున్నాడు. నాకు తాపశాంతిని కలిగించుటకు నీవే సమర్ధురాలివి. ఓ! మహాభాగా! నా వలన నీకు ఇరువురు మహాబలులయిన పుత్రులు కలుగుదురు." అది వినిన తారావతికి ఏక కాలమున భయము, దు:ఖము కలిగినవి. ఆమె వ్యాకుల చిత్తయై "స్వామీ! నేను పరమ పతివ్రతను. నాచే ఈ నిందాకార్యము చేయతగదు. మీరు నాచే నమస్కార యోగ్యులు. అందువలన ఇటువంటి పలుకులు పలుకవలదు. మీరు సర్వసంగ పరిత్యాగులయిన మునులు. లోకము గర్హించునది, తపోక్షయము కలిగించునది, మరియు పాతివ్రత్యమును నాశనమొనర్చునది అయిన ఈ దుష్కార్యము చేయుట ఉచితము కాదు. అంత కపోతుడు మోహావేశమున "ఓ! శుభాంగీ! నా తపోక్షయమయిననూ, ఈ కార్యము దోషప్రదము అయిననూ, నీతో సురత క్రీడ జరుపవలెనన్న కోరిక నాకు ఇనుమడించుచున్నది. అందువలన నా కామక్రీడను నివారించుటఏ నీ కర్తవ్యము. ఓ! మనోహరీ! నీవు నా దరికి రాకున్న నేను నిశ్చయముగ కామాగ్ని యందు దగ్ధుడనగుదును. అంతకు మున్ను నిన్ను, నీ బంధువర్గమంతటినీ శాపాగ్ని చే దగ్ధమొనరించెదను.

మహారాణి తారావతి ఈ క్లిష్ఠ పరిస్థితి చే నిరుత్తరయై, ఒక్క క్షణము యోచించి ఇట్లనియె "ఓ! మహామునీ! ఒక్క క్షణము తాళవలసినది. నేను చెలులతో సంభాషించెదను." అని వెనుకకు వచ్చి చిత్రాంగదతో ఇట్లనియె "చిత్రాంగదా! ఈ ముని నాతో సంభోగమునపేక్షించు చున్నాడు. లేని ఎడల బంధువర్గము సహితముగ నన్ను శాపాగ్ని యందు భస్మమొనరింపనున్నాడు. నాకు ఈ మునితో సంభోగేచ్ఛ లేదు. నా శీలము చెడకుండా ఈ ఆపద నుండి ఎట్లు కాపాడుకోవలెను. అంత చిత్రాంగద "ఓ! సత్యవాదినీ! భయము వలదు. దీనికి ఒక ఉపాయమున్నది. దీనిచే నీ పాతివ్రత్యము భంగము కాకుండ, ముని శాపము నుండి బయటపడవచ్చు. నీవు మునికి తెలియకుండ, ఒక మనోహర దాసిని వివిధ భూషణముల చే అలంకృతమొనర్చి ముని వద్దకు పంపుము. ఈ ముని కామాతురుడు, మరియు జ్ఞానరహితుడైయుండుట చే ప్రచ్ఛన్న దాసిని నీవే అనుకొనును. నిశాకరుని వెన్నెలచే హరిణము మోహితమైనట్లే, ఈ మునియు కామమోహితుడైనాడు. అంత తారావతి "ఓ! మృగాక్షీ! నా వస్త్ర భూషణముల దాల్చి నీవు ఆ ముని వద్దకు ఏగవలసినది. అన్యులేగిన ఎడల మునికి తెలియవచ్చును. ఇట్లు జరిగిన చే ఆయన మనందరినీ శాపాగ్ని యందు జ్వలింపజేయును. నీవు నా వలెనే యుండుట చే, నా వస్త్ర భూషణ ధారణ చే ముని సందేహింపడు. అందువలన మన కులము నాశనమవ్వదు." ఈ పలుకులు విని చిత్రాంగద ఒక్క క్షణము మౌనము వహించి, తుదకు మనసు కుదుట పరుచుకొని సోదరీ! నీవు మన తండ్రికి, మహారాజు చంద్రశేఖరునికి ఆశ్వాశన మొసంగుము. నా చెలులను కూర్మితో చూడుము," అని పలికి తారావతి యొక్క వస్త్ర భూషణములు దాల్చి కపోతముని కామార్థము చనెను. తారావతి సాధారణ దాసీ దుస్తులు ధరించి వారి నడుమ చిత్రాంగదను అనుసరించి వెడలెను.

కపోతుడు ఏతెంచుచున్న చిత్రాంగదను కాంచి ముగ్ధుడై, ఏ మునులు ఇత:పూర్వము పరస్త్రీ సంభోగమును వాంఛించిరో అద్దానిని తలచుకొనెను. పూర్వము వతండముని పుత్రుడు "ప్రమ్లోచ" అను అప్సరస తో సంభోగము

వాంఛించెను. బుద్ధిమంతుడయిన భరద్వాజుడు "పద్మ" ను వాంఛించెను. అట్లే నేనునూ ఈ వరవర్ణిని తో సంభోగించి, దాని పాపమును తపోబలముతో దగ్ధమొనరించెదను. ఈ విధముగ తలచుచుండగా నెమ్మదిగ చిత్రాంగద ఆయనను చేరి సిగ్గుతో తలవంచుకొనెను. కపోతుడు శృంగారోచిత వేషభాషల కొరకై మదనుని ప్రార్థించెను. తక్షణము మదనుడు ప్రత్యక్షమై ఆయన కోరికను అనుగ్రహించెను. కపోతుడు క్షణములో ఉత్కృష్ఠ వస్త్రధారియై, దివ్యమాల్యాంబరధారియై, మనోహర రూపము ధరించి, రెండవ సూర్యుని వలె దేదీప్యమానముగ వెలుగుచుండెను. ఆ ముని రూపమును కాంచినంతనే తారావతి తక్క మిగిలిన కాంతలందరికీ కామాభిలాష కలిగెను. తారావతి సహితము ద్వితీయ మదనుని వలె ప్రకాశించుచున్న మునిని గాంచి విస్మయమొందెను. తదనంతరము ముని చిత్రాంగద తో కామోపభోగమొంది సద్యోగర్భమున ఇరువురు దేవతుల్యులు, ప్రదీప్త అగ్నిశిఖలవలె వెలుగొందుచున్న పుత్రులను ప్రసాదించెను. పిదప చిత్రాంగదపై మక్కువ తీరక ఆమెను మృదువుగ స్పర్శించి "ప్రియా! నీవు మరి కొన్నాళ్ళు నా వద్ద యుండవలసినది. తదనంతరము నీ ఇష్ఠ ప్రకారము నీవు వెడలిన ఎడల నీకు రాజు భయము కలుగదు." చిత్రాంగద శాపభయము వలన "వల్లె" యని అంగీకరించెను. అంతముని మిగిలిన దాసీ జనులను వెనుకకు తిరిగి వెడలుటకు అనుమతినిచ్చెను. రాణి తారావతి దాసీ సహితయై వెనుకకు తిరిగి, తన సోదరి చిత్రాంగద గూర్చి మిక్కిలి శోకాకులయై, తన భవనమునకేగి జరిగిన వృత్తాంతమంతయు తన పతికి నివేదించెను. మహారాజు ఈ వృత్తాంతమంతయు విని కొంత తడవు యొచించి, కపోత ముని వద్దకేగి, ఆయన అనుమతి తీసికొని చిత్రాంగదకు సహాయము చేయవలెనని తలంచెను. అంత సగరుడు "మహాత్మా! చిత్రాంగద ఏ విధముగ కకుత్స రాజతనయ  అయినది? అద్దానిని వివరింప గోరుచున్నాను, అని పలికెను. ఔర్వుడు "ఒకానొకప్పుడు కకుత్సుడు మృగయా వినోదమునకై హిమాలయసానువులకేగి, అనేక మృగములను వేటాడి, విశ్రామార్థము ఒక తరి కూర్చొండెను. ఆ సమయమున ఆయన నారాయణుని ఊరువు నుండి ఉద్భవించినది, అతిలోక సౌందర్యరాశి అయిన అప్సరోభామ ఊర్వశిని చూచెను. అంత మహారాజు మదన పీడితుడై, ఊర్వశీ సంగమును పొందదలచి ఆమెను ప్రార్థించెను. ఇంద్రతుల్యుడని కకుత్సుని చూచి, ఊర్వశి ఆయన ప్రార్థనను మన్నించి, ఆ గిరిశిఖరమునున్న నికుంజమునందు ఆయనకు సురతానంద సుఖానుభవమునిచ్చెను. తదుపరి ఆ సంగము కారణమున సద్యోగర్భముగ ఊర్వశీ గర్భము నుండి ఒక మనోహర రూప సంపన్న, పుత్రికారూపమున ఉద్భవించెను. కామక్రీడానంతరము ఊర్వశి తన స్వస్థానమయిన స్వర్గమునకు పోదలచెను. అంత కకుత్సుడు "ఓ! శుభాంగీ! ఈ పుత్రికను విడచి నీవు ఎక్కడికేగుదువు? నీవు ఈ పుత్రికను పెంచవలసినది" అని పలికెను. అంత ఊర్వశి "నృపోత్తమా! నేను దేవవేశ్యను. ఈ గర్భాది కారణము చే నా శరీరము వికృతము నొందదు. నా నుండి పుట్టిన పుత్ర లేక పుత్రికల పాలన నేను చేయను. ఇయ్యది నా స్వభావము. ఒకవేళ మీకు ఈమె యందు ప్రేమ, దయ యున్న ఎడల ఈ బాలిక యొక్క పాలన, పోషణ మీరే కావింప వలసినది. ఇది సత్యము" అని పలికి అంతర్హితురాలైయ్యెను. అంత కకుత్సుడు ఆమెకు చిత్రాంగద అను నామమిడి, ఆమెకు తన భార్య అయిన మనోన్మథనికి ఇచ్చి "ఈ సకల సద్గుణ సంపన్న నా కుమార్తె. ఈమె పర్వత శిఖరమున జన్మించినది. ఈమెను నీవు జాగ్రర్తగా పెంచవలసినది. ఈమెను ఎన్నడునూ అవమానింపవలదు."

రాజుయొక్క ఆదేశమును శిరోధార్యముగ ఎంచి, మరి ప్రశ్నింపక మహారాణి ఆమెను తన సొంత కుమార్తెవలె పెంచెను. చిత్రాంగద ఒకనాడు బాల్యచాపల్యము చే అష్టావక్ర మహర్షిని అపహాస్యము చేసెను. అంత ముని ఆగ్రహోదగ్రుడై "ఓ! కకుత్సపుత్రీ! చపలా! నీవు దాసీ జనమునకధిపతివై పుత్రద్వయమును కందువు. అటుపిమ్మట నీకు  దాసీ విమోచనమై మంగళములనొందెదవు." అందువలన చిత్రాంగద దాసీలకు అధిపతియై, తారావతితో ఏతెంచి ఇపుడు కపోతముని ద్వారా పుత్ర ద్వయమునకు తల్లి అయ్యెను. కానీ ఈ పుత్రులిరువురు మహా భాగ్యవంతులు మరియు శూరులు," అని పలికి ఔర్వుడు తిరిగి ముఖ్య విషయము నందు ప్రవేశించెను.

**(శ్రీ కాళికా పురాణమందలి ఋషి దర్శనమను నలుబది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# ఏబదియవ అధ్యాయము

**(చంద్రశేఖరుని ఆత్మసాక్షాత్కారము)**

ఈ విశేషములన్నియు జరిగిన కొంత కాలమునకు సర్వాలంకార భూషిత, మరియు సర్వాంగ సుందరి అయిన తారావతి ఋతుస్నానార్థము రమాది పుణ్యస్త్రీ సహితయై, అనేకమంది పరిచారికలు వెంటరాగా పరమ పవిత్రసరిత అయిన దృషద్వతీ నదీ తీరమున కేగెను. అత్యంత శీతలము, నిర్మలము, శ్యామసలిలయుక్తమయిన దుషద్వతి యందు ప్రవేశించి గౌరాంగశరీర అయిన తారావతి తన విద్యుత్ శరీరకాంతులను నలుదిశలా విరజిమ్ము చుండెను. అదే సమయమున కపోతముని ఆమెను గాంచి, చిత్రాంగదను పిలచి, అనేక మంది పరిచారికా సహిత అయిన ఆ స్త్రీ ఎవరని ప్రశ్నించెను? అంత సాధ్వి అయిన చిత్రాంగద తావావతిని ప్రశంశించి ఇట్లనియె "ఓ! ముని ప్రవరా! ఆమె కకుత్సరాజతనయ మరియు చంద్రశేఖర మహారాజు యొక్క ధర్మపత్ని అయిన తారావతి. ఇత:పూర్వము మీరు ఈమెయందు గాఢానురక్తులయిరి. కానీ తారావతి తన వస్త్రభూషణములను నాకు ధరింపజేసి, నన్ను మీ వద్దకు పంపినది. ఈమె నా అనుంగుసోదరి. తిరిగి స్నానార్థము ఏతెంచినది. దయచేసి ఈమెను మీరు ఏ విధముగానూ శపింపవలదు. మీ అనుమతి అయినచో నేను ఒక్కమారు అచటికేగి నా ప్రియ సోదరితో మాటలాడి తిరిగి వచ్చెదను."

చిత్రాంగద ద్వారా విషయము వినిన కపోతుడు అగ్రహోదగ్రుడై " ఈ పాపిని నా ఎడ ఎంత అధర్మము కావించినది? దీనికి ప్రతీకారము తీర్చుకొనవలె!" అని పలికి చిత్రాంగద సహితుడై నదీతీరమున కేగి వికటముగ నవ్వుచూ ఇట్లనియె "పూర్వము నా ఉపభోగార్థము నిన్ను ప్రార్థించితిని. నీవు మాయలల్లి నన్ను వంచించితివి. ఓ! పాపీ! నా ఎదురుగ నీవు స్వయముగ పతివ్రతనని ఆత్మప్రశంశ కావించుకొని, నన్ను ధర్మనాశకుడని నిందించి, నా యందు అనురక్తి చూపకుంటివి. అందువల్ల ఒక భీభత్స వేషధారి, కురూపి, నిర్ధనుడు, కపాలి, శ్వేతకేశుడు, నిన్ను హఠాత్తుగ అనుభవించును. తత్ఫలితముగ నీ గర్భము నుండి సద్యోగర్భముగ ఇరువురు శిశువులు వానరముఖులు ఉత్పన్నమయ్యెదరు." ఈ శాపమును వినిన మహారాణి తారావతి క్రోధితయై, పెదవులదరుచుండగా ఇట్లనియె "ముని ప్రవరా! నేను నా తల్లికి చండికాదేవి ఆరాధన చే పుట్టినట్లయిన, నాకు నా భర్త అయిన చంద్రశేఖరుని యందు అచంచల భక్తి, ప్రేమ ఉన్న ఎడల, నేను వాస్తవమునకు కకుత్సరాజకన్యకను అయిన ఎడల నన్ను దేవతలు తక్క, మానవ మాత్రులెవరూ కామించలేరు. ఓ! మునిశార్దూలా! నేను నిరంతరము మహాదేవుని పూజన మొనర్చిన ఎడల, ఆ సత్య ప్రభావము చే నన్ను శివుడు తప్ప వేరొకరు స్వప్నమునందు కూడా వాంఛింపలేరు." ఈ విధముగ పలికి మునికి ప్రణామము గావించి, కుపితయై తన గృహమున కరిగెను.

ఈ విధముగ తారావతి వెడలిన పిదప కపోతుడు ఆశ్చర్యచకితుడై యోచించుట మొదలిడెను. "ఏమి ఆశ్చర్యము! ఒక రాచవనిత ఏమి? నా శాపమును ధిక్కరించి, నిర్భయముగ తన అభిప్రాయమును వ్యక్తీకరించి, వెడలినది. దీని యందు ఏదో నిగూఢ రహస్యము, దేవకార్యము, దైవ నిర్ణయము ఉండివుండును," అని తలచి మనసు కుదుట పరచుకొని, ధ్యానమగ్నుడై పూర్వజనిత వృత్తాంతము-పార్వతీశాపము, భృంగీ మహాకాలుర ప్రతిశాపము, సర్వమును గ్రహించి, మౌనియై చిత్రాంగదను తీసికొని తన ఆశ్రమమునకు చని ఆమెను తిరిగి వాత్సల్యముతో ఆదరించెను. తారావతి తన భవనమునకేగి చంద్రశేఖరునకు ఈ వృత్తాంత మంతయు నివేదించెను. అంత పౌష్యనందనుడు కొంత తడవు చింతించి, తదుపరి తన ప్రియపత్నిని ఆశ్వాశించి, పతిసేవ, సర్వదా ధర్మానుష్ఠానము, సత్సంగము, దుస్సంగ పరిత్యాగము చే మునిశాపము శాంతించునని తెలిపి తిరిగి ఇట్లనియె "ప్రియా! నీవు పతివ్రతవు, భాగ్యవతివి,

వ్రతానుష్ఠానపరాయణవు, అంతేకాక దేవగణములకు సహితము కళ్యాణ ప్రదాతవు. అందువలన నీకేవిధమయిన విపత్తు సంభవింపదు." ఈ విధముగ పలికి కరవీరాధిపతి తన పురమందు ఒక మనోహర హర్మ్యమును విశ్వకర్మ చే నిర్మింపజేసెను. అయ్యది నాలుగు వందల వ్యోమముల ఎత్తు, మూడు వందల వ్యోమముల వెడల్పు కలిగి స్పటిక నిర్మితమై, శ్వేత, ఎరుపు, పసుపు, నీలి రత్నములు పొదగబడి, స్థంభములు రత్నమయమై, మెట్లు వైఢూర్యమయమై, అమరావతీ హర్మ్యముల తలదన్నునట్లు అతి రమ్యముగ నిర్మింపబడినది. మహారాజు చంద్రశేఖరుడు తారావతిని అందు ప్రవేశపెట్టి, ఆమె రక్షణార్ధము నలుప్రక్కలా సాయుధులైన వీరులను యుంచి, ఈ విధముగ ఎవ్వరినీ లోనికి పోనీయకుండ కట్టుదిట్టము కావించెను.

నిరంతరము సుందర హాస్య, చతుర సంభాషణలతో ఎల్లరునూ అలరించు తారావతి పతి వియోగము చే ఏకాకియై, ఆ మహా హర్మ్యమందు నిరంతరము పతి చరణములను సంస్మరించుచుండెను. కొన్నాళ్ళకు ఆ పతివ్రతా శిరోమణి తన పతితో పాటు పార్వతీ పార్శ్యమున ఆశీనుడయిన జగత్పిత అయిన నీలకంఠుని పూజింప మొదలిడెను. తదుపరి వారిరువురి తో పాటు త్రిలోకపావని అయిన పార్వతీదేవిని సహితము పూజింపమొదలిడెను. ఈ విధముగ పూజ కావించుచున్న ఆ సాధ్వికి తన భర్త అయిన చంద్రశేఖరునకు, పార్వతీపతి అయిన శ్రీకంఠునకు మధ్య భేదము నశించి, ఇరువురు ఒకే రూపముతో కనిపింప నారంభించిరి. ఈ విధముగ కాలము గడుచుచుండగా, ఒకమారు పార్వతీ పరమేశ్వరులు ఆకాశమార్గమున అరుగుచూ పార్వతీ ప్రతిరూపము, సర్వ లక్షణ లక్షిత అయిన తారావతిని వీక్షించిరి. అంత అంబికానాధుడు చిరునవ్వులు చిందించుచూ ఆర్యామహాదేవి తో "ప్రియా! ఈ తారావతి నీ మానవమూర్తి. భృంగి, మహాకాలుర శాపము చే నీవు ఈమె రూపమును గ్రహించితివి. నాకు నీవు వినా వేరొక అన్యస్త్రీ యందు మనసొల్లదు. అందువల్ల నీవు ఈమె యందు ప్రవేశింపుము. నేను నీ మానవమూర్తి నుండి భృంగీ, మహాకాలురను ఉత్పన్నము కావింతును." పార్వతీదేవి అందుకు సంతసిల్లి "వల్లె" అనెను.

అనంతరము భగవతి స్వయముగ తారావతి శరీరము నందు ప్రవేశింపగా, మహాదేవుడు సహితము ఆమెను భోగించుటకు దరిచేరెను. పార్వతీదేవి ఆవహించిన తారావతి పినాకి రమణేచ్ఛను గమనించి, ఆయన వద్దకు స్వయముగ చేరెను. ఆ సమయమున ఖట్వాంగుడు కపాలియై, అస్థికలు ధరించి, దర్గంధదేహముతో, అత్యంత విరూపియై కపోతముని పలికిన పలుకులను సత్యము కావించెను. తదనంతరము వారిరువురు పరస్పర రతిక్రీడా నిమగ్నులై, అయ్యది పరిసమాప్తి నొందిన పిదప తారావతి సద్యోగర్భమున ఇరువురు పుత్రులకు జన్మనిచ్చెను. తక్షణము పార్వతీదేవి తారావతి శరీరము నుండి బయల్వెడలెను. తదుపరి తారావతి తేరుకుని, జరిగిన విషయము గ్రహించి, తన పుత్రద్వయమును, భీభత్సవేషధారి అయిన శివుని కాంచి, మునిశాపము నిజమయినదని, తాను సతీత్వము కోల్పోయి భ్రష్ఠురాలినైతినని, తనను తాను నిందించుకొనుచూ బిగ్గరగ రోదించుట నారంభించెను. అంత ఆ పతివ్రత మహాదేవుని కాంచి "పతివ్రతల పవిత్రత మునుల వ్రతము కంటె మిన్న అయినద"ని పూర్వము పండితులు ఘోషించిరి. కానీ నేటి నా దుస్థితి చూడ, వారి వాక్యములసత్యములని తెలియచున్నది," అని పలికి పెద్దపెట్టున రోదించుట నారంభించెను.

అంత మహాదేవుడు తారావతిని కాంచి "ఓ! వరాననా! నీవు క్రోధము వహించి పతివ్రతా ధర్మమును నిందింపవలదు. ఓ! విశాలాక్షీ! కపోత మహర్షి నీకు శాపమిడినపుడు నీవు పలికిన పలుకులు నిజమయినవి. ఆ సమయమున నీవు "నేను నిత్యము మహాదేవుని విడువక ఉపాసన కావించిన ఎడల ఆ సత్య బలము చే నా ఆరాధ్యుడయిన చంద్రశేఖరుడు తప్ప వేరెవరూ స్వప్నము నందు కూడా నన్ను అభిలషించకుందురు గాక!" అని పలికితివి. నేను ఆ చంద్రశేఖరుడను, మహాదేవుడను. నేను నిన్ను భోగించితిని. అందువలన శోకింపవలదు, అని పలికి అంతర్హితుడయ్యెను. కానీ మాయామోహిత అయిన తారావతి మలిన వస్త్రయై, నేలపై కూర్చొండి రోదించుచూ, శిరోజములు విరబోసుకొని, తన పతి ఆగమనమునకై

ప్రార్థించుచుండెను. ఆమె గర్భమున పుట్టిన పుత్రద్వయము అచటనే యుండిరి. ఆమె వారివంక ఒక్కతరియైననూ చూడకుండెను. ఆమె మహాదేవుని యొక్క పలుకులకు ఎంతమాత్రము సంతసిల్లలేదు. కొంతసేపటికి మహారాజు చంద్రశేకరుడు ఆమెను చూచుటకేతెంచి, మలిన ముఖి, విరబోసిన కేశములతో సత్యనింద కావించుచూ, భూమిపై పడి ఆర్తనాదము కావించుచున్న తనపత్ని తారావతిని, సూర్యచంద్రుల వలె ప్రకాశించుచూ, వానరముఖులైన ఇరువురు బాలకులను కాంచెను. ఆయన భయగ్రస్తుడై, కొంతసేపటికి తెప్పరిల్లి ఈ విధముగ తన పత్నిని ప్రశ్నించెను "ఓ! తారావతీ! ఈ నిర్జన గృహమందు నీ ఎడ ఏమి అపచారము జరిగినది? నక్క సింహికను ఆక్రమించినట్లు, నిన్ను ఎవరు ఆక్రమించి పరాభవించిరి? ఈ ప్రదీప్త వానరముఖులు ఎవరు? నీ కొరకై నిన్ను కామించుచూ ఎవరు ఏతెంచిరి?"

అంత పరమ పతివ్రత అయిన తారావతి జరిగిన విషయమంతయు పూసగ్రుచ్చినట్లు తన పతికి వివరించెను. నయనములశ్రు పూరితములై, కన్నీళ్ళు వర్షము వలె ముఖమండలము నుండి ధారాపాతముగ వర్షించుచుండగా, మహాదేవుని ఆగమనము, తదుపరి కార్యమును వివరించెను. మహారాజు చంద్రశేఖరుడు నిరుత్తరుడై కొంచెము సేపు నేలపై చిత్తరువు వలె కూర్చొనెను. తదుపరి తిరిగి జరిగిన విషయము చింతించుచూ "మహాదేవుడు పార్వతీదేవిని వినా వేరొకరిని ఒల్లడు. ఈ జరిగిన కార్యము ముని శాపము వలన జరిగినది. అందువలన ఏతెంచిన ఆగంతకుడు మహాదేవుడు కాడు. ఏదేని మాయావి అయిన రాక్షసుడు శంకరుని రూపమున ఏతెంచవచ్చు. నా పత్ని రాక్షస స్పర్శచే పాపము నొందినది. ఈ పుట్టిన శిశువులు సహితము రాక్షసులే! లేని ఎడల వీరికి వానరముఖము ఎట్లు ప్రాప్తించును? ఇకనుండి నేను నా దైనందిన కర్మలు ఎట్లు చేయగలను?"

ఈ విధముగ మహారాజు తన మనసునందు తీవ్ర సంఘర్షణ నెరపుచుండగా, దేవగణ ప్రేరితయై అదృశ్యరూపమున సాక్షాత్ సరస్వతీదేవి "మహారాజా! తారావతిని ఇట్లు సందేహించుట తగదు. జరిగిన విషయమందు ఆమె తప్పిదము ఇసుమంత లేదు. సాక్షాత్ పరమేశ్వరుడే నీ పత్నియొద్దకు ఏతెంచెను. ఈ మహాపురుషులయిన శిశువులిరువురు మహాదేవుని పుత్రులే! వీరిరువురినీ నీవు రక్షించి, పెంచి, పోషింపవలసినది. మిగిలినవి నీకు నారదమహర్షి స్పష్టమొనరించును" అని పలికి వాగ్దేవి మౌనము వహించెను. అంత చంద్రశేఖరుడు ఊరటనొంది, తన భార్యను దగ్గరకు తీసికొని, ఆశ్వాశించి, ధైర్యము చెప్పి, మహాదేవుని పుత్రద్వయమును స్వీకరించి, వారికి సవిధి సంస్కారములు కావించెను. మహారాజు సహితము నారదమహర్షి యొక్క ఆగమనమునకై ప్రతీక్షించుచుండెను. కొన్నాళ్ళకు నిత్యనిరంతర నారాయణ జపతత్పరుడు, మహాజ్ఞాని అయిన నారదమహర్షి ఏతెంచెను. అంత మహారాజు చంద్రశేఖరుడు పత్నీ సహితుడై అర్ఘ్య పాద్యాదులచే ఆయనను పూజించి, ఆశీనుని కావించి ఏకాంతమున ఇట్లనియె "ఓ! ద్విజోత్తమా! మీ వంటి పరమ పవిత్ర పుణ్యపురుషుల ఆగమనము చే మా గృహము పావనమయినది. మేము పునీతులమైతిమి. మా హృదయమందలి సందేహములను మీరు వినా వేరొకరు తీర్పలేరు. సాధ్వి, పరమ పతివ్రత అయిన నా పత్ని తారావతి కపోతముని శాపము చే కురూపి, భీభత్సవేషధారి, మృగచర్మధారి అయిన పురుషుని చే భోగింపబడి, సద్యోగర్భమున ఇరువురు పుత్రుల నొందినది. ఆ విషయమై నాకు కొన్ని సందేహములున్నవి. అవి మహాదేవుడు గిరిజాదేవి వినా వేరొకరిని కన్నెత్తి చూడడు. అటువంటి భగవానుడు నీచమయిన మానవ స్త్రీ సంసర్గమును ఏలకోరును? ఎందువలన మానుష క్షేత్రమున ఇరువురు పుత్రులనుత్పన్నము కావించును? ఈ సందేహములు నివృత్తి కావించుకొనుటకు మేము అర్హులమైతిమేని, దయచేసి తెలుప ప్రార్ధన."

అంత నారదమహర్షి చెప్పనారంభించెను "మహారాజా! మహాదేవునకు భృంగి, మహాకాలురను ఇరువురు అనుచరులు కలరు. ఒకనాడు వారు పార్వతీదేవి చే శపింపబడి, తిరిగి ఆ భగవతికి ప్రతిశాపమిడిరి. అంత మహాదేవుడు పౌష్యపుత్రుడవయిన నీ వలెనూ, భగవతి కకుత్సపుత్రిక అయిన తారావతి వలెను జన్మించిరి. నారదుడు వారిరువురికీ ఆ ఆఖ్యానమునంతటినీ వినిపించి, తదుపరి మరియొక రహస్యోపాఖ్యానమును వినిపించెను. రాజా! ఒకానొకనాడు శంకరుడు

పార్వతిని "కాళి" అని సంభోదించి అపహాస్యము చేసెను. అంత గిరిరాజ పుత్రిక కినుక వహించి, గౌరాంగి అగుటకై హిమాలయ శిఖరము చేరి తపశ్చర్య నారంభించెను. అంత పార్వతీ విరహము చే పరమశివుడు కైలాసము వీడి సుమేరు శిఖరము చేరెను. కానీ ఆయన మనసునిండా పర్వతరాజపుత్రిక నిండియుండుటచే, మరుని శరములచే మది విదీర్ణమగుట చే, మహామాయ చే మోహితుడగుట చే శూలి సుఖమునకు అత్యంత దూరుడయ్యెను. ఆ సమయమున సకల సద్గుణ సంపన్న, రూప లావణ్యముల యందు పార్వతీ తుల్యమయిన సావిత్రీదేవి అచట తిరుగాడు చుండెను. అంత ఉమాకాంతుడామెను వీక్షించి, అవిద్యచే ఆవృతుడై, సాధారణ మానవుని వలె కామాతురుడై, ఆ సావిత్రీదేవిని పార్వతి అని భ్రమపడి ఆమెను ఆనుగమించుచూ ఇట్లనియె "ఓ! పార్వతీ! నీ విరహము చే నేను విదీర్ణడనైతిని. కాముడు పూర్వ వైరము చే నన్ను మరింత బాధించుచున్నాడు. నన్ను ఈ కామవిపత్తు నుండి కాపాడవలసినది." ఈ విధముగ వేడుకొనినప్పటికీ సావిత్రీదేవి బదులీయక ముందుకు నడచుచుండెను. అంత కపాలి ముందుకేగి ఆమె కరకమలమును గ్రహించెను. అంత సావిత్రీదేవి క్రోధోద్రిక్తయై ఇట్లనియె "ఓ! శితికంఠా! నేను పతివ్రతనైన సావిత్రిని. నీవు ప్రాకృత మనుష్యుని వలె నా యందు దుర్వ్యవహారము నేల ఆచరించుచుంటివి? తొలుత నీవు నీ భార్యను వెడలగొట్టి, ఇపుడు అనునయ వాక్యములు పలుకుచుంటివి. మూఢుఢా! నేను పార్వతినో, కానో తెలియకనే నా కరగ్రహణము నేల కావించితివి? సాధారణముగ నీవు పరదారాగమనము చేయనప్పటికీ, పార్వతీ విరహమున ఈ దుష్కార్యము నాచరించితివి. అందువలన దీనికి ప్రతిఫలముగ నీవు మనుష్యయోని సంభోగము కావించెదవు," అని పలికి సావిత్రి తన ఆశ్రమమునకు చనినది. శివుడు సహితము విస్మయ, లజ్జా సహితుడై తన స్వస్థలికి చనెను. ఇందువలన శంభునికి నీ పత్ని తో సంభోగము సంభవించినది. ఇక తారావతిని శంకింపక ఈ పుత్రులిరువురినీ నీ పుత్రులవలె పెంచి పోషింపుము."

తదుపరి చంద్రశేఖరుడు తాను శివాంశయనీ, తారావతి భగవతి అంశయని నారదుని చే తెలుపబడి ఇట్లనియె "దేవర్షీ! మేము మా ఇరువురి శివతత్వ, భగవతీ తత్వమును ఎట్లు ప్రత్యక్షముగ నెరుంగ గలము?" నారదుడు "మహారాజా! మీరు ఎడమ చేతితో తారావతిని పట్టుకొని ఇరువురు కనులు మూసుకొనవలసినది. మీకు శివరూప జ్ఞానము ఎరుకపడును." తారావతీ చంద్రశేఖరులు అట్లే ముని వాక్యమును పాటించిరి. వారిరువురు కనులు మూసికొనగనే వారికి శివతత్వము, భగవతీతత్వము-నేను శివుడను/పార్వతిని అని బోధపడినది. అంత వారిరువురు కనులు తెరవగనే వారిరువురి రూపములు ఈ విధముగ కనబడెను. మహారాజు తనను తాను వ్యాఘ్ర చర్మాంబరధారి, దశభుజశాలి, చేతుల యందు త్రిశూలాది ఆయుధధారి, వృషభారూఢ, జటాజూటధారి గా కాంచెను. అంత వారిరువురికి తాము పార్వతీ పరమేశ్వరుల అంశయని ధృఢ నిశ్చయము కలిగినది. అంత నారదుడు తిరిగి "మహారాజా! ఇంతకుమున్ను మీరిరువురినీ విష్ణుమాయ మానవదేహములందు ముగ్ధులకావించి బంధించినది. ఇపుడు మీరిరువరికీ సత్యము ఎరుక అయినది. తిరిగి మీరు కన్నులు మూసికొనవలసినది. తిరిగి మీరు మానుషభావము నొందెదరు. అంతేకాక ఈ జన్మము చివరి వరకు మీరు మానుషభావము నందే యుందురు. తిరిగి ఆ రాజదంపతి కనులు మూసి తెలిచిరి. వారిరువురు సర్వమును మరచి మానుష భావము నొంది సంపూర్ణ విష్ణుమాయా మోహితులైరి. అనంతరము మహారాజు ముదిత మనస్కుడై నారదుని తో "మహానుభావా! నేను ఈ మహాదేవ సుతులను నా నిధిగా తలంచి పోషించెదను. దయచేసి మీరు ఈ బాలురకు జాతక, జన్మ సంస్కరణ కావింపవలసినది."

నారదుడు మహారాజు యొక్క అభ్యర్ధనను మన్నించి, వారిరువురికి జాతక కర్మలాచరించి బలిష్ఠుడయిన గరిష్ఠ పుత్రునికి "భైరవుడు" అనీ, కాలాంజనుని వంటి కనిష్ఠ పుత్రునికి "భేతాళుడు" అనీ నామకరణము గావించి, మహారాజ దంపతి యొక్క సంశయములను పటాపంచలు కావించి, తిరిగి ఆకాశమార్గమున స్వర్గమున కేగెను. తదుపరి చంద్రశేఖరుడు తారావతి, పుత్రద్వయ సహితుడై ఎంతో ఆనందము ననుభవించెను. రాజపుత్రులిరువురు శుక్లపక్ష చంద్రుని వలె దినదిన

ప్రవర్ధమానులైరి. అటు పిదప ఆదంపతికి ముప్వురు బహుగుణ రూప వీర్యవంతులయిన పుత్రులుదయించిరి. వారు "ఉపరిచర," "దమన", "అలర్క" నామధేయులు. ఆ దంపతి వారయిదుగురినీ భేదభావము లేక అత్యంత ప్రేమతో పెంచిరి. వారందరూ పెరిగి మహాబలాఢ్యులై, సమస్త పృథివీ మండలముపై విజయము సాధించిరి.

**(శ్రీ కాళికా పురాణము నందలి చంద్రశేఖరుని ఆత్మసాక్షాత్కారమను ఏబదియవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది ఒకటవ అధ్యాయము

**(భేతాళ భైరవుల గణాధ్యక్షత)**

కాలము ఎవ్వరి కొరకు ఆగదు కదా! ఏళ్ళు గడచుచున్నవి. మహారాజు చంద్రశేఖరుడు, మహారాణి తారవతి నెమ్మదిగ మధ్య వయస్కులైరి. పిల్లలందరూ పెద్దవారై నిరంతరము కలసియుండుట చే ఒకరియందు ఒకరు మిక్కిలి ప్రేమాస్పదులై, నిత్యసహచరులైరి. ఒక్క క్షణము సహితము ఒకరినొకరు విడచి యుండెడువారు కారు. విష్ణుమాయా విలాసమున నెమ్మదిగ చందశ్రేకరునికి తన పుత్రులయందు ప్రేమ, మమత ఎక్కువై, భేతాళ భైరవుల యెడ ఉదాసీనత కలుగ నారంభించెను. కానీ ఈ ఇరువురు మహేశ్వర పుత్రులు కాలక్రమమున సర్వ శాస్త్ర విశారదులై, ధనుర్విద్యా పారంగతులై, త్రైలోక్య విజయులైరి. చంద్రశేఖరుడు వీరిరువురు తన పుత్రులను రాజ్య భ్రష్ఠులు గావింతురని లోలోన మధనపడుచు, తిరిగి వారి ధార్మికతను గమనించి కొంచెము స్వస్థత నొందువాడు. కొంతకాలము తదుపరి అత్యంత రూపవంతుడు, రాజలక్షణ శోభితుడు అగు ఉపరిచరుని యువరాజుగ ప్రకటించి అభిషిక్తుని చేసెను. ఉపరిచరుడు అత్యంత నీతివంతుడు మరియు రాజులందు మాన్యుడు. అంతేకాక మహారాజు ఆ సందర్భమున దమన, అలర్కులకు సహితము అనేక ధనరాశులను ప్రదానము చేసెను కానీ భేతాళ, భైరవులకు కనీసము ఒక్కమాడ కూడ ఈయకుండెను. అంత భేతాళ భైరవులు దు:ఖితులై నిర్జనారణ్యమున కేగి తపశ్చర్య కావించుటకు నిశ్చయించిరి. మహారాణి తారావతి జరుగుచున్న దుష్కార్యమును చూచి మనసున ఎంతో దు:ఖము నంది కూడ మహారాజు, యువరాజుల యందలి భయము చే పెదవి విప్పి పలుకదయ్యె!! తన పుత్రులు అరణ్యమున కేగిననూ మౌనముగ ఆ బాధను తట్టుకొని భరించెను.

దృషద్వతీ తీరమున సురత క్రీడారతుడు, స్త్రీ సంగ ప్రియుడు అయిన కపోత మహర్షి తన సహచారిణి అయిన చిత్రాంగదను పిలచి ఇట్లనియె "ప్రియా! చిత్రాంగదా! నాకు సంసారము పట్ల విముఖత ఏర్పడినది. నేను కాననమున కేగి తపమాచరించ దలచితిని. నీ మనసున ఏదేని కోరిక యున్న ఎడల నాకు తెలుప వలసినది. దానిని తప్పక నెరవేర్చెదను. అంత చిత్రాంగద "ఓ! తపో శిరోమణీ! మీ పుత్రులయిన "సువర్చుడు", "తుంబురుడు" ఇరువురికీ ప్రియమొనర్చి, పిదప నన్ను నా సోదరి ఇంటివద్ద దింపి మీరు తపో వనమునకు చనవలసినది. అంత కపోతుడు ఒక్క క్షణమాలోచించి, అలకాపురికి ఏగి కుబేరుని ప్రార్థించి, ఆరు వందల బారువుల సువర్ణముద్రలు, ఒక వేయి నిష్కములు, వంద బారువుల దివ్యరత్నములను పొంది, వాటిని చమరీ పృష్ఠమునవైచి, తిరిగి వచ్చి ఆ దివ్య సంపదను, తన పత్నీ పుత్రులను తీసికొని మహారాజు చంద్రశేఖరుని వద్ద కేతెంచి ఇట్లనియె "మహారాజా! మీకు గుర్తుండి యుండవచ్చు. ఈ నా పత్ని కుకుత్స రాజకన్యక. మాకు ఇరువురు పుత్రులు కలిగిరి. రాజా! అపుత్రకుని పుత్రుడు, నిర్ధనుని ధనము, మాతృహీనుని తల్లి, పితృహీనుని తండ్రి, నిస్సహాయులకు సహాయత, పతిహీనులకు ప్రభువు, దరిద్రులకు సహాయకుడు, మనుష్యులకు బంధువు మహారాజే!!! రాజు సర్వదేవమయుడు. అందువలన మహారాజా! నేను మీ సహాయము నర్థింప

వచ్చితిని. నేను కుబేరునర్ధించి ఈ ధనరాశి నొందితిని. ఈ ధనము తీసికొని మీరు, మీ యువరాజు నా పుత్రులను రక్షింపవలసినది." అంత మహారాజు చంద్రశేఖరుడు "మహర్షీ! నేను, నా పుత్రుడు, యువరాజు ఉపరిచరుడు, ఇరువురము మీ పుత్రుల రక్షించెదము." అని వాగ్దానము చేసి చిత్రాంగదను ముని సమ్మతిన గ్రహించి, ధనమును, ముని పుత్రులను తన కుమారుని కర్పించెను. అంత నీతిమంతుడయిన ఉపరిచరుడు తన అర్ధరాజ్యమును ముని పుత్రుడయిన సువర్చునకిచ్చి, తుంబురుని ఆ రాజ్యమునకు ప్రధానామాత్యుని కావించెను. తదుపరి మహర్షి తన పుత్రులు ఇరువురినీ ఆశ్వాశించి, మహారాజు తో ముచ్చటించి, తపోవని కి చనెను.

మార్గమధ్యమున చంద్ర దివాకరుల వలె వెలుగొందుచూ, సహాయరహితులై అటు నిటు భ్రమించుచున్న మహాదేవ పుత్రులను కపోతమహర్షి కాంచెను. అంత ఆయన తన దివ్య దృష్టి చే సర్వమును గ్రహించి వారిని ఇట్లు ప్రశ్నించెను. "మీరిరువురు దేవసదృశులవలె గోచరించుచున్నారు. నిర్జనమయిన ఈ కారడవి లో ఏల భ్రమించుచున్నారు? నాకు తెలుపవలసినది." అంత ఆ మహేశ్వర పుత్ర ద్వయము ఆ మహర్షికి ప్రణామములాచరించి "ముని ప్రవరా! మేము తారావతీ చంద్రశేఖరుల పుత్రులము. మా ఎడ మహారాజు మిక్కిలి దయారహితుడై, నిరాదరణ చూపించుచుండెను. మాకు ఒక్క నిష్కాసము నయిన ఈయక మా ఎడల పూర్ణముగ ఉపేక్షను ప్రదర్శించెను. మేము సాక్షాత్ ఆయన ఔరస పుత్రులము. కానీ మా తండ్రి ప్రవర్తన చే మిక్కిలి దు:ఖము, బాధ నొంది, అచట యుండలేక తపస్యార్ధము కాననమున కేతెంచితిమి. మీరు మాకు ఉపదేశమొనర్చి మమ్ము అనుగ్రహింప వలసినది." అంత కపోతుడు "నాయనలారా! మీరిరువురు చంద్రశేఖరుని ఔరస పుత్రులు కారు. మీరు సాక్షాత్ శంకరుని తేజస్సుచే తారావతి గర్భము నందుత్పన్నమయిరి. మీరిరువురు భృంగీ, మహాకాలురను సాక్షాత్ శంకరానుచరులు. పార్వతీ శాపమున ఈ పుడమిపై ఉద్భవించిరి. అందువలననే మహారాజు ఏవిధమయిన ధనము ఈయలేదు. ఇపుడు మీరు మీ జన్మదాత అయిన పరమశివుని వద్దకేగి ఆయనను శరణువేడవలసినది. ఆ మహేశ్వరుడే మీ ఇచ్ఛను సఫలీకృత మొనర్చును. అదికాక దీర్ఘకాల తపము చే ఫలము ఏమి యున్నది?" ఈ విధముగ పలికి కపోతుడు వారిరువురికి వారి పూర్వజన్మ వృత్తాంతము కావించుట నుండి ఇప్పటి వరకు జరిగిన విషయములన్నియు పూసగ్రుచ్చినట్లు వివరించెను.

ఆ సోదరులిరువురు ఆ వృత్తాంతము విని మహదానంద పరవశులై తిరిగి ఇట్లనిరి "మునివర్యా! మహేశుడు మా తండ్రి అని తెలిసి అమందానంద కందళిత హృదయారవిందులమైతిమి. ఇది సత్యము, కానీ ఆయనను చేరుటకు ఏ విధమయిన పూజ, ఆరాధన కావింపవలెను? ఏ విధముగ ఆయనను శీఘ్రముగ ప్రసన్నము కావింపగలము? మహాత్మా! మీరు ఈ నిగూఢ రహస్యముల నెరుగుట యందు నిష్ణాతులు. దయచేసి మాకు దివ్యోపదేశము గావించి, వృషధ్వజుని శీఘ్రముగ ప్రత్యక్షము కావించుకొను దివ్య విద్యను ఉపదేశింప వలసినది." అంత కపోతుడు "పుత్రులారా! మహాదేవుడు ఎక్కడ నిత్యానంద భోగరతుడగునో, ఆ అజ్ఞాత స్థలమును, మరియు ఎక్కడ పూజించిన ఎడల శీఘ్రముగ ప్రత్యక్షమగునో ఆ ప్రదేశమును తెలిపెదను."

గంగా తీరము నందు గల సుమనోహర పట్టణము కాశీ! అయ్యది వరుణాగ్నుల చే రక్షింపబడుచున్న ధనుషాకార పురము. యోగి జనులకు నిత్యసుఖము నిచ్చు శితికంఠుడు ఇచట ఆత్మారాముడై నిరంతరము ఆత్మ చింతనము కావించుచూ దివ్య ధ్యానమందు నిమగ్నమయి యుండును. ఈ పురి శంకరుని యోగబలము చే ఆకాశస్థలి యందు నిలిచియుండును. ఇచట మృతి నొందు జీవుల ముక్తి కొరకై మహాదేవుడు స్వయముగ జ్ఞాన బోధ కావించును. ఈ స్థలి యందు జీవులకు అనాయాసమరణము లభ్యమగును. ఇచట శంకరుడు యోగరతుడై, భగవతీ సహితుడై యుండి దేవ, దానవ, యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష, మానవులకు ఆరాధ్యుడై వెలుగొందుచుండును. కానీ ఆ ప్రదేశము నందు శంభుడు ఎవరి అభిలాష పూర్ణ మొనర్చుడు. ఎవరికీ శీఘ్రముగ ప్రసన్నుడు కాడు. ఎవరేని దీర్ఘకాలము భక్తియుతులై ఆరాధించితిరేని

వారికి నిర్వాణపదము నొసగును. ఈ వారణాసీ క్షేత్రమందు గౌరీదేవి యొక్క గమనాగమనములు కలుగవు. ఈ మహాక్షేత్రము నుండి గౌరి కదలక స్థిర నివాసమేర్పరుచు కొనును. ఈ వారణాసీ క్షేత్రము మనమున్న చోటికి అత్యంత దగ్గరగ యున్నది. ఇపుడు మరియొక తీర్థ వర్ణనము కావింతును. అయ్యది "కామరూపము" అను గుప్తపీఠము. ఇచట నిరంతరము అర్చింపబడు గౌరీశంకర ధర్మార్థకామప్రద తీర్థమున్నది. ఇచట శీఘ్ర ఫలప్రదాయిని అయిన పుణ్య పీఠము యున్నది. పరమేశ్వరుని ఇచట పూజించిన ఎడల ఆయన అతి శీఘ్రముగ అనుగ్రహించును. ఋషిగణములు సహితము ఈ పీఠమును అత్యుత్తమమని నొక్కి వక్కాణింతురు.

ఈ కామరూప మహా పీఠము గుప్తాతిగుప్తము. ఇచట పార్వతీపరమేశ్వరులు ఒండొరులు విడువక యుందురు. ఇచట పూజన మొనర్చుట చే మహాదేవుడు శీఘ్రముగ అనుగ్రహించుటయే గాక, భగవతి సహితము తొందరగ కృప జూపించును. ఈ తీర్థము గూర్చి మరికొంత తెలిపెదను. ఇయ్యది "కామరూపము" అని ప్రసిద్ధి నొందినది. పూర్వము కామదేవుడు శివుని క్రోధాగ్ని చే దగ్ధమయ్యెను. మహాదేవుని అనుగ్రహము చే ఈ క్షేత్రమునందే ఆతడు తిరిగి పునర్జీవితుడయి రూపము నందెను. అందువలన ఈ పీఠము కామరూపమని పేర్కొనబడెను. ఇయ్యది ముప్పది యోజనముల పొడవుయుండి, నీలాంజన వర్ణ, త్రికోణాకార పర్వత శ్రేణులచే పరివేష్ఠితమై అనేక నదుల చే పరివృతమై యుండును. పశ్చిమమున "కరతోయా" నది నుండి తూర్పున "ధిక్కరవాసినీ" నది వరకు ఈ కామరూప క్షేత్రము విస్తరిల్లి యుండును. ఈ పీఠమధ్యము నుండి ఈశాన, ఆగ్నేయ, నైఋతి, వాయువ్య కోణముల యందు, మరియు వాని మధ్య, పార్శ్వముల యందలి జల, స్థలముల యందు మహాదేవుడు సుందర ఆశ్రమములు నిర్మించి, భగవతీ సహితుడై అందు భోగించి, వినోదించుచుండును. ఈ పీఠమధ్యమమున "నీలపర్వత"మందు ఒక దేవీ మందిరము కలదు. అచట పార్వతీదేవి నివాసముండును. శంకర భగవానుడు అచట ఆమె ఆధీనమునందు యండును. పీఠమునకు ఈశాన కోణమందు "నాటక పర్వతము" నందు శివభగవానుని సుందర మహాశ్రమము కలదు. అందు శివుడు నివసించుచుండును. శివాణి ఆయనకు అనుయాయియై ఆధీనమై అచట నివసించుచుండును. ఈ పీఠమందలి అనేక స్థానములందు గౌరీశంకరుల ప్రాచీన ఆశ్రమములు అనేకములు కలవు. పార్వతీ పరమేశ్వరుల ధామమయిన కామరూపము వంటి క్షేత్రము మరియొకటి లేదనిన అతిశయోక్తి కాదు. మీరిరువురికి మహాదేవుని ఆరాధించుటకు ఇయ్యది అత్యంత ఉపయుక్తమయిన తీర్థక్షేత్ర రాజము. అచటి కేగి మహాయోగము నవలంబించి, తీవ్ర తపము చే మహాదేవుని ఉపాసింప వలసినది."

అంత భేతాళ భైరవులు ఇట్లు ప్రశ్నించిరి "ముని ప్రవరా! మహానుభావా! మేము తక్షణము నాటక పర్వతమున కేగి, శాంకరీ శంకరుల నివాస స్థలమును గని, వారిరువురి ఆరాధన కావించెదము. కానీ ఏ అర్చనా విధి చే ఆయనను ఆరాధింప వలెను? ఏ మంత్రోపాసన చే ఆయన అతి శీఘ్రముగ ప్రసన్నుడగును? దయానిధీ! మా యందు ప్రసన్నులై మాకుపదేశము కావింప వలసినది." అంత కపోత మహర్షి" నరసత్తములారా! మీరు తొలుత నాటక వర్వతమున కేగవలసినది. అచటకు దగ్గరనే "సంధ్యాచలము" నందు బ్రహ్మపుత్రుడయిన వశిష్ఠ మహర్షి నిరంతర శంభు పూజనమొనర్చు చుండును. మీరిరువురు ఆయనను పూజించి, ఆయన ద్వారా శంభుని శీఘ్రముగ పొందు మంత్ర, తంత్ర, ఆరాధనా రహస్యములు తెలిసికొనవలసినది. ప్రస్తుతము నేను తపస్సార్థము కాననమునకేగుచున్నాను. ఇక నాకు కాలయాపన ఉచితము కాదు" అని పలికి వారిరువురికి వీడ్కోలు పలికెను. తదనంతరము భేతాళ, భైరవులు ఒక శుభ ముహూర్తము నిర్ణయించుకొని, తపోదీక్షితులై, తల్లిదండ్రులు, భ్రాతా, బంధు, బాంధవుల అనుమతి గైకొని తపస్సార్థము కామరూపమునకు వెడలిరి.

తపశ్చర్య కై వెడలుచున్న తన పుత్రుల చూచి శితికంఠుడు దేవతలతో "అనుమిషులారా! ఈ భేతాళ భైరవులు నా పుత్రులు. వీరిని తీవ్ర తపస్సుచే సంస్కరించి వీరికి గణాధిపత్యము నొసంగెదను. వీరి తపశ్చర్యకు మీరు సహాయపడవలసినది.

తీవ్ర తపస్సు చే వీరికి మానుషభావము అంతరించి, దేవభావము అంకురించును.” తదుపరి తమ పుత్రులయందలి వాత్సల్యము చే పార్వతీ పరమేశ్వరులు వారి వెనుక అదృశ్యముగ ఆకాశమార్గమున అనుగమించిరి. ఇంద్రాది దేవతలు, దిక్పాలురు మిగిలిన దేవతాగణము రుద్ర, రుద్రాణిలను అనుగమించిరి. క్రమముగ సోదరులిరువురు దృషద్వతీ నదిని చేరి, అచట తపోభావమును పూని, మృగచర్మధారణ కావించి, ముందునకేగి కొంత కాలమునకు కామరూపము చేరిరి. అచట కరతోయా నది దర్శనము గావించి, అందలి నీటిచే ఆచమనాదులు చేసి స్నానాదికములు కావించి, తిరిగి ప్రయాణము కొనసాగించి “జటోద్భవా” నదిని చేరిరి. అక్కడ కూడా స్నానాచమనాదులు కావించి దగ్గరనే యున్న నందికుండమును దర్శించి, జల్పీష దేవతకు వందన మొనర్చి, నాటక శైలమున కేగిరి. నాటక శైలమందు కపోతముని చేసిన బోధను స్పురణకు తెచ్చుకొని, కొంత తడవు వృషధ్వజునకు వందనమొనర్చి, పిదప శివోపాసనా రహస్యములు తెలిసికొనుటకై దక్షిణ దిశగా సంధ్యాచలమునకు ప్రస్థానమయిరి. అచట వశిష్ఠ ముని చే కొనిరాబడిన “కాంతా” నది విరాజిల్లుచున్నది.

ఈ కాంతానదీ తీరమున, ఛాయా యుక్తమయిన దివ్యవృక్షములతో నిండిన ఒక విశాల పర్వతమున్నది. బ్రహ్మ మానసపుత్రుడయిన వశిష్ఠ మహర్షి అచటనే కూర్చొని సంధ్యాదికములు పూర్తి చేయువాడు. అందువలన దేవతలు ఈ పర్వతమునకు “సంధ్యాచలము” అను నామమిడిరి. ఇచట వశిష్ఠ మహర్షి తీవ్ర తపోధ్యానయుక్తుడై, గిరీశారాధనము నందు లీనమై యుండును. ఆయన తపస్సు చే ద్వితీయాదిత్యుని వలె దీప్తించుచుండెను. భేతాళ భైరవులిరువురు వశిష్ఠ మహర్షిని చేరి, అవనిత శిరస్కులై, చేతులు జోడించి, సాంజలిబంధకముగ సాష్టాంగ దండ ప్రణాములాచరించి తదుపరి ఇట్లనిరి “ఓ! సువ్రతా! మేము తారావతీచంద్రశేఖరుల పుత్రులము. జనులు మమ్ము మహాదేవుని మానవ యోనిగత పుత్రులుగ పరిగణింతురు. మేము మహాదేవుని ఆరాధింప దలచితిమి. మీరు మా యందు కృపబూని, ఆ ఆరాధనా విధిని ఉపదేశించి మాకు కార్యసిద్ధి కలుగునట్లు చేయ ప్రార్థన. అంత వశిష్ఠ మహర్షి “అరిందములారా! మీరిరువురు మహాదేవుని పుత్రులని నిస్సందేహముగ నాకు తెలియును. మీ తక్షణ కర్తవ్యము మహాదేవోపాసన. తద్విషయమై, నా వలన సహాయము తెలుపవలసినది. మీరు నా వద్దకు వచ్చిన మరుక్షణము మీ  కోరిక నెరవేరినదని తెలియుడు.” అంత భేతాళ భైరవులు “మహానుభావా! ఏ మంత్ర, తంత్ర, అనుష్ఠానములల ద్వారా శ్రీకంఠుడు అతి శీఘ్రముగ ప్రసన్నుడగును? ఆ విధి విధానము నంతయు సాంగోపాంగముగ మాకు ఉపదేశింప వలసినది.”

వశిష్ఠుడు “భవానీ భవులు మీ యందు ప్రసన్నులయిరి. ఆ విషయము వారు అమరులెదురుగా, మునుల సాక్షిగా తెలిపిరి. వారిరువురు మిమ్ము రక్షించుచూ, మీ వెనుకే ఆకాశమార్గమున ఏతెంచిరి. మీరిరువురు మానవులు గావున తీవ్ర తపో నియమముల ద్వారా మిమ్ము మీరు సంస్కరింపబడిన అనంతరము భవుడు మీకు గణాధిపత్యము నొసంగి కైలాసమునకు గొనిపోవును. మీరు ఏ ఉపాయము చే శీఘ్రముగ మహాదేవుని ప్రాప్తించెదరో అద్దానిని వివరించెదను. కేవల ధ్యానము చే మహాదేవుడు ప్రసన్నుడవడు. “ధ్యానము”, “పూజ” ఈ రెండింటి ద్వారా ఆయన అతి శీఘ్రముగ ప్రసన్నుడగును. ఆ విధిని మీకెరిఁగింతును. నిత్య నిరంజనుడు, తేజోమయుడు, చిదానందుడు, జగన్నాథుడు, జ్ఞానసుధాస్వాదకుడు, జగన్మయుడయిన బ్రహ్మ, విశ్వరూపుడయిన విష్ణువు, మహాయోగతత్పరుడు అయిన మహేశునికి ఎన్ని మూర్తులు, రూపములు కలవో ఎవరికెరుక? కానీ ఆ మూర్తులందు ఏ మూర్తి ఇచట నివాసమున్నదో, ఏ మూర్తి నా గమ్యమో అద్దానిని తెల్పెదను. తొలుత మంత్రవర్ణనము కావించి, తదుపరి ధ్యానము తెలిపి తుదకు పూజాపరిపాటి వివరించెదను.

“మానవ శ్రేష్ఠులారా! “ఋ” మరియు “ఌ” లను వదలి సమస్త స్వర వర్ణనములను విసర్గ, బిందు యుక్తము కావించిన, అయ్యది పంచవక్త్రుని (మహేశుని) పంచాక్షర యుక్త మంత్రమయిన “ఆం ఈం ఊం ఐం ఔం ” అగును. పంచమంత్రములు “సమ్మోద, సందోహ, నాద, గౌరవ, నిర్దుష్ఠ”ములు. పైన తెలిపిన ఒక్కొక్క మంత్రాక్షరముతో ఈ

పంచమంత్రములు పరమేశ్వరుని పంచముఖములందలి ఒక్కొక్క ముఖమును పూజింప వలెను. లేని ఎడల పరమేశ్వరుని పంచముఖములను కేవలము ప్రాసాద మంత్రము "హౌం" తో పూజింపవలెను.

సమ్మోదాది మంత్రముల కంటె "ప్రాసాదమంత్రము" ప్రాసస్త్యము. ఇయ్యది మహాదేవునికి ప్రసన్నత కలిగించునది కావున సర్వ మంత్రముల కంటె అత్యంత శక్తివంతమయినది. శంభునికి ఆమోదయోగ్య మంత్రము "సమ్మోదమంత్రము". 'సందోహమంత్రము" మనసునందలి కోరికలను తీర్చును. కావున అయ్యది సందోహ మయినది. శబ్దోచ్ఛారణ చే ఇష్టదైవము ఆకృతి దాల్చును. దాని నామమే నాదము. మంత్రము నందు గురుత్వము ఇమిడి యుండును. అందువలన ఇది "గౌరవము" అని పిలువబడును. మీరు ఈ మంత్రములన్నింటి చే శివుని పూజింప వలసినది. పంచాక్షరి (నమ:శివాయ) అని తెలుపబడు మంత్రము చే పంచముఖుని నిత్యారాధన కావింప వలసినది.

భేతాళ భైరవులారా! ఏకాగ్రతతో వినవలసినది. పంచముఖుడు, మహాకాయుడు, జటాజూటధారి, చారుచంద్ర కళాశోభితుడు, మస్తకమందు సర్పమకుటుడు, దశభుజుడు, వ్యాఘ్రచర్మధారి, విషలిప్తకంఠుడు, ఫణిభూషణుడు, ప్రతి ముఖమందు త్రినేత్రుడు, వృషవాహనుడు, షట్‌జ్యోతి పూర్ణుడు, మహేశ్వరుడు, కృత్తివాసుడు (ఏనుగు చర్మము చే ఆచ్ఛాదితుడు), భస్మలిప్తాంగ శరీరుడు – పరమశివుడు. ఆయన పంచముఖుడు. ఆ ముఖములు "సద్యోజాతము స్ఫటికము వలె నిర్మలము. వామదేవము పసుపు పచ్చని వర్ణమున సౌమ్యము, మనోహరము. అఘోరము నీలవర్ణము, భయంకర దంతమయము. తత్పురుషము రక్తవర్ణము, దేవమూర్తి, మరియు మనసును రంజిల్ల చేయును. ఈశానము శ్యామవర్ణము మరియు నిత్యశివ స్వరూపము. ఈ ముఖములు వివిధ దిశలను చూచుచుండును. సద్యోజాతము పశ్చిమమునకు, వామదేవము ఉత్తరమునకు, తత్పురుషము తూర్పునకు, అఘోరము దక్షిణమునకు, ఈశానము వీటన్నింటికి మధ్యన ఉపస్థితమై యుండును. ఆయన ఎడమవైపు అయిదు హస్తములందు అక్షమాల, మాతులుంగ ఫలము (Citrus Medica), భుజంగము, ఢమరు, పద్మము యుండును. ఆయన దక్షిణ హస్తములందు శక్తి, త్రిశూలము, ఖట్వాంగము, వరదముద్ర, అభయముద్ర యుండును. అణిమాది అష్టైశ్వర్య సిద్ధి ప్రదాయకుడయిన మహాదేవుని ఈ మూర్తిని నిరంతరము హృదయమందు ధ్యానము చేయవలెను. ధ్యానకాలమందు ఈ విధమయిన మూర్తిని చింతించి గణేశాది ద్వారపాలురను పూజింపవలెను.

తదుపరి పంచభూత శుద్ధి కావించి మహాదేవుని అష్టమూర్తి తత్వమును ఎనిమిది నామముల ద్వారా చింతించి, పిదప పూజింప వలెను. తదనంతరము ఆసనాది పూజన కావించి హృదయ పద్మమున అష్ట పుష్పముల చే పూజించి, నారాచముద్రచే తాడించి, ధేనుముద్ర చే విసర్జన కావించి, ఆ విసర్జన మాల్యమును చండికేశ్వరునికి సమర్పింప వలెను. పూర్వము తెలుపబడిన సమ్మోదాది మంత్రముల చే తన అంగ ప్రత్యంగములను మార్జన చేయవలెను. "బాలా, జ్యేష్ఠ, రౌద్రీ, కాళీ, కలవికరణీ, బలప్రమథినీ, సర్వభూతదమనీ, మనోన్మథనీ" వీరిని యధాక్రమేణ శంభు ప్రసన్నార్థము పుజింపవలెను. ఈ విధముగ పూజించి, మనసును ధ్యానయోగ్యము కావించి, గురువును, మంత్రమును భక్తిగా తలచుకొని, జపమాల ధరించి ఏకాగ్రముగ పంచాక్షర మంత్రమును గానీ, ప్రాసాదమంత్రము (హౌం)ను గానీ జపించినచో శీఘ్రముగ సిద్ధి కలుగును. ఈ విధముగ మీకు మంత్రము, పూజాక్రమము, ధ్యానము తెలిపితిని. ఇక మీరిరువురు నాటక పర్వతమున కేగి అచట శ్రీ కంఠ భగవానుని ఆరాధింపవలసినది.

భేతాళ భైరవులు "మహాత్మా! మీ అనుమతి తో మేము పంచాక్షరి మంత్రము నాలంబనము చేసికొని, ముదితమనస్సు, ఏకాగ్రభక్తితో మహాదేవుని ఆరాధించెదము అని పలికి అచట నుండి నాటక పర్వతమునకేగిరి. ఆ మహా పర్వతమున నిర్మల జలపూర్ణము, ప్రఫుల్ల కమలయుక్తము, దీర్ఘము పరమ రమ్యమయిన సరోవరము కలదు. అందు దేవ, కిన్నెర, ప్రమదాదులు నిరంతర నృత్య వాద్యములు కావించుచు ఆ ప్రదేశమును రక్షించుచుందురు. వీరి నృత్య వాద్యముల చే

కౌతూహలుడై మహాదేవుడు సహితము నృత్యము కావించుచుండును. ఈ నృత్య (నటన) కారణమున ఈ పర్వతమునకు నాటక పర్వతమును పేరు కలిగినది. ఈ శైలము ఛత్రాకారము కలిగినదై, శంకర ప్రియమై యొప్పును. సోదరద్వయము ఆ సరోవర తీరము చేరిరి కానీ మానవులగుటవలన వారు ఆ పరమ పవిత్రాశ్రమమును గుర్తింపరైరి. తదుపరి వారు మహాదేవునికి ప్రణామము లాచరించి, తీరమున సుందర స్థండిలము (అనుష్ఠాన భూమి) ను నిర్మించి, వశిష్ఠ మహర్షి ఆదేశించిన రీతిని మహేశ్వరోపాసన ఆరంభించిరి. భగవతీ సహిత మహాదేవుడు తమ పుత్రులు ఈ ఉపాసన యందు నిమగ్నులగుట గని ఆ ఆశ్రమము నందు నివసింపసాగిరి. దేవతలు సహితము ఆ ఆశ్రమ నికటమున నివాసము లేర్పరుచుకొనిరి. ఆ పర్వతపు అధోభాగమున భేతాళ భైరవులు, ఊర్ధ్వ భాగమున సురసహితుడై మహాదేవుడు నివాసమేర్పరుచు కొనిరి. అప్పుడప్పుడు నృత్య వాద్యములు వినిపించినప్పటికీ, సోదరులకు ముటుకు ఎవరునూ కనిపింపరైరి. తన పుత్రులు యోగమార్గమందు స్థిరులైన పిదప శివుడు సహితము తన యోగము నందు సుస్థిరుడయ్యెను. సోదరులిరువురు పూజన కాలమందే కాక అటునిటు తిరుగుచున్నపుడు, కూర్చొనినపుడు, సర్వసమయముల యందు, నిరంతరము మహాదేవుని స్మరించుచుండిరి.

ఈ విధముగ వారిరువురు ఉపవాసాది భోజన నియమములతో, మహాదేవ పరిచింతనా తత్పరులై, పంచాక్షరీ మంత్రము జపిచుచూ ఒక వేయి సంవత్సరములను ఒక్క వత్సరము వలె గడపిరి. అంత మహాదేవుడు ప్రసన్నుడై వారి ఎదుట ప్రత్యక్షమయ్యెను. తమ ధ్యానగమ్యమయిన వృషధ్వజుడు ఎదుట సాక్షాత్కరింపగనే వారిరువురు తొలుత తమ గురువయిన వశిష్ఠుని తలచి, పూజించి, తదుపరి ఉమాపతిని ఇట్లు కీర్తించిరి. "పంచముఖుడు, ప్రశాంత శరీరుడు, మహాకాయుడు, సర్వజ్ఞానమయుడు, సంసార సాగరమునుండి తరింపజేయు మహానుభావుడు, అయిన పరమాత్మకు ప్రణామములర్పించుచున్నాము. ప్రభూ! మీరేపరము, పరేశులు, పురుషోత్తములు, కూటస్థులు, పరివర్తనశూన్యులు, జగద్వ్యాపకులు, ప్రధాన పురుషోత్తములు. మీరు మహాత్ములు, పరమాత్ములు, తత్వజ్ఞానమయులు, సాంఖ్యయోగమునకు ఆలంబనము మరియు నిర్మల గుణత్రయమునకు జ్ఞాత. మీరే నిత్యానిత్యులు, జగత్కర్తా, జగద్భర్తా, జగత్ సంహార కర్త. మీరు ఒక్కటైనప్పటికీ అనేకులు, జగన్మయులు మరియు నిష్క్రియులు. మీరే నిర్వికార, నిరాధార, నిత్యానంద సనాతనులు. అనేక భ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులు. మీరే సవిశేషరూపులు, అణిమాది అష్టైశ్వర్య స్వరూపులు కానీ బంధన రహితులు. స్వామీ! మీరు స్వేచ్ఛగా ఈ భూమండమున కేతెంచిరి. మీరు సర్వవిదితులు కానీ కేవలము నిష్ఠుర కష్ట సాధనలచే మాత్రమే తెలియుదురు. మీరు ధవళవర్ణ పర్వతము వలె భాసించుచూ, ఫణిపతివేష్టితులై యుందురు. సూక్ష్మము కంటె సూక్ష్ములు, అవ్యయులు, దేవ దేవులు, మరియు సమస్త దేవగణములకు ఆశ్రయులు. మీరు ప్రళయకాలమందు స్థిరులై యుందురు. మీరు పవిత్రాత్మకుల హృదయ నివాసులై, ఏకాదశ ఇంద్రియముల చాలికులై యుందురు. మహాత్మా! మీరు ప్రభువులకు ప్రభువు, సర్వకారణ కారణము, ముని గణముల గతికారకము, యోగి గణముల ప్రాప్యము, విశ్వాత్మా, విశ్వరూపి! ప్రభూ! మీరు జ్ఞానామృత ధార కురిపించు పూర్ణచంద్రులు, మోహాంధకారమును విధ్వంసము కావించు ఆదిత్య మండలము, భక్తులకు సాక్షాత్ పితృపాదులు, మరియు కామమను ఏనుగును అంతము చేయు పంచాస్యులు. సమస్త లోకములకు ప్రధమ గురు స్వరూపము మీరే! మీరే భ్రహ్మరూపమున సృష్టించి, విష్ణు రూపమున పాలించి, రుద్ర రూపమున సంహారము కావింతురు. మీరే చంద్ర, సూర్య, వాయు, అగ్ని, జలము, పృధివి, ఆకాశము, మరియు యజ్ఞ స్థలహోత అయిన యజమాన స్వరూపమయిన అష్ఠమూర్తులు. మీరు అనంత స్వరూపులు అయినప్పటికీ భక్తుల ముఖ్య భూమికా ధ్యానతత్పరత వల్ల అష్ఠమూర్తులుగ వర్ణింపబడుచున్నారు. మీరే త్రయంబకులు, త్రిపురారి, శంభు, ఈశ, శమన, మరియు విధాత. ప్రభూ! మీరు సహస్రబాహు, హిరణ్యబాహు, సహస్రమూర్తి అయినప్పటికీ పంచముఖులే! సమస్త ప్రకృతినీ వీక్షించినప్పటికీ త్రినేత్రులే! సమస్త భోగ వస్తువులు మీ వద్ద యున్నప్పటికీ మీరు అనాసక్తులు. నిత్యానిత్య

స్వరూపులు, పరతత్వరూపులు; బ్రహ్మ, విష్ణువులు సహితము మీ ఆద్యంతములు కనుగొనలేరనిన ఓ! వృషధ్వజా! మేము మిమ్ము ఎట్లు స్థుతింపగలము? దేవదానవులు సహితము మిమ్ము లేశమయిన తెలియరనిన బాలురమయిన మేము ఏపాటి? వృషభారూఢా! కేవల భక్తి పూర్వకముగ మీకు ప్రణామములర్పించు చున్నాము. గిరీశా! మీకు మరల మరల ప్రణామములు!!! "

మహాదేవుడు ఈ భేతాళ భైరవ స్థవమునకు ప్రసన్నుడై ఇట్లనియె "వత్సలారా! నేను మీ తపోనిష్ఠ, ఇంద్రియ నిగ్రహము, సంయక్ ధ్యాన తత్పరత పట్ల సంతుష్ఠడనైతిని. మీ మనోవాంఛిత వరమును కోరుకొనవలసినది." అంత ఆ సోదరద్వయము "ఓ! వృషభవాహనా! మేము సదా పుత్ర భావముతో జగదీశ్వరులైన మిమ్ము అనుగమింప వలెను. మా నేత్రములు సదా మీ చరణ సందర్శనము చేయుచూ, సర్వ కర్మలచే మీ ధ్యాన, అర్చనాది కర్మములు కావించుచూ, కాలము వెళ్ళబుచ్చవలెను. ఇవి వినా మాకు రాజ్యకాంక్ష, ధనాభిలాష, వేరే ఇతర కోరికలు లేవు. మేము యధార్థముగ మీ పుత్రులమైనచో, మా భక్తి, నిష్ఠలతో మాయందు మీరు ప్రసన్నులైనచో, మా ఈ కోరికను మన్నించి, ఈ వరమీయ వలసినది." అంత పరమేశ్వరుడు దేవగణ సహితుడై చిరునవ్వులు చిందించుచూ, వారి పలుకులు విని వారికి దేవత్వము ప్రసాదించి, ఇంద్రుని ఆదేశించి, అమృతము తెప్పించి వారితో త్రావించెను. అమృత పానము చే వారిరువురు మానవ దేహము విడచి అమృతత్వము నొంది దైవశక్తి, దైవజ్ఞానము, దైవ రూపము ప్రాప్తించిరి. అంత పరమశివుడు వారితో "పుత్రులారా! నేను ప్రసన్నుడనైతిని. ఈమె నాపత్ని పార్వతి. నా చే ఈయబడిన ఈ శక్తి చే మీరు భగవతీ ఆరాధన కావింపవలసినది. నేను ఈమె వినా ఏ కార్యము సాధించుట యందు సమర్థుడను గాను. అందువలన మీరిరువరు ఈ భగవతిని శరణుజొచ్చి ఈమెను నిత్యము, నిరంతరము పూజింప వలసినది. ఆ భావము వహించిరేని భగవతి శీఘ్రముగ ప్రసన్నురాలగును."

**(శ్రీ కాళికా పురాణమందలి భేతాళ భైరవ గణాధ్యక్షత అను ఏబది ఒకటవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది రెండవ అధ్యాయము

**(మంత్రోపదేశము; మహామాయాకల్ప విధాన వర్ణనము)**

ఈ విధముగ భూతేశుడు, పరమేశ్వరుడు తెలుపుచుండగా భేతాళ భైరవులు హర్షోత్ఫుల్ల లోచనులై, ప్రసన్న హృదయులై వ్యోమకేశుని తో ఇట్లనిరి "భగవాన్! మాకు పార్వతీదేవి యొక్క మంత్ర, ధ్యాన, అర్చన, పూజాదికములు ఏవియును తెలియవు. వీని విషయమందు మాకు వలయు రీతిని వివరింపవలసినది." అంత మహాదేవుడు "వత్సలారా! మీకు ఆ విధివిధానములు అన్నింటినీ తెలిపెదను. దాని వలన మీకు సిద్ధి కలుగును." ఔర్వ మహాముని సగర చక్రవర్తికి ఈ విధముగ తెలుపుచూ ఒక్క క్షణము దీర్ఘ నిట్టూర్పు విడచి తిరిగి ఇట్లనియె "పురాతన కాలమందు మహేశుడు పార్వతీ పూజా విధానమును పదునెనిమిది పటలముల విస్తృత విద్యాకల్పముగ రచించెను. సగరుడు "మహాత్మా! నేను మహాదేవ విరచితమయిన ఆ సర్వ పూజా విధిని తెలిసికొన గోరుచున్నాను. దయచేసి శెలవీయ వలసినది." ఔర్వుడు "మహారాజా! మహాదేవ విరచితము, అత్యంత విస్తృతము అయిన ఆ విధిని వివరించుటకు దీర్ఘకాలము పట్టును. అందువలన సారభూతమయిన మహాదేవ వ్యాఖ్యానమును తెలిపెదను."

మహాదేవుడు "వత్సలారా! మీకు అత్యంత గుహ్యతమమైన అష్టాక్షర మంత్రమును తెలిపెదను. ఏకాగ్రతతో వినవలసినది. ఈ వైష్ణవీ మంత్రమునకు ఋషి నారదుడు, దేవత శంభుడు, అనుష్టుప్ ఛందస్సు. ఇయ్యది సర్వకార్య సిద్ధి

కొరకు వినియోగకరము. ఈ మంత్రాక్షరములు "అకచటతపయష" (అంకం చంటం తం పం యం షం). ఈ అష్టాక్షర మంత్రమునకు పూర్వమున "ఓం" అను ప్రణవమును కలిపి సాధకులు జపించవలెను. ఈ వైష్ణవీ మంత్రము రక్తకమల (ఎర్రని కమలము) ప్రభాయుక్తము, అత్యంత గుహ్యాము. మంత్రము దేహము వంటిది. అందువలన ఇయ్యది అంగములు కలిగి యుండును. ఈ మంత్రము యొక్క ఆకార, అంగ, ప్రభలు విశేషముయినవి.

మహాదేవుని ఊర్ధ్వముఖ మంత్రాక్షరమైన "ఓం"కారము ఈ మంత్రము యొక్క బీజము. "య" కారము శక్తి. దీని పూజా పద్ధతి (కల్పము) తెలిపెదను. తొలుత తీర్థము, నది, జలాశయము, తోట మొదలగు నీటి వసతులందు ఎందైననూ, ఇతరుల తో సంబంధము లేకుండ స్నానమాచరింపవలెను. తదుపరి ఆచమనాదులు కావించి, పవిత్రులై ఆసనము గ్రహింపవలెను. తదుపరి ఉత్తరాభిముఖులై "యూం.స:క్షిత్యా" ఈ మంత్రముల చే పూజావేదిని స్వయముగ మార్జనమొనర్చ వలెను. పిదప "ఓం హ్రీం స:" మొదలగు మంత్రముల చే భూతోపసారణము కావించి భూత ప్రేతాదులను పారద్రోల వలెను. అపుడు పవిత్రీకరణము కావించుకొని, కుడి చేతి యందు బంగారపు ఘంటము కానీ, కుశలు గానీ ధరించి, వానితో పూజావేది యందు "ఓం వైష్ణవ్యై నమ:" అని కానీ, లేక పైన తెలిపిన వైష్ణవీ మంత్రమును కానీ వ్రాయవలెను. తదుపరి కుశలతో సమాంతరముగ త్రికోణ మండలము నేర్పరుపవలెను. నిత్య పూజార్థము చూర్ణముతో మండలమును నిర్మింపనవసరము లేదు. కానీ కామ్య సిద్ధికి, మరియు పురశ్చరణమునకు చూర్ణమండలము నిర్మింపవలెను. మండల నిర్మాణమందు రేఖలు తొలుత ఉత్తరమునకు, పిదప పశ్చిమమునకు, తదుపరి దక్షిణమునకు, చివరగ తూర్పునకు ఏర్పరచ వలెను. ద్వారములు, అక్షరములు సహితము ఇదే క్రమము పాటింపవలెను. పిదప "ఓం హ్రీం శ్రీం స:" అను మంత్రము తో మండల పూజనమొనర్పవలెను. తదుపరి తన హస్తముల నుపయోగించి అష్టదిక్కుల దిగ్బంధనము కావింప వలెను. ఎనిమిది యవ ధాన్యముల పరిమాణము ఒక అంగుళము. ఇరువది నాలుగు అంగుళములు ఒక అడుగు లేక హస్తము. సాధారణముగ మండలము ఒక హస్తము పరిమాణమున యుండవలెను. మండలాంతర్గమున ఒక అరచేయి పరిమాణమున పద్మముండవలెను. పద్మము యొక్క రేకులు కలసియుండి అందలి కర్ణిక పద్మపు పరిమాణమునకు సగము యుండవలెను. దీనికి మధ్య చిన్నని ద్వారముండవలెను. ఈ ద్వారము మరీ చిన్నది, పెద్దది కాక సమముగ యుండవలెను. ఈ మండలము ఎర్రని వర్ణ యుక్తమై, స్పష్టముగ గీయబడినదై యుండవలెను. ఈ మహామాయా మండలము ఈ విధముగ తెలుపబడిన రీతిలో కాక భిన్నముగ లేక హీనముగ నిర్మించిన ఎడల, అభీష్ట కామనా ప్రాప్తి కలుగదు. అందువలన మండల నిర్మాణము స్పష్టముగ తెలుపబడినది.

**(శ్రీ కాళికా పురాణ మందలి మండల వర్ణనమను ఏబది రెండవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది మూడవ అధ్యాయము

**(మహామాయా కల్ప ధ్యాన, న్యాస వర్ణనము)**

మహాదేవుడు తిరిగి పలుకనారంభిచెను" వత్సలారా! ఇపుడు "లం" అను మంత్రాక్షరమును ఉచ్చరించుచూ అర్ఘ్య పాత్ర యంచుటకు ద్వార, కమల రహితమైన ఒక చతుష్కోణ మండలమును నిర్మింపవలెను. తదుపరి "ఓం హ్రీం శ్రీం" అను మంత్రము పలుకుచూ అర్ఘ్య పాత్రను అందు స్థాపించి "ఓం హ్రీం హ్రౌం" అను మంత్రము చే అర్ఘ్య పాత్ర యందు గంధ, జలములు చిలకరింపవలెను. ఇపుడు "హ్రీం" మంత్రము నుచ్ఛరించుచూ ఆసన పూజ కావింపవలెను. పిదప "క్లైం" మంత్రము చే గంధ పుష్పాదులు ఉపయోగించి తన శిరస్సును అర్చించుకొనవలెను. తదుపరి "ఓం హ్రీం

స:" అను మంత్రముతో వామహస్తమందు పుష్పము నిడుకొని, దక్షిణ హస్తముతో పూజ చేసి, పిదప ఆ పుష్పమును వాసన చూసి, అదే మంత్రోచ్చారణ కావించుచూ ఆ పుష్పమును ఈశాన్య కోణ మందు విడువ వలెను. ఇపుడు చేతుల యందు ఎర్రని పుష్పము స్వీకరించి, చేతులను కచ్ఛపాకృతి (కచ్ఛప ముద్ర) యందుంచి, తదుపరి దహన, ప్లవనాది కార్యక్రమములు ఆచరింప వలెను.

**కచ్ఛప ముద్ర:**

1. ఎడమ చేతి బొటన వ్రేలిపై కుడి చేతి తర్జనని యుంచవలెను.
2. ఎడమ చేతి తర్జని పై కుడి చేయి కనిష్ఠకను యుంచవలెను.
3. కుడి బొటన వ్రేలు ఎడమ బొటన వ్రేలి క్రింది, వెనుక భాగమున యుంచవలెను.
4. కుడి చేయి మధ్య మరియు ఉంగరపు వ్రేళ్ళను ఎడమ చేయి బొటన వ్రేలు, తర్జనిల మధ్యగా పోనిచ్చి, ఎడమ చేయి వెనుక భాగమున యంచవలెను.
5. ఎడమ చేయి మధ్య, ఉంగరము, కనిష్ఠకలను కుడి చేయి వెనుక భాగమున యుంచవలెను.

ఇపుడు హస్తములందు కచ్ఛప ముద్రయుంచి, సాధకుడు కన్నులు మూసికొని సమోకాయ శిరోగ్రీవముతో, హృదయమందు ఈశ్వర చింతన కావింపవలెను. దహన ప్లవనాది క్రియలు హృదయమందే కావింపవలెను. ఎట్లనగా తొలుత అగ్నితత్వమును వాయువు నందుంచి, వాయువును జలమునందు, జలమును హృదయమందుంచి, హృదయమును ఆకాశమందు నిక్షిప్తమొనర్పవలెను. "ఓం హూం ఫట్" అను మంత్రముతో జీవుని మస్తకమందలి బ్రహ్మ రంధ్రము ద్వారా ఆకాశమందు స్థాపింప వలెను. ఇపుడు వాయు, అగ్ని, యమ, ఇంద్ర, వరుణ బీజములైన "యం, రం, మం, లం, వం" లను క్రమముగ ఉచ్ఛరించుచూ సాధకుడు ఆత్మశుద్ధికై శోషణము, దహనము, ఉత్పాదనము, అమృతీకరణము, మొదలగు క్రియలన్నింటినీ మానసికము గనే కావింపవలెను. ఇపుడు దేవీ బీజమయిన "లం" ను ఉచ్ఛరించుచూ, అణురూపమయిన స్వర్ణ బ్రహ్మాండమును "ఓం హ్రీం శ్రీం" అను మంత్రము నుపయోగించి మానసికముగ రెండు భాగములుగ విభజింప వలెను. ఇందు ఊర్ధ్వ భాగము ఆకాశ, స్వర్గములు గనూ, అధో భాగము, పృధివీ, పాతాళములగనూ భావింప వలెను. ఇపుడు ఈ పృధివీ భాగమందు ఒక ఇక్షు సాగరమును, దాని మధ్య స్వర్ణ ద్వీపమును, దాని మధ్య సదా మందాకినీ జలములతో తడుపబడుచున్న రత్న మండపమును, దాని యందు ఒక రత్న పర్యంకమును భావన చేయవలెను. ఈ పర్యంకముపై విరిసిన ఎర్ర కమలమును, ఈ కమలము యొక్క నాళము స్వర్ణ వర్ణమున సప్త పాతాళ పర్యంతము యుండి, ఊర్ధ్వమున ఈ కమలము బ్రహ్మలోక పర్యంతము వ్యాప్తి చెందినటుల భావింపవలెను. ఈ పద్మ కేసరములు స్వర్ణ వర్ణమున ప్రకాశించుచున్నవి. ఈ కమలమందు స్థిర స్థిత అయిన మహామాయను సాధకుడు ఏకాగ్రతా చిత్తముతో భక్తి పూర్వకముగ ధ్యానింప వలెను.

ఈ దేవి రక్తవర్ణ కమలకాంతి తో భాసించుచూ, పొడవాటి కేశపాశము కలిగి, నెమ్మదిగ కదులుచూ కాంతులీనుచున్న స్వర్ణ రత్న జటిత కుండలాలంకృతాంగై, తెలుపు, నలుపు, ఎరుపు వర్ణమున యున్న మూడు సుందర నయనములు కలిగి యుండును. ఈ దేవి చంచల నేత్రయై సంధ్యాకాలపు చంద్రకాంతిని సంతరించుకొనిన కపోలములు కలిగి, దానిమ్మ గింజల వంటి దంత పంక్తితో, ఎర్రని కాంతి గల చిగుళ్ళతో, సంపెంగి వంటి నాసికతో, శంఖము వంటి కంఠముతో, సుందరముగ తీర్చిదిద్దిన కనుబొమలతో, చతుర్భుజయై, మందార పుష్పము వలె ఎర్రని కాంతితో భాసించుచున్న దుకూలధారియై, పీనోన్నత పయోధరయై, కోటి సూర్యుల కాంతితో ప్రకాశించు చుండును. ఈ దేవి తన కుడివైపు పైచేతిలో కృపాణము, క్రింది చేతిలో పాశము, ఎడమ చేతుల యందు వరదాభయ ముద్రలు ధరించి యుండును. ఈ దేవి మంద గజరాజ గమనయై నొప్పారును. అంతేకాక ఈ దేవి నీవారాసనమందు బద్ధ పర్యంకముద్ర వైచికొని, రత్న

స్థంభమును ఆనుకొని సుఖస్థితయై యుండును. ఈ దేవి ఎల్లప్పుడూ భక్తులను "ఇంకనూ మీకు ఏమి కావలయును?" అని అడుగుచూ, తన సింహ వాహనమును వీక్షించుచుండును. ఈ దేవతామూర్తి మణిరత్న మాలాలంకృతయై, రత్న స్వర్ణ ఖచిత దివ్యాభరణ భూషితయై, సుచిస్మితయై, కోటి సూర్య ప్రభారాశియై, సర్వాంగ శుభ లక్షణ లక్షితయై, ముగ్ధ మనోహర యువావస్థయందున్న స్త్రీమూర్తి వలె ప్రకాశించుచుండును.

ఈ విధమయిన అంబికా దేవి యొక్క రూపమును చింతించుచూ, "నేను సహితము ఈ దేవి యొక్క రూపమునే" అని మనసున తలంచి, ఆ రూపమును "నమ:ఫట్" అను మంత్రముతో శిరస్సుపై న్యాస మొనర్చ వలెను. తదుపరి "ఓం క్లాం" మొదలగు మంత్రములను దీర్ఘము కావించి కరన్యాసము, "ఫట్" మొదలగు మంత్రముల తో అంగన్యాసము, శిరము, శిఖ, కవచము, నేత్రములతో మొదలుపెట్టి సర్వావయవముల యందు న్యాసమొనర్చ వలెను. ఈ ప్రకారముగ శరీరమును, మనసును మాలిన్యముల నుండి శుద్ధి కావించుకొనిన మానవునకు స్థిరత్వము కలిగి ధ్యానము ధృఢముగ కుదురును.

**(శ్రీ కాళికా పురాణమందలి ధ్యాన న్యాస వర్ణనమను ఏబదిమూడవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది నాల్గవ అధ్యాయము

**(మహామాయా కల్పమందు పూజావిధి వర్ణనము)**

మహానుభావుడయిన శితికంఠుడు తిరిగి చెప్పదొడంగెను "అర్ఘ్యపాత్రపై మనసు నుంచి, ఎనిమిది మార్లు మూల మంత్రమును జపించి, అటు పిదప అర్ఘ్య పాత్ర యందలి పుష్పముతో ఆ పాత్ర యందలి నీటిని తీసికొని, తొలుత రచించిన మండలము పై, మరియు ఆసనముపై, పూజోపకరణముల పై మౌనముగ "ఓం ఐం హ్రీం హ్రౌం" అను మంత్రమును జపించుచూ చిలకరించి పవిత్రీకరణము చేయవలెను. తదుపరి దేవి యొక్క ద్వార పాలురును, ఆసనములను పూజింపవలెను. దేవికి నంది, భృంగి, మహాకాల, గణేశులను నలుగురు ద్వారపాలురు కలరు. వీరందరినీ క్రమముగ ఉత్తరదిశ నుండి మొదలుపెట్టి మధ్యన యున్న ఆసనముతో సహితము అందరినీ పూజింప వలెను. మండలమునకు పార్శ్వమున ఆగ్నేయాది దశ కోణములందు దిక్పాలురతో పాటు ధర్మాధర్మములను పూజింపవలెను. మండలము నందు రవి, అగ్ని, చంద్ర, వాయువు, మొదలగు దేవతలకు పద్మమయ స్థానములనమర్చి మండలమును పరిపుష్ఠము కావింపవలెను. అంతేకాక త్రిగుణములను (సత్య, రజస్, తమస్సు), యోగ పీఠికను, గురు చరణములను, శారదాదేవిని, బ్రహ్మ పీఠమును సాంగోపాంగముగ పూజింపవలెను. బ్రహ్మాండము, హిరణ్య గర్భుడు, త్రిమూర్తులు, సప్తద్వీపములు, సముద్రములు, వాని యందు స్వర్ణద్వీపము, అందు స్వర్ణ ఖచిత స్థంభములతో కూడిన పర్యంకము, దానిపై కమలము; ఇవన్నియు మండలమందు ఉపస్థితమైనట్లు భావన చేయవలెను. తదుపరి ఇటువంటి మండల మధ్యమున పంచముఖుడు అయిన పరమేశ్వరుని పూజింపవలెను. ఇపుడు "హ్రీం" మంత్రముచ్ఛరించుచూ, రెండు చేతులతో కచ్ఛపముద్ర యొనర్చి, ఇత:పూర్వము హృదయము నందు నిక్షిప్తము చేసికొనిన (పూర్వోక్తు అధ్యాయము నందు తెలుపబడిన) దేవీ రూపము యొక్క ధ్యానమాచరింప వలెను. మానసికముగ ఆ దేవికి షోడశోపచారములు కావింపవలెను.

పిదప వాయుబీజం "వం" తో కుడినాసిక నుండి వాయువును వెలివర్చుచూ "క్రీం" మంత్రోచ్ఛారణ ద్వారా హృదయస్థమయిన దేవీ రూపమును మండలమందు స్థాపింపవలెను. ఈ కార్యమాచరించునపుడు చేతులు ఎట్టి పరిస్థితులయందు కూర్మముద్రను విడువవలదు. అట్లు గాక చేతులు విడవడిన ఎడల పూజాఫలము గంధర్వుల చే

అపహరింపబడి సాధకునకు ఫలము లభింపదు. పిదప సాధకుడు శిరసు వంచి "మహామాయైచ విద్మహే చండికాయై ధీమహి; ధియోయోన: ప్రచోదయాత్" అను మంత్రమునుచ్చరించుచూ దేవిని ఆవాహన కావింపవలెను. అంత "స్నానీయం దేవితో తుభ్యం ఓం హ్రీం శ్రీం నమ:" అని పలుకుచూ పవిత్ర జలములను స్నానార్థము సమర్పింపవలెను. తదుపరి మూల మంత్ర సహితముగ గంధ, పుష్ప, ధూప, దీపములు అర్పించి, మోదకములు, పాయసము దేవికి సమర్పింపవలెను. వీటితో పాటు వివిధ రకములయిన ఫలములు, బెల్లము, పాలు, పెరుగు, నేయి, ఎర్రని పుష్పములు, రజిత స్వర్ణ మాలలు, భక్ష్య భోజ్యములు, దానిమ్మ, వెలగ, మామిడి, గుమ్మిడి, బూడిదగుమ్మడి, ఆనప మొదలగు ఫలములు, కాయగూరలు, కమల నాళములు, కొబ్బరినీరు దేవికి ప్రయత్న పూర్వకముగ సమర్పింపవలెను. దేవికి ఎర్రని పట్టు వస్త్రము ప్రియము. దానిని సమర్పింప వలెను. ఎప్పుడూ నీలి లేక నల్లని వస్త్రము దేవికి బహూకరింపరాదు. పొగడ, నాగకేసరము, మల్లి, మందారము, నువ్వుల పుష్పము, గన్నేరు, ఎర్రజిల్లేడు, బూరుగ, కోమలమయిన దూర్వాంకురములు, కుశలు, కమలము, మారేడు పత్రములు, రక్త కమలము (ఎర్రని కమలము) దేవికి కడు ప్రియమైనవి. అయినప్పటికీ అంబికాదేవికి సర్వ పుష్పములు ఉపయుక్తములే! ఈ పుష్పపత్రములందు మందారము, పొగడ, మల్లె, త్రిపత్రయుతములయిన బిల్వ పత్రములు విశేషముగ ఉత్తమములు అని తెలియనగును. పొగడ లేక మందారమాల దేవికి అత్యంత ప్రసస్తము. దేవికి మల్లెపూలు సమర్పించిన ఎడల ఆ సాధకులకు తను అభీష్ఠములు నెరవేరి నా (శివుడు) లోకము ప్రాప్తించెదరు. నైవేద్యములయందు పాయసము, మోదకములు ఉత్తమము.

దేవికి ప్రయత్న పూర్వకముగ కాలీయకము తో మిశ్రితమయిన శీతల చందనపు అనులేపనమును సమర్పింప వలెను. సుగంధములందు కర్పూరము, కుంకుమ, కూర్చ, కస్తూరి, కాలీయకము, మొదలగునవి దేవికి అత్యంత ప్రసన్న కారకములు. యక్షధూపము, ప్రతివాహకము, పిండధూపము, గోళకము, అగరు, సింధువారము, ఇవి దేవికి అత్యంత ప్రసన్నత కలిగించు ధూపములు. సింధూరము అంగరాగములందు మిన్న. నైవేద్యముల యందు మధువు, మాంసముల చే వండబడిన అన్నము (చిత్రాన్నము), అటుకులు, అన్నపు పాయసము, ఉత్తములు. దేవికి స్నానయోగ్యమయిన జలములు – రత్నముల చే శుద్ధి కావింపబడిన జలము, పుష్పయుక్త జలము, కర్పూరము, గోరోచనము (ఆవు పేడను మంటబెట్టగా లభించిన విభూతి) కలిపిన నీరు, స్వర్ణ లేక తగర పాత్ర యందుంచబడిన నీరు ఉత్తమము. సర్వ దీపముల యందును ఆవు నేయితో వెలిగించిన దీపము ఉత్తమము.

మూలమంత్రము జపించుచూ మూడు మార్లు శ్రద్ధగా పుష్పాంజలి సమర్పించవలెను. ఈ విధముగ భగవతి యొక్క పూజ సలుపుచూ, ఉపచారములు కావించుచూ అరువది నాలుగు యోగినులను మండల మధ్య భాగమున పూజింపవలెను. వారి యందలి కొందరి నామములు "కామేశ్వరీ, గుప్తదుర్గ, వింధ్య కంధరవాసినీ, కోటీశ్వరీ, దీర్ఘిక, ప్రకటీ, భువనేశ్వరీ, కామాఖ్యా, ఆకాశగంగా, ధిక్కరవాసినీ, మాతంగీ, లలిత, దుర్గ, భైరవీ, సిద్ధిదా, బలప్రమదినీ, చండీ, చండోగ్రా, చండనాయికా, ఉగ్రా, భీమా, శివా, శాంతా, జయంతీ, కాళికా, మంగళా, భద్రకాళీ, శివా, ధాత్రీ, కపాలినీ, స్వాహా, స్వధా, అపర్ణా, పంచపుష్కరిణీ, దమనీ; వీరు సర్వ ప్రాణులను ప్రోత్సాహము, దమనము కావించెదరు. వీరి పూజ మండల మధ్య భాగమున కావించి, ఇపుడు మూల మంత్రము పఠించుచూ హృదయము, శిరస్సు, శిఖ, కవచము, నేత్రము, బాహువులు, పాదముల యందు న్యాసము కావింపవలెను. ఈ క్రమములో మూల మంత్రము యొక్క ఒక్కొక్క అక్షరమును జోడించుచూ పూజింపవలెను. దేవి యొక్క ఖడ్గము, సిద్ధ సూత్రములను పూజించుటకు సహితము ప్రత్యేక మంత్రములున్నవి. వానిని ఈ ప్రత్యేక మంత్రముల చేతనే పూజింపవలెను.

తదుపరి అష్ఠదళ కమలమునందు తూర్పు, ఉత్తర, పడమర, దక్షిణ దిశల మందు వరుసగా శైలపుత్రీ, చండఘంట, స్కంధమాత, కాళరాత్రి మొదలగు నలుగురు దేవతలను, ఆగ్నేయ, వాయువ్య, నైఋతి, ఈశాన్య కోణములందు చండిక,

కూష్మాండ, కాత్యాయినీ, మహాగౌరీ, దేవీమూర్తులను పూజింపవలెను. పిదప ఎనిమిది మార్లు మూలమంత్రమును పఠించి "మహామాయా క్షమస్వ" అని పలుకుచూ కమల కర్ణిక యందు మహామాయను పూజింపవలెను. ఈ కల్పము (పూజా పద్ధతి) ప్రకారము కామాఖ్యా దేవి పూజనమొనర్చిన ఎడల, దేవి ఆ మండలమందు ఉపస్థితయై, నివేదింపబడిన పదార్థములను స్వయముగ స్వీకరించి సాధకుల కామనలను పరిపూర్ణముగ అనుగ్రహించును.

**(శ్రీ కాళికా పురాణమందలి మహామాయా పూజావిధి యను ఏబది నాల్గవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది ఐదవ అధ్యాయము

**(బలి విధానము)**

పై విధముగ పూజ పరిసమాప్తి కావించిన పిదప దేవికి అత్యంత ఆనందదాయిక మయిన బలిదానకర్మము నాచరింపవలెను. తొలుత మోదకములతో గణేశుని, హవిష్యముతో సూర్య భగవానుని, సంతుష్ఠుల గావించి, పిదప నృత్య, గీత, వాద్యములతో శివుని, నియమిత ఆచారములతో విష్ణువును, బలిదానము తో చండికను ప్రసన్నము కావింపవలెను. పక్షులు, కూర్మము, మొసలి, పంది, గోపురంకోతి, చామరీ మృగము, కృష్ణసారమృగము, కుందేలు, సింహము మొదలగు ఈ తొమ్మిది రకముల మృగములు, చేపలు, సాధకుని రక్తము, ఇవన్నియు మహాబలులని తెలుపబడినది. కొన్ని విశేష అవసరములందు గుఱ్ఱము, ఏనుగు, మేక, శరభము, మానవ బలులు కూడా మహాబలి అని తెలుపబడినది. ఏ ప్రాణి యొక్క బలిదానము అయిననూ "బలి" అని తెలుపబడినది. ఉపస్థితమయిన బలి పశువునకు స్నానమొనరించి సాధకుడు దేవి యొక్క పుష్ప, చందన, ధూపములతో, బలి మంత్రముల తో, శ్రద్ధగా పూజింపవలెను. తదుపరి సాధకుడు ఉత్తరదిశగా కూర్చొని, బలి పశువు ముఖము తూర్పునకు యుంచి, బలి పశువును వీక్షించుచూ ఈ మంత్రమును పఠింపవలెను; "ఓ! పశువా! మీరు నా భాగ్యవశమున ఈ బలి పశువు రూపమున ఇచట ఉపస్థితయై యున్నారు. మీకు ప్రణామములు అర్పించుచున్నాను. మీరు సర్వరూపులు అయినప్పటికీ బలిరూపమున యుండి, చండికాదేవికి బహుమతి అయి, దాతయొక్క విపత్తులను వినాశమొనర్చువారు. ఓ! వైష్ణవీ మహామాయ యొక్క బలిపశువా! మీకు మరల మరల ప్రణామములు. స్వయముగ బ్రహ్మ యజ్ఞముల కోసమై పశువులను సృష్ఠించెను. అందువలన నేడు మిమ్ములను వధించుచున్నాను. అందుచేత యజ్ఞార్థమై జరుపబడు వధ నిజమునకు వధ కాదు."

భైరవా! ఈ విధముగ కామరూపధారిగ బలిపశువును గూర్చి చింతించుచూ అద్దాని శిరముపై "ఓం ఐం హ్రీం శ్రీం" అను మంత్రోచ్చారణ కావించుచూ పుష్పములు వేయవలెను. పిదప దేవిని లక్ష్యముగ యుంచుకొని, తన అభీష్ఠమును మనసున తలంచి బలిపశువును అభిషేకమొనర్చి, కరవాలమునకు పూజనమొనర్పవలెను. కరవాల పూజన మంత్రము "ఓ! ఖడ్గమా! నీవు చండికాదేవి యొక్క నాలుకవు. నీవు దేవలోకమును ఉపలబ్ధ మొనరించు దివ్యజీవివి." ఈ విధముగ ధ్యానమొనర్చి "ఐం హ్రీం శ్రీం" అను మంత్రములతో ఖడ్గ పూజన మొనర్పవలెను. ఖడ్గ స్థితి: మంత్రార్థము "ఓ! శ్యామవర్ణ ఆయుధమా! నీవు పినాకపాణి, కాళరాత్రి స్వరూపి, ఎర్రని రంగుతో తేజరిల్లెడి ముఖము, నేత్రములు కలది, ఎర్రని మాలలు, వస్త్రధారణ కావించిన రక్త చందనధారి, పాశహస్తి, తన పరిజనుల మధ్య మద్యమాంసాది భోజనము, రుధిరపానము సలుపు మహా అసి; ఓ! తీవ్రమయిన అంచులు కల మహా కరవాలమా! నీవు దుష్టులను భక్షించి, ధర్మ పాలన కావించి, తదుపరి ఐశ్వర్య, ప్రతిష్ఠ, విజయములకు ప్రతీకవు. నీకు నమస్కారము! నీకు నమస్కారము!!! ఈ విధముగ ఖడ్గమును పూజించి "ఓం ఆం హ్రీం ఫట్" మంత్రోచ్చారణ కావించుచూ ఖడ్గమును గ్రహించి, బలి పశువును

ఖండింపవలెను. తదుపరి బలి పశువు యొక్క రక్తమును జలము, ఉప్పు, ఫలములు, మధువు, గంధ పుష్పాదులతో ప్రయత్న పూర్వకముగ సుగంధ భరితమొనర్చి, "దాపయామితే ఓం ఐం హ్రీం శ్రీం కౌశికీ" నేను ఈ రక్తమును నీకు సమర్పించుచున్నాను." అని పలికి, రక్తమును ఒక పాత్ర యందుంచి, బలిపశువు యొక్క శిరమును ఒక సముచిత స్థానమందుంచి, అద్దానిపై ఒక దీపము నుంచవలెను. ఈ విధముగ పైన తెలిపిన రీతిని బలిదానమొనర్చిన సాధకుడు పూర్ణ ఫలితము నొందును. ఈ ప్రక్రియను తక్కువగ చేసిన ఫలితము తక్కువగనూ, ప్రక్రియను విధి విధానముగ అనుష్ఠింపని ఎడల ఫలితము నిష్ఫల మగును. భేతాళ, భైరవులారా! దుర్గాదేవికి సహితము బలిదాన విధానమిదియే!!

ఈ విధముగ బలిదానమొనర్చి, తిరిగి పూర్వము వలెనే జపమాల ధరించి, సాధకుడు దుర్గాదేవి యొక్క ధ్యాన మారంభింపవలెను. గురురూపమును మస్తకమందు, శ్వేత వర్ణమును గళమందు, మహామాయను హృదయమందు ధ్యానించి, చివరకు వీరందరినీ గురు పాదముల యందు మానసికముగ లయమొనర్చి జపమాచరింప వలెను. జపారంభ సమయమున గురువు, మంత్రము, దేవి, తాను (సాధకుడు) ఒక్కరే అని తలచి, మానసికముగ సుషుమ్న మార్గము గుండా షట్చక్రశోధన మారంభించి, తదుపరి ఒక్కొక్క చక్రమందు దేవిని దర్శించుచూ మూలమంత్రమును స్మరింపవలెను. చివరకు షోడశ చక్రము చేరి సర్వకామనలను ఈడేర్చునది, మహానందమయి అయిన దేవిని చింతించుచూ సాధకుడు జపమారంభించవలెను. మానవ శరీరమందు "ఇడ, పింగళ, సుషమ్న" అను మూడు నాడులు కనుబొమల మధ్యన నాలుగు అంగుళముల విస్తారమందలి షట్కోణాకృతినున్న కూడలి యందు కలియుచున్నవి. ఈ షట్కోణము ఎర్రని రంగు కలిగి "ఆజ్ఞా చక్రము" అని పిలువబడును. మానవుని కంఠమందు సహితము పైన తెలిపిన మూడు నాడుల సంగమస్థలి అరు అంగుళముల విస్తీర్ణమున తెల్లని శ్వేత వర్ణమున షట్కోణాకృతిలో యుండి "షట్చక్రమని" పిలువబడును. హృదయమందు సహితము ఈ మూడు నాడుల కూడలి ఏడు అంగుళముల పరిమాణమున పదహారు దళములతో "ఆదిషోడశ చక్రము" అని పిలువబడును. ధ్యానమునకు, మంత్ర చింతనకు, జపమునకు మూల స్థానము హృదయమే! అందువలన దీనిని ఆదిస్థానమనియు, ఇచటి చక్రమును ఆదిషోడశ చక్రమనియు పిలిచెదరు.

జపారంభమున సాధకుడు జపమాలను మండలమునకు లోపల స్థాపించి కానీ, లేక కుడిచేతియందు గ్రహించి కానీ అభిషేచనము కావించి ఈ క్రింది మంత్రము పఠించుచూ పూజింపవలెను. మంత్రార్థము "ఓ! మాలా! నీవు స్వయముగ మహామాయా రూపిణివి. సర్వ శక్తి స్వరూపిణివి. ధర్మార్థ కామమోక్షములు నీ ఆధీనమునందు యున్నవి. అందువలన నీవు నాకు (సాధకునకు) సిద్ధిని ప్రసాదింప వలసినది." ఈ విధముగ పూజించి మాలను కుడి చేయి మధ్య వేలు మధ్య భాగముతో గ్రహించవలెను. తర్జని వేరుగనూ, కనిష్ఠిక, ఉంగరపు వేలు కలిపి యుంచవలెను. మాల యందలి ప్రతి పూసను బొటన వ్రేలి అగ్ర భాముతో ముందుకు త్రోయుచూ, పెదవులతో నెమ్మది నెమ్మదిగ మంత్రోచ్చారణ కావింప వలెను. జపము చేయు నపుడు మాల యొక్క ముందు వెనుకలు తాకరాదు.(పూసలు). ఒకవేళ అట్లు తాకిన ఎడల జపము నిష్ఫలమగును. జప సమయమునందు మాలను కుడి చేయి యందు ధరించి, హృదయమునకు దగ్గరగ తీసికొని పోయి, దేవి యొక్క చింతన చేయుచూ జపము చేయవలెను. ఆ సమయమున మాలను ఎడమ చేతితో తాకరాదు. మాల స్ఫటికము, ఇంద్రాక్ష, రుద్రాక్ష, పుత్రజీవ ఫల బీజములు, సువర్ణము, మినుములు, కమలబీజములతో నిర్మింపవచ్చును. అక్షమాల లేక కుశలతో నిర్మించిన మాల దేవికి ప్రసన్నత కలిగించును. ఈ మాలను చేతిలోనికి తీసికొని మౌన జపము (ఉపాంశువు) కావింపవలెను. మాలలు అన్నింటి యందునూ రుద్రాక్షలనిన దేవికి అత్యంత ప్రీతికరము. ఈ రుద్రాక్షమాల ఇరువది ఎనిమిది లేక ఏబది అయిదు రుద్రాక్షల కంటె ఎక్కువ లేక తక్కువ యుండరాదు. మాల స్ఫటికము, ఇంద్రాక్ష లేక రుద్రాక్షలతో చేయబడిన ఎడల, వాని మధ్య పుత్రజీవాది ఇతరములు మిశ్రమము చేయరాదు. జపమాల యందు కేవలము ఒకే విధమయిన ఇంద్రాక్ష లేక రుద్రాక్షలు కాక మరి ఏ ఇతరములయిన

పూసలను కలిపిన ఎడల భగవతి వానికి మోక్షము నీయదు. అంతేకాక ఇష్ట కామనలు పూర్ణమవ్వవు. అట్టి మాలలతో జపమొనర్చు వారు వేద వేదాంగముల యందు నిష్ణాతులైనప్పటికీ ఈ పాప కర్మ వలన మరుజన్మము నందు ఛండాలురై జన్మించెదరు.

మాల యందు అతిపెద్ద పూస "మేరువు" అనబడును. దాని నుండి వరుసగా ప్రక్కన యున్న రుద్రాక్షలు క్రమముగా చిన్నవగుచూ యుండిన ఎడల, అయ్యది "సర్పాకార మాల" అగును. సాధకుడు తన మాలను తానే తయారు చేసికొనవలెను. దీక్షా రహితులైన మానవులను ఇందుకు ఉపయోగింపరాదు. మాల యొక్క మధ్యన దారములు మూడు ముడులు వైచి, చివర అరముడి వైచి, ప్రదక్షిణ క్రమములో పూసలను యుంచిన ఎడల అద్దానిని "భ్రహ్మ గ్రంధి" అనెదరు. మాల యొక్క దారములు, సుదృఢముగ యుండవలెను. జపమందు మాలను ఉపయోగించునపుడు మాల క్రింద పడరాదు, లేక తెగరాదు. మాల క్రింద పడిన ఫలితము నిష్ఫలమగును. మాల తెగిన ఎడల మృత్యువు సంభవించును. ఈ విధముగ సవిధి విధానముతో మాలను ఉపయోగించిన ఎడల సాధకునకు వాంఛిత కామనలు పూర్ణమగును. వీనిని విస్మరించిన ఎడల విపరీత ఫలితములు కలుగును. సాధకుడు ప్రయత్నపూర్వకముగ మంత్రము గణించుచూ జపము నాచరింపవలెను. గణింపకుండా కావించు జపము నిష్ఫలమగును. జపము ముగించిన పిదప మాలను శిరముపై లేక ఒక ఎత్తైన స్థలమునందుంచి, తదుపరి స్థుతి పాఠములను వల్లించి, అపుడు తన అభీష్ఠమును దేవతకు నివేదింపవలెను.

**స్థుతి – "సర్వ మంగళ మాంగల్యే శివే సర్వార్ధ సాధకే**
**శరణ్యే త్ర్యంబకే గౌరీ నారాయణి నమోస్తుతే ॥**

స్థుతి సర్వ కామనలను సఫలము కావించు మహామంత్రము. మంత్రార్ధము – సర్వ మంగళములు, కళ్యాణములు కావించునది, సర్వ కార్య సిద్ధి కలిగించునది, త్రినేత్రి, శరణు జొచ్చిన భక్తులను రక్షించు గౌరీ, నారాయణీ, నీకు నమస్కారము. ఈపై మంత్రమును ఏడు మార్లు పఠించి, "ఐంహ్రీంశ్రీం" మంత్రముతో అయిదు మార్లు ప్రణామములు కావింపవలెను. ప్రణామములు ఆచరించిన పిదప యోనిముద్ర ప్రదర్శించి, దేవికి విసర్జన కావింపవలెను. సాధకుడు యోనిముద్రను మూలమంత్రము పఠించుచూ మూడు సార్లు దేవికి ప్రదర్శింప వలెను. తదుపరి ముద్రను తన శిరసుపై ధరించి అటు పిమ్మట ఈశాన్య కోణ మందు తన అంగుళుల ద్వారా ద్వార, పద్మరహిత మండలమును నిర్మింప వలెను. అపుడు సాధకుడు "హ్రీం శ్రీం" మంత్రోచ్ఛారణ కావించి రక్తచండాదేవికి ప్రణామము లర్పించి, "రక్త చండాయై నమ:" అను మంత్రముతో పుష్పాది నిర్మాల్యమును ఆ మండలమందు విడువవలెను. అట్లు కాని ఎడల నిర్మాల్యమును జలమునందు కానీ, వృక్షమూలమందు కానీ విడువవలెను. ఈ విధముగ ఏ సాధకుడు విధి విధానముతో పూజాదికములు నిర్వర్తించునో అతడు శీఘ్రముగ మనోభిలాషితములైన అభీష్ఠములనొందును. సాధకుడు ఏబది వేల సార్లు జపమాచరించి, తదుపరి అనేక విధములైన నైవేద్యములను నివేదించిన ఎడల అయ్యది పురశ్చరణమగును.

సాధకుడు శుక్ల పక్షపు అష్ఠమినాడు ఉపవాసముండి, మండలము వంటి కుండము నేర్పరిచి, తదుపరి పంచరంగుల చూర్ణముతో మండలము నేర్పరుపవలెను. ఈ కార్యము సాధకుడు తన తండ్రి, మరియు గురువు సన్నిధిని చేయవలెను. పైన తెలిపిన విధముగనే పూజనమాచరించి, మూడు వేల సార్లు మంత్రము జపము చేసి, చివరగా బిల్వ పత్రములు, తిలలు, నేయితో మూడు వందల ఎనిమిది సార్లు ఆహుతులు సమర్పింప వలెను. సాధకుడు నైవేద్యము, గంధపుష్పములు, వస్త్రములు, తొలుత తెలుపబడిన దేవికి ప్రియమైన వస్తువులు, పాయసము నివేదింప వలెను. పూజాంతము నందు మూడు బలి దానములు సమర్పింపవలెను. నవమి నాడు తన సామర్ధ్యానుసారము సింధూరము, స్వర్ణము, రత్నములు, స్త్రీలకు ఆనందము కలిగించు ఆభరణములు, పుష్పమాల, బియ్యము నేయి కలిపిన చూర్ణము, సమర్పించి చివరగా స్వర్ణము, గోవులు, తిలలు గురువుకు దక్షిణగా సమర్పింప వలెను. గురువే గురుమంత్రమునకు మూలము. గురువు

శుద్ధుడయినచో, గురువు ద్వారా ఈయబడిన మంత్రము సఫలమగును. అందువలన దీక్ష తీసికొనకముందే గురువును ప్రయత్నపూర్వకముగ పరీక్ష చేసి గురువును స్వీకరింపవలెను. శాపగ్రస్తుడు, పుత్రహీనుడు, దోషి, పాపయుక్తుడు, జూదరి, క్రియాహీనుడు, అధార్మికుడు, మురగుజ్జు, గురువింద చేయువాడు, ఈర్ష్యాళువు అయిన గురువు నుండి మంత్రము గ్రహింపరాదు. సాధకుడు దుష్టత్వముతో, కోపముతో, మోసముతో, మోహముతో, గురుసమ్మతి లేకుండా, గురువును చూసి ఆయన పద్ధతిని అనుకరించుటతో మంత్ర గ్రహణము కూడదు. ఇది మంత్ర చౌర్యమనబడి, ఆ పాపకారణమున ఆ మానవుడు మూడు మన్వంతరములు నరకమందు యాతనలనుభవించి, తిరిగి పాప యోనులందు జన్మించును. ఉత్తమ బీజమును అడవి యందు ఎట్లునాటవలదో, అట్లే మంత్రము సహితము దుష్టుడు, క్రూరుడు, మూర్ఖుడు, మోసగాడు, పాపి అయిన వ్యక్తికి ఈయరాదు. సాధకుడు తన కామనా పూర్తికి ఒక లక్ష జపమాచరింప వలెను. ఏ సాధకుడు త్రిసంధ్యల యందును రెండు లక్షల మార్లు జపమాచరించుట చే, ఆతడు కవి, వక్త, పండితుడు యశశ్వి అగును. జపమాచరించి, తదుపరి అనేక విధములైన నైవేద్యములను నివేదించిన ఎడల అయ్యది పురశ్చరణమగును.

ఇపుడు సాధకులకు ఉత్తమ స్థలములు తెలిపెదను. ఏ ఏ నిర్జన స్థలములందు సాధకుడు పత్ర, పుష్ప, ఫల, జలములతో పూజన మొనర్చునో అచట దేవి స్వయముగ పూజను గ్రహించును. జపములన్నిటి యందును ఉపాంశువు (మౌన జపము) ఉత్తమము. అపవిత్ర అవస్థ యందు మహామాయా పూజనము ఎన్నడునూ ఆచరింపరాదు. ఒక వేళ సాధకుడు తీవ్ర భక్తుడయిన ఎడల మంత్రమును స్మరింపవచ్చు. నోటియందలి చిగుళ్ళు నుండి రక్తస్రావము జరుగుచున్న ఎడల, ఆ దశ యందు ఏ మంత్రజపము కావింపరాదు. అట్లు జపించిన ఎడల నరకగాములగుదురు. మోకాళ్ళపైన గాయమయిన ఎడల నిత్యకర్మ, మోకాళ్ళ క్రింద గాయమైన ఎడల నైమిత్తిక కర్మ ఆచరింప రాదు. జాతసూతకము నందు, క్షురకర్మయందు, మైథానావస్థ యందు, వాంతుల యందు, నిత్యకర్మ నిషిద్ధము. తినిన పదార్థము జీర్ణము కాని ముందు, జన్మ మరణ అశౌచములందు, భుజించునపుడు నిత్యకర్మ నిషిద్ధము. పత్రములు, పుష్పములు, వక్కలు, పిల్లి పిప్పలి మొదలగునవి ఔషధములుగ పరిగణింపబడును. ఇవి తప్ప మిగిలిన వేవియును తినినచో నిత్యకర్మ నిషిద్ధము. జలము సహితము ఔషధము వలె తప్ప మిగిలిన సమయములందు జలము త్రాగినచో నిత్యకర్మ నిషిద్ధము. జలగ, పాము, కీటకములు, కూర్మము, వీటిని చేతితో స్పర్శించిన ఎడల నిత్యకర్మ నిషిద్ధము. ఎవరేని మాతా పితరులు మరణించిన ఎడల ఒక వర్ష ప్రయుక్తము దేవీ పూజ మానసికముగ నైననూ పూర్ణముగ నిషిద్ధము. మహా గురువుల మరణానంతరము ఏదేని కామ్యకర్మ, ఋత్విక్ కర్మ, బ్రహ్మ, దేవ యజ్ఞములు, శ్రాద్ధాది కర్మలు కూడా నిషిద్ధము.

గురువుపై నిందలు మోపిన, బ్రాహ్మణుని పై ప్రహరించిన, వీర్యపాతమయిన పిదప నిత్యకర్మ నిషిద్ధము. ఆసనము, అర్ఘ్యపాత్ర పగిలిన ఎడల, నిత్యకర్మ నిషిద్ధము. ఊసర క్షేత్రములు, కీటకయుక్త స్థానములు, శుద్ధి చేసినప్పటికీ అచట పూజ నిషిద్ధము. భైరవా! సాధకుడు పవిత్రుడై, వినమ్రుడై, సమతల భూమి యందు చండిక లేక ఇష్ఠ దేవతా పూజనమొనర్చవలెను. దిశల యందు ఉత్తర దిశ శివా (పార్వతీ) దేవికి ప్రసన్నత కలిగించును. అందువలన పూజ ఉత్తరాభిముఖులై కావింపవలెను. పురుగులు పట్టినవి, చినిగినవి, పాతవి, భూమిపై బడి మలినమైనవి, కేశములతో కూడినవి, ఎలుకలు కొరికినవి, అయిన పుష్పములను ప్రయత్న పూర్వకముగ పూజయందు త్యజింపవలెను. ఇతరుల నుండి తీసికొని రాబడినవి, తనవి కానివి, అంత్యజుల ద్వారా స్పర్శింపబడినవి, పాదముల తో త్రొక్కబడినవి, అయిన వస్తువులను ప్రయత్న పూర్వకముగ పూజ యందు పరిత్యజింపవలెను. ఈ విధి విధానములు శివాదేవి యొక్క ఉత్తమ పూజా పద్ధతులు. ఎవరు వీనిని పాటించెదరో వారు వాంఛిత ఫలమును పొందెదరు.

**(శ్రీ కాళికా పురాణమందలి బలి విధానమను ఏబది అయిదవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది ఆరవ అధ్యాయము

**(కవచ వర్ణనము)**

పరమేశ్వరుడు చెప్పదొడంగెను "భేతాళ భైరవులారా! ఇపుడు వైష్ణవీదేవి యొక్క మంత్రమును, వైష్ణవీ కవచమును తెలిపెదను. మాలమంత్రము (అకచటతపయష). ఇందలి ప్రథమాక్షరము "అ" వాసుదేవ స్వరూపము. ద్వితీయాక్షరము "క" స్వయముగ బ్రహ్మ. తృతీయ అక్షరము "చ" చంద్రశేఖరుడు. చతుర్థము "ట" గణేశ స్వరూపము. పంచమమైన "త" దివాకర స్వరూపము. షష్ఠము "ప" స్వయముగ మహామాయ, జగన్మయి శక్తి స్వరూపము. సప్తమము "య" మహాలక్ష్మీ స్వరూపము. అష్టమమైన "ష" సరస్వతీ స్వరూపము. ఈ అష్టాక్షరములకు యోగినులు కూడా కలరు. "అ" కారమునకు యోగిని శైలపుత్రి, "క" వర్ణమునకు చండిక, "చ" వర్ణమునకు చంద్రఘంట, "ట" వర్ణమును కూష్మాండ, "త" వర్ణమునకు స్కంధమాత, "ప" వర్ణమునకు స్వయముగా కాత్యాయిని, "య" వర్ణమునకు కాళరాత్రి, "ష" వర్ణమునకు మహాదేవి యోగినులుగ తెలుపబడిరి. వైష్ణవీ తంత్రమందు ఎనిమిది కవచములు తెలుపబడినవి. అవి వరుసగా "వర్ణ కవచము, యోగినీ కవచము, దేవౌఘ కవచము, దేవీ దిక్కవచము, పార్శ్వ కవచము, ద్వితీయాష్టాక్షర కవచము, షడక్షర కవచము, అభేద్య కవచము." అవి సర్వులను రక్షించును. ఈ కవచములను పూర్ణముగ తెలిసికొనిన మానువుడు స్వయముగ మహామాయ యొక్క శక్తి చే స్వయముగ నా (శివ) స్వరూపుడగును.

**వర్ణ కవచము:** ఈ కవచమునకు ఋషి నారదుడు. అనుష్టుప్ చందస్సు. కాత్యాయిని దేవత. ఇయ్యది సర్వార్థ సాధకము. మంత్రార్థము – తూర్పున "అ" కారము, ఆగ్నేయమున "క" కారము, ఎల్లప్పుడూ రక్షించుగాక, దక్షిణమున "చ" కారము, నైఋతిన "ట" కారము, పశ్చిమమున "త" కారము, వాయువ్యమున శక్తి వర్ణమయిన "ప" కారము, "య" కారము  ఉత్తరమున, "ష/శ" కారము ఈశాన్యమున నన్ను రక్షించుగాక! "అ" వర్ణము మూర్ధన్యమును, "చ" ఎడమ భుజమును, "ట" హృదయమును, "త" కంఠ దేశమును, "ప" కటి ప్రదేశమును, "య" కుడి పాదమును, "ష' ఎడమ పాదమును రక్షించుగాక!

**యోగినీ కవచము:** తూర్పున శైలపుత్రి, చండిక ఆగ్నేయమున, యమభయము నుండి కాపాడు చంద్రఘంట దక్షిణమున, సంసారమును ఉత్పన్నము కావించు కూష్మాండదేవి నైఋతినీ, పశ్చిమమున స్కంధమాత, లోకులందరికీ స్వామిని అయిన కాత్యాయిని వాయువ్య కోణమున, కాళరాత్రి స్వయముగ కుబేర దిశ అయిన ఉత్తరమున, పవిత్ర మహాగౌరి ఈశాన్య కోణమున యుండి నిరంతరము నన్ను రక్షించుగాక!

**దేవౌఘ కవచము:** సనాతనుడయిన వాసుదేవుడు నా నేత్రములను, మాతృయోని నుండి కాక స్వయంభువుడై కమలమందు ఉత్పన్నమైన చతుర్ముఖ బ్రహ్మదేవుడు నా ముఖమును, చంద్రశేఖరుడు నా నాసికను, శివపుత్రుడు గణేశుడు నా రెండు స్థనములను, దివాకరుడు సూర్యుడు నా రెండు చేతులను, పరమేశ్వరి మహామాయ నా నాభినీ, మహాలక్ష్మీ నా  గుహ్య భాగమును, సరస్వతీ దేవి నా మోకాళ్ళను కాపాడు గాక!

**దేవీ దిక్కవచము:** శుభ స్వరూపిణి అయిన మహామాయ తూర్పు, శ్రేష్ఠమయిన ఆసనమును అలంకరించి అగ్నిజ్వాల ఆగ్నేయ కోణము, రుద్రాణి దక్షిణము, చండనాయిక నైఋతి కోణము, మహేశ్వరి అయిన ఉగ్రచండ పశ్చిమము, ప్రచండ వాయువ్య కోణము, ఘోర రూపిణి ఉత్తరదిశన, ఈశాన్యమున సనాతని అయిన ఈశ్వరీ దేవి, ఉపరిభాగమున (పైన) మహామాయ, పరమేశ్వరి క్రింద భాగము, ముందు భాగమున ఉగ్ర, వెనుక భాగమున వైష్ణవీ దేవి యుండి నన్ను రక్షించుగాక! సుందరి అయిన బ్రాహ్మణిదేవి కుడి భాగమున, వృషధ్వజ ధారిణి అయిన మహేశ్వరి దేవి నా ఎడమ

భాగము, పర్వతములందు కౌమారీదేవి, జలములందు వారాహీ, భయంకర దంష్ట్రలుకల మృగములున్న విపినములందు నారశింహీ, ఆకాశము నందు ఐంద్రీ, ఈ విధముగ జల స్థలములందు వీరందరూ నన్ను రక్షించుగాక! సేతువు (ఓం) నా సర్వాంగుళీయకములను, ద్రైవ్యై నా కర్ణములను, నమః నా చిబుకమును, శక్తి బీజమయిన "ప" కారము నుండి అయిదవ అక్షరమయిన "మ" వర్ణము నా పార్శ్వములను, "హ" వర్ణము నా ఊరువులను, మాయ నా తొడలను, "ఐ" వర్ణము రోమకూప సహిత సర్వాంగములను రక్షించుగాక! "వై" వర్ణము నా నాలుకను, "ష" వర్ణము నా నఖ, దంత, పెదవులు, చేతులను, ఎల్లప్పుడు నా సర్వాంగములను రక్షించుగాక! "ఓం" కారము బయటి నుండి నా సంపూర్ణ శరీరమును, దేవ్యై యందలి "వ్యై" నా వసతీ క్షేత్రమును, "నమః" శబ్దము నా స్థన గర్భాశయములను రక్షించుగాక!

**అభేద్య కవచము:** వైష్ణవీ మంత్ర తంత్రము నా షట్చక్రముల యందు, లలాట, హృదయ, స్కంధము లందు, బ్రహ్మ రంధ్రములందు, స్థితిగతమై నన్ను ఎల్లప్పుడూ రక్షించుగాక! ఇట్లే రెండవ అష్టాక్షరి అయిన "ఓం మహామాయాయై నమః" అను మంత్ర కవచము సర్వ కర్ణ నాడులను, పార్శ్వ కక్ష్యలను, శిఖ, రక్తము, స్నాయువు (కండరములు), మజ్జ, మస్తిష్కము, మరియు కీళ్ళ యందు, అన్ని వైపులనుండి నన్ను కాపాడు గాక! నా వాయువు, వీర్యము, నాభి, వీపు, కీళ్ళు మొదలగునవి "ఓం వైష్ణవ్యై నమః" అను షడక్షర మంత్రము చే రక్షింపబడు గాక! నా నాసికా రంధ్రములను మహామాయ, కంఠ రంధ్రములను వైష్ణవీ, సర్వావయవ కీళ్ళను భీషణ దుఃఖములను దూరమొనర్చు దుర్గాదేవి నన్ను రక్షించుగాక! నాసికను నిత్యము "హూం ఫట్ కాళికా" మరియు నేత్రములను నేత్ర బీజ త్రయము "ఐం హ్రీం శ్రీం" ఎల్లప్పుడూ కాపాడు గాక! నా నాసిక యందు "ఓం ఐం హ్రౌం చండికా," నా జిహ్వా మూలము నందు "ఓం హ్రీం హూం తారా" స్థితిగతమై నన్ను రక్షించుగాక. సేతువు (ఓం) ఉత్తమ జ్ఞానహేతువై హృదయమందుండి, "ఓం క్లౌం ఫట్ మహామాయ" మంత్రము నన్ను ఎల్లప్పుడూ అన్ని వైపుల రక్షించుగాక! ప్రాణ రక్షిణి అయిన "ఓం యుసః కౌశికీ" నా ప్రాణములను మరియు ఓం హ్రీం హౌం సౌః భర్గాదయిత" శరీర రహిత స్థితుల యందు, నన్ను రక్షించుగాక!

"ఓం నమః శైలపుత్రీ" మంత్రము నన్ను సర్వ రోగముల నుండి మరియు "ఓం హ్రీం సః స్పేం క్షః అస్త్రాయఫట్ శివదూతి" నన్ను యుద్ధము నందు సర్వ అస్త్రముల నుండి, మరియు సింహ వ్యాఘ్ర మృగముల నుండి; కర్ణ రంధ్రముల యందుండి "ఓం హ్రాం హ్రీం సః చంద్రఘంట" నన్ను రక్షించుగాక! "ఓం క్రీంసః" కామేశ్వరీదేవి సర్వ కామనల యందు రక్షించి, "ఓం ఆం హూం ఫట్ ఉగ్రచండా," శత్రువులు మరియు విఘ్నములు నష్ట పరచుట యందు కాపాడుగాక! "ఓం అం వైష్ణవీ జగదీశ్వరి" శూలము తోనూ, "ఓం కం బ్రహ్మాణి" చక్రము తోనూ, "ఓం చం రుద్రాణి" శక్తితోనూ, "ఓం టం కౌమారి" వజ్రము తోనూ, "ఓం తం వారాహి" బాణము తోనూ, "ఓం పం నారశింహి" రాక్షసులు మరియు అస్త్రభయము నుండి, "యం సం చండికా దేవ్యై నమోనమః" సర్వ శస్త్ర, యంత్ర, అనిష్ఠ కారక మంత్రముల నుండి, "ఐంద్రీ" విశ్వాస ఘాతకుల నుండి, "ఓం నమో మహామాయాయై నమోనమః" లేక "ఓం నమో వైష్ణవ్యై నమోనమః" సర్వత్ర సర్వ ప్రాణుల నుండి నన్ను రక్షించుగాక!!!

వైష్ణవీ దేవి యొక్క వరదాయకమయిన అష్టాక్షరీ మంత్రము (అకచటతపయుష) వాయుమార్గమందు ఆధార చక్రమందు, చంద్రుని వంటి శీతలయుతులైన కమలదళము వలె హృదయమునందు, సూర్యుని వలె సహస్రారమందు, అగ్ని వలె నా వసతీ క్షేత్రమందు ప్రవేశించుగాక! పద్మగర్భుని ప్రకాశము వంటి కాంతి గల ఈ పూర్ణము, ప్రధానము, శ్రేష్ఠమయిన ఈ బీజమంత్రమును బ్రహ్మ శిరము నందు, విష్ణువు గళమునందు, చంద్రచూడుడైన శివుడు హృదయము నందు దాల్చును. ఆ మహా మహితాన్విత మంత్రము నన్ను రక్షించుగాక! వైష్ణవీ మంత్ర తంత్రములందలి సర్వ వర్ణ, వర్గములకు ప్రథమము, సర్వసహిత, రహిత విసర్గ సహిత హల్లుల యందలి ఒక వేయి ఎనిమిది మంత్రముల యందు నివసించునది అగు సేతువు "ఓం" కారము. ఈ ఓంకారము ను పూర్ణముగ త్రిమూర్తులు సహితము తెలియరు.

ఇటువంటి ఓంకారము నన్ను పరాపరములందు, చావు పుట్టుకల యందు, పృధివ్యాకాశముల యందు, పవిత్ర తత్వమునందు రక్షించుగాక! ఓ! దేవీ! నీ దివ్య అష్టాక్షరి (అకచటతపయష) యందలి అష్టాక్షరములు అష్టాంగ యోగమందలి ఎనిమిది అంగములను (యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి); ఆయుర్వేదము నందలి ఎనిమిది అంగముల (ద్రవ్యాభిదానము, గద నిశ్చయము, కాయ, శౌచ్య, శల్యకర్మ, భూతి నిగ్రహము, బాలవైద్యము, రసాయనము) జ్ఞానమును; అష్ఠ వసువులు (ధర, ధృవ, సోమ, విష్ణు, అనల, అనిల, ప్రత్యూష, ప్రభాస లేక ద్రోణ, ప్రాణధృవ, అర్క, అగ్ని, దోష, వసు, విభావసు); శివుని అష్ఠమూర్తులు (క్షితి, జల, తేజ, వాయు, ఆకాశ, యజమాన, అర్క, చంద్ర, లేక సర్వ, భవ, రుద్ర, ఉగ్ర, భీమ, పశుపతి, ఈశాన, మహాదేవ); అష్ఠ దళములు, అష్ఠ మధుమతీ విద్యలు, అష్ఠ సిద్ధులు (అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వం, వశిత్వం); జగత్ప్రసిద్ధములయిన అరువది నాలుగు రతి కళలను, అష్ఠ దిశల సమూహములను నాకు ప్రసాదించుగాక.

ఈ విధముగ ధర్మార్ధ కామ ప్రదాయినిగ సాధనా రూపమున ఈ కవచము ప్రసాదింపబడినది. ఇయ్యది అత్యంత గోప్యము, శ్రేష్ఠము, మరియు సర్వసిద్ధి ప్రదాయకము. నా (శివుడు) ద్వారా తెలుపబడిన ఈ కవచమును ఎవరు ఒక్కమారు పఠించునో వారు సర్వ యజ్ఞ ఫలమును పొందెదరు. ఇందు సందియము లేదు. యుద్ధ కాలమందు పఠించిన ఎడల వారు సింహము మత్తేభమును జయించునట్లు, అగ్ని గడ్డిపరకను దహించునట్లు, శత్రువును జయించెదరు. వారి శరీరము నందు ఏ అస్త్ర శస్త్రములు ప్రవేశింప లేవు, మరియు ఏ రోగములు బాధింప లేవు. వారికి గుటిక, అంజనము, పాతాళము, పాదలేపనము, రసాంజనము, ఉచ్చాటనము, మొదలగు సమస్త సిద్ధులు ప్రాప్తమగును. వారు దీర్ఘాయువులై, ధన కామోపభోగములు అనుభవించుచూ, వాయువు వలె ఎదురు లేక ఎదుగుదురు. ఏ సాధకుడు శుక్ల పక్ష అష్ఠమి నాడు నియమధారియై, నవమినాడు విధి విధానముగ శివాదేవిని పూజించి, నియమానుసారము ఆ దేవిని మానసికముగ స్మరించుచూ, ధ్యానించుచూ ఈ కవచమును దేహమందు ధరిచిన ఎడల కలుగు ఫలితమును తెలిపెదను. వినుడు.

ఆతడు సర్వవ్యాధి విముక్తుడై, శత వర్షాయువై, గుణ, రూప, విద్యా, ధన, రూపుడై, రత్నముల కాలవాలమగును. ఆతని శరీరమును అగ్ని మండింపజాలదు, నీరు తడిపి భగ్న మొనరింపజాలదు, వాయువు శోష మొనరింప లేదు; మృగములు సంహరింపలేవు. శస్త్రములు ఖండింపలేవు, సూర్యుడు తపింపజేయలేడు, విఘ్నములు దరిచేరలేవు, మహా జ్వరములు పీడింపలేవు. భేతాళ, పిశాచ, రాక్షస గణములు అండజ, పిండజ, స్వేదజ, జరాయుజములు వశము చేసికొనలేవు. ఎవరు పరమేశ్వరుని ద్వారా నిర్మితమయిన ఈ కవచమును భక్తి పూర్వకముగ పఠించెదరో వారు మహాదేవుడు, మహామాయ, మాతృకల స్వరూపమగును. ధర్మార్ధ కామ మోక్షములను చతుర్విధ పురషార్ధములు వారికి కరతలామలకములగును. వారు జ్ఞానులై, వరదాయకులై, పండితులై పరులచే కీర్తింపబడుదురు. వారి యందు కవిత్వశక్తి, నిరంతర సత్య భాషణము ఉత్పన్నమై వేలాది శ్లోకములు, శ్లోకార్ధములు, జ్ఞానము, ధారణ యందుండు సమర్ధులగుదురు. ఎవని ఇంటి యందు ఈ కవచము లిఖిత రూపమున యుండునో వానికి దోషము, దర్గతులు యుండవు. గ్రహములన్నియు వానిచే సంతుష్ఠములై యుండును. రాజులు, ప్రభువులు వానికి వశీభూతులై యుందురు. ఏ రాజ్యము నందు ఈ కవచము తెలిసిన జనులు నివసించెదరో, ఆ రాజ్యమందు ప్రకృతి వైపరీత్యములు యుండవు. ద్వితీయ అష్టాక్షరి అయిన "ఓం మహామాయాయై నమ: లేక షడక్షరి అయిన "ఓం వైష్ణవ్యై నమ:" ఈ రెండు మంత్రములు ఏ సాధకుని జిహ్వాగ్రము నందు నిరంతరము యుండునో, మహామాయ వారి శరీరమందు నిరంతరము నివాసముండును.

ప్రణవము (ఓం) సేతువు (వంతెన). ఇయ్యది మంత్రములను బంధించును. ఓం కారమును మంత్రమునకు పూర్వము నందు లేక చివరి యందు జోడించని ఎడల అయ్యది పూర్ణముగ నిష్ఫలమగును. నమస్కారము మహామంత్రము. ద్విజులు, శూద్రులు, సర్వుల ద్వారా ఆచరింపబడునది. ప్రజాపతి అయిన బ్రహ్మ పురాతన కాలమందు "అ"కార

“ఉ”కార “మ”కారములను ఋక్, యజుర్, సామ వేదములనుండి గ్రహించి “ఓం” కారమును నిర్మించెను. ఈ “ఓం” కారమును ద్విజులు ఉదాత్త స్వరముతోనూ, క్షత్రియులు అనుదాత్త స్వరముతోనూ, వైశ్యులు స్వరిత స్వరముతో ఉచ్ఛరింపవలెను. ఈ ప్రణవమును మానసికముగ సహితము స్మరింపవచ్చు!! స్వరాంతమైన చతుర్ధ స్వరమందు శూద్రులు ప్రణవము ను జపించవలెను. ఆనకట్ట లేని జలము ఎట్లు క్షణముతో పల్లమునకు ప్రవహించునో అట్లే యజ్ఞ కర్మములందు ప్రణవము లేని మంత్రములు ప్రభావశూన్యములగును. చాతుర్వర్ణముల వారు “ఓం” కారమును వివిధములుగ మిశ్రమము చేసి జపాది కర్మములు ఆచరింపవలెను. శూద్రులు కేవలము ఆదియందు (మంత్రమునకు మొదట) “ఓం” కారమును జోడించిన అది సరిపోవును. వారు సహితము మంత్రమునకు ఇరువైపులా ప్రణవము జోడింపవచ్చును.

ఔర్వుడు “మహారాజా! ఇయ్యది ఎనిమిది కవచములతో నిండిన అభేద్య మహాకవచము. పరమేశ్వరునితో తెలుపబడిన ఈ మహా కవచమును మీకు తెలిపితిని. మంత్ర భరితమయిన మహామాయాకల్ప సంబంధ కవచము షడక్షర మంత్ర యుక్తము. ఇయ్యది మూడు లోకముల యందు దుర్లభము. ఓ! రాజసింహమా! నీవు సభక్తి యుతముగ ఈ కవచమును నిత్యము పఠించుచూ వైష్ణవీ మంత్రమును జపించుచుండిన ఎడల నీకు సర్వ సిద్ధుల ప్రాప్తి కలుగును.

**(శ్రీ కాళికా పురాణ మందలి మహామాయా కల్పమందు కవచవర్ణనము అను ఏబది ఆరవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది ఏడవ అధ్యాయము

**(పూజావిధి; అంగమంత్ర కధనము)**

మార్కండేయ మహర్షి తిరిగి చెప్పదొడంగెను “ఔర్వ సగర సంవాదము సుందర, సమధురముగ అట్లు సాగుచుండగా తిరిగి సగర చక్రవర్తి ఔర్వుని ఇట్లు ప్రశ్నించెను “ఓ! ద్విజ ప్రవరా! మీ ద్వారా సాంగోపాంగముగ అంగమంత్ర వివరణ వింటిని. ఇపుడు నాకు అంగభూత మంత్రములు వివరింపవలసినది. అంతేకాక దేవీ సంబంధిత సమస్త మంత్ర తంత్రములు, పూజా స్ధానములు, ఉత్తర తంత్ర విధి, కవచములు, వీటన్నింటినీ గూర్చి వేరువేరుగా, విపులముగ విశదీకరింప వలసినది. భగవతి ఉమాదేవి యొక్క పతి మహాదేవుడు భేతాళ భైరవులకు పరమ రహస్యము, మంత్రయుక్తము అయిన కామాఖ్యాదేవి మహాత్మ్యమును వినిపించెను. అద్దానిని మీరు నాకు విస్తార పూర్వకముగ విశదీకరింపవలసినది. మీ ద్వారా తెలుపబడుచున్న ఈ మహాద్భుత వృత్తాంతములు విని నాకు ఇంకనూ తృప్తి కలుగక ఇంకనూ వినవలెనని కుతూహలము కలుగుచున్నది.” ఔర్వుడు “ఓ నృప శార్దూలమా! ఈ మహాఖ్యానము శ్రేష్ఠము, పరమ పవిత్రము, పాపనాశకము, అత్యంత కళ్యాణకరము, పుంసవన కారకము, మంగళమయము, పరమరహస్యము, పరమ హితకరము, మరియు చతుర్విధ పురుషార్ధ ప్రదాయకము. ఈ ఆఖ్యానమును దుష్టులకు, చపలచిత్తులకు, నాస్తికులకు, జితేంద్రియులు కాని వారికి, దేవ, బ్రాహ్మణ, గురువులపై అబద్ధమారోపించు వానికి, పాపికి, శాప, రోగగ్రస్తులకు, శ్రద్ధా రహితునికి ఈయరాదు.”

మహాదేవుడు “భేతాళ భైరవులారా! మీకు మహామాయా తంత్రమును తెలిపితిని. ఇపుడు అంగభూత మంత్రములు తెలిపెదను. సాధకుడు దేవీపూజనా క్రమమందు తొలుత స్నానమాచరించి, పవిత్రీకరణము, ఆచమనాదులు చేసి, శుచియై బుద్ధి పూర్వకముగ ఇంటి యందుకానీ, దేవాలయ ద్వారమందు కానీ, పూజావేదికకు దగ్గర దగ్గర నాలుగడుగుల దూరము యుండి, తొలుత గురువునకు, ఇష్ట దేవునికి శిరసు వంచి ప్రణామములాచరించి, మానసికముగ దిక్పాలురందరికీ నమస్కృతులు సలుపవలెను. ఇంతకు ముందు చేసిన పాపములు, ప్రాయశ్చిత్త కర్మలచే కూడా దూరము కాని పాపములను తొలుత స్మరించి తదుపరి ఈ క్రింది మంత్రమును “దేవీ......సాక్షిణ:” పఠింపవలెను. మంత్రార్ధము. ఓ!దేవీ! సూర్య

చంద్రులు, యముడు, కాలము, పంచభూతములు (ఆకాశము, అగ్ని, వాయువు, జలము, పృధివి) ఈ తొమ్మిది మంది ప్రాణుల శుభాశుభ కర్మల సాక్షీ భూతములు. నా చిత్తము స్వభావ సిద్ధముగ నీ యందు లగ్నమయిననూ, పైన తెలిపిన పాపములచే పూర్ణముగ నిండియున్నది. అందువలన నీవు ఆ పాప మలినమును నా చిత్తము నుండి తొలగింప ప్రార్థన. నేను "హుం ఫట్" మంత్రము జపించుచూ మీకు నమస్కరించుచున్నాను. సాధకుడు తనను తాను పై నుండి క్రిందికి, ఇరు ప్రక్కలా "హుంఫట్" అని పలుకుచూ క్రోధ పూర్వకముగ దృషి సారించి, పిదప సావధాన చిత్తుడు అవవలసినది. ఈ విధముగ చేయుట చే అల్ప పాపములు నష్టమగును. కానీ ఈ పాపోత్సరణము ద్వారా బలమయిన తీవ్ర పాపములు కొంచెము సేపు దూరమయి తిరిగి పూజానంతరము వెనుకకు వచ్చును. కానీ వాని తీవ్రత బాగుగా తగ్గి, వాని ఫలము అతి కొంచెము అనుభవించగనే అవి నశించును. పాపవిముక్తుడయిన సాధకుడు పూజచే క్షణములో తన కామనలను పూర్ణము ఒనరించుకొనును.

ఈ విధముగ పాపోత్సారణానంతరము "ఓం అం ఫట్" మంత్రముచ్ఛరించుచూ పూజాస్థలి ప్రవేశింపవలెను. పిదప నారాచముద్ర ధరించి "హ్రీం హూం ఫట్" మంత్రముతో గంధ, పుష్ప, నైవేద్యాదులను అవలోకింపవలెను. పుష్పమాల యందున్న దోషములు సాధకునికి తెలియక పోవచ్చును. ఎట్లన అయోగ్యులచే కోయబడినవి, అన్యాయార్జితముగ తేబడినవి, కీటమశకముల చే మలినమయినవి; ఇటువంటివన్నియు పైన తెలిపిన అవలోకన ద్వారా శుద్ధమగును. తదుపరి "రం" మంత్రము చే దీపపు వత్తిని స్పర్శింపవలెను. దాని వలన దీపము సుందరతను సంతరించుకొనును. ఈ ప్రక్రియ చే కీట, కేశ, మశకాదుల కాల్చుట, జంతుస్పర్శ, మరియు యజ్ఞ బలిదానమునందలి వస, మజ్జ, అస్తి, దుర్గంధము, ఇంకను ఏవేని తెలియక దీపమునందున్న దోషములు, ఇవన్నియు శమించును. నృశింహ మంత్రము పఠించుచూ సాధకుడు తన అంగుళుల అగ్రములతో జలమును స్పర్శించి, ఆ నీటిని తనపై ప్రోక్షణ కావింపవలెను. ఆ సమయమున తన కుడివైపున యున్న పాత్రను తనకుడి చేతిలోనికి తీసికొని ఆధారమంత్రము పఠించుచూ ఆ నీటిని సంస్కరించి స్పర్శింపవలెను. యజ్ఞయాగాదుల సంయోగము చే పీనయోగ్యము కాని జలము, దోష భూయిష్ఠమయిన పాత్రలందలి జలము, శవ స్పర్శ, స్నానాదికములచే కావింపబడిన దోషము, జలాశయములందు ఉత్పన్నమయిన దోషములు, ఇవన్నియు పైన తెలిపిన విధి విధానము చే శుభ్రమగును.

**నారశింహ మంత్రము:** ప్రజాపతి పుత్రుడయిన అగ్ని బీజమంత్రము "ర" కు అంతిమ స్వరమైన "ఔ" జోడించి, "హ" తరువాత వచ్చు వ్యంజనము "క్ష" కు అర్ధ చంద్ర బిందువు కలిపిన అయ్యది నారశింహ మంత్రమయిన "క్షౌం" అగును.

**ఆధార మంత్రము:** ఆది అక్షరమయిన "అ" కు అర్ధ చంద్ర బిందువు జోడించిన అయ్యది సాధకులకు కార్యసిద్ధి కలిగించు ఆధారమంత్రము "అం" అగును.

ఇపుడు సాధకుడు జల దీపాదుల శుద్ధి అయిన పిదప ఆధారమంత్రమును ఉచ్ఛరించుచూ ఆసనమును చేతిలోనికి తీసికొని, అద్దానిని నేలపై పరచి, ఇపుడు ఆ ఆసనమును చేతితో స్పర్శించి, ఆత్మమంత్రమునుచ్ఛరించుచూ ఆసనమందు ఆశీనుడవవలెను. ఈ ప్రక్రియ వలన ఆసన దోషము లన్నియు శమించి శుభ్రమగును.

**ఆత్మమంత్రము:** తొలి స్వరాక్షము "ఆ" కు అర్ధ చంద్ర బిందువు జోడించిన అయ్యది ఆత్మ మంత్రము "ఆం" అగును.

**మాతృకాన్యాసము:** బుద్ధిమంతుడయిన సాధకుడు బిందునాద యుక్తమయిన మాతృకా మంత్రముల ద్వారా తన శరీరమందు మాతృకాన్యాసమొనర్పవలెను. మంత్రోచ్ఛారణ పద్ధతుల యందు సహితము కనబడని దోషములు, దుష్ఠ పదార్ధ స్పర్శనము, మంత్రములందలి మాత్రాది దోషములు, ఈ మాతృకాన్యాసము ద్వారా నష్టమగును. సమస్త వ్యంజనములు (హల్లులు, "క" నుండి "హ" వరకు) విష్ణు స్వరములు (అచ్చులు) తో కలిపి వానికి అర్ధ చంద్రమును జోడించిన అవి మాతృకా స్వరములు లేక మాతృకా మంత్రములగును. (కం, ఖం, గం, అం, ఆం, ఇం, ఈం). ఏకమాత్ర స్వరము హ్రస్వమనియు,

ద్విమాత్ర స్వరము దీర్ఘమనియు, త్రిమాత్ర స్వరము ప్లుతమనియు పిలువబడును. ఈ విధముగ స్వర వర్ణములన్నియు వ్యవస్థితములైనవి. ప్రతీ వర్ణమునకు "శివదూతి" వంటి మంత్రదేవత మాతృక అగును. ఈ మాతృకాన్యాసమనగా ఈ వర్ణములను సాధకుని శరీరమందు న్యాసమొనర్చుట చే ఆ దేవతలందరూ (మాతృకలు) తన శరీరమందు న్యాసమొనర్ప బడుదురు. ఈ సాధన దేవీ పూజన మందు సాధకుని రక్షించి, దోషములను దూరమొనర్చి, ధర్మార్థ కామ మోక్షములనెడు చతుర్విధ పురుషార్థములను శీఘ్రముగ ప్రసాదించును. దేవ పూజన మొనర్చనప్పటికీ ఏ సాధకుడు నిత్యము మాతృకా న్యాస మొనర్చునో వాని వలన భూతములు భయము నొందును. వాని దర్శనమునకై దేవతలు లాలస నొందెదరు. ఈ సాధకుడు సర్వులను తన ఆధీనమొనర్చుకొని, ఎన్నడునూ పరాభవము నొందడు.

కరశోధన కర్మమందు సాధకుడు విష్ణుమంత్ర ముచ్చరించుచూ అంగుళుల అగ్రభాగముతో పుష్పమును గ్రహించి, ప్రాసాద మంత్రముతో రెండు చేతులతో దానిని మర్దించి తదుపరి కామరాజ బీజము నుచ్చరించి, పిదప బ్రహ్మ బీజము (ఓం) తో ఆ పుష్పమును ఘ్రాణమొనర్చి, ఆ పుష్పమును ఈశాన్య కోణమందు తిరిగి ప్రాసాద మంత్ర ముచ్చరించి విసర్జింప వలెను. ఈ విధానము చే భుజముల నుండి రెండు చేతుల చివర వరకు పాదరక్షా స్పర్శాది స్పర్శన దోషము, దుర్గంధ దోషము నశించును. పుష్పమును గ్రహించుట వలన అంగుళాగ్రములు, మర్దించుట వలన అరిచేతులు, మంథనము చేయుట వలన వాని వెనుక భాగములు, వాసనచూచుట వలన నాసికాగ్రము శుభ్రపడి, ఆ చేతుల యందు తీర్థములు చేరి వశమగును. అందువలన కరశోధనము ప్రయత్నపూర్వకముగ చేయవలెను.

**ప్రాసాదమంత్రము:** అంతిమమునకు ముందునున్న వర్ణము "హ" కు వాసుదేవ బీజము "ఔ" జోడించి, అద్దానికి శంభుచూడము (అర్ధచంద్రము) కలిపిన అయ్యది ప్రసాదమంత్రము "హౌం" అగును.

**కామబీజము:** ఆది వ్యంజనమైన "క"ను అంతిమ దంత్యమునకు ముందునున్న దంత్యము "ల" తో కలిపి చంద్రబిందువు (అర్ధచంద్రము) సహిత వాసుదేవము జోడించిన అయ్యది "క్లీం" అగును.

**బ్రహ్మ బీజము:** ప్రణవము పిదప మొదటి రెండు దంత్యములను ఉచ్ఛరించిన అయ్యది సర్వ పాప హరమయిన బ్రహ్మబీజము (ఓం తథ) అగును.

తొలుత ముఖ శుద్ధికై దీర్ఘ ప్రణవము జపించి తదుపరి వాసుదేవ బీజముతో ప్రాణాయామ మొనర్పవలెను. ప్రతీ దేవతకు ఒక నిర్దిష్ఠ రూపము, వాహనము, అభూషణములు యందును. వాని వాని పూజన మందు పూరక రేచకములతో ఆరూపమునే ధ్యానింప వలెను. వైష్ణవీ మంత్ర తంత్రములందు వాసుదేవబీజము పూర్ణచంద్రుని వంటిది. అందువలన వాసుదేవ బీజమంత్రము నుచ్చరించి, అర్ఘ్య పాత్ర యందుంచిన నీటిని అమృతీకరణ కావించుటకు సాధకుడు సార్ధధేను ముద్ర ప్రదర్శించి గంగావతరణ బీజము "ఘీం" ఉచ్చరింపవలెను. దీని వలన అర్ఘ్య పాత్ర యందలి నీటికి గంగానది శక్తి అంకురించును. ధర్మార్ధకామసిద్ధికై అమృతీకరణము ఆవశ్యకము. దేవ పూజార్ధము "స్వస్తిక, గోముఖ, పద్మ, అర్ధస్వస్తిక, పర్యంకాసనములు" ప్రసస్తము. ఆసనము పాదయంత్రమనబడును. ఇయ్యది సమస్త మంత్ర సాధనకు ఆధారము. బుద్ధిమంతులు ఆయిన సాధకులు వరాహ బీజము చే ఆసనమును పూజించి అపుడు ఆసనమును గ్రహింపవలెను. వరాహ బీజము చే శుద్ధి నొందిన సాధకుడు పూజా సమయమున (ఇష్టదేవ దర్శన సమయమున) తన కాళ్ళను చూచిన దోషము సంక్రమింపదు. మంత్ర ప్రయోగానంతరము ఉపాసన చేయుట చే అభీష్ఠ సిద్ధి కలుగును. అందువలన సాధకుడు మంత్ర పరాయణుడు కావలెను. సాధకుడు కూర్మ మంత్ర ముచ్చరించుచూ, చేతులను కచ్ఛపాకృతి యందుంచి, దానిచే శుద్ధ పుష్పము స్వీకరించి, తన శరీరమును పూజింపవలెను. దాని వలన సాధకుడు దేవత్వము నొందును.

**కూర్మమంత్రము:** వైష్ణవీ తంత్రమందలి ద్వితీయ బీజమంత్రమయిన "క' కు చంద్రబిందువు, షష్ఠమ స్వరము "ఊ" జోడించిన అయ్యది కూర్మమంత్రము "కూం" అగును.

ప్రారంభము నందు దహన ప్లవనాది క్రియల అనంతరము ఓం కారము ఉచ్ఛరించుచూ సాధకుడు బ్రహ్మరంధ్ర భేదనమొనర్పవలెను. తొలుత తెలుపబడిన వాసుదేవ బీజమును ప్రాణవాయు సహితముగ బ్రహ్మరంధ్రమందు స్థాపించవలెను. దీని వలన మండల స్థానమందలి మార్జనాది క్రియల యందు, పూజోపచారముల యందు తెలియక చేసిన దోషములు శమించును. ఈ భూమి (మేదిని) మధుకైటభుల మేధస్సు (మెదడు) నుండి చేయబడినది కావున ఇయ్యది దేవపూజకు సర్వదా శుద్ధము లేనిది (అశుద్ధము). అందువలననే దేవతలు తమ కాళ్ళచే పృధివిని స్పర్శింపరు. అంతేకాక వారి ఛాయ సహితము పృధివిపై వాలనివ్వరు. ఈ దోష విముక్తికై పృధివి పై మంత్ర రాజమును లిఖింపవలెను. జలప్రోక్షణము, వీక్షణాది ప్రక్రియల చే భూమి శుద్ధి అగును. స్థండిలము (వేది) యొక్క వీక్షణము ధర్మ బీజము నుచ్ఛరించుచూ కావింప వలెను.

**ధర్మబీజము:** దంత్యము "ధ" కు బలబీజము "ఈ" జోడించి, అద్దానికి అర్ధచంద్రమును కలిపిన అయ్యది ధర్మబీజము "ధీం" అగును. ఇయ్యది ధర్మార్ధకామసాధకమయిన బీజమంత్రము.

**పాత్ర ప్రతిపత్తి:** "పాత్రను లేవనెత్తుట, చేతియందుంచుకొనుట, స్థాపనాస్థలి యందు భక్తి పూర్వకముగ స్థాపించుట, పూజించుట, నీటితో నింపుట, అందు గంధపుష్పములుంచుట, దానియందు సూర్యచంద్రాగ్ని తత్వములను న్యాసమొనర్చుట, పుష్పముతో తాడించుట, అమృతీకరణము." ఇవి తొమ్మిది సాధకుని చే కావింపబడు పాత్ర స్థాపన యందలి తొమ్మిది క్రియలు. అనిరుద్ధ బీజముతో పాత్రను తీసికొని, అస్త్ర మంత్రముతో అద్దానిని ధారణ చేసి, వాగ్భవ బీజము తో మండలన్యాసమొనరింప వలెను.

**అనిరుద్ధ మంత్రము:** ప్రధమ బీజమయిన "అ"కు విసర్గతోడయిన అయ్యది అనిరుద్ధ మంత్రము "అ:" అగును.

**అస్త్ర మంత్రము:** అనిరుద్ధ మంత్రము చివరి "ఫట్" జోడించిన అయ్యది అస్త్రమంత్రమగు "అ:ఫట్" అగును.

**తృతీయ వాగ్భవ బీజము:** శంభువు "హ" కు ముందు, "వ" వర్ణమునకు తరువాత వచ్చు వర్ణము "స" కు ప్రాంత స్వరము "ఔ" జోడించి అద్దానిని బిందుయుక్తము గావించిన అపుడు నిష్కలము అను తృతీయ వాగ్భవ బీజము "సౌం" అంకురించును. దీనినే శక్తి బీజమందురు.

**ద్వితీయ వాగ్భవ బీజము:** ద్వితీయ వర్గపు ప్రధమాక్షరమైన "క" కు "ల" మరియు చంద్రబిందువు, చతుర్ధస్వరము "ఈ" జోడించిన ఎడల అయ్యది ధర్మార్ధ కామదాయిని అయిన ద్వితీయ వాగ్భవబీజము "క్లీం" అగును. దీనినే కామరాజ బీజమని తెలిపెదరు.

**ప్రధమ వాగ్భవ బీజము:** కుండలినీ శక్తియుతమైన వాసుదేవ బీజము "ఐం" ప్రధమ వాగ్భవ బీజమని తెలియనగును. దీనినే సారస్వత బీజమని పిలుతురు.

ఈ బీజములు విడివిడిగా యున్నపుడు సారస్వత, కామరాజ, శక్తి బీజములని పిలువబడును. కానీ ఈ మూడు కలసినపుడు మహామహితాన్వితమైన త్రిపురాబీజము "ఐం క్లీం సౌం/ఐం క్లీం సౌ:" అగును.

**కామదేవ మంత్రము:** ప్రధమ వర్ణమయిన "అ" కు తృతీయ వర్ణమైన "ఇ" జోడించి, అద్దానిని సంయుక్తముగ అర్ధచంద్రముతో సుశోభితమొనర్చిన ఎడల అయ్యది సర్వ కామోపభోగములను ప్రసాదించు కామదేవ మంత్రము "ఈం" అగును.

కుండలీశక్తి అనబడు బీజము సూర్య సమాన తేజశ్శాలి "ఔ". సాధకుడు ఈ మంత్రముతో భూతోపసారణము కావించిన ఎడల భూతప్రేతాదికములు దూరముగ వైదొలగును. లేని ఎడల అచట గల భూత ప్రేతాదులు నైవేద్యాదులను భక్షించి దేవతలకు అందకుండ చేయును. అందువలన సాధకుడు భూతోపసారణ క్రియను ప్రయత్న పూర్వకముగ ఆచరింపవలెను. అస్త్ర మంత్రము (అ:ఫట్) పలికి క్రింద తెలిపిన భూతోపసారణ మంత్రమును ఉచ్ఛరించవలెను. మంత్రార్ధము: "పృధివీ రక్షకులయిన భూతములారా? ఇచటి నుండి వెడల వలసినది. నాకు మీతో విరోధము లేదు. నేను కేవలము దేవపూజ

సలుపుచున్నాను.” ఈ విధముగ స్థండిల వేదిక నుండి వాటిని వెడలగొట్టి దిశా దిగ్బంధన కావింపవలెను.

**దిగ్బంధన మంత్రము:** విష్ణుబీజము “అం” కు “ఫట్” జోడించిన అయ్యది దిగ్బంధన మంత్రము “అం ఫట్” అగును.

దిశలన్నింటి యందు చిటికెలు వేయుచూ పై మంత్రముతో దిగ్బందన కావింపవలెను. దీనిచే పూజ ఆరంభమునకు అధికారము సిద్ధించి ఆసనము యోగపీఠమగును. పంచభూతాత్మికమయిన శరీరము స్వాభావికముగ సిద్ధము. కానీ దుర్గంధభరితమైన మల, పిత్త, కఫ, మూత్రము, వీర్యము, మొదలగు వానిచే నిండియుండుటచే అది అశుద్ధమగును. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధివి ఈ అయిదు పంచభూతములనబడును. ఈ శరీరమందలి పంచభూతముల శుద్ధికై శోషణ, దహన, భస్మ ప్రోత్సాదన, అమృతవర్షణ, వాయు ఆల్పావన మొదలగు క్రియలు మానసికముగ ఆచరింపవలెను. బ్రహ్మాండమును చింతించుట చే బ్రహ్మాండ భేదన జరుగును. దాని మధ్య ఇష్టదేవతా చింతన చేయుటచే ఇష్ట దేవతా సంపూర్ణ చింతనమగును. “సోహం” అను మంత్రమునకర్ధము నేను అదియే! (అది=భగవంతుడు). దీనిని నిరంతరము చింతించుట చే సాధకుని యందు తనకు తానుగా దేవతారూపము అంకురించును. తదుపరి దేవతకు పుష్పములు సమర్పించిన ఎడల సాధకునికి సంపూర్ణ సంస్కారము జరుగును. సాధకునకు దేవభావమంకురింపగనే పూజోపచారములయిన గంధ, పుష్ప నైవేద్యాదులకు దేవత్వముత్పన్నమగును. దేవతకు అధారము భగవంతుడే!! సర్వము నందు దేవత్వముత్పన్నమగుట వలన సర్వము శుద్ధమగును. ప్రాణాయామము చే మనస్సు, జీవము, ఆత్మ, దేహ మలినములు శుద్ధమగును. సాధకుడు ఇంటియందు, దేవాలయమునందు ఇష్టదేవతా పూజనమందు ఆదిత్య బీజముచ్ఛరించుచూ నలుదిశలా అవలోకింప వలెను. ఇట్లు చేయుటలో అశుద్ధ పక్షి సంయోగము, పక్షుల ఎంగిలి, ఎలుక, చుంచుల స్పర్శ, కీటకాది సంస్పర్శ, గృహసంబంధమైన దోషములు మొదలయిన వన్నియు నష్టమగును.

తొలుత యోగపీఠమును ధ్యానించి అపుడు మండలమందు ప్రవేశింప వలెను. యోగపీఠమును స్పర్శించినంత మాత్రమున సర్వము యోగపీఠ సమానమగును. యోగపీఠము కంటె శ్రేష్ఠమయిన ఇతర ఆసనము లేదు! లేదు!! దీని మహిమను ఎవరు వర్ణింపగలరు? అందుచేత ఈ యోగపీఠ దర్శన ధ్యానము, సర్వ చింతలను దూర మొనర్చి చతుర్విధ పురుషార్ధములను ప్రసాదించును. ధ్యానము: ఇయ్యది శుద్ధ స్పటిక సంకాశము, చతుర్దిశలు, చతుర్కోణము కలిగినది. అంతేకాక ఇయ్యది సూర్య సదృశము, మరియు ఆధార శక్తిని నియంత్రించునది. ఈ యోగ పీఠము యొక్క ఆగ్నేయాది నాలుగు కోణములందు క్రమముగ ధర్మ, జ్ఞాన, ఐశ్వర్య వైరాగ్యములు, తూర్పు మొదలగు దిశలందు అధర్మ, అజ్ఞాన, అనైశ్చర్య, అవైరాగ్యములు వ్యవస్థితమై యుండును. ఈ యోగ పీఠమునకు పైన గల జలరాశి యందు బ్రహ్మాండము, బ్రహ్మాండము నందలి నీటి యందు కచ్ఛపము, ఆ కూర్మముపై శేషనాగు, వాని పడగలపై పృధివి ఉపస్థితమై యున్నవి. ఆనంతుని శరీరముతో కలసిన ఒక కమలనాళము పాతాళము వరకు వ్యాప్తినొందినది. ఈ పృధివి మధ్య ఒక కమలము కలదు. ఈ కమల దళములే దిశలు, కేసరములే పర్వతములు; అద్దాని అష్ట దిశలందు దిక్పాలురు, మధ్యన స్వర్గము; కర్ణిక బ్రహ్మలోకము, దాని క్రింద మహర్లోకము; స్వర్గమందు నక్షత్రములు, దేవతలు, నాలుగు వేదములు ఉపస్థితమైనవి. ఈ కమల మధ్యమున ప్రాకృతిక సత్వ, రజో, తమో గుణములే కాక పరతత్వమయిన అమృతము స్థితిగతమై యుండును. ఈ కమలము యొక్క పై భాగము బ్రహ్మాండము యొక్క ఊర్ధ్వావరణము. కేసరముల క్రింద భాగము అధోఆవరణము.

పూజా హేతువై ఉపస్థితుడైన సాధకుడు తనను బ్రహ్మ, విష్ణు, శివాత్మకునిగ భావింపవలెను. యోగ పీఠము మండలాకారముగ యుండును. ఈ మండల మధ్యమునందు పద్మమును, అద్దాని యందు నాలుగు ఆసనములు శవాసనము, సుఖాసనము, ఆరాధ్యాసనము, విమలాసనము) చింతింప వలెను. తొలుత యోగ పీఠమునొక్కటినీ, తదుపరి మండల సహిత యోగ పీఠమును ధ్యానించి, పిదప తన ఆసనమును పూజింపవలెను. సాధకుడు ఈ పద్మ సహిత యోగపీఠమును, శవాది చతురాసనములను ధ్యానింప వలెను.

యోగ పీఠమునకు ఈ విధముగ నే ధ్యానమందు జలము, గంధ పుష్ప నైవేద్యములు, మొదలగు పూజోపచారములు కావింపవలెను. ఈ విధమయిన యోగ పీఠ పూజనముచే చరాచర జగత్తు, గంధర్వ, గుహ్యాక సహిత సర్వ దేవతలు, కూడ స్మరింపబడకుండగనే పూజింప బడుదురు. అంతేకాక యోగ పీఠ పూజానంతరము అభీష్ఠ దేవతను పూజింపక కేవలము చింతించిన మాత్రమున చతుర్విధ పురుషార్ధ ఫలప్రాప్తి, తుష్టి, పుష్టి సిద్ధించును. తదుపరి దేవత ఆవాహన జరుపవలెను. తదుపరి రెండు చేతులను ఆకాశము వంక చూపించి, పిదప రెండు చేతులను దూరముగనే యుంచి, పూర్తిగా పైకెత్తి, తదుపరి రెండు చేతులు కలిపి క్రిందికి తీసుకొని వచ్చు చుండగా హేరంభబీజము నుచ్ఛరించుచూ దేవతావతరణము కావింప వలెను. తదుపరి దేవతానుగ్రహమునకై హేరంభ బీజముచ్ఛరించుచూ ప్రాణాయామము సలిపి దేవతను భావింపవలెను. దీని వలన అభీష్ఠ దేవత మండలమందు స్థితిగతమగును.

**హేరంభ బీజము:** "అ" కారమునకు చంద్రబిందువు జోడించిన అయ్యది "అం" అను హేరంభ బీజమగును. ఇయ్యది విఘ్నమూలమును సహితము నాశమొనర్చి ధర్మార్ధ కామ మోక్షములనెడు పురుషార్ధములను ప్రసాదించును.

ఇపుడు గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్య, వస్త్ర భూషణాదులను వరుణమంత్రముతో ప్రోక్షణ చేయుచూ మూలమంత్ర సహితముగ ఇష్ఠ దేవతకు నివేదింప వలెను.

**వరుణ మంత్రము:** "వ" వర్ణమునకు చంద్రబిందువు జోడించిన ఆయ్యది వరుణ మంత్రము "వం" అగును.

జపము నందలి మాల ప్రతిష్ఠ యందు మాలను చూచుట, పూజించుట, చేతిలోనికి తీసుకొనుట యను మూడు ప్రక్రియలు యున్నవి. తొలుత మాలపై ప్రోక్షణ కావించి గణపతి బీజము "గం" ఉచ్ఛరించుచూ "అవిఘ్నం కురు మాలేత్వం" అను మంత్రము పఠించి మాలాగ్రహణము కావింపవలెను. మాలను రెండు చేతులతో తీసికొని శ్రీ బీజముతో పూజింప వలెను.

**శ్రీ బీజము:** అంతిమ దంత్యమయిన "శ" కు అంతిమ మాత్రా విసర్గ "ర" జోడించి, వానికి ప్రథమ వర్ణ తృతీయాక్షరము, చంద్ర బిందువు కలిపిన శ్రీబీజము "శ్రీం" అగును.

మాలను శిరము నుండి అవతరణము కావించిన ఎడల అపుడు సారస్వత బీజము నుపయోగించి చేతిలోనికి తీసికొనవలెను.

**సారస్వత బీజము:** శ్రీ బీజము యొక్క ప్రథమాక్షరమైన "శ" కు అగ్ని బీజము, చంద్రబిందువు జోడించిన ఆయ్యది సారస్వత బీజము "స్రాం" అగును.

ధర్మార్ధ సాధకుడు ప్రదక్షిణ, ప్రణామము మొదలగు క్రియలు వైదిక, పౌరాణిక మంత్రములతో కావింపవలెను. భూమిని చూచి, తొలుత వివరించిన విధముగనే క్షితిబీజము నుచ్ఛరించుచూ అభ్యుక్షణము గావించి, భూమిని స్పర్శించి, ఇష్ఠ దేవతకు ప్రణామములు అర్పింపవలెను.

**క్షితిబీజము:** విసర్గ రహిత వరాహ బీజము "భూ" వర్ణమునకు చంద్రబిందువు జోడించిన అయ్యది చతుర్విధ ఫల పురుషార్ధముల నొసగు క్షితి బీజము "భూం" అగును. భైరవా! దర్పణము, పంఖము, ఘంట, చామరము, నైవేద్యాదుల ప్రోక్షణము నైవేద్యలోక మంత్రముల చే కావింపవలెను. ద్వితీయ వాగ్భవ బీజమయిన "క్లీం" తో ముద్రాబంధము కావించి, మూల మంత్రోచ్ఛారణ చే ముద్రలు ప్రదర్శించి, అర్ఘ్యాని పరిత్యాగము తారాబీజముతో కావింపవలెను. ముద్రా ప్రదర్శనము తో పూజ పరిసమాప్తి నొందును. దేవత ఆ ముద్రల గాంచి, అత్యంత ప్రసన్నమై, సాధకునికి చతుర్విధ పురుషార్ధముల నిచ్చును. ముద్రా ప్రదర్శనానంతరము "యద్ దత్తం నమ:" అను ఆరు శ్లోకముల సంపుటిని పలుకవలెను.

**"మంత్రార్ధము:** ఓ! దేవీ! నా ద్వారా భక్తితో ఈయబడిన పుష్ప, పత్ర, జల, ఫల, నైవేద్యాదులను నీవు దయతో స్వీకరింప వలసినది. నేను పూజా భావనలను, ఆవాహన, విసర్జనలను తెలియను. కేవలము నాకు నీవే గతి అని తెలియుదును. ఓ! పరమేశ్వరీ! నాకు మనసా, వాచా, కర్మణా నీవు తప్ప వేరొక గతి లేదు. సర్వ ప్రాణుల హృదయాంతరాళముల యందు నిరంతరము సంచరించు నీవే నా పరమాగతి. తల్లీ! కర్మ వశాత్తు నేను ఏఏ యోనులందు జన్మించిననూ, ఆయా జన్మములందు నీయందు అవిచల భక్తిని ప్రసాదింప వలసినది. సమస్త జగత్తు దేవీ స్వరూపమే! సర్వులకు సర్వమును ప్రసాదించునది, భోగించునది కూడా దేవియే! దేవికి సర్వత్ర జయమగుగాక! ఎవరు దేవియో అదియే నేను. ఓ! దేవీ! అక్షర పదభ్రష్టము, మాత్రారహితము అయిన నా పూజా యందలి దోషములను క్షమింప వలసినది". ఓ! భైరవా! ఈ మంత్రములు పఠించుట చే దేవి శీఘ్రమే ప్రసన్నమై చతుర్విధ పురుషార్ధములను అనుగ్రహించును.

తదుపరి కార్యము విసర్జనము లేక నిర్మాల్యధారిణి పూజ. దీనికై ఈశాన్య కోణమందు ద్వార, పద్మరహిత మండలము ఏర్పరచవలెను. నిర్మాల్యధారిణి యొక్క ధ్యానము పద్మాదుల ద్వారా ఆమె పూజనము కావించి నిర్మాల్యమును ఈ క్రింది మంత్రము పఠించుచూ మండలమందు నిక్షేపింప వలెను. మంత్రార్ధము: "ఓ! పరమేశ్వరీ! బ్రహ్మాదులకు కూడ అవగతము కాని నీ శ్రేష్ఠ స్థానమునకు నీవు నిష్క్రమింపవలసినది". "ఈ మంత్రము ద్వారా విసర్జనము కావించి పూరకము ద్వారా ధ్యానము చేయుచూ సాధకుడు నమస్కారముతో దేవిని హృదయమందు ఈ క్రింది మంత్రము ద్వారా స్థాపించవలెను. మంత్రార్ధము: ఓ! పరమేశ్వరీ! నీవు శ్రేష్ఠ స్థానమును నా హృదయమందు స్థాపించి, అచట బ్రహ్మాది సకల దేవతా సహితవై విలసిల్లుము." తదుపరి ఏకజటా బీజము నుచ్చరించుచూ, ఇష్ట దేవతను స్మరించుచూ, సర్వార్ధ సాధన భూతమైన నిర్మాల్యమును మస్తకమందు ధరింపవలెను. పిదప ఐశ్వర్య హేతువై సాధకుడు మండలము కొరకు ఒక ప్రక్రియ నాచరింపవలెను. అందు భాగముగ తన చేతి వేళ్ళను ఎనిమిది దళముల కమలముగ క్షితి మంత్రముతో కావింపవలెను. తదుపరి మూలమంత్రము లేక సర్వ వశ్య మంత్రముతో, ఉంగరపు వేళ్ళ అగ్రభాగముతో తన లలాటమును స్పర్శింపవలెను. సాధకుడు ధర్మానుగత దోషములు దూరీకృత మొనర్చుటకై భాస్కరబీజము నుచ్చరించుచూ అర్ఘ్యప్రదానము కావింపవలెను.

సూర్యార్ఘ్య ప్రదాన మంత్రార్ధము – "ఓ వివస్వంతా! బ్రహ్మన్! ప్రకాశవంతుడా! విష్ణుతేజయుక్తుడా! సవితా! పవిత్రరూపా! జగదోత్పన్న స్వరూపా! కర్మఫలప్రదాతా! నీకు నమస్కారము." పిదప మనోవాచకముల యందు ఏకాగ్రత వహించి దోషముక్తి కొరకై అచ్ఛిద్ర మంత్రమును పఠింపవలెను. మంత్రార్ధము – "యజ్ఞ, తపో, పూజా, అన్యదోషములన్నియు భాస్కర భగవానుని కృప చే దూరమగు గాక! నా కర్మము సహితము దూరమగుగాక!" ఇట్లు పలికి తదుపరి పుష్ప, పాత్ర, నైవేద్యములన్నింటినీ దేవీ బీజము నుచ్చరించుచూ. అవలోకింపవలెను. అందువలన తొలుత హస్త, నేత్రాది స్థానములందు న్యాసమొనర్చిన వన్నియు విసర్జింపబడును. సాధకుడు ఐశ్వర్య హేతువై పూజను వేదిపై కానీ, శుద్ధ జలము నందుకానీ, వెలుగుచున్న అగ్ని యందు కానీ, సూర్య కిరణములు, ప్రతిమ లేక శివలింగము నందు కావింపవలెను. సాధకుడు స్థండిలాది సమస్త ప్రదేశములను యోగపీఠ బీజాక్షరముల చే ఏకాగ్రతతో న్యాసమొనర్ప వలెను. విద్వాంసుడైన సాధకుడు వాసుదేవుడు, రుద్ర, బ్రహ్మ, భాస్కరాది సమస్త దేవతల పూజనమందు ఈ విధమయిన ప్రక్రియనే ఆచరింపవలెను.

ఈ విధమయిన పూజచే త్రిమూర్తులు, సూర్య, గణేశాది దేవతలు, మహాదేవి, మహామాయా, జగత్స్వరూపిణీ, భగవతీ, సర్వదా ప్రసన్నులై సంతుష్టులగుదురు. ఈ విధమయిన పూజచే సాధకుడు పూర్ణ ఫలితమునకు అర్హుడగును. అట్లుగాకున్న ఆ పూజ స్వల్ప ఫలమునొసగును. ఎట్లు అంగ విహీనుడు గొప్ప యాజ్ఞికుడు కాలేడో, అట్లే అంగ విహీన

పూజ పూర్ణ ఫలము నొసంగ జాలదు. ఇయ్యది పరమ గోప్యము, కళ్యాణకారకము, మంత్ర జ్ఞానయుక్తము, సర్వ పాపహరము, శుద్ధ రహస్యము. దీనిని శ్రాద్ధకాలమందు, దేవ పూజనమందు, యజ్ఞమందు, బ్రాహ్మణ సమ్ముఖమున, వినిపించిన ఎడల దాని వలన సరి అయిన ఫలితము/ ఫలము లభించును. దీనిని వినిపించిన ఎడల సరి అయిన పూజనము లేక పోయిననూ అనంత ఫలప్రాప్తి కలుగును.

**(శ్రీ కాళికా పురాణమందలి అంగమంత్ర కధనము అను ఏబది ఏడవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది ఎనిమిదవ అధ్యాయము

**(కామాఖ్యా పూజావిధి; దేవీ తంత్రము)**

శంకర భగవానుడు "భేతాళ భైరవులారా! ఇపుడు దేవీ తంత్రమును వినవలసినది. దీనిని తెలిసికొనిన ఎడల దేవి శీఘ్రమే వరదాయిని అగును. ఈ తంత్రమును మీకు తొలుత సామాన్య, సాధారణ విధానముతో తెలిపితిని. ఇపుడు విశేష విధానములతో తెలిపెదను. ఇయ్యది పూర్వము తెలుపబడిన తంత్రముల కంటె శ్రేష్ఠము. మహామాయను భక్తితో కొలుచు సాధకులు ఈ పూజను సాంగోపాంగము, అంగమంత్ర సహితముగ కావింపవలెను. సాధకుడు ఫల, పుష్ప, అన్న, పేయ, తాంబూలాదులు దేవికి నివేదింపక ఎన్నడునూ భుజింపరాదు. వారు రహదారి, పర్వతాగ్రము, ఇది అది అననేల? ఎక్కడయున్ననూ భోజ్య వస్తువులను దేవికి అర్పింపక ఎన్నడునూ భుజింపరాదు. సాధకుడు మదిరాపాత్ర, ఋతుమతులైన స్త్రీలు, సింహము, పులి, ఏనుగు, శవము, రక్త (ఎర్రని) కమలము, గురువు, లేక మహారాజు ను కాంచిన ఎడల అయ్యది మహామాయా స్వరూపమని తలంచి నమస్కరింపవలెను. సాధకుడు ఐశ్వర్య ప్రాప్తికై ఋతుకాలము సమీపించినపుడు భగవతిని ధ్యానించి తన ధర్మపత్నితోనే సంగమింపవలెను. సాధకుడు కళ్యాణకరము, వైభవోపేతము లేక ఇష్ట కామ్యములాచరించునపుడు దేవికి నమస్కరించి అందు నిమగ్నమవ్వవలెను. నృత్య, వాద్య, గానములు చూచి/ వినునపుడు తొలుత వానిని దేవికి అర్పించి అపుడు ఆ కార్యమందుపక్రమింప వలెను. నూతన వస్త్ర, చందన, భూషణములు ధరించినపుడు వానిని మంత్ర సహితముగ ధరింపవలెను. వ్యాయామము, కార్యవిధి, సభ, జల, స్థలములందు ఎక్కడెక్కడికేగిననూ, ఎల్లప్పుడు దేవీ స్మరణ కావింపవలెను. పూజా సమయమందు అంగభూత కర్మలు తత్సంబందిత మంత్రముల చేతనే కావింపవలెను. లేని ఎడల ఆ పూజ నిష్ఫలమగును. పూజా సంబంధమైన కర్మలందు కూడా తత్సంబంధిత మంత్రముల నుపయోగింపవలెను. లేని ఎడల నైవేద్యాలోక మంత్రముల చే కూడా కావింపవచ్చును. దేవీ పూజ కొరకు ఇష్ట మంత్రముల చే మండలము గీసి, పూజాంతమున సర్వవశ్య మంత్రము పఠించుచూ తన లలాటమున ధరింపవలెను. ఎవరు విధి విధానములు తెలిసి పూర్ణముగ ఈ పూజాదికములు మంత్ర తంత్ర సహితముగ ఆచరించెదరో వారు మిత్ర, పుర, రాక్షస, రాజ, ప్రజ, సమస్త జ్ఞానరాశి తో సహిత సంపూర్ణ జగత్తును తన వశము నందుంచుకొనెదరు. పూజ కావింపకున్ననూ గుప్తముగ ఈ మంత్రముల పఠించుచూ తిలక ధారణ కావించిన ఎడల సర్వము ఈ సాధకుని వశము నందుండును. ప్రయాణ, మార్గ, దుర్గమ స్థానములందు, స్థానచలనము, జలము, కారాగారము, చందనము, ప్రాయోపవేశములందు, మనసున భయము ఉత్పన్నమయినపుడు, గిరుల నుండి కాననమందు పడినపుడు, శత్రువుల చేజిక్కినపుడు, సహితము బుద్ధిమంతుడయిన సాధకుడు కామాఖ్యదేవి యొక్క మానసిక పూజన మాచరింప వలెను.

హృదయాంతర్గతమున యోగపీతమును ధ్యానించి, దానిపై పృధివిని ఆవాహన చేసి, మానసిక పూజ కావింపవలెను. దంతధావన, మలోత్సర్గము, స్నాన, అలంకరణాది సర్వ కర్మములు ఆ సమయమున మానసికముగనే ఆచరింప

వలెను. మానసిక పూజానంతరము పుష్పాదులచే బాహ్యపూజ కావించి, హృదయమందే సమస్త అనుష్ఠానములు కావింప వలెను. దేవీ ఉపాసకులు నిరంతరము అష్టమినాడు వ్రతనిష్ఠులై యుండి, నవమి నాడు తన రక్తము చే పూజన మొనర్పవలెను. సాధకుడు మహామాయ యొక్క పూజ, పుస్తకము, వేదిక, పాదుకలు, ప్రతిమ, చిత్రము, లింగము, త్రిశూలము, ఖడ్గము, జలము, ఈ విధముగ దేని యందైననూ ఆవాహన కావించి ఒనర్పవలెను. ఖడ్గము ఏబది అంగుళములు లేక త్రిశూలము ఒక అడుగు పొడవు యుండవలెను. సాధకుడు శిలపై, పర్వత శిఖరముపై గుహలయందు ఎక్కడైననూ శ్రద్ధా భక్తులతో నిత్యము దేవీ అర్చన కావింప వలెను.

వారణాసి యందు కావింపబడు మహామాయ పూజ సంపూర్ణ ఫలము నొసంగును. దానికి రెట్టింపు ఫలితము జగన్నాధపురి (పూరీ) యందు, దానికి రెట్టింపు ఫలితము ద్వారక యందు లభించును. సర్వ తీర్థ, క్షేత్రముల యందు కావింపబడు మహామాయా పూజ ద్వారకా పూజా సమాన ఫలితము నొసంగును. వింధ్యా క్షేత్రమందలి పూజ ద్వారకా పూజకు వందరెట్ల ఫలితము నొసంగును. గంగాతటము, ఆర్యావర్తము, మధ్య దేశము, బ్రహ్మావర్తము, ప్రయాగ, పుష్కర క్షేత్రము నందలి పూజ సహితము వింధ్యా పూజా సమాన ఫలము నొసంగును. దీనికి నాలుగు రెట్ల ఫలితము కరతోయా నదీ జలమునందు, దీనికి నాలుగు రెట్లు ఫలము నందికుండమందు, దీనికి నాలుగు రెట్లు ఫలితము జల్పీశ లింగము వద్ద కావించిన పూజకు లభించును. జల్పీశుని కంటె రెండు రెట్లు ఫలము సిద్ధేశ్వరీ యోని మండలమందు, దీనికి నాలుగు రెట్ల ఫలము లౌహిత్య (బ్రహ్మపుత్ర) నదీ జలములందలి పూజకు లభించును. కామరూప మందు ఏ జల స్థలములందు కావింపబడిన పూజకైననూ లౌహిత్య నదీ పూజా ఫలము లభించును. విష్ణు భగవానుడు ఎట్లు సర్వుల యందు శ్రేష్ఠుడో, లక్ష్మీదేవి ఎట్లు సర్వుల యందునూ ఉత్తమురాలో, అట్లే దేవీ పీఠములన్నింటి యందు కామరూపమందలి పూజ సర్వశ్రేష్ఠము, సర్వోత్తమము. కామరూపము వంటి దేవీ క్షేత్రము ఇంకొకటి లేదు! లేదు!! లేదు!!!

అన్య స్థానములందు అత్యంత దుర్లభమైన దేవి కామరూపము నందు ప్రతి గృహము నందు లభించును. లౌహిత్య నదీ ఫలితము కంటె వంద రెట్లు నీలకూట శిఖరమందు, దానికి ద్విగుణీకృత ఫలము హేరుక శివలింగమందు, దీనికి ద్విగుణీకృతమయిన ఫలము శైలపుత్రి ఆదిగాగల యోనులందలి పూజ, వీనికి వంద రెట్లు ఫలము కామాఖ్యా యోని మండలమందు కావించు పూజకు లభించును. ఎవరు ఒక్కమారు కామాఖ్యా మహామాయా పూజను చేయుదురో వారు ఇహలోక మందు సర్వ కామనలను పూర్ణ మొనర్చుకొని, పరలోకమందు శివ స్వరూపము నొందెదరు. వారితో సమానమైన వారుండరు; వారికి పొందదగినవి కూడా ఏవీ ఇక యుండవు. కామాఖ్యా పూజన మొనర్చిన వారు చిరాయువులై, ఇతరులచే నిరోధింపబడరు. యుద్ధ, శాస్త్రార్థముల యందు వారు దుర్జయులగుదరు. వైష్ణవీ తంత్రమందు తెలిపిన విధి విధానములతో ఒక్క మారు కామాఖ్యా యోని మండలమందు పూజన మొనర్చిన ఎడల వారికి వందరెట్లు ఫలితము లభించును.

మహామాయ జగత్తు యొక్క మూల ప్రకృతి, యోగనిద్ర మరియు జగన్మయి. అందువలన వైష్ణవీ తంత్ర మందు ఆ దేవి మంత్రములనే తొలుత చెప్పబడినవి. తదుపరి తెలుపబడిన శైలపుత్రి మొదలగు మూర్తులు ఈ దేవి శరీరము నుండి వెలువడిన స్వరూపములే! సూర్యుని నుండి కిరణములు వెలువడు నటుల, ఈ మహామాయ శరీరము నుండే ఉగ్రచండాది దేవతలు ఆవిర్భవించిరి. మహామాయ ఒక్కటే! విభిన్న కార్యప్రాప్తికై భిన్న రూపములు ధరించినది. కామాఖ్యా దేవియే తన మూలరూపమందు మహామాయ గా పిలువబడు చున్నది. భిన్న స్థానములందు ఉద్భవించుట చేత కూడా ఆమెకు భిన్న నామములంకురించినవి. ఏ విధముగ విష్ణు భగవానుడు ఏకమాత్ర అద్వితీయుడు, నిత్యుడు అయినప్పటికీ సనాతనుడు. దుర్జనులను పీడించుటచే జనార్ధనుడు అయ్యెను. అట్లే మహామాయ సహితము కార్య సంబంధమున నీలకూట పర్వతమందు ఆవిర్భవించిన కారణమున దేవ మానవులు ఆ దేవిని కామాఖ్య అని పిలుచుచుండిరి. ఛత్రధారణ

చేయు మానవుని ధాత్రి అనియు, స్నానమాచరించు వానిని స్నాపకుడని పిలుచునటుల మహామాయయే కార్యవశమున కామాఖ్యా అని పిలువబడుచున్నది. మహామాయ కామ్యార్థము శరీరము స్వీకరించి ఎర్రని కుంకుమను ధరించి, పచ్చని మేని ఛాయ కలిగి యుండును. కామోపభోగార్ధము ఖడ్గమును వదలి స్వయముగ పుష్పమాల ధరించును. కామము నుండి విరక్త అయినపుడు తిరిగి చంద్రహాసము ధరించును. కామోపభోగకాలము నందు ఆ దేవి ఎర్రని కమలమందు విరాజమానమై, శివరూప ప్రేతము పై స్థితిగతయై రమించుచుండును. కామ విరక్త అయినపుడు శ్వేత ప్రేతాసనముపై యుండును. భక్తుల కామనలు పూర్ణ మొనరించుటకు ఒకతరి సింహ వాహనము, లేక రక్త కమలము, లేక శ్వేత ప్రేతాసనముపై అటునిటు చరించుచుండును. ఈ దేవి స్వేచ్ఛారూపిణి.

ఈ దేవి రక్త కమలమందు ఆసీన అయినపుడు ఆమె సింహవాహనము సేవకుని వలె నిలుచుని యుండును. ఆమె ప్రేత శవాసీన అయినపుడు ఆ దేవి అన్యులను అవలోకించుచుండును. ఒకవేళ రక్తకమలమందు ఆశీనయై యున్నదని తలచిన ఎడల ఎదురుగ సింహము కూడా యున్న దేవిని ధ్యానమొనర్పవలెను. ఒకవేళ సింహారూఢను ధ్యానమొనర్పవలెనన్న పద్మము, శ్వేత ప్రేతములను సహితము ధ్యానింప వలెను. అందువలన ఎల్లప్పుడూ సింహ, పద్మ, శ్వేతప్రేతయుతమయిన కామాఖ్యాదేవిని ధ్యానింపవలెను. ఒక్కొక్క మారు విడివిడిగా కూడా ధ్యానింపవచ్చును. ఈ దేవి జగత్స్వరూపిణి. తనంతతానే జగత్తు సర్వమును ఉత్పన్నము కావించును. అందువలన ఈ దేవి త్రిమూర్తుల చే సహితము ధ్యానింపబడు చుండును. ఈ దేవి ఆసనములైన శ్వేతప్రేతమే స్వయముగ మహాదేవుడు శివుడు. రక్త కమలమే బ్రహ్మ, సింహమే విష్ణువు. త్రిమూర్తులు వారి వారి స్వస్వరూపములతో మహామాయకు వాహనములు కాలేరు. అందువలన ఈ మహానుభావులు ఈ రూపములు ప్రాప్తి నొందిరి. సింహముపై రక్తకమలము, దానిపై శ్వేత ప్రేతము, దానిపై వరదాభయ ముద్రలతో మహామాయ విరాజిల్లు చుండును. ఈ రూపమును ఎవరు ధ్యానించెదరో వారు త్రిమూర్తులను సహితము పూజించుచున్నారు. ఇందు సందేహము లేదు. ఈ విధముగ మహామాయ, కామాఖ్య ఒక్కరే అయినప్పటికీ రూప ధ్యానముల వలన వేరువేరుగ కానపట్టు చున్నారు. అందువలన మహామాయను కామరూపమందు పూజింపవలె! ఓ! నరశ్రేష్ఠులారా! మీరిరువురికీ దుర్గాదేవి యొక్క విశేష పూజావిధిని వర్ణించితిని. ఇపుడు ఆ దేవి అంగ మంత్రములను వినవలసినది.

**(కామాఖ్యా పూజావిధి యందలి దేవీ తంత్రమను ఏబది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము)**

# ఏబది తొమ్మిదవ అధ్యాయము

**(అంగమంత్ర వర్ణన; పవిత్రారోపణము)**

మహాదేవుడు "నరశ్రేష్ఠులారా! ఇపుడు సర్వ శక్తుల, విశేషత: చండికా దేవి యొక్క అంగమంత్రములు తెలిపెదను. ఇయ్యది చతుర్విధ పురుషార్ధ పలప్రదాయిని. చండికా దేవి యొక్క నేత్రబీజము "ఐంహ్రీంశ్రీం." ఈ మూడు బీజాక్షరములు వామ, లలాట దక్షిణ నేత్రములకు సూచకము. ఇయ్యది సర్వ శ్రేష్ఠ మంత్రము, అత్యంత గుప్తము మరియు దుర్గా బీజమని పిలువబడును. కాత్యాయన ముని ఆశ్రమము నందు దేవతలచే స్థుతింపబడిన పిదప మహామాయ దేవతల శరీర తేజము నుండి ఆవిర్భవించి శరీరము ధరించినది. ఆ దేవి యొక్క మూడు నేత్రముల నుండి దేవి యొక్క శక్తి స్వరూపిణి, మూలమూర్తి, మహిషాసుర వధకై తేజోమయముగ ప్రకటితమయ్యెను. సర్వ దేవతల నుండి ఉత్పన్నమై, సర్వ దేవతల ఆయుధములు ధరించి, బ్రహ్మాది దేవతల చే స్థుతింపబడి, ఆ దేవి తన గణముల, సేవకుల, సహాయోగుల, మంత్రులు సేనాపతుల సహాయముతో వాహన సహితయై మహిషుని వధించెను. అటు పిదప దేవతలు ఈ నేత్రబీజ

మంత్రముతో ఆ దేవిని పూజించిరి. అందువలన ఈ మంత్రము సంసారము నందు వృద్ధి పొందెను. అట్లే ఈ మహిషాసురమర్దినీ రూపము జగత్ప్రసిద్ధమై, మూల తేజోమయ రూపము గుప్తమయ్యెను.

మహిషాసుర మర్దినీ స్వరూపమును ఈ విధముగ ధ్యానింపవలెను. ఈ దేవి పూర్ణచంద్ర వదనయై, త్రినేత్రయై, మస్తకమందు జటాజూటము, అందు అర్ధచంద్ర రేఖతో విరాజిల్లుచుండును. తప్తకాంచన శరీర ఛాయతో, సుందర నేత్రములతో, నవ యవ్వనముతో, సర్వాభరణ భూషితయై, ఠీవిగా ప్రతిష్ఠితమై యుండును. తెల్లని దంత పంక్తి, పీన పయోధరయై, త్రిభంగి స్వరూపయై ఒప్పారు చుండును. ఈ దేవి కమలనాళము వంటి కోమల స్పర్శ కలిగి యుండును. ఆమె దశ భుజములందు దక్షిణ హస్తములందు క్రింది నుండి పైకి త్రిశూలము, ఖడ్గము, చక్రము, బాణము, శక్తి ధరించును. వామ హస్తములందు డాలు, నారి బిగించిన ధనుస్సు, పాశము, అంకుశము, ఘంట యుండి ఈ దేవి కాళ్ళ వద్ద శిరవిహీనుడైన మహిషుని శరీరము యుండును. మహిషుడు శిర విహీన శరీరము మరియు హస్తము నందు ఖడ్గము దాల్చిన దానవ శరీరము, హృదయము దేవి యొక్క త్రిశూలము చే భేదింపబడి యుండును. పేగులు బయటకు వచ్చి, శరీరమంతయు తన శరీరము నుండి వెలువడిన రక్తముచే తడచి ఎర్రగా యుండును. మహిషుని ముఖము వికృతమై, కనుబొమలు వంకర తిరిగి నాగపాశము చే బంధింపబడి యుండును. భగవతి దుర్గాదేవి తన పాశము ధరించిన ఎడమ చేతితో మహిషుని శిరము యొక్క కేశములను బిగించి యుండును. రక్తము వోడుచున్న మహిషుని శిరము, శరీరము మరియు దేవి యొక్క వాహనము సహితము యందును. ఆ సమయమున దేవి యొక్క కుడికాలు సింహవాహనము పైననూ, ఎడమ కాలు మహిషుని శరీరముపైననూ యుండును. ఈ దేవి "ఉగ్రచండ, ప్రచండ, చండోగ్ర, చండనాయిక, చండా, చండావతీ, చాముండీ, చండికా" అను ఎనిమిది శక్తులచే నిరంతరము పరివేష్ఠింపబడి యుండును. ఈ పైన తెలిపిన రూపమును సాధకులు ధ్యానింపవలెను.

ఇపుడు ధర్మార్ధకామ సాధక అంగ మంత్రములను ఏకాగ్ర చిత్తులై వినవలసినది. దుర్గా మంత్రము "ఓం దుర్గే దుర్గే రక్షిణి స్వాహా." ఇయ్యది జయదుర్గా మంత్రముగ ప్రసిద్ధి నొందినది. సూర్యుడు మకరరాశి యుందున్నపుడు (మాఘమాసము) శుక్లపక్ష పంచమి (వసంత పంచమి) నాడు ఈ మంత్రముతో విధి విధానముగ శివాదేవి యొక్క పూజన మొనర్చి, తదుపరి శుక్ల అష్టమినాడు అదే విధముగ దేవిని పూజింపవలెను. నవమి నాడు అధికముగ బలిదాన మొనర్చి, సంధ్యా సమయమందు తన శరీరము నుండి వెలువడిన రక్తమును బలిదాన మొనర్పవలెను. ఈ విధముగ కావించిన ఎడల సాధకునకు నిత్య శుభములు ప్రాప్తించి ధనధాన్య సిద్ధి, పుత్ర పౌత్రాభివృద్ధి కలిగి దీర్ఘాయువై ఆనందమనుభవించును. జేష్ఠ శుక్లఅష్ఠమి నాడు సాధకుడు వ్రత పరాయణుడై, నవమినాడు తిలలు, యవలు, అన్నముచే వండబడిన పిండివంటలు, పాలు, నేయి, మధువు, చక్కెర, అనేక ప్రకారములయిన బలులకు ఉపయోగించిన పశువుల రక్త మాంసములతో దేవికి పూజన మొనర్పవలెను. తదుపరి జేష్ఠ శుక్ల దశమి (గంగా దశహరా/దసరా) నాడు తిలలు, నీరు కలిపిన తిలాంజలి దుర్గా తంత్రములో వర్ణింపబడిన మంత్ర సహాయముతో మూడు మార్లు తిలాంజలి సమర్పింపవలెను. దశమినాడు ఈ విధముగ చేయుటచే పది జన్మములందు కావింపబడిన పాపము లన్నియు దగ్ధమయి సాధకుడు దీర్ఘాయువగును. భైరవా! ఆషాఢ, శ్రావణ మాసములందలి శుక్లపక్ష అష్ఠమినాడు దేవికి అతి ప్రసన్నత కలిగించు పవిత్రారోపణ (సూత్రధారణ) కర్మ కావింపంలెను.

దుర్గాతంత్ర మందు ఉల్లేఖింపబడిన మంత్రములు, దుర్గాబీజము, వైష్ణవీ తంత్రమందలి మంత్రములచే ఈ పవిత్రారోపణము కావింపవలెను. ఆషాఢ, శ్రావణము లందు సర్వదేవతలకు కావింపబడు పవిత్రారోపణ, ఆ సంవత్సర మంతయు ఫలము నిచ్చును. పక్షము నందలి వివిధ తిథులు వివిధ దేవతల పవిత్రారోపణమునకు శ్రేష్ఠము. పాడ్యమి కుబేరునకు, విదియ లక్ష్మీదేవికి, తదియ భవ, భవానీలకు (జగన్మాత, పితరులకు), జగదంబ అయిన పార్వతికి, చతుర్థి

వారి పుత్రుడయిన గణేశునికి, పంచమి చంద్రునకు, షష్ఠి కార్తికేయునకు, సప్తమి సూర్యునకు, అష్టమిదుర్గకు, నవమి మాతృకలకు, దశమి వాసుకికి, ఏకాదశి ఋషులకు, ద్వాదశి విష్ణువునకు, త్రయోదశి మన్మధునికి, చతుర్దశి బ్రహ్మకు, మరియు పౌర్ణమి దిక్పాలకులకు పవిత్రారోపణమునకు ఉత్తమ తిధులు. ఏ సాధకుడు దేవతలకు పవిత్రారోపణము కావింపడో వాని సంవత్సర పూజాఫలము విష్ణువు అపహరించును. అందువలన సాధకులు ఈ పవిత్రారోపణమును ప్రయత్న పూర్వకముగ చేయవలసినదే!! దీనిచే సాధకుడు అధిక ఫలములనొంది పూజ సఫలీకృతము అగును.

ఇపుడు ఈ ప్రక్రియ ఏ సూత్రముతో, ప్రమాణముతో, విధితో చేయవలెనో తెల్పెదను. వినుడు. ప్రప్రథమముగా కుశలతోనూ, పిదప పద్మనాళములు, పిదప "లినెన్" తో చేయబడిన తంతువులు (అనిసె మొక్క పోగులు) తోనూ, తదపరి ఉన్ని, చివరగా పట్టు తంతువులతో పవిత్ర తేక సూత్రమును తయారు చేయవలెను. వీనిని గంధ పుష్పములతో సుగంధ భరిత మొనర్చవలెను. వీనిని కన్యలు, పవిత్రమైన గృహిణిలు, సాధువర్తనము గల విధవ స్త్రీలు చేయవచ్చు. ఈ సూత్ర నిర్మాణమందు సూదులతో గుచ్చుట, నీటితో తడువుట, భస్మాదుల యందు ముంచుట మొదలగునవి చేయరాదు. అంతేకాక ఎలుకలు కొరికినవి, మద్య, రక్తాదులతో అపవిత్రమయినవి, నలుపు, ఎరుపు రంగుల తంతువులను నిషేధింపవలెను. ఈ విధమయిన జాగ్రర్తలు తీసికొని మూడు రకముల (కనిష్ఠ, మధ్యమ, ఉత్తమ) సూత్రములను నిర్మింపవలెను. ఇరువది ఏడు తంతువులతో చేయబడిన సూత్రము కనిష్ఠము. ఇది మర్త్య లోకమున కీర్తి, యశస్సు, సుఖము, సౌభాగ్యములు ప్రసాదించును. ఏబది నాలుగు తంతువులతో చేయబడిన సూత్రము మధ్యమము. ఇయ్యది దివ్యము, భోగప్రదము, పవిత్రము, స్వర్గమోక్షములను సహితము ప్రసాదించునది. నూట ఎనిమిది తంతువులతో చేయబడిన సూత్రము ఉత్తమము. దీనిని మహాదేవుని కర్పించి సాధకుడు సాక్షాత్ శివ సాయుజ్యము నొందును. ఇందు సందియము లేదు. ఒక వేయి ఎనిమిది తంతువులతో కావింపబడిన సూత్రము "రత్నమాల" అనబడను. దీనిని దేవికి అర్పించిన ఎడల అయ్యది భోగ మోక్షములు రెంటినీ ప్రసాదించును. అంతేకాక స్వర్గము నందు వేల కోట్ల కల్పములు సుఖించి తదుపరి శివ స్వరూపుడగును. ఈ ఒక వేయి ఎనిమిది తంతువుల సూత్రము శంకరునికి సమర్పించిన అయ్యది "నగహారము" అగును. దీనిని శంకరునికి సమర్పించిన ఎడల, ఆ సూత్రమందు ఎన్ని తంతువుల కలవో అన్ని వేల కల్పములు ఆ సాధకుడు శివలోకమందు ఆనంద మనుభవించును. ఈ సూత్రమునే విష్ణువుకు సమర్పించిన ఎడల అయ్యది "వనమాల" అగును. దీనిచే సాధకుడు విష్ణు సాయుజ్యమొందును.

కనిష్ఠ సూత్రము నాభి పర్యంతము యుండి, అందు పన్నెండు గ్రంధులు (ముడులు) కలిగి యుండును. మధ్యమ పవిత్ర తొడల వరకు యుండి ఇరువది నాలుగు ముడులు యుండును. ఉత్తమ పవిత్ర మోకాళ్ళ వరకు వ్రేలాడుచూ ముప్పది ఆరు ముడులు కలిగి యుండును. నగహారము సహితము ఈ విధముగనే చేయవలెను, కానీ అందు నూట ఎనిమిది ముడులు యుండవలెను. పవిత్ర ఏ రంగుతో చేయబడునో, దానికి భిన్నమైన రంగుగల తంతువులతో గ్రంధులు చేయవలెను. కనిష్ఠ పవిత్ర యందు ముడులు, ఒక్కొక్క ముడి యందు తంతువును ఏడుసార్లు ఆవృతము (చుట్టవలెను) చేయవలెను. మధ్యమ పవిత్ర యందు ముడులు పదునాల్గు సార్లు, ఉత్తమ పవిత్ర యందు ముడులు ఇరువది ఒక్కమార్లు ఆవృతము ఒనరింపవలెను. ఈ కార్య క్రమములన్నియు ముందురోజు ముగించుకొని మరునాడు ద్విజ సాధకుడు దుర్గా బీజమంత్రము చే మంత్రన్యాసము కావింపవలెను. ఇతర సాధకులు వైష్ణవీ మంత్రము చే న్యాసమొనర్చవలెను. పవిత్రము (సూత్రము) నందు ఎన్ని గ్రంధులు యున్నవో అంత న్యాస మొనర్చవలెను. ఈ విధముగ మంత్రమును అంగములతో సమాయోజన చేసి తదుపరి సాధకుడు దుర్గా మంత్రములతో తత్వన్యాసము కావింపవలెను.

మూడు పవిత్రములను (కనిష్ఠ, మధ్యమ, ఉత్తమ) ఒక యజ్ఞ పాత్రయందుంచి, దాని యందు గంధ పుష్పాదులు వైచి, బొటనవ్రేలి అగ్రభాగముతో తత్వన్యాసము కావింపవలెను. ద్విజులు "ఇదం విష్ణుం" మొదలగు మంత్రములుతోనూ,

శూద్రులు "ఓం నమో భగవతే వాసుదేవాయ" మంత్రము తోనూ, మంత్ర న్యాసము కావింపవలెను. ప్రాసాద మంత్రముతో శివుని మంత్రన్యాస, దానములు కావింపవలెను. సాధకులు కుంకుమ, వట్టివేళ్ళు, కర్పూరము, చందనము, యొక్క లేపనమును పవిత్రలకు అలది, అర్చించి, తత్వన్యాస మొనర్పవలెను. సాధకుడు మండలమందు వైష్ణవీ తంత్రము లేక దుర్గా తంత్రముతో వినమ్రుడై, విధి విధానముగ దేవిని పూజించి, పిదప దుర్గాతంత్రముతో దేవి శిరముపై ఈ పవిత్రలను యుంచవలెను. ఏ దేవతకు ఏ మండలము, మంత్రము, బీజాక్షరములు, ధ్యానాదులు చేయవలెనో, వానినే సాధకుడు ప్రయత్నపూర్వకముగ ఆచరింపవలెను. ఈ విధముగ నాపై (శివుడు) లేక ఇతర దేవతలపై పవిత్రారోపణ చేసిన ఎడల ఆ సాధకునకు మనోరధములు పూర్ణమగును. అగ్ని, బ్రహ్మ, భవాని, గణేశ, నాగ, స్కంధ, సూర్య, మాతృగణ, దిక్పాల, నవగ్రహములు, ప్రతి ఒక్కరికీ ఒక్కొక్క ఘటమందు విధి పూర్వకముగ పూజనమొనర్చి, ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క పవిత్రను శిరముపై యుంచవలెను. తదుపరి సాధకుడు పంచ గవ్యములచే చరువును చేసి, దేవికి మూడు ఆహుతులిచ్చి, అట్లే ఆ చరువునే హరి, శివులకు ఆహుతులిచ్చి, పిదప కేవలము నేతితో నూట ఎనిమిది ఆహుతులు, తిలలు నేయి కలిపి మరల నూట ఎనిమిది ఆహుతులు మహాదేవికి సమర్పింపవలెను. ధర్మార్ధ కామ సిద్ధికి సాధకుడు ఈ విధముగనే విష్ణ్వాది దేవతలకు పవిత్రారోపణము కావింపవలెను.

దేవీ సాధకులు పాయసము, వడ, మోదకములు, పిండివంటలు, అనేక ప్రకారములైన నైవేద్యములు, గుమ్మిడిపండు, కొబ్బరి, ఖర్జూరము, పనస, మామిడి, దానిమ్మ, ద్రాక్షాది ఫలములు, అనేక భక్ష్య, భోజ్యములు, వివిధములయిన చేపలు, మాంసములు, అన్ని విధములైన ధూప దీపములు, వస్త్ర భూషణములతో పూజనమొనర్పవలెను. ఈ పవిత్రారోపణ సందర్భమున నటనర్తక గాయక వేశ్యాదుల ద్వారా ప్రసన్న పూర్వకముగ రాత్రి పర్యంతము నృత్య గీతములతో జాగరణ మొనర్పవలెను. ద్విజులకు, సర్వ జాతులకు కూడా సంతర్పణ మొనర్పవలెను. అటు పిదప శ్రద్ధా పూర్వకముగ సాధకుడు స్వర్ణము, గోవులు, ఘృతము, తిలలు, వస్త్రములు, ఆకుకూరలు దక్షిణ దానములుగ ఈయవలెను. పిదప "మణి.........పరమేశ్వరీ" అను మంత్రమును పఠించవలెను. మంత్రార్ధము: ఓ! పరమేశ్వరీ! మణులు, రత్నములు, మందారము, మొదలగు పుష్పమాలలతో కావింపబడిన ఈ వార్షిక పవిత్రారోపణ పూజ స్వీకరింపవలసినది." తదుపరి పూజాది కర్మకాండలతో దేవికి విసర్జన పలుకవలెను. ఈ విధముగ వార్షిక పవిత్రారోపణము పరిపూర్ణమగును.

**(శ్రీ కాళికా పురాణమందలి పవిత్రారోపణమను ఏబది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# అరవైయవ అధ్యాయము

## కాత్యాయినీ ఆవిర్భావము

శివ భగవానుడు చెప్పదొడంగెను "రాజులు శరత్కాల మహర్నవమి నాడు దుర్గామంత్ర తంత్రముల ద్వారా దుర్గాదేవిని పూజించి బలులీయవలెను. ఆశ్వయుజ శుక్ల అష్టమి దేవికి అత్యంత ప్రియమయిన రోజు. అయ్యది మహాష్టమి అని పిలువబడును. ఆ మరుసటి దినము మహర్నవమి. ఈ దినమును "శివప్రియ" మరియు "సర్వలోక పూజ్య" మని తెలుపబడినది. భైరవా! ప్రతి సంవత్సరము నందు ఏతెంచు ఈ తిథి ద్వయము నాడు కావింపబడు దుర్గాపూజ విశేషఫలము నొసంగును. ఈ దినములందు దేవీపూజ మండలము నందు సవిధి విధానములతో కావింపవలెను. వత్సా! దుర్గాదేవి భక్తులకు విభిన్న విభూతులు ప్రసాదించుటకై విభిన్న పూజలు గైకొనును. అందు వలన సూర్యుడు కన్యారాశి యందు

ప్రవేశించినపుడు శుక్ల పాడ్యమి నుండి భిన్న తిథుల యందు భగవతి భిన్న భిన్నములయిన పూజలు గైకొని విభిన్నములయిన ఐశ్వర్యములు ప్రసాదించును. పూర్వము తెలుపబడిన వైష్ణవీ మంత్ర తంత్రముల చే దుర్గాదేవి యొక్క విభిన్న మూర్తులను భిన్న తిథులయందు ఆరాధింపవలెను. ఈ తిథుల యందు భక్తులు ఏక భుక్తము, రాత్రి భోజనము, ఏకాహారి, లేక వాయు భక్షణ చేయుచూ ప్రాత:స్నానము, జితేంద్రియత్వము, త్రైకాలిక శివపూజ, జపహోమ యుక్తులై యుండి కుమారీగణమునకు భోజన మిడవలెను. షష్ఠినాడు బిల్వశాఖ మరియు బిల్వ ఫలముల చే దేవిని పూజింపవలెను. సప్తమినాడు తిరిగి సరికొత్త బిల్వశాఖలచే దేవిని పూజింపవలెను. అష్టమినాడు విశేష పూజనమొనర్చి, బలిప్రదానమొనరించి, రాత్రి జాగరణ చేయవలెను. నవమినాడు విశేష బలిదానమొనర్చి, దశభుజ అయిన దేవిని ధ్యానించి దుర్గా మంత్రతంత్రముల చే పూజన మొనర్చవలెను. దశమి నాడు సాధక శ్రేష్ఠులు దేవి ప్రతిమను విసర్జన కావించి, తదుపరి ఆ రాత్రంతయు తిరిగి జాగరణ చేయవలెను.

దుర్గా తంత్రము చే మహామాయ యొక్క షోడశ (పదహారు) భుజముల మూర్తిని పూజించ దలచిన ఎడల, ఆ విశేష విధి విధానములను తెలిపెదను. వినుడు. సూర్యుడు కన్యారాశి యందు ప్రవేశించిన కృష్ణ ఏకాదశి నాడు ఉపవశించి, ద్వాదశి నాడు ఏకభుక్తము (ఒంటి ఊట భోజనము), త్రయోదశి నాడు నక్తము (రాత్రి భోజనము) కావించి, చతుర్దశి నాడు గేయ, గీత, వాద్యములతో, మరియు నానా విధి నైవేద్యములతో, వందన పూర్వకముగ దేవి యొక్క ఆవాహన చేయవలెను. తదుపరి దినము (అమావాస్య) నాడు ఉపవసింపవలెను. ఈ విధముగ వ్రతానుష్ఠానము నవమి వరకు కావింపవలెను. పూజ జేష్ఠా నక్షత్రమందు పూజారంభము కావించి, మూల మరియు ఉత్తరాషాఢ నక్షత్రమందు పూజను కొనసాగించి, శ్రవణ నక్షత్ర మందు విసర్జన కావింపవలెను.

ఇపుడు దుర్గా మంత్ర తంత్రముల ద్వారా అష్టభుజమూర్తిని పూజించు విధి విధానములు తెలిపెదను. కన్యారాశి యందలి కృష్ణపక్షమందు ఆర్ద్రా నక్షత్రయుతమయిన నవమి నాటి పగటి కాలమందు గీతా, వాద్య, నైవేద్యములతో దేవిని ఆవాహన చేయవలెను. శుక్ల పక్ష చతుర్థినాడు దేవికి కేశమోచన మొనర్చి, పంచమినాటి ప్రాత:కాలము సుగంధ ద్రవ్యయుక్త జలములచే స్నానము చేయించి, సప్తమినాడు పత్రికాపూజనమొనర్చి, అష్టమినాడు ఉపవసించి, నవమినాడు ఉపవాసము తోపాటు విధి విధానముగ పూజాధికములు, బలిప్రదానము కావించి, జాగరణ చేయవలెను. దశమి నాడు ఉత్సాహవంతులై మంగళాచారణము కావించి విసర్జన కావింపవలెను. దశమినాడు నీరాజనము సమర్పించుట చే అతిశయ బలవృద్ధి కలుగును.

భైరవా! ఇపుడు జగన్మాత వైష్ణవీ దేవి పూజ, విశేష విధులు తెలిపెదను. ఆలకింపుడు. సూర్యుడు కన్యారాశి యందు ప్రవేశించునపుడు ఏతెంచు శుక్లాష్టమి నాటి రాత్రి కాలమందు అతిశయ వైభవముతో విస్తారమయిన పూజ కావింపవలెను. నవమి నాడు యధావిధిగ బలిదానమొనర్చవలెను. ఐశ్వర్య ప్రాప్తికి ఆ సమయమున విధి విధానములతో జపహోమములు ఆచరింపవలెను. అంతేకాక దేవిని అష్టవిధ పుష్పములతో పూజించి పుష్పాంజలి నొనర్చవలెను. ప్రాచీనకాలమందు చతుర్ముఖ బ్రహ్మదేవుడు శ్రీరామ విజయమునకు రావణవధ నిమిత్తమై మహామాయను ఈ విధముగ రాత్రివేళ ఆవాహన కావించి విశేష పూజన మొనర్చెను. అపుడు మహామాయ జగన్మాత ఆశ్వయుజ శుక్లపక్ష నందాతిథి (పాడ్యమి) నాడు నిద్రను వర్జించి, రామ రావణ యుద్ధమొనర్చుచున్న లంకాపురికేగెను. ఆ తల్లి అదృశ్యరూపిణియై రామరావణులను యుద్ధమునకై ప్రేరేపించి, ఏడుదినములు చేయించి, ఆ సమయమునందు రాక్షస, వానర రక్తమాంసములను భక్షించెను. ఈ విధముగ ఏడు రోజులు (రాత్రింబవళ్ళు) యుద్ధ క్రీడను వీక్షించుచుండగా, ఆ సమయమంతయు దేవతలందరూ నిరంతరము దేవీ పూజనమొనర్చుచునే యుండిరి. తదుపరి నవమీ తిథి యందు జగద్రూపిణి మహామాయ రాముని నిమిత్తముగ చేసికొని రావణుని వధించెను. నవమి నాడు రావణ వధానంతరము

లోక పితామహుడు చతుర్ముఖ బ్రహ్మ సమస్త దేవతా సహితుడై దుర్గాదేవికి విశేష పూజన మొనర్చెను. తదుపరి దశమి నాడు "శార్వరోత్సవము" కావించి దేవిని ప్రసన్నురాలిని గావించి విసర్జన గావించిరి.

స్వాతి నక్షత్రయుతమయిన తృతీయనాటి రామరావణ యుద్ధము వీక్షించి విశాలమయిన దేవసేన భయభీతులై స్థబ్దులైరి. ఆ సమయమున వారు లంక యొక్క పూర్వోత్తర భాగమందు స్థితిగతులైరి. దేవసేన యొక్క శాంతి, శక్తి, మరియు దేవరాజ్య వృద్ధి కొరకై విష్ణుదేవుని వచనానుసారము దేవి యొక్క శార్వరోత్సవానంతరము దేవరాజు ఇంద్రుడు దేవసేన యొక్క "నీరాజనము" కావించెను. (ఈ నీరాజన (ఒక రకమయిన సేనా పూజావిధి) విధానము తదుపరి అధ్యాయము లందు వివరింపబడినది.) నీరాజనానంతరము శచీపతి రామలక్ష్మణులను కలసి, తిరిగి తన స్వస్థలి అయిన స్వర్గమునకేగెను. పూర్వకాలమున స్వాయంభువ మన్వంతర మందలి త్రేతాయుగారంభమున దేవమానవ హితార్థము, సంపూర్ణ జగత్ హితార్థము మహామాయ దశభుజారూపిణి గా ప్రాదుర్భవించెను. పూర్వకల్పమందు జరిగిన ఘటనలు మరల మరల జరుచునే యుండును. ప్రతి కల్పము నందు దైత్యనాశనమునకు దేవి స్వయముగ అవతరించుచుండును. అట్లే రావణాది రాక్షసులు, రామచంద్రుడు సహితము ప్రతికల్పము నందు ఉత్పన్నమగుచునే యుందురు. ప్రతి కల్పము నందు రామరావణ సంగ్రామము, దేవగణ సహితుడై రాముడు ఉత్పన్నమగుచుండుట చే అనంత కాలమందు వేలాది రాములు, రావణులు గడచిరి. భవిష్యత్ నందునూ వారు తిరిగి జనన మందెదరు. భూత భవిష్యత్ లందునూ దేవి ఈ ప్రకారముగనే ప్రవర్తిల్లి జగత్తుకు హితమొనరించును. తదుపరి దేవసైన్యము నీరాజనమిడుచునే యుండును.

రాజులు తమ శక్తి, వృద్ధి కొరకై దివ్యాలంకార భూషితులైన స్త్రీలచే తమ సేనకు నీరాజనమిప్పించి నృత్య, గీత, క్రీడా కౌతుకముల చే మంగళకార్యములు అనుష్ఠించెదరు. తదుపరి మోదకములు (పిండివంటలు), నువ్వులపిండితో చేసిన మధుర పదార్థములు, పాయసము, అనేక ప్రకారములయిన భక్ష్య, భోజ్యములు, గుమ్మిడిపండు, నారికేళములు, ఖర్జూరము, పనస, ద్రాక్ష, శాండిల్యము, ప్లీహము, నల్లతుమ్మ, కశేరు, క్రుమకం (వక్కలు), ముల్లంగి, లవ (లాజలు), నేరేడు, దొండ, పంచగవ్యములు, బెల్లము, మధ్యము, మాంసము, మధువు, చెరకు, చక్కెర, నారింజ, రామాఫలము, మేక, మహిషము, తన రక్తము, పక్ష్యాది ప్రాణులు, తొమ్మిది రకముల మృగములు; ఈ విధముగ సకల ఉపకరణముల ద్వారా నిఖిల జగద్ధాత్రి అయిన మహామాయ యొక్క పూజనమొనర్పవలెను. రక్తమాంసముల బురద ఏర్పడు రీతిని బలిదాన మొనర్పవలెను. ఆ రోజు రాత్రి శత్రు వినాశనార్థము, దుర్గాదేవి యొక్క ప్రసన్నతా సిద్ధ్యర్థము, స్కంధ విశాఖుల విగ్రహములు నువ్వుల పిండితో చేసి పూజింపవలెను. తదుపరి తిలలు, మాంసము, మరియు నేయి ఉపయోగించి ఉగ్రచండాది శుభ ప్రదాయినులైన అష్ఠ యోగినుల హోమమాచరింప వలెను. తదుపరి అరువది నాలుగు యోగినులు మరియు కోటి యోగినుల పూజన మొనర్పవలెను. అంతేకాక దేవికి అత్యంత సన్నిహితులైన జయంతీ మొదలగు నవదుర్గలను గంధ పుష్పములతో అర్చింపవలెను. చిత్రమేమనగా వీరందరూ కేవలము దేవి యొక్క మూర్తి భేదములే! వీరందరితో పాటు దేవి యొక్క అస్త్ర వాహనములను, సింహ సహిత మహిషాసుర మర్దినిని, అంగ ప్రత్యంగ మంత్రములతో పూజింపవలెను.

పూర్వకల్పమందలి స్వాయంభువ మన్వంతరమందు సత్యయుగారంభమున మహిషాసుర నాశనమునకు, మానవులు మరియు జగత్ హితార్థము మహాదేవి, మహామాయ, యోగనిద్ర ప్రాదుర్భవించి దేవతలచే స్తుతింపబడినది. ఆ సమయమున ఆ జగజ్జనని విశాల శరీరయై, షోడశ భుజయుక్తమై క్షీర సాగరపు ఉత్తర తీరమున ఆవిర్భవించి "భద్రకాళి" నామముతో ప్రసిద్ధమయినది. ఆ సమయమున ఆ తల్లి అసతీపుష్ప సంకాశయై, తప్తకాంచన కుండలాలంకృతయై, జటాజూటము, అర్ధచంద్రరేఖ, స్వర్ణమకుట ధారిణియై ఒప్పెను. ఆమె మెడయందు స్వర్ణ భూషణములతో పాటు నాగాభరణములు ధరించినది. దివ్య జనని కుడి చేతుల యందు వరుసగా శూల, చక్ర, ఖడ్గ, శంఖ, బాణ, శక్తి, వజ్ర, దండము

ధరించినది. ఎడమ చేతుల యందు వరుసగా డాలు, చర్మము, ధనస్సు, పాశము, అంకుశము, ఘంట, పరశువు, ముసలము ధరించును. ఆ తల్లి దంతములు మెరయుచుండగా అట్టహాసము గావించుచుండును. సింహ వాహనయై, త్రినేత్రములు రక్తవర్ణముతో ప్రకాశించుచుండగా ఎడమకాలితో మహిషుని మర్దించి, శూలముతో వానిని భేదించి, పరమేశ్వరి, మహామాయ, భద్రకాళి, జగత్స్వరూపిణి విరాజిల్లు చుండును. దేవియొక్క తేజోరూపమును, మరణించిన మహిషుని గాంచి తేవతలు సర్వులూ ప్రణామములాచరించి నిశ్శబ్దముగ నిలబడిరి. అంత దేవి వారిని గమనించి, వారి కొరకై కించిత్ స్మితముఖియై బ్రహ్మాది దేవతలతో ఇట్లనియె "సుర గణములారా! మీరందరూ జంబూద్వీపము నందలి హిమాలయ నికటమునున్న కాత్యాయన మహర్షి ఆశ్రమమునకు వెళ్ళవలసినది. అక్కడ మీకు కార్యసిద్ధి కలుగును. ఇందు సందియము లేదు," ఈ విధముగ పలికి దేవి అంతర్హితురాలైయ్యెను.

దేవతలు కొంచెము విస్మితులై ఈ విధముగ తర్కించుకొనిరి "మనము మహిషాసుర మరణమునకై భద్రకాళిని ప్రార్థించితిమి. ఆ తల్లి ప్రాదుర్భవించినపుడు మహిషుడు ఆ తల్లి శూలఘాతము చే మరణించుట కాంచితిమి కదా! మరి ఇపుడు కాత్యాయన మహర్షి ఆశ్రమమునకు ఏ కార్యమునకేగవలెను? ఇక మిగిలిన కార్యము లేవి? దేవి మనలను ఎందుకు ఈ మహర్షి ఆశ్రమమునకు ఏగమని ఆనతిచ్చినది? ఈ విధముగ తర్కించుకొనుచు వారందరూ కాత్యాయన మహర్షి ఆశ్రమము చేరిరి. అచట త్రిమూర్తులు, దిక్పాలురు, దుర్గా దర్శనార్థమై నిరీక్షించుచుండిరి. ఆ సమయమున రుద్ర గుణములేతెంచి మహిషాసురుని అకృత్యములు ఏకరువు పెట్ట నారంభించిరి. అంత త్రిమూర్తులు, దేవతలు, అత్యంత క్రోధితులై మహిషుడు తొలుత మరణించెను కదా! మరి ఈ జగద్విధ్వంశము కావించుచున్న వేరొక మహిషాసురుడెవ్వడు? అని తర్కింపసాగిరి. అత్యంత క్రోధితులై యున్న ఆ దేవతలందరి నుండి వేరువేరుగ దివ్యజ్యోతి రూపములో శక్తి వెలువడి, ఆ తేజోపుంజములన్నియు ఏకమై ఒక దివ్య శక్తిరూపిణి ఆవిర్భవించినది. ఈ శరీరాకృతి దాల్చిన తేజోరాశి మొట్టమొదట కాత్యాయన మహర్షి చే పూజింపబడి "కాత్యాయినీ దేవి" గా తెలియబడినది. ఆ తల్లి దశముఖి గా ఆవిర్భవించి ఆ రూపముతోనే మహిషుని సంహరించినది. ఆ మహాదేవి కృష్ణపక్ష చతుర్దశి నాడు బ్రహ్మాదుల చే ఆవాహన కావింపబడి, శుక్లపక్ష సప్తమినాడు దేవతా తేజములచే మూర్తిరూపము నొంది, అష్టమినాడు దేవతలచే అలంకరింపబడి, దివ్యాభూషణ భూషితయై, నవమినాడు మహిషాసుర వధ కావించి, దశమినాడు అంతర్హితమయ్యెను.

ఇది అంతయు వినుచున్న సగర చక్రవర్తి సంశయచిత్తుడై ఔర్వుని ఇట్లు ప్రశ్నించెను "స్వామీ! మహామాయ ఆవిర్భవించినపుడు మహిషుని సంహరించుచూ కనిపించినది. అయ్యది సర్వ దేవతలచే వీక్షింపబడినది. తిరిగి మహామాయ కాత్యాయినీ దేవిగా ఆవిర్భవించి తిరిగి మహిషుని పరిమార్చినది. ఇది ఎట్లు సంభవము? ఓ! మునిశ్రేష్ఠా! దయచేసి నా సంశయమునకు సమాధానమీయవలసినది."

ఔర్వుడు "ఓ! నృపశార్దూలా! పూర్వకాలమందు మహిషునితో పాటు భద్రకాళి ఎట్లు ప్రాదుర్భావము నొందినదో అద్దానిని వివరించెదను. వినుము. మహిషుడు రాజ్యపాలనము కావించు దినములందు ఒకానొకనాటి రాత్రి ఆతడు సుఖనిద్ర పోవుచుండగా ఆతనికి ఒక భయంకర స్వప్నము కనిపించినది. ఆ స్వప్నమందు ఆతడు భద్రకాళి తన నిశిత ఖడ్గము చే తన శిరమును ఖండించి, భయంకరముగ నోటిని తెరచి రక్తము పానము చేయుట కాంచెను. ఆతడు మిక్కిలి భయభీతుడై మరునాడు ప్రాత:కాలము నిదురలేచి, శుభ్రుడై, తన అనుచర సహితుడై, తీవ్ర భక్తితో భద్రకాళి పూజన మొనర్చెను. ఆతని భక్తి తీవ్రతకు ప్రసన్నయై భద్రకాళి షోడశ భుజయై దర్శనమిచ్చెను. అంత మహిషుడు వినమ్రుడై శిరస్సు వంచి, ప్రమాణములిడి ఈ విధముగ పలికెను. "తల్లీ! నేను నా స్వప్నమందు మీరు నా శిరస్సు ఖండించి రక్తపానము కావించుట కాంచితిని. మీరు రుధిరపానము చేయుట సత్యమని నాకు తోచుచున్నది. విధిరాతను ఎవరును మార్చలేరు. కానీ నా తండ్రి నా కొరకై శంభుని ఆరాధించెను. తత్కారణమున నేను జన్మమొందితిని. నేను సహితము

నియమముగా శివారాధన కావించి వరములు పొందితిని. నేను మూడు మన్వంతరములు నిష్కటంకమయిన అసుర రాజ్యమునేలితిని. అందువలన ఇపుడు నాకు దు:ఖము గానీ, పశ్చాత్తాపము గానీ లేవు. పూర్వ కాలమున "రౌద్రాశ్వ ఋషి" హిమాలయములందు తపమొనరించు చుండెను. ఆయన కాత్యాయన మహర్షి శిష్యుడు. నేను ఆయనను ఆటపట్టించుటకై ఒక దివ్యసుందరీమణి రూపము ధరించి ఆ ఋషిని మోహింపజేసితిని. ఆ మహర్షి కామాకర్షణ చే మూఢుడై తపస్సు నుండి విరక్తుడాయెను. కాత్యాయన మహర్షి ఈ విషయమును తెలిసికొని, తన శిష్యుని మంగళార్ధము నన్ను ఈ విధముగ శపించెను "నీవు స్త్రీ రూపము ధరించి నా శిష్యుని తపోభ్రష్టుని గావించితివి. అందువలన స్త్రీ జాతి మూలమున నీ వధ ప్రాప్తించును." ఆ శాపమును అనుభవించు సమయమాసన్నమయినదని నాకు తెలియుచున్నది. నేను ఇంద్రత్వము ను సహితము ప్రాప్తించి అఖండ త్రిభువన సామ్రాజ్యమును నిర్వివాదముగ భోగించితిని. నాకు ఈ లోకములందు వాంఛింపదగిన వస్తువు లేదు. ఒకవేళ నేను వాంఛించిన ఎడల నాకు ఆ వస్తువును పొందుట కష్టతరము కూడా కాదు. అమ్మా! నేను నిన్ను ఆశ్రయించుచున్నాను. దేవీ! దుర్గా! నిన్ను శరణువేడు చున్నాను. ఈ జీవితపు అంతిమ ప్రార్ధన స్వీకరించి ఒక్క వరము ప్రసాదింపవలసినది. నీకు మరల మరల ప్రణామము లర్పించుచున్నాను.

దేవి "ఓ! మహాసురా! మహిషాసురా! నీ మనసుకు నచ్చిన వరము కోరుకొనవలసినది. సందేహము లేదు. అయ్యది ఎంతటి దుర్లభమయిననూ అద్దానిని నెరవేర్చెదను." అంత మహిషుడు "తల్లీ! నేను మీ దయ చే యజ్ఞభాగములు భోగింప దలచితిని. నేను సర్వ యజ్ఞములందునూ పూజ్యుడనవవలెను. ఎంత వరకు ఈ లోకములో సూర్యుడుండునో అంతదనుక నేను మీ చరణసేవ వదులకుందును గాక! ఈ వరములు దయచేసి నాకు ప్రసాదింప వలసినది. అంత జగన్మాత "మహిషా! సమస్త యజ్ఞ భాగములను పూర్వకాలమందే దేవతలకు పంచి ఇచ్చితిని. ఇక ఇచ్చుటకు అచట ఏదియునూ మిగిలి యుండలేదు. కానీ నీవు నా ద్వారా యుద్ధమందు సంహరింపబడిననూ, నీవు నా చరణములు త్యజింపవు. ఇందు సందేహము లేదు. నేను ఎక్కడెక్కడ పూజింపబడుదునో, అక్కడక్కడ నీ శరీరము సహితము పూజింపబడును." దేవి యొక్క వరములకు మహిషుడు మిక్కిలి సంతోషము నొంది "ఓ! ఉగ్రచండా! భద్రకాళీ! దుర్గాదేవి! నీకు నమస్కారము. మీకు అనేక మూర్తులు కలవు. ఈ జగత్తు నందలి సర్వము మీ మూర్తి స్వరూపమే! నేను మీ ఏఏ మూర్తుల సహితముగ పూజింపబడుదును? మీకు నా యందు కృప కలిగినచో దయచేసి తెలుపవలసినది." అంత దేవి "మహిషా! నీవు ప్రస్తుతము ఏ మూర్తుల నామములను తలంచితివో (ఉగ్రచండా, భద్రకాళి, దుర్గ), ఆ మూర్తుల చరణములందు నీవు ఎల్లప్పుడూ సంలగ్నుడవై యుండెదవు. ఈ మూర్తుల చరణములందుండి నీవు దానవ, మానవ, దేవతలచే పూజలందుకొందువు. ఆదిసృష్టి యందు నేను ఉగ్రచండ రూపమున నిన్ను సంహరించితిని. ద్వితీయ సృష్టి యందు భద్రకాళి రూపమున నిన్ను పరిమార్చితిని. ఈ జన్మమందు దుర్గా రూపమున నీ అనుచర సహితముగ నిన్ను హతమార్చెదను. కానీ పూర్వపు రెండు మూర్తుల యందు నేను నిన్ను నా చరణ సన్నిధి యందుంచలేదు. కానీ ఇపుడు నీ ప్రార్ధన ననుసరించి ఆ రెండు మూర్తుల యందు సహితము నిన్ను నా చరణ సన్నిధిని యుంచెదను. ఇపుడు దుర్గామూర్తి యందు సహితము నీవు యుండి పూజలను గ్రహింపవలసినది.

మహామాయ ఈ విధముగ పలికి మహిషునకు "ఉగ్రచండ" రూపమును చూపెను. ఉగ్రచండ షోడశభుజ అయిన భద్రకాళి కంటె రెండు భుజములు ఎక్కువ కలిగి, మిగుల బలిష్ఠియై, ఆ రెండు బాహువుల యందు కుడివైపు గద, ఎడమవైపు సురాభాండము పట్టుకొని గళమున పుర్రెలమాల దాల్చినదై యుండెను. ఈ తల్లి దళితాంజన శరీరయై, సింహవాసినియై, రక్త నేత్ర, అత్యంత బృహత్ శరీరయై పదునెనిమిది బాహువులు కలిగి యుండెను. మహిషుడు ఉగ్రచండ, భద్రకాళీ స్వరూపమును కాంచి విస్మిత చిత్తుడై వారికి ప్రణామములర్పించెను. తదుపరి దేవి మహిషునకు ఎట్లు మరణము సంభవించునో అద్దానిని కనిపింప జేసినది. అది ఎట్లన దేవి పూర్వము ఏ విధముగ మహిషుని

సంహరించినదో అదే విధముగ మహిషుని తన పాదముల కడకీడ్చి, తన పాదము తో త్రొక్కి, మహాసురుని పట్టి, హృదయమును శూలము తో చీల్చెను. మహిషుడు ఆ శరీరము నుండి నిర్గమంచి, దేవి ద్వారా ఖండింపబడిన తన పూర్వ మహిష శిరమును, అస్త్ర వస్త్ర భూషణ యుక్తమై యుండి వరద వలె రక్తస్రావము అగుచున్న తన విశాల కాయమును వీక్షించి ఒక్కతరి శోక మోహగ్రస్తుడయి, తిరిగి స్వస్థుడై దేవికి ప్రణామము లాచరించి గద్గద స్వరముతో ఇట్లనియె "తల్లీ! మీరు నా యందు ప్రసన్నులైన ఎడల, నాకు మీ పూజ యందు భాగమును ప్రసాదించిన ఎడల దయచేసి తిరిగి నాకు ఈ దుస్థితి కల్పింపవలదు. నాకు ఇక దేవతలతో వైరము వలదు. నాకు పునర్జన్మ వలదు. నాకు ఆ వరము ప్రసాదింప వలసినది." అంత దేవి "మహాసురా! నీవు నా ఆరాధన కావించితివి. నీవు నాచే వధ్యుడవు. దీని విషయమై ఇక వాదన తగదు. నీవు దేవతలతో విరోధము వలదంటివి. అట్లే అగుగాక! నా చరణ సంస్పరణము వలన నీ శరీరము యజ్ఞ (పూజ) భాగము గైకొను నిమిత్తము విదీర్ణము కాదు. పరమాత్ముడయిన మహాదేవుని సంస్పర్శ కారణమున నీ ప్రాణము జీవాత్మ యందే స్థితిగతమై యుండును. మూడు వేలనూట ఎనిమిది కోట్ల కల్పముల పర్యంతము నీకు పునర్జన్మ కలుగదు. ఈ విధముగ వరములిచ్చి, తిరిగి మహిషుని జీవింపజేసి, వానిచే వందనములు గైకొని, దేవి అంతర్హితమయ్యెను. మహిషుడు తిరిగి తన స్వస్థలికేగి, మహామోహగ్రస్థుడై, తన పూర్వ అసుర భావమును పూర్ణముగ పొందెను."

అంత సగరుడు ఔర్వ మహర్షిని తిరిగి ఈ విధముగ ప్రశ్నించెను "ఓ! ద్విజశ్రేష్ఠా! లోక కళ్యాణార్థమై ఇదివరలో ఎందరో రక్కసులను మహామాయ వధించినది. కానీ వారెవరికీ ఆ తల్లి అతులిత వరములు ఈయుట గానీ, తన వానిగ వాత్సల్యము చూపుట గానీ ఎరుగుము కదా! ఏ కారణము చే ఆ తల్లి మహిషుని పై అంత కృపా వాత్సల్యములు వర్షించి వరము లిచ్చినది? దయచేసి నాకు తెలుపవలసినది. "ఔర్వుడు సగర సార్వభౌమా! ఒకనాటి మాట!! పూర్వ కాలమున "రంభుడు" అను దైత్యపుంగవుడుండెడి వాడు. ఆతడు మహాదేవుని భక్తుడు. అతడు దీర్ఘకాలము మహాదేవునారాధించి తపమాచరించెను. ఆతని తపమునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై వరము కోరుకొనమనెను. అంత రంభుడు కపాలికి వందనములిడి ఇట్లనియె "మహాదేవా! నేను అపుత్రకుడను. ఒకవేళ మీకు నాయందు కృపాకటాక్షములుయున్న ఎడల మీరు మూడు జన్మల యందు నా పుత్రుడై పుట్టవలెను. మీరు నా పుత్రుడయినప్పటికీ మీరు సర్వ ప్రాణుల చే అవధ్యులై, దేవగణ విజేతలై, చిరాయువు, యశశ్వి, లక్ష్మీ సంపన్నుడు, సత్య ప్రతిజ్ఞా పాలకుడై యుండవలెను." అంత ఈశ్వరుడు భక్త సులభుడు కావున "మనోవాంఛా ఫలసిద్ధిరస్తు" అని దీవించి అంతర్హితుడయ్యెను. అంత రంభాసురుడు ప్రసన్న హృదయుడై తన గృహమున కేగుచుండగా, మార్గమధ్యమున ఆతనికి మూడు వర్షముల నవయవ్వనమునందున్న ఒక సుందర మహిషి (ఆడదున్న) కానబడెను. ఆ మహిషిని కాంచగనే రంభుడు కామమోహితుడై, ఆమె హస్తమును గ్రహించి ఆమెతో రతిక్రీడ సలపనారంభించెను. వీరి కామోపభోగ ఫలితముగ మహిషి గర్భవతియై మహిషాసురుని కనెను. మహిషుడు అసామాన్యుడు. సాక్షాత్ శంకరాంశ సంభూతుడు. చిన్నప్పటి నుండి మహిషుడు శుక్లపక్ష చంద్రుని వలె దినదిన ప్రవర్ధమానుడయ్యెను. ఈ మహిషునే కాత్యాయన మహర్షి తన శిష్యకారణమున శపించెను.

మహిషుడు ఈ విధముగ శపించబడగనే భగవానుడు చంద్రశేఖరుడు చండికాదేవి తో ప్రేమగా ఇట్లనియె "ఓ! దేవీ! జగన్మయీ! కాత్యాయన ముని స్త్రీ జాతి కారణమున నీవు మడియుదువని మహిషుని శపించెను. మహర్షి వాక్యము సత్యమయి తీరును. యోగ యుక్తుడయిన మహిషుని శరీరము నాదే! ఈతడు పూర్వము నాచే సంహరింపబడెను. తదుపరియు అట్లే జరుగును. కానీ శ్రీమహావిష్ణువు సింహరూపమున నిన్ను మోయలేకున్నాడు. అందువలన నా మహిష శరీరము సహితము నిన్ను వహించును." ఈ విధముగ మహాదేవుడు దేవిని ప్రార్థించెను. మూడు జన్మల యందును రంభాసురుడు "రంభుడు" అను నామము చే జన్మించి, మహాదేవుని కొరకై మహోగ్రతపమాచరించి శంభుని పుత్రునిగ

పొందెను. ప్రతి జన్మయందును ఆతడు మహిషిపై కామోద్రేకత నొంది, తత్ఫలితముగ మహిషాసురుని పుత్రునిగ పొందెను. మూడు జన్మల యందును ఆతడు కాత్యాయన మహర్షి చే శపించబడెను. ప్రతి జన్మము నందు మహిషుని ప్రవృత్తి మారక ఒకే విధముగ యుండి అత్యంత నియమ నిష్ఠలతో దేవీ పూజ కావించి వరముల బడసెను. కేవలము తృతీయ జన్మమందే ఆతడు దేవి నుండి జన్మరాహిత్యము వాంఛించెను. నృపశార్దూలా! అందువలన ఈ జన్మమందు మహిషుడు దేవి యొక్క చరణములందు సంలగ్నుడయ్యెను. ఇక అనేక కల్పాంతముల వరకు ఆతనికి జన్మలేదు. ఈ విధముగ మహాదేవాంశ సంభూతుడయిన మహిషుడు దేవీ కృప చే ఆ తల్లి చరణ కమలములందు సంలగ్నుడై ఇప్పటికీ దివ్యానంద భోగములనుభవించుచున్నాడు. మార్కండేయుడు “మునులారా! ఔర్వసగర సంవాదము నందలి మహిషాసుర చరిత్రమును మీకు వినిపించితిని. కానీ గుప్తాతిగుప్తమయిన ఔర్వ సగర సంవాదము నందలి మిగిలిన విషయములను మీకు వినిపించెదను.

**(శ్రీ కాళికాపురాణమందలి కాత్యాయినీ ఆవిర్భావము మరియు మహిషాసుర ఉపాఖ్యానమను**
**అరువదియవ అధ్యాయము సమాప్తము)**

# అరువది ఒకటవ అధ్యాయము

**(దేవీ పూజా కర్తవ్యత, కామాఖ్యా మహాత్మ్యమ్ - 1)**

ఔర్వుడు “ఓ! నృపశార్దూలా! ఇపుడు తిరిగి భేతాళ భైరవులకు మహాదేవుడుపదేశించిన విధి విధానములు గూర్చి తెల్పెదను. పూర్వకాలమున సూర్యుడు కన్యారాశి యందు ప్రవేశించినపుడు కృష్ణపక్ష నవమినాడు భగవతి మహామాయ అష్టాదశ భుజ మరియు కోటి యోగినీ పరివేష్ఠితయై ప్రాదుర్భవించెను. అది ఎట్లనగా.......పూర్వము దక్షప్రజాపతి యజ్ఞము చేసెనని తెలిపితిని కదా! అయ్యది పన్నెండు సంవత్సరములు పాటు జరుగు మహాయజ్ఞము. అందు దక్షుడు సర్వదేవతలను, వరణము చేసి కపాలినగుట చే నన్ను (శంకరుని), నా పత్ని అగుటచే సతీదేవిని ఆహ్వానింపలేదు. అంత సతీదేవి ప్రాణత్యాగము కావించిన విషయము లోక విదితమే! కానీ రహస్యమేమన, సతీ దేహత్యాగము కావించిన సమయమున ఆమె “చండమూర్తి” రూపము ధరించినది. ఆమె దేహత్యాగము కావించిన దినము సూర్యుడు కన్యారాశి యందు ప్రవేశించిన కృష్ణపక్ష నవమి. ఆ సమయమున యోగనిద్ర చండమూర్తి (ఉగ్రచండ) రూపము ధరించి, కోటియోగినీ పరివేష్ఠితయై, అష్టాదశభుజయై సతీరూపు విసర్జించి మహాదేవునితో పాటు యజ్ఞ ధ్వంసము కావించినది. తదనంతరము దేవి యొక్క అతిదారుణ క్రోధము శాంతించిన పిదప దేవగణములందరూ పూర్వోక్త విధానమున అతులిత పూజన మొనర్చిరి. దీని వలన దేవగణముల దు:ఖము దూరమై పరమశాంతి నొందిరి. ఈ విధముగ అతులిత విభూత్యైశ్వర్యముల కొరకై, చతుర్విధ పురుషార్థముల కొరకై సర్వులు ఈ పూజను కావింపవలసినది. ఎవరేని మనుష్యులు మోహము, బద్ధకము, దంభము లేక ద్వేష కారణమున ఈ మహోత్సవ కాలమందు దేవీపూజను కావింపని ఎడల, దేవి వానిపై క్రోధము పూని వాని సమస్త కామనలను నాశనమొనరించును. తదుపరి జన్మమున ఆ జీవి దేవి యొక్క బలిపశువై జన్మించును.

అష్టమి నాడు రక్తముచే, సుగంధ మాంసము చే, నానా విధములయిన బలులచే, సింధూరము, పట్టు వస్త్రములు, నానా రకములయిన లేపనములచే, అనేక విధములయిన ఫలపుష్పముల చే దేవీపూజ కావింపవలెను. పుత్రవంతుడయిన వ్యక్తి మహాష్టమి నాడు ఉపవాస ముండరాదు. ప్రతి అయినవాడు సర్వ విధముల ఆచార వ్యవహారములచే పవిత్రాత్ముడై

యుండి, పూజనమొనర్చి తదుపరి నవమి నాడు బలి ప్రదానము కావింపవలెను. దశమినాడు శ్రవణ నక్షత్ర కాలమందు "శార్వరోత్సవము" కావించి దేవీ పూజా ఉద్యాపన (విసర్జన) కావింపవలెను. ఉద్యాపన, రోజు నందు శ్రవణ నక్షత్రము యొక్క అంతిమ చరణమందు కావింపవలెను. ఈ విధముగ సంప్రోక్షణ గావించి తదుపరి సువాసినులు, కన్యలు, వేశ్యలు, నర్తకీమణులు, సహితులై శంఖము, భేరీ, బాకా, పటహము, మృదంగము మొదలగు వాద్యములు ప్రయోగించుచూ, అనేక ధ్వజములు ఎగురవేయుచూ, లాజలు, పువ్వులు విసురుచూ, క్రీడా కౌతుకముతో భగలింగాది శబ్దములను గ్రామ్య శబ్దములుగ ఉచ్చారణ కావించుచూ, గ్రామ్య గీతములాలపించుచూ, ఈ విధములయిన అశ్లీల పదముల నుపయోగించుచూ ఉద్యాపనా కాలమందు ధూళి విరజిమ్ముచూ మంగళాచరణము కావింపవలెను. ఈ దినమున ఏ వ్యక్తి తనపై చూపబడిన అశ్లీల వ్యవహారము శుభమని తలంపడో, అట్లే ఇతరులతో అశ్లీల వ్యవహారము నడుపడో, వారి యందు దేవి అప్రసన్నయై శాపమిలిడును.

దేవి యొక్క ఉత్థానము నవమి నాటి రాత్రి శ్రవణ నక్షత్రము మొదటి పాదమందు కావింపవలెను. పగటి పూట ఉత్థానము (లేవనెత్తుట) కావింపరాదు. ఒకవేళ రాత్రి సమయమునకు శ్రవణ నక్షత్ర అంత్య పాదములున్న ఎడల అపుడు పగటి పూజ ఉత్థానము కావించవచ్చు. దేవీ ప్రతిమను ఈ ఉద్యాపనా మంత్రమును పఠించుచూ నీటియందు కలుపవలెను. మంత్రార్థము "ఓ! దేవీ! చాముండీ! శుభప్రదమయిన నా పూజను స్వీకరించి నీవు నీ ఎనిమిది శక్తులతో నాకు కళ్యాణము ఒనర్పవలసినది. నేను కావించిన పూజను పరిపూర్ణ మొనర్పవలసినది. దేవి మీరు ఈ జలమందు ప్రవేశించి, సూక్ష్మరూపము తో నా గృహమందు ఎల్లప్పుడూ నివాసముండవలసినది. నేను సంతానము, ఆయువు మరియు ధనవృద్ధికై మిమ్ము జలమందు స్థాపించుచున్నాను." మహామాయ యొక్క మహోత్సవ కాలమందు "భద్రకాళీ" మరియు "ఉగ్రచండీ" రూపములను సహితము దుర్గామంత్ర, తంత్రములతో పూజింపవలెను. వీరందరి పూజన కొరకై నేత్రబీజమును (క్లాం) పలికి సర్వ యోగినుల పూజనమొనర్పవలెను. భైరవా! ఇపుడు ఉగ్రచండా మంత్రమును తెలిపెదను. నేత్ర బీజము యొక్క మొదటి రెండు మంత్రముల మధ్య "హ" కారమునకు "ర" కారము జోడించి దానిపై చంద్రబిందువును అమర్చిన ఎడల అయ్యది ఉగ్రచండ మంత్రమగును – "ఐం హ్రీం హ్రౌం".ద్వితీయ నేత్ర బీజమంత్రము రెండు మార్లు ఆవృతమయిన అయ్యది ధర్మార్థ కామ సిద్ధి యొనర్చు భద్రకాళీ మంత్రమగును – "హ్రీం హ్రీం."

మహామాయా, జగన్మయి వైష్ణవీ దేవిని పూజించినపుడు అష్టయోగినులను సహితము పూజింపవలెను. పూర్వ కాలమందు ఈ అష్టయోగినులు శైలపుత్రి ప్రభృతులు. దుర్గాతంత్ర మందలి అష్టయోగినులు ఉగ్రచండాది ప్రభృతులు. భద్రకాళీ మంత్రముచే భద్రకాళీ పూజనమొనర్పవలెను. భద్రకాళి యొక్క అష్ట యోగినులు – "జయంతి, మంగళ, కాళి, భద్రకాళి, కపాలినీ, దుర్గా, శివా, క్షమ మరియు ధాత్రి." ఐశ్వర్య వృద్ధికై ఈ అష్ట యోగినులను అష్టదళ పద్మమందు పూజింపవలెను. ఉగ్రచండా మంత్రము తో దేవిని పూజించునపుడు ఉగ్రచండా అష్ట యోగినులను సహితము పూజింపవలెను. వారు వరుసగా "కౌశికీ, శివదూతి, ఉమ, హైమవతి, ఈశ్వరీ, శాకంబరీ, దుర్గా, మహోదరి". ఇపుడు సౌమ్యమూర్తి అయిన ఉమాదేవి యొక్క మంత్రమును వినుము. ఇది ఏకాక్షరి లేక త్రయక్షరి "ఫ: ఫట్." ఈ తల్లి స్వర్ణ సదృశ గౌరవర్ణ, ద్విభుజ యై యుండి ఎడమ చేతి యందు నీలికమలము, కుడి చేతియందు శ్వేత చామరము ధరించి, ఆ చేతిని శంభుని కుడి తొడపై యుంచి ఉపస్థితమై యుండును. ఈ దేవిని ఇట్లే ధ్యానింప వలెను. భక్తజనులు మహాదేవుని వినా కేవలము స్వర్ణవర్ణ గౌరాంగీ, పద్మచామర ధారిణీ, ద్విభుజి, ఎల్లప్పుడూ వ్యాఘ్ర చర్మముపై యుంచబడిన పద్మము నందు పద్మాసనా స్థిత అయిన రుద్రాణి ఉమ యొక్క ధ్యానము కూడా చేయవచ్చు. (సాధారణముగ ఉమా మహేశులను వేరు పరుచరాదు.) ఉమాదేవి యొక్క పూజనము నందు ఆమె యొక్క అష్ట యోగినుల పూజ కూడా సలుపవలెను. వారు వరుసగా "జయ, విజయ, మాతంగీ, లలిత, నారాయణీ, సావిత్రీ, స్వధ, స్వాహా."

పూర్వకాలమందు అంధకాసురునికి శుంభ, నిశుంభులను, ఇరువురు పుత్రులు కలరు. వారిరువురు మహాకాయులు, మహాసత్వ సంపన్నులు, ప్రబల పరాక్రమోపేతులే కాక మత్తేభము వంటి దుర్మదాంధులు. అంధకుడు నాచే (శంకరుడు) సంహరింపబడెను. కానీ ఈ ఇరువురు సోదరులు సైన్య, వాహన సమేతులై పాతాళము నందు నివాసముండి, తదుపరి అతి తీవ్ర తపమాచరించి, విరించిని ప్రసన్నము కావించుకొని దుర్లభమయిన వరములు పొందిరి. ఈ వర గర్వము చే వారు ముల్లోకములను ఆక్రమించి, వశము గావించుకొని, శంభుడు ఇంద్రత్వమును, నిశుంభుడు చంద్రత్వమును పొందిరి. తదుపరి వారిరువురు దేవగణముల యొక్క యజ్ఞ భాగములు హరించి, స్వయముగ దిక్పాలురైరి. అంత ఇంద్రుడు సర్వదేవతా సహితుడై హిమాలయమందలి గంగావతరణ స్థానమునకేగి, మహామాయను ప్రసన్నము కావించుకొనుటకై స్థవము సల్పి అనేకమార్లు స్థుతించెను. అంత దేవి సంతుష్ఠి నొంది, ఒక మాతంగి రూపము ధరించి, అచటి కేతెంచి వారితో ఇట్లనియె "ఇయ్యది మతంగ మహర్షి ఆశ్రమము. మీరందరూ ఇచటి కేతెంచుటకు కారణమేమి? మీరు ఏ స్త్రీమూర్తిని కొలుచుచున్నారు?" ఈ విధముగ మాతంగి ప్రశ్నించుచుండగా, ఆమె శరీరము నుండి ఒక దివ్య దేవతా స్త్రీ ఉద్భవించి "వీరు నా కొరకై స్థవము కావించు చున్నారు." శుంభ నిశుంభులను ఇరువురు దానవులు సమస్త దేవతా గణమును హింసించుచున్నారు. అందువలన వారి వదార్ధము ఈ దేవతలు నా స్థవము కావించుచున్నారు." అని శెలవిచ్చెను. హిమాచలాశ్రితము, గౌరవర్ణి అయిన మాతంగి శరీరము నుండి ఆ దివ్య దేవతామూర్తి వెలివడగనే మాతంగి శరీరము దళితాంజన సమాన కృష్ణ వర్ణము నొంది "కాళిక"యని పిలువబడెను. ఈమె కూడా హిమాలయములను తన స్వస్థానమొనర్చుకొనెను. ఋషిగణము ఈమెనే "ఉగ్రతార" అని పిలిచిరి. ఈ తల్లి భక్తులను ఉగ్ర లేక తీవ్ర భయముల నుండి కాపాడును. ఈమెకు ఒక్కటే జట యుండును. అందువలన ఈమెను "ఏకజట" అని కూడా పిలుతురు. ఈమె మంత్రమందలి తొలి బీజము "ఐం". ఈమె మంత్రము తొలతనే తెలుపబడినది "(ఐంహ్రీంహ్రౌం)."

ఇపుడు ఈ ఏకజటా దేవి యొక్క ధ్యానము గూర్చి వివరించెదను. ఈ ధ్యానముచే భక్తుల అభీష్ఠములు పూర్ణమగును. ఈమె చతుర్భుజి, కృష్ణవర్ణ మరియు కపాలమాలా ధారిణి. ఈమె కుడి వైపు ఊర్ధ హస్తమందు ఖడ్గము, అధోహస్తమందు చామరము యుండును. వామ ఊర్ధ్వ హస్తమందు కత్తెర, అధోహస్తమందు కపాలము ధరించి, శిరమందు ఆకాశభేదిని అయిన ఏకజట శోభించుచుండును. ఈమె కంఠమందు ఎల్లప్పుడూ కపాలమాలాధారియై యుండును. ఈ దేవి వక్షస్థలమందు నాగాభరణ భూషితయై యుండి, నేత్రములు రక్తవర్ణములై, కృష్ణవస్త్రధారియై, కటి యందు వ్యాఘ్రచర్మము ధరించి, వామ పాదము శివుని హృదయము పై యుంచి, దక్షిణ పాదము సింహపు మూపుపై యుంచి, స్వయముగ శవ దేహమును నాలుకతో నాకు చుండును. ఈ దేవి అత్యంత అట్టహాసముగ ఘోర శబ్దములు కావించుచూ, అతి భీషణముగ కానపట్టును. భక్తులు ఈ దేవిని ఈ విధముగ ధ్యానింపవలెను. ఈ దేవికి అష్ఠ యోగినులు కలరు. వారు వరుసగా "మహాకాళీ, రుద్రాణీ, ఉగ్రా, భీమా, ఘోరా, భ్రామరీ, మహారాత్రి మరియు భైరవి." వీరిని సహితము పూజింపవలెను.

మాతంగీదేవి శరీరము నుండి బయల్వెడలిన సుచారురూప సంపన్న, మనోహారిణీ దేవి "కౌశికీ" అని పిలువబడును. ఈ కౌశికీ దేవి చండీదేవి యొక్క హృదయము నుండి ఆవిర్భవించి, ఆమె నాలుకయొక్క ఆగ్రభాగము నుండి బయల్వెడలినది. ఈమెతో సాటివచ్చు సుందర సౌందర్యరూపిణిలు లేరు అన అతిశయోక్తి కాదు. ఏ దేవీ స్వరూపము మహామాయా, యొగనిద్ర, మూల ప్రకృతి అని పిలువబడునో ఆ దేవి యొక్క ప్రాణ స్వరూపమే కౌశికీ దేవి. ఈ కౌశికీ దేవి మంత్రము "సూం అం కం చం టం తం పం." ఈ శుభమంత్రము సర్వ కామనలను ప్రసాదించును. భేతాళ, భైరవులారా! సర్వ జగదాహ్లాదిని అయిన ఈ దేవీ రూపమును వర్ణించెదను. ఏకాగ్రచిత్తులై వినవలసినది. ఈ దేవి మస్తకమందు చిక్కని కబరీ బంధము ధరించి, దాని యందు కిరీట ధారణ చేయును. లలాటమందు తిలకధారణ గావించి, ఆ తిలకపు పై భాగమున సుందరమయిన అధోముఖ చంద్రరేఖ ఉపస్థితమైయుండును. కపోలములు మణికుండలముల కాంతులు

వెదజల్లు చుండును. కర్ణములు కర్ణపూరములను కర్ణ భూషణములచే అలంకరింపబడి యుండును. దేహమందు స్వర్ణ మణిమయ మాణిక్యహారములు, సర్పహారములు, విరాజిల్లు చుండును. ఈ తల్లి ఎన్నడూ వాడని సుగంధ భరిత కమలమాల గళమున ధరించును. ఈ తల్లి కమలనాళముల వంటి సుకోమల హస్తములు, గుండ్రని భుజములు కలిగి, ఆ భుజములు సువర్ణ కేయూరయుక్తమై యుండును. పీనోన్నత పయోధరములు కంచుకి చే బంధింపబడి, సన్నని నడుము, త్రివళీయుక్తమయిన ఉదరము కలిగి పచ్చని పట్టు పుట్టము ధరించి ఈదేవి ప్రకాశించుచుండును. దక్షిణ హస్తములందు వరుసగా పై నుండి క్రిందికి శూల, వజ్ర, బాణ, ఖడ్గ, శక్తులు; వామ హస్తములందు వరుసగా పై నుండి క్రిందికి గద, ఘంట, ధనుస్సు, డాలు, శంఖము ధరించి యుండును. దేవి యొక్క సింహ వాహనముపై వ్యాఘ్రచర్మము పరుచబడి, అద్దానిపై దేవి సుఖాసీనయై యుండును. ఈ విధముగ కౌశికీ దేవి సర్వదేవ దానవ గణములను మోహింపజేయుచుండును. ఈ కౌశికీ దేవి సహితము అష్ట యోగినీ పరివృత. వీరి నామధేయములు "బ్రాహ్మణి, మహేశ్వరి, కౌమారి, వారాహి, వైష్ణవీ, నారశింహీ, ఐంద్రీ, శివదూతి." ఈ మహానుభావలైన అష్టయోగినులు అతులిత కామ ప్రదాయినులు.

మాతంగీ దేవి నుండి విడివడిన కాళీదేవి యొక్క మంత్రము "క్రీం ఫట్." ఈ మంత్రము ధర్మార్థ కామ ప్రదాయకమయిన కాళీ మంత్రము. ఇపుడు కాళీదేవి యొక్క మూర్తి వర్ణనము కావించెదను. ఏకాగ్రతతో వినుడు. ఈ దేవి నీలి కమల దళముల వంటి శ్యామవర్ణినియై, చతుర్భుజయై శోభిల్లును. దక్షిణ హస్తములందు ఊర్ధ్వమున ఖట్వాంగము, క్రింద చంద్రహాసము, వామహస్తములందు ఊర్ధ్వమున డాలు, క్రింద పాశము ధరించును. గళమందు కపాలమాల ధరించి, వ్యాఘ్ర చర్మాంబరధారియై ఒప్పును. ఈ దేవి కృశించిన అంగములు, భయంకరమయిన కోరలు, అతి దీర్ఘ శరీరము కలిగి భీషణాకృతితో యుండును. పాము వలె లోపలికి, వెలుపలికి తిరుగాడుచున్న మెలి తిరిగిన నాలుక, రక్తవర్ణ నేత్రములు, ఈ ఆకృతిని మరింత భయానకముగ గావించును. ఈ దేవి అతి విశాలముఖియై, లోహపాత్రపై ఆశీనయై యుండి, విశాలమయిన కర్ణములు కలిగి యుండును. ఈ దేవియే "తార" లేక "చాముండ" అని పిలువబడును. ఈ దేవి యొక్క అష్ట యోగినులు "త్రిపుర, భీషణ, చండీ, కర్త్రీ, హంత్రీ, విద్యాయినీ, కరాళీ, శూలిని." ఈ కాళీదేవిని పూజించునపుడు ఈ అష్ట యోగినులను సహితము పూజింపవలెను. ఈ తల్లి అత్యంత కామప్రద మరియు జడత్వమును నాశనమొనర్చును. కామనా ప్రదాయకము నందు ఈ దేవితో సమానమయిన దేవత వేరొకరు లేరనుట అతిశయోక్తి కాదు.

ఇపుడు శివదూతి గూర్చి తెలిపెదను. ఈ దేవి విష్ణు భగవానుడు కౌశికీదేవిని ధ్యానించినపుడు సాక్షాత్ ఆయన హృదయము నుండి ఆవిర్భవించినది. ఆ దేవి ఎల్లప్పుడూ వందలాది జంబుకముల చే పరివృతయై యుండును. ఈ దేవి యొక్క మంత్రము "ప్రూం స: స్ఫేం క్ష:". ఇయ్యది ధర్మార్థకామ ప్రదము. ఈ మంత్రము ద్వారా సాధకుడు వాంఛిత కామితములను పొంది దుర్లభమయిన శివలోకము నొందును. ఈ దేవి యొక్క రూపమును వర్ణించెదను. ఏకాగ్రతతో వినుడు. ఈ దేవి చతుర్భుజ, మహాకాయ యై యుండి, శరీరవర్ణము, సింధూరము వలె ప్రకాశించుచుండును. శిరమున జటాజూటము, అర్ధచంద్రరేఖ కలిగి, రక్తవర్ణ దంతములు, గళమందు కపాలమాల, కర్ణములందు నాగ కుండలములు ధరించును. నఖములు దివ్య కాంతి శోభితములై యుండును. ఈ దేవి వ్యాఘ్ర చర్మధారియై, దక్షిణ హస్తములందు పైన శూలము, క్రింద ఖడ్గము, వామ హస్తములందు పైన పాశము, క్రింద డాలు ధరించి యుండును. ఈ దేవి ముఖము, పెదవులు స్థూలముగ యుండి, ఉదరము విశాలముగ యుండి, దేహము మిక్కిలి ఎత్తుగ చూచుటకు అతి భయంకరముగ యుండును. ఈ దేవి కుడి పాదము శవ వక్ష స్థలముపై యుంచి, ఎడమ పాదము నక్క యొక్క వీపుపై యుంచి, వందలాది శృగాలముల చే (నక్కలచే) పరివేష్ఠితమై యుండును. ఈ శివదూతి యొక్క మూర్తిని ధ్యానము చేయుట చే శుభ ఫలములు శీఘ్రముగ లభించును. ఏ మానవులు "శివా" (నక్క) శబ్దము వినంగనే విధి విధానముగ శివదూతి

పూజనమొనర్చెదరో వారికి సమస్త కామనలు కరతలామలకములగును. మహామాయ, జగద్ధాత్రి, జగత్‌హితార్ధము రక్తబీజుని సంహరించినపుడు, ఆ దేవి శరీరము నుండి ఉత్పన్నమయిన దివ్య రూపిణియే శివదూతి. ఈమెను శంభుడు దూతగా మార్చి మంతనములకై పంపెను. అప్పటి నుండియు ఈదేవి "శివదూతి" అని పిలువబడెను. ఈమె ఎల్లప్పుడూ ద్వాదశ యోగినుల చే పరివేష్ఠితమై యుండును. వారు వరుసగా "క్షేమకరీ, శాంతా, వేదమాత, మహోదరీ, కరాళీ, కామదా, భగాఖ్యా, భగమాలినీ, భగోదరీ, భగారోహా, భగజిహ్వా మరియు భగా." ఈ ద్వాదశ యోగినులు శివదూతిని ఎల్లప్పుడూ అనుసరించు చుందురు. శివదూతిని పూజించునపుడు ఈ యోగినులను సహితము పూజింపవలెను. భేతాళ భైరవులారా! మీకు దేవి యొక్క అంగ మంత్రములను తెలిపితిని. ఇపుడు కామాఖ్యాదేవి మహాత్మ్యము, పూజాకల్పము, మరియు మంత్రములను తెలిపెదను.

**(శ్రీ కాళికా పురాణమందలి కామాఖ్యా మహాత్మ్యము, దేవీపూజా కర్తవ్యత అను అరువది ఒకటవ అధ్యాయము సమాప్తము)**

# అరువది రెండవ అధ్యాయము

**(కామాఖ్యాదేవీ మహాత్మ్యము - 2)**

భగవానుడు తిరిగి చెప్పదొడంగెను "సర్వ జనుల కామనలను పూర్ణమొనర్చుటకై ఎవరు నాతో ఈ మహాగిరి పైకి ఏతెంచినదో, నిర్జనమయిన నీలకూట పర్వతముపై ఏ దేవి ఉపస్థితమయినదో ఆ దేవియే "కామాఖ్య" అని పిలువబడును. ఈమె "కామిని" – సర్వజనులను అకర్షించునది. "కామదా" – సర్వమును ప్రసాదించునది. "కామా" – సర్వ జనులచే అభిలషినీయ, చివరగా "కామాంగనాశినీ" – సర్వుల కామములను హరించి మోక్షమునకు దారి చూపునది. ఈ కారణములచే ఈమె "కామాఖ్య" అని పిలువబడును. ఈ దేవి యొక్క మహాత్మ్యమును వినుడు. వాస్తవమునకు ఈ దేవియే సమస్త జగత్తును నియంత్రించునది. ఒకానొకనాటి మాట. విష్ణుభగవానుడు మహామాయ చే విమోహితుడై మధు కైటభులతో యుద్ధ మొనర్చెను. అది ఎట్లనిన – ఒకనాటి దైనందిన ప్రళయ వేళ కూర్మపృష్ఠము పై యుండిన పృధివి సంపూర్ణముగ విశీర్ణమై ప్రళయజలములందు కరిగిపోయెను. అంత మహామాయ పృధివిని ధృడ మొనర్చుటకు చింతించుచూ ఈ నీటిపై తేలకలుగు పదార్ధమేది అని ఆలోచించెను. ఘృతము నీటిపై తేలును, కానీ ఘృతము (నెయ్యి) పై జనులు నివసింప లేరు కదా! ఈ విధముగ శోచించుచు జగన్మాత విష్ణువు వద్ద కేగెను. ఆ సమయమున విష్ణువు దీర్ఘ సుషుప్తి యందుండెను. అంత జగత్ప్రసవినీ మహామాయ విష్ణువు యొక్క రెండు కర్ణముల యందు తన చిటికెన వ్రేలు పెట్టి కర్ణమలమును చూర్ణము కావించెను. అంత విష్ణువు యొక్క కుడి కర్ణమలము నుండి మధువు, ఎడమ కర్ణమలము నుండి కైటభుడు ఆవిర్భవించిరి. ప్రధమాసురుడు జన్మించిన దాదిగ అత్యంత మధుపానాసక్తుడై యుండుట చే ఆతడు "మధువు" అని పిలువబడెను. ద్వితీయాసురుడు జగన్మాత హస్తముపై కీటకము వలె భాసించెను. అందువలన ఆతడు "కైటభుడు" అని నామకరణము గావింపబడెను. అంత మహామాయ వారిరువురినీ విష్ణువుతో సమరమొనరించుటకు ప్రోత్సహించి "విష్ణువు మీరు మమ్ము సంహరింపుడని వేడుకొనునంత వరకు ఆయన మిమ్ము సంహరింపలేడని" వరమొసంగెను.

అంత ఆ అసురులిరువురూ విష్ణువు శరీరముపై భ్రమణము కావించుచూ, ఆయన నాభికమలము చేరి, అక్కడ

ఉపస్థితుడయిన బ్రహ్మదేవుని కాంచిరి. ఆ అసురద్వయము విరించిని చేరి "నిన్ను తక్షణమే వధించెదము. నీవు బ్రతికి బట్టకట్టవలెనన్న ఈ విష్ణువును మేల్కొలుపుము, అని ఆదేశించిరి. విరించి భయభీతుడై యోగమాయను శరణుజొచ్చి ఆమెను స్థుతించెను. అంత మహామాయ ప్రసన్నచిత్తయై, ప్రత్యక్షమై, "పితామహా! నన్ను స్థవమొనరించుటకు కారణమేమి? అని ప్రశ్నించెను. అంత బ్రహ్మ "అమ్మా! మధుకైటభులు నన్ను వధింపక మునుపే జగన్నాధుడు విష్ణుభగవానుని మేల్కొలిపి, ఈ అసుర ద్వయమును సమ్మోహితులను కావింప వలసినది." జగన్మాత "వల్లె" యని విష్ణువును మేల్కొలిపి, మధుకైటభులను మోహితుల గావించెను. అంత విష్ణు భగవానుడు ఘోర రూపులైన మధు, కైటభులను భయభీతుడై యున్న బ్రహ్మను గాంచి, సందర్భము గ్రహించి, యుద్ధోన్ముఖుడై, ఆ అసుర లిరువురితో చిరకాలము సమరమొనర్చెను, కానీ వారిని పరాజితుల కావింప నశక్యుడయ్యెను. ఆ సమయమున అనంతుడు సహితము తన ఫణములపై ఈ వీరత్రయమును భరింపనశక్యుడయ్యెను. అంత బ్రహ్మదేవుడు అర్ధయోజనము పొడవు, వెడల్పు గల ఒక శిలారూపమయిన శక్తిని నిర్మించెను. అంత శ్రీహరి ఆ శిలపై నిలబడి ఆ అసురద్వయముతో సమరము కొనసాగించెను. కానీ ఆ శిల సహితము సాగర జలములందు మునగ నారంభించెను. ఆ శిల మునిగినప్పటికీ శ్రీహరి జలములందు మగ్నుడై అసురులతో అయిదు వేల ఏండ్లు సమరము కొనసాగించెను. కానీ జగత్పతి అయిన నారాయణుడు వారిరువురిని ఓడింపజాలక మిగుల చింతాక్రాంతుడయ్యెను. చతుర్ముఖ బ్రహ్మ మిక్కిలి భయభీతుడయ్యెను.

అంత మహామాయ చే మోహితులై అసురద్వయము విష్ణువుతో ఇట్లనిరి "ఓ! మాధవా! నీ యుద్ధ నిపుణత చే మేము మిక్కిలి ముదము నొందితిమి. నీ మనోవాంఛితమయిన వరము కోరుకొనుము. అద్దానిని ప్రసాదించెదము. ఇది సత్యము." అంత గరుగధ్వజుడు "మీరిరువురు నాచే వధ్యులు కావలసినది," అని పలికెను. అంత అసురులు "మాకు నీ ద్వారా వధింపబడుటే శోభాయమానము. కానీ మమ్ము నీరు లేని ప్రదేశమున వధింపవలసినది." అలి బదులిచ్చిరి. అంత నారాయణుడు చతుర్ముఖుని, నన్ను (శంకరుని) పిలచి నీటి యందు మునిగిన శిలను పైకి లేవనెత్తవలసినదని, ఆ శిలపై అసురులను సంహరించెదననీ పలికెను. అంత బ్రహ్మ, శంకరులు ఆ శిలను పర్వత రూపులై లేవనెత్త సంకల్పించిరి. ఆ శిల యొక్క తూర్పు భాగమును నేను (శంకరుడు) పర్వత రూపుడనై లేవనెత్తి, రసాతలమునకు ఒరిగితిని. ఈశాన్య కోణమందు ఆదికూర్మము, వాయువ్యకోణమందు అనంతుడు, ఆగ్నేయ కోణమందు స్వయముగ విష్ణువు, నైఋతి కోణమందు జగద్ధాత్రి మహామాయ స్వయముగ పర్వతరూపిణియై ఆ బ్రహ్మశిలను ధరించిరి. తదుపరి విష్ణుభగవానుడు వరాహుని పృష్ఠముపై పాదములూన్చి, ఇరువురు అసురులను తన ఎడమ తొడపై చేర్చి, సుదర్శన చక్రముతో వారి మస్తకములు ఖండించెను. ఇందరు దేవతలు మోయుచున్ననూ బ్రహ్మశక్తి శిల జలములందు మునగ నారంభించెను. అంత జగత్పతి అయిన వాసుదేవుడు ప్రయత్నపూర్వకముగ ఆ శిలను మధుకైటభుల శరీరములపై యుంచెను. తదుపరి జలములందు కరిగిన పృధివినంతటినీ సేకరించి, అద్దానిని మధుకైటభుల మేధస్సు (మెదడు) తో లిప్త మొనర్చి పృధివిని దృఢము గావించెను. పృధివి మేధతో లిప్తమయిన కారణమున అప్పటి నుండియు దేవ, దానవ, మానవులు పృధివిని "మేదిని" అని పిలువసాగిరి.

అటు పిమ్మట ప్రాణి సృష్టి జరిగి దీర్ఘకాలము గడచినది. నేను (శంకరుడు) భార్యార్ధినై దక్షకన్య అయన సతీదేవి ని పాణిగ్రహణము చేసితిని. ఆ సమయముననే సతి తన తండ్రితో "నీవు ఎపుడేని శంభుని నిందించిన ఎడల నేను ప్రాణత్యాగము కావింతునని " తెలిపెను. ఈ విధముగ తండ్రిని ప్రతిజ్ఞా బంధితుని గావించి సతి నా ప్రియసతి అయినది. తదనంతరము దక్ష ప్రజాపతి యజ్ఞము కావించి సంసారము నందలి సర్వులను ఆహ్వానించి, కేవలము నన్ను, సతిని పిలుకుండెను. తత్ఫలితముగ సతి ప్రాణత్యాగము కావించినది. అంత నేను (శంకరుడు) మోహ పరవశుడనై, ఆ మృత శరీరమును శరీరము పై వైచికొని, సర్వలోకములు తిరుగుచూ చివరకు ఈ పీఠస్థలి (బ్రహ్మ శక్తి

శిల) వద్ద కేతెంచితిని. యోగమాయ ప్రభావము చే ఆ సతీ శరీరము యొక్క వివిధ భాగములు వివిధ ప్రదేశములందు పడినవి. ఎక్కడెక్కడ ఆ శరీర భాగములు పడినవో, ఆ ప్రదేశములన్నియు పరమ పవిత్రములైనవి. ఇది అంతయు యోగమాయా ప్రభావము. ఈ బ్రహ్మ శక్తి శిల పై సతి యొక్క యోనిమండలము పడి, యోగమాయ సహితము అందు లీనమయినది. పర్వత రూపమునున్న నాపై (శంకరుడు) యోని మండలము పడి, అద్దాని యందు యోగమాయ లీనమగుట చే ఆ పర్వతము నీలి వర్ణము దాల్చినది. మహామాయ ఈ పర్వతమందు ప్రగాఢ రూపముతో విలీనమయిన కారణమున పర్వతము పాతాళ తలమందు ప్రవేశింపగా, బ్రహ్మ దేవుడు ఆ పర్వతమును వేరొక పర్వతరూపమున దాల్చియే యున్నాడు. ఇపుడు ఆ రూపము తోనే నన్ను సహితము దాల్చెను. తత్ఫలిగముగ ఆతడు సహితము ఆధోమండలమునకు జారెను. అంత వరాహ రూపుడయిన మాధవుడు, శైలరూపమునున్న నన్ను ధరించుటకు ప్రయత్నించెను. కానీ ఆతడు సహితము ఆ భారము నోపజాలక పృధివి పైకి ఎగసి, పృధివి క్రిందకు జారకుండ గట్టిగా పట్టెను. ఈ పర్వతము లొక్కక్కటి వంద యోజనములు ఎత్తు యుండెడివి. కానీ మహాదేవి చే ఆక్రమింపబడి అవి కేవలము ఒక్కొక్క క్రోసు ఎత్తు మాత్రమే ప్రస్తుతము యున్నవి.

మహాదేవియే జగత్తు యొక్క మూల ప్రకృతి. అందువల్ల ఆ తల్లి త్రిమూర్తులను సహితము ధరించినది. ఈ పర్వతముల మధ్యన బ్రహ్మశిల ఇమిడియున్నది. దీనినే దేవతలు "శ్వేత పర్వతము" అని కూడా పిలుతురు. నా (శంకరుడు) స్వరూపముతో ఏర్పడిన పర్వతము నీలశైలము. ఇయ్యది (నీలశైలము) త్రికోణాకారముగ యుండును. బ్రహ్మ పర్వతము "రోలు" ఆకారమున యుండును. నీలశైలము, బ్రహ్మ, వరాహ పర్వతముల మధ్యన యుండి శోభించుచున్నది. వరాహ శైలము చిత్ర, విచిత్ర రంగులతో ప్రకాశించుచూ "చిత్ర పర్వతము" అని ప్రసిద్ధి నొందినది. ఇయ్యది అన్ని పర్వతములకు వెనుక మరియు క్రిందికి యుండును. వాస్తవమునకు ఇయ్యది అన్ని పర్వతముల కంటె దీర్ఘము. ఈశాన్య కోణమందు మహాశక్తివంతమయిన ఆదికూర్మము పర్వతరూపేణ యున్నది. ఇయ్యది "మణికర్ణము" అని పిలువబడి దేవతల చే సేవింపబడుచుండును. వాయువ్య కోణమందు అనంతుడు, శేషుడు పర్వతరూపుడై యుండును. ఇయ్యది "మణి పర్వతము" అని పిలువబడి, మాధవునకు కడు ప్రియమయినది. నైఋతి యందు సాక్షాత్ మహామాయ పర్వత రూపమున ఉపస్థితమై "గంధమాదనము" అని పిలువబడుచున్నది. ఇది శంకరునికి కడు ప్రియము. వారాహ పృష్ఠము యొక్క పై భాగముననే శ్రీహరి మహాసుర ద్వయమును సంహరించెను. ఆ ప్రదేశమున "పాండుశిల" ఉత్పన్నమై, శ్రీహరి అచట "పాండునాధుడు" అను పేర స్మరింపబడును. బ్రహ్మశిల మధ్య నుండి తూర్పు వైపునకు నేను (శంకరుడు) పర్వత రూపమున స్థితిగతుడనైతిని. అయ్యది భస్మాచలము అని ప్రసిద్ధి నొందినది. నీల పర్వతాగ్రమున "కుబ్జాపీఠమను" పరమ పవిత్ర నిర్జన ప్రదేశమున మహామాయ నాతో (శంకరుడు) నివసించుచుండును. సతీదేవి యొక్క శిధిలమైన యోని మండలము ఇక్కడనే పడినది. తదుపరి ఆ యోని మండలము శిలారూపము నొంది ఆ మండలము నందే కామాఖ్యాదేవి స్థిరపడినది.

ఏ మానవుడు ఈ శిలను స్పర్శించునో, ఆ జీవి పరిణామ క్రమమున అమరత్వము నొంది, తుదకు బ్రహ్మలోకమునకేగి, తుదకు మోక్షలాభము నొందును. ఈ శిల యందు కామేశ్వరీదేవి సహితము ఉపస్థితమై యున్నది. ఈ మండలము యొక్క మహిమ మహాద్భుతము. ఈ మండలమందు యుంచబడు లోహము సహితము భస్మీపటలమగును. ఈ కామేశ్వరీ దేవి నా (శంకరుడు) ప్రసన్నత కొరకు మరియు లోకులను మోహ పరచుటకు పంచమూర్తి రూపములందు విరాజమానమై యున్నది. నేను (శంకరుడు) సహితము నా పంచ ముఖములచే ఈ అయిదు స్థానములందు ఉపస్థితుడనై యుందును. నేను తూర్పున "ఈశాన" రూపముతో వ్యక్తమవ్వగా, అచటనే దేవి కామేశ్వరీ రూపముతో ఉపస్థిత మయినది. దేవి యొక్క పంచమూర్తులలో కామేశ్వరీ రూపము ప్రధానము. ఈశాన కోణమందు "తత్పురుష" మూర్తిగానూ, అచటకు

దగ్గరనే "అఘోర" మూర్తిగనూ, వాయువ్య కోణమందు "సద్యోజాత" మరియు "వామదేవ" మూర్తులు గనూ అవతరించియున్నాను. దేవి సహితము ఈ మూర్తులకు అనుగుణముగ అయిదు రూపములు ధరించినది. అవి 'కామాఖ్యా, త్రిపుర, కామేశ్వరి, శివా, మరియు శారద." ఈ పంచమూర్తులు దేవతా గణములకు సహితము గుప్తమూర్తులు. ఈ దేవతామూర్తులందరూ మహోత్సాహులు మరియు గుణరూపాలంకృతులు. ఈ శిలారూపమయి యోని మండలమందు నేను (శంకరుడు) లింగరూపియై యున్నాను. అంతేకాక సమస్త దేవతానీకము శైలరూపులై పరతత్వము సంతరించుకొని ఈ నిర్జన ప్రదేశమందు కామాఖ్యాదేవిని ఉపాసించుచుందురు. ఈ దేవతానీకము, త్రిమూర్తులు, దిక్పాలురు, సర్వులు మాకు (పార్వతీ పరమేశ్వరులకు) అనుకూలురై కార్య నిర్వహణ కావించుచుందురు. మేము బాహ్యముగ పర్వత రూపులమైనప్పటికీ, గుప్తముగ మా రూపములతో రమించు చుందుము. అట్లే సర్వ దేవతానీకము కావింతురు.

నీలాచలము త్రికోణాకారముగ యుండి మధ్యలో గుంటపడి యుండును. నీలాచలము సాక్షాత్ శివ స్వరూపమే! ఈ మధ్యన గల నిమ్న ప్రదేశమున ముప్పది శక్తులతో కూడిన సుందర మండలముయున్నది. ఇచటనే మన్మధుని చే నిర్మింపబడిన "కామ గుహ" యున్నది. ఈ గుహ లోపల యున్న శిలపై మనోహర యోని మండలము ఉపస్థితమై యున్నది. ఇయ్యది ఇరువది ఒక్క అంగుళముల పొడవు, పన్నెండు అంగుళముల వెడల్పు యుండును. ఈ మండలము సూక్ష్మ రూపమున నెమ్మదిగ సన్నబడి, మెలితిరిగి భస్మశైలము వరకు వ్యాపించును. ఈ మండలము కుంకుమ లేక సింధూర వర్ణమున యుండి, భక్తుల సర్వ కామనలను పూర్ణము కావించును. ఈ యోని మండలమందు జగత్తును పాలించు జగన్మాత తన పంచరూపములైన "మూలభూత, సనాతని, జగద్ధాత్రి, మహామాయ, కామాఖ్యా" రూపములతో నిత్యము రమించుచుండును. ఇచట దేవిని పరివేష్ఠించి పూర్వమే తెలుపబడిన శైలపుత్రి మొదలగు మూల భూతములు, అష్ఠయోగినులు, నలు ప్రక్కలా ఉపస్థితలై యుందురు. ఇచట గల అష్ఠ యోగినులు అష్ఠ పీఠములయందు పీఠ దేవతలుగ యుండి, ఈ పీఠములన్నియు తీర్ధరూపేణ (జలరూపేణ) ప్రసిద్ధములై యున్నవి. వీరి నామములు "గుప్తకామ, శ్రీకామ, వింధ్యవాసిని, కోటేశ్వరి, వనస్థా, పాదదుర్గా, దీర్ఘేశ్వరీ, మరియు భువనేశ్వరి." ఇచట పరమ పుణ్యాదాయకము, మరియు కనిష్ఠము అయిన "సౌభాగ్య సరస్సు" అను చిన్న సరోవరము కలదు. అద్దాని తీరమున విష్ణుభగవానుడు "కమలుడు" అను నామమున స్థితిగతుడై యుండును. "కాముకుడు" అను వటువు స్వర్ణకామాఖ్యాదేవి నికటముననే యుండును. ఇచట లక్ష్మీ సరస్వతులు సహితము కామాఖ్యాదేవి వద్ద కొలువుందురు. ఇచట లక్ష్మీదేవి "లలిత" అను నామమున, సరస్వతి "మాతంగి" అను నామమున ఉపస్థితులై యుందురు. ఈ మహాశైలపు తూర్పు ద్వారము వద్ద దేవికి ప్రియ పుత్రుడయిన గణపతి "సిద్ధుడు" అను నామమున ప్రసిద్ధినొంది ఉపస్థితుడై యుండును.

దేవికి సంతోష మొనరించు కల్పవృక్షము ఇచట "చింత చెట్టు" రూపమున, కల్పవల్లి "అపరాజిత" రూపమున మార్పు చెంది దర్శనమిచ్చుచున్నవి. తొలుత విష్ణుమూర్తి మధుకైటభులను సంహరించిన ప్రదేశమందు వరాహమూర్తి "పాండునాధుని"గ తెలియబడును. ఇచటకు దగ్గరనే బ్రహ్మదేవుడు నిర్మించిన బ్రహ్మ కుండము (బ్రహ్మ సరోవరము) యున్నది. దీనికి దగ్గరనే సిద్ధకుండము యున్నది. ఈ సరోరవ మధ్యమున పరమశివుని "ఈశానుడు" అని ముఖము శిలారూపముగ యుండి "సిద్ధేశ్వరునిగ" ప్రసిద్ధి నొందినది. దీనికి సమీపముననే "గయ" మరియు "వారణాసీ" క్షేత్రములు యోని మండలము మరియు కుండ (సరోవర) రూపములు ధరించి స్థితిగతమయినవి. దీనికి దగ్గరనే సుధారసపూర్ణమయిన "అమృతకుండము" యున్నది. దీనిని నా (శంకరుడు) ప్రసన్నత కొరకై ఇంద్రుడు సమస్త దేవతా గణములతో కలసి నిర్మించెను. శివుని మరొక ముఖము (శిరస్సు) అయిన వామదేవము "శ్రీకామేశ్వర" నామమున ప్రసిద్ధినొందినది. దీనికి దగ్గరనే "కామకుండము" అను పవిత్ర సరోవరమున్నది. సిద్ధకుండము మరియు కామ కుండముల మధ్య "కేదారము" అను పవిత్ర క్షేత్రమున్నది. ఇయ్యది "ఛాయాఛిత్ర" మను పేర ప్రసిద్ధమై పదునాల్గు వ్యోమములు (వ్యోమము అనగా ఒక

మానవుని రెండు బాహువులు పూర్తిగా రెండు వైపులా చాచగా మధ్యనున్న దూరము) వెడల్పు యుండును. దీనికి సమీపమున "గుప్తకుండము" యున్నది. ఈ కుండ మధ్యమున కామేశ్వర శిలపై "గుప్తకామ" యను శైలపుత్రి సంస్థితమై యున్నది. ఈ కామేశ్వరి శిల తూర్పు భాగమున వీరిరువురు (కామేశ్వర, గుప్తకామ) సర్వదా కలిసియుండి, పశ్చిమభాగమున యోని మండలము ఉపస్థితమై యున్నది. కామేశ్వర, కామాఖ్యల మధ్య భాగమునున్న పీఠముపై కాళరాత్రి "దీర్ఘేశ్వరి" అను పేర సంస్థితయై, ఈ పీఠ చివరి భాగమున "ప్రచండిక" నివసించు చుండును.

ఈ కామాఖ్యా శిల ప్రాంతము నందే "కూష్మాండ" అను యోగిని "కోటీశ్వరి" అను నామమున యోని రూపమున యున్నది. నా (శంకరుడు) "అఘోరము" అను ముఖము కామాఖ్యాదేవి యొక్క దక్షిణపీఠము నందు స్థితిగతమయినది. పరమ పదము కోరు భక్తులు ఈ మూర్తిని "భైరవుడు" అని పిలచెదరు. భైరవునికి సమీపముననే "భైరవి" అను నామము గల చాముండీ దేవి కలదు. ఈ చాముండి చండముండాసురులను పరిమార్చినది. ఈ దేవి భక్తుల కామనలను పూర్ణమొనర్చును. ఈ కామ, భైరవుల మధ్య జగత్ హితార్థము మరియు కామాఖ్యాదేవి ప్రసన్నార్థము స్వయముగ దేవనది గంగ ప్రవహించుచున్నది. నా (శంకరుడు) "సద్యోజాత" మను పేరుగల ముఖము (శిరము) భైరవమను గుహయందు ఆమ్రాతకేశ్వర పీఠమందు స్థితిగతమయినది. ఇయ్యది దేవర్షి గణసేవితము. ఇచట కల్పవృక్షము, కల్పవల్లి రెండును ఆమ్రాతక వృక్షము (నీరుసు చెట్టు, WILD MANGO) రూపమున యుండును. దీని ప్రత్యేకత ఏమనగా, ఈ వృక్షము ఆకులు ఎన్నడూ జీర్ణమవక, పచ్చగా చిగురించుచునే యుండును. ఈ ఆమ్రాతకేశ్వర పీఠము వద్ద జగత్పావని గంగ స్వయముగ ఉద్భవించినది. ఇచట అద్దాని నామము "సిద్ధగంగ". పుష్కరమను క్షేత్రము ఈ పీఠము వద్దనే యుండి, అదియును 'ఆమ్రాతక" మనే ప్రసిద్ధి నొందినది. ఈ పుష్కర క్షేత్ర ఈశాన్య భాగమందు "భువనానందము" అను గుహ కలదు. అందు నా (శంకరుడు) "తత్పురుష" నామ శిరము "భువనేశ్వరుడు" అన్న నామమున ప్రసిద్ధి నొందినది. దీనికి సమీపముననే సురభి కామధేనువను పేర శిలా రూపమున ఉపస్థితమై భక్తుల కామనలను ఈడేర్చును. ఈ నీలాచల పర్వత మధ్య భాగమున "కోటిలింగము" అను స్థానము కలదు. అచట ఒక భయంకర శరభమూర్తి కలదు. అయ్యది "మహా భైరవము" అని పిలువబడును. నేను (శంకరుడు) ఈ కోటిలింగ స్థానమందు, అయిదు భాగములందు అయిదు రూపములతో యుండి, ఎల్లప్పుడూ ప్రసన్నుడనై యుందును.

బ్రహ్మ పర్వతపు ఊర్ధ్వమున, నీలాచల, బ్రహ్మ పర్వతపు కలయిక వద్ద "మహాగౌరి" యను సిద్ధరూపిణి అయిన యోగిని శిలారూపమున సంస్థిత మయినది. ఈ తల్లి మహా సౌందర్యరాశి మరియు "భువనేశ్వరి" అను పేర ప్రసిద్ధమైనది. ఇచటనే ప్రసిద్ధ కల్పవల్లి "అపరాజిత" అను నామమున దర్శనమిచ్చును. ఈ స్థలము కామధేనువునకు దగ్గరగ యుండి, అద్దాని తూర్పున కామాఖ్య "మహేశ్వరీ" రూపమున విలసిల్లుచున్నది. దీనికి ఆగ్నేయ కోణమందు సర్వకామనలను ఈడేర్చు కామాఖ్యా రూపమయిన "చండిక" అను యోగిని కలదు. ఈ పీఠమందు మరి ఇద్దరు యోగినులు కలరు. వారు "చంద్రఘంట" మరియు "స్కంధమాత". చంద్రఘంట అను యోగిని పీఠమందు "వింధ్యావాసిని" అని పిలువబడును. స్కంధమాత అను యోగిని "వనవాసిని" అను పేర ప్రసిద్ధి నొందినది. ఇక పవిత్ర నీలాచల నైఋతి కోణమందు కాత్యాయినీ దేవి "పాదదుర్గ" గా పూజలందుకొనును. నా (శంకరుడు) అన్యమూర్తి అయిన నంది పీఠము యొక్క పశ్చిమద్వారమందు పాషాణరూపియై "హనుమాన్" రూపమున పూజలందుకొనును. నీలాచల పర్వతము మరియు కామాఖ్యా పీఠములందలి పరమ పవిత్ర ప్రదేశములను గూర్చి ఘంటాపథముగ తెలుపుచున్న శంకరుని ఆపి ఉత్సుక చిత్తులై, భేతాళ, భైరవు లిట్లనిరి "తండ్రీ! పీఠ వర్ణనము, పూజావర్ణనము వింటిమి. ఇపుడు దేవి యొక్క పంచమూర్తుల సమగ్రరూపము, మంత్ర, యంత్ర, తంత్రముల గూర్చి తెలుపవలసినది." అంత శంకరుడు "భేతాళ భైరవులారా! తప్పక తెల్పెదను.

**కామస్థం కామమధ్యస్థం కామదేవ పుటీకృతమ్**
**కామేన కామఏత్ కామ కామం కామే నియోజయేత్ ॥**

మంత్రార్ధము – సాధకులు తమ కామనలను సఫలీకృత మొనర్చుకొనుటకై కామరూప క్షేత్ర మధ్యమున స్థితిగతులై యున్న కామాఖ్యా కామేశ్వరులకు విన్నవించుకొందురు. ఉత్తర షట్క్రమమునందు, మరియు నిత్య షోడశికార్ణవ గ్రంధములందు ఈ శ్లోకము కొంచెము శబ్ద భేదము తో యున్నది. ఈ శ్లోకము యొక్క బీజమంత్రమును సంపుటము చేసిన ఎడల "హ్రీం క్లీం ఐం బ్లూం స్త్రీం" అగును. సాధకుడు ఈ బీజమంత్రమును కామాఖ్యా సాధనయందలి తనను స్వయముగ కామరాజ యంత్రమని తలచి జపించి పూజింపవలెను. కామాఖ్యాదేవి పంచమూర్తుల వలె ఈ శ్లోకము నందలి కాముని పంచరూపములయిన "కాముడు, మన్మధుడు, కందర్పుడు, మకర ధ్వజుడు, మోహనుడు" అను పంచ బీజాక్షరములచే నిర్దేశింపబడినది.

బ్రహ్మ వ్యంజనమయిన "ఓం" సర్వ శ్రేష్ఠము. దీనినే శాంతము అని తెలియనగును. ఈ అమృతమయ వర్ణమును సర్వ మంత్రములకు ముందు సమ్మిళితము కావింపవలెను. ప్రజాపతి బీజమంత్రమయిన "క", ఇంద్రబీజమంత్రమయిన "ఌ" పరస్పరము సంయుక్తమై చంద్రఘంట "ం" తో కూడి పరమ పవిత్రమయిన కామాఖ్యా బీజమంత్రము "క్లూం లేక క్ల్యాం" అగును. ఈ మంత్రము ధర్మార్ధ కామమోక్షదాయకము, అన్యత్ర దుర్లభము, అత్యంత రహస్యము! అత్యంత రహస్యము!! అత్యంత రహస్యము!!!

ప్రయత్న పూర్వకముగ ఏ మానవుడు ఈ మంత్రమును గురుముఖతా వినునో, అతడు సర్వ కామనలను ప్రాప్తినొంది శివలోకము నొందును. ఈ మంత్రరాజము సమస్త శృతుల సారము. దేవతల కంఠములందున్న అద్వితీయహారము. ఇయ్యది సమస్త దోష పరిహారము కావించును. ఇయ్యది విష్ణుదేవుని సహితము ప్రసన్నము కావించు సుందర రీతి. సాధకునికి యశస్సు ను ప్రసాదించునది, విఘ్నహంత్రి అయిన కామాఖ్యాదేవిని సూచించునది మరియు చూపించునది, మరియు పరమశివుని యొక్క సర్వస్వము. ఇయ్యది ధ్యాన యోగులకు దండపాణియై యమభయమును నివారించును. అత్యంత శ్రేయస్కరియై, సర్వలోకవ్యాప్తమై, పరమపదమును ప్రసాదించును. దుర్భాగ్యమును జీర్ణము కావించి శివప్రదము (సుఖప్రదము) కావించును. ఈ మంత్రము ఎవరి చెవుల యందు పడునో వారి దు:ఖములు దూరమగును. ఇయ్యది ధర్మ, నీతి మార్గమునకు ఏకమాత్ర ధామము. ఈ మంత్రశక్తిని దేవతలు సహితము తెలుపలేరు. సర్వులకు ఈ మంత్రము మననీయము.

కామాఖ్యా రూపము: ఈ దేవి తన చెవుల యందు సూర్య చంద్రులను కుండలములు వలె దాల్చినది. కుంకుమ యొక్క ఎరుపు, పసుపు వర్ణముల కలయిక చే కూడిన వర్ణము కలది. స్వర్ణమణియుక్త విచిత్ర భూషణములు చెవులనుండి వ్రేలాడుచున్నవి. లలాటము నందు త్రినేత్రములు కలిగి, వరదాభయ హస్తములు నిరంతర దాన నిరతి యందు లగ్నమయియుండును. అక్షమాల ధరించి తనను కొలుచుచున్న దేవతా మానవులను పరిపాలించుచున్న ఈశ్వరి – "సిద్ధ కామేశ్వరీదేవి". నవయవ్వన శోభిత, పద్మాసనస్థ, ముక్తకేశి, శోభించుచున్న హారధారిణి, పీనోన్నత స్థనద్వయశోభిత, మరియు శవము యొక్క వక్షస్థలముపై అధిష్ఠించినది. ఆ తల్లి ముఖము బాలసూర్యతేజము తో ఉజ్వలమయినది. ఈ తల్లి "స్వర్ణ కామేశ్వరి." ఈ కామేశ్వరీ దేవి సంపద, శక్తి, ప్రభావము, వైభవమును ప్రసాదించును. ఈ తల్లి సుందరకేశములు, లలితమయిన నఖాగ్రములు, ప్రకాశించుచున్న దంతపంక్తి, శిరమందు చంద్రరేఖ కలిగి కామేశ్వర శిల యందు ఆశీనయై, యోని ముద్రాంకితయై చిరునవ్వులు చిందించుచూ పవన సమాన వేగముతో ప్రవర్తిల్లగల దివ్య జనని. అగ్ని మరియు విద్యుత్ వలె ప్రకాశించు ఈ దేవిని ప్రార్ధించు సాధకులు ధర్మార్ధాది పురుషార్ధములను తప్పక పొందెదరు.

**(శ్రీ కాళికా పురాణమందలి కామాఖ్యా మహాత్మ్యమనెడు అరువది రెండవ అధ్యాయము సమాప్తము)**

# అరువది మూడవ అధ్యాయము

**(త్రిపురా పూజా విధి)**

మహేశ్వరుడు చెప్ప దొడంగెను "పూర్వము వైష్ణవీ తంత్ర మందు నేను తెలిపిన నిర్మాణవిధిని అనుసరించి శిలపై ఆ మండలమును పుష్ప చందనములతో నిర్మించి పత్రాదికములను అర్పింపవలెను. ఆసనాదులకు పూర్వము వలెనే పూజ కావింపవలెను. తదుపరి తెల్ల ఆవాలు, పుష్ప చందనాదుల చే గణముల సహిత సూర్య భగవానునికి అర్ఘ్య ప్రదానము కావింప వలెను. దేవతలకు మండల మధ్యమున పూజనమొనర్పవలెను. ఇపుడు వైష్ణవీ ధ్యానమునకు బదులు కామాఖ్యా ధ్యానము ఒనర్పవలెను. మిగిలిన పూజా విధులన్నియు వైష్ణవీ తంత్ర మందు తెలిపిన విధముగనే కావింపవలెను. పీఠ పూజానంతరము అరువది నాలుగు యోగినుల పూజ విడివిడిగా కావింప వలెను. అభీష్ఠ సిద్ధకై మనోభవ, ఆమె సఖులైన మహోత్సాహ, నవగ్రహముల పూజ వారి రూపములు తలచుకొని చేయవలెను. తొలుత మండలము యొక్క తూర్పు ద్వారమున గణేశుని, పశ్చిమ ద్వారమున నంది, లేక హనుమంతుని, ఉత్తర ద్వారమున భృంగి, దక్షిణ ద్వారమున మహాకాలుని పూజింపవలెను. కామముద్ర తో అమృతీకరణము కావించి, మూడు చిటికెలతో భూతోపసారణము, "హూం హూం ఫట్" అను మంత్రముతో ఎడమ చేతితో కుడి చేతిని తప్పట్లు కొట్టి భూత గణములను పారద్రోలి, దిగ్బంధనము కావించి, ఉత్తర తంత్రములో తెలిపిన విధి విధానములతో మిగిలిన కార్యములాచరించి ప్రాణాయామము చేయవలెను.

సాధకుడు మూల మంత్రము పఠించుచూ మధువు, పాలు, నేయి, పెరుగు, గోమూత్రము, ఆవుపేడ, రత్న ప్రక్షాళిత జలము, చక్కెర, బెల్లము, కుశలతో మిశ్రితమయిన జలము, మొదలగు వానితో దేవికి స్నానమొనర్పవలెను. సాధకుడు యోని మండలము వద్ద శిలపై తెల్ల ఆవాలు, మినుములు, తిలలు, పాలు, యవలు, ఎర్రచందనము, పుష్పములు, దూర్వాంకురములు, గోరోచనము – ఈ తొమ్మిది పదార్థములతో అర్ఘ్య ప్రదానము కావింపవలెను. తదుపరి ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనము, మధుపర్కము, స్నానీయజలము, వస్త్రము, చందనము, భూషణములు, పుష్ప, ధూప, దీప, నేత్రాంజన, నైవేద్య, ప్రదక్షిణ, నమస్కారము, మొదలగు షోడశోపచారములు చేసి, మహాదేవిని కామ గాయత్రితో ఆవాహన చేయవలెను. ఆవాహన మంత్రార్థము: ఓ! కామాఖ్యా దేవీ! నీవు యథోచిత రూపముతో ఇచట కేతెంచి, పూజాకర్మమందు నీ సాన్నిధ్యమును ప్రసాదింపుము.

**కామగాయత్రి: కామాఖ్యాయై, విద్మహే కామేశ్వర్యైతు ధీమహి**
**తత:కుర్యాన్ మహాదేవీ తతశ్చాను ప్రచోదయాత్! కామేశ్వర్యై ప్రచోదయాత్॥**
**మంత్రార్థము : నేను కామాఖ్యాదేవిని ఎరుగుదును. కామేశ్వరీ దేవిని**
**ధ్యానించుచున్నాను. అందువలన మహాదేవి నాకు సిద్ధిని ప్రసాదించు గాక!**

తదుపరి శుభదాయిని అయిన భగవతికి పూజనమొనర్చి, ఆదేవి ప్రసన్నతకై బలిదానము సలిపి, రుద్రాక్షమాలతో జపమాచరించి, త్రయక్షరీ మూల మంత్రముతో మూడు మార్లు ఆవృతమొనర్చి, పూజన సలుపవలెను. ఆహ్వానానంతరము అంగన్యాస, కరన్యాసములు కావించి, తదుపరి దేవతామూర్తి యొక్క వరదాభయ ముద్రలను, అక్షమాల, పాశములను, మస్తకమందలి సూర్య చంద్రులను, చంద్రకళను, ఎర్రని కమలమును, ప్రేతము, లౌహిత్య బ్రహ్మపుత్రను, మనోభావ శిలను, అక్కడే శవ (శ్వేత ప్రేతము) మధ్యమున విరాజమానమైన శక్తిదేవిని, ప్రక్కనే యున్న కరవాలమును భక్తి పూర్వకముగ

పూజింపవలెను. సాధకుడు పీఠ దేవతలను, శుభదాత్రి అయిన కామేశ్వరీ దేవిని, ప్రత్యధిదేవతలైన త్రిపుర, శారద, మహోత్సాహలను పూజింపవలెను. మహాదేవి చండీశ్వరి, కామేశ్వరి యొక్క నిర్మాల్యధారిణి. విసర్జన కాలమందు యోని ముద్ర ఉపయోగింపవలెను. సింధూరము, చందన, కుంకుమాగరులు నా (శివుడు) ద్వారా దేవీ పూజకు విశేష ద్రవ్యములని చెప్పబడినవి. పైన తెలిపిన విశేష ద్రవ్యముల చే వైష్ణవీ తంత్రముపయోగించి, కామాఖ్యా పూజన కావింపవలెను. ఈ విధముగ మనోభావ గుహయందు కామాఖ్యా పూజను ఎవరు కావింతురో వారు పరమగతిని ప్రాప్తించెదరు.

సాధకుడు తన సమస్త కామనల సిద్ధికై బ్రాహ్మణీ, చండికా, రౌద్రీ, గౌరీ, ఇంద్రాణి, కౌమారి, వైష్ణవీ, దుర్గా, నారశింహీ, కాళికా, చాముండీ, శివదూతీ, వారాహీ, కౌశికీ, మహేశ్వరీ, జయంతీ, సర్వమంగళా, కాళీ, కపాలినీ, మేధా, శివా, శాకంబరీ, భీమా, శాంతా, భ్రామరీ, రుద్రాణి, అంబికా, క్షమా, ధాత్రీ, స్వాహా, స్వధా, అపర్ణా, మహోదరీ, ఘోరరూపా, మహాకాళీ, భద్రకాళీ, భయంకరీ, క్షేమకరీ, ఉగ్రచండా, చండోగ్రా, చండనాయికా, చండా, చండావతీ, చండీ, మహామోహా, ప్రియంకరీ, బలవికరిణీ, దేవీ, బలప్రమదినీ, మనోన్మథినీ, సర్వ భూతస్య దమనీ, ఉమా, తారా, మహానిద్రా, విజయ, జయ మరియు తొలుత తెలిపిన శైలపుత్రీ ఆదిగా ఎనిమిది యోగినులు కలిపి అరువది నాలుగు యోగినులకు మండలమందు పూజన మొనర్పవలెను. తదుపరి అనేక ప్రకారములైన నైవేద్యములు, పానీయములు, పాయసము, మోదకములు, అపూపములు, చూర్ణములు దేవికి అర్పింప వలెను. ఏ సాధకుడు ఈ విధముగ కామాఖ్యా దేవిని కొలుచునో, వాని కామనలన్నియు పూర్ణముగ సఫలీకృతమగును.

**"మహోత్సాహ" పూజావిధి:** ఈ దేవికి సహితము మహామాయా దేవికి వలెనే అదే మండలము, అంగన్యాస, కరన్యాసములు, నైవేద్యములు సమర్పించి యోని మండలమందు పూజనమొనర్పవలెను. ఎందుకనగా మహామాయయే మహోత్సాహ.

**త్రిపురా పూజావిధి:** ఇపుడు త్రిపురా రూపమున కామఖ్యా దేవి యొక్క పూజా విధానము వినవలసినది. ఈ దేవి యొక్క మూలమంత్రము ఉత్తర తంత్ర మందు తెలుపబడినది. వాగ్భవ బీజం. "ఐం", కామరాజ బీజము "క్లీం", డామరు బీజము "ఏం". ఈ మూడు కలిపిన ధర్మార్థకామ సాధక మంత్రము "ఐంక్లీంఏం" అగును. ఈ మూడు బీజాక్షరములను ఉచ్చరించి మహేశ్వరి అయిన దుర్గను ధ్యానమొనర్పవలెను. సాధకుడు కామాఖ్యకు వలెనే త్రిపురా దేవికి స్నానమొనర్చి, ఈ దేవికి మూడు రేఖలతో త్రికోణ మండలము ఏర్పరచవలెను. ఈ మంత్రము "ఐంక్లీంఏం" నందలి మూడు అక్షరముల త్రిపురాదేవి రూపములే! కుండలనీ శక్తియే మూడు విధములుగ సృష్టి, స్థితి, లయలకు బ్రహ్మ, విష్ణు, రుద్రులుగ రూపాంతరము చెందినది. అందువలన ఈ దేవీ పూజ యందు కూడా అన్నియు మూడు, మూడుగా వర్తించును.



అందువలన ఈ దేవి "త్రిపుర" గా పేర్కొనబడినది. త్రిపురా దేవి యొక్క మండలము ఈ విధముగ కావింపవలెను. ఈశాన్యము నుండి నైఋతికి, నైఋతి నుండి వాయువ్యమునకు, వాయువ్యము నుండి ఈశాన్యమునకు గీతలు గీచి ఒక త్రికోణమును మండలాంతర్గతముగ కావింపవలెను. ఈశాన్యము నుండి నైఋతికి వెడలు రేఖ "శక్తి" అనుబడును. నైఋతి నుండి వాయువ్యమునకు, వాయువ్యము నుండి ఈశాన్యమునకు పోవు రేఖలు "శంభు" అనబడును. ఈ రేఖలు ఒక్కొక్క వైపు మూడు మూడుగా యుండవలెను. ఈ త్రికోణము చుట్టూ అష్టదళ కమలము యుండవలెను. ఇపుడు త్రిపురా మహాశక్తిని ధ్యానించుచూ మూడు బీజాక్షరములను కలిపి పూజించుచూ, మూడు రేఖలు కలిగిన శంభు, శక్తి రేఖలను తేరిపార గమనించవలెను. స్థానము యొక్క అభ్యుక్షణ, మార్జన, మంత్ర లేఖన, అస్త్ర, మంత్ర ప్రయోగము, భూతోపసారణము మొదలగు ప్రక్రియలన్నియు తొలుత వైష్ణవీ తంత్రమందు తెలిపిన రీతిలో కావింపవలెను. ఈ త్రిపురాదేవి యొక్క విశేషపూజ ఇపుడు తెలిపెదను. ఈ త్రికోణమందు త్రిమూర్తులు ముువ్వురు స్థితిగతులై యుందురు. త్రికోణము యొక్క ఈశాన్యకోణమందు శివుడు, నైఋతి కోణమందు విష్ణువు, వాయువ్యమందు బ్రహ్మ దేవుడు యందురు. పద్మ దళములందు మొదటి పురము, కేసరములందు ద్వితీయ పురము, త్రికోణమే మూడవ పురముగ తెలియవలెను. త్రికోణమండలమే త్రిపుర!!! సాధకుడు పద్మ దళములందు, కేసరములందు త్రికోణము నందు విడివిడిగా, స్పష్టముగ మూడు రేఖలు లిఖింపవలెను.




ఈ మండలమునకు ఉత్తర భాగమునున్న ద్వారము ధనుషాకార మందునూ, తూర్పున యున్న ద్వారము షట్కోణాకారముగానూ, దక్షిణమున చతుష్కోణముగనూ, పశ్చిమమున తోరణాకారముగనూ యుండవలెను. ఈశాన్య కోణమందు కామదేవుడు, ఆగ్నేయమున ఆయన ధనస్సు, నైఋతి కోణమున పుస్తకము, వాయువ్య కోణమున అక్షమాల యుండవలెను. పిదప "వాగ్వేశ్మనే నమ:" అను మంత్రముతో మండల పూజన మొనర్చి, మూడు మార్లు కాళికా మంత్రము ("క్రీం క్రీం క్రీం") లేక మూల మంత్రము ("ఐం క్లీం ఏం") లేక తొలుత తెలుపబడిన మంత్రములతో పూజ కావించి, తొమ్మిది చిటికెల తో మూడు సార్లు దిగ్బంధనము చేయవలెను. తదుపరి సాధకుడు అభ్యుక్షణము, భూతోపసారణము కావించి అర్ఘ్య హేతువుకై తొమ్మిది రకముల పాత్రలను స్థాపింపవలెను. పిదప సాధకుడు ధేనుముద్రతో దహన, ప్లవన క్రియలాచరించి, అమృతీకరణము కావించి, యోని ముద్ర తో పాత్ర యందలి నీటిని మూడు మార్లు స్పర్శింప వలెను. పిదప గణములు సహిత మార్తాండ భైరవునికి పచ్చ ఆవాలు, ఎర్ర చందనము, పుష్పములతో కూడిన ఆర్ఘ్యము నివేదింప వలెను. క్రమముగ పూజ యొక్క మొదట, మధ్యన, అంతమున పాణికచ్ఛప (కూర్మ) ముద్ర, యోనిముద్ర ద్వారా మూడు మార్లు ధ్యానమొనర్ప వలెను. పాత్ర స్థాపనకు అస్త్ర మంత్రము చే షట్కోణ మండలము నిర్మించి పిదప "ఏం ఆం క్లీం" మంత్రముచ్చరించుచూ ఆ పాత్ర యందు జలము, గంధ పుష్పాక్షతలు, దూర్వాంకురములు యుంచవలెను.

పిదప బొటన వ్రేలి తో మొదలుపట్టి "ఓం హ్రాం హ్రీం, హ్రై, హ్రౌ, మొదలగు మంత్రములతో హ్ర: వరకు హస్తము యొక్క వెనుక భాగమందు, వేళ్ళయందు న్యాసమొనర్పవలెను. మూడు మూడు అంగుళుల స్పర్శచే హృదయాది అంగన్యాసమును, రెండు రెండు అంగుళులతో అంగుష్ఠాది కరన్యాసము, ప్రాణాయామము సలిపి, దహన ప్లవన క్రియలు కావించి, ఆద్యా దేవి యొక్క చింతన మూడు మార్లు హృదయమందు కావింపవలెను.

**త్రిపురా రూపము:** ఈ దేవి చతుర్భుజ, త్రినేత్రయై, సింధూరపు మేనిచ్ఛాయ కలిగి యుండును. కుడివైపు పై చేయి యందు పంచబాణములు, క్రింది చేయియందు అక్షమాల, ఎడమవైపు పై చేయి యందు పుష్పధనువు, క్రింది హస్తమందు పుస్తకము యుండును. ఈ దేవి పంచ ప్రేతాసీన. శిరముపై అర్ధచంద్ర యుత జటాజూటము, త్రిభంగి అయిన కారణమున సుందర కటి ప్రదేశము, సర్వాంగ సుందరియై, సర్వభూషణభూషిత, సర్వ శుభలక్షణ లక్షితయై, వర్షించుచున్న ధనరాశి వలె ఒప్పును. తొలుత ఈ రూపమును ధ్యానించి, పిదప మూడు మార్లు తన రూపమును ధ్యానించి, తిరిగి దేవిని ధ్యానింపవలెను. తదుపరి వాగ్భవ బీజము "ఐం" ఉచ్ఛరించుచూ ఒక పుష్పమును తన తలపై నిడుకొనవలెను. తిరిగి వాగ్భవ బీజమును రెండు మార్లు ఉచ్ఛరించి, నీటిని తన తలపై మూడు మార్లు జల్లుకొనవెలెను. అట్లే పూజోకరణములపై మూడు మార్లు జల ప్రోక్షణ కావింపవలెను. తదుపరి పీఠ ధ్యానమొనర్చి క్రమముగ తూర్పున గణేశుని, దక్షిణమున గణాధ్యక్షుని, పశ్చిమమున గణనాథుని, ఉత్తరమున గణక్రీడుని, ద్వారములందు హేరంబ బీజము "హ్రీం" తో పూజింప వలెను. పిదప సిద్ధపుత్ర, జ్ఞానపుత్ర, సహజపుత్ర, సమయపుత్ర మొదలగు వటువులను మొదట "శ్రీం" బీజము, చివర "దేవీ" యుంచి పూజింపవలెను. తరువాత మండలమునకు ఈశాన్యాది కోణములలో "సిద్ధ, జ్ఞాన, సహజ, సమయ" అనువటుక కుమారిణులను, గౌరట, డామరు, లోహజంఘ, భూతనాథ మొదలగు క్షేత్రపాలురను సహితము పూజింపవలెను. మండల మధ్యమున కామదేవుని పంచ బాణములైన "ద్రావణ, శోషణ, బంధన, మోహన, మరియు ఆకర్షణ" లను మధ్య మంత్రమయిన "క్లీం" బీజముతో పూజింపవలెను. త్రికోణమునకు మూడు వైపులా భగమాలినీ, భగోదరీ, భగారోహా, అను కామరూపిణులైన యోగినులను పూజింపవలెను.

తదుపరి అష్ఠ దళములందు అవ్యగ్ర రూపులైన ఎనిమిది మంది కామ యోగినులు "అనంగ కుసుమ; అనంగ మేఖల, అనంగ మదన, అనంగ మదనాతుర, అనంగ వేషా, అనంగ మాలినీ, మనదాతురా, మదనాంకుశా" లను మరియు శైలపుత్రి మొదలగు యోగినులను పూజింపవలెను. తదుపరి "హ్రీం" బీజముతో దుర్గాదేవి యొక్క ఆరు మంత్రముల నుపయోగించి అంగన్యాసము కావించి, కమలపు మధ్యన "క్లీం" బీజముచ్ఛరించుచూ ఎనిమిది మంది క్షేత్రపాలురను, "హేతుక, త్రిపురఘ్న, అగ్ని జిహ్వ, అగ్ని భేతాళ, కాల, కరాళిక, ఏకపాద, భీమనాథ" ఉత్తర దిశ నుండి ప్రారంభించి పూజింపవలెను. మండలమునకు నాలుగు దిశల మందు ఒక్కొక్క దిశ యందు ఇరువురు భైరవుల చొప్పున "అసితాంగ" మొదలగు నాయకులను (భైరవులను), మిగిలిన ఒక్క భైరవుని మండల మధ్యమున పూజింపవలెను. వారు వరుసగా "అసితాంగ, రురు, చండ, క్రోధ, ఉన్మత్త, భయంకర, కపాలీ, భీషణ, సంహార" భైరవులు (నాయకులు). ఇపుడు ఈశాన్యాది కోణములందు ఒక్కొక్క కోణమందు ఇరువురు నాయికలను, చివర మిగిలిన ఇరువురు నాయికలను మండల మధ్యమున పూజింపవలెను. దశ నాయికలు వరుసగా "బ్రాహ్మణీ, భైరవీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, నారశింహీ, వారాహీ, ఇంద్రాణి, చాముండీ, చండికా". అంతేకాక వైష్ణవీ తంత్రమందు తెలుపబడిన సర్వ భైరవులను, ప్రేతత్వము దాల్చిన మహాదేవుని సద్యోజాతాది పంచముఖములను, రక్తకమలము, శ్వేత ప్రేతము, సింహము, జగదాధారమైన పీఠము, వీటన్నింటినీ సహితము మండల మధ్యమున పూజింపవలెను.

వీరినే కాక "జయంతీ, మంగళ, కాళీ, భద్రకాళి, కపాలినీ, దుర్గా, క్షమ, శివా, ధాత్రీ, స్వధా మరియు స్వాహా" వీరిని సహితము పూజింపవలెను. మండల మధ్యమున విశేషముగ "ఉగ్రచండ, ప్రచండ, చండోగ్ర, చండనాయిక,

చండ, చండవతీ, చండరూపా, అతి చండిక" లను కూడా పూజింపవలెను. ఆదిత్యాది నవగ్రహములను, వారి వారి అస్త్రసహితముగ దిక్పాలురను, వారి వారి అస్త్ర, మంత్ర, నామ సహితముగ వీరందరినీ మండల పార్శ్వమున పూజింపవలెను. మండల మధ్యమున ఏకముఖము, చతుర్భుజములు, భస్మము వంటి శ్వేతవర్ణము కలిగి, శ్వేత పద్మాశీనుడయిన కామేశ్వరుని, హృదయమందు ధ్యానింపవలెను. ఈయన కుడివైపు చేతుల యందు కమలము, దానిమ్మపండు, ఎడమ చేతుల యందు త్రిశూలము, పినాకము ధరించును. ఈయనతో పాటుగా కామాఖ్యాదేవిని కూడా ధ్యానించి, వీరిరువురినీ ఎర్రని పుష్పములు, కుంకుమతో పూజింపవలెను. క్షేత్రపాలకుడయిన కరాళుడు భయంకరరూపుడు. ఈయన చేతుల యందు కత్తెర, కపాలము ధరించి, దంతములతో పెదవులు కొరుకుచూ, భయంకర స్వరూపుడయినప్పటికీ శివునికి అత్యంత ప్రియుడు. అందువలన ఈయనను పూజింపవలెను. కల్పవృక్షమునకు ప్రతిరూపము, రత్నసుశోభితము, సుఖప్రదమయిన, ఛాయాదాయకమైన చింత చెట్టును, నల్లని గొప్ప ద్యుతి కల త్రికూటమును, నీలపర్వతమును, రత్నమండల సంయుతమైన పంచవ్యోమ విస్తృతము, ఎర్రని మురి (Spiral) ఆకారమున యున్న మనోభావ గుహ, మూడు వ్యోమముల విస్తృతము కలిగి యుండి, ఎర్రని రంగు కలిగి నిరంతరము పుష్పశోభితమైన అపరాజితా వల్లి, విఘ్నములకు విపత్తు కలిగించువాడు, కుడి చేతి యందు దండము, ఎడమ చేతి యందు కపాలమును ధరించిన వాడు, ద్విభుజుడు, ఏనుగుపై సవారీ చేయువాడు, దేవికి ముందున ఉపస్థితుడైన "కంబళుడు" అను వటువుకు; ఎర్రని రంగుతో ఒప్పారుచూ, చతుర్భుజుడై, నాలుగు చేతుల యందు గదా, పద్మ, శక్తి, చక్రములు ధరించిన "పాండునాధుడు" అను విష్ణు స్వరూపమునకు పూజనమొనర్పవలెను.

రక్తవర్ణ స్వరూపుడు, భయంకరుడు, కత్తి, డాలు ధరించినవాడు, నరమాంసభోజి, రక్తము స్రవించుచున్న మూడు కపాలములు ధరించినవాడు, అగ్నిచే మండుచూ, విరుగుచున్న దంతములు గల ప్రేతముపై ఆశీనుడు అయిన "హేరుకుడు" అను శ్మశానవాసిని పూజింపవలెను. మహామాయా తుల్య రూపముగల "మహోత్సాహ" అను యోగినిని కూడా పూజింపవలెను. నీల పర్వతమునకు తూర్పున రెండు యోజనములు పొడవు, అర్ధయోజనము వెడల్పు గల ఒక ప్రదేశము కలదు. అందు మణి, రత్న, స్వర్ణ నిర్మితములైన అనేక హర్మ్యములతో కూడినది, వికసించిన కమలయుతమైన స్వచ్ఛ సరోవరములు కలది అయిన "చంద్రావతి" అను పురము కలదు. అందు మణి రత్న స్వర్ణ సమూహములు కలబోసి నిర్మించిన గొప్ప హర్మ్యము కలదు. అందు దేవిని మంత్ర సహితముగ పూజింపవలెను. తదుపరి ఎరుపు, పసుపు కలగలపు శరీరము కలవాడు, నీలి వస్త్రధారి, రత్నమాలాధారి, చతుర్భుజుడు, కుడి రెండు చేతులయందు పుస్తక, శ్వేత కమలములు, ఎడమ చేతుల యందు శక్తి, ధ్వజములు ధరించి, శుభుడై మొసలిపై ఆసీనుడైన లౌహిత్యుని (బ్రహ్మ పుత్ర) పూజింపవలెను. ఈ పీఠ దేవతలను అందరినీ మండల మధ్యమున వారి వారి మంత్రములతో పూజింపవలెను. ప్రాసాద మంత్రముతో కామేశ్వరుని, కామేశ్వరీ మంత్రముతో శుభ ఫల దాయిని అయిన కామేశ్వరినీ, పూజింపవలెను. కామేశ్వరీ లేక మాయాకరణ బీజము "ఖోం", చండికా నేత్ర బీజము యొక్క చివరి బీజమయిన "శ్రీం" తో తింతిడీ వృక్షమును పూజింపవలెను. ఉగ్రుని మధ్య బీజము నీలశైలము యొక్క మంత్రమగును. మనోభవ బీజము మహాదేవుని తో సమానము. హయగ్రీవ బీజమంత్రము "ఓంక్రూం". ఈ ఉత్తమ విష్ణు మంత్రముతో "కంబళుని" పూజింపవలెను. తదుపరి మహా భైరవుని "క్ష" మంత్రముతోనూ, మహామాయ, మహోత్సాహను ద్వితీయ అష్టాక్షరి "ఓం మహామాయాయై నమ:" మంత్రము తోనూ, చంద్రావతీ పురమును "ఓం చంద్రావత్యై నమ: " అను మంత్రము తోనూ, బ్రహ్మపుత్రను నా (శివుడు) మరియు బ్రహ్మ యొక్క బీజ మంత్రములకు స్వాహా జోడించి పూజింపవలెను.

త్రిపురా దేవి యొక్క ద్వితీయ, మరియు తృతీయ రూపములను ఆవాహన కావించుటకై యోనిముద్ర ధరించి ధ్యానింపవలెను. ఈ తల్లి మందారపుష్పపు రంగుతో శోభించుచూ, చంద్రరేఖ గలిగిన జటాజూటము కలిగి, సర్వాధారణ

భూషితయై, సర్వసులక్షణ లక్షితయై, ఉదయభాను కాంతితో కమల పర్యంకముపై సుఖాసీనయై యుండును. ఈ దేవి ముత్య, రత్నముల మాల ధరించి, పీన పయోధరయై, పుష్ప మకరందమును ఆస్వాదించుట యందు నిమగ్నయై, సర్వులను ఆహ్లాదమొనర్చు నేత్రములు కలిగి, సర్వజగత్తును ప్రభావితమొనర్చు చుండును. ఈ దేవి త్రినేత్రయై, యోని ముద్ర ధరించి, నవయవ్వనియై, కమలాసనమునందు చిరునవ్వులు చిందించుచూ సుఖాసీనయై యుండును. ఈ దేవి చతుర్భుజయై, దక్షిణ హస్తములందు పుస్తక రుద్రాక్షమాలలు, వామ హస్తములందు వరదాభయ ముద్రలు, కలిగియుండి భాను సమాన తేజశ్శాలియై, లేత రక్తవర్ణపు పాదములు కలిగి, పొడవాటి కపాల మాల ధరించి, కామవనమందలి కల్పవృక్షము వద్ద ఉపస్థితమై యుండును. ఈ విధముగ కామునికాహ్లాదము కలిగించు సుందరి, శుభప్రద అయిన ద్వితీయ త్రిపురా రూపమును ధ్యానింపవలెను.

**తృతీయ త్రిపురా ధ్యానము:** ఈ దేవి మందార పుష్ప శరీర ఛాయతో, విరబోసిన కేశసంపదతో, సదాశివుని ప్రేత రూపముగ మోహింపజేసి, ఆయన హృదయముపై అర్ధ పద్మాసన ముద్రతో కూర్చొని యుండును. ఈమె పీన పయోధరయై, మెడయందు కాళ్ళవరకు వ్రేలాడుచున్న పుర్రెలమాల వైచికొని, చతుర్భుజయై దక్షిణ హస్తములందు పైన అక్షమాల, క్రింద వరద హస్తము, వామ హస్తములందు అభయముద్ర, పుస్తకము ధరించి, త్రినేత్రయై, శుచిస్మితయై, నగ్నయై, ఉబికి వచ్చుచున్న రక్తపాన లాలసయై, సర్వాంగ సుందరియై ఒప్పారును. సాధకుడు త్రిపురాదేవి యొక్క తృతీయ రూపమును ఈ విధముగనే ధ్యానింపవలెను.

మొదటి రూపము వాగ్భవ బీజము, "ఐం" గనూ, ద్వితీయరూపము కామరాజబీజమైన "క్లీం" గనూ, తృతీయ రూపమును డామర్ లేక మోహన బీజము గనూ తెలియవలెను. ఈ మూడు రూపములను విడివిడిగా ధ్యానమొనర్చి అర్ధ సిద్ధికై సాధకుడు మంత్రత్రయము మరియు షోడశోపచారములతో తన హృదయమందు పూజనమొనర్చవలెను. తదుపరి మూడు మంత్రములను ఒకటి చేసి, మూడు రూపములను మధ్య రూపమందు విలీనమొనర్చి, ఆ రూపమును కుడి నాసికా రంధ్రమునుండి, బహిర్గత మొనర్చి, తన చేతులయందుంచి, మూడు మార్లు అవాహన కావింపవలెను. తదుపరి గాయత్రీ మంత్రము మూడుమార్లు పఠించి, దేవికి స్నానమొనర్చి ఆవాహన హేతువై ఈ క్రింద మంత్రము పఠింపవలెను. మంత్రార్ధము – "ఓ! త్రిపురాదేవీ! కామనలను పూర్ణమొనర్చు దేవీ! నీ కుంతలములు అతి సుందరము. యజ్ఞమందు నీవు నా యొద్దనే యుండి, ఎన్నడూ రుద్ధము కాని సుందర గళము (వాణి) ను నాకు ప్రసాదింపుము. నీవు నా వద్ద కేతెంచి నీ యొక్క బలి నైవేద్యములను స్వీకరింపుము.

**నారాయణాయైచ విద్మహే వాఙ్మయాయైచ ధీమహి**
**తన్నో దేవీ ప్రచోదయాత్ ॥**

నేను దేవి నారాయణిని ఎరుగుదును. వాఙ్మయ దేవి యొక్క ధ్యానమొనర్చుచున్నాను.
దేవి నన్ను ప్రేరేపించు గాక!

**నారాయణాయైచ విద్మహే చండికాయైచ ధీమహి**
**తన్నో కుబ్జి ప్రచోదయాత్ ॥**

నేను నారాయణీ దేవిని ఎరుగుదును. చండికను ధ్యానించుచున్నాను. కుబ్జాదేవి నన్ను ప్రేరేపించుగాక!

**మహామాయైచ విద్మహే సమ్మోహిన్యైచ ధీమహి**
**తన్నిశ్చండి ప్రచోదయాత్**

నేను మహామాయను ఎరుగుదును. సమ్మోహినిని ధ్యానించుచున్నాను. చండీదేవి నన్ను ప్రేరేపించుగాక!

ఈ మూడింటినీ త్రిపురా గాయత్రిగ పేర్కొందురు. ఒక్కొక్క గాయత్రీ మంత్రముతో ఒక్కొక్క దేవతను స్నాన మొనర్చవలెను. ప్రప్రథమముగ వాగ్భవ మంత్రము "ఐం" తోనూ, తరువాత కామరాజ బీజమంత్రము "క్లీం" తోనూ, తదుపరి డామర్ బీజమంత్రము "ధం" తోనూ పూజింపవలెను. చివరగా మూడు మంత్రముల తోనూ ఈ త్రిపురాదేవిని పూజించి, షోడశోప చారములు సమర్పింపవలెను. కామాఖ్యా తంత్రమందు తెలుపబడిన అంగ ప్రత్యంగ మంత్రములచే దేవికి అంగపూజ కావించి, మిగిలిన ఎనిమిది అంగముల పూజ మూలమంత్రము తో కావింపవలెను. ప్రతి ప్రాకారమందు పూజనమొనర్చి "త్రిపురాయై నమ:" అని పలుకవలెను. ఈ ప్రకారముగ త్రిపురాదేవిని తొమ్మిది ప్రాకారములు, ఆవరణల యందు పూజింపవలెను.

కమల పత్రములందు నాలుగుదిశల యందలి దళముల యందు ఉత్తరము నుండి మొదలుపెట్టి నలుదిశలా బ్రహ్మ, విష్ణు, శివ, ఆదిత్యులను పూజింపవలెను. మిగిలిన నాలుగు ఉపదిశల యందలి దళముల యందు ఈశాన్యమున జయంతి, వాయువ్యమున అపరాజిత, నైఋతి యందు విజయ, ఆగ్నేయమందు జయ, దేవీమూర్తులను పూజింపవలెను. త్రికోణమందు కేసరములపై కాముడు, ప్రీతి, రతి, పంచబాణములు, పుష్పధనువు, పుస్తకము, అక్షమాల, రత్న పర్యంకము, ప్రేతము, కమలము, శివుడు, పంచ ప్రేతములను పూజింపవలెనను. భైరవా! సాధకుడు పూర్వము వలెనే స్ఫటికమాలకు పూజనమొనర్చి, దానిని చేతి లోనికి తీసికొని, ఉత్తరీయము కప్పి, అత్యంత శ్రద్ధా భక్తులతో త్రిపురామంత్రమును జపమొనర్చవలెను. జపానంతరము పలుమార్లు ప్రణామములాచరింపవలెను. పిదప మూడు జాతులలో ఉత్పన్నమయిన పశువులను త్రిపురా దేవికి బలిదానమొనర్చి, చక్కెర, మధువు, ఉప్పు కలిపిన నురగయున్న నీటిని ఆ బలిపై చిలకరించి, ఆ పశువు యొక్క రక్తమును కామరాజ బీజము నుచ్చరించుచూ దేవికి అర్పింపవలెను. అట్లు కావించుచూ వాగ్భవ బీజముతో పశువు యొక్క శిరము ఖండించి, డామరు బీజముతో ఆ శిరమును దేవికి అర్పింపవలెను.

దేవి యొక్క పూజనమందు ఎక్కడెక్కడ బలిదాన ప్రస్తావన ఏతెంచినదో అక్కడక్కడ వైష్ణవీ తంత్రమందు వర్ణించిన రీతిని అనుసరింపవలెను. తదుపరి భక్తులు వర్ణక్రమము ననుసరించి బ్రాహ్మణులు గోక్షీరమును, క్షత్రియులు గోదధి (పెరుగు) మరియు నెయ్యి, వైశ్యులు మధువు (తేనె), శూద్రులు పుష్పములు, పుష్పాసవము (మకరందము) సమర్పింపవచ్చును. చిరవగా సాధకుడు పుష్పమును ఆఘ్రాణించి, నిర్మాల్యమును ఈశాన్య కోణమందుంచవలెను. ఈ త్రిపురాదేవి యొక్క నిర్మాల్యధారిణి "త్రిపుర చండిక". తొలుత దేవిని విసర్జించి, దేవికి యోనిముద్ర, పద్మముద్ర, అర్ధముద్ర, ఈ మూడు ముద్రలు చూపించి, తదుపరి కామరాజ బీజమంత్ర మచ్చరించుచూ నిర్మాల్య గ్రహణము కావింపవలెను. ఏ సాధకుడు ఈ విధముగ త్రిపురాదేవిని పూజించునో, ఆతడు తన అన్ని కామనలను పూర్ణమొనర్చుకొని, అంతమున దేవీ లోకము ప్రాప్తించును.

**(శ్రీ కాళికాపురాణ మందలి త్రిపురా పూజావిధి అను అరువది మూడవ అధ్యాయము సమాప్తము)**

# అరువది నాల్గవ అధ్యాయము

**(కామాఖ్యా పూజావిధి, కామేశ్వరీ తంత్రము)**

మహేశ్వరుడు "ఇపుడు కామేశ్వరీ రూప, తంత్ర, ధ్యాన, పూజా క్రమములు వివరించెదను. దీనిని చింతించినంత మాత్రమున సాధకులకు సర్వము లభ్యమగును. **కామేశ్వరీ బీజమంత్రము:** ప్రజాపతి బీజము "క" కు అగ్ని బీజము "ర", ఇంద్రబీజము "ల్" బిందు సహిత అర్ధ చంద్రము, చతుర్థస్వరము ఈ కలిసి "క్లీం" అగును. ఇయ్యది సర్వసిద్ధి ప్రదాయకము.

ఉత్తమ సాధకులు వైష్ణవీ తంత్రము, ఉత్తర తంత్రమందు తెలిపిన విధి విధానములచే స్నానము, అభ్యుక్షణ, యంత్రము, పాత్రన్యాసము, భూతోపసారణము కావించి, మూడు ప్రాణాయామములు చేసి, దహన ప్లవన క్రియలు పూర్ణము కావింపవలెను. భేతాళ భైరవులారా! ఇపుడు ఈ పూజకై విశేష మండల నిర్మాణమొనర్పవలెను. ఇయ్యది షట్కోణము. తొలుత ఈశాన్యము నుండి నైఋతికి ఎరుపు రంగు చూర్ణముతో శక్తిని గీయవలెను. నైఋతి నుండి వాయువ్యమునకు, వాయువ్యము నుండి ఈశాన్యమునకు శంభువును గీయవలెను. ఇపుడ పశ్చిమము నుండి తూర్పుకు, తూర్పు నుండి ఉత్తరమునకు, ఉత్తరము నుండి పశ్చిమమునకు చూర్ణముతో గీతలు గీసి షట్కోణమును నిర్మింపవలెను. మండలమునకు ఉత్తరమున ధనస్సు, పశ్చిమమున తోరణము, దక్షిణమున త్రికోణము, తూర్పున షట్కోణము నిర్పింపవలెను. పూర్వము తెలిపిన విధమున ఉత్తరమున జలంధర పీఠము, పశ్చిమమున ఓఢ్ర పీఠము, దక్షిణమున కామరూప పీఠము లిఖించి, ఆయాదిశల యందలి కోణము లందు, ఆరు రేఖలతో మూడు మూడు చొప్పున దేవికి వెలుపల గుహ్యా మండల నిర్మాణ మొనర్పవలెను. మండల సంబంధమైన మిగిలిన ప్రక్రియలన్నియు ఉత్తర తంత్రమందు, వైష్ణవీ తంత్రమందు తెలిపిన విధముగనే కావింపవలెను. "ఓం క్లీం మండలతత్వాయ నమ:" ఈ మంత్రము తో మండలమందలి యోగ పీఠమును ప్రప్రధముగ ధ్యానింపవలెను. తదుపరి పీఠముపై యోని మండల రూపమున మండలము నిర్మించి త్రికోణాకృతిని మరియొక మండలము నిర్మించి, దానిని పద్మముతో కప్పవలెను. ఇపుడు కామేశ్వరీ దేవి యొక్క మనోహర రూపమును ధ్యానింపవలెను.




**కామేశ్వరీ దేవి రూపము:** ఈ దేవి కాలాంజన పర్వతశిఖర సదృశ నల్లని ఛాయ కలిగి, నల్లని కోమలమైన కురులు కలిగి, ఆరు ముఖములు, పన్నెండు చేతులు, పదునెనిమిది భుజములు, కలిగి ప్రతి శిరస్సు అర్ధ చంద్రునితో అలంకరింపబడి యుండును. గళమందు మణి, మాణిక్య, ముత్యాల హారములు ధరించి, సర్వాంగ భూషితయై ఒప్పారును. ఈ దేవి దక్షిణ హస్తములందు పుస్తకము, సిద్ధ సూత్రము, పంచబాణములు, ఖడ్గము, శక్తి, శూలము; వామహస్తములందు రుద్రాక్షమాల, మహాపద్మము, ధనుస్సు, అభయముద్ర, డాలు, దండము ధరించును. ఈ దేవి ఆరు ముఖములు వరుసగా తెలుపు, ఎరుపు, పసుపు, ఆకుపచ్చ, నలుపు, రకరకముల రంగుల కలగలపు యుండి వరుసగా ఈశాన్యము, తూర్పు, దక్షిణము, పశ్చిమ, ఉత్తర, మధ్య భాగమున యుండును. ఇందు తెల్లని శిరస్సు మాహేశ్వరీ దేవి, ఎరుపు కామాఖ్యా, పసుపు త్రిపుర, ఆకుపచ్చ శారద, నలుపు కామేశ్వరీ, రంగురంగుల మోము చండాదేవి యొక శిరస్సులుగ తెలియనగును.

దేవి యొక్క ప్రతి శిరస్సు అలంకరింపబడిన కేశపాశముతో శోభించుచుండును. సింహముపై శ్వేతప్రేతము, దానిపై రక్తకములము, దానియందు సుచిస్మితయై, పట్టుచీర, వ్యాఘ్రచర్మము కట్టబడిన వస్త్రములు కలిగిన కామేశ్వరీదేవిని ధర్మార్థ కామసిద్ధికై ధ్యానింపవలెను.

మూలమంత్రమందలి అక్షరములను రెండు రెండు అక్షరములు కలిపి దీర్ఘస్వరముతో పలికి, ప్రతి రెండు అక్షరములకు రెండు చేతుల యందలి వేళ్ళను బొటన వ్రేళ్ళతో మొదలుపెట్టి, కలుపుచూ ఆరు మంత్రములను పలికి కరన్యాస మొనర్చవలెను. తదుపరి హృదయము, శిరము, శిఖ, కవచము, నేత్రములు, అస్త్రము క్రమముగ ఆరు మంత్రములతో ఎడమ చేతితో అంగన్యాసమొనర్చవలెను. అట్లే ముఖము, రెండు చేతులు, గర్భాశయము, గుహ్యము, రెండు మోకాళ్ళు, రెండు కాళ్ళు, వీటిని అంగన్యాసమొనర్చవలెను. అర్ఘ్యార్థము సంగ్రహించిన నీటి యందు ఎనిమిది మార్లు మూలమంత్రమును జపమొనర్చి, పిదప ఆ నీటితో పూజాద్రవ్యములు, పూజోపకరణములు, పీఠముపై సాధకుడు అభ్యుక్షణ మొనర్చవలెను. సాధకుడు స్థానీయుడు (అదే ప్రదేశమునకు చెందినవాడు) అయిన ఎడల దేవతను స్పర్శించినపుడు ఆ దేవి ఉద్విగ్నమవ్వదు. లేని ఎడల (సాధకుడు దూర ప్రదేశము నుండి ఏతెంచిన ఎడల) అటువంటి సాధకులు స్థానిక సాధకుల ఉపదేశానుసారము పూజింపవలెను. ఓఢ్ర, పాంచాల మొదలగు దేశములకు చెందిన సాధకులు వారి వారి దేశ ఆచారములనే పాటించుచూ దేవపూజ కావింపవలెను. దీనికి వ్యతిరేకముగ ఆచరించిన ఎడల వారికి సంపూర్ణ ఫలము లభింపదు. ఎక్కడెక్కడ పూజాక్రమము తెలుపబడదో, అక్కడ ఉత్తర తంత్రము, వైష్ణవీ తంత్రమందు తెలుపబడిన విధి విధానములను అనుసరింపవలెను. తూర్పు ద్వారమందు కామ తత్వమును, దక్షిణమున ప్రీతి తత్వమును, పశ్చిమమున రతి తత్వమును, ఉత్తరమున మోహన తత్వమును క్రమముగ పూజింపవలెను. ఈశాన్య దిశయందు దేవ శ్రేష్ఠుడయిన గణేశుని, ఆగ్నేయకోణమందు అగ్ని భేతాళుని, నైఋతి యందు కాలుని, వాయువ్యము నందు నందిని ద్వారపాలురుగ అర్చింపవలెను.

నాలుగు (పీఠములు) అయిదు (బాణములు) ఆరు (భగ/ఐశ్వర్యములు) ఈ నాలుగు, అయిదు, ఆరు తత్వ విశేషముల నెరిగిన సాధకుడు మాత్రమే పీఠ పూజనమునకు అర్హుడు. పీఠములందు ప్రథమము ఓఢ్ర పీఠము, ద్వితీయము జలశైల లేక జాలంధర పీఠము, తృతీయము పూర్ణగిరి పీఠము, చతుర్థము కామరూప పీఠము. పశ్చిమమున గల ఓఢ్ర పీఠము (ఒరిస్సా) నందు "కాత్యాయినీ, ఓఢ్రేశ్వరి లేక శివా" అను దేవీమాతలను, జగన్నాథుని ఓఢ్రేశ్వరుని గనూ శ్రద్ధా భక్తులతో పూజింపవలెను. ఉత్తరమున గల జాల శైలము లేక జాలేశ్వర/జాలంధర పీఠమందు "జాలేశ్వరీ, దీర్ఘికా, ఉగ్రచండ మొదలగు దేవీ మాతలను, మహాదేవుడయిన జాలేశ్వరుని పూజింపవలెను. దక్షిణమున పూర్ణ శైలమందు "పూర్ణేశ్వరి, సరోజ (లక్ష్మి), చండికా, శాంత స్వభావిని అయిన దమనీదేవిని, మహాదేవుడయిన పూర్ణనాథుని పూజింపవలెను. కామరూప పీఠమందు కామేశ్వరీ దేవిని, పర్వతరాజమయిన నీలాచలమును, కామేశ్వర నాథుని క్రమముగా తూర్పు ద్వారమందు పూజింపవలెను. అట్లే ఇతర పీఠములందు సహితము క్షేత్ర పాలురను, గురువును, ద్వారపాలాది సర్వులను వారి వారి స్థానములందు పూజింపవలెను.

భేతాళ భైరవులారా! ఇపుడు కామరూపమునందు నీలశైలముపై ప్రతిష్ఠితమైన కామేశ్వరీ దేవి యొక్క పూజను విశేషముగ తెల్పెదను. వినుడు. ఇచట త్రికూటమందు నీలశైలము, మనోభావగుహ, చింతచెట్టు, క్షేత్రపాలుడైన కరాళుడు, కామేశ్వరుడు, కామేశ్వరీ దేవి, విరాజమానమై యుందురు. అంతేకాక కంబళుడు అను వటువు, అపరాజితా వల్లి, పాండునాథుడను భైరవుడు, హేరుకమను శ్మశానము, మహోత్సాహ అను యోగినీ, చంద్రావతి పురము, ధిక్కరవాసినీ సమీపమున నదుల రాజయిన లౌహిత్యుడు, ఉపస్థితులై యుందురు. జల్పీశుడను దేవతను వాయువ్య కోణమునందు, కేదారుడను రాక్షసుని నైఋతి కోణమందు, సమస్త యోగినీ, వటువులను ద్వారమందు, దేవి యొక్క మండలమందలి

కామరూపమను శ్రేష్ఠ పీఠమందు దేవిని పూజింపవలెను. ఓఢ్రాది పీఠములందు ఇదే విధముగ పూజింపవలెను.

బాణ పంచకము: మండలము యొక్క మధ్య భాగమున ద్రావణ, శోషణ, బంధన, మోహన, ఆకర్షణమను కామదేవుని పంచబాణములను పూజింపవలెను. షట్కోణ మండలపు ఆరు కోణముల చివర ఉత్తరమున మొదలుకొని భగ ఆది ఉత్తరతంత్రమందు తెలుపబడిన దేవతలను ఉత్తమ సాధకుడు పూజింపవలెను. అట్లే గుణక్రీడ, విద్యాకళ, బకుట (వకుట), సిద్ధపుత్ర మరియు కుమారీ గణములను కూడ పూజింపవలెను. సిద్ధ, వకుట, సిద్ధ పుత్ర మరియు కుమారీ గణములు అత్యంత పూజనీయ వర్గము. అందువలన వీరిని "చతుష్క" అని పిలుతురు. "కామ, రతి, ప్రీతి, అనంగమేఖల" మొదలగు నలుగురు, త్రిపురఘ్నాది ఏడుగురు, అసితాంగాది తొమ్మిది మంది భైరవులు, మాహేశ్వరి మొదలగు ఏబది మంది దేవీమూర్తులు, పంచ శక్తి సమూహములను పీఠ పూజనమందు ద్వితీయ పంచకమని పేర్కొందురు. వీరందరూ కామనా ప్రదాయకము నందు ముఖ్యులు. తంత్రమునకు ఆధారశక్తి అయిన దేవతామూర్తులు ఎల్లప్పుడూ ఇచట ప్రతిష్ఠితమై యందురు. ధర్మాదులు ఎనమండుగురూ, సత్వాది మూడు గుణములు, గ్రహ, దిక్పాలాదురు అందరినీ కలిపి ద్వితీయ చతుష్కమందురు. ఉగ్రచండాది దేవతలను, వారి నాయికలను, యోగినులను, త్రిపురా తంత్రమందు తెలిపినట్లుగా భక్తితో పూజింపవలెను. ఆవాహనాది షోడశోపచార పూజ, జప, బలిదానములు, అంగ మరియు అస్త్ర పూజ, ముద్రాపూర్వక విసర్జతము; ఈ సమూహమునంతటినీ అంతిమాష్టకమని తెలిపెదరు. ఈ ఏడు (నాలుగు పీఠములు, అయిదు బాణములు, భగాది ఆరు ఐశ్వర్యములు, బటుక, సిద్ధిపుత్ర, సిద్ధ, కుమారికలు (చతుష్కము), కామ, రతి, ప్రీతి; అనంగమేఖల మొదలగువారు, త్రిపురఘ్నాది ఏడుగురు, అసితాంగాది తొమ్మిది మంది భైరవులు, మాహేశ్వరి మొదలగు ఏబది మంది దేవీమూర్తులు, అయిదు శక్తి సమూహములు, ఆధార శక్తి ధర్మాదులు ఎనిమిది, సత్వాది గుణములు మూడు, గ్రహ, దిక్పాలురు; వీరి రహస్యములను ఎరుగక ఎవరు పీఠ పూజనము చేయుదురో వారు ఫలము నొందరు సరికదా హీనాయువులగుదురు. త్రిపురా తంత్ర మందు తెలిపిన స్థానములందు తొలుత పూజనమొనర్చి తదుపరి పరమేశ్వరుని పూజింపవలెను. "ఓ! కామేశ్వరీ దేవి! మీరు ఇచటకేతెంచి, దయచేసి నా సమ్ముఖమున కూర్చొనవలసినది. నేను మిమ్ములను తెలియుదును. నేను కామాఖ్యను ధ్యానించుచున్నాను. ఓ! కుబ్జికా! మహామాయా! మీరు నాకు ప్రేరణ కల్పింపవలసినది. ఓ! కామప్రియా! కామరూపధారిణీ! భగవతీ! మాతా! సర్వ లోకానుగ్రహకారిణీ! కామేశ్వరీ! మీరు ప్రసన్నయై శీఘ్రముగ ఏతెంచవలసినది."

తదుపరి సాధకుడు మూలమంత్ర ముచ్చరించుచూ స్నానార్థము జలమునిచ్చి, పిదప షోడశోపచారములు సమర్పింపవలెను. అపుడు మంటల మధ్యమున దేవికి షడంగములతో పూజనమొనర్పవలెను. పూర్వము తెల్పినట్లుగా అంగన్యాస, కరన్యాసములొనర్చి, అష్టదళములందు తూర్పున మొదలుకొని క్రమముగా "గుప్తకామా, శ్రీకామా, వింధ్యవాసినీ, కోటీశ్వరి, వనస్థా, పాదచండికా, యోగినీ దీర్ఘేశ్వరీ, ప్రకటా భువనేశ్వరి" అను కామ ప్రదాయినులైన యోగినులను సాధకుడు తన కామ్యసిద్ధికై శ్రద్ధగా పూజింపవలెను. తదుపరి షట్కోణము యొక్క ఆరు కోణముల యందు ఈశాన్యమున ప్రారంభించి "కామాఖ్యా, త్రిపుర, శారదా, మహోత్సాహా, ప్రకటా భువనేశ్వరీ, సిద్ధ కామేశ్వరి" ఈ ఆరుగురు యోగినులను పూజింపవలెను. ఎనిమిది పుష్పములతో దేవి యొక్క ఎనిమిది రూపములను పూజించి, జప, స్తుతి, బలిదానము, నమస్కారము, ముద్రా ప్రదర్శనము, నిర్మాల్య ప్రదానము, మండలము నుండి దేవి యొక్క విసర్జన కావించి తిరిగి దేవిని యోని మండలమందు స్థాపించవలెను.

భేతాళ, భైరవులారా! ఇయ్యది పూర్ణముగ కామేశ్వరీ తంత్రము. ఇపుడు శారదా తంత్రమును తెలిపెదను. వినుడు.

**(శ్రీ కాళికా పురాణమందు కామేశ్వరీ తంత్రమును అరువది నాల్గవ అధ్యాయము సమాప్తము)**

# అరువది అయిదవ అధ్యాయము

**(శారదా తంత్రము)**

పురాతనకాలమందు దేవి శరద్రుతువు నందలి నవమి నాడు దేవతల ద్వారా ఉద్భవింపబడినది. అందువలన మానవలోకమందు మరియు సిద్ధక్షేత్రములందు ఈ దేవి "శారద" అను పేర ప్రసిద్ధి నొందినది. ఈమె మంత్రము నేత్రబీజము "ఐం హ్రీం శ్రీం", లేక దుర్గా బీజము". ఈ మంత్రముతోనే ఈ జగన్మయి పూజన మొనర్చవలెను. పుత్రులారా! ఇపుడు శారదాదేవి యొక్క ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థ ప్రదాత అయిన తృతీయ బీజ మంత్రమును తెలుపుచున్నాను. వినవలసినది. ఇయ్యది "హ్రీం క్లీం పౌం స:". ఈ చతురక్షర మహా మంత్రముతో సాధకుడు పీఠ పూజనము చేసిన ఎడల అతడు సర్వార్థ సిద్ధి నొందును. సింహవాహన అయిన ఈ దేవిమాత యొక్క రూపమును ఇది వరలో మీకు వర్ణించితిని. ఇపుడు పూజా పద్ధతిని వివరించెదను.

తొలుత నాలుగు ద్వారములు కల మహామాయా మండలము పూర్వ పద్ధతిలోనే శారదా పూజనమునకు నిర్మించి, వైష్ణవీ మంత్ర తంత్రములతో స్నానమార్జనాది ప్రక్రియలను నేత్ర బీజముతో ఒనర్చవలెను. యోగ పీఠమందు అష్టదళ పద్మమును గీసి (వ్రైచి), వాని మధ్యన త్రికోణమును ఆయత్తము చేయవలెను. వైష్ణవీ తంత్రమందు తెలుపబడిన రీతిలోనే మండల రచన కావించి భూతోపసారణము, పాత్రా ప్రతిపత్తి, స్థాపన, అమృతీకరణము, గంధ పుష్పాదులు జలము నందుంచుట, ఆసనపూజ, త్రివిధముల ప్రాణాయామము, భూతశుద్ధి, పూజా గృహ ప్రవేశము, దహన ప్లవన క్రియలు, పాణికచ్ఛప ముద్ర ప్రదర్శనము, యోగ పీఠధ్యానము, ఈ ప్రక్రియలన్నియు కావింప వలెను. తదుపరి దేవికి విశేష పూజనమొనర్చి ధేనుముద్రతో జలమును అమృతీకరణము కావింప వలెను. పిదప దేవి యొక్క దశభుజా రూపమును ధ్యానించుచూ, దుర్గా తంత్రానుసారము నవాక్షర మంత్రముతో అంగుష్ఠాది క్రమములో కరన్యాసము, హృదయాది క్రమములో అంగన్యాసము కావింపవలెను. తదుపరి ఎనిమిది రకముల మంత్రములతో అర్ఘ్య పాత్రయందలి నీటిని అభిమంత్రీకరించి, ఆ జలమును తన శిరసుపై, ఇతర పూజోపకరణములు, గంధపుష్పాదులపై, ప్రోక్షణ కావింపవలెను. ఈ పూజా క్రమము నందే సాధకుడు పూర్వము వలె దేవి యొక్క మండలము నిర్మించి, సూర్య భగవానుని, చండికా రూపములో ధ్యానించుచూ, ఆవాలు, పుష్ప, అక్షతలతో అర్ఘ్య ప్రదానము కావింపవలెను.

మండల మధ్యమున ధర్మాదులను, గుణత్రయమును, గురుపాదములను పూజించవలెను. మండల మధ్యనున్న కమలము యొక్క మధ్య భాగమున తొలుత సుమేరు పూజ కావించి, తుదపరి మండలమునకు తూర్పున దేవి యొక్క శక్తులను శ్రద్ధా భక్తులతో పూజింపవలెను. కామేశ్వర నాధునితో ప్రారంభించి లౌహిత్యుని వరకు సర్వపీఠ దేవతలను మండలమునకు ఉత్తర భాగమున పూజింపవలెను. "మణికర్ణ, చిత్రరధ, భస్మకూట, శ్వేత, నీల, చిత్ర, వరాహ, గంధమాధన, మణికూట, నందనులను" మండలమునకు పశ్చిమమున పూజింపవలెను. "జల్పీశ, కేదార, ధిక్కరవాసినీ, ధాత్రీ, స్వధా, స్వాహా, మానస్తోకా, అపరాజిత" వీరిని మండలమునకు దక్షిణ భాగమున పూజింపవలెను. అరవై నాలుగు యోగినులను, గ్రహ, దిక్పాలురను, తొలుత తెలిపిన విధముగనే పూజించి, తదుపరి భైరవ భైరవీలను సహితము పూజింపవలెను. పిదప కూర్మముద్రతో బంధనమొనర్చి, దేవిని మానసికముగ హృదయమందు ధ్యానింపవలెను. దేవిని హృదయము నుండి కుడి నాసిక ద్వారా బహిర్గత మొనర్చి, మండలముందుంచి, కామాఖ్యా శారదాదేవిని ఆహ్వానింపవలెను. ఆవాహన మంత్రార్థము: ఓ! పరమేశ్వరీ! మీరు దయచేయవలసినది. ఇచట ఉపస్థితమవ్వవలసినది. దయచేసి ఈ పూజను గ్రహించి యజ్ఞమును రక్షింపవలసినది. అమ్మా! మీకు నమస్కారము. ఓ! దుర్గా! దుర్గా! మీరు మీ అనుచర సహితులై ఇచట

కేతెంచి, ఈ పూజను గ్రహింప వలసినది. ఈ యజ్ఞమును రక్షింపవలసినది. మీకు నమస్కారము."

**నారాయణాయ విద్మహే చండికాయైతు ధీమహి**

**తన్నో చండి ప్రచోదయాత్ ॥**

**మంత్రార్ధము** : నేను నారాయణుని ఎరుగుదును. చండికవైన నిన్ను ధ్యానించుచున్నాను. ఆ చండికా దేవి నన్ను ప్రేరేపించుగాక!

ఈ గాయత్రి చే కానీ, దుర్గా తంత్రము చే కానీ, స్నానమర్పించి, నేత్ర బీజముతో కానీ, పీఠ మంత్రముతో కానీ, చతురక్షర మంత్రముతో కానీ, మూడు మంత్రములతో కానీ పూజనమొనర్పవలెను. దేవికి షోడశోపచారములు చతురక్షర మంత్రముతో అర్పించవలెను. దుర్గా తంత్రమందలి మంత్రములచే దేవి యొక్క హృదయము, శిఖ, కవచము, నేత్రము, పాదములు మొదలగు పంచాంగములను అయిదు అక్షరములతో క్రమముగ పూజన మొనర్పవలెను. కేసరముల మధ్య భాగమున "ఉగ్రచండా, ప్రచండా, చండోగ్రా, చండనాయికా, చండా, చండవతీ, చండరూపా, చండికా" మొదలగు ఎనిమిది మంది నాయికల పూజనమొనర్పవలెను. వీరిని నేత్ర బీజమునకు మధ్య బీజమయిన "హ్రీం" బీజాక్షరముతో పూజింపవలెను. అష్టదళ మధ్య భాగమున, త్రికోణాంతర్గతమున "కామ, ప్రీతి, రతి, పంచ బాణములు, పుష్ప ధనువు" ను కామ దేవుని మంత్రములతో పూజింపవలెను. పిదప అష్ఠ పుష్పికలతో పరమేశ్వరిని పూజించి, అంత దేవిని రెండు చేతులలోనికి తీసికొని, దేవి యొక్క శస్త్ర, అంగ, సింహవాహన, కేసరములను మండలము యొక్క వేరొక భాగ మందు పూజింపవలెను పీఠాధిష్ఠాత్రి దేవత అయిన శారద, అధి దేవత కామాఖ్య, పీఠ అత్యధిదేవత మహాదేవి త్రిపుర లేక కామేశ్వరి మరియు మహోత్సాహో దేవిలను సహితము పీఠ మధ్యమున పూజింపవలెను. తదుపరి చతురక్షర మంత్రముతో మూడు పుష్పాంజలులు సమర్పించి పిదప జప, స్థుతి, బలి ప్రదానము, నమస్కారము, అవగుంఠనము, యోనిముద్రా ప్రదర్శనము కావించి, అపుడు చండికాయై నమ: అను మంత్రముతో చండీశ్వరికి నిర్మాల్యా ప్రదానము కావించి, దేవిని విసర్జింపవలెను. పూజ యందలి దోష నివారణార్ధము సూర్యునికి అర్ఘ్య ప్రదానము కావించి, దేవిని హృదయమందు తిరిగి స్థాపించి, పున: యోని మండలమందు స్థాపింపవలెను.

ఈ ప్రకారముగ జగత్స్వరూప, యోని ముద్రారూపిణి, కామాఖ్య, లేక స్వయముగ మాహాదేవి శారదను విధి విధానములతో, శ్రద్ధా భక్తులతో పూజించిన ఎడల ఆ సాధకుని సర్వ కామనలు పూర్ణమై ఆతడు/ఆమె శివలోకమును ప్రాప్తించును. ఈ ప్రకారముగ పంచరూప ధారిణి అయిన దేవిని సాధకుడు పంచ మంత్రములతో ఒకేసారిగానీ, విడివిడిగా గానీ, పూజించిన ఎడల వానికి దేవి అవశ్యము వరదాన మొసంగును. వానికి విఘ్నములు ఉత్పన్నము కావు. ఏ విధమయిన శారీరక, మానసిక వ్యాధులు సోకవు. వానితో సమానమైన ధనధాన్య సమృద్ధిపరుడు యుండడు. కోట్లాది గోదానముల వలన కలుగు ఫలము మానవునకు కామాఖ్యా పూజనము చే వాటిల్లును. ఒక్కమారు సాధకుడు పూజ సలిపిన వాని పది తరములు ముందు, పదితరములు తరువాత కూడా నా (శివుడు) లోకము ప్రాప్తించును. రెండుమార్లు కామాఖ్యా పూజన మొనర్చిన ఎడల సాధకుడు వాని వంద తరములను ఉద్ధరించి దేవీలోకము ప్రాప్తింపజేయును. ఏ మానవుడు నీలి పర్వతము చేరి యోని మండలమందు కామాఖ్యాదేవికి ఈ ప్రకారముగ పూజన మొనర్చిన ఎడల అతడు/ఆమె ఈ లోకమందు చిరాయువై సుఖైశ్వర్యములు ప్రాప్తించి, వేయితరముల నుద్ధరించి, దేహాంతమున శివలోకము చేరి అచట గణములకు స్వామి యగును. ఏ మాసమందలి అష్ఠమి, లేక నవమినాడు పంచరూపధారి అయిన వరదా కామాఖ్యను పంచ మంత్ర తంత్రములతో వేర్వేరు మండలముల ద్వారా పంచరూప ధ్యానము, పంచ మంత్ర జప సహిత పూజన మొనర్చిన ఎడల, ఆ సాధకుడు దేవీ కృపచే ఇహలోక మందు వాంఛిత సుఖములొంది, యశమును ప్రాప్తించి,

పంచాస్యము మత్తేభములను మర్దించునటుల శత్రుంజయుడై, దీర్ఘాయువై, పుత్రపౌత్ర వైభోగ యుక్తుడై జీవించి పరలోకమందు వేల కోట్ల కల్పములు నా (శివుడు) లోకమందు నివసించి చివరకు నిర్వాణ ప్రాప్తి నొందును.

**(శ్రీ కాళికా పురాణమందలి శారదా తంత్రమును అరువది అయిదవ అధ్యాయము సమాప్తము)**

# అరువది ఆరవ అధ్యాయము

**(నమస్కార వర్ణనము; ముద్రా కధనము)**




ఔర్వ మహర్షి తిరిగి చెప్పదొడంగెను. భేతాళ భైరవులు సర్వ మంత్రములు విని హర్షోత్పుల్ల నేత్రములతో త్రయంబకుని ఈ విధముగ అడిగిరి "తండ్రీ! పరమదయాళూ! మీ కృపవల్ల కామాఖ్యా తంత్రమును సాంగోపాంగముగ వింటిమి. ఇపుడు నమస్కార, ముద్ర, బలిదాన, షోడశోపచార నియమములు, మాతృకాన్యాసము మరియు అన్యత్ర పూజ గూర్చి సవిస్తారముగ తెలుపవలసినది. అంత శంకర భగవానుడు "ఓ! పురుష శ్రేష్ఠులారా! మీ జిజ్ఞాస, జ్ఞానతృష్ణ సంపూర్ణముగ తృప్తి నొందునట్లు సర్వమును తెలిపెదను. ప్రణామములు (నమస్కారములు) ఏడు రకములు. అవి "త్రికోణము, షట్కోణము, అర్ధ చంద్రాకృతి, ప్రదక్షిణ, దండము, సాష్టాంగము మరియు ఉగ్రము," అనునవి. కామాఖ్యాదేవి పూజనమునకు ఈశాన్య కోణము కానీ, ఉత్తరదిశ కానీ ఉత్తమము. కానీ స్థండిలము నందు సర్వమూర్తుల పూజలు కావింపవచ్చు. త్రికోణ వ్యవస్థ (నమస్కారము) – సాధకుడు తూర్పునకు తిరిగి పూజ చేయదలచిన ఎడల పశ్చిమము నుండి ఈశాన్య కోణమున కేగి అచట పూజా వ్యవస్థ స్థాపింపవలెను.

**త్రికోణ నమస్కారము:** సాధకుడు ఉత్తర ముఖుడై పూజింపదలచిన ఎడల, దక్షిణము నుండి వాయువ్యమున కేగి, అచట నుండి ఉత్తరము, అచట నుండి ఈశాన్యమునకు అచట నుండి దక్షిణ దిశకు ఏతెంచిన ఎడల అయ్యది త్రికోణాకార నమస్కారమగును. ఇయ్యది త్రిపురాదేవికి మిక్కిలి ప్రసన్నత కలిగించును.

**షట్కోణ నమస్కారము:** దక్షిణము నుండి ప్రారంభించి వాయువ్య కోణమునకేగి, అచటి నుండి ఈశాన్యమును చేరి, ఈశాన్యము నుండి ఆగ్నేయము ప్రవేశించి, అచట నుండి దక్షిణమునకు ఏగవలెను. తిరిగి దక్షిణము నుండి ఆగ్నేయమునకేగి, అచటి నుండి నైఋతి చేరి, అచటి నుండి ఉత్తరమునకేగి, అచట నుండి తిరిగి ఆగ్నేయము ప్రవేశించిన

ఎడల అయ్యది ద్విత్రికోణముల యందు (షట్కోణ) భ్రమణ మగును. ఈ రకమయిన షట్కోణ భ్రమణము శివునకు, దుర్గాదేవికి ప్రీతికరము.

**అర్ధచంద్ర నమస్కారము:** దక్షిణమునుండి వాయువ్యమున కేగి తిరిగి దక్షిణమునకు తిరిగి వచ్చిన ఎడల అయ్యది అర్ధచంద్ర నమస్కారము.

**ప్రదక్షిణ నమస్కారము:** ఒక్కమారు వృత్తాకారములో ప్రదక్షిణ గావించి సాధకులు నమస్కారము పూర్ణము కావించిన ఎడల అయ్యది వృత్తాకారము లేక వర్తులాకారపు నమస్కారము. ద్విజులు సామాన్యముగ ఈ వృత్తాకార ప్రదక్షిణా నమస్కృతులాచరించెదరు.

**దండ నమస్కారము:** ఎవరు తన ఆసనమును విడచి, ఏ విధమయిన ప్రదక్షిణ చేయకుండ దండము వలె నేలపైబడి నమస్కరించిన ఎడల అయ్యది దండ నమస్కారము. ఇది సర్వ దేవతలకు ప్రసన్నప్రదాయకము.

**సాష్టాంగ నమస్కారము:** దండము వలె నేలపై బడి ముఖము, నాసము, దవడలు, బ్రహ్మరంధ్రము, కంఠము, హృదయము, మణమలు భూమికి తగులునట్లు పడి నమస్కరించిన దానిని పండిత గణము సాష్టాంగనుని తెలిపెదరు.

**ఉగ్ర నమస్కారము:** ఏ జీవి వర్తులాకారముగ మూడు మార్లు ప్రదక్షిణ గావించి పిదప బ్రహ్మరంధ్రము నేలకు తాకునట్లు నమస్కరించిన ఎడల అయ్యది ఉగ్ర నమస్కారము. ఇది విష్ణు భగవానునకు మరియు మహామాయకు ప్రీతికరము.

నదములందు సాగరము, మనుష్యులందు బ్రాహ్మణుడు, నదుల యందు జాహ్నవి, దేవ గణములందు విష్ణువు ఎట్లు ప్రసస్తమో అట్లే నమస్కారములందు ఉగ్ర నమస్కారము అత్యంత ప్రసస్తము. అయిననూ భక్తులు త్రికోణాది నమస్కారములు సహితము చేయవచ్చును. నమస్కారము ఒక మహా యజ్ఞము. ఇయ్యది సర్వ దేవతా గణమునకు ప్రీతి కరము. నమస్కారము చే చతుర్విధ పురుషార్ధములు ప్రాప్తించును. నేను మీకు ఇప్పటి వరకు నమస్కారముల గూర్చి వర్ణించితిని. ఇపుడు ముద్రల గూర్చి వర్ణించెదను.

పూర్వము బ్రహ్మదేవుడు నూట ఎనిమిది ముద్రల గూర్చి ప్రస్తావించెను. అందు ఏబది అయిదు గ్రాహ్యములు. అవి – "ధేను, సంపుట, ప్రాంజలి బిల్వ, పద్మ, నారాచ, ముండ, దండ, యోని, అర్ధయోని, వందనీ, మహాముద్ర, భగ, పుటక, ని:స్సంగ, అర్ధచంద్ర, అంగ, ద్విముఖ, శంఖ, ముష్ఠిక, వక్త్ర, రంధ్ర, షట్‌యోని, విమల, ఘట, శిఖరిణి, తుంగ, పుంద్ర, అర్ధపుంద్ర, సమ్మిళినీ, కుండ, చక్ర, శూల, సింహ, గోముఖ, ప్రాన్నామ, ఉన్మన, బింబ, పాశుపత, శుద్ధ, త్యాగ, సారిణీ, ప్రసారిణీ, ఉగ్ర, కుండలీవ్యూహ, త్రిముఖ, అశవక్త్రా, యోగ, భేద, మోహన, బాణ, ధనుష, మరియు తూణీర." ఇవన్నియు ఉత్తమ ముద్రలే!! మిగిలిన ఏబదిమూడు ముద్రలు ధనాకర్షణకు, సంకేతార్ధము, నాట్యము, నటన యందు ఉపయోగపడును. తొలుత తెలిపిన ఏబది అయిదు ముద్రలు ధ్యాన, యోగ, జప, చింతన, ఉద్యాపన (విసర్జన)ల యందు ఉపయోగపడును. ముద్రలు లేని జప, ప్రాణాయామ, దేవతార్చన, యోగము, ధ్యానము, ఆసనము నిష్ఫలమగును.

### ధేనుముద్ర-

1) కుడిచేతి మధ్యవేలి అగ్రభాగమును ఎడమచేతి తర్జనీ అగ్రమును కలుపవలెను.

2) అట్లే ఎడమ చేతి మధ్యవేలి అగ్రభాగమును కుడిచేతి అగ్రమును కలుపవలెను.

3) కుడి ఉంగరపు వేలు అగ్రమును ఎడమ చిటికెని వ్రేలు అగ్రముతోనూ, ఎడమ ఉంగరపు వేలి అగ్రమును కుడి చిటికెని వేలు అగ్రము తోనూ కలుపవలెను.

4) ఇపుడు రెండు చేతులను మణికట్టు వద్ద కలుపవలెను.

ఈ ముద్ర సమస్త దేవతా గణమునకు సంతుష్ఠి కలిగించును.



**ప్రాంజలి ముద్ర (నమస్కార ముద్ర) (భేదముద్ర)**



రెండు చేతుల యందలి అరిచేతులు, బొటనవ్రేళ్ళు, మిగిలిన వేళ్ళు ఒకదానితో మరొకటి కలిపి మధ్యన కొంచెము ఖాళీ యంచవలెను.

ఈ ముద్ర సమస్త దేవతా గణమునకు సర్వదా ప్రీతి పాత్రము. ధ్యాన, చింతన యోగములందు అత్యంత ప్రశస్తము. త్రిమూర్తులకు అత్యంత ప్రియము.

**బిల్వముద్ర-**



1) ఎడమ ముష్ఠిని బిగించి, బొటనవ్రేలిని విప్పార్చి అపుడు ఎడమముష్ఠిని తలక్రిందులుగ చేయవలెను.

2) ఇపుడు విప్పార్చిన ఎడమ బొటన వ్రేలిని కుడి పిడికిలి యందు బిగింపవలెను.

3) ఇపుడు ఎడమముష్ఠి పైకి, కుడి ముష్ఠి క్రిందకు యుండును.

**పద్మముద్ర-**



1) రెండు చేతులను మణికట్టు వద్ద కలుపవలెను.

2) రెండు బొటనవ్రేళ్ళను కలుపవలెను.

3) రెండు చిటికిన వ్రేళ్ళను కలుపవలెను.

4) మిగిలిన వ్రేళ్ళను పూర్తిగా విపార్చవలెను.

ఇది పద్మము వలె కానపట్టును.

**నారాచముద్ర-**



1) రెండు చేతులను మణికట్టు వద్ద కలుపవలెను.

2) రెండు చేతుల తర్జని (చూపుడువ్రేళ్ళను) కలిపి ముందుకు సాచవలెను.

3) బొటన వ్రేళ్ళ అగ్రములను వాని వాని తర్జని యొక్క మొదలు వద్ద యుంచవలెను.

4) మిగిలిన వ్రేళ్ళను ఒకదాని తో మరియొకటి కలిపి యుంచవలెను.

ఇయ్యది శివునికి అత్యంత ప్రీతికరము.

**ముండముద్ర**



1) కుడి చేయి బొటనవ్రేలు, చూపుడు వేలు, మధ్యవేలు అగ్రములు మాత్రమే కలుపవలెను.

2) ఎడమ చెయ్యి బొటన వ్రేలు లోపలపెట్టి పిడికిలి బిగించవలెను.

3) ఇపుడు ఎడమ పిడికిలి ని కుడి చేయివ్రేళ్ళ చివర యుంచవలెను.

ఇయ్యది గణనాధుని ప్రసన్నము చేసికొనుటకు సర్వోత్తమ ముద్ర. సర్వదేవతలకు సర్వ కర్మల యందును సంతుష్ఠి కలిగించును.

**దండముద్ర:**



1) కేవలము కుడిచేతిని మాత్రమే ఉపయోగింపవలెను.

2) కుడి చేయి బొటనవ్రేలు, మధ్యవేలు, ఉంగరపు వేలు, చిటికిన వేలు ముడిచి వాని అగ్రభాగములను కలుపవలెను.

3) కుడిచేయి తర్జని (చూపుడు వేలు) చాచవలెను.

**యోని ముద్ర:**



1) రెండు అరచేతులను ప్రక్కప్రక్కన యుంచి, చాచి, రెండు మధ్య వ్రేళ్ళను అరచేతిలోనికి మడచవలెను.

2) కుడి ఉంగరపు వ్రేలిని ఎడమ ఉంగరపు వ్రేలిపై యుంచవలెను.

3) వ్యతిరేక (Opposite) ఉంగరపు వ్రేలిని అదే వైపు చూపుడు వేలితో లాగవలెను.

4) రెండు చిటికిన వ్రేళ్ళను లోపలికి తీసికొని వచ్చి, మడిచిన మధ్య వ్రేళ్ళను చాపి వాటితో చిటికిన వ్రేళ్ళను ప్రక్కనుండి అదమవలెను.

5) ఇపుడు ఏ చేతి బొటనవ్రేలి అగ్ర భాగముతో అదే చేతి చిటికిన వ్రేలి అగ్రభాగమున తాకవలెను.

6) ఇపుడు రెండు మణికట్టును (మణి బంధములను) ఒకదానికొకటి ఎదురుగ కలుపవలెను.

ఈ ప్రకారమగ చేసిన ఎడల అయ్యది యోని ఆకారమగును.

ఈ ముద్ర పంచమూర్తి కామాఖ్యాదేవికి, భగవతి దుర్గకు, కామునికి అత్యంత ప్రీతికరము.

**అర్ధయోని ముద్ర:**



1) రెండు అరచేతులు కలిపి నమస్కార ముద్ర కావింపవలెను.

2) ఇపుడు రెండు బొటన వ్రేళ్ళ అగ్రభాగముల చే ఆ చేతి కనిష్ఠిక (చిటికెన వ్రేలు) అగ్ర భాగమును స్పృశింపవలెను.

వైష్ణవీ తంత్రమందు దీనినే మహాయోని ముద్ర అని తెలిపెదరు.

**వందన ముద్ర:**



ప్రాంజలి ముద్ర (రెండు అరచేతులు కలిపి నమస్కరించుట) చేసి, ఆ రెండు చేతులను శిరసుపై యుంచిన ఎడల అయ్యది వందన ముద్ర అగును.

ఈ ముద్ర విష్ణు భగవానునికి ప్రీతిపూర్వకము.

**మహాముద్ర:**



వందన ముద్రను కుడి చెవి తగులునట్లు (స్పృశించునట్లు) చేసిన ఎడల అయ్యది మహాముద్ర అగును.

**వైష్ణవీముద్ర:**



వందనముద్రను కుడిచెవి, కుడిలలాటము తగులునట్లు (స్పృశించునట్లు) కావించిన ఎడల అయ్యది వైష్ణవీముద్ర అగును.

వైష్ణవీ తంత్రమందు మహాయోనిముద్ర విశేషముగ తెలుపబడినది.

**భగముద్ర:**



1) రెండు అరిచేతులను ఒకదాని కొకటి ఎదురుగ మణికట్టు వద్ద సంయోగమొనర్పవలెను.

2) రెండు చేతుల బొటన వ్రేళ్ళ అగ్రభాగములను వానివాని చిటికిన వ్రేళ్ళ మూలము వద్ద యుంచి మిగిలిన వ్రేళ్ళను పూర్తిగ విప్పార్చవలెను.

ఇయ్యది లక్ష్మీదేవి, సరస్వతీ దేవి మరియు శివునికి ప్రీతీప్రదము.

**పుటకముద్ర:**



1) కేవలము కుడిచేయి మాత్రమే!

2) కుడి చేయి అన్ని వేళ్ళ అగ్రభాగములను కలిపి అరచేతిని దోసిలి పట్టి ముందుకు చూపవలెను.

**నిస్సంగముద్ర:**



1) రెండు చేతులను వేరువేరుగా యుంచవలెను.

2) ఇపుడు బొటనవ్రేలు, ఉంగరపు వ్రేలు, చిలికెన వ్రేలు యొక్క అగ్రభాగములను కలిపి మిగిలిన రెండు వ్రేళ్ళను విప్పార్చవలెను.

3) ఈ రెండు చేతులను వేరువేరుగనే యుంచి, మణికట్టు వద్ద కొంచెము వంచి దేవతకు ప్రదర్శింపవలెను.

ఈ ముద్ర నరశింహ, వారాహమూర్తులకు ప్రసన్నత కావించును.

**అర్ధ చంద్రముద్ర:**



1) కుడి చేయి మాత్రమే!

2) కుడి చేతి యొక్క మధ్య, ఉంగరపు, చిటికెన వ్రేళ్ళను పూర్తిగా ముడిచి, బొటనవ్రేలు, మరియు తర్జని (చూపుడు వ్రేలిని) విప్పార్చవలెను.

ఈ ముద్ర గ్రహములకు ప్రసన్నత కలిగించును.

**అంగముద్ర**

1) కుడి చేయి పిడికిలి బిగించి, బొటన వ్రేలిని విప్పార్చవలెను. (Thumbs up Sign)

2) ఇపుడు విప్పార్చిన కుడి బొటన వ్రేలిని ఎడమ చేతి పిడికిలి యందు బంధించి, ఎడమ బొటనవ్రేలిని విప్పార్చవలెను.

3) ఇపుడు ఎడమ పిడికిలి కుడి పిడికిలిపై యుండును.

4) దీని యందు మరియొక ఎనిమిది వైవిధ్యములు యున్నవి. ఇదే భంగిమ యందు కుడిచేయి కనిష్ఠము (చిటికెన వ్రేలు) తో మొదలుపెట్టి మిగిలిన ముడిచిన వ్రేళ్ళ యందలి ఒక్కొక్క వ్రేలిని ఒక్కొక్కసారి విప్పార్చిన ఎడల అయ్యది ఒక్కొక్క ముద్ర అయి మరి ఎనిమిది ముద్రలకు దారితీయును. అవి వరుసగా "ద్విముఖ, ముష్ఠి, వజ్ర, ఆబద్ధ, విమల, ఘట, తుంగ, మరియు పుంద్ర" ముద్రలు.



ఈ ముద్రలు తొమ్మిది విష్ణుమూర్తి యొక్క తొమ్మిది మూర్తులకు మరియు వారి నాయికలకు కూడా అతి ప్రియము.

**శంఖ ముద్ర:**



1) ఎడమ చేతి బొటనవ్రేలిని కుడిచేతి యొక్క చూపుడువ్రేలి నుండి చిటికిన వ్రేలు వరకు గల నాలుగు వ్రేళ్ళతో చుట్టవలెను.

2) ఇపుడు ఎడమ చేతి యొక్క మిగిలిన నాలుగు వ్రేళ్ళను దగ్గరకు చేర్చి, వాని అగ్ర భాగములను కుడిచేయి బొటన వ్రేలి అగ్రభాగముతో తాకవలెను.

ఇయ్యది శంఖము వలె వొప్పును.

**శిఖరిణీ ముద్ర:** (Thumbs up Sign)



1) కుడిచేయి మాత్రమే!

2) కుడిచేయి బొటన వ్రేలిని విప్పార్చి, మిగిలిన నాలుగు వ్రేళ్ళతో పిడికిలి బిగింపవలెను.

ఇయ్యది సూర్య భగవానునికి, బ్రహ్మ దేవునికి ప్రియము.

**సార్ధధేను ముద్ర:**



1) రెండు చేతులు విడివిడిగాయుంచి ప్రతి చేతి యందలి బొటన వ్రేలు, తర్జని, మధ్యవ్రేళ్ళ అగ్రభాగములను కలిపి, ఉంగరపు, మరియు చిటికిన వ్రేళ్ళను విప్పార్చవలెను.

2) ఇపుడు రెండు చేతులను మణికట్టు వద్ద కలిపి వాటిని దేవతకు ప్రదర్శింపవలెను.

ఇయ్యది చంద్రభగవానునకు అత్యంత ప్రీతికరము.

**సమ్మిళినీ ముద్ర:**



1) రెండు చేతుల యొక్క వ్రేళ్ళను విప్పార్చి, అరిచేతులను ఒకదానికొకటి ఎదురుగ యుంచవలెను.

2) ఇపుడు ఎడమ చేతి వ్రేళ్ళ మూలముల వద్దకు కుడిచేయి మణికట్టు చేర్చవలెను.

3) ఇపుడు రెండు చేతుల వ్రేళ్ళను మడచి, కేవలము వాని అగ్రభాగములు మాత్రమే తాకునటుల కలుపవలెను.

ఈ ముద్ర సమ్మిళినీముద్రయై మంగళుడు (కుజుడు), పృధ్వి, సప్తర్షులకు అత్యంత ప్రీతిపాత్రము.

**కుండముద్ర:**



1) కేవలము కుడిచేయి మాత్రమే!

2) కుడి చేయి అంగుళుల సహితముగ ఒక దొప్ప వలె చేసినచో అయ్యది కుండముద్ర అగును.

ఇయ్యది బుధునకు, సరస్వతికి, శివునకు అత్యంత ప్రీతికరము.

**చక్రముద్ర:**





1) రెండు చేతుల వ్రేళ్ళను పూర్తిగా విప్పార్చవలెను.

2) ఇపుడు విప్పార్చిన కుడిచేతి వేళ్ళను ఎడమ చేతి వేళ్ళ మధ్య యంచవలెను.

3) రెండు బొటనవ్రేళ్ళను ప్రక్కప్రక్కన జోడించి వానిని తన హృదయముపై యుంచవెలను.

ఈ చక్రముద్ర విష్ణుమూర్తి, శివుడు మరియు బృహస్పతికి ప్రీతికరము.

**శూలముద్ర:**



1) కుడిచేయి మాత్రమే!

2) కుడిచేయి బొటనవేలు, మధ్య వేళ్ళను ముడిచి, వేరువేరుగ యుంచి, మిగిలిన మూడువేళ్ళ అగ్ర భాగములను కలుపవలెను.

ఇయ్యది శివునకు, శుక్రునకు ప్రీతికరము.

**సింహముఖీ ముద్ర:**



1) ఎడమ చేతిని బిగించి పిడికిలి బిగించవలెను.

2) కుడిచేతిని సాచి కుడి అరచేతి మధ్య భాగమును ఎడమ పిడికిలిపై బొర్లింపవలెను.

ఈ ముద్ర సూర్య పుత్రుడయిన శనికి, చక్రి (విష్ణువు)కు మరియు కృష్ణునకు అతి ప్రియము.

**గోముఖీ ముద్ర:**



రెండు చేతుల యందు భగముద్ర ధరించి, ఆ చేతులను తన రెండు చెవులపై యుంచిన ఎడల అయ్యది గోముఖీ ముద్ర అగును.

ఇయ్యది శివ, విష్ణు, రాహువులకు ప్రీతికరము.

**దశముద్ర:**



ఇయ్యది ఒక మూల పద్ధతి నుండి పది విధములయిన వైవిధ్యములు కలిగి యుండును. అవి "ప్రోల్లాసము, ఉన్మణము, బింబము, పాశుపతము, శుద్ధము, త్యాగము, సారణీ, ప్రసారిణీ, దక్షిణ, ఉగ్ర."

1) రెండు చేతులను కలిపి వ్రేళ్ళను ఒకదాని మధ్య ఒకటి యుంచి పిడికిలి బిగింపవెలను.

2) అక్కడి నుండి కుడి చేతి చిటికిన వ్రేలితో మొదలు పెట్టి ఒక్కొక్కవేలిని విప్పార్చవలెను.

3) ఎడమ చేతి వేళ్ళను విప్పార్చినపుడు (చాపినపుడు) వాటిని కుడి చేతి వేళ్ళతో సంధింపవలెను.

4) ఈ విధముగ కావించునపుడు రెండు బొటన వేళ్ళు పరస్పరము కలిసి యుండవలెను.

5) ఎనిమిది ముద్రలు అయిన పిదప అన్ని వేళ్ళను తిరిగి ముడువవలెను. అది దక్షిణముద్ర అగును.

6) అటు పిదప రెండు చేతులు విడదీసి, సాచి, రెండు అరిచేతులు బయటకుపెట్టి (Expose చేసి), చేతుల జోడించిన ఎడల అయ్యది ఉగ్రముద్ర అగును.

ఈ దశముద్రలు దిక్పాలకులకు ప్రీతికరము.

**కుండలీముద్ర:**



1) కుడిచేయి మాత్రమే!

2) కుడిచేయి బొటనవ్రేలు, చూపుడు వ్రేలు అగ్రభాగములు కలుపవలెను.

3) మిగిలిన మూడు వేళ్ళ అగ్రభాగములు వాని వాని మూలములు తగులునట్లు మూడువవలెను.

యధానామము తధాగుణము. ఇయ్యది సర్వదేవ ప్రియము మరియు కుండలినీ శక్తికి తుష్ఠి నిచ్చునది.

**త్రిముఖా ముద్ర:**



1) కుడిచేయి మాత్రమే!

2) కుడిచేతి బొటనవ్రేలు, చూపుడువేలు, మధ్యవేలు అగ్రభాగములు కలిపి మిగిలిన రెండు వేళ్ళు మడిచి వానిని అరిచేతి యందుంచవలెను.

ఈ ముద్ర విశ్వేదేవులకు, కేతువునకు, మాతృకాశక్తులకు ప్రియము.

**అసివల్లీ ముద్ర:**



1) రెండు చేతులు వేరువేరుగా యుండవలెను.

2) ఇపుడు ఏ చేతికి ఆ చేయి బొటన వేలు, తర్జనీ అగ్రభాగములు కలిపి మిగిలిన మూడు వ్రేళ్ళు ముడువవలెను.

ఇయ్యది పితరులకు, సాధ్యులకు, రుద్రులకు విశ్వకర్మకు ప్రీతిపదము.

**యోగముద్ర:**

రెండు పాదములు కలిపి, రెండు కాలి బొటన వ్రేళ్ళను నాభియందుంచి, దానిపై రెండు చేతులు జోడించి అంజలి ఘటించిన ఎడల అది యోగముద్ర అగును. ఇయ్యది యోగ విద్యా తాత్వికతకు, సర్వ దేవతా పూజన మందు ఉపయోగింపవచ్చును. ఇయ్యది తుష్ఠి పుష్ఠి ప్రదాయిని.

**సమ్మోహన్ ముద్ర:**



1) రెండు చేతులను కలిపి నమస్కార ముద్ర కావింపవలెను.

2) రెండు బొటన వ్రేళ్ళు ఒకదానిపై ఒకటి యుండవలెను.

3) మిగిలిన వేళ్ళు రెండు వైపులా ఒకదానితో ఒకటి సంయోగమై యుండవలెను.

4) ఇపుడు ప్రథమముగ రెండు తర్జనీలను వేరుపరచి కనిష్ఠక (చిటికెన వ్రేళ్ళను) వీక్షింపవలెను.

5) తదుపరి ఉంగరపు వ్రేళ్ళను వేరుపరచి కనిష్ఠికలను వీక్షింపవలెను.

ఇయ్యది కామునకు, దుర్గాదేవి, రమాదేవి మరియు సర్వ దేవతలకు ప్రీతికరము.

**బాణముద్ర:**



1) కుడిచేయి మాత్రమే!

2) బొటన వేలిని మడచి అరచేతి యందుంచవలెను.

3) అద్దానిపై మధ్యవేలు, మరియు ఉంగరపు వేలు యుంచవలెను.

4) ఇపుడు తర్జనీ మరియు కనిష్ఠికల అగ్రభాగములను వీనిపై భాగమున కలుపవలెను.

ఇయ్యది సమస్త దేవతలకు ప్రీతిపాత్రము.

**తూణీరముద్ర:**

1) కుడిచేయి మాత్రమే!



2) కుడిచేయి యొక్క నాలుగేవేళ్ళ అగ్రభాగమును బొటన వేలి యొక్క మూల స్థానమందుంచవలెను.

3) బొటనవ్రేలిని ఉంగరపు వేలి యొక్క వెనుక భాగమందుంచవలెను.

4) నాలుగువేళ్ళకు, అరిచేతికి మధ్య కొంచెము ఖాళీ యుంచిన అది తూణీర ముద్ర అగును.

ఇయ్యది సర్వ దేవతా ప్రియము.

ముద్రా ప్రదర్శనము చే పూజ పరిపక్వత నొందును. ముద్ర చే ధ్యానము యొక్క ఆవిర్భావము నొందును, ముద్రలచే యోగము సిద్ధించును. ముద్రయే సాధకులకు మోదకసాధకము. పూజ, ధ్యానము, యజ్ఞము, చింతన మొదలగు వన్నింటి యందు చేతులతో ఏ క్రియాకలాపమాచరించినప్పటికీ, కరద్వయముచే ముద్రా ప్రదర్శనము కావింపవలెను.

ఇష్టా పూర్తముల యందు ముద్రలకు ఎంతైననూ ఆవశ్యకత యున్నది. యజ్ఞక్రియలు ఆచరించునపుడు సహితము మనుజునకు ముద్రా ప్రదర్శనము నందు లాఘవము యున్న ఎడల, తొలుత ముద్రా ప్రదర్శనము కావించి, పిదప యజ్ఞకర్మలు ఆచరింపవలెను. ముద్రారహితముగ అచరింపబడు దేవకార్యములు నిష్ఫలములగును. అందువలన ముద్రా ప్రదర్శన ఆవశ్యకమే! సాధారణముగ అనేక ముద్రలు దేవపూజా విసర్జన సమయమందు ఆవశ్యకము. అందువలన ఆ పూజల ఆరంభ మరియు నిర్ధారిత సమయము లందు ముద్రలను ప్రదర్శింపవలెను. బుద్ధిమంతులు దేవతా ఉద్యాపన (విసర్జన) కాలమందలి ముద్రలను వదలి, ఇతర ముద్రలు పూజనమందు కావించిన ఎడల కర్మఫల వృద్ధి యగును. ముద్రా ప్రదర్శనము పుణ్యప్రదము, పరమ ధర్మము, మరియు దేవగణ ప్రీతికరము. అందువలన ప్రయత్న పూర్వకముగ ముద్రా ప్రదర్శనము కావింపవలెను.

"అర్ధయోని, మహాయోని, యోని, వైష్ణవీ, భ్రాహ్మీ, సంపుట ముద్రలు" దేవతా విసర్జనమందు  ఉపయోగించు ముద్రలు. విశేషముగ "శివా" మరియు "త్రిపురా" పూజన మందు ఈ ముద్రలను తప్పక ఉపయోగించెదరు. దుర్గాదేవి యొక్క సమస్త రూప పూజనమందు ఈ ముద్రలను తప్పక ఉపయోగించెదరు. "యోని, సంపుట, మరియు మహాయోని" ముద్రలు పూజాకర్మములందు నిమగ్నమయినప్పటికీ చేయవలెను. ముఖ్యమయిన ఏబది అయిదు ముద్రల గూర్చి తెలిసికొంటిమి. మిగిలిన ఏబది మూడు ముద్రలు గౌరీ, లక్ష్మీ, సరస్వతీ సమానములు. ఇవి సర్వమూ పూర్ణముగ ప్రమోదకరములు. ఈ ముద్రలు తెలిసిన వారి వద్ద నుండి తెలిసికొని, ప్రయోగించిన ఎడల పూజలందు పూజించు సాధకులకు తుష్ఠి, పుష్ఠి ప్రసాదించును. ఓ! భేతాళ, భైరవులారా! ఏ దేవత యొక్క విసర్జనమందు ఏ ముద్ర ప్రదర్శింపవలెనో ఆ ముద్రనే ప్రదర్శింపవలెను. ఇపుడు బలిదానము గూర్చి తెలిపెదను.

**(శ్రీ కాళికా పురాణమందలి నమస్కార వర్ణనము మరియు ముద్రా ప్రదర్శనమనెడు అరువది ఆరవ అధ్యాయము సమాప్తము)**

# అరువది ఏడవ అధ్యాయము

**(రుధిరాధ్యాయము, బలి విధానము)**

శ్రీకంఠుడు తన పుత్ర ద్వయముతో సంభాషణ కొనసాగించుచూ ఇట్లనియె "పుత్రులారా! ఇపుడు బలిదానమును గూర్చి వివరించెదను. ఏ ప్రాణి రక్తముతో దేవి పూర్ణత: ప్రీతినొందునో వినవలసినది. సాధకుడు బలిదానమునకు వైష్ణవీ తంత్ర పద్ధతిని అవలంబింప వలెను. అన్ని పక్షులు, తాబేళ్ళు, మొసళ్ళు, చేపలు, తొమ్మిది రకముల మృగములు, మహిషము, మేక, కొమోడో డ్రాగన్, గొర్రె, జింక, పంది, ఖడ్గమృగము, కృష్ణసాగర  మృగము, శరభము, సింహము, వ్యాఘ్రము, మనుష్యుడు, తన శరీర రక్తము, వీని రుధిరమును చండికాదేవికి లేక భైరవునకు బలిదానార్ధము ప్రదానము చేయవచ్చు. బలిచే స్వర్గప్రాప్తి మరియు ముక్తి లభించును. బలి చే రాజులు శత్రురాజుల పరాజితుల కావించెదరు. చేప లేక తాబేలు రక్తము చే శివాదేవి (కాళికాదేవి) కి ఒక మాసము తృప్తి లభించును. దేవి మృగ లేక మనుష్య రక్తము చే ఎనిమిది మాసములు తృప్తి నొందును. ఇయ్యది సర్వదా కళ్యాణ ప్రదము. ఆవు లేక కమోడో డ్రాగన్ రక్తము చే దేవి ఒక వత్సరము తృప్తి నొందును. పంది మరియు కృష్ణసార మృగముల రక్తము చే దేవి పన్నెండు సంవత్సరములు తృప్తినొందును. మేక లేక గొర్రె రక్తము చే దేవి ఇరువది అయిదు సంవత్సరములు, మహిష, వ్యాఘ్ర, ఖడ్గమృగములు రక్తము చే వంద సంవత్సరములు దేవి తృప్తి నొందును. సింహము, శరభము, లేక తన రక్తముచే దేవి వేయి వత్సరములు తృప్తి నొందును.

ఏ జంతువు రక్తము తో దేవి ఎంత సమయము తృప్తి నొందునో, ఆ మృగముల మాంసము చే కూడా అంతే తృప్తి దేవత నొందును.

ఇపుడు కృష్ణసారమృగము, ఖడ్గమృగము, వెండి పొలుసులతో మెరయుచున్న చేప, వాధ్రీనస, మొదలగు వాని బలి వలన కలుగు ఫలమును వేరు వేరుగా తెలిపెదను. వినుడు. కృష్ణసార మృగము, ఖడ్గమృగమాంసము చే చండికాదేవి వంద సంవత్సరములు, రోహితమత్స్యము, లేక వాధ్రీనస మాంసము చే మూడు వందల సంవత్సరములు దేవి తృప్తి నొందును (వాధ్రీనసము అనగా క్షీణింపని లేక బలమయిన తెల్ల వృద్ధ మేక లేక నీల గ్రీవము, ఎర్రనితల, నల్లని కాళ్ళు, తెల్లని తోక యున్న పక్షి, లేక కొన్ని కోశ గ్రంథములందు ఈ పదము ఖడ్గమృగాది జంతువులకు సహితము వాడబడినది.) ఈ మాంసము హవ్య (దేవకార్యము), కవ్య (పితృకార్యము) ము లందు సహితము ఉపయోగింపవచ్చును. ఇయ్యది శివకేశవులిరువురికి ప్రీతి ప్రదము. విధి విధానమున కావింపబడిన ఒక్క నరబలి చే దేవి సహస్ర వర్షములు తృప్తి నొందును. మూడు నరబలుల చే దేవి లక్ష సంవత్సరములు తృప్తి నొందును. మనుష్య మాంసము చే కామాఖ్యాదేవి మరియు నా (శంకరుడు) రూపధారి అయిన భైరవుడు మూడువేల సంవత్సరములు తృప్తి నొందును. బలి యందు మస్తకము మరియు రక్తము దేవతలకు అత్యంత అభీష్ఠదాయకము. అందువలన పూజా సమయమందు శిరము, మరియు రుధిరము దేవతకు అర్పింపవలెను. విచక్షణ గల సాధకుడు భోజ్య వస్తువుల తో పాటు రోమ రహిత మాంసమును అర్పింపవలెను. రక్త రహిత మస్తకము అమృతతుల్యము. అట్లే మంత్రముతో శుద్ధీకరింపబడిన రక్తము సహితము అమృతమయమగును. కూష్మాండము (బూడిద గుమ్మిడి కాయ), చెరకు, మధ్యము, పుష్ప మకరందము, బలిగా అర్పించుట నల్లమేకను బలి ఇచ్చుట తో సమానము.

బలిపశువును చంద్రహాసముతో కానీ, కత్తెరతో కానీ ఖండించుట ఉత్తమము. కొడవలి, కత్తి, పలుపుతాడు, క్రకచము (చాకు) లేక శంకులము తో ఖండించుట మధ్యమము. మంగలి కత్తి, ఇతర పదునయిన ఆయుధము లేక బల్లెము ద్వారా బలి అధమము. వీటివినా శక్తి లేక బాణముల చే లేక ఇతర శస్త్రములచే బలి చ్ఛేదము విహితము కాదు. బలిదానార్ధము తెలిపిన ఆయుధములు వినా మిగిలిన ఆయుధములు ఉపయోగించిన ఎడల ఆ బలిని దేవి స్వీకరింపదు. అందువలన బలికర్త శీఘ్రముగ మరణించును. ప్రోక్షణ కావించిన బలి పశువు, లేక పక్షిని ఉత్త చేతులతో ఖండించిన ఎడల ఆ బలి కర్తకు దు:సహ బ్రహ్మ హత్య సంభవించును. అట్లే మంత్రించని ఖడ్గమును, బలి యందు వాడరాదు. బలి యందు పూర్వము పండితులు మహామాయా ప్రసన్నార్ధము ఖడ్గమృగమును బలిఇచ్చునపుడు ఉపయోగించిన మంత్రసంపత్తిని ఏ బలికైననూ వాడుకొనవచ్చును. శారదాదేవికి కానీ, మీదు మిక్కిలి కామాఖ్యా దేవి పూజా సమయమందు ఖడ్గాభిమంత్రణ విషయముపై పూర్వము తెలుపబడిన మంతమ్రులే కాక ఈ ఇతర మంత్రములు సహితము ఉపయోగింపవలెను "కాళి కాళి వజ్రేశ్వరి లౌహ దండాయై నమ:" ఈ మంత్రము చే ఖడ్గమును పూజించి, కాళరాత్రి మంత్రము ద్వారా ఖడ్గమును అభిమంత్రించ వలెను. కాళరాత్రి మంత్రము "హ్రీం హ్రీం శ్రీం శ్రీం శ్రీం శ్రీం శ్రీం కాళీ కరాళోష్టీ ఫేత్కారిణీ ఖాదయ ఛేదయ సర్వాన్ దుష్టాన్ మారయ మారయ బలాయకమ్ ఖడ్గేన ఛింది ఛింది కిల కిల చికి చికి పిబపిబ రుధిరం చస్ప్రం స్ప్రం కిరికిరి కాళికాయై నమ:". ఈ మంత్రము చే ఖడ్గమును అభిమంత్రించుట చే కాళరాత్రి స్వయముగ ఆ బలికర్త ఎడల ప్రసన్నయై శత్రువధ కావించును. ఇంతకు పూర్వము తెలుపబడిన బలిదాన మంత్రముల ఎడల సాధకుడు అత్యంత గోప్యత పాటించవలెను. బలియందు జరుగు హత్యా దోష నివారణార్ధము ఈ క్రింది మంత్రమును పఠింపవలెను. మంత్రార్ధము – స్వయంభువుడైన చతుర్ముఖ బ్రహ్మ పూర్వము కేవలము యజ్ఞార్ధము పశువులను సృజించెను. అందువలన నేను యజ్ఞార్ధమై నిన్ను వధించుచున్నాను. యజ్ఞమందలి పశువధ దోషము కాదు.

తదుపరి దేవతను, తన కామ్యమును మనసునందుంచుకొని, అభిమంత్రిత ఖడ్గముతో తూర్పునకు తిరిగి

పశువును ఖండించవలెను. లేని ఎడల తాను తూర్పునకు తిరిగి పశువును ఉత్తరమునకుంచి, సైంధవాది లవణములను ఆ బలిపశువు ముఖము నందు లేపనము కావించి, అపుడు వధింపవలెను. తన విత్త శక్తి ననుసరించి రుధిర దానార్థము బంగారము, వెండి, తామ్రము, వెదురాకులు, కాంస్యము, మట్టి లేక యజ్ఞకాష్ఠ పాత్రను తీసికొనవలెను. కానీ ఈ పాత్ర ఇనుము, చెట్టు బెరడు, ఇత్తడి, ఎరుపురంగు పాత్ర, లేక గాజు పాత్ర కారాదు. స్రుక్, స్రువములతో బలి యందలి రుధిరమును అర్పింపరాదు. ఐశ్వర్యమును ఆశించు వ్యక్తి కుండయందు, నేలపై, క్షుద్రపాన పాత్రలందు రుధిరప్రదానము కావింపరాదు. రాజు మనుష్య రక్తమును మృణ్మయ పాత్ర లేక మెరయుచున్న పైన తెలిపిన లోహ పాత్ర యందు యుంచి అర్పింపవలెను. పత్రములచే చేయబడిన దొన్నె యందు రుధిర ప్రదానము ఎన్నడునూ కావింపరాదు. గుర్రము యొక్క బలి కేవలము అశ్వమేధ యజ్ఞమందు మాత్రమే కావింపవలెను!!! రాజు దిక్పాలమేధయజ్ఞ మందు మాత్రమే ఏనుగును బలి ఇవ్వవలెను. వీటి వినా ఏ యజ్ఞమందు హయ గజములను బలి ఈయరాదు. రాజు అశ్వమునకు బదులు చమరీ మృగమును బలిఈయవచ్చును.

బ్రాహ్మణుడు దేవికి సింహ, వ్యాఘ్ర, మనుష్య, లేక తన రక్తమును, మరియు మధ్యమును ఎన్నడునూ బలి యందు సమర్పింపరాదు. ఒకవేళ సమర్పించిన ఎడల ఆతడు నరకముపాలగును. ఈ లోకమున సహితము ఆయువు క్షీణించి, సుఖ సౌభాగ్యవిహీనుడగును. బ్రాహ్మణుడు తన రక్తమును దేవికి సమర్పించిన ఎడల ఆతనికి ఆత్మహత్య పాతకము చుట్టుకొనును. బ్రాహ్మణుడు మధ్యమును దేవికి సమర్పించిన ఎడల ఆతడు బ్రాహ్మణత్వము నుండి చ్యుతుడగును. క్షత్రియునకు కృష్ణసారమృగ బలి నిషిద్ధము. ఒకవేళ అట్లు సంభవించిన ఎడల ఆతనికి బ్రహ్మహత్యా దోషము చుట్టుకొనును. ఒక వేళ బ్రాహ్మణుడు, సింహ, వ్యాఘ్ర, నరబలి కావింపదలచిన ఎడల ఆతడు ఘ్రుతము, నువ్వుల పిండి కానీ, ఘ్రుతము యవల పిండిని కానీ కలిపి, దానితో పైన తెలిపిన మృగ, మానవుల బొమ్మలు చేసి, చంద్రహాసమును అభమంత్రించి, అద్దానితో ఆ బొమ్మలు ఖండించి దేవికి అర్పింపవలెను.

శంకరుడు "పుత్రులారా! ఇప్పటి వరకు సామాన్య బలులు, మరియు వాని పూజా మంత్రములు తెలిపితిని. ఇపుడు విశేష పూజా మంత్రములు తెలిపెదను. ఒకవేళ అతి ఎక్కువ బలి సమర్పణము కావింపదలచిన ఎడల, ఆ మృగములను దేవతకు ఎదురుగ యుంచి, వేర్వేరుగ వాటికి పూజనమొనర్చి అపుడు మిగిలిన విధి విధానములను కావింపవలెను. ప్రధమత: భైరవీ లేక భైరవులకు మహిషమును బలి ఈయవలెనన్న ఈ మంత్రము చే ఆ మృగమును పూజింపవలెను. మంత్రార్ధము – "ఓ! మహిషమా! నీవు అశ్వవిరోధివి. నీవు చండికను వహించెదవు. అట్లే నా శత్రువులను సంహరించి నాకు శుభములు ప్రసాదింపుము. ఓ! మహిషమా! నీవు యమునకు వాహనము మరియు శ్రేష్ఠ రూపధారివి. నీవు నాకు అవ్యయమయిన ఆయు, విత్త, యశములు ప్రసాదింపుము. ఓ! కాసరమా! నీకు నమస్కారము." ఒకవేళ ఖడ్గమృగమును బలిఈయవలెనన్న అచట జలము చే అభ్యుక్షణ గావించి, అచట ఒక గుహ యున్నదని మనసున తలంచి, ఒక మండలమును నిర్మించి, ఈ క్రింది మంత్రమును పఠించవలెను."ఓ! ఖడ్గమృగమా! నీవు దైవ, పితృ కార్యములందు శుభములు ప్రసాదించెదవు. నీవు నా విఘ్నములను ఛేదింపుము. నీకు నమస్కారము." ఇపుడు కృష్ణసార మృగబలి. ఈ క్రింది మంత్రమును పఠించవలెను. మంత్రార్ధము "ఓ! కృష్ణసారమా! నీవు బ్రహ్మరూపివి, మరియు బ్రహ్మ తేజమును ఇనుమడింపజేయుదానవు. నీవు చతుర్వేద స్వరూపివి. ఓ! బుద్ధిమంతుడా! నాకు విశేష బుద్ధి మరియు మహాయశస్సును ప్రసాదింపుము." శరభ బలి యందు ఉపయోగించు మంత్రము. మంత్రార్ధము – ఓ! శరభమా! నీవు అష్ఠ పాద ధారిణివి. నీవు కదులుచున్న, మెరయుచున్న చంద్రబింబ అంశమై జన్మనందితివి. ఓ! మహాబాహూ! నీవు అష్ఠమూర్తివయిన భైరవుడివి. నీకు నమస్కారము. నీవు ఎట్లు భైరవరూపముతో వరాహమూర్తిని సంహరించితివో, అట్లే నీ శరభ రూపము తో నా శత్రువులను, విఘ్నములను నశింపచేయవలసినది. సింహబలి. మంత్రార్ధము – ఓ! పంచాస్యమా!

నీవు సాక్షాత్ నారయణునివి. నీవు ఏ ప్రకారముగ సింహ రూపముతో చండికాదేవిని వహించెదవో అట్లే నా మంగళములను వహించి, నా శత్రువులను దునుమాడుము. సింహ స్వరూపమును ధరించి జగత్పీడకుడయిన హిరణ్యకశిపుని నీవే వధించితివి."

భేతాళ, భైరవులారా! ఇపుడు మనుష్యబలి, మరియు తన రక్త తర్పణము ద్వారా అర్చనా క్రమమును తెలిపెదను. కామరూప పీఠమందు మనుష్యబలి ఇవ్వదలచిన ఎడల ఇతఃపూర్వము తెలుపబడిన "హేరుకము" అను శ్మశానమందు కావింపవలెను. ఈ హేరుక శ్మశానము పర్వతమందలి కామాఖ్యా నివాసమందు, ఓడ్రపీఠమందు యున్నది. ఈ శ్మశానము సంపూర్ణముగ నా (శంకరుడు) స్వరూపమే!! ఈ శ్మశానము తపఃసిద్ధికై మూడు భాగములుగ విభజింపబడినది. దీని పూర్వాంగము (తూర్పు భాగము) "భైరవము" అని పిలువబడును. ఇచట తపము కావించినచో సద్యఃసిద్ధి లేక తక్షణసిద్ధి కలుగును. ఇందు సందేహము లేదు. దక్షిణ భాగము నందు భైరవీదేవికి బలిపశువు (మనిషి) శిరమును కపాలమాలాలంకృతుని గావించి అర్పింపవలెను. పశ్చిమభాగమందు రుధిరమును "హేరుకునకు" అర్పింపవలెను. మనుష్య బలి అనంతరము అర్చన దానాదికములు పీఠస్థానమయిన శ్మశానమందు చేసి, ఉద్యాపన (విసర్జన) కావించునపుడు బలిదీపమును ప్రజ్వలింపజేయవలెను. అన్య స్థానములందు మహాబలి కావించినపుడు బలిని ఒక స్థలమందు అర్పించుట, మరియొక స్థలమందు పశువును ఖండించుట, మరియొక ప్రదేశమందు అమృతరూప మస్తక ప్రదానము కావించుట, వేరొక ప్రదేశమందు రుధిరార్పణము చేయుట కావింపవలెను. సాధకుడు ఒక్కమారు బలి విసర్జన కావించిన పిదప దానివైపు మరి తిరిగి చూడరాదు.

మనుష్యబలి – ఈ బలిపశువుగ ఉపయోగపడు మానవుడు సుస్నాతుడు, దీప్తుడు (ఆరోగ్యముతో ప్రకాశించువాడు), ముందురోజునుండి మితాహారుడు, మాంసమైథునాది భోగ వర్జితుడు, చందన మాలాధారి అయి యుండవలెను. అటువంటి మనుష్యుని, ఆ దేవతల కంటె అభిన్నునిగ భావించి పూజింపవలెను. ఆతని బ్రహ్మరంధ్రమందు బ్రహ్మను, నాసిక యందు పృధివినీ, కర్ణద్వయమందు శక్తి మరియు ఆకాశమును, జిహ్వ యందు అగ్నిని, గ్రీవమందు యముని, కేశాగ్రములందు నిఋతిని, భ్రూద్వయమందు వరుణుని, నేత్రములందు విష్ణువును, లలాటమందు శంకరుని, కుడి కపోలమందు ఇంద్రుని, ఎడమ కపోలమందు అగ్నిని, నాసికామూలమందు పవనుని, భుజముల యందు కుబేరుని, హృదయమందు సర్పరాజును, పూజించి ఈ మంత్రమును పఠింపవలెను. మంత్రార్థము – ఓ! మహాభాగా! నరశ్రేష్ఠా! నీవు సర్వదేవ మయుడవు మరియు ఉత్తముడవు. నీవు పుత్ర, అమాత్య, పశు, బాంధవ, చతురంగ సేనా సహితుడైన నన్ను, శరణాగతుని రక్షింపుము. ఓ! మహాభాగా! గొప్ప తపస్సు, జ్ఞానము, మరియు యజ్ఞముల ద్వారా లభించు అమరత్వమును నీవు నాకు ప్రసాదించి, నీవు శోభాలాభము నొందుము. నీ కృపచే రాక్షసులు, పిశాచములు, భేతాళురు, సరీసృపములు, ఇతర రాజులు, శతృగణములు, నన్ను వధింపకుందురు గాక! మృత్యువు అనివార్యము. అందుచే నీవు పంచత్వము నొంది నీ కంఠము మరియు అంగముల నుండి స్రవించు రక్తధారల ద్వారా నీవు నా వృద్ధిని కల్పింపుము. ఈ విధముగ పూజించి, పూర్వము తెలుపబడిన తంత్ర పద్ధతి ద్వారా సహితము పూజింపవలెను.

ఈ విధముగ పూజింపబడిన బలిపశు రూపమయిన నరుడు నా (శంకరుడు) స్వరూపమునొంది, బ్రహ్మ మరియు ఇతర దేవతల ద్వారా దిక్పాల పదవి యందు అధిష్ఠితుడగును. ఈ విధమయిన నరబలిపశువు పాపి అయిననప్పటికీ నిష్పాపి అగును. ఈ నిష్కలుషుని రుధిరము అమృతమయి జగన్మాత, జగత్స్వరూప అయిన మహాదేవిని ప్రసన్నము కావించును. ఈ బలిపశువు అయిన నరుడు శీఘ్రముగ మరణించి, మానవ శరీరమును వదలి గణములకు స్వామియై, నా (శంకరుడు) చే అమితముగ సన్మానింపబడును. అట్లుగాక పాపయుక్తుడు, మలమూత్రాదుల చే అపరిశుద్ధుడు, ఇటువంటి పురుషుని బలిని కామాఖ్యదేవి గానీ, ఇతర దేవతలు గానీ స్వీకరింపరు గాక స్వీకరింపరు!!!

అన్య పశువుల బలియందు ఈ పశువులు సహితము పవిత్రతను సంతరించుకొనును. వాని రక్తమును కామాఖ్యాదేవి స్వీకరించును. అన్య దేవతలకు సమర్పించునపుడు, ఆ బలిని పూజింపబడు దేవత ద్వారానే ఈయవలెను. బధిరులను, అట్టలు కట్టిన శిరోజములు కలవానిని, రోగిని, దంతముల నుండి రక్తము స్రవించువానిని, నపుంసకుని, క్షీణించిన అంగములు కలవానిని, వృద్ధుని, దుర్లక్షణములు కలవానిని, బొల్లి మొదలగు చర్మ వ్యాధిగ్రస్తుని, మురగుజ్జును, మహాపాపిని, పన్నెండు వర్షములు కంటె కనిష్ఠుని, సూతకమున్న బాలురను, వికలాంగులను, గురువధ కావించిన దుర్మార్గులను, మరణ శౌచమున్నవారినీ, బలి ఇచ్చుట నిషిద్ధము. స్త్రీ బలి ఎల్లప్పుడూ నిషిద్ధము. లేని ఎడల నరకప్రాప్తి కలుగును. సామూహిక బలిదానములందు సహితము మనుష్య స్త్రీలను విడచి, పశుపక్షి సమూహములను సామూహికముగ పూజించి, వాని యందు స్త్రీ జాతి యున్ననూ బలిఈయవచ్చును. మూడు మాసముల కంటె తక్కువ వయసున్న పశువులను, మూడు పక్షముల కంటె తక్కువ వయసున్న పక్షులను సహితము కామాఖ్యకు బలిఈయరాదు. దోషయుక్తులయిన మనుష్యులు ఎట్లు బలికి వర్జితులో, అట్లే దోష యుక్తమయిన పశు పక్షులను సహితము వర్జింపవలెను. పశుపక్షులందు కూడా అవిటి, వికలాంగులు, దోషయుక్తమయిన జంతువులను, పశుపక్షులను  వర్జింపవలెను. ఛిన్న (ఛేదింపబడిన) పుచ్ఛము, ఛిన్న కర్ణములు, భగ్న దంతులు, భగ్న శృంగములు కల పశువులు బలికి వర్జితములు. రాజు ఎన్నడునూ బ్రాహ్మణుని, ఛాండాలుని బలి ఈయరాదు. రాజు యుద్ధమందు జయించిన శత్రురాజును, ఆతని పుత్రుని బలి ఈయవచ్చును. కానీ రాజు తనపుత్రునీ, సోదరుని, తండ్రిని, మిత్రులను, దేశదిమ్మరినీ, సార్థవాహులను (ప్రయాణము కావించు వర్తకులను), సోదరినీ, మేనమామను, ఇతర స్వజనులను, అజ్ఞాతమయిన (పేరు తెలియని) పశు పక్షులను సహితము బలి ఇచ్చుట వర్జితము. కానీ బలి ఇచ్చుటకు యోగ్య పశువు దొరకనపుడు గాడిద, మరియు ఒంటెను బలి పశువుగ ఉపయోగింపవచ్చును. కానీ యోగ్య  పశువులు లభించినపుడు వ్యాఘ్ర, గార్ధభ, ఒంటెల బలి నిషిద్ధము.

బలిపశువుగ ఉపయోగించు పశుపక్ష్యాదులను బలికి పూర్వమే యధావిధిగ అర్పించవలెను. తదుపరి మంత్రోచ్చారణ కావించుచూ ఆ పశువును ఛేదించి, మంత్ర సహితముగనే నాకు (శంకరుడు) నివేదింపవలెను. మనుష్య మస్తకమందలి రక్తమును దేవికి దక్షిణదిశ యందు అర్పింపవలెను. మేక యొక్క శిరో రుధిరమును దేవికి ఎడమవైపున, మహిషశిరమందలి రుధిరమును దేవికి సమ్ముఖమున, పక్షి గణముల శిరో రుధిరము దేవికి ఎడమవైపున, శరీర రుధిరము దేవికి సమ్ముఖమున నివేదింపవలెను. మాంస భక్షకులయిన పశు, పక్షి మరియు సమస్త జలచరముల మస్తకము మరియు రుధిరమును దేవికి వామ పార్శ్వమందు (ఎడమవైపు) నివేదించవలెను. కృష్ణసారమృగము, కూర్మము (తాబేలు), కుందేలు, మొసలి మరియు మత్స్యముల రుధిరము దేవికి సమక్షముననే యుంచి అర్పింపవలెను. సింహము మరియు ఖడ్గమృగము యొక్క రుధిరము దేవి యొక్క కుడివైపు యుంచి సమర్పింపరాదు. నైవేద్యము కుడి, ఎడమ లేక ఎదురుగ (సమ్ముఖమున) యుంచవచ్చును. కానీ వెనుకవైపు ఎన్నడునూ సమర్పింపరాదు. దీపము కుడివైపు యుండవలెను. ఎడమవైపు లేక సమ్ముఖమున యుండరాదు. ధూపము ఎడమవైపు లేక సమ్ముఖమున అర్పింపవలెను. ఎన్నడు కుడివైపు యుండరాదు. గంధ, పుష్ప, భూషణములు, ఎల్లప్పుడు ఎదురుగనే సమర్పింపవలెను. ఒకవేళ మండలమందు పూజ జరుగుచున్న ఎడల, అపుడు అద్దాని మధ్య భాగమున గంధ, పుష్ప, భూషణములు అర్పింపవలెను. మిగిలిన వస్తువులన్నియు కుడి ఎడమల పైన వివరించిన రీతిని యుంచి అర్పింపవలెను. మదిర వెనుకవైపు నుండి అర్పింపవలెను. ఇతర పానీయములు ఎడమవైపు అర్పింపవలెను. ఎక్కడ మదిర ప్రదానము ఉచితమో లేక విహితమో, అచట బ్రాహ్మణుడు కాంస్య పాత్ర యందు నారికేళ జలము కానీ, మధువు (పుష్ప మకరందము) ను గానీ తీసికొని, అద్దానిని మదిరా స్థానమందు అర్పింపవచ్చు. ఆపదల సమయమందు సహితము బ్రాహ్మణుడు మదిర అర్పణము కావింపరాదు. ఈ స్థానమందు పుష్పాసవము (పుష్ప మకరందము) లేక వృక్షముల నుండి స్రవించు మధువును గానీ అర్పించవచ్చును.

రాజు యొక్క అనుమతి లేకుండా నరబలి కావించిన వ్యక్తి పాపగ్రస్థుడగును. కానీ ఏదేని ఉపద్రవము సంభవించిన వేళ, లేక యుద్ధకాలమందు ఎవరేని రాచకార్యములు ఆచరించు వ్యక్తి ఇచ్ఛా పూర్వకముగ నరబలి కావింపవచ్చు. ఇతరులెవ్వరు నరబలి కావించుటకు అర్హులు కారు. బలిదానమునకు ముందురోజు బలిప్రదాత బలిపశువు అయిన మనుష్యుని "మానస్తోకే తనవే" మంత్రము ద్వారా, మరియు సూక్త త్రయము, మరియు "గంధద్వారా దురాదర్శా" మంత్రముల చే ఆతని మస్తకముపై ఖడ్గము నుంచి, ఖడ్గముపై గంధాదులు యుంచి బలిని ఆవాహన చేయవలెను. తరువాత ఖడ్గహస్తుడైన మనిషి, గంధాదులను బలిపశువైన మానవుని కంఠముపై "అంబే, అంబికే" ఇత్యాది మంత్రములు, రౌద్ర మంత్రములు లేక భైరవ మంత్రములు పఠించుచూ అర్పింపవలెను. ఈ విధముగ సంస్కృతుడయిన బలిపశువు (మానవుని) ను దేవి బలికై రక్షించును. దాని వలన ఆ రాత్రి బలిపశువయిన మానవునకు ఏ విధమయిన రుగ్మత, క్షీణత రావు. అంతేకాక ఏ విధమయిన మారణ శౌచము, జ్ఞాతి లేక జనన శౌచము ఆతనిని అంటవు.

బలి కాలమందు ఛేదింపబడిన మానవుని శిరస్సు ఎక్కడపడినచో ఏ విధమయిన శుభాశుభ ఫలితముల నిచ్చునో అవి తెలిపెదను. వినుడు. ఖండిత శిరము ఈశాన్యము లేక నైఋతి కోణమందు పడిన ఎడల రాజ్యహాని లేక రాజు యొక్క వినాశము సంభవించును. శిరము తూర్పున పడిన సంపద, ఆగ్నేయమున పుష్టి, దక్షిణమున భయము, పశ్చిమమున పుత్రలాభము, వాయువ్యమున ధనలాభము కలుగును. మహిషము యొక్క ఖండితశిరము యొక్క ఫలితములు – ఉత్తరమున భాగ్యము, ఈశాన్యమున హాని, తూర్పున ఐశ్వర్యము, ఆగ్నేయమున విత్తము, దక్షిణమున రిపుంజయత్వము (శత్రువులను జయించుట), నైఋతిని భయము, పశ్చిమమున రాజ్యలాభము, వాయువ్యమున శ్రీలాభము కలుగును. అన్ని పశువులకు మేకలు మొదలగు పశువులకు సహితము ఫలితములివే! నీటి నుండి పుట్టిన జంతువులు, మరియు పక్షిగణముల ఖండిత శిరము పడుటచే కలుగు ఫలితములు – దక్షిణ దిశ యందు లేక ఆగ్నేయ కోణమందు శిరము పడిన ఎడల భయము కలుగును. మిగిలిన అన్ని దిశలయందు శ్రీలాభము కలుగును. మనుష్యులు, పశువులు, పక్షులు, మరియు మొసలి మొదలగు జంతువుల శిరము ఖండింపబడినపుడు దంతములు పటపటమని కొరికిన ఎడల అపుడు రోగోత్పత్తి జరుగును. ఆ సమయమున వాని కండ్లనుండి నీరు కారిన ఎడల రాజ్యహాని కారకములగు సంఘటనలు జరుగును. మహిషము యొక్క ఖండిత శిరము నుండి కన్నీరు కారిన ఎడల శత్రురాజులకు మృత్యువు ప్రాప్తించును. ఇతర బలి పశువుల శిరము నుండి కన్నీరు కారిన ఎడల అయ్యది అతిశయ భయము, పీడ ప్రాప్తించునను సూచకము. నరబలి యందు ఖండిత శిరము హాస్యము నొలికించినచో అపుడు శత్రుక్షయమగును. అంతేకాక బలిదాతకు సర్వదా లక్ష్మీసిద్ధి, ఆయుర్వృద్ధి కలుగును. ఇందు సందేహము లేదు. నరబలి యందలి ఖండిత శిరము ఏదేని వాక్యము పలికిన ఎడల అయ్యది శీఘ్రముగ జరిగి తీరును. ఒకవేళ ఆ శిరము హుంకారము కావించిన ఎడల రాజ్యహాని, శ్లేష్మస్రావము అయిన ఎడల బలిదాత యొక్క మృత్యువు సంభవించును. ఆ శిరము దేవతా నామము ఉచ్చరించిన ఎడల బలిదాత ఆరు మాసముల లోనే అతులైశ్వర్య లాభము నొందును.

రుధిర ప్రదాన సమయమందు ఖండిత బలిపశువు, (నరబలి) శరీరము నుండి మూలమూత్రములు, విసర్జించిన ఎడల అపుడు బలిదాత యొక్క మృత్యువు నిశ్చయము. ఖండిత శరీరము యొక్క ఎడమ కాలు కంపించిన ఎడల మహారోగోత్పత్తి, కుడికాలు కంపించిన ఎడల శుభములు ప్రాప్తించును. సాధకుడు మహిషము లేక మనుష్యుడు, లేక బలి ఈయబడిన ఏ జంతువు రక్తమునైననూ తన మధ్య మరియు ఉంగరపువ్రేళ్ళతో తీసికొని మహా కౌశిక మంత్రము పఠించుచూ తూర్పు నుండి నైఋతి కోణము వరకు పూతనాది దేవతలనుద్దేశ్యించి నేలపై బలి రూపమున సమర్పింపవలెను. అయిదు సంవత్సరముల మహిషమును కానీ, ఇరువది అయిదు సంవత్సరముల మనుష్యుని గానీ బలిఈయవలెను. వారి రక్తము మాత్రమే ఐశ్వర్య దాయకమగును. కౌశికీ మంత్రము – "ఓం ఐం క్లీం కౌశిక్యై నమ:" ఓం ఐం హ్రీం క్లీం

చాముండాయై విచ్చై ఐం క్లీం కౌశిక్యై స్వాహా" "ద్విర్మాసిక్ కౌశికీ ఏష బలి స్వాహా." ఏ నరుని బలి ఇచ్చుచున్నామో ఆ నరుని రక్తము సహితము బలిగా ఈయవలెను. రాజు పైన తెలిపిన కౌశికీ మంత్రము పఠించుచూ ఖడ్గమును అభిమంత్రించి శత్రువును కానీ, మహిషము లేక మేకను శత్రువు పేరు మీదుగా బలిఈయవలెను. తొలుత ఈ మంత్రము పఠించుచూ బలి పశువు యొక్క మస్తకమును మూడు మార్లు సూత్రముతో (దారము) కట్టవలెను. తదనంతరము బలి పశువు యొక్క శరీర ఛేదనము కావించి ప్రయత్నపూర్వకముగ అద్దాని శిరమును దేవతకు అర్పింపవలెను. ఎప్పుడెప్పుడు శత్రువృద్ధి కలుగునో, అప్పుడప్పుడు బలిపశువు నందు శత్రువు యొక్క ప్రాణ ప్రతిష్ఠ కావించి తదుపరి శిరచ్ఛేదము కావించి బలిఈయవలెను. ఈ విధముగ కావించిన ఎడల శత్రుక్షయమగును. తొలుత "విరుద్ధ రూపిణి చండికే వైరిణంత్వం ఖాదయస్య స్వాహా" ఇది ఖడ్గమంత్రము. మంత్రార్థము – "ఈ శత్రువు సదా నన్ను ద్వేషించుచున్నాడు. ఓ! మహామారీ! ఇపుడు పశురూపధారి అయిన ఆతని వినాశము కావింపుము" అని తెలిపి "స్రేం స్రేం ఖాదయ ఖాదయ" అని మంత్రోచ్చారణ కావించి మస్తకమందు పుష్పార్పణ మొనరించి, దేవికి అర్పించి ఆ బలి పశువు రుధిరమును ద్వయక్షర మంత్రము తో దేవికి సమర్పింపవలెను. శరదృతువు నందలి మహర్నవమి నాడు ఈ విధముగ బలి ప్రదానము కావించి, ఎనిమిది అంగముల నుండి ఉత్పన్నమయిన మాంసమును దుర్గా తంత్ర మంత్రముల చే పవిత్రము కావించి, అగ్ని యందు విధి విధానముగ హోమము కావించిన ఎడల తప్పక శత్రునాశనము జరుగును.

పుత్రులారా! సాధకుడు తన రక్తమును సమర్పించదలచిన ఎడల ఎట్టి పరిస్థితుల యందును నాభికి క్రింది భాగము నుండి కానీ, ఉదరము నుండి కానీ రక్తదానము కావింపరాదు. పెదవులు, చిబుకము, బాహ్యేంద్రియముల నుండి రక్తము సమర్పింపరాదు. కంఠము, నాభి, అరచేతులను వదలి బాహు ద్వయము నుండి రక్తము నీయవచ్చు. రక్తదానము చేయునపుడు కఠినముగ ఆఘాతము కావించుకొనరాదు. కేవలము నెమ్మదిగ కోసి, అద్దానిచే స్రవించు రక్తమును ప్రదానము కావింపవలెను. సాధకుడు గండస్థలము, లలాటము, భ్రూమధ్యము, కర్ణాగ్రములు, బాహుద్వయము, స్థనద్వయము, కంఠముక్రింద, నాభికిపైన, వక్షము పార్శ్వముల నుండి, రక్తదానము చేయవచ్చు. కానీ ముఖము, గడ్డము, రోగయుక్త అంగములు, గుల్ఫము, అన్యులచే కావింపబడిన గాయముల నుండి స్రవించు రుధిరమును దానము చేయట వర్జితము. సాధకుడు పవిత్రుడై, శ్రద్ధాపూర్ణమయిన మనసుతో, తనపై తాను నెమ్మదిగ గాయము చేసికొని, దానినుండి స్రవించు రుధిరమును కమల దళముల దొన్నెయందు కానీ, స్వర్ణ లేక కాంస్య పాత్ర యందు కానీ యుంచి, పూర్వము తెలుపబడిన మంత్రోచ్చారణ కావించుచూ దేవికి రుధిర ప్రదానము కావింపవలెను. కత్తి, ఛురిక, ఖడ్గము, శంఖము మొదలగు శస్త్రములను ఈ ప్రక్రియకు ఉపయోగింపవచ్చును. ఈ శస్త్రములందు ఎంత పెద్ద శస్త్రము ఉపయోగించిన అంత లాభము కలుగును. ఒక కమలదళమందు ఎంత రక్తము పట్టునో అంతకు నాలుగు రెట్లు రక్తము కంటె ఎక్కువ సమర్పణ చేయరాదు. అంతకంటె ఎక్కువ అంగచ్ఛేదము కావింపరాదు.

ఏ మానవుడు తన వక్షస్థలము నుండి ఒక తల (నువ్వుగింజ) లేక మినుము, లేక పెసర గింజ ప్రమాణ మాంసమును భక్తి పూర్వకముగ దేవికి సమర్పించిన ఎడల, వాని సమస్త కామనలు ఆరు మాసముల లోపల సిద్ధించును. ఎవరేని సాధకుడు తైలపాత్ర లేకుండ దీపమును తన బాహు ద్వయమందు కానీ, భుజద్వయమందు కానీ, వక్షస్థలమందు కానీ వెలిగించి దేవికి నివేదించిన ఎడల అద్దాని ఫలితమును తెలిపెదను. వినుడు. ఆతడు మూడు కల్పములు దేవి యొక్క గృహమందు భోగములనుభవించి, తదుపరి భూమండలమున సార్వభౌముని జన్మనొందును. ఏ సాధకుడు ఖండిత మహిష శిరముపై దీపమునుంచి, ఆ శిరమును తన హస్తముల యందు నిడుకొని దేవి ఎదుట ఒక రాత్రింబవళ్ళు నిలుచొని యున్నచో, ఆతడు ఇహలోకమందు చిరావుయై పవిత్రుడై నా (శంకరుడు) గృహము చేరి గణాధిపత్యము నొంది సకల భోగములు అనుభవించును. సాధకుడు కుడి చేతి యందు బలి ఈయబడిన మనుష్య

శిరమును, ఎడల చేతి యందు రుధిరమును పాత్రయందు పట్టుకొని రాత్రి అంతయు దేవి ఎదుట “హే మహామాయే జగన్నాధే హే సర్వకామప్రదే” అను మంత్రము స్మరించుచూ జాగరణ చేసిన ఎడల, అతడు ఇహలోకము నందు మహారాజై దేహాంతమున నా (శంకరుడు) లోకమును ప్రాప్తించును. బుద్ధిమంతుడయిన మానవుడు ఈ మంత్రము పఠించుచూ స్వదేహ రుధిరమును సమర్పణ కావింపవలెను. మంత్రార్ధము – నేను నా స్వదేహ రుధిరమును అర్పించుచున్నాను. మీరు నా యందు ప్రసన్నులై వరము నీయవలసినది.”

ఇపుడు స్వమాంస దాన మంత్రము. మంత్రార్ధము – ఓ! ఈశ్వరీ! నేను ఐశ్వర్య (ఏ విభూతి ఐననూ) లాభార్ధము సత్యరక్షణ కావించుచూ నా దేహ మాంసమును అర్పించుచున్నాను. ఈ సత్యరక్షణ ద్వారా దేవీ! నాకు నిర్వాణము ప్రసాదింపవలసినది. “హం హం నమో నమ:” ఈ మంత్రముల ద్వారా సాధకుడు తన దేహ మాంసమును సమర్పింపవలెను. తదుపరి

**సౌభాగ్యం సుఖ సంపన్నం ప్రదీపం పరమం రుచి:**
**దీపయో మాంస మిహతం దీపం హ్రౌం హ్రౌం నమోనమ: ॥**

ఈ మంత్రము పఠించుచూ శరత్కాల మహర్నవమి నాటి రాత్రి సాధకుడు స్కంధ, విశాకుల నిమిత్తము దీపదానము కావింపవలెను. యవ చూర్ణముతో కానీ, మృత్తికతో కానీ, శత్రు ప్రతిమ చేసి, మంత్రోచ్ఛారణ సలిపి, ఆ ప్రతిమకు శిరశ్ఛేదము కావించి బలిప్రదానము కావింపవలెను. తదుపరి ఈ క్రింది మంత్రముచే ఖడ్గమును అభిమంత్రింపవలెను – “రక్తం కిలికిలీ ఘోరఘోర ధార విహింసక: భ్రహ్మ శిష్యాంబికా శిష్యా అముకంచారి సత్తమమ్: హ: హం.” అముకం అన్నచోట శత్రువు నామము పలుకవలెను. లేదా “మ:మం క్ర: క్రం ఫట్.” ఈ మంత్రముతో స్కంధ విశాఖులకు బలిఈయవలెను. శత్రురాజు యొక్క ప్రతిమకు ఎర్రని పదార్ధము (కుంకుమ) లేపనము చేసి, లలాటమందు రక్తచందనమలది, ప్రతిమ యొక్క కంఠమును రక్త సూత్రము (ఎర్రదారము) తో చుట్టి, నాభి యందు శల్యము తో పొడిచి, ప్రతిమను ఉత్తరమునకు త్రిప్పి, భుజముల సహిత శిరమును ఖడ్గముతో ఖండించి, స్కంధ మంత్రము తో అభిమంత్రించి, ఆ శిరమును దేవికి అర్పించవలెను. స్కంధుని మూల మంత్రము “హ్రౌం”. ఈ మూల మంత్రముల నుచ్ఛరించుచూ స్కంధ విశాఖులకు బలి ప్రదానము కావింపవలెను. స్కంధ విశాకుల ధ్యానము – ఈ మూర్తులు ముడివడిన భృకుటి గల నేత్రములు కలవారు, కృష్ణపింగళ వర్ణులు, మరియు రక్తవస్త్రధారులు. చతుర్భుజులు. కుడివైపు ఒక చేతి యందు త్రిశూలము, మరియొక చేతియందు కరవాలము కలిగి, ఎడమ వైపు ఒక చేతియందు నృకపాలము (మానవ కపాలము), వేరొక చేతి యందు కత్తెర ధరించెదరు. వీరిరువురు త్రినేత్రులు. గళమందు కపాలమాలాలంకృతులు. ఇరువురు భీషణులై, వికట దంష్ట్రులై యుందురు. వీరిరువురు గణాధిపులు మరియు ద్వారపాలురు. వీరిరువురినీ వీరు సదా దేవి ఎదురుగ ఉపస్థితులై యుండిరని ధ్యానింపవలెను.

చైత్రమాస కృష్ణపక్ష చతుర్దశినాడు మహిషము, మేక, గొర్రె, మధువు, మత్స్యములతో భైరవరూపుడనైన నన్ను (శంకరుని) ప్రసన్నము కావింపవలసినది. అద్దానిచే నేను సంతుష్టుడనగుదును. చండిక ప్రసన్నార్ధము బలి యందు బలిపశువు యొక్క మస్తకమును జలాభిషేకము చేసి మూలమంత్రము ద్వారా అర్పింపవలెను. ఇంతవరకు పూజింపబడి, ఇంకనూ కొంచెము ప్రాణముండిన ఖండిత శిరమును సాధకుడు సిద్ధభావప్రాప్తికై వీక్షించుచూ ఈ మంత్రము పఠింపవలెను.

**సితప్రేతో రథస్థేషాం యోగ పీఠస్య సన్నిభః**

**ధ్యాయామ్యాస్మిన్ మాహామాయే సిద్ధిం బోధయితే నమః ॥**

మంత్రార్ధము – యోగ పీఠ సమీపమున శ్వేత ప్రేత రథముపై విరాజమానమయిన మహామాయా! నేను మిమ్ము ధ్యానించుచున్నాను. మీరు నాకు సిద్ధిని తెలుపవలసినది. మీకు నమస్కారము. ఈ శ్లోకము పఠించిన మీదట శిరము కంపింపని ఎడల కార్యసిద్ధి కలగినదని తెలియవలెను. ఒకవేళ శిరము కంపించిన ఎడల కార్యసిద్ధి కలుగలేదని నిదర్శనము. ఎవరేని ధీరుడయిన సాధకుడు ఈ తెలుపబడిన విధి విధానములచే బలిదానము సలిపిన ఎడల చతుర్విధ పురుషార్ధములు లభించును. ఇందు సంశయము లేదు. ఈ ప్రకారముగ రుధిరాధ్యాయము నందు బలిదానము యొక్క రూపము, క్రమము మీకు వివరించితిని. ఇపుడు మీరిరువురు పూజోపచారముల గూర్చి వినవలసినది.

**(శ్రీ కాళికా పురాణము నందలి రుధిరాధ్యాయము, బలిదానము అను అరువది ఏడవ అధ్యాయము సమాప్తము)**

# అరువది ఎనిమిదవ అధ్యాయము

**(షోడశోపచారములందు ఆసనాది ఆరు ఉపచారముల వర్ణనము)**

భగవానుడు చెప్పదొడంగెను "భేతాళ, భైరవులారా! ఇపుడు షోడశోపచారముల గూర్చి తెలిపెదను. ఈ ఉపచారములను సభక్తియతముగ, సవిధి విధానముగ అర్పించిన ఎడల దేవియు, అన్యదేవతలు సహితము సంతుష్టులగుదురు. దేవత ఆసన ప్రదానము మండలమునకు ఉత్తరమున కావింపవలెను. ఈ ఆసనము పుష్పములు, లేక కఱ్ఱ (కాష్ఠము), లేక వస్త్రము లేక చర్మము, లేక కుశలతో చేయవలెను. ఆసనమును పుష్ప లేక జలసహితముగ అర్పింపదలచిన ఎడల, అద్దానిని మండలమందలి పద్మమునందు అర్పింపవలెను. ఆసనమును పుష్ప రహితముగ అర్పించిన ఎడల ఆ ఆసనమును మండలపు వెలుపలి ద్వారము వద్ద నివేదింపవలెను. మండల పూజనమందు అర్ఘ్యము, పాద్యము, ఆచమనము, స్నానము నేత్రాంజనము, మధుపర్కము, గంధ పుష్పములు, పద్మము నివేదింపవలెను. ప్రతిమా పూజనమందు శరీరముపై అలదుకొను యధోచిత అంగరాగములు సహితము అర్పింపవలెను. నైవేద్యాదులు దేవి యొక్క సమ్ముఖమున నివేదింపవలెను. పుష్పాసవము అర్పించుట విహితమయిన ఎడల, అద్దానిని పద్మమందు అర్పింపవలెను. (పుష్పాసవము = పుష్పముల నుండి తీయబడిన మధువు. ఇది తేనె కాదు. దీనిని అర్పించుట అందరి దేవతలకు విహితము కాదు). ఒకవేళ ఆసనము పెద్దదయిన ఎడల, అద్దానిని మండల ద్వారము వద్ద అర్పింపవలెను."

భైరవా! ఆసనము పుష్పము, పుష్పసమూహాములు, కుశలు, లేక సూత్రము చే చేయబడిన ఎడల అయ్యది దేవికి, నాకు (శంకరుడు), అన్యదేవతలకు సహితము అత్యంత ప్రియము. సాధకులకు నాలుగు విధములయిన ఆసనములు తెలుపబడినవి. అవి కాష్ఠ, వస్త్ర, చర్మ, తైజసములు. ఆసనము యజ్ఞ కాష్ఠముతో నిర్మితమయినచో అయ్యది కంటక రహితయై, నున్ననై, శుభము, కోమలము, అత్యంత ఎత్తు లేక పల్లము కాకుండ, అతి చిన్నది లేక అతి విశాలము కాకుండ యుండవలెను. కంటక సహితము, పాలుకారునది, ఘాత సహితము, స్మశానము మరియు నాలుగు రహదారుల కూడలి యందలి కాష్ఠములను, విభీతక వృక్షము (తాని కాయ) కాష్ఠములను తప్పక వర్జింపవలెను. వస్త్రము తో చేయబడిన ఆసనము నాలుగు విధములు. అవి వల్కలము (చెట్టు బెరడు), పట్టు, లినెన్ (అవిశ ఆకునుండి తీయబడిన దారముతో నేయబడినది), లేక రోమములతో నేయబడినది (రగ్గు లేక కంబళి). వస్త్రాసనములందు కంబళాసనములు

ప్రసస్థము మరియు దేవతా ప్రియము. సింహము, వ్యాఘ్రము, తరక్షు (చిరుతపులి), మేక, పొట్టేలు, మహిషము, ఏనుగు, గుర్రము, కృష్ణజింక మొదలగు తొమ్మిది రకముల పశుచర్మముల ఆసనములు దేవతలకు ప్రియము. జింకల యందు సహితము అయిదు రకములు కలవు. అవి "ఖడగ్, రురు, పృషత్, మృగ, ఋష్యము", అనునవి. ఈ జింక (లేడి) బలి ప్రదానమునకు మరియు చర్మాసనమునకు సహితము ప్రసస్థము. చర్మాసనముల యందు జింక చర్మములు, కాష్ఠాసనములందు చందన కాష్ఠము ప్రసస్థము. సర్వ దేవతలకు, ఋషులకు, నియతాత్ములు అయిన మహానుభావులకు కుశాశనమే సర్వ శ్రేష్ఠము. ఇయ్యది యోగపీఠ సమానము. లోహములందు ఇనుము, కాంస్యము, సీసము లేక మరి ఏ ఇతర మెరయుచున్న లోహమయిననూ ఆసనమునకు ప్రసస్థము. భక్తి మరియు ముక్తికి శిల, మణి, లేక రత్నమయ ఆసనములు వర్జింపవలెను. అవి భోగహేతువులు. ఆసన ప్రదానము కావించుట చే సాధకుడు సౌభాగ్యమును, ముక్తిని ప్రాప్తించును. భైరవా! మీకు ప్రసస్థ ఆసనముల గూర్చి తెలిపితిని. ఈ ఆసనములు ఉపయోగించు సాధకునకు సర్వ సిద్ధులు సిద్ధించును.

పూర్వము దేవగణార్ధము ఏ ఆసనములు తెలుపబడినవో అవే ఆసనములను సాధకుడు ఉపయోగింపవలెను. సాధకుడు పూజాదికములందు తనకు ఇచ్చవచ్చిన ఆసనములయందు కూర్చొనరాదు. అందువలననే పండిత గణములు కాష్ఠాది అన్యాసనములను సహితము అనుమతించిరి. కాష్ఠాసనము ఇరువది నాలుగు అంగుళముల పొడవు, పదహారు అంగుళముల వెడల్పు మరియు నాలుగు అంగుళముల ఎత్తు యుండవలెను. ఎత్తు నాలుగు అంగుళముల కంటె ఎత్తు యుండరాదు. పూజాదికముల యందు ఏ ఆసనములు వర్జనీయములని తెలుపబడినవో, వానిని నిశ్చయముగ విడువవలెను. వస్త్రాసనము రెండు అడుగుల పొడవు, అర అడుగు వెడల్పు యుండి మూడు అంగుళముల కంటె ఎత్తు యుండరాదు. మహామాయ యొక్క పూజార్ధము కంబళి, శైలాసనము లేక చర్మాసనమును ఉపయోగించుట మేలు. ఈ పూజావిధికి ఇవి ప్రసస్తము. త్రిపుర లేక విష్ణు పూజకు కుశాశనము ప్రసస్థము. అతిదీర్ఘము, అతి విస్తృతము, అతి ఉచ్చము అయిన కాష్ఠమరియు శిలలపై జరుపబడు కర్మము భూమిపై జరుగునట్లే అని భావింపవలెను.

వివిధ ఆసనముల వ్యవస్థ ఎల్లప్పుడూ మండలమునకు లేక మండల ద్వారమునకు బయటనే ఒనర్చవలెను. ఏనుగు దంతములు మినహా వేరొక ఏ ప్రాణి యొక్క ఏ విధమయిన శల్యములను ఆసనమును నిర్మించుటకు ఉపయుక్త మొనరింపరాదు. కామ్య పూజనమునకు ఏనుగు దంతములతో చేయబడిన ఆసనమును గ్రహింపవచ్చును. పూర్వము తెలిపినట్లు కస్తూరిమృగ చర్మమును సహితము ఆసనముగ గ్రహింపవచ్చు. ఒకవేళ జలములందు పూజ మొనర్చవలెనన్న, ఆసనము నందు కూర్చొని మాత్రమే పూజింపవలెను. జలములందు కాష్ఠము, లేక లోహాదులతో చేయబడిన ఆసనములు వాడరాదు. ఒకవేళ జలములందు ఆసనము అసంభవము అయిన ఎడల, అపుడు కేవలము మనసునందే ఒక ఉజ్వల ఆసనము కల్పించుకొని పూజనమొనర్చవలెను. జలములందు కానీ, ఏ విధమయిన ఆసనములు లభింపనపుడు కానీ, అటువంటి పరిస్థితుల యందు నిలుచుని పూజ కావింపవచ్చును. ఇయ్యది ఆసనముల గూర్చి సంపూర్ణ వివరణ.

ఇపుడు పాద్యము. భేతాళ; భైరవులారా! పాద ప్రక్షాళణా జలమే పాద్యము. ఇది కేవలము జలము. దీనిని మెరయుచున్న లోహ పాత్ర యందుకానీ, లేక శంఖము నందు కానీ యుంచి, అపుడు పాద ప్రక్షాళణార్ధము ప్రదానము కావింపవలెను. పాద్యము ధర్మార్ధకామమోక్ష చతుర్విధ ఫల పురుషార్ధ సాధకము. ఆసనము సమర్పించిన మీదట మూల మంత్రోచ్ఛారణ గావించుచూ పాద్య సమర్పణ కావింపవలెను. ఇపుడు అర్ఘ్యము: అర్ఘ్య జలమందు కుశలు, పుష్పములు, అక్షతలు, చందనము, సుగంధ పదార్ధములు, సిద్ధ కామనతో అర్ఘ్య ప్రదానము కావింపవలెను. అర్ఘ్యము తో కామనలు పూర్ణమగును. అర్ఘ్యము చే ధనలాభము, పుత్రసంతతి, సుఖము, ఆయువు లభించి చివరకు మోక్షము సహితము కరతలామలకమగును. భాస్కరునకు శంఖ జలముతోనూ, విష్ణువునకు ఆలుచిప్పల పాత్రతోనూ, ఎట్టి పరిస్థితుల యందు

అర్ఘ్య మీయరాదు. ఆచమనము ఎల్లప్పుడూ సుగంధభరితమయిన శుభజలము చే మాత్రమే కావింపవలెను. ఆచమన జలము నిర్మలమై, కృష్ణాగరు ధూప ధూపితమై, నురుగు లేకుండా యుండవలెను. ఈ ఆచమన జలమును శంఖమందు కానీ, మెరయుచున్న లోహ పాత్ర యందు కానీ యుంచవలెను. దేవతార్చన యందు ఎప్పుడూ నురుగు లేని జలము మాత్రమే ఆచమనము చేయవలెను. ఏ జలము నురగరహితయై, స్వచ్ఛమై, దేవతల కర్పింపబడునో, అద్దానినే ఆచమనమని పిలువవలెను. దేవతలకు శుద్ధ జలము కానీ, పెరుగన్నము కానీ సమర్పింపవలెను. ఆచమన జలము స్వచ్ఛ జలము కానీ, సుగంధ జలము కానీ అయియుండవచ్చు. సాధకుడు నిత్యము ఆచమనము అర్పించిన ఎడల ఆతనికి బల, ఆయువు, యశోవృద్ధి కలిగి కామనాలాభము కలుగును.

మధుపర్కము – "పెరుగు, నేయి, జలము, తేనె, చక్కెర", ఈ పంచద్రవ్య మిశ్రమము నే మధురపర్కమందురు. మధుపర్క ప్రదానముచే దేవతలు ప్రసన్నమగుదురు. ఇందు జలము అతి తక్కువగనూ, పెరుగు, నేయి, చక్కెర సమానము గనూ యుండి తేనె అత్యధికముగ యుండవలెను. ఈ విధముగ కలుపుట అత్యావశ్యకము. ఈ మధుపర్కము జ్యోతిష్టోమము, అశ్వమేధము, ఇష్టా పూర్తములు మరియు పూజాదికములందు కాంస్య, స్వర్ణ, లేక రజత పాత్రయందుంచి, దానిని దేవతలకు అర్పించిన ఎడల దేవగణములు సంతుష్టి నొందెదరు. మధుపర్కము సౌఖ్య, భోగ, తుష్టి, పుష్టి ప్రదాయకము, మరియు చతుర్విధ పురుషార్ధ సాధకము. స్నానము – నీటి యందు సుగంధ యుక్త చూర్ణము, కస్తూరి, పసుపు, కుంకుమ, బెల్లము, తేనె, పంచగవ్యములు, సర్వౌషధములు, నిర్ణేజనము (సబ్బు), స్నిగ్ధ తైలము, తిలలు, ఈ మిశ్రమమంతయు కలిపిన ఎడల అయ్యది స్నానయోగ్య జలమగును. స్వర్ణము లేక రత్నములను ఈ స్నానీయజలములందుంచి, అద్దానిని ధాతు లేక కాంస్య, లేక శంఖమందుంచి దేవతకు నివేదింపవలెను. ఈ స్నానీయ జలమును మండలమందలి పద్మకేసరముల పై కానీ, సూర్యుని ప్రతిమ పై కానీ, శివలింగము పైన లేక సర్పము యొక్క పీఠమందు కానీ, లేక దేవత యొక్క శరీరముపై నివేదింప (పోయ)వలెను. ఒకవేళ ప్రతిష్ఠిత ప్రతిమ అత్యంత కోమలము కానీ, మృణ్మయము కానీ, నేయి మరియు సింధూర మిశ్రమము కానీ, శ్రీ చందనము తో చేయబడినది కానీ అయిన ఎడల అపుడు స్నానీయజలమును కేవలము ప్రతిమ యొక్క శరీరముపై పూతవలె పూయవలెను. కానీ దేవత ప్రతిమ యందు లేక స్వస్తిక, ఖడ్గ, దర్పణములందుయున్నచో స్నాన జలముచే స్నానము చేయించవచ్చు. దర్పణము నందు దేవి యొక్క ప్రతిబింబమునకు స్నానమాచరింపవచ్చు. మహాదేవి మరియు విశేషించి త్రిమూర్తులకు ఈ విధముగ స్నానమాచరింపవలెను. సాధకుడు విధి విధానముగ స్నానమాచరింప జేసిన ఎడల అయ్యది చిరాయువును, మరియు అనేక అత్యంత కల్పాంత పర్యంతము స్వర్గలోక నివాసము ప్రసాదించును.

అర్ఘ్య పాత్రను అమృతీకరణము కావించిన పిదప దేవతకు అభిషేకము చేసి పాద్యము, గంధము, ధూపదీపములు, మొదలగు ఉపచారములు అర్పించిన ఎడల, ఇష్టదేవత ఆ ఉపచారములను స్వయముగ స్వీకరించును. అట్లు కావించని ఎడల ఆ ఉపచారములు నిష్ఫలమగును. మోహ, లోభ, రోగ, ప్రమాద కారణమున అమృతీకరించిన జలము పూర్తిగా పడిపోయిన ఎడల, తిరిగి అర్ఘ్యపాత్ర యందు జలము స్వీకరించి తిరిగి అమృతీకరణము కావింపవలెను. కానీ అర్ఘ్యపాత్రయందు కొంచెము జలము ఒలకక మిగిలియున్న, అపుడు ఆ పాత్ర యందు అదనపు జలము కూర్చిన ఎడల అయ్యది తిరిగి అమృత జలమగును. తిరిగి అమృతీకరణము కావింపనవసరము లేదు. పుష్పములు లేక పుష్పమాల అధికముగ యున్న ఎడల వాటిపై అమృతీకరించిన జలము ప్రోక్షణ చేసి ఆ పుష్పమాలను అర్పింపవచ్చును. అమృతీకరించిన అర్ఘ్యపాత్ర మినహా వేరొక జలము వేయి విధములుగ అర్పించినప్పటికీ, దేవతలు ఆ జలమును స్వీకరింపరు. తొమ్మిది రకముల ప్రతిపత్తుల ద్వారా అర్ఘ్యపాత్ర సంస్కరింపబడును. ఇట్లు సంస్కరింపబడిన అర్ఘ్య పాత్ర యందు సర్వ తీర్థములు, అమృతము ఉపస్థితమై యుండును. పూజా సామాగ్రి నంతటినీ అర్ఘ్య పాత్ర యందలి జలముల చే ప్రోక్షణ కావింపవలెను.

ఏ వస్తువులను అర్ఘ్య పాత్ర యందే నివేదింపవలెనో వాటిని అట్లే నివేదింపవలెను. భేతాళ, భైరవులారా! మీకు అర్ఘ్య పాద్యాది ఆరు ఉపచారముల గూర్చి తెలిపితిని. ఇపుడు జ్ఞాన వృద్ధికై వస్త్రాది దశ ఉపచారముల గూర్చి తెలిపెదను.

**(శ్రీ కాళికా పురాణమందలి షోడశోపచారములందలి ఆసనాది ఆరు ఉపచారముల వర్ణనమను అరువది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము)**

# అరువది తొమ్మిదవ అధ్యాయము

**(వస్త్రాది ఉపచారముల వర్ణన)**

భగవానుడు తిరిగి చెప్పదొడంగెను, “నాలుగు రకములయిన వస్త్రములను దేవతలకు ప్రదానము చేయవచ్చును. అవి “నూలు, కంబళి (ఉన్ని), వల్కలము, కాషాయములు.” వీటిని సహితము మంత్రము చే ప్రోక్షణము కావించి, అటుపిమ్మట దేవతకు అర్పింపవలెను. మలినము, జీర్ణము, ఛిన్నము, ముందు వాడబడినది, ఇతరులది, ఎలుకలు కొరికినది, సూదితో కుట్టినది, కేశయుక్తము, తడిసినది, శ్లేష్మము మరియు మూత్రము చే మలినమయినది అయిన వస్త్రము దేవతలకు అర్పించుటకు, దైవ ప్రేత కార్యములందు, యజ్ఞాది కార్యములందు వర్జితము. ఉత్తరీయము, ఉత్తరీయ సంగము, శాలువ మొదలగునవి కుట్టకుండగనే అర్పింపవలెను. పట్టు వస్త్రములు, నిశారము, ఛత్రము, చంద్రాతవము (ఉత్తర భారతమందు స్త్రీలు ధరించు “లహెంగా”), పారదర్శక వస్త్రములు కుట్టిన వయిననూ వర్జితము కాదు. పతాకము, ధ్వజము, దండము మొదలగునవి కుట్టినవి మాత్రమే అర్పింపవలెను. ఇతర ఆవరణాది కార్యములకు కుట్టిననూ, కుట్టకున్ననూ వాడవచ్చును. రక్తవర్ణ లేక కాషాయ వర్ణ వస్త్రములు దేవికి ప్రీతికరము. పచ్చని వర్ణము లేక కాషాయము విష్ణువునకు ప్రీతి ప్రదము. రక్తవర్ణము లేక ఉన్ని కంబళి శివునకు ప్రీతికరము. చిత్ర విచిత్ర రంగులు యున్న వస్త్రములు సకల దేవీ దేవగణములకు నివేదింపవచ్చు. అన్ని రకముల శుద్ధ నూలు వస్త్రములు దేవగణముల కర్పింపవచ్చు. విష్ణు భగవానునికి రక్త వర్ణము మరియు చైల వస్త్రము (చినిగినది) ఎన్నడునూ సమర్పింపరాదు. నీలివర్ణ వస్త్రము శివునికి వర్జము. అట్లే ఎరుపు, నీలి మిశ్రమ వర్ణము సహితము వర్జము. ఈ మిశ్రమ వర్ణము కలిగిన వస్త్రములను దైవప్రేత కార్యములందు బుద్ధిమంతులయిన సాధకులు ఉపయోగించరాదు. ఈ మిశ్రమవర్ణ వస్త్రమును ఏ కారణము చేతనైననూ ఎవరేని విష్ణు భగవానునకు బహూకరించెనేని వాని పూజ వ్యర్ధమగును. ఈ నీలి, రక్తవర్ణ మిశ్రమ వర్ణ వస్త్రమును కేవలము దేవికి మాత్రమే అర్పింపవలెను. వేరే ఏ దేవతల కయిననూ అయ్యది వర్జితము. మానవులందు బ్రాహ్మణుడు, దేవతలందు ఇంద్రుడు ఎట్లు శ్రేష్ఠులో, అట్లే భూషణ సమూహములందు వస్త్రము అన్నిటి కంటె శ్రేష్ఠము. వస్త్రదానము చే పాపములు శమించి, సిద్ధి కలుగును. ఇది అది అననేల! వస్త్రము చతుర్విధ ఫల పురుషార్ధ ప్రదాయిని.

పుత్రులారా! ఇప్పటి వరకు మీకు సర్వశ్రేష్ఠమయిన వస్త్రదానము గూర్చి తెలిపితిని. ఇపుడు భూషణాలంకారముల గూర్చి వివరించెదను. “కిరీటము, శిరోరత్నము, కుండలము, లలాటిక, తాళపత్రహారము, కంఠహారము, ఉంగరము, ముక్తాహారము, రత్నసూత్రము, ఉతంగము (మకుటముపై పెట్టుకొను ఆభరణము), అక్షమాలిక, పార్శ్వ ద్యోతము, నఖద్యోతము, అంగుళీచ్ఛాదకము, జూటాలకము, మానవికము, మూర్ధతారా, ఖలంతిక, అంగదము, బాహువలయము, శిఖాభూషణము, ఇండికా, ప్రాగ్దండ బంధకము, ఉద్ఘసము, నాభిపురము, మల్లిక, కరధనీ, దండపత్రము, శృంఖలము, కర్ణకము, ఉరుసూత్రము, కమరబంధము, ముష్టి బంధము, ప్రకీర్ణకము, పాదాంగదము, హంసకము, నూపురము,

ఛద్రఘంటికా, సుఖపట్టము" – ఇవన్నియు శోభనాలంకారములే!!! ఈ నలుబది అలంకారములు వేదములందు సహితము సుఖదాయకములని వర్ణింపబడినవి. ఈ అలంకారములన్నియు దాతకు చతుర్విధ పురుషార్థముల నిచ్చును. వీటిని తొలుత అర్చించి, ఆ అర్చనా సమయమందు దేవతతో దానము యొక్క ఉద్ధేశ్యమును ఉల్లేఖించి, అపుడు ఆ అలంకారములను దేవతకర్పింపవలెను. శిరోరత్నములెప్పుడునూ సువర్ణమే అయి యుండవలెను. భేతాళ, భైరవులారా! శిరము పై ధరించు కిరీట, శిరోరత్న, చూడామణి మొదలగునవి ఎప్పుడునూ సువర్ణమే అయియుండవలెను. కంఠహారము నుండి నూపురము వరకు స్వర్ణము లేక రజతము యుండవచ్చును. ఇతర ధాతు (లోహ) నిర్మితములయిన ఆభరణములు వర్జితములు. ఘంట, చామరము, కుంభము మొదలగు ఉపకరణములు ఏఏ అంగములందు ధరింపబడునో, వాటిని ఆఆ అంగభూషణార్పణ సమయముననే సమర్పింపవలెను. ఎందువలననగా ఈ ఉపకరణమలు ఆ అంగముల ఉప భూషణములు. ఈ ఉపభూషణములు తామ్ర (రాగి) జనితములై యుంగవచ్చును.

పైన తెలిపిన నలుబది ఆభూషణములు కాక మిగిలిన వన్నియు తామ్రముతో  నిర్మితములయియుండవచ్చు. మిగిలిన అన్ని స్థానములందు తామ్రము స్వర్ణముతో సమానము. తామ్ర నిర్మిత అర్ఘ్య పాత్ర స్వర్ణపాత్ర కంటే శ్రేష్ఠము, మరియు ఫలప్రదము. పూజయందలి అర్ఘ్య పాత్ర, నైవేద్యమునకు వలయు ఆధారపాత్ర, పానపాత్ర, ఉదుంబర (మేడిచెట్టు) వృక్ష నిర్మితములయిన ఎడల అయ్యది విష్ణు భగవానునికి అత్యంత ప్రీతికరము. తామ్రము చే దేవతలు సంతుష్టి నొందెదరు. వారు ఎల్లప్పుడూ తామ్రము నందు స్థితిగతులై యుందురు. అందువలన తామ్రము సర్వదా ప్రీతిప్రదము. మానవునకు తన శక్తికొలది భూషణములను అర్పించవలెను. గ్రీవము (కంఠము)పై భాగమున కేవలము బంగారు భూషణములనే ధరింపవలెను. వెండి సహితము వర్జితము. ప్రావారము (పూర్వ కాలమున నేయబడిన బహుమూల్య ఉత్తరీయము), పానపాత్ర, గండకము, గృహము, పర్యంకము, మొదలగు వస్తువులన్నియు ఉపభూషణములని తెలుపబడుచున్నవి. స్వర్ణ, రజితముల స్థానమున గ్రీవము క్రింది భాగమున స్వర్ణ, రజితములని భావించి ఇనుము, కంచు వదిలి మిగిలిన లోహముల ఆభరణములు  అర్పింపవచ్చును. ఏ వ్యక్తి అయిననూ తన శక్త్యాది సారముగ సర్వ భూషణములను అర్పణమొనర్పవలెను. ఆభరణార్పణము చతుర్విధ పురుషార్థములనొసగి సర్వ సుఖములను, తుష్టి, పుష్టిలను ప్రసాదించును. ఇపుడు గంధ, చందనముల గూర్చి వినవలసినది. ఇయ్యది అయిదు విధములుగ లభ్యమగును. అవి "చూర్ణకృత, ఘృష్ఠ, దాహకర్షిత, సమ్మర్ధక, ప్రాణ్యంగజ" ములు. ఈ అయిదు రకముల గంధములు దేవతలకు పరమ ప్రీతికరము. చూర్ణకృత గంధములు – గంధ ద్రవ్యములను చూర్ణము చేయుట, గంధ పుష్పములను చూర్ణము కావించుట, ప్రసస్థ సుగంధ భరిత గంధ పత్రములను చూర్ణము కావించుట. ఇవన్నియు చూర్ణీకృత గంధమునకుదాహరణలు. ఘ్రుష్ఠ గంధములు – మలయాచలమందుత్పన్నమయినవి, మేరువు (శిల) యందు అరుగదీయబడినవి. అగరు మొదలగు పరిమళముల నుండి తీయబడిన గంధములు ఈ కోవకు చెందును. దాహకర్షిత గంధములు – దేవదారు, అగరు, కమలము, చందనము, గంధసారము, ప్రియ (చిన్న ఏలుకలు) వీటిని ప్రత్యేక విధిని కాల్చుటచే ఉత్పన్నమయినవి, తృతీయకోటికి చెందిన గంధములు.  సమ్మర్ధక గంధములు – సుగంధ కరవీరము, బిల్వము, గంధినీ, మరియు తిలకాదులను పిండుట ద్వారా లభ్యమయిన రసమును తీసి దానినుండి వివిధ ప్రక్రియల ద్వారా గంధము (వాసన) ను వెలికిదీసిన ఎడల, దానిని సమ్మర్ధకమందురు. ప్రాణ్యంగజ గంధములు – మృగనాభి (కస్తూరి మృగము) నుండి ఉత్పన్నమయిన కస్తూరి, ఇయ్యది ప్రాణుల నుండి ఉత్పన్నమగును. కర్పూరము, గంధసారాది చూర్ణములను తీసికొని దానిని చంద్రభాగ (సర్పగంధి) రసముతో కలిపిన అయ్యది సుమధుర పరిమళమగును. అన్ని రకముల సమ్మర్ధన గంధములందు గంధసారము కలిపిన అయ్యది సుమధుర పరిమళమగును. అన్ని రకముల సమ్మర్ధన గంధములందు గంధసారము నుపయోగించుట కలదు. మృగనాభి (కస్తూరి) ని కొంతమంది అరగదీయుదురు. మరికొంతమంది

చూర్ణమొనర్చెదరు. ఎన్ని రకముల గంధములున్ననూ, అవన్నియు ఈపైన తెలిపిన అయిదు గంధముల కోవకే చెందును. ఒక గంధముతో మరియొకటి కలుపుట ద్వారా గంధము అత్యంత ప్రీతి ప్రదమగును.

మలయపర్వతమునందు ఉత్పన్నమయిన మలయ చందనము దేవతలకు, పితరులకు ప్రీతికరము. దీనియొక్క లేపనము, రసము, చూర్ణము, ఇవన్నియు విష్ణు భగవానునికి తుష్టి కారకము. అన్ని గంధముల కంటె మలయ చందనము అత్యంత ప్రసస్థము. అందువలన ప్రయత్న పూర్వకముగ మలయ చందనమును దానమొనర్పవలెను. భైరవా! నల్లఅగరు, కర్పూరము, మలయగంధము ఈ మూడింటినీ కలుపుట చే ఉత్పన్నమగు గంధము వైష్ణవీ దేవి మరియు కామాఖ్యాదేవికి అత్యంత ప్రీతికరము. కుంకుమాగరుకస్తూరిలను సమభాగములలో తీసికుని దానిని చంద్రభాగ (సర్పగంధి) తో కలిపిన ఎడల వెలువడు గంధము త్రిపురాదేవికి, శంభునికి, చండికకు ప్రీతిప్రదము. ఏ సాధకుడయననూ, ఏ దేవతా ఉద్దేశ్యమునకైననూ గంధార్చన కావించి, దానిని తన ఇష్ట దైవమునకు ప్రసాదించిన ఎడల అయ్యది సర్వసిద్ధి ఫలప్రాప్తి కలిగించును. గంధము ధర్మార్థకామ మోక్షములకు సాధకము.

ప్రియపుత్రులారా! ఇపుడు దేవికి ప్రియమయిన పుష్పముల గూర్చి తెలిపెదను. పొగడ, మందార, కుంద, కురంటక, కరవీర, అర్క (జిల్లేడు), శాల్మలి, అపరాజిత, దమన, సింధువార, కురువకం (మొగలి), భ్రహ్మ వృక్షము, లతలు, దూర్వాంకురములు, కుశలు, బిల్వపత్రములు; వీటితో వైష్ణవీదేవి, కామాఖ్యా మరియు త్రిపురాదేవి పూజనమొనర్పవలెను. ఇవేకాక ఇతర పుష్పములు దేవికి ప్రీతి కలిగించునవి తెలిపెదను. మల్లిక, మాలతి, జాతి (మల్లె), మాధవి, కలిగొట్టు, కరవీరము, జవ, తర్కారిక, తిలకము, శిరీషము, శమీపుష్పము, ద్రోణము, పద్మము, ఉత్పలము, బకము, అరుణము, శ్వేతారుణము, త్రిసంధ్య, పలాశ, చాపచెట్టు, వనమాల, సేవంతీ, కుముదము, కదంబము, చక్రము, కోకనదము, గిరికర్ణిక, నాగకేశరము, పున్నాగ, కేతకీ (మొగలి), అంజలికము, దోహదము, మాతులుంగ, నమేరు, శాలము, త్రిపుషీ, చండబిల్వము, జుంటి. వీటన్నిటితో వరదాయిని అయిన పార్వతీదేవిని పూజింపవలెను.

ఇపుడు పత్రములు – ఆపామార్గము, భృంగారకము, (భృంగిరాజు), గంధినీ, బలాహకము, కాపరిపట్టు, వంజలుస్తకము, మామిడి, నేరేడు, మాతులుంగ, కుశ, దూర్వాంకురములు, శమీపత్రము, ఉసిరి, వీటిపత్రములన్నియు దేవికి ప్రీతిప్రదము. వీటన్నిటి యందునూ బిల్వపత్రము అత్యంత ప్రీతిపాత్రము. దీనిచే వైష్ణవీ దేవి అత్యంత ప్రసన్నత నొందును. పుష్పమాలన్నిటి యందు పద్మము అత్యుత్తమమని తెలుపబడును. ఏ సాధకుడు అత్యంత భక్తి పూర్వకముగ సహస్ర రక్త పద్మమాల (వేయి ఎర్రని పద్మముల మాల), కట్టి, అద్దానిని దేవికి బహూకరించిన ఎడల దాని ఫలితమును ఉటంకింతును. వినుడు. ఆతడు నా లోకమున (శివలోకమున) శతాధిక, సహస్ర కల్పములు నివాసముండి, తిరిగి భూమండలమున మహారాజై జన్మించును. పత్రములందు బిల్వపత్రమనిన దేవికి అత్యంత ప్రీతికరమని తెల్పితిని కదా! ఎవరేని సాధకుడు సహస్ర బిల్వ పత్రములతో మాల అల్లి, దానిని దేవికి అర్పించిన ఎడల అదియును పూర్వము తెలిపిన ఫలమునే ఒసంగును. ఇక వేయిమాట లేల? ఇక్కడ తెలుపబడిన, లేక తెలుపబడని, జలములందు లేక భూమిపైన, అన్ని రకముల పుష్పములు, పద్మములు, ఓషధులు, పత్రములు సర్వమును దేవి పూజకు అర్హములే! అన్నిటితో దేవికి పూజ కావింపవచ్చును!!! పుష్పములు లభ్యమవ్వని ఎడల పత్రములు, అవికూడ దొరకని ఎడల తృణ, గుల్మ, ఓషధులు, అవికూడ దొరకని ఎడల తెల్ల ఆవాలు, అవికూడా దొరకని ఎడల మానసిక పూజనము ఒనర్పవలెను.

వజ్రదంతి పూలు లేక పత్రములు, లేక తులసి పత్రములు, లేక మంజరి తో శ్రీవృద్ధికి చండికాదేవి పూజనమొనర్పవలెను. పురశ్చరణార్థము బిల్వపత్రములు, తిలలు, అక్షతలు, ఘ్రుతము ఉపయోగించి, శివుని ఉద్దేశ్యించి ప్రయత్నపూర్వకముగ సంస్కరింపబడిన ప్రజ్వలితాగ్నియందు కామ్య పూర్ణమునకై హోమము కావింపవలెను. "పురశ్చరణ" అనగా ఒకానొక కార్యసిద్ధి కొరకై సాధకుడు సంకల్పము కావించిన ఎడల దానిని పురశ్చరణ అని ప్రవచింతురు. ఈ

పురశ్చరణమందు తొలుత కామాఖ్యా లేక వైష్ణవీ దేవిని విధి విధానముగ పూజింపవలెను. తదుపరి షోడశోపచారములు కావించి విహిత కార్యములను ఉల్లంఘింపరాదు. కల్పము ప్రకారముగ పూజను సలిపి మంత్రమును వందసార్లు జపించవలెను. తదుపరి హోమము గావించి, హోమానంతరము మూడు బలులు ఈయవలెను. తదనంతరము భార్య, సోదర సోదరీ, గురు, పుత్రపుత్రీ, శిష్యుల సహితులై నైవేద్యములను అర్పింపవలెను. పూజావసాన సమయమున గురువును పూజించి శుభదక్షిణనీయవలెను. దక్షిణాద్రవ్యములు సువర్ణము, తిలలు, గోవులు. వీటిని దానమిచ్చుటకు అశక్తత యున్న ఎడల వల్కలములు ప్రదానము కావింపవచ్చును. "శుక్లాష్టమి, నవమి, చతుర్దశి" ఈ మూడు దినములు సాధకుడు జితేంద్రియుడై, బ్రహ్మచర్యము పాటించి, దేవిని పూర్వము తెలుపబడిన రీతిని అనుసరించి పూజోపచారములు కావించి, పూజోపరాంతమున గురుముఖతా మంత్రమును గ్రహించి పురశ్చరణ కావింపవలెను. సంపూర్ణముగ పూజావిధి ననుసరింపక మంత్ర గ్రహణము కూడదు; మరియు పురశ్చరణ కావింపరాదు. ఒకవేళ అట్లు కావించిన ఎడల తీవ్ర దు:ఖములు ప్రాప్తించును.

నిత్యపూజ యందు ఈ విధముగ కల్పోక్తప్రకారముగ చేయగలిగిన దక్షత యున్నచో అవశ్యము ఈ విధముగ పూజ కావించవలెను. లేని ఎడల ఈ క్రింది విధిని ఆచరింపవలెను – మార్జనమాచరించి, తదుపరి మండలమును స్థండిలమందు అంకితము కావించి పాత్రయందే దాహక, ప్లావక క్రియలాచరింపవలెను. పిదప ఆత్మధ్యానము కావించి, అంగ సంస్కరణ మొనర్చి, తదుపరి శుద్ధికై అంగుష్ఠముల నుండి శిరము వరకు పన్నెండు విధముల అంగన్యాస, కరన్యాసములు కావించి, అర్ఘ్య పాత్రయందు ఎనిమిదిమార్లు మూలమంత్ర పఠనము కావించి, శుద్ధీకరించిన ఆ నీటిని పూజా సామాగ్రి పై ప్రోక్షణ కావించి అపుడు ఆధారశక్తి నుండి సుమేరు పర్వతము వరకు సర్వ పీఠ దేవతలకు పూజన మొనర్పవలెను. తదుపరి హృదయస్థమయిన దేవత యొక్క ధ్యానమొనర్చి, వాయు సహాయమున ఆ దేవతను హృదయము నుండి బయటకు తెచ్చి, మండలమందు ప్రతిష్ఠ కావించి, యధాశక్తి ఉపచారములొనర్చి పూజింపవలెను. తదుపరి షడంగపూజ, అష్టదళ దేవతా పూజ, జప స్థవములు, ప్రణామము, మూడు పుష్పాంజలులు ప్రదానము చేయవలెను. పిమ్మట దేవత ఎదుట ముద్రా ప్రదర్శనము కావించి, అపుడు దేవతకు ఉద్యాపన (విసర్జన) కావింపవలెను. సర్వ దేవతలకు ఇదియే విధి. ఒకవేళ పూజ కావించుటకు శక్తి లేని ఎడల ఈ క్రింది అయిదు ఉపచారములు కావింపవలెను. అవి గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములు. ఇవి లభింపని ఎడల పుష్పము, జలములతో పూజింపవలెను. ఇవికూడ లభింపని ఎడల, కేవలము భక్తిభావముతో పూజింపవలెను. భేతాళ, భైరవులారా! మీకు సంక్షిప్తముగ పూజ, వస్త్ర, పురశ్చరణము గూర్చితెలిపితిని.

ఇపుడు పుష్పముల గూర్చి మరికొంచెము తెల్పెదను. పుష్పములతో దేవతలు ప్రసన్నులగుదురు. పుష్పములందే దేవగణములు సంస్థితులై యుందురు. సమస్త చరాచరము పుష్పరసమే!! ఇక ఈ పుష్పమాల గూర్చి ఏమని, ఎంతని తెలుపుదును? పరంజ్యోతి స్వరూపుడయిన పరమాత్మ పుష్పములందే నివసించుచూ, పుష్పములచే ప్రసన్నుడగును. పుష్పము తుష్టి, శ్రీ, మరియు మోక్షము అయిన త్రివర్గదాయకము. పుష్పము యొక్క మూలమందు బ్రహ్మ, మధ్యనందు విష్ణువు, అగ్రమందు శివుడు నెలవైయుండును. పుష్పదళములందు సర్వ దేవతలు అవస్థితులై యుందురు. అందువలన మానవులు పుష్పములందే దేవతార్చన గావింపవలెను. "పుష్పము" అను నామము ఉచ్చరించనంత మాత్రమున సమస్త విభూతులు లభించును.

ఇపుడు దీప వర్ణనము. దీపము చే లోక జయము సిద్ధించును. దీపము తేజోమయము. ఏ సాధకుడు నిరంతరము పుష్ప దీపములతో పూజనమొనర్చునో, ఆతనికి చతుర్విధ పురుషార్థములు కరతలామలకములు. ఇందు సందియము లేదు. దీపములు ఏడు రకములు. ఘృత, పచ్చఆవాలు & నల్ల ఆవాల తైలము, తిలతైలము, పుష్పాసవము, దధి,

మరియు అన్న దీపములు. పద్మసూత్రము, దర్భలు, గర్భసూత్రము, పట్టు లేక లినెన్, రేగుపండుతో చేయబడిన వత్తులు దీపకార్యమందు ఉపయోగింపవచ్చును. దీపము లోహము, ఇనుము, కర్ర, మట్టి, లేక నారికేళ ప్రమిదలయందుండవచ్చును. దీపమును లోహ ప్రమిదయందు కానీ, వృక్షము పై నుంచి కానీ దీపదానము కావింపవలెను. ఎప్పుడూ కేవల భూమిపై దీపముంచరాదు. పృథివి రెండు మినహా మిగిలిన వన్నింటికీ సహించును. అవి ప్రమిదయొక్క తాపము, అకార్యసాధనకు పృథివిపై చలించుట. అందువలన దేవగణ మరియు దేవి కొరకై పృథివిపై ఏదేని ఆధారము నుంచి, దానిపై దీపము నుంచవలెను. ఎవరేని మానవుడు దీపమును ఆధారమునందుంచక తిన్నగా నేలపై యుంచిన ఎడల ఆతడు తాపరూప నరకమయిన తామ్ర తాప నరకమునకేగును. ఇందు సందేహము లేదు.

దీపము నందు వృత్తాకర వత్తి, ఉత్తమమైన తైల పదార్థము నుంచి సదృశ్యము, సుందర ఛాయాయుక్తము అయిన వృక్షకోశమునందు ప్రయత్న పూర్వకముగ దీప ప్రదానము కావింపవలెను. ఏదేని దీపతాపము నాలుగు అంగుళముల కంటె దూరము ప్రసరించిన ఎడల అయ్యది దీపము కాదు "వోర్ధ్వవహ్ని" లేక నిరంతర ప్రజ్వలాగ్ని అని తెలియబడును. నేత్రానంద కరము, శోభన కిరణయుక్తము, భూమికి తాపము కావింపనిది, ఉత్తమ శిఖ కలిగినది, శబ్దరహిత, ధూమరహితము, అతి చిన్నది, దక్షిణావర్తముగ చుట్టిన వత్తికలది అయిన దీపము శ్రీ వృద్ధిని కలుగజేయును. పుత్రులారా! పైన తెలిపిన లక్షణములున్న దీపములు దీపవృక్షమందు (వృక్షరూపమునున్న అమరికపై అనేక దీపములు కలది) యుంచబడిన ఎడల అయ్యది సర్వోత్తమము, మరియు సర్వులకు సంతుష్ఠని కలుగజేయును. అట్లుకాని ఎడల అయ్యది మధ్యమము. దీపపాత్ర యందు పూర్ణముగ తైలము లేని ఎడల అది అధమమగును. వృక్షత్వచము (బెరడు), జీర్ణమలిన వస్త్రము, చే కానీ ఎన్నడు వత్తిని చేయరాదు. శ్రీవృద్ధికై ఎల్లప్పుడూ నూతన వస్త్రమును వత్తిగా చేయవలెను. పట్టు వస్త్రము కానీ, రోమములతో చేయబడిన వత్తులను ఎన్నడునూ వత్తులుగ ఉపయోగింపరాదు. దీపము నందు నేయి మరియు తైలము కలిపి ఎన్నడూ దీపము వెలిగింపరాదు. ఒకవేళ ఎవరేని సాధకుడు అట్లు గావించిన ఎడల వారు తామిశ్ర నరకమందు పడెదరు. వస, మజ, అస్తి, మరియు ప్రాణుల అంగములతో దీపములు వెలిగింపరాదు. అట్లు గావించిన ఎడల వారు నరకగాములగుదురు. అంతేకాక అస్తి నిర్మిత పాత్ర లేక దుర్గంధ పాత్ర యందు దీపము వెలిగింపరాదు. అట్లే నయనానందకారకముగ వెలుగుచున్న, మరియు దేవతల వద్ద వెలగుచున్న దీపములను ప్రయత్నపూర్వకముగ ఆర్పరాదు. తెలిసీ, తెలియక, మానసిక లోభమున, ఎట్టి పరిస్థితుల యందు దీపములు ఆర్పరాదు. దీపమును అపహరించువారు గుడ్డివారుగనూ, ఆర్పువారు కుంటివారుగనూ తిరిగి పుట్టెదరు.

పుత్రులారా! ఇపుడు ధూపము గూర్చి తెలిపెదను. కన్నులకు, నాసికకు సుఖము; సుగంధము ప్రసాదించునది, దహనశీలమగు మనోహర కాష్ఠము కలిగినది, ఇతర పవిత్ర చూర్ణములతో కలిసి తాపరహిత ధూపమును ఉత్పన్నము కావించు దానిని మాత్రమే ధూపము అని పిలువవలెను. ఇది దేవతా గణమునకు తుష్ఠి ప్రసాదించును. తుషాగ్ని వలె అత్యధిక ధూపము ఉత్పన్నమయిన ఎడల అయ్యది ఫలప్రదాయకము కాదు. శ్రీచందనము, సరళము, సాలవృక్షము, కాలాగరు (నల్లని అగరు), ఉదయము, సురభము, రక్తవిద్రుమము, పచ్చశాలము, పరిమళము, విమర్ది, నమేరు, దేవదారు, బిల్వ, దానిమ్మ, సంతానకము, పారిజాతము, హరిచందనము, వల్లభ వృక్షముల ధూపము సర్వులకు ప్రీతిప్రదము. అర్జున, వాధి, (కమలము), అక్కస వృక్షములు, సర్వోషధ రజము, జాతి (మల్లి), వారాహ చూర్ణము (ఆమ్ల+పసుపు+అల్లము+ఓషధులు), జాతికోశచూర్ణము, గంధకస్తూరి చూర్ణము, వీటి ధూపములు సహితము అర్పింపవలెను. యక్షధూపము (గుగ్గిలము), వృక్ష ధూపము (టర్పెంటైన్), శ్రీపిష్ఠము, పరివాహము, పిండధూపము, సుగోళము, కంతము, వీటి కలయికచే ఉత్పన్నమయిన పదార్థములను అగ్ని సంపర్కమొనరించుట చే ఉత్పన్నమయిన ధూపమును దేవతలకర్పింపలెను. ఈ విధమయిన ధూపమును ఆఘ్రాణము కావించుటచే ప్రాణికోట్లు తృప్తినొందును.

అయిదు రకముల ధూపములు శుభకరము మరియు ప్రీతిని కలిగించునవి. అవి కృత్రిమము (ఇతర సుగంధ పదార్థములు అరగదీసి, కలిపి ఉత్పన్నము కావింపబడినవి), నిర్యాసము (వివిధ సుగంధ పదార్థములను పిండి ఉత్పన్నము కావింపబడినవి), పరాగము, కాష్ఠము, గంధము. మాధవునకు యక్షధూపము (గుగ్గిలము), శివునకు రక్తవిద్రుమము, సురధము, కద్రిళ ధూపములు వర్జితము. మహామాయకు యక్షధూపము, పత్రివాహము, పిండధూపము, సుగోళకము, కృష్ణాగురు, మరియు కర్పూర ధూపములు ప్రీతికరము. వృక్షధూపము సహితము మహామాయకు ప్రీతి. మేదామజ్జాయుక్తము, ఇతరులకు ఈయబడినది, పూర్వమే ఆఘ్రాణితమయినది, యాచన లేక అపహరించుట ద్వారా తేబడినది, అయిన ధూపము ఎన్నడునూ అర్పింపరాదు. ధూపము నెప్పుడునూ ఒక ఆధారమునందుంచి అపుడు నివేదింపవలెను. రక్త విద్రుమము, శాలము, సురధము, సంతానకము, నమేరు, కృష్ణాగురు, వృక్షముల నుండి చేయబడిన జాతికోశము (మిశ్రమము) యొక్క ధూపము కామేశ్వరీ దేవికి, త్రిపురాదేవికి, మాతృగణములు మరియు కాంతాది పీఠ దేవతలకు నిత్య ప్రియము.

పుత్రులారా! ఇపుడు నేత్రాంజనము గూర్చి తెలిపెదను. మహాదేవి, కామాఖ్య, త్రిపుర, మరియు వైష్ణవీదేవి ల అంజనము తయారగు విధిని వివరించెదను. అంజనముల యందు ఆరు అంజనములు ప్రసిద్ధములు. అవి సౌవీరము. సౌవీర వృక్షరసము నుండి ఉత్పన్నమయినది; యమునా = రాతిచే అంజన విశేషమును చూర్ణము గావించి గ్రహింపబడినది. తుథ్యం = జింక్ ఆక్సైడ్(Zinc Oxide); మయూరము మరియు గ్రీవకము = రత్నముల నుండి ఉత్పన్నమయినవి, దర్వికా = తామ్ర పాత్ర యందు తైలము పోసి అగ్నిచే మండించినపుడు ఉత్పన్నమగు కాటుక; మేఘనీలము = ధాతువుల నుండి ఉత్పన్నమయినది. ఈ ఆరురకముల అంజనములు పైన తెలిపిన దేవీ మూర్తులందరకునూ అత్యంత ప్రీతి పాత్రము. మహామాయ కొరకు విధవ స్త్రీ అంజనమర్పింపరాదు. అంతేకాక వేరొక చోటు నుండి తేబడిన అంజనము సహితము అలదరాదు. అంజనమును మట్టిపాత్ర యందు ఎన్నడునూ యుంచరాదు. అట్లయిన సాధకునకు పూజాఫలము ప్రాప్తించదు. దీపాంజనములు చతుర్విధ పురుషార్థ ప్రదాయకములగుటచే సాధకులు ఈ రెండింటినీ దేవతకు అర్పింపవలెను. భేతాళ భైరవులారా! మీరిరువురికి దీప, ధూప, నేత్రాంజన విశేషములను ఎరింగించితిని. ఇపుడు నైవేద్యముల గూర్చి తెలిపెదను.

**(శ్రీ కాళికా పురాణమందలి వస్త్ర, గంధ, ధూప, దీప, నేత్రాంజన అర్పణమనెడు అరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బదియవ అధ్యాయము

**(నైవేద్య ప్రకరణము)**

భగవానుడు చెప్పదొడంగెను "పుత్రులారా! ఏ వస్తువు పవిత్రము మరియు ప్రసస్థమో, అయ్యది నైవేద్యమని తెలుపబడును. ఇది భక్ష్య, భోజ్య, లేహ్య, పేయ, చోష్యములని అయిదు విధములు. ఈ అయిదింటి యందును దేవికి సర్వదా ప్రియమయిన వాటిని గూర్చి తెల్పెదను. వీటిని అర్పించిన ఎడల దేవి ప్రసన్నత నొందును. విధి విధానముగ అర్పింపని ఎడల దేవి గ్రహించదు (తీసికొనదు). అందువలన సవిధి విధానమును అవలంబింప వలెను. నిమ్మ, ద్రాక్ష, క్రముకము (వక్క), అరటి పళ్ళు, రేగుపండ్లు, పనస, పొగడ, తేనె, మామిడి, రాచఉసిరి, అక్రూట్ (Walnut), పిండ ఖర్జూరము, కరుణ (నల్ల తుమ్మ), బిల్వ ఫలము, ఔదుంబరము, (మేడి), పున్నాగ, మాధవ, కర్కటీ (దానిమ్మ), జాంబవ

ఫలము, మాతులుంగ, జంబల్ ఫలము (Black Plum), అమలకము, ఆరు విధముల నారింజ, దేవకం (Fig), అత్తిపండు, ఖర్జూరము, దోసకాయ, పాటల్ (దొండ), క్షీర వృక్షజం (పనస), ఆనప, చింత, దానిమ్మ, కుసుమ, పీత, కాకర, కరుషజం (ఖర్జూరం), గర్భవర్తం (దానిమ్మ), వీని పుష్పములు, ఫలములు, కమలము, పంకజము, వివిధ వన్యఫల పుష్పములతో దేవి పూజన మొనర్పవలెను. లవంగం, దానిమ్మ, రేగు మరియు అరటి జాతులందలి ఫలములే కాక ఇతర ఫలములు కూడా దేవికి ప్రీతికరము. భైరవా! మాతులుంగము, నాగరము (నిమ్మ), కరమర్దము (పావక్కాయ), రసాలము (మామిడి), మొదలగు ఫలములను కామాఖ్యా దేవికి అర్పింపవలసినది. త్రిపుర మరియు పీఠ దేవతలకు సహితము ఈ ఫలములు ప్రీతి. శృంగాటకము (రాచఉసిరి), కశేరు (కుంకుమపువ్వు), శాలుక (సొరకాయ), మృణాళము (పద్మనాళము), పొగడ, శృంగబేరము (దోస), నాగలింగ పువ్వు, స్థూలకందము, వీటన్నిటి దుంపలను దేవికి నివేదింపవచ్చును. పరమాన్నము, పిష్ఠకము, యవలు, ఖిచిడీ, మోదకములు, అటుకులు, మొదలగు వాటిని చక్కగా వండి నివేదింపవలెను. ఘృతము, చక్కెరతో వండిన శాలి ధాన్యము, మిగిలిన అనేక విధములయిన చిత్రాన్నములు, మహిషము, మేక, గొర్రె, లేడి, పాలు, అన్ని విధములయిన తేనె, బెల్లపు పదార్థములు, చక్కెర, పాన మాంసములు, రకరకములయిన సుగంధ చూర్ణము, శాకాహార, మాంసాహారములతో వండిన మనోహర వ్యంజనములు, మహాదేవికి నివేదింపవలెను.

మాంసము, పరమాన్నము, చక్కెరయక్తమయిన పెరుగు, నేయి మొదలగు వస్తువులు దేవికి సమర్పించుట చే అశ్వమేధ యజ్ఞ ఫలము లభించును. చక్కెర మిశ్రిత పిండి వంటలు, తేనె కలిపిన సుర దేవికి నివేదించిన ఎడల ఆ వ్యక్తి దీర్ఘకాలము దేవీ లోకము నందుండి తిరిగి భూలోకమున రాజుగ జన్మించును. ఏ మానవుడు దేవికి నాగలి, వక్క, రుచకము, కాకర అర్పించునో ఆతడు అతులిత సౌభాగ్యవంతుడై దేవీ లోకమందు సహితము పూజ్యుడగును. మినుములు, పెసలు, కందిపప్పు, తిలలు, గంజాయి, యవలు, మొదలగునవి యోగ్యత ననుసరించి అర్పింపవలెను. సర్వ విధములయిన వస్తువులను సంస్కరించి, దేవికి అర్పింపవలెను. సాధకులు, మునులు, బ్రాహ్మణులు, సామాన్యులు, మహావీరులు ఎవరెవరు, ఏమేమి భుజించెదరో అవియే దేవికి భక్తిసహితముగ అర్పింపవలెను. ఏ వస్తువులను ఏ విధముగ సంస్కరించిన సంస్కరింపబడునో, అట్లే సంస్కరించి దేవికి సమర్పింపవలెను. దుర్గంధిత వస్తువులు, మాడిపోయినవి, భోజనమునకు యోగ్యము కానివి, శాస్త్ర సహిత వస్తువులు కానివి ఎన్నడునూ అర్పింపరాదు. కర్పూరము మొదలయిన సుగంధ యుక్త మయిన తాంబూలము నందు కమలచూర్ణము యుంచి, అద్దానిని దేవికి అర్పింపవలెను. ఏ పశుపక్ష్యాదులు మరియు మత్స్యములు బలిదానమునకు అర్హములో వాటి మాంసమును దేవతకు సమర్పింపవలెను. ఖడ్గమృగము, వాధ్రీనసి, మరియు మేక యొక్క మాంసమును మిశ్రమము చేసి, అద్దానిని సుగంధయుక్తముగ వండి వేడివేడిగా ఆ వ్యంజనము (కూర) ను దేవికి అర్పించిన ఎడల ఆతనికి సార్వభౌమత్వము లభించును. ముల్లంగి మరియు లేడి మాంసమును ఒక లోహ పాత్ర యందు సుగంధ భరితముగ వండి, అద్దానిని దేవికి నిదేవించిన ఎడల ఆతనికి దేవీలోకము ప్రాప్తించును.

ఖర్జూరము, పిండ ఖర్జూరము, ఘృతయుక్త యవ చూర్ణము కలిపి దేవికి నివేదించిన ఎడల వారికి రాజసూయ యజ్ఞ ఫలితము లభించును. ఖిచిడీ అర్పించిన ఎడల అతులిత సౌభాగ్యము లభించును. కొబ్బరినీరు, నేరేడు, లవలీ, మామిడి, ధాత్రి (రాచఉసిరి), మారేడు పళ్ళు అర్పించిన ఎడల అగ్నిష్టోమ యజ్ఞ ఫలితము లభించును. ద్రాక్ష, చక్కెర, నారింజ, బత్తాయి దేవికి అర్పించిన ఎడల ఆ సాధకుడు శ్రీయుతుడు, రూపవంతుడు అగును. అటుకులు దేవికి సమర్పించిన ఎడల లక్ష్మీవంతుడగును. చెరకు, పెసరపిండితో చేసిన పదార్థము, వెన్న నివేదించిన ఎడల ఉత్తమ సౌభాగ్యము, దేవీలోక ప్రాప్తి కలుగును. ఎవరు నవనీతము, తిలలను కలిపి నివేదించిన వారి కామనలు అన్నియు ఇహలోకమునందే పూర్ణమయి మరణాంతరము మోక్షము నందును.

అభక్ష్యములనన్నింటినీ వదలి మిగిలిన వాటితో అన్న వ్యంజనములు కావించి, వాటిని దేవికి నివేదింపవలెను. రత్నములు కలిపిన నీరు, కొబ్బరినీరు, క్షీరము, ఘ్రుతము, మధువు, చక్కెర, మరియు పెరుగుతో కూడిన పానీయమును ధాతుపాత్ర యందు నివేదించిన కలుగు పుణ్యఫలము వినము. ఆతడు వేలాది, వందలాది, కల్పకోట్లు పర్యంతము దేవీలోకమందు నివసించి తిరిగి భూమిపై సార్వభౌముడై జన్మించును. తదుపరి యదేశ్చగా సామీప్య, సాలోక్య, సారూప్య, సాయుజ్య మోక్షములందు ఏది తలచిన ఆ మోక్షము నొందును. నీవారధాన్యము (Basmate Rice) మరియు తిలలను పెరుగుతో దంచి దేవికి అర్పించిన ఎడల వారికి అభీష్ఠసిద్ధి తప్పక కల్గును. పిప్పళ్ళు, కోషము, జీవకము, వసుంభము, మరియు తింతిడి, వీటిని సంస్కరించి, దేవికి భక్తి పూర్వకముగ సమర్పించిన ఎడల వారికి జ్యోతిష్టోమ యజ్ఞఫలము లభించి, తదుపరి దేవీ లోకమున కేగును. రాజ్మా, ఎర్రతోటకూర, ఎర్రచందనం, కాలాయకాలసక, బ్రాహ్మీశాకము, ముల్లంగి, తులసి, కలంబి (మెంతులు), చాటుక (Chilli Brinjal), పునర్నవ, చిల్ మోచిక చక్ర, విద్రుమపత్ర (Aloe vera) మొదలగు వృక్ష జాతికి చెందిన మొక్కలను దేవికి ప్రసాదించిన ఎడల ఇహమందు అతులిత ధనలాభమొంది, పరమందు దేవీలోకము చేరును.

శ్రద్ధ, పరీక్షి, సంస్కారము, భక్తి, ద్రవ్యము, అభిమంత్రణము, మరియు అనురాగము దేవిపట్ల ఎంత ఎక్కువ అభివృద్ధి నొందునో, అంతే ఎక్కువగా ఫలము యుండును. వీటి హీనత యందు ఫలితము సహితము హీనముగ యుండును. కాల లేక మంత్ర విరుద్ధము, అత్యంత భార సమాన్వితమయిన నైవేద్యములు దేవతకు నివేదింపవలదు. సువర్ణము, రజితము, తామ్రపాత్ర, శిల లేక పద్మపాత్ర, యందు నా (శంకరుడు) ప్రియతమకు (దేవికి) ప్రియమయిన నైవేద్యములు అర్పింపవలసినది. స్వర్ణ లేక తామ్రపాత్ర భోజనమునకు ఉత్తమము. యజ్ఞకాష్ఠ పాత్ర మధ్యమము. ఏ విధమయిన పాత్ర లభింపని ఎడల, మీ చేతిని దోసిలి కట్టి, దానిని పాత్రగావించి, వ్యవహారము పూర్ణమొనర్పవలెను. పుత్రులారా! మీకు నైవేద్య ప్రకరణమును తెలిపితిని, అందునా త్రిపురా, కామాఖ్యలకు ప్రియమయిన నైవేద్యములను సహితము తెలిపితిని. ఇపుడు ప్రదక్షిణ, నమస్కారముల గూర్చి తెల్పెదను.

**(శ్రీ కాళికా పురణ మందలి నైవేద్య ప్రకరణమను డెబ్బదియవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది ఒకటవ అధ్యాయము

**(నమస్కార ప్రకరణము)**

భగవానుడు చెప్పదొడంగెను "సాధకుడు శిరము వంచి, దక్షిణ భాగము దేవత వైపు యుంచి, మనసునందు సద్భావముతో ఒకటి లేక మూడుమార్లు దేవత చుట్టూ ప్రదక్షిణ మాచరించిన ఎడల అయ్యది సర్వ దేవతలకు ప్రసన్నత నిచ్చును. ఎవరు దేవికి నూట ఎనిమిది మార్లు ప్రదక్షిణమాచరించెదరో వారి కామనలు పూర్ణమయి మోక్షలాభము నొందెదరు. ఎవరు మనసునందు ఐననూ దేవికి భక్తి పూర్వకముగ ప్రదక్షిణ మాచరించెదరో వారు యమగృహము (నరకము) చూడరు. నమస్కారములు కాయక, వాచిక, మానసికములని మూడు రకములు. అందునా ఉత్తమ, మధ్యమ, అధమ భేదములున్నవని తత్వజ్ఞులు నుడివెదరు. కాయక నమస్కారము – మస్తకము, జానుద్వయము (మోకాళ్ళు) భూమిని స్పర్శించునటుల నమస్కరించిన అది ఉత్తమము. జానుద్వయము భూమికి తగులక కేవలము మస్తకము భూమికి స్పర్శించిన అయ్యది మధ్యమము. జాను, మస్తకములు భూమికి తగులక సమస్కరించిన అయ్యది అధమము. వాచిక నమస్కారము – నిత్య, పద్య, గద్య, రచన చేయుచూ (స్వనిర్మిత), భక్తి పూర్వకముగ నమస్కరించిన అయ్యది

ఉత్తమము. పురాణములు, వైదిక మంత్రములు ఉచ్చరించుచు కావించిన నమస్కారము మధ్యమము. తన భాషతో నమస్కరించుట అధమము. మానసిక నమస్కారము. ఇష్టము, మధ్యగతము, అనిష్టము అయిన మనస్సు ద్వారా కావింపబడు నమస్కారములు క్రమముగ ఉత్తమ, మధ్యమ, అధమములని తెలియబడును. ఈ మూడింటి యందును కాయక నమస్కారము సర్వోత్తమము. దీనిచే దేవి నిత్యప్రసన్న అగును. నమస్కారము నందు దండము వలె భూమిపై పడుటచే అయ్యది "ప్రణామము" అని పిలువబడినది. ఇపుడు నైవేద్యము.

నైవేద్యము చే సర్వసిద్ధి, చతుర్విధ పురుషార్థములు, అమృతలాభము కలుగును. నైవేద్యము సర్వయజ్ఞమయము, సర్వ సంతుష్టి దాయకము, జ్ఞానకామనాప్రదము, పవిత్రము మరియు సర్వ భోగములను ఈడేర్చునది. ఏ మానవుడు దేవికి మనసునందు నైవేద్యము అర్పించినప్పటికీ, ఆతడు దీర్ఘాయువై సుఖముల నొందును. ఎవరు మహాదేవికి నిత్యపూజ సలిపి నానా రకములయిన నైవేద్యముల నర్పింతురో, ఆ నైవేద్యముల నమర్చుటకై నిరంతరము చింతించుచుందురో, వారు సర్వకామనలను బడసి మరణాంతరము నా (శంకరుడు) లోకమునకరుదెంచెదరు. ఎవరు మనసునందు తీవ్రభక్తిచే దేవికి ప్రదక్షిణమాచరించెదరో, వారు దక్షిణమునకేగి యముని సందర్శించరు గాక సందర్శించరు!!! (నరకము నొందరు). దేవదానవ, మనుష్య, గంధర్వ, యక్ష, రాక్షస, పన్నగ సర్వులు నమస్కారముచే సంతుష్టులగుదురు. సాధకుడు, బుద్ధిమంతుడయిన మనుష్యుడు కేవలము నమస్కారము చే చతుర్విధ పురుషార్థములు పొందును. సర్వార్థసిద్ధికై నమస్కారమే ప్రసస్తము! నమస్కారము చే లోకులు విజేతలై, దీర్ఘాయువులై వర్ధిల్లెదరు. ప్రజలు కేవలము నమస్కారము చే అవిచ్ఛిన్న దీర్ఘాయువును పొందెదరు.

**నమస్కురు మహాదైవ్యై ప్రదక్షిణమథ్**
**నైవేద్యం దేహి నితరామితి.**

శ్లోకార్థము – "మహాదేవికి ప్రణామములాచరించి, ప్రదక్షిణము చేసి, విపుల నేవైద్యములర్పింపవలెను. "ఏ మానవుడు నిరంతరము ఈ వాక్యమును పున:పున: ఉచ్చరించుచుండునో, అతడు ఇహలోకమందు సర్వకామనలను బడసి, తదుపరి నా (శంకరుడు) లోకము చేరును. ఎవరు భక్తితో నిత్యము దేవికి నైవేద్యమర్పించెదరో, వారు దేవీలోకము ప్రాప్తించెదరు. పుత్రులారా! మీకు షోడశోపచారముల గూర్చి తెలిపితిని. ఇంకనూ ఏమి వినదలచుకొన్ననూ అడుగ వలసినది".

**(శ్రీ కాళికా పురాణమందలి నమస్కార ప్రకరణమను డెబ్బది ఒకటవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది రెండవ అధ్యాయము

**(కామాఖ్యా మహాత్మ్య వర్ణనము)**

మహాదేవుడు తిరిగి చెప్పదొడంగెను "భేతాళ భైరవులారా! మీరిరువురికి అంగ ప్రత్యంగ రహస్య సహితముగ కామాఖ్యా దేవి యొక్క మహాత్మ్యమును తెలిపెదను. వినుడు. ఒకానొకప్పుడు విష్ణు భగవానుడు భక్తాగ్రేసరుడయిన నారదునితో కలసి గరుడవాహనముపై పయనించుచూ కామాఖ్యా నెలవైన నీలాచల పర్వతము వద్ద కేతెంచి ఆ పర్వత పవిత్రత గుర్తించక ఆయన గరుడుని పదపదమని అదిలించెను. అంత జగజ్జనని జగన్మాయ, కామాఖ్యాదేవి విష్ణువును గరుడునితో సహా ఆకాశము నందే స్థంభీభూతుని గావించెను. విష్ణువు సహితము మోహితుడై, ప్రయత్నించినప్పటికీ గరుడుడు కదలలేక పోవుట గ్రహించి క్రోధోద్రిక్తుడై నీలాచలమును ఉట్టడిగించుటకు ఆ పర్వతమును తన రెండు చేతులలోనికి తీసికొనెను. అంత కామాఖ్య క్రోధితయై తన సిద్ధ సూత్రము (పాశము) తో వైకుంఠుని బంధించి లీలామాత్రముగ

వారందరినీ లవణ సముద్రమందు విసరివైచెను. విష్ణు భగవానుడు మోహితుడై, బంధ విముక్తుడగుటకు శత విధముల ప్రయత్నించి విఫలుడుయ్యెను. దేవి కామాఖ్య విష్ణువు యొక్క వ్యాపక శక్తినీ, జ్ఞానమును సహితము నశింపజేసెను. జ్ఞాన శూన్యులై వారు ఆ సాగరమున దు:ఖితులై దీర్ఘకాలము కాలము వెళ్ళబుచ్చసాగిరి.

వీరిని కానక లోక పితామహుడయిన బ్రహ్మ వీరిని వెదకుచూ, చివరకు లవణ సాగరమున వీరిని కాంచి, తన చేతినిచ్చి వారినిపైకి లాగుటకు ప్రయత్నించెను. కానీ కామాఖ్యా మహిమచే పితామహుడు సహితము స్థంభీభూతుడాయెను. వీరిని వెదకుచూ ఇంద్రాది దేవతలేతెంచి వీరిని పైకి తెచ్చుటకు వారును విశ్వప్రయత్న మొనరించి, దేవీ మాయచే వారును స్థంభీభూతులై సాగరమున పడిరి. అటు పిదప వీరందరినీ వెదకుచూ దేవగురువైన బృహస్పతి హిమాలయ శిఖరమునున్న మహాదేవుడు శంకరుని వద్ద కేగి, విధి విధానముగా ఆయనకు ప్రణమిల్లి, స్తుతించి, దేవతల విషయమై ఇట్లు ప్రశ్నించెను "ఓ! జగదాధారా! సంసార శాంతి ప్రదాతా! నేను ఇంద్రాది దేవతలను వెదకుచు నీ వద్ద కేతెంచితిని. బ్రహ్మ, విష్ణువులు, దేవతలు వారి వారి స్థలములందు కానరారైరి. వారు ఏ అవస్థయందుండిరో తెలియకున్నది. స్వామీ! దయచేసి వారి విషయమై తెలుపవలసినది. మీ ఉపదేశానుసారముగ నేను వారిని అన్వేషింతును." అంత శివుడు తన దివ్య దృష్టిచే సర్వము గ్రహించి, జరిగిన విషయ మంతయు బృహస్పతికి ఎరింగించి, "దేవగురు! మీ అంతట మీరు అచటి కేగిననూ మీకు వారి గతియే పట్టును. అంతేకాక మీరు వెనుకకు తిరిగి వచ్చుట అసాధ్యము." ఈ విధముగ పలికి వృషధ్వజుడు బృహస్పతి సహితుడై విష్ణ్వాదుల వద్ద కేగి ఇట్లు ప్రశ్నించెను "దేవతలారా! మీ ఈ దురవస్థకు కారణమేమి? మీరందరూ కదలిక లేక జ్ఞాన వర్జితులై, మూఢుల వలె ఎందుకు ప్రవర్తించుచున్నారు?" అది విని విష్ణు భగవానుడు "మహాదేవా! నేను గరుడునిపై నెక్కి విహరించుచూ, నీలాచలమను పర్వతము మాగమనమును ఆపుట గమనించి, ఆ పర్వతమును అచట నుండి దూరముగ విసిరివేయవలెనని సంకల్పించితిని. వెంటనే గరుడుని సహితమై నేను ఇచటకు విసరివేయబడి, చిరకాలము నుండి ఇచటనే చతికిలపడితిని. అయిననూ మహామాయకు నాపై ప్రసన్నత కలుగుటలేదు. ఇచట కేతెంచిన ఈ బ్రహ్మాది దేవతలు సహితము మహాదేవి యొక్క మాయచే బంధింపపడిరి. అంధకాంతకా! మీరు మా యందు దయదలిచి, మమ్ము ఆ దేవి యొక్క లోకమునకు గొనిపోవలసినది. మేము బంధ విముక్తులమై శ్రద్ధా భక్తులతో ఆ దేవిని ప్రసన్నులము కావించుకొందుము."

ఇది విని నేను (శివుడు) కరణార్ద్ర హృదయుడనై బ్రహ్మాదులతో ఇట్లు పలికితిని, "మీరందరూ తొలుత సుందర కామేశ్వరీ కవచమును మీ శరీరమున ధరించి, అద్దాని సహాయముతో పైకి ఎగిరి ఆ దేవిని చేరుటకు ప్రయత్నింపవలసినది. ఆ కవచ మహిమ చే నేను ఇచటికి ఏతెంచిననూ ఆ మాయకు లోబడలేదు. ఈ బృహస్పతి నా సంసర్గముచే ఆ మాయకు లోబడలేదు. నేను మీకు ఆ కవచమును తెలిపెదను. ఆ ప్రభావము వలన మనమందరము సుఖ పూర్వకముగ కామాఖ్యా దర్శనము కావించెదము.

కామాఖ్యా కవచము: ఈ కవచమునకు ఋషి బృహస్పతి, అనుష్టుప్ చందస్సు. సర్వ సిద్ధ్యర్థము దీనిని ఉపయోగింపవచ్చు. కామేశ్వరి దేవి నా శిరమును, కామాఖ్య నేత్రమును, శారద నా రెండు చెవులను, త్రిపురాదేవి నా ముఖమును రక్షించుగాక! కంఠమును మహామాయ, హృదయమును కామేశ్వరీ, జఠరమును కామాఖ్యా దేవి, నాభిని శారద, పార్శ్వ భాగములను త్రిపురాదేవి, మహామాయ లింగమును, కామేశ్వరి గుదమును, కామాఖ్య రెండు ఊరువులను, రెండు మోకాళ్ళను శారదాదేవి, రెండు కాళ్ళను త్రిపురాదేవి, కేశములను కోటేశ్వరి, నాసికను దీర్ఘిక, దంత సమూహమును భైరవీ, అంగములను మాతంగీ రక్షించుగాక! బాహువులను లలితాదేవి, చేతులను వనవాసినీ, అంగుళులను వింధ్యవాసినీ, గోళ్ళను శ్రీకామ, రోమకూపములను గుప్తకామాదేవి, కాళ్ళ యొక్క అంగుళులు, మణమలు భువనేశ్వరీ దేవి రక్షించుగాక!

"క్లీం" బీజము చే రక్షణ: "ఓం" కారము జిహ్వను, "క" కారము కంఠము లోపల, "ల" కారము వక్షము లోపల,

“ఇ” కారము జఠరాంతరము, అర్ధ చంద్రము ఉదరము క్రింది భాగము, బిందువు యోని లోపల నన్ను రక్షించుగాక!

“త్రీం” బీజము చే రక్షణ: “త” కారము నా చర్మమును, “ర” కారము నా ఎముకలను, “అ” కారము సర్వ నాడులను, “ఈ” కారము అన్ని కీళ్ళను, అర్ధ చంద్రము స్నాయువు (కండరములను), బిందువుమజ్జను రక్షించుగాక!

అష్ట దిశల యందునూ వైష్ణవీ మంత్రము “(అకచటతపయష)” యొక్క ఎనిమిది అక్షరములు నన్ను ఉద్ధరించుచూ, అన్ని దిశల యందు నన్ను రక్షించుగాక! ఊర్ధ్వ, అధో భాగములందు రెండు సేతువులు “(ఓం ఓం)” నన్ను కాపాడుగాక! శారదా మంత్రము యొక్క నవాక్షరములు నాసికాదులను అన్ని వైపుల నుండి నన్ను రక్షించుగాక! త్రిపురా దేవి యొక్క మూడు అక్షరములు వాత, పిత్త, కఫముల వికారముల నుండి, “ఓం” కారము, భూత, పిశాచ, దుర్నివార, మాంసభోజిలైన ప్రేతముల నుండి నన్ను రక్షించుగాక! ప్రకృతి రూపయై జగత్తునంతయు నిండియున్న మహామాయ, జగన్మయి కామేశ్వరీ దేవికి నమస్కరించుచున్నాను.

**కామాఖ్యారూపము:** కుంకుమ వంటి ఎర్రని శరీర ఛాయ కలిగి, మణిరత్న విభూషితయై, శ్వేతప్రేతమందు సుస్థిరమై, చేతుల యందు వరదాభయముద్ర, రుద్రాక్షమాల, పాశము కలిగి, సౌమ్యమయిన రూపము కలిగి, జ్ఞాన ధ్యానములందు ప్రతిష్ఠితయై, బ్రహ్మేంద్రాది దేవతా పరివృతమై, బిందు సహిత బీజాక్షర మంత్రమందు పూర్ణరతి కలిగిన దేవి కామాఖ్యను నేను సిద్ధిహేతువై నమస్కరించుచున్నాను. లోకమందు సర్వగుణములతో ప్రకాశించునది, వంపుగల నడుము కలిగి హావభావయుక్తమయినది, ప్రకటితరూపమందు నమ్రత కాలవాలమైనది, పరమ శాంతితో విరాజమానమైనది, యమునికి సహితము అంతము కలిగించునది, పరమ కళ్యాణకారిణి, శుభముఖి, పవిత్ర ప్రణవరూపిణి, వరదాభయహస్త, కామ శబ్దముతో కూడిన ఈశ్వరీ, కామేశ్వరీ! మమ్ము రక్షించుగాక!

ఏ సాధకుడు ఈ కవచమును ఒక్కమారు పఠించిననూ కామాఖ్యా దేవి వానిని వెంబడించి యుండును. వానిని ఆది వ్యాధులు, అగ్ని, జలము, శత్రువులు, రాజులు, భూతప్రేతములు, బాధింపవు. ఇహలోకమందు దీర్ఘాయువై, సర్వ భోగములను, పుత్ర పౌత్రాదులను అనుభవించి, పరలోకమందు దేవీ ధామము చేరి నిత్యానందము ననుభవించును. ఒక వేళ సాధకుడు యుద్ధ రంగమందు లేక ఇతరులచే బంధింపబడిన ఎడల ఈ కవచ స్మరణ మాత్రమున ఒక్క క్షణములో విముక్తుడగును.

ఈశ్వరుని నుండి ఈ కవచమును విని బ్రహ్మ, విష్ణ్వాదులు, ఈ కవచమును తమ శరీరమందలి వివిధ అవయవములందు న్యాస మొనర్చుకొనిరి. తక్షణము వారందరూ మహామాయా ప్రభావమున సాగర జలముల నుండి బయటకు వచ్చి, భూమిని చేరి, అచట నుండి నీలకూట పర్వతమునకు కామాఖ్యా దర్శనమున కేగిరి. విష్ణు భగవానుడు మహామాయా ప్రభావమును తెలిసికొని ఆ తల్లిని కాంచి ఇట్లు స్తుతించెను “తల్లీ! నీవే ప్రకృతి. నీవే పంచ భూతములు. నీవే జగన్మాయవు, జగత్ కర్తవు, జగన్మయివి, మరియు ముక్తిదాయినివి. స్థూలసూక్ష్మ రూపిణివి నీవే! నీవు పరమునకు సహితము పరాత్మికవు. ఓ! శుభే! నీవు చతుర్విధ పురుషార్థప్రదాయినివి. నిష్పాపివి. నీవు ప్రసన్నమయిన సర్వ దేవతలు ప్రసన్నమగుదురు.” మహాత్ముడైన విష్ణువు ఈ విధముగ పలుకగనే జగన్మాత కామాఖ్యా దేవి తన నిజరూపము తో ప్రత్యక్షమై “బ్రహ్మాదుల తో సహితముగ ఓ! విష్ణూ! మీరందరూ శీఘ్రముగ నా యోని మండలము నుండి వెలివడుచున్న జలములందు స్నానమాచరించి, ఆ జలపానము చేయవలసినది. విష్ణువు సర్వ దేవతా సహితుడై, తక్షణము ఆ కార్యమాచరించి, స్వర్గమున కేగి అచట ఉపస్థితమైన కామాఖ్యాదేవిని కాంచిరి.

అచట వారందరికీ అనేక నీలకూట పర్వతములు, యోని మండలములు కానపట్టినవి. వారందరూ ఆ పర్వతముల నధిరోహించి తిరిగి ఆ నీటి యందు స్నానమాచరించిరి. వారందరూ రోగ దోష రహితులై, విస్మయ చిత్తులై, కామాఖ్యా యోని మండలమును, దేవ గురువైన బృహస్పతిని, నన్ను (శివుడు) స్తుతించి వారి వారి ప్రదేశములకు చనిరి. భేతాళ

భైరవులారా! మీకు కామాఖ్యా మహాత్మ్యమును, కవచమును తెలిపితిని. మీరు దీనిని యథోచితముగ వినియోగింపవలసినది. ఇక ఈ కామాఖ్యా మహాత్మ్యమును ఏమి వర్ణింతును? ఈ యోని మండలము ను స్పర్శించిన శిల సహితము స్వర్ణమగును. ఈ యోని మండలమందు స్నాన పానాదుల కావించిన మనుష్యుడు పునర్జన్మ నొందక, అంత్యమున మోక్షము నొందును.

**(శ్రీ కాళికా పురాణమందలి కామాఖ్యా కవచము, మహాత్మ్యము అను డెబ్బది రెండవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది మూడవ అధ్యాయము

**(మాతృకా న్యాసము)**

మహాదేవుడు "భేతాళ భైరవులారా! మీరిరువురికి ఇపుడు మాతృకాన్యాసము తెలిపెదను. దీనిని ఆచరించినంత మాత్రమున మానవుడు దేవత్వము నొందును. వాక్, బ్రాహ్మణీ మొదలగువారు మాతృకలు అని తెలుపబడుదురు. అన్ని అచ్చులు, హల్లులు, వీరి మంత్రములే! వీనికి చంద్రబిందువు జోడించిన అవి సాధకునకు సమస్త కామనలు పూర్ణమొనరించును. ఈ మాతృకామంత్రములకు ఋషి సాక్షాత్ బ్రహ్మ. చందస్సు గాయత్రి. దేవత సరస్వతి. శరీర శుద్ధికి, అర్థ సాధనకు ఈ మంత్ర వినియోగము గూర్చి తెలిపెదను. హల్లుల మొదటి వర్గమయిన "క" (క ఖ గ ఘ ఙ) లకు "అ" కారము, చంద్రబిందువు జోడించి బాహ్యాంగముల యందు న్యాసమొనర్పవలెను. ఈ మొదటి వర్గమును రెండు బొటన వ్రేళ్ళ యందును న్యాసమొనర్పవలెను.

"చ" వర్గమునకు (చ ఛ జ ఝ ఞ) హ్రస్వ మరియు దీర్ఘ "ఈ" కారము మరియు "స్వాహా" జోడించి రెండు తర్జనుల యందు న్యాసమొర్పవలెను.

"ట" వర్గమునకు (ట ఠ డ ఢ ణ) హ్రస్వ, మరియు దీర్ఘ "ఉ" కారము మరియు "వషట్" జోడించి వానిని రెండు మధ్య వేళ్ళ యందు న్యాసమొనర్పవలెను.

"త" వర్గమునకు ( త థ ద ధ న) హ్రస్వ మరియు దీర్ఘ "ఏ" కారము మరియు "హుం" జోడించి వానిని రెండు అనామికల యందు న్యాసమొనర్పవలెను.

"ప" వర్గమునకు (ప ఫ బ భ మ) హ్రస్వ మరియు దీర్ఘ "వ/వో" కారములు మరియు "ఔషట్" జోడించి వానిని రెండు కనిష్ఠికల యందు న్యాసమొనర్పవలెను.

"య" నుండి "క్ష" వరకు (య ర ల వ శ ష స హ క్ష) "అం" మరియు "అ:" జోడించి చివర ఫట్ యుంచి రెండు అరి చేతులు, చేతుల వెనుక భాగములందు న్యాసమొనర్పవలెను.

శరీరము యొక్క అన్య భాగములందు అస్త్రన్యాసమొనర్చుటకు "వషట్" కారము ఉపయోగింపవలెను. ఏ విధముగ ఈ ఆరు విధముల కరన్యాసము కావించితిమో, అట్లే ఆ ఆరు క్రమములు ఉపయోగించి హృదయాది ఆరు అంగముల యందును, కాళ్ళు, మోకాళ్ళు, ఊరువులు, గుహ్యము, పార్శ్వములు, వస్తిక్షేత్రము; ఆరు అంగములు – భుజములు, చేతులు, నడుము, నాభి, పొట్ట, స్థనములు; ఆరు అంగములు – ముఖము, చిబుకము, గండ స్థలము, చెవులు, లలాటము, భుజములు; ఆరు అంగములు – రోమ కూపములు, బ్రహ్మ రంధ్రము, గుదము, రెండు తొడలు, కాలివేళ్ళు, గోళ్ళు;

ఈ విధముగ ప్రతి ఆరు అంగముల యందును పై తెలిపిన విధముగ న్యాసమొనర్చిన ఎడల ఆ సాధకుడు

సర్వయజ్ఞ లేక పూజా సంబంధ కార్య హేతువై పవిత్రుడు, అధికారి అగును. వీటికి వినా వేరొక మంత్రములు లేవు. ఇవి సర్వ కామనలను ఈడేర్చి, చతుర్విధ ఫల పురుషార్థముల నొసంగును. ఏ సాధకుడు వాగ్దేవతలను, సర్వ మంత్రాక్షరముల మూర్తులను హృదయమందు ధ్యానమొనర్చి, మాతృకా మంత్రములతో మూడు మార్లు జలపానము ఒనర్చిన ఎడల అతడు వక్త, విద్వాంసుడు, బుద్ధిమంతుడు మరియు శ్రేష్ఠ కవి అగును.

సాధకుడు తొలుత సర్వ వర్ణములకు చంద్ర బిందువు జోడించి పలుకవలెను (అం ఆం ఇం ఈం). తదుపరి సర్వ వర్ణములు (అ–క్ష పర్యంతము) పూరకము కావించుచూ జలము తీసికొన వలెను. తిరిగి అదే ప్రక్రియ కుంభకము, రేచకము నందు కావించిన అయ్యది మూడు మార్లు జలము సేవించినట్లగును. ఈ విధముగ కావించు సాధకుడు మిక్కిలి బలవంతుడై, పండితుడై, పుత్రపౌత్ర వంతుడగును. త్రిసంధ్యల యందునూ మాతృకా మంత్రము చే మంత్రింపబడిన జలము స్వీకరించుట చే సాధకునకు కవిత్వ శక్తి కలిగి సర్వకామనలను పొందును. ఏ సాధకుడు మాతృకా మంత్ర పూరిత జలము నిరంతరము పూరక, కుంభక, రేచక ప్రక్రియతో సేవించునో ఆతడు లోకమందు మహాకవి, శక్తిశాలి, సత్యవిక్రముడు, సర్వ జన ప్రియుడై, పరలోకమున మోక్షము నొందును. ఆతడు రాజులను, రాజ పుత్రులను, స్త్రీలను వశము చేసికొనును. న్యాసకార్యమందు మాతృకా ప్రయోగము ఎట్లు కావింపబడినదో, అట్లే ఆచమన కార్యమందు అదే క్రమము పాటింపవలెను. దేవ, దానవ, ఋషులకు ఏ ఏ మంత్రములు కలవో, ఆ మంత్రములన్నియు మాతృకా మంత్రములందు నిత్య ప్రతిష్ఠమై యున్నవి. ఈ మాతృకా మంత్రము సర్వ మంత్ర, సర్వ వేద స్వరూపియై చతుర్విధ పురుషార్థములను ప్రసాదించును. పుత్రులారా! ఇపుడు ముద్రా విభాగమును వినుడు.

**(శ్రీ కాళికా పురాణమందలి మాతృకా న్యాసమనెడు డెబ్బది మూడవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది నాల్గవ అధ్యాయము

**(ముద్రా విభాగము; అష్టవిధి యోని మద్ర; మంత్ర రహస్యము)**

పరమేశ్వరుడు తిరిగి చెప్పదొడంగెను "పుత్రులారా! మీకు తొలుత యోనిముద్ర గూర్చి వివరించితిని. అయ్యది ఎనిమిది విధములు. అందలి తొలి యోని ముద్ర మీకు వివరించితిని. రెండవ ముద్ర కామాఖ్యా దేవికి సంబంధించిన ఖేచరీ ముద్ర. ఈ అద్భుత గుప్తముద్ర తెలియుట చే చండికా దేవి సంతుష్ఠ యగును.

**ఖేచరీ ముద్ర:**

1) కుడి చేతి అనామిక (ఉంగరపు వేలు) ఎడమ చేతి చూపుడు వేలు చివర కలుపవలెను.

2) కుడి చేతి చూపుడు వేలు ఎడమ చేతి అనామిక కు కలుపవలెను.

3) రెండు చేతుల మధ్య వేళ్ళను చివర కలిపి వానిని ముందు కలిపిన వేళ్ళపై భాగమునకు తీసికొని రావలెను.

4) బొటనవేలి చివర బాగములను ఆ చేతి చిటికెన వేలి మొదలు వద్ద యుంచవలెను.

5) ఇపుడు రెండు చిటికెన వేళ్ళను చివరలు కలుపవలెను.

**గుహ్యాయోని ముద్ర:**

సర్వము ఖేచరీ ముద్రవలె కావించి ఈ క్రింది మార్పులు చేయవలెను.

1) చిటికెన వేళ్ళను రెండింటినీ ఒకదాని ప్రక్కన ఒకటి యుంచవలెను. (చివర్లు కాదు).

2) ఏ చేతి బొటన వేళ్ళను ఆచేతి చిటికెన వేళ్ళ మధ్య భాగమున యుంచవలెను. (మొదలు కాదు). ఇయ్యది కామేశ్వరీ దేవికి ప్రియము.

**త్రిశంకరీ యోని ముద్ర:**

సర్వము గుహ్యయోని ముద్ర వలె కావించి బొటన వేళ్ళ చివరలను ఆ చేతి మధ్యవేళ్ళ మధ్యన యుంచవలెను. ఇయ్యది త్రిపురా దేవికి మిక్కిలి సంతుష్టి నొసగును.

**శారదీయ ముద్ర:**

సర్వము గుహ్యయోని ముద్రవలె కావించి ఈ క్రింది మార్పులు కావింపవలెను.

1) రెండు చిటికెన వేళ్ళను ఒకదాని ప్రక్కన ఒకటి యుంచి, వానిని అరచేతులలోనికి తీసికొని రావలెను.

2) రెండు బొటన వేళ్ళు ఆ చేతి చిటికెన వేలి మొదలు వద్ద యుంచవలెను.

ఇయ్యది శారదాదేవికి ప్రియము.

**యోగినీ యోగముద్ర:**

1) రెండు చేతులు దగ్గరకు చేర్చవలెను.

2) రెండు బొటన వేళ్ళు ఒకదానికొకటి పెనవేయవలెను.

3) మిగిలిన వేళ్ళు కేవలము చివర్ల వద్ద కలువవలెను.

4) అరిచేతుల మధ్య ఖాళీ వదులవలెను.

ఇయ్యది యోగినులకు ప్రియము కలిగించును.

ఈ ముద్రలన్నియు కామేశ్వరీ దేవికి, మిగిలిన దేవతలకు సహితము ప్రియము. యాత్రలందు, సమరములందు, వాదవివాదములందు, జగడములందు ఈ ముద్రలు కావించిన వానికి విజయము సునిశ్చితము. చండికా దేవి యొక్క పూజ, స్మరణ, విసర్జన సమయములందు కర్మ భేదము ననుసరించి ఈ యోని ముద్రలు తెలుపబడినవి.

ఇపుడు వామ, దక్షిణాచారముల భేదము, మంత్ర శుద్ధి, రహస్యములను తెలిపెదను. ఈ యోని ముద్రలు పూజా విసర్జన కాలమందు చేయదగినవి. మంత్రములచే చుట్టూ కావింపబడు సూక్ష్మ పంజరము "మంత్ర రహస్యము" అని మంత్ర వేత్తలచే ఘోషింపబడినది. కామాఖ్యా పూజకై మండలము యొక్క మధ్యన భోజపత్ర చెట్టు బెరడుపై ఒక షట్కోణమును గీసి, అందు పై మూడు కోణముల వద్ద మూడు మార్లు కామాఖ్యా మూల మంత్రమును లిఖింపవలెను. క్రింది మూడు కోణముల వద్ద బ్రహ్మ, ఇంద్ర, శివుల బీజమంత్రములు, మదనబీజముతో కలిపి లిఖింపవలెను. ఇపుడు ఆ భోజపత్ర బెరడును కుడి చేతిలోనికి తీసికొని, మాలను గైకొని, సాధకుడు ఉత్తరాభిముఖుడై, వేయిమార్లు మూల మంత్రమును జపింపవలెను. ఉత్తమ సాధకులు ఈ విధముగ కావింపబడిన భోజపత్ర బెరడును కుడిచేతికి, లేక కుడి భుజమునకు కట్టుకొనిన, ఆతడు దీర్ఘాయువై, సర్వలను వశపరుచుకొని, ధనధాన్య సమృద్ధి కలిగి, ఇహలోకమందు సర్వ సుఖములు అనుభవించి, మరణించిన పిదప దేవీ లోకమున కేగును.

భోజపత్ర బెరడుపై అష్టదళ కమలమును, దాని లోపల షట్కోణమును, ఒక పవిత్ర జలముతో కానీ, రంగునీటి

తో కాని నిర్మించి (గీసి), అద్దాని ఎనిమిది దళముల యందు ఉత్తరము నుండి మొదలుపెట్టి వైష్ణవీ తంత్రమందు తెలిపిన ఎనిమిది అక్షరములను (అకచటతపయష) లిఖించి, మధ్య కర్ణికయందు కామరాజ బీజము లిఖింపవలెను. షట్కోణమందలిపై మూడు త్రికోణాగ్రములందు నేత్రబీజము (ఐం హ్రీం శ్రీం) లిఖించి, ఈ మంత్రమును సాధకుడు ఎడమ చేతితో పట్టుకొని, కుడి చేతిలో మాలధరించి మూడు వేల సార్లు మూల మంత్రమును జపింపవలెను. తదుపరి ఆలస్యము చేయక వైష్ణవీ రూప ధ్యానము కావించి, వేయిమార్లు ప్రాణాయామము చేసి, ఆ మంత్రమును భోజ పత్ర బెరడును కంఠమందు ధరింపవలెను. అట్లు కావించిన సాధకుడు రాజపుత్రడయినచో ఆతడు రాజగును. బ్రాహ్మణుడు కవి, విద్వాంసుడు, వక్త అగును. భూత, పిశాచ, రాక్షస లేక ఏ ఇతరుల చేత ఆతడు జయింపబడడు. ఇహలోకమందు దీర్ఘాయువై బలబుద్ధి యుతుడై మరణానంతరము మోక్షము నొందును.

సాధకుడు భోజపత్ర బెరడుపై చతుద్వారమండలమందు బిల్వరసము తో అష్టదళ పద్మము, దానిమధ్య షట్కోణము గీసి, అష్టదళముల యందు పైన తెలిపిన విధముగ వైష్ణవీ మంత్రము లిఖించి, షట్కోణ మందలి పై మూడు కోణముల యందు త్రిపురా బీజ మంత్రమును "ఐం క్లీం సౌ:", క్రింది మూడు కోణములపై నేత్రబీజము "ఐం హ్రీం శ్రీం" లిఖింపవలెను. మండలము యొక్క నాలుగు ద్వారములు వద్ద ఉత్తరము నుండి మొదలు పెట్టి వైష్ణవీ మంత్రమును ఏకాగ్రమున తిరిగి లిఖింపవలెను. సాధకుడు ఈ యంత్రమును కుడి చేతి యందుంచి మూడు దినములలో పదివేల మార్లు మూల మంత్రమును జపించి, ప్రసన్న హృదయుడై, మూడువేల పర్యాయములు ప్రాణాయామమాచరించి, నవమి నాటి సంధ్యాకాలమందు ఈ యంత్రమును మస్తక మందు ధరింపవలెను. ఇటువంటి సాధకుడు శతాయువై, బుద్ధిశాలి, పండితోత్తముడై, బలవీర్య, ధనైశ్వర్య యుక్తుడయిన రాజగును. ఈ మహామేధావి అయిన సాధకుడు నిత్యము, మహామాయా, కామాఖ్యా, త్రిపురా, మహాత్సాహా, శారదలను ప్రత్యక్షముగ చూచును. సింహ, సర్ప, సర్వ హాని కారకములయిన మృగములు ఈ సాధకుని స్పృశింపగనే నశించును. ఇది అసంశయము!! శాస్త్ర చర్చలందు, సంగరములందు, వాద వివాదముల యందు వీనిని నియంత్రించువారు ముల్లోకముల యందుండరు. వీరు మరణానంతరము దేవీ ధామము చేరి తదుపరి మోక్షము నొందెదరు.

ఇపుడు ఒక తెల్లని పట్టు వస్త్రము తీసికొని దానిపై వహ్నిశిఖ (కన్యాకంటి మొక్క) రసము చే ఒక మండలము, దాని లోపల అష్టదళ పద్మము, గీసి వాని మధ్య, మహామాయ, శారద, కామాఖ్య, త్రిపుర, మరియు మహోత్సాహ మంత్రములను లిఖింపవలెను. తిరిగి మండలము యొక్క రెండు ద్వారమల వద్ద ఈ మంత్రములను తిరిగి లిఖింపవలెను. ఈ వస్త్రమును ఉత్తరీయము వలె వేసికొని జపమాచరింపవలెను. జపమునకు ముందు సాధకుడు ఉపవాసము చే శుద్ధుడై, మాతృకాన్యాస మొనర్చి పంచవర్గములను (కచటతప వర్గములను) అయిదు వేల సార్లు అయిదు దినములలో జపింపవలెను. తదుపరి అయిదు వేల మార్లు ప్రాణాయామ మొనరింపవలెను. పిదప కాత్యాయినీ కవచ న్యాస మొనర్చి, మాతృకా మంత్రములతో శ్వాస నిరోధనము చేసి, మూడు మార్లు కపిల గోవు యొక్క క్షీరమును త్రావి, రాత్రి జాగరణమొనర్ప వలెను. ఈ విధముగ శరీరముపై శ్వేత వస్త్రము వలె యంత్ర ధారణ చేసిన సాధకుడు ఇహలోకమందు సిద్ధినొంది దేహాంతమున దేవీలోకమునకేగును. ఈ ప్రకారము అభిమంత్రితమైన వస్త్రమును ప్రతినిత్యము ఎవరు ధరించెదరో అద్దాని ప్రభావము తెలిపెదను. వినుము. ఆతని శరీరమును అగ్ని మండింపదు; జలము తడుపదు. శస్త్రము ఖండింపదు. భూత, పిశాచ, రాక్షస గణములు ఈ మహానుభావుని చూచినంతనే భయపడి పారిపోవును. ఆతడు ఏ ప్రదేశమున కేగిననూ, దేవ, రాజ, స్త్రీ, అన్యులందరినీ వశపరుచుకొనును. ఆతడు సాహసించిన ఎడల మేధావి, వక్త, మహారాజు, కవి, మహాద్బుద్ధిశాలి, చిరజీవి, ధనధాన్య సంపన్నుడు, అయి శత్రువులకు అజేయుడగును. ఇటువంటి సాధకుడు నివసించు నగరము వజ్రపాతమునకు గురికాదు. సర్పులు ఆయనను ఆరాధించెదరు. వానికి శారీరక, మానసిక

రోగములుండవు. ఈతడు దేవికి ప్రియపుత్రుడై మరణాంతరము మోక్షము నొందును. తన పతిచే ఇటువంటి యంత్ర వస్త్రము ప్రసాదింపబడిన స్త్రీ పతివ్రతయై, దీర్ఘాయువై, పుత్ర పౌత్రులతో వర్ధిల్లును.

ఇప్పటి వరకు మీకు ఇరువది మంత్రములను వర్ణించితిని. వీనియందు ఏ ఒక్కటి హృదయమందు స్థాపించిననూ, లేక ఈ యంత్రములన్నియు లిఖించి గళమందు దాల్చిననూ, ఆతడు ఈ భూమిపై దేవేంద్రుని వలె వెలుగును. ఆతడు తొలుత తెలుపబడిన ఫలములన్నింటినీ, తక్షణము ప్రాప్తించును. ఆతడు సర్వలోకములందలి దేవతా స్త్రీలను దర్శించును. వేల కొలది యంత్రములందు ఎనిమిది యంత్రములు మీకు తెలిపితిని. వానిని ఒక శ్వేతవస్త్రము నందు లిఖించి, తన శరీరముపై ధరించిన ఎడల సర్వము ప్రాప్తించును. ఎవరేని క్షత్రియుడు ఈ ఎనిమిది యంత్రములను యుద్ధకాలమందు తన వక్షమున ధరించి, దేవి యొక్క యంత్రాక్షరములను తన బాహ్యాంగములపై ధరించి తదుపరి గళమందు హరి, వక్షమందు బ్రహ్మ, రెండు స్థనముల యందు గణేశ సహిత శివ, భుజములు మరియు అంగసంధుల యందు విష్ణువు మరియు వైష్ణవీ, రెండు భుజముల యందు లక్ష్మీ, సరస్వతుల బీజమంత్రములు, లిఖింపవలెను. ఈ విధముగ అష్టాంగ విధానముతో రణమునందు తన శరీరమందు బీజమంత్ర కవచధారణ చేసి శివాదేవి యొక్క చింతన చేయవలెను. అంతేకాక మానవుడు తన తిలక మధ్య భాగమున సర్వ మంత్రాక్షరములతో కూడిన ఉత్తమ మంత్రమును లలాటమందు లిఖింపవలెను. తదుపరి వైష్ణవీ తంత్రమందు తెలుపబడిన మంత్రమును తన ఎనిమిది స్థానములందు చేతిని నిడుకొని ఎనిమిది మార్లు జపించి, అపుడు రణభూమి కేగవలెను. ఇటువంటి సాధకుడు సురక్షితుడై, సంగరమందు నా (శివుడు) వలె చెలరేగును. ఆతనిపై వేయబడు శస్త్రాస్త్రములు మహానలమందు పడిన గడ్డి పోచల వలె నశించును. ఆతని శత్రువులు దూరమై, ఆతడు నరశార్దూలుడై, వీరాగ్రణియై, అద్వితీయ బల సంపన్నుడగును. ఇది కామాఖ్యా రహస్యము.

ఇపుడు వైష్ణవీ తంత్రమందు ముఖ్యమయిన త్రిపురా రహస్యమును తెలిపెదను. వినుడు. త్రిపురా మంత్రములన్నింటినీ ఏకత్ర మొనరించిన అవి ముప్పదిమూడు వేలు అగును. ఇందలి ప్రథమ మంత్రము వాగ్భవ బీజము "ఐం". రెండవది కామరాజ బీజం "క్లీం". మూడవది మోహన బీజము. నాల్గవది రెండు మార్లు ఉచ్చరింపబడిన వాగ్భవ బీజము "ఐం ఐం". అయిదవ మంత్రము – రెండు మార్లు వాగ్భవ మంత్ర ముచ్చరించి అపుడు నేత్రబీజము పలకిన "ఐం ఐం ఐం హ్రీం శ్రీం". ఆరవ మంత్రము – నేత్రబీజము యొక్క ద్వితీయ వర్ణము, కామబీజము, వాగ్భవ బీజముల సంపుటి – "హ్రీం ఈం ఐం." ఏడవ మంత్రము – నేత్ర బీజమునకు వాగ్భవమును జోడించిన ఆ సంపుటి – "ఐం హ్రీం శ్రీం ఐం". ఎనిమిదవ మంత్రము – వాగ్భవమునకు నేత్ర బీజము జోడింపవలెను – "ఐం ఐం హ్రీం శ్రీం". పదవ మంత్రము – కామరాజ బీజమునకు తరువాత మోహన మంత్రము జోడింపవలెను. పదకొండవ మంత్రము – డామరు మంత్రమును ముందర, వాగ్భవమును తరువాత ప్రయోగించిన అయ్యది "ధం ఐం" అగును. పన్నెండవ మంత్రము – త్రిపురా మంత్రమునకు మహః జోడింపవలెను.

వర్ణాక్షరముల అంతిమాక్షరమునకు అగ్నియుక్త వాగ్భవమును జోడించిన అయ్యది త్రిపుర భైరవికి ప్రథమ బీజమగును. "హ్రైం". వర్ణాక్షరములందలి చివరి అక్షరమునకు ముందు అక్షరమునకు వహ్ని బీజము, చంద్రబిందువు జోడించి దానిని చతుర్ధ వర్ణయుక్తము (ఈ) చేసిన అయ్యది త్రిపుర భైరవికి ద్వితీయ బీజమగును. "శ్రీం". "స" కారమును వహ్ని బీజము, అంతిమ స్వరము "ఔ" మరియు చంద్ర బిందువు, విసర్గ జోడించిన తృతీయ బీజము "స్రౌః" అగును. ఇపుడు త్రిపుర భైరవీ మంత్రము "హ్రైం శ్రీం సౌః" పృథివి యందు ఈ రహస్యము నెరిగిన మానవుడు శ్రేష్ఠుడు, విద్యాధరుల కంటె అధికుడు. పైన తెలిపిన పదమూడు మంత్రములు ఇరువది వేల త్రిపురా మంత్రముల యందు ఉజ్వలములు.

ఇపుడు త్రిపుర బాలామంత్రమును తెలిపెదను వినుడు. వాగ్భవము, కామరాజము, "స" కారమునకు విసర్గ, బిందువు మరియు అంతిమ స్వరము జోడించిన అయ్యది త్రిపురా బాలా మంత్రము "ఐం క్లీం సౌ:" అగును. త్రిపురబాల ఆద్య. మధ్యత్రిపుర గూర్చి తెలిపితిని. చివరిది త్రిపుర భైరవి; అమిత తేజస్విని. ఇపుడు త్రిపురబాలా, మరియు త్రిపుర భైరవిల సర్వ సిద్ధి ప్రదాయకము లైన పూజా విధిని తెలిపెదను.

మండలము పూర్వము త్రిపురాదేవికి వలెనే నిర్మించి, దానికి ద్వారముల నేర్పరచవలెను. వీరికి సహితము పూర్వము వలె షట్కోణము గీయవలెను. ఇందు అధోముఖ షట్కోణము శక్తి. ఊర్ధ్వముఖ త్రికోణము శంభువు. ఇపుడు ఆరు కోణముల వద్ద ఆరు అక్షరములు లిఖింపవలెను. తదుపరి పాపోత్సారణము, భూత శోధనము, దహన, ప్లవన, పాత్ర ప్రతిపత్తి ప్రక్రియలను కావింపవలెను. ఈ ప్రక్రియలన్నియు కామాఖ్యా పూజావిధి యందు తెలిపిన విధముగనే కావించి, అన్ని స్వరములతో అంగన్యాస, కరన్యాసములు కావింపవలెను. త్రిపుర భైరవీ ధ్యానము: ఈ దేవి చతుర్భుజ; ఎర్రని శరీర వర్ణముతో శోభించుచూ, ఎర్రని వస్త్రధారియై దక్షిణ హస్తములందు ఊర్ధ్వమున మాల, క్రింది చేయి యందు పుస్తకము, వామ హస్తములందు వరదాభయ ముద్రలు యుండును. ఈ దేవి వేలాది సూర్యుల కాంతితో ప్రకాశించుచూ, త్రినేత్రయై, గజగమనయై, పీనపయోధరయై, శ్వేతప్రేతముపై ఆసీనయై, ప్రసన్నముఖి, సుచిస్మితయై, సర్వాభరణ భూషితయై విరాజిల్లు చుండును. ఈమె శిరము, వక్షము, నడుముపై మూడు కపాలమాలలు వ్రేలాడు చుండును. నేత్రములు మదిరా పానము చే ఎరుపెక్కి యుండును. ఇటువంటి వరదాయిని అయిన త్రిపుర భైరవిని ధ్యానింపవలెను.

ఇపుడు పీఠాది తంత్రములు తెల్పెదను. ఇవి "త్రిపురాందేవి విద్మహే" అను మంత్రముతో ప్రారంభమగును. త్రిపురా గాయత్రి

త్రిపురాం దేవి విద్మహే కామేశ్వరీం ధీమహి
త్వాం తన్న: క్లిన్నే ప్రచోదయాత్ ॥

ఈ మంత్రమును విశేషముగ ఆవాహన యందు ఉపయోగించెదరు. తదుపరి స్నానాది కార్యక్రమములు వీరిరువురికి ఆచరింపవలెను. మిగిలిన ప్రక్రియలన్నియు ఉత్తర తంత్రమందు తెలిపిన విధి విధానముననే కావింపవలెను. ప్రప్రథముగా బ్రహ్మ ముహూర్తమందు నిద్రలేచి, పరమగురువును ధ్యానించి, తన గురువును, త్రిపుర భైరవిని ధ్యానింపవలెను. పైన తెలిపిన త్రిపుర భైరవీ స్వరూపము రత్న జటిత స్వర్ణ సింహాసనముపై కూర్చొని, బంగారు జరీ వస్త్రము, స్వర్ణ కుండలములు ధరించి యుండును. ఈ స్వరూపమును ధ్యానింపవలెను. పిదప శౌచ, ఆచమన, దంతధావన, కావించి దేవికి చెందిన వైదిక మంత్రముల నుచ్చరించుచూ మూడు త్రిపుర బీజములతో మూడు మార్లు స్నానమాచరింపవలెను. దేవతల నామములకు భైరవ పదము జోడించి (బ్రహ్మ భైరవ, ఇంద్ర భైరవ) ఉచ్చరింపవలెను. "ఆప: పునంతు పృథివీ", "ద్రుపదాదివ" మంత్రములు పలుకుచూ ఆచమనము చేసి "ఇదం విష్ణు భైరవ విచక్రమే" మంత్రముతో మృత్తికా గ్రహణము కావింపవలెను. త్రిపుర భైరవీ మంత్రముచే ఆమెను ఆవాహన చేసి "మార్తాండ భైరవాయ" మంత్రముతో సూర్యునికి అర్ఘ్యమీయవలెను. సర్వ దేవతలకు, పితరులకు సహితము భైరవ శబ్దము జోడించి తర్పణమీయవలెను (భైరవీ మాత:, భైరవపిత:) జ్యోతిష్టోమ, అశ్వమేధాది యజ్ఞములందు కూడా దేవతలకు భైరవరూపేణ, దేవీమూర్తుకు భైరవీరూపేణ పూజన మొనర్పవలెను. మదిరాపాత్ర, ఎర్రని వస్త్రము ధరించిన స్త్రీ, మానవ కపాలము కనిపించిన ఎడల ద్విజులు భైరవీ చింతన చేయవలెను. సుందరమైన యువతీ లేక యువతులు కనిపించిన ఎడల, భైరవీ రూపము చింతించి త్రిపుర భైరవీ ప్రసన్నార్థము వారికి వందన మొనర్పవలెను. అట్లే వివాహ సమయమున సాధకుడు "నేను భైరవ

రూపుడనై స్త్రీ రూపమునున్న భైరవిని స్వీకరించుచున్నాను. అని తలంపవలెను. కన్యాదాత సహితము "నేను త్రిపుర భైరవిని భైరవునకు అర్పించుచున్నాను" అని తలంపవలెను.

ఈ భైరవీ పూజ యందు ఉపయోగించు పూజోపకరణములు మరి ఏ ఇతర పూజలయందు ఉపయోగింపరాదు. వామాచారమందు ద్విజులు ఒక్కమారు ఇతరులచే భైరవికి మద్యము సమర్పింపవచ్చు. శూద్రులు ఉత్తమ పుష్పాసవములను నిరంతరము సమర్పింపవచ్చు. త్రిపురా బాలాదేవిని వామ లేక దక్షిణాచారముతో పూజింపవచ్చును. శ్మశాన భైరవీ, ఉగ్రతారా దేవి, ఉచ్ఛిష్ఠ భైరవీ, చండీ, త్రిపురా భైరవీ యొక్క పూజ దక్షిణాచారము విడచి కేవలము వామాచారముతోనే కావింపవలెను. ఋషి, దేవత, పితరులు, మనుష్యులు, ప్రాణి సంబంధిత ఋణములు బలి వైశ్యాది పంచ యజ్ఞాదుల చే కావింపవలెను. విధి విధానములతో, స్నానదానాది ప్రక్రియలతో, తత్వజ్ఞానముతో, ఆచరించిన పూజ దక్షిణాచారము అని తెలియబడును. సర్వ దేవ, పితృగణముల, దేవీ సహితము దక్షిణాచారమందు ఉపస్థితమగును. పూజింపబడుచున్న దేవత, ఆమెయే మిగిలిన దేవతల కన్న ముందు బలిని స్వీకరించిన ఎడల అయ్యది వామాచారమగును. వామ మార్గమాచరించుచున్న సాధకుడు పంచ యజ్ఞములను ఆచరింపడు. ఈ పంచయజ్ఞములను దేవతయే స్వీకరించుట వలన ఆ సాధకుడు దేవత, పితృ ఋణ విముక్తుడు కాజాలడు. ఈ వామమార్గమవలంబించి, త్రిపురా యోగము నందు నిష్ణాతుడైన సాధకుడు, ఈ మార్గము ద్వారా అనేకమార్లు ప్రయత్నించి చివరకు మోక్షము ప్రాప్తించును. ఈ సాధకులు పంచయజ్ఞ ఋణ విముక్తులు కానప్పటికీ, ఇహలోకమందు సర్వులకు ప్రియులై సుఖైశ్వర్యములను అనుభవించెదరు. ఈ సాధకులు కాముని వంటి సుందర శరీరులై, రాజులను వశము చేసికొని, స్త్రీలను మోహింపజేసి, క్రూర మృగములను, భూత ప్రేత పిశాచములను, వశపరుచుకొని సాధకులు బాలా, త్రిపురా, మధ్యా, భైరవీ, కామాఖ్యా, ఎవరినైననూ పరమభక్తితో వామలేక దక్షిణాచారము తో పూజనమాచరించి సర్వ సిద్ధులు పొందవలెను.

మహామాయా, శైలపుత్రి, శారద, వీరిని ఎప్పుడూ దక్షిణాచారముతో వారివారి రూపములందే పూజనమొనర్పవలెను. వీరిని దక్షిణాచారము కాక అన్య భావముతో పూజించిన ఎడల ఆ సాధకుడు పాపియై పతితుడగును. శివదూతాది దేవతను సహితము దక్షిణాచారముతోనే పూజింపవలెను. వారు సాధకులను ఎల్లప్పుడూ రక్షించెదరు. వామాచారమందు స్థితిగతుడైన సాధకుడు కేవలము ఆ మూర్తులనే పూజింపవలెను. దక్షిణాచారమందు అందరు దేవతలను దేవతామూర్తులను పూజింపవచ్చును. అందువలన అన్ని విధముల దక్షిణాచారమే శ్రేష్ఠము.

భైరవా! ఇపుడు మీకు త్రిపుర భైరవీ న్యాసమును తెలిపెదను. కేవలము దీనిని ఆచరించుటవలన మానవుడు దైవత్వమునొందును. ఈ భైరవీ తంత్రమందు ఋషి దక్షిణ; చందస్సు పంక్తి. దేవి త్రిపుర భైరవి. దీనిని అర్ధ కామార్జన యందు వినియోగించెదరు. "హ" కారమును నాభియందు, "స" కారమును వస్తి (Pelvis) యందు, "వ" కారము లింగమందు "ఐ" కారము గుదము నందు న్యాసమొనర్చి, ప్రధమ మంత్రం "హ" ఊరువుల యందు, ద్వితీయ మంత్రం "స" మోకాళ్ళ యందు, తృతీయ మంత్రము "వ" పిరుదుల యందు, చతుర్ధ మంత్రము "ఐ" కాళ్ళ యందు న్యాసమొనర్పవలెను. ఈ విధముగ నాభి నుండి పాదముల వరకు మొదటి సంపుటి "హ, స, వ, ఐ" మంత్రములను మూడు మార్లు న్యాసమొనర్పవలెను. తదుపరి "హ" కారమును హృదయమందు, "స" ను ఎడమ స్థనమందు "వ" ను కుడిస్థనమందు, "ఐ" ను ఉదరమందు, పంచమాక్షరమైన "ర" ను పార్శ్వద్వయమందు, ఆరవ అక్షరమైన "ఈ" కారమును నాభి యందు న్యానమొనర్చి ఈ ప్రక్రియను మూడుమార్లు న్యాసమొనర్పవలెను. ఈ సంపుటి "హ స వ ఐ ర ఈ". ఇపుడు తృతీయ బీజ సంపుటి. ఇపుడు "హ" ను మస్తకమందు, "స" కారమును కేశాంత భాగమున, "ర" ముఖము నందు, "ఔ" హృదయమందు న్యాసమొనర్చి, ఈ ప్రక్రియను మూడు మార్లు ఆచరింపవలెను. సంపుటి "హ,స,ర,ఔ."

ఇపుడు కరన్యాసము – ఇపుడు త్రిపురాదేవి యొక్క ప్రధమ బీజము యొక్క ప్రధమాక్షరమైన "హ" ను కుడిచేతి

బొటనవ్రేలి యందు, "స" కారము తర్జని యందు, "ర" కారము మధ్యవేలి యందు, "ఐ" కారము అనామిక యందు, ద్వితీయ బీజము యొక్క ప్రధమాక్షరము "హ" కనిష్ఠక యందు, ద్వితీయాక్షరము "స" ను వామహస్తము బొటన వేలి యందు, "ఔ" కారము వామహస్త కనిష్ఠిక యందు న్యాసమొనర్పవలెను. ఈ విధముగ మూడు మార్లు న్యాసమొనరించి, బుద్ధిమంతుడయిన సాధకుడు తృతీయ మంత్రము చే రెండు చేతుల యందు విన్యాసమొనర్పవలెను. ఈ మంత్రము చతురక్షర మంత్రము "హ స ర ఔ". ఇపుడు రెండు చేతుల యందలి వేళ్ళను కలిపి, బొటన వేళ్ళ నుండి అనామిక వరకు ఒక్కొక్క జోడి వేళ్ళయందు రెండు అక్షరముల చొప్పున న్యాసమొనరించుచూ, కనిష్ఠిక ద్వయమందు అన్ని బీజవర్ణములను న్యాసమొనర్పవలెను. తదుపరి త్రిపురాదేవి యొక్క ప్రధమ బీజమును రెండు అరిచేతులందు, ద్వితీయ బీజమును చేతులకు వెనుకభాగమందు, న్యాసమొనర్చి, తృతీయ బీజమునకు "ఫట్" జోడించి, ఉచ్ఛరించి మూడు మార్లు తప్పట్లు చరుచవలెను. తదుపరి వరుసగా చెవులు, చిబుకము, గంగస్థలము, ముఖము, నేత్రములు, నాసిక రెండు భుజములు, మోచేతులు, ఉదరము, శిశ్నము, మస్తకము, కాళ్ళు, పార్శ్వ భాగములు, హృదయము, రెండు స్థనములు, కంఠము లందు మంత్రాక్షరములను న్యాసమొనర్పవలెను.

లింగమందు "ఓం రత్యై నమ:" అనియు, హృదయమందు "ఓం క్లీం ప్రీత్యైనమ:" అనియు, శీఘ్రుదేవత్వప్రాప్తికై, తృతీయ త్రిపురా మంత్రము "(హ స ర ఔ)" సహితముగ "మనోభవాయ నమ:" అని భ్రూమధ్యము నందు న్యాసమొనర్పవలెను. ఇపుడు మన్మధుని ఈశ్వరుని తో జోడించి న్యాసమొనర్పవలెను. అది ఎట్లనిన "ఓం ఈశానరూపాయ మనోభవాయ నమ:" అను మంత్రము చే ఈశానుని శిరము నందు, తత్పురుష మకరధ్వజుని త్రిపురా ఆది బీజము తో ముఖము నందు, త్రిపురా ఆది బీజముతో అఘోర కందర్పుని హృదయ మందు, వామదేవ మన్మధుని "వాం" బీజముతో లింగమందు, సద్యోజాత కామదేవుని చరణ ద్వయమందు న్యాసము చేయవలెను. "సహ రౌం ఓం ఈం ఈశానరూపాయ మనోభవాయ నమ:" మంత్రము చే ఊర్ధ్వమున "స హ రైం తత్పురుషాయ మకరధ్వజాయ నమ:" మంత్రముచే ముఖమునకు తూర్పున, "స హ రుం అఘోర కుమార కందర్పాయ నమ:" తో దక్షిణమున, "స హ రీం వాం వామదేవాయ మన్మధాయనమ:" మంత్రము చే ఉత్తర భాగమునున, "స హ ర ం సద్యోజాత కామదేవాయ నమ:" మంత్రముచే పశ్చిమ భాగమును న్యాసముఒనర్పవలెను.

ప్రతి మంత్రమునకు మొదట "ఓం" యుంచవలెను. త్రిపురాదేవి యొక్క స్వరహీన ప్రధమ బీజమంత్రమందు "ఆం ఈం ఊం ఐం ఔం" దీర్ఘ స్వరములు యుంచి షడంగన్యాస మొనర్చి, తదనంతరము ద్రావణాది పంచ బాణములను వరుసగా మూర్ధన్యము, పదద్వయము, ముఖము, లింగము, హృదయమందు యధాక్రమముగా న్యాసమొనర్పవలెను. "ఓం హ్రీం క్లీం సౌం" మంత్రముచే ద్రావణ శరమును మూర్ధమందు; "ఓం హ్రీం" మంత్రముతో క్షోభణ శరమును పదద్వయమందు," ఓం క్లీం క్లీం హ్రీం సం" మంత్రముతో వశీకరణ శరమును ముఖము నందు, అట్లే ఇతర బీజ మంత్రములతో సమ్మోహన శరమును లింగమందు, ఆకర్షణ శరమును హృదయమందు న్యాసము కావింపవలెను.

తదుపరి అష్ఠ శక్తుల యొక్క న్యాసము క్రిందనీయబడిన విధముగ అంకితమొనర్పవలెను.

**"ఐం క్లీం బ్లూం స్త్రీ స: సుభగాయై, భగాయై భగరూపిణ్యై, అనంగ కుసుమాయై, అనంగ మేఖలాయై, అనంగ మదనాయై, మదవిభ్రమ మంథరాయై నమ:"**

మంత్రజ్ఞుడయిన సాధకుడు "సభగా, భగా, భగరూపిణి, భగమాలా, అనంగకుసమ, అనంగమేఖల, అనంగమదన, మదవిభ్రమమంథరా" మొదలగు ఎనిమిది శక్తులను త్రిపుర భైరవీ రూపముతోనే ధ్యానింపవలెను. మస్తకము, లలాటము, భ్రూ ద్వయము, కర్ణ ద్వయము, నేత్రద్వయము, గండద్వయము, నాసికా పుట ద్వయము, హృదయము, ముఖము, ఈ పదునాల్గు స్థానములందు త్రిపురా భైరవీ బీజత్రయ మందలి పదునాల్గు వర్ణములను యధా క్రమములో న్యాసమొనర్పవలెను.

చిబుకము, చర్మము, గ్రీవము, కంఠము, పార్శ్వయుగళము, స్థనద్వయము, స్కంధ ద్వయము, మోచేతి ద్వయము, రెండు అరచేతులు, వాని వెనుక భాగములు, నాభి, లింగము, రెండు తొడలు, రెండు మోకాళ్ళు, రెండు పిక్కలు, రెండు పిరుదులు, రెండు మణమలు, రెండు కాలి వేళ్ళయందు "క" కారము నుండి "మ" కారము వరకు గల వర్ణములను న్యానమొనర్పవలెను. మేఖల, కంఠము, బాహుభూషణము, హారము, మాల, కుండలము, కేశబంధము చూడామణి, ఈ ఎనిమిది స్థానములపై "ల" కారము నుండి "మ" కారము వరకు మంత్రాక్షరములను న్యాసమొనర్పవలెను. వ్యతిరేక క్రమమున మూడు మూడు మంత్రాక్షరములు, మూడు మూడు మార్లు న్యాసమొనర్చి శిరముపై అమృత, యోగినీ, విశ్వయోగినీల త్రిబీజాత్మిక త్రిపురాబాలా మంత్రము యొక్క ఒక్కొక్క బీజాక్షరమును మస్తకము, బాహువు, హృదయమందు న్యాసమొనర్పవలెను

ఇపుడు పీఠ దేవతలను వదలి దేవి యొక్క అష్ట శక్తులయిన "శుభగ" మొదలగు వారిని మండలమునకు ఎనిమిది దిక్కులయందును, త్రికోణము యొక్క మూడు కోణములందు అమృత, యోగినీ, విశ్వయోగినీలను పూజింపవలెను. భైరవా! ఇపుడు త్రికోణ మధ్యమున మేఖలాది ఎనిమిది భూషణములను, నా (శివుడు) ఈశానాది పంచ ముఖములను, మనోభావాది పంచ దేవతలను, త్రిపురాదేవిని, అన్య దేవతలను పూజింపవలెను.

త్రిపురాదేవి యొక్క నిర్మాల్యధారిణి భైరవి. పూజా విసర్జనానంతరము ఈ నిర్మాల్యమును ఉత్తర దిశన పరిత్యజింపవలెను. త్రిపుర భైరవీ దేవి యొక్క మూడు మూర్తులకు పూజన మొనర్చి మంత్రమును మూడు వందల సార్లు కంటె ఎక్కువ జపము ఆచరింపవలెను. సాధకుడు తన బొటనవేలు, మధ్య, ఉంగరపు వేళ్ళతో పుష్పమాలాదులను పట్టుకొని, జింక చర్మాసనము పై వజ్రాసనము నందు కూర్చొని, నిర్జన స్థానమందు అనన్యమనస్కుడై పూజింపవలెను. త్రిపురా పూజనమందు పూజోపకరణములను, పూలను ఎడమ చేతితో మాత్రమే ఈయవలెను. లేని ఎడల ఈ క్రింది దోషములు అంకురించును. 1.ఆతని శరీరము నందు వ్యాధులు పొటమరించును. 2.ఆతని బార్యా, పుత్ర, సేవకాదులు ఆతని మాట వినక నిరంకుశులగుదురు. 3.ఆతని శరీరమందు అస్త్ర ఘాతములై ప్రాణహాని సహితము సంభవించును. అందువలన ఈ దేవిని "త్రిఛిద్ర" అని పిలుతురు. భేతాళ భైరవాలారా! దేవి యొక్క రూపమును మీకు ఎరుక పరచితిని. ఈ దేవి మరియు ఇతర దేవతా రూపములన్నియు భైరవీ స్వరూపములే! ఆమెయే యోగనిద్ర, జగన్మాత. ఆమెయే అనేక రూపములతో జగత్తు నందు క్రీడించుచుండును. మహామాయయే మూలరూపము. శారద, ఉమ, శైలపుత్రి, ఉగ్రచండా, ప్రచండా మొదలగు వారందరూ నాకు ప్రియులే! నేను వారితో పాటు భైరవ రూపము ధరించి వారి నాయకునిగ నిత్యము చరించుచుందును. ఈ విధముగ తెలిసికొని బుద్ధిమంతులైన సాధకుడు మా ఇరువురి సేవనమొనర్చెదరు.

మదిరా, మాంసాదులు సేవించి, రతి క్రీడలయందు మునిగి తేలుటకు నేను ఈ భైరవ రూపమును స్వీకరించితిని. అందువలన ఈ భైరవ స్వరూపమును వామమార్గమందు పూజింపవలెను. ఈ విధమయిన వామమార్గమాచరించుచూ, మధుమాంస భక్షణకు, భోగములకు చతుర్ముఖ భ్రహ్మ సహితము చార్వాకాది మత ప్రవక్తయై "మనోమోహుడు" అను వామమార్గ శరీర ధారణమొనర్చెను. విష్ణువు యొక్క వామమార్గ మూర్తి "నరశింహుడు" అను పేర పిలువబడును. ఈ నరశింహమూర్తి సాధకుల వారివారి అభిరుచులను బట్టి వామ, దక్షిణాది రెండు మార్గముల యందును పూజనీయుడు. అట్లే జరాయుజుడైన బాలగోపాలుడు సహితము వైష్ణవమూర్తి అయినప్పటికీ మధు, మాంస భోజి మరియు లలనాసక్తుడు. చండికాదేవికి సహితము కేవల వామమార్గమూర్తులు యున్నవి. లక్ష్మీదేవి యొక్క వామమార్గ మూర్తి "దహన భైరవి". ఈ దేవియే గ్రామ, నగరాదులను దహనమొనర్చునది. అందువలన లక్ష్మీ పూజనము ఒనర్చునపుడు ఈ దేవిని కూడా పూజింపవలెను. సరస్వతీ దేవి యొక్క వామమూర్తి "వాగ్భైరవి" ఈ దేవి శ్వేతవర్ణ. ఈ దేవి మంత్రము పూర్వమే తెలిపితిని. త్రిపురా పూజ యందు మధ్య త్రిపురా పూజన, ధ్యానము తెలిపితిని కదా! ఈమెకు కూడా సంపూర్ణముగ అదియే ప్రక్రియ. సూర్యుని వామమూర్తి మార్తాండ భైరవుడు. గణేశుని వామమూర్తి అగ్ని భేతాళుడు. వీరిందరినీ

వామాచార పద్ధతి ద్వారా పూజనమొనర్చవలెను. పుత్రులారా! ఏ మానవుడైననూ ఒక్కమారు శరీరమందు న్యాసపూర్వకముగ త్రిపుర భైరవీ ధ్యానమొనర్చి, పూజ కావించి, ఈ మంత్ర సముదాయమును జపించిన ఎడల, ఆ సాధకుడు మూడు రోజులలో అన్ని కామనలను ప్రాప్తించి, స్వరూపమున కామదేవ సమానుడై, ధార్మికుడై, శ్రేష్ఠుడగును. శరీరము నందు బలశాలియై, పరమారోగ్యశాలియై, చిరాయువై బాధారహితుడై వొప్పును. ఇయ్యది త్రిపుర భైరవీ దేవి యొక్క పూజా పద్ధతి.

ఇపుడు వైష్ణవీ దేవి యొక్క పదహారు వేల మంత్రములు శ్రద్ధగా వినవలసినది. ఇందు ఒక వేయి ఎనిమిది, మరియు నూట తొంబది రెండు మంత్రములు ఈ దేవి కొరకు వివిధ పద్ధతుల ద్వారా తెలుపబడినవి. వీనికి అను స్వరములు, విసర్గలు జోడించిన ఎడల అవి ద్విగుణీకృతములగును. అంతేకాక ఈ మంత్రములకు ముందు, వెనుక, వ్యతిరేక దిశయందు "క" వర్ణము నండి ప్రారంభించి ఒక్కొక్కటిగా, అన్ని హల్లులను వినియోగించి మంత్రవేత్త ప్రయోగింపవలెను ఓ! భేతాళ భైరవులారా! ఈ మంత్రమును ఎనిమిది భాగములుగ విభజించి వాటికి అచ్చులు జోడించి, జోడింపక, స్వర యుక్తము, స్వర రహితము, అనుస్వరము, విసర్గ యుక్తము, ఈ విధమయిన సంయోగ వియోగముల చే నూట ఎనిమిది మంత్రములు పదహారు వేలు అగును. ఈ విధముగ నా చే (శివుడు) తెలుపబడిన మంత్రములు, విడివిడిగా కానీ, సమిష్ఠిగా కలిపిగానీ, ఏ సాధకుడు తెలియునో అతడు శివలోకమున కేగును. అష్ఠమి మరియు నవమి నాడు వైష్ణవీ మూర్తిని ఏకాగ్ర ధ్యాన మొనర్చి ఈ పదహారు వేల బీజ మంత్రములనూ ఎవరు జపమొనర్చునో, ఆ సాధకుడు పొందు ఫలమును తెలిపెదను. ఆతడు చిరాయువై, బలశాలియై, అనేక వాహనములు కలిగి, అనేక సుఖముల ననుభవించి, పృథివి యందు మహారాజై వర్ధిల్లును. ఈ మంత్రములను ఎనిమిది మార్లు జపించిన ఎడల ఆ సాధకుడు సార్వభౌముడగును. మరణానంతరము ఆతడు గణములకు అధిపతి అయి, అంతమందు మోక్షము నొందును. ఆతడు సకల సద్గుణవంతుడై, దోషరహితుడై, ఇతరుల దోషములను నాశనమొనర్చు గొప్ప మంత్రవేత్తయై, సమస్త తత్వార్థ విశారధియై, రోగశోక విముక్తుడై, శత్రునాశకుడై వర్ధిల్లును.

**(శ్రీ కాళికా పురాణమందలి ముద్రా విభాగము, త్రిపురా మంత్ర రహస్యము అను డెబ్బది నాల్గవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది అయిదవ అధ్యాయము

**(పురశ్చర్య విధి)**

భగవానుడు తిరిగి చెప్పదొడంగెను "సాధకుడు వాంఛిత కామనార్థము మూడు, ఆరు, తొమ్మిది లేక పన్నెండు లక్షల మంత్ర జపమాచరింపవలెను. జాతీ పుష్పము, పొగడ, మాలతీ, కలిగొట్టు, తెల్ల పద్మము, నంధ్యావర్తము, ఘ్రుతము, అన్నము, పాయసము, పెరుగు, పాలు, మధువు, లాజలు, పంచదార మొదలగు పదునాల్గు ద్రవ్యములు త్రిపురా దేవి యొక్క పురశ్చరణ సంభారములు. పన్నెండు లక్షల జపానంతరము సాధకుడు ఈ పదార్థములను ఉజ్వలమయిన అగ్ని యందు హోమము చేయవలెను. మూడు లక్షల జపమే చేసిన ఎడల, అపుడు కేవలము కర్పూరము, ఘ్రుతము తో నాలుగు వందలు హోమము చేయవలెను. తొమ్మిది లక్షల జపానంతరము పది ద్రవ్యములతో హోమము చేయవలెను. ఆరు లక్షల జపమునకు ఎనిమిది రకముల ద్రవ్యములతో (ఆహుతులతో) హోమ మొనర్చవలెను. ఎల్లప్పుడూ నియమములివే!

బాల లేక మధ్య త్రిపురా దేవి యొక్క కుండము ఒక అడుగు మూడంగుళములు యుండి షట్కోణమై యుండవలెను. త్రిపుర భైరవీ కుండము రెండు అడుగులు యుండి చతుష్కోణమై యుండవలెను. వైష్ణవీ దేవి కుండము రెండు అడుగుల ఎనిమిది అంగుళములు యుండవలెను. సవిధి వైష్ణవీ కామాఖ్య కొరకు ఒక అడుగు పొడవు యున్న త్రికోణాకార కుండమును నిర్మింపవలెను. ఇతర కార్యముల నిమిత్తము వేరువేరు ప్రకారములయిన మండలములు కలవు. కామాఖ్యాదేవి కుండము జ్యోతిష్టోమాది యజ్ఞములందుండు కుండ పరిమాణముండవలెను. అగ్ని బాగుగా ప్రజ్వలమైన పిమ్మట పదునాల్గు ద్రవ్యములను ఒక్కొక్క ద్రవ్యము ఒక్కొక్క ఆహుతి చొప్పున పదునాల్గు ఆహుతులు ఈయవలెను. ఇది త్రిపుర భైరవికి నియమము. తదుపరి మూలమంత్రముతో మూడు వందల ఎనిమిది సార్లు హోమ మొనర్చవలెను. వంద సార్లు జపమునకు ఆరు లేక పన్నెండు మార్లు హోమమందు ఆహుతులు అర్పింపవలెను. జపాంతము నందు బలిదాన మొనర్చి రత్న, స్వర్ణ, కర్పూరాదులు దక్షిణగా ఈయవలెను. ఒకవేళ హోమ ద్రవ్యములు లభ్యము కాని ఎడల పెరుగు, పుష్పములు, ధాన్యము తో పురశ్చరణ కావింపవలెను. కానీ అన్ని ద్రవ్యములు లభించిన ఎడల పదునాల్గు ద్రవ్యములతో హోమము ఆచరింపవలెను.

ఇపుడు త్రిపురా యంత్ర రహస్యములు వినుడు. మంత్రముతోనే సాధకుడు అభిలిషితములైన లాభము నొందును. షట్కోణ మండలము నిర్మించి, ఊర్ధ్వమున మూడు కోణముల యందు త్రిపుర భైరవీ బీజత్రయము, క్రింది మూడు కోణముల యందు ఆద్యాత్రిపుర యొక్క బీజత్రయము, మధ్య త్రిపుర యొక్క బీజత్రయము మధ్యన, పీఠ యంత్రమందు లిఖించి, దాని చుట్టూ లక్కతో మాతృకా వర్ణములు రచించి, దీనినంతటినీ మూడు లోహములతో (బంగారము, వెండి, రాగి) చుట్టవలెను. ఎవరు ఈ యంత్రమును శిరమందు ధరించెదరో, ఆతడు సర్వత్ర విజయుడై, దీర్ఘాయువై, ధన, గుణ, రూపశాలియై, మణిమాణిక్యములకధిపతియై, అనేక కామోప భోగముల ననుభవించి, ఉత్తమ సంతతి నొందును. మధ్యా త్రిపుర బీజములిఖించి ఒకటి మస్తకముపై, వేరొకటి దానికి క్రింది భాగమున ధరింపవలెను. అట్లే ఆద్య త్రిపుర లేక త్రిపుర భైరవీలకు సహితము కావింపవలెను. ఈ విధముగ ఆరు ప్రకారములుగ ఈ మంత్రములు లిఖించి మూడు లోహములతో వేష్ఠిత మొనర్చవలెను. వీనిని వేనివైననూ కుడి, ఎడమ చేతులందు, హృదయ, కంఠ, మణికట్టు, లేక మస్తకమందు ధరింపవలెను. బాహువుల యందు ధరించుట చే సంపద, శిరముపై ధారణ కవిత్వమును, మణికట్టు ధారణ మోహనమును, కంఠధారణ వశీకరణము, హృదయమందు ధారణ సౌభాగ్యమును, ప్రసాదించును. భేతాళ భైరవులారా! త్రిపురా యంత్ర మంత్రములను త్రిగుణీకృత మొనర్చిన అవి ముప్పది వేలు అగును. ఇవి తెలిసిన సాధకుడు ఇహపర లోకములందు ఆపదలనొందడు. ఈ త్రిపురా మంత్ర సమూహములందలి నిశ్చిత ప్రధాన మంత్రములు (గురువుల ద్వారా ఈయబడినవి) భయనాశకములు, కవిత్వాది శక్తి దాయకములు, ధర్మార్థకామ పురుషార్థ ప్రదాయకములు, త్రిరూప సమాన్వితములు, ఈశ్వరుని నివాస స్థానములు, జ్ఞాన భాండారములు మరియు సమస్త శుభఫలదాయకములు. దీనినే త్రైపుర మంత్రమని పిలుతురు.

ఇపుడు త్రిపురా కవచమును గ్రహింపవలసినది. దీనిని తెలిసిన సాధకుని పూజ సమగ్ర లాభమొందును. ఈ కవచము యొక్క మహిమను బ్రహ్మ, కేశవుడు, సహస్రజిహ్వుడైన అనంతుడు సహితము తెలియరు. ఈ కవచ ధారణ వలన రాక్షస, జల, అగ్ని భయము యుండక సకల కళ్యాణ లాభము జరుగును. ఈ త్రిపురా కవచము యొక్క ఋషి దక్షిణ. దేవత త్రిపుర భైరవి. ఇయ్యది ధర్మార్థ కామ మోక్షములను ప్రసాదించును. త్రిపురాదేవి యొక్క వాగ్వాది బీజములను ఇత: పూర్వమే తెలిపితిని. ప్రప్రథముగా వాగ్భవ బీజము “ఐం” నా పదునైన జిహ్వను (పరుష వాక్యములను) నిగ్రహించు గాక! కామరాజ బీజము “క్లీం” నా కామనలను సఫలీకృతమొనర్చుగాక! సమస్త శరీరమునకు శక్తి నిచ్చు తేజోపుంజమయిన ఈశ్వరుడు నా ఇంద్రియములను రక్షించుగాక! పంచకూటము ద్వారా తెలుపబడిన మంత్ర యంత్రములు నా తేజమును అభివృద్ధి పరచుగాక! నిత్య నిరంతరములు తన తేజోమయ రూపమందు నిమగ్నమయిన ఈ మంత్రమునకు

నమస్కరించుచున్నాను. ఇయ్యది నా బుద్ధిని సంపూర్ణముగ వికసనము కావించుగాక! వాగ్భవ బీజము మూలాధారము నందు, కామరాజము హృదయమందు, మోహనము భ్రూమధ్యము మరియు మస్తకమందు నన్ను రక్షించుగాక! సర్వకామనలను ఈడేర్చు సర్వలోకమాత అయిన త్రిపుర భైరవి నా నాభి కమలమందుండి నన్ను సర్వరోగముల నుండి రక్షించి సుఖమును ప్రసాదించుగాక! ఈ త్రిపుర భైరవి యోగము ద్వారా సర్వులను మోహము నందు ముంచి, భవాని రూపమున తాను సర్వదా జాగ్రదావస్థ యందుండును. ఈ పంచతారక రూపిణి అయిన త్రిపుర నా కళ్ళు, ముక్కు ,కర్ణములు, మరియు నాలుకను రక్షించుగాక! కామదాయినులైన ఆద్య త్రిపుర, మధ్య త్రిపుర, త్రిపుర భైరవీ, ఈ ముఫ్వురూ నాకు నిత్య రక్ష కల్పింతురు గాక! బాల త్రిపుర తూర్పున, మధ్య త్రిపుర దక్షిణము, త్రిపుర భైరవి పశ్చిమము, వాయువ్యము నందు నన్ను రక్షించుగాక!

మహామాయ, మహాయోని, విశ్వయోని అయిన త్రిపుర భైరవి నిత్యము నన్ను రక్షించుగాక! లలాటమందు సుభగాదేవి, తూర్పున కామప్రద అయిన త్రిపుర సుందరి, నిత్యము నన్ను కాపాడుగాక! కనుబొమలందు, ఆగ్నేయకోణమందు భగగణములను వర్ధనము కావించు త్రిపురా భగమాత నన్ను రక్షించుగాక! ముఖము నందు, దక్షిణ దిశయందు, భగసర్పిణి త్రిపుర యమ దూతలను పారద్రోలి నన్ను రక్షించుగాక! కర్ణములను, పశ్చిమ దిశయందు జగద్యోని, అయోనిజ బాలాత్రిపుర; కంఠమును, పశ్చిమ దిశయందు మాహేశ్వరీ, అనంగకుసుమ, సుందరీ, త్రిపుర భైరవీ మాత; హృదయము మరియు వాయువ్య కోణమున అనంగమేఖల; నాభి మరియు ఉత్తర దిక్కున మాతంగీ, త్రిపుర, అనంగమదన, త్రిపుర; ఈశాన కోణమందు మరియు లింగమందు మదవిభ్రమమంథర, వాగ్వాదినీ త్రిపుర భైరవీ; హృదయాంతరాళమున ప్రీతి త్రిపుర భైరవీ; భ్రూమధ్యమున మనోభావ, నన్ను రక్షించుగాక!!!

ద్రావణి అను శరము, దుర్గాదేవి, పైన యుండి శత్రువుల నుండి రక్షించుగాక! అభయ ప్రద అయిన క్షోభణ శరము మాంసాహారులనుండి, వశీకరణ శరము నన్ను అగ్ని మరియు రాజుల నుండి, ఆకర్షణ శరము శస్త్ర ఘాతముల నుండి, నన్ను రక్షించుగాక! మోహన శరము నాకు ఉత్తమాభిలాషలను ప్రసాదించి సర్వ భూత, పిశాచ, యమాదుల నుండి నన్ను రక్షించి, నా శరీరమును కాపాడి, నాకు  ఉత్తమమైన కోరికలను ప్రదానము కావించుగాక! దేవి యొక్క మాల నా జ్ఞాన విధిని, శాస్త్ర వాదములందును, ఆమె చేతి పుస్తకము నా మనో సంకల్పములను వృద్ధి యొనర్చుట (సత్సంకల్పముల) యందును, వరదముద్ర నా బల తేజములను వృద్ధి యొనర్చి నా గృహమును రక్షించి, అభయముద్ర నా ఐశ్వర్యమును పెంపొందించి, దేవి యొక్క  కపాలమాల రక్తసిక్తమై కాలాగ్ని స్వరూపమై నాకు జ్ఞాన ధ్యానములందు ఏకత్వమును, ప్రగాఢ అనురక్తిని కలిగించి, తత్వ రూపమునందు నన్ను బద్ధ ప్రతిష్ఠుని కావించి, రక్షించుగాక!!!

ఈ దివ్య విద్య అధోఊర్ధ్వ లోకములందు, సర్వ స్థానముల యందు, భయంకరమైన భోగములనుండి రక్షించుగాక! "హ" కారము హృదయమును, "ర" కారము గుహ్యమును, సౌ:కంఠము, పార్శ్వములను, రక్షించుగాక! ఆకాశమున ఇంద్రుడు, సర్వత్ర బ్రహ్మదేవుడు రక్షించుగాక! (ఇచట ఇంద్రుడు "లం" బీజమునకు, బ్రహ్మ "కం" బీజమునకు ప్రతీకలు) విద్యావిద్యల స్వభావిని, కామరూపా, ఆదిమాయా, స్థూల సూక్ష్మ రూపములను అనుభూతికి కొనివచ్చు మాయా స్వరూపిణి, బ్రహ్మేంద్రాది దేవతలకు సహితము పూజనీయ, ఐశ్వర్య ప్రదాయిని అయిన భైరవి సర్వత్రా నన్ను రక్షించుగాక! తల్లీ! నీవే ఆద్యా, మధ్యా, భావినీ, నీతి, జ్ఞాన జ్ఞేయ స్వరూపిణి, పరాదేవి, ఆద్యంతములకు మధ్యనయున్న సర్వము అయిన తారాదేవివి. ఓ! త్రిపుర భైరవీ! నన్ను రక్షించు. నీ యొక్క మంత్ర, యంత్ర, తంత్ర భాగములను బ్రహ్మ, రుద్ర, కేశవులు ఎరుగుదురు. వారికి నమస్కారము. తల్లీ! నీవే బ్రహ్మాణీ, భవానీ, లక్ష్మీ, యోగినీ, వాగ్మీ, సుభగ. నీ మంత్రాక్షరములు నిష్కళంకములు. ఈ మంత్ర వర్ణములన్నియు నీ శరీరముపై సుస్థిరముగ యున్నవి. కామ ప్రదవు, కామినివీ నీవే! ఓ! త్రిపురాదేవీ! నీవు మాకు నిర్మల కవిత్వమును, సౌభాగ్యమును, ప్రసాదింపుము."

దేవి యొక్క ఈ కవచమును ఎవరు తెలియదురో వారు మంత్రజ్ఞులు. వారికి భయము, ఆదివ్యాధులు సోకవు. ఈ త్రిపురా కామాఖ్యా కవచము అత్యంత గుప్తము. దీనిని మీకిరువురికి తెలిపితిని. దీనిని మీరిరువురు శ్రద్ధగా సేవించి సిద్ధి లాభము నొందవలెను. ఇయ్యది పుణ్యమయము, పరమ పావనము, కీర్తిని ఇనుమడింపజేయునది. భైరవా! ఏ మానవుడు ఉదయమున ఈ కవచమును పఠించునో, వాని మనోవాంఛితములు ఫలించును. ఏ వ్యక్తి ఈ కవచమును లిఖించి కంఠ ధారణ చేయునో, యుద్ధమందు వానిని శస్త్రములు ఛేదింపవు. సమరమందు లేక శాస్త్రీయ తర్కమందు ఆతడు విజేతయగును. ఈ కవచము తెలియక ఎవరు త్రిపురా పూజనమొనర్చెదరో వారు శాస్త్ర ఘాతకులగుదురు. ఏ మానవుడు నిర్మల చిత్తుడై, మౌనియై, తన దోషము లెరింగి బీజ మంత్రోచ్చారణ కావించునో వారికి ప్రత్యేక రహస్యములన్నియు వినిపించును, బోధపడును. ఆతని యజ్ఞాది క్రతువులు దోషరహితమగును. బీజాక్షరములను సరియైన రీతిలో పలుకని ఎడల అయ్యది తప్పుడు అవగాహనకు దోహదమగును. బీజాక్షరములను విడివిడిగా పలికిన సాధకుడు కుష్ఠురోగియై, ఆ బీజమంత్రములు ఫలింపవు. న్యాసము ఎంత ఎక్కువగా యుండునో, ఫలితము అంత మిక్కుటముగ యుండును. అందువలన న్యాసమును ఎన్నడును విడువక అధికముగ చేయవలెను. నా (శివుడు) ద్వారా తెలుపబడిన న్యాసము కావింపక చేసిన పూజ ప్రమాదకారియై సాధకునకు విపత్తులు చేకూర్చును. అన్ని మంత్రములకు తొలుత న్యాసము కావింపవలెను. ఇది శైవ, వైష్ణవ, దేవీ, దేవగణముల ఎవరి పూజయందైననూ తొలుత న్యాసమొనర్పవలసినదే!!!

అంగ రాగములందు సింధూరము, పానీయములందు మదిర, వస్త్రము లందు ఎర్రని పట్టు వస్త్రము, విశేషముగ దేవికి ప్రియము. పూజ కొరకై మూడు, అయిదు లేక ఏడు దీపములుంచవలెను. ఇంతకంటె తక్కువ దీపములు దేవి పూజయందుకూడదు. భైరవా! మల్లిక, మాలతి, కుంద, పొగడ, ద్రోణ, తెల్ల కమలము, తెల్లని పుష్పములతో దేవిని పూజించిన ఎడల త్రిపురాదేవి ప్రసన్నమగును. ఈ దేవి శుద్ధ భక్తితో అర్పించిన ఎర్రని కమలములు, ఎర్రగన్నేరు మొదలగు పూలను స్వర్ణ పుష్పముల కంటె ఎక్కువ ప్రీతితో తీసికొనును. భైరవా! మీకు సర్వమును సంక్షేపముగ తెలిపితిని. మీరు దీనిని విస్తరింపవలసినది. మీరు మహామాయా ఆరాధన చే గణాధ్యక్షులగుదురు. ఈ త్రిపుర భైరవీ యొక్క తెల్లని రూపమే సారస్వతము (సరస్వతీ స్వరూపము). ఈ దేవి యొక్క మంత్రము తదనురూపము.

ఈ సరస్వతీ దేవి వీణా పుస్తకధారిణి, మరియు మాలా, కమండలములు ధరించును. ఈ తల్లి కుడి చేతిలో తెల్లని లత/ఆకు ధరించి, మహాచలమందు శ్వేతపద్మమందు ఉపస్థితయై యుండును. ఈ దేవి శుక్లవర్ణ, శుక్ల వస్త్రధారిణి, శుక్లాభరణ భూషిణి. ఈ తల్లి ప్రథమ బీజము వాగ్భవము "ఐం", ద్వితీయము నేత్రబీజము "ఐం హ్రీం శ్రీం". ఈమెకు సంబందించిన మంత్రములు ఇంతకు పూర్వమే ప్రతిపాదింపబడినవి. ఈ తల్లి వరదాభయహస్త; వీణాపుస్తక ధారిణి, శుక్ల పద్మాసన స్థిత, పరావాక్ స్వరూప సరస్వతి. బలబీజము యొక్క తొలి అక్షరమునకు అర్ధ చంద్రము జోడించి, రెండుమార్లు ఉచ్ఛరించిన అయ్యది సరస్వతీ మంత్రము "ఈం ఈం" అగును. ఈ సరస్వతీ దేవియే కపాలమాలా ధారిణియై, ఎర్రని రంగుతో ప్రకాశించుచున్న ఎడల ఆమె "వృద్ధ సరస్వతి" అగును. తొలుత తెలుపబడిన పదమూడు మంత్రములలో ఆరవమంత్రము "హ్రీం ఈం ఐం" ఈమెదే! ఈ దేవి కవిత్వ ప్రదాత, శాస్త్రార్థ చర్చలందు, తత్వార్థ వివేచనయందు జయప్రద. అంతేకాక అనేక సుఖ సంపత్తుల సహితము ఒసగును. తెలుపు, ఎరుపు వర్ణ భేదముల చే ఈ తల్లికి అరువది నాలుగు రూపములు కలవు. ఇవన్నియు త్రిపురా రూపములే! మహామాయా, యోనిముద్ర, జగత్ ప్రసవినీ, మూల ప్రకృతీ, జగన్మాతా, జగద్ధాత్రీ, విద్యావిద్యా స్వరూపిణి, త్రిపుర మొదలగునవన్నియు ఈ మహాదేవి యొక్క అంశలే! ఈ దేవి స్వరూపము నుండే సర్వదేవీ స్వరూపములు ఉత్పన్నమయినవి. మీకు ఈ మహాదేవి యొక్క వామ దక్షిణాది మనోహర రహస్యముల నన్నింటినీ నుడివితిని. ఇపుడు మంత్ర సిద్ధి వినవలసినది.

**(శ్రీ కాళికా పురాణమందలి పురశ్చరణ విధి, త్రిపురా మంత్ర రహస్యము, కవచము, అను డెబ్బది అయిదవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది ఆరవ అధ్యాయము

**(భేతాళ, భైరవుల మంత్రసిద్ధి)**

మహాదేవుడు తిరిగి చెప్పదొడంగెను "మంత్రము యొక్క సిద్ధత్వము తెలిసి కొనిన పిదపే ఉత్తమమైన మంత్రమును గ్రహింపవలెను. అక్షర భేదముల చే మంత్రము నాలుగు రకములు. అవి సిద్ధ, సుసిద్ధ, సాధ్య, శాత్రవ మంత్రములు. వైష్ణవీ తంత్రార్గతముగ ముఖ్య వర్ణములు, వాని క్రమమును మీకు తెలిపితిని. అది ఎప్పుడూ శాశ్వతము. దానినే మొదట తెలిసికొనవలెను. వాటిని గూర్చి తిరిగి తెలిపెదను. వినుడు. తొలుత మూల మంత్రమున తెలిపిన వర్ణములు (అక్షరములు) మూల భూత వర్ణములు. వీనినుండే మిగిలిన వర్ణములు వికసితమగును. "అకచటతపయ". ఈ అక్షరములు వర్ణముల ఆది అక్షరములు.

అచ్చులు – "అ, ఇ, ఉ, ఋ, ఌ". ఈ వర్ణములు హ్రస్వ, దీర్ఘములుగ యుండును.

అనుస్వరములు – "ఎ ఐ ఒ ఔ :" ధ్వని భేదము చే ఉత్పన్నమగు స్వరములుయోగికి స్వరములనబడును.

వ్యంజనములు – క ఖ గ ఘ ఙ

చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ల వ

శ ష స హ ళ క్ష

మంత్రాదులందు వర్ణము లన్నియు సంయోగ, వియోగ, లోమ, ప్రతిలోమముగ ఉపయోగింపబడును. వర్ణములన్నియు చతుర్వర్గ ప్రదాయకములు మరియు సుఖ, దు:ఖ, రోగ మరియు తేజో కారకములు. ఇవి పూజించునవి మరియు పూజింపబడునవి. ఈ వర్ణములు నాకు (శివుడు), విష్ణువుకు, బ్రహ్మకు, వేదమాత గాయత్రికి, మరియు ఇతర విద్యోపాసకులకు పరబ్రహ్మానుభవమును కలిగించునవి. ఏ సాధకులు బ్రహ్మ తత్వజ్ఞులై యుందురో, వారు బ్రహ్మమును పొందెదరు. జగత్తు సృష్టికి కారకుడైన పరబ్రహ్మ, తన ఇచ్ఛానుసారముగ ఈ వర్ణములను సృజించి, వాటిని నా (శివుడు) మరియు బ్రహ్మ యొక్క ముఖ మండలమున యుంచెను. భైరవా! అందువలన నేను (శివుడు) జ్ఞాన మార్గము వర్థిల్లుటకు సర్వ వర్ణములను విన్యాసమొనర్చి అనేక శాస్త్రములను రచించితిని.

మంత్రమందలి వర్ణముల సంఖ్య అయిదు లేక తొమ్మిది అయిన అయ్యది సాధకునకు సిద్ధమంత్రము. మంత్రము రెండు లేక ఆరు వర్ణములైన అయ్యది సాధ్యమంత్రము. మంత్రము మూడు, ఏడు, పదకొండు వర్ణములైన అయ్యది సుసిద్ధ మంత్రము. ఒకవేళ మంత్రము నాలుగు, ఎనిమిది, పన్నెండు వర్ణములైన అయ్యది శాత్రవము. సుసిద్ధ, సిద్ధ మంత్ర సాధన శీఘ్ర సిద్ధినిచ్చును. సాధ్య మంత్రము కొంచెము జాప్యముగ సిద్ధి నిచ్చును. శాత్రవ కోటి మంత్రములు కామనలను నాశమొనర్చును.

ఇపుడు వామాచార విధిని ఆచరించు మంత్రముల గూర్చి తెలిపెదను. దీని యందు "ఙ, ఞ, ణ, న ళ్ " లను వదలి మిగిలిన వర్ణ క్రమమును వామపద్ధతిని లిఖింపవలెను. నృశింహ, సూర్య, వారాహి మంత్రములు, ప్రాసాద మంత్రము, ప్రణవము, ఏక లేక ద్వి అక్షర మంత్రముల దీక్షయందు, అన్నిరకముల బీజమంత్రముల దీక్షయందు సిద్ధి

మొదలగు భేదములు చూడరాదు. దశ బీజములకు ఇతర దోషములను మర్దించు శక్తి కలదు. సిద్ధ, సాధ్య మంత్రముల కంటె సుసిద్ధ మంత్రములు దీక్షార్థము స్వీకరించుట మేలు. ఎందుకనగా అవి కామ ప్రదములు. శాత్రవ మంత్రములు ఎన్నడునూ స్వీకరింపరాదు. ఏ వర్ణము ఏ దేవత నామాక్షరముతో ఏకమగునో అదియే మంత్రము. "ఆ" వర్ణమునకు అర్ధ చంద్ర " (ँ) " లేక బిందువు (.) జోడించిన అయ్యది బీజాక్షరమగును. ఇంద్రుని వర్ణము "శ" అగును. మంత్రోద్ధారము (వర్ణములతో మంత్రమును రచించుట) నందు వర్ణములను మొదటి నుండి లెక్కింపవలెను (అను లోమము), కొన్ని పద్ధతుల యందు విలోమము (వెనుక నుండి లెక్కించుట) కూడా కలదు. ఎక్కడైననూ లెక్కించు విధానమును తెలుపని ఎడల అచట అనులోమ పద్ధతినే వాడవలెను. పండిత గణములు మంత్ర శుద్ధికై చక్ర నిర్మాణమొనర్చెదరు. ఈ చక్ర నిర్మాణము అత్యంత గోప్యము.

సాధకుడు హిమాలయ నల్ల ఎలుగుబంటి దంతమును తీసికొని, దానిని ఆ మృగము యొక్క చర్మముతో చుట్టి, అద్దానిని వైష్ణవీ నిర్మాల్యముతో మూడు పేటలున్న సూత్రముతో అభిమంత్రించి, దానిని కుడి చేతి యందు ధరించి, జితేంద్రియ స్థితిని పొంది, వందమార్లు జపమొనర్చి, సాధకుడు చేతికి కట్టుకొని చింత కలిపిన భోజనమును వర్జించిన ఎడల ఆతడు పన్నెండు విధముల సిద్ధులు పొందును. ఆతని శరీరమున రోగములు ప్రవేశింపవు, సంగ్రామ వివాదముల యందు జయము కలుగును, రాజులు, రాజ పుత్రులు, వనితలు ఆతని వశము నందుందురు. భూత, ప్రేత, పిశాచములు ఆతని దరి చేరవు. ఆతని సమస్త కార్యములందలి దోషములు నష్టమగును. ఈ సాధకుడు రక్త, శ్లేష్మ, ధాతు, తేజ స్థంభన కావించును. ఆతని నేత్రములందలి కాంతి వృద్ధి నొందును. నల్ల ఎలుగు బంటి శిరమును హస్తమున నిడుకొని, మూడు వందల మార్లు జపమాచరించి, పిదప ఆ శిరమును తన గృహము నందుంచుకొనిన, ఆ సాధకుడు అపుత్రుకుడు కాడు. అంతేకాక ఏ పతివ్రత స్త్రీ అయిననూ ఆ సాధకుని కాంచిన, ఆ స్త్రీ పుత్ర సంతతి నొందును. ఏ గృహమందు ఈ విధమయిన ఎలుగుబంటి శిరముండునో, ఆ గృహమందలి స్త్రీ అంతకుముందు బిడ్డలను కోల్పోయిననూ, తదుపరి పుత్ర సంతతి నొందును. ఏ గృహమందు చిలుక, కోకిల, చకోరములను వైష్ణవీ మంత్రములతో అభిమంత్రించి ఇంటియందుంచుకొనిన, ఆ గృహమందు విఘ్నములు జరుగవు. పుత్ర పౌత్రాదులు వృద్ధి నొందెదరు. అచటకు సర్పములు చేరవు; చేరిననూ మనుష్యులను హింసింపవు. ఆ గృహమందు వంధ్యలు జన్మింపరు.

పంచమూర్తి చండికాదేవి యొక్క నిర్మాల్యమును బలి మాంసముతో (ఒక్కొక్క మూర్తికి ఒక్కొక్క నిర్మాల్యము మరియు బలి మాంసము) కలిపి, ఒక పాత్రయందు యుంచి, దానిని మూడు రోజులు వండి, ఆ మాంసముపై అభిమంత్రిత జలము ప్రోక్షణ కావించి, తిరిగి దేవికి నివేదింపవలెను. మనసు నందు దేవిని భక్తి పూర్వకముగ తలచుకొని, ఎవరు ఈ ప్రసాదమును భుజించెదరో ఆతడు దీర్ఘాయువై, రోగహీనుడై, తేజోనిధియై, శత్రు దమనుడు, కవి అగును. విద్వాంసుడయిన సాధకుడు ఒకానొక, అష్టమి, నవమి లందు ఒక ప్రత్యేక స్థానమందు అంగన్యాస, కరన్యాసములు కావించి, కుంకుమ, మలయ చందనములను కలిపి ఆ మిశ్రమమును లలాటము, మూర్ధ్ని, కంఠము, బాహుద్వయము, పాణి, హృదయము లందు మంత్ర సహితముగ, ఒక్కొక్క స్థానమందు ఎనిమిది మార్లు మంత్ర జపమాచరించుచూ అలదుకొనవలెను. తదుపరి శివాదేవి యొక్క పూజన మాచరించి, పిదప మూడు జంతువులను దేవికి బలిఇచ్చి వేయిమార్లు మంత్రజపమాచరింపవలెను. అనంతరము హవిష్యాన్నము ఆరగించి, ఆ రాత్రి అంతయు సంయమియై గడుపవలెను. ఈ విధముగ ఆచరించిన సాధకుడు రణమునందు, శాస్త్రచర్చలందు పరాజితుడవ్వడు. క్షత్రియుడు యుద్ధకాలమందు ఒక్కమారు ఈ కార్యమాచరించి, తదుపరి సమయములందు, ఆ స్థానమునకేగి మంత్రాక్షరములు లిఖింపవలెను.

పుత్రులారా! మీకు యుద్ధార్థము అతి గుహ్య అష్టాక్షరిని ఇదివరలో బోధించితిని. దీని అనుష్ఠానము ద్వారా విజయలాభమొందవలసినది. మీరిరువురికి సర్వ విధములు గుహ్యతర, గుహ్యతమ అనుష్ఠానములను తెలిపితిని. అనేక

సుఖ ప్రదములయిన మంత్ర, తంత్ర, యంత్రములను సహితము తెలిపితిని. ఏ సాధకుడు వీని స్వరూపమును తెలిసికొనునో, వాని అభిలిషతములు సర్వము ప్రాప్తి నొంది, అంతమున కైవల్యము నొందును. ఏ సాధకుడు ఈ ప్రసంగమును బ్రాహ్మణుని ముఖతా వినునో, ఆతనికి విఘ్నములుండవు. ఆతడు పుత్ర రహితుడు కాడు. దీర్ఘాయువై, బలయుతుడై, నిత్యానందుడై యుండి, వాంఛిత లాభముల నొంది, అంతమున దేవీలోక ప్రాప్తి నొందును. మీరిరువురు నీలాచలమున కేగి కామరూపము చేరుడు. అచట కుబ్జికా పీఠము అను కామాఖ్యా దేవి యొక్క గుప్తావాసమున్నది. అచట ఆకాశగంగ సంచరించుచుండును. అచట మీరిరువురు జగన్మయి మహామాయ యొక్క ఆరాధన కావింపవలసినది. అందువలన దేవి శీఘ్రముగ ప్రసన్నయై మీకు వరప్రదాన మొసంగును." ఈ విధముగ పలికి వృషధ్వజుడు అచటనే అంతర్హితుడయ్యెను.

అంత భేతాళ భైరవులు నాటక పర్వతమును వీడి, బ్రహ్మపుత్రుడయిన వశిష్ఠుడుండిన సంధ్యాచలమునకేగిరి. వశిష్ఠుడు వీరిని సాదరముగ ఆహ్వానించెను. తదుపరి వారిరువురు వశిష్ఠుని వద్ద ఉపదేశమొంది నీల పర్వత మందలి కామాఖ్యా ఆశ్రమమునకు ఏగిరి. మహాదేవ పుత్రులిరువురు ఆ ప్రదేశమందు భైరవుడను శివలింగము వద్ద ఉపస్థితులై, ప్రతిదినము ఆకాశగంగా జలములందు స్నానమాచరించి, మృత్తికతో ఒక ఉత్తమ మండలమును నిర్మించి, మహామాయ జగన్మయిని వైష్ణవీ తంత్రము ద్వారా అష్టాక్షరీ మంత్రానుష్ఠానము కావించిరి. భేతాళ భైరవుల సాధ్య మంత్రమును ఎనిమిది లక్షల జపమును మూడు ఏండ్లలో కావించిరి. ఆ మూడేండ్లలో ఉత్తర తంత్రమందు, కల్పమందు తెలిపిన, లిఖించిన పద్ధతులన్నియు ఆచరించిరి. నాలుగు లక్షల జపము అయిన పిదప మూడుమార్లు (అయిదు పురశ్చరణ విధులు) పురశ్చరణ కావించిరి. వారు కామాఖ్య, త్రిపుర, మరియు ఇతర దేవతా మూర్తులను ఒక్కమారు పూజించి విధి విధానముగ పీఠయాత్ర కావించిరి. ఈ విధముగ మహాదేవ పుత్రులిరువురు కవచ ధారణ చేసి, న్యాసమొనరించుట చే మహామాయ వారిని అనుగ్రహించెను. వారిరువురు ధ్యానముగ్నులై నిరంతరము మనసునందు జగదీశ్వరి యొక్క జపము, పూజ కావించుచుండుట చే, ఆ సమయమున మహామాయ శివలింగము ను భేదించి, వారి సమక్షమున ప్రత్యక్షమయ్యెను.

ఆ సమయమున లింగము మూడు ముక్కలై భైరవుడు, భైరవి, హేరుకముగా మారెను. భేతాళ, భైరవులు తమ హృదయమందు ధ్యానించుచున్న దేవీమాతను ప్రత్యక్షముగ కన్నులెదుట కాంచిరి. ఆ తల్లి ఆ సమయమున సర్వాంగ సుందరియై, పీనోన్నత పయోధరయై, వరదాభయ ముద్ర, సిద్ధ సూత్రము ధరించి, ఎర్రని కమలకాంతితో శ్వేత ప్రేతాశీనయై దర్శనమిచ్చెను. వారిరువురు కన్నులు మూసికొని "మహామాయా రక్షించు" అని పదే పదే పలుకసాగిరి. అంత మహామాయ తన కరాగ్రముతో వారిరువురినీ స్పర్శించెను. ఆ దివ్య స్పర్శచే భేతాళ భైరవుల మనుష్యత్వము అంతరించి, దేవత్వము అంకురించినది. వారిరువురు మహామాయకు నమస్కరించి ఇట్లు స్థవము కావించిరి.

"ఓ! గిరిజాదేవీ! మీరు ఎల్లప్పుడూ శివుని తో కేళిలోలయై యుందురు. మీకు జయమగుగాక! మీ త్రినేత్రములు సూర్య, చంద్రాగ్నుల కంటె ఎక్కువ ద్యుతి కలిగి యుండును. మీరు కమలోత్పన్న. మీ మధ్య నేత్రము కృపాపూర్ణ స్వరూపము. మీరు మీ కనుబొమల భంగిమతో భక్తుల మనస్సును నిర్మల మొనరించు విమల స్వరూపులు. తల్లీ! మీరు శాంత స్వరూపులు, నవకోటి చంద్రుల కాంతి ధారులు, మస్తకమందు శాంత చంద్ర ధారిణులు. మీరు వివిధములయిన మాయా శరీర రూపధారిణిలు, మరియు మూడు నాడుల (ఇడ, పింగళ, సుషుమ్న) మధ్యస్థమున ఉపస్థితమైనవారు. శుభరూపమున సుషుమ్నా నాడిని నివాసమొనర్చుకొనిన కుండలినీ రూపిణులు. తల్లీ! మీరు దేవగణములను సహితము విశేషముగ ఆనందింపజేయు విశ్వమూర్తి షట్చక్రధారిణి. మీ సుందర దేహము షోడష చక్రములను సంస్పర్శము కావించుచున్నది. మీరు మూలాధారము (పృధివి) నుండి సహస్రారము (ఆకాశము) వరకు వ్యాప్తి నొంది యున్నారు. తల్లీ! మీరు మీ బాహువుల యందు వరదాభయ ముద్రలు, పాశము, పాపులను నాశనమొనర్చు చంద్రహాసము ధరించి యున్నారు. మీరు చతుర్దళ మూలాధారము మధ్యన చతుర్బాహువులతో మణి వలె మెరయుచున్నారు. మీరు జ్ఞానరూపమయిన

సరస్సు. మీరు మంత్ర, యంత్ర, తంత్రముల ద్వారా యోగి గణములను నిబద్ధత యందుంచుచున్నారు. తల్లీ! మీరు సర్వపాపనాశిని, మరియు భక్త జనులకు ఆనంద ప్రదాత. మీరు ఎల్లప్పుడూ ఆత్మ తత్వ పరాయణుడు, జ్ఞానహారుడు, సారరూపుడు, ముక్తి ప్రదుడు, శ్వేతప్రేతుడయిన శివుని యందు అత్యంతానురాగము కలిగి యుందురు. తల్లీ! మీరు ఈ బ్రహ్మాండము నందలి సమస్త రత్నరాశుల సారభూతము, రాగద్వేషములకు దూరముగ వసించు భక్తుల హృదయములను మంత్ర యుక్తము కావించెదరు. మీకు నాలుగు దిక్కుల యందునూ యోగినులు నృత్యము చేయుచుందురు. నృత్యరతులయిన భైరవ భృత్యులు ఆనందాప్లుతులై మీకు నలుదిక్కులా నిలబడి యుందురు. హార కంకణ కేయూరములతో అలంకరింపబడిన మీరు వారి యజమానురాలు. మీరు సర్వదా సంతుష్టాంగ తరంగులై, ఆనంద సాగరమున ఓలలాడుచుందురు. మీ కేశ పాశము విడివడి యుండి మీరు సురేశుని అర్ధాంగ భాగమందు ప్రతిష్ఠితమై యుందురు. తల్లీ దయచేసి మాకు శోక, బంధన, పాపముల నుండి విడివడిన మనస్సును ప్రసాదింప ప్రార్ధన. ఓ! దేవీ! మీరు సర్వ విద్యాత్మిక, గుహ్యారూప, మంత్ర తంత్రాత్మిక, శివా, మహామాయా, మరియు లోకము, వేదము లందు కీర్తింపబడిన దేవీ స్వరూపము. మీకు నమస్కారము. తల్లీ! మీరు పర, అపర స్వభావ, శుద్ధ, ఏకస్వరూపిణి, సాధ్యాధార సంస్థిత, కామాహ్లాద కారిణి, కాంత మరియు జగన్మయి. మీకు ప్రణామములు. తల్లీ! ఈ కనిపించు విశ్వమంతటికీ మీరు ఏకైక కారణము. మీకు ప్రణామములు!! మీరే కామాఖ్య, నిత్యరూప, మహామాయ, సరస్వతీ, విష్ణువక్షస్థ లక్ష్మీ. మీరే శివరూపిణి. మీకు నమస్కారము! పదహారు వేల మంత్రములకు, వాని తంత్రములకు మీరే స్వరూపము. ఓ! పార్వతీ! మీకు నమస్కారము!!!"

అంత జగత్ ప్రసవినీ మహామాయ ఆనందితయై "వరమడువలసినది" అని పలికెను. అంత మహాదేవుని పుత్ర ద్వయము తాము ధ్యానమందు దర్శించిన మహామాయను కన్నులెదుట కాంచుచూ ఇట్లు పలికిరి "దేవీ! మేమిరువురము ఈ దేహముతో సూర్యచంద్రులు ఉన్నంత వరకు శంకర భగవానుని సేవ చేయవలెను. మేము మీ భక్తులమై ఈ గిరి మందిరముననే యుండవలెను. ఓ! మహామాయా! జగన్మయి! మాకు ఇది వినా వేరొక అన్యవరము అనవసరము". అంత దేవి అది విని "తదాస్తు" అని దీవించెను. అంత జగద్ధాత్రి తన స్థనగ్రములను మర్దించగా వాని నుండి రెండు దుగ్ధధారలు వెలువడెను. అంతదేవి వారిని ఇరువురినీ ఆ దుగ్ధము పానము చేయుడని ఆదేశించెను. వారిరువురు ఆ దుగ్ధపానము ఒనరించిన వెంఠనే వారికి శాశ్వత దేవత్వము ప్రాప్తించెను. వారిరువురు మహా తేజస్వులై, అజరామరులైరి. భగవతి యొక్క స్థన దుగ్ధమే అమృతము. ఈ అమృత పాన కారణమున భేతాళ భైరవులకు శాశ్వత అమరత్వము సిద్ధించినది. అంత భగవతి "పుత్రులారా! మీరిరువురు గణాధీశ్వరులై, నందీశ్వరుని వలె దేవాధిదేవుడయిన శంకరునికి ద్వారపాలురు కావలసినది."

ఔర్వుడు "మహామాయ మహాదేవుని అనుమతితో వీరిరువురికి ఈ పదవులు ప్రసాదించి, వెంఠనే తన యోగినీ గణములతో అంతర్ధానమయ్యెను. అంత భేతాళ, భైరవులు అత్యంత ఆనందితులై కృతార్థుల మైతిమని సంతసిల్లిరి. అంత వారిరువురినీ తన సభా సదులు కావించుటకై భగవానుడు రుద్రుడు దేవతా సహితుడై అచటి కేతెంచెను. అంత మహాదేవుడు నీలాచలమందలి సమస్త పీఠములను, ప్రతి ఒక పుణ్య స్థలమును వారికి చూపించి, కామాఖ్య యను మనోభావ గుహను, తన కామగుహ, ఛాయ, ఛత్రమును, పంచమూర్తి సంస్థానమును, దర్శనము కావించి, చివరకు కామరూప పీఠమందు అదృశ్యముగయున్న సమస్త దేవతానీకమును వారికి దర్శింపచేసెను. అంతేకాక దక్షిణ సముద్రగామిని, పుణ్య సరిత, శుద్ధ, సదా కళ్యాణమును ప్రసాదించు "కరతోయా" అను సత్య గంగను సహితము దర్శింపజేసెను.

**(శ్రీ కాళికా పురాణమందలి భేతాళ భైరవుల మంత్ర సిద్ధియను డెబ్బది ఆరవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది ఏడవ అధ్యాయము

**(కామరూప ప్రదర్శనము, జల్పీశ లింగ మహిమ)**

ఔర్వ మహర్షి తిరిగి చెప్పదొడండెను" మహాదేవుడు వారిరువురికీ కామరూపమునకు వాయు కోణమున యున్న "జల్పీశ లింగము"ను చూపించెను. ఇచటనే నంది జగత్పిత అయిన మహాదేవుని ఆరాధించి తన స్వశరీరముతోనే గణాధిపత్యము నొందెను. తదుపరి మహాదేవుడు నందీశ్వరుడు తపమాచరించిన "నందికుండము" ను చూపెను. అచటనే నంది తపార్ధము ఈ మహాకుండము నిర్మించి, ఆ జలమును త్రాగుచూ, జల్పీశునకు అభిషేకమొనర్చువాడు. ఇచటనే పరమ పవిత్రమైన "లబ్ధవరము" అను జలాశయము కలదు. ఈ నందికుండమందు జలపానము కావించుటచే మానవుడు కృతార్థుడై, శివునకు నందివంటి ప్రియతమ సేవకుడై శివగృహమునకేగును. అచటకు దగ్గరనే అవస్థిత అయిన జగన్మయి, మహాదేవి, యోనిరూప అయిన సిద్ధేశ్వరిని మహాదేవుడు వారిరువురికి చూపెను. ఇచటకు దగ్గరనే "స్వర్ణమానసము" అను మనోహర నదము కలదు. పూర్వకాలము నందు మహాదేవుని ఆజ్ఞచే నందీశ్వరుని అనుగ్రహించుటకు ఈ నదము ఇచ్చుటకేతెంచినది. ఈ నదము స్వయముగ మానస సరోవరమే! నంది మహాదేవుని ఆజ్ఞచే మహామాయ యొక్క స్థుతి, స్థోత్రము లాచరించి, ఇచటనే గణాధిపత్యము నొందెను. మహాదేవుడు ఈ పుణ్యస్థలిని కూడా తన పుత్రులకు చూపించెను.

ఇచట హిమాలయోత్పన్న అయిన "జటోద్భవ" అను నది కలదు. దీని యందు స్నాన మాచరించుటచే మానవునకు గంగాస్నాన ఫలము లభించును. పూర్వకాలమందు గౌరీవివాహ సమయమున మాతృకా గణములన్నియు శివుని జటాజూటమును జలాభిషేకమొనర్చినవి. ఆ జలములన్నియు ఏకత్రమై ఒక పవిత్ర సరిత ఏర్పడినది. అదియే "జటోద్భవ". చైత్ర శుక్ల అష్టమినాడు ఎవరు ఈ నది యందు స్నానమాచరించెదరో వారు దీర్ఘాయువులై శివలోకము ప్రాప్తించెదరు. ద్వాపరమందు ఈ త్రిస్రోతా (మూడు చోట్ల పుట్టుక గల) నదియే గంగ. ఈ శుద్ధ సరిత హిమాలయముల నుండి బయల్వెడలినప్పటికీ, చంద్రుని నుండి ఉత్పన్నమయినది. "మహామాఘి" (మాఘ శుక్ల అష్టమి) నాడు ఈ నది యందు స్నానమాచరించిన మానవుడు, మరి మాతృ గర్భ సందర్శనము చేయడు (పునర్జన్మ యండదు). సూర్య, చంద్రగహణమందు ఇచట స్నానమాచరించు మానవులకు కైవల్యము సిద్ధించును. ఇచటనే మహాదేవుని ద్వారా మర్త్య లోకమునకు తీసికొని రాబడిన మరియొక శ్వేతవర్ణ సరిత కలదు. అదియే "సితప్రభ". ఇయ్యది దక్షిణ సముద్రము వైపు ప్రవహించును. జేష్ఠ శుక్లదశమి (గంగా దశహరా) నాడు ఇందు స్నానమాచరించిన మానవుడు ముక్తినొంది విష్ణులోకమునకేగును. ఈ నదికి తూర్పున "నవతోయా" అను శుభ సరిత కలదు. అయ్యది దరినున్న మానవులను వివిధ రూపములతో పావనము చేయుచుండును. అందువలననే ఇయ్యది "నవతోయా" అని పిలువబడినది. ఇయ్యది హిమాలయముల నుండి ఉద్భవించి, ప్రవహించును. మహామాఘి యందు ఈ నది యందు స్నానమాచరించిన మానవులు దేవత్వము నొందెదరు. పూర్ణముగ మాఘమాసమంతయు ఇందు స్నానమాచరించిన ఎడల వారు విష్ణులోకమున కేగుదురు.

ఈ నదీ నదములన్నింటికీ పతి అయిన "అగదము" అను నదము బ్రహ్మ పాదములనుండి ఉత్పన్నమై, హిమాలయములనుండి నిర్గమించి, పూర్వ పీఠము వద్ద ప్రవహించుచున్నది. ఇయ్యది దేవ గంధర్వ సేవితము మరియు పరమ పవిత్రము. ఇందు స్నానమాచరించిన, లేక జలపానము కావించిన మానవులు బ్రహ్మలోకమున కేగెదరు. ఎవరేని మానవులు కార్తీకమాస మంతయు అవిచ్ఛిన్నముగ అగద నదమందు స్నానమాచరించిన ఎడల అద్దాని ఫలితమును తెలిపెదను. వినుడు. ఆ మానవుడు ఇహ లోకమందు రోగములొందక, సర్వ సుఖములు అనుభవించి, తదుపరి దేవలోకమునకేగి, అచట నుండి మోక్ష లాభము నొందును. సాధకులు తొలుత నందికుండమందు స్నానమాచరించి

రాత్రి వ్రతము సలుపవలెను. మరునాడు అచటి మహానది యందు స్నానమాచరించి, జల్పీశ లింగ దర్శనమొనర్చి, హవిష్య భోజనము సేవించి, ఆ రాత్రి అచట గడుపవలెను. మరునాడు సిద్ధేశ్వరీ దేవి దర్శనము కావింపవలెను. అష్టమినాడు సిద్ధేశ్వరీ దేవి యొక్క పూజోపవాసములు కావింపవలెను. సిద్ధేశ్వరీ దేవి పీనోన్నత స్థని, చతుర్భుజ, సింధూర వర్ణిని; దక్షిణ హస్తములందు కత్తెర, కపాలము ధరించి, వామ హస్తములందు అభయ, వరద ముద్రలు ధరించి, జటాజూటధారియై, రక్తవర్ణ కమలముపై సుఖాసీనయై యుండును. పంచాక్షర మంత్రమే ఈ దేవికి ఆదిమంత్రము. ఈ దేవికి కామాఖ్యా తంత్రము ననుసరించియే పూజనమొనర్పవలెను. ఈ దేవికి విధి విధానముగ పూజ కావించిన మానవునకు పునర్జన్మ యుండదు.

పూర్వకాలమందు పరశురాముని భయము చే రాజులందరూ మ్లేచ్ఛత్వము నొందిరి. వారందరూ జల్పీశుని శరణుమొంది, జల్పీశుని సేవ చేయుచూ, మ్లేచ్ఛభాషను త్యజించి, ఆర్యభాష భాషించుచూ, జల్పీశుని దాచి రక్షించిరి. వారందరూ సుందర శివగణములైరి. సాధకులు వీరందరినీ సంతుష్టిపరచి, జల్పీశునకు పూజనమొనర్పవలెను. జల్పీశుడు ద్విభుజుడై, మల్లెపూవు వంటి తెల్లని రూపము ధరించి, అభయ వరద ముద్రలతో శోభించుచుండును. ఈయన పూజ తత్పురుష మంత్రముతో ఒనర్పవలెను. దేవోత్తముడయిన జల్పీశుని పూజ పుణ్యప్రదము. ఏ మానవుడు ఈ జల్పీశుని గూర్చి పూర్ణముగ తెలిసికొనునో ఆతడు నిక్కముగ శివలోకమునకేగును.

**(శ్రీ కాళికా పురాణమందలి జల్పీశ లింగ మహిమ అను డెబ్బది ఏడవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది ఎనిమిదవ అధ్యాయము

**(మణికూట మాహాత్మ్యము; నైఋుతి మొదలగు భాగముల నిర్ణయము)**

మార్కండేయుడు "భేతాళ భైరవ మహాదేవ సంవాదమును వినుచున్న సగర చక్రవర్తి ప్రఫుల్ల ప్రసన్న చిత్తుడై, మహాద్యుతుడయిన ఔర్వమునిని సవినయముగ ఈ విధముగ ప్రశ్నించెను. "భగవన్! మీరు కామరూప పీఠము యొక్క సంస్థ, విధి విధానముల గూర్చి తెలిపితిరి. దయచేసి తిరిగి వాయువ్య, తూర్పు, మధ్య భాగముల గూర్చి తెలుపవలసినది, మునిశార్దూలా! అచట అంబికా మహాదేవులు ఏ విధముగ అవస్థితులైరి? దీనిని గూర్చి వినవలెనని నాకు మిక్కిలి కుతూహలముగ యున్నది. అద్దానిని గూర్చి విస్తారముగ తెలుపవలసినది." ఔర్వుడు "నృపవరా! వాయువ్య కోణము గూర్చి తెలిపెదను. కరతోయా నదికి దక్షిణమున ఉత్తరమునకు ప్రవహించు "బహురోకా" నది కలదు. ఇయ్యది కామరూపమునకు తూర్పున యున్నది. కామరూపము నందు "సురస" అను పర్వతము కలదు. ఇచట నుండే ధర్మప్రద అయిన బహురోకా ఉత్పన్నమయినది. ఈ సురస పర్వత సమీపమున "మహావృష" శివలింగము ఉపస్థితమైనది. అచటనే దేవి మహేశ్వరి యోని మండల రూపమున యున్నది. బహురోకా నది యందు స్నానమాచరించి, సురస పర్వతమధిరోహించి, మహావృష శివలింగమునూ, మహేశ్వరీ దేవిని పూజించిన సాధకులు పాపరహితులై, ద్వంద్వములను జయించి తిరిగి జన్మమొందరు. మహావృషుడు వృషభవాహనుడై, చతుర్భుజుడై, స్ఫటికవర్ణుడై, జటాజూటము ఎగురుచుండగా, వరదాభయ ముద్రాయుక్తుడై, త్రిశూల ధారియై వెలుగొందుచుండును. మహేశ్వరీ, కామేశ్వరీ రూపములు, పూజావిధి, ప్రసాదించుఫలము సమానమే!! ఇచటనే వశిష్ఠ కుండమున్నది. ఇచటనే నరకాసురుడు వశిష్ఠుని కామరూపమునకు వెళ్ళకుండ నిరోధించెను. వశిష్ఠుడు నీల పర్వతమునకు పోలేని కారణమున, నరకునకు శాపమిడి, తన స్నానార్ధము, దేవతల పూజార్ధము ఒక కుండమును నిర్మించెను. ఇచట స్నానమాచరించు భక్తులు స్వర్గమునకు ఏగుదురు.

సురస పర్వతమునకు తూర్పున "కృత్తివాసా" పర్వతమున్నది. పురాతన కాలమందు కృత్తివాసుడు పార్వతీ సహితుడై ఈ పర్వతముపై నివసించెడివాడు. ఇచట "చంద్రికా" నది కలదు. ఇందు స్నానమాచరించిన భక్తులు స్వర్గగాములగుదురు. భాద్రపద శుద్ధ చవితి నాడు ఈ చంద్రికా నది యందు స్నానమాచరించి, కృత్తివాసుని పూజనమొనర్చు భక్తులు కళంకశూన్యులగుదురు. అట్లే భాద్రపద పూర్ణిమ నాడు చంద్రిక యందు స్నానమాచరించి కృత్తివాసుని దర్శనము చేసికొనవలెను. ఈ చంద్రిక ఎల్లప్పుడూ ఉత్తరగామిని. ఈ నదికి దగ్గరనే తూర్పునకు "ఫేనిలా" నది యున్నది. ఇయ్యది సాక్షాత్ బ్రహ్మదేవుని పుత్రిక మరియు గంగా పర్వతము నుండి ఉత్పన్నమయినది. ఈ నదీమతల్లి శతానంద మహర్షి ద్వారా అవతరింపబడినది. మానవులు బ్రహ్మ స్థాన దినమున (ఫాల్గుణ పూర్ణిమ) ఈ నది యందు స్నానమాచరించిన ఎడల నరకమును జయించి స్వర్గమును పొందెదరు. ఈ నదికి తూర్పున ఉత్తరగామిని అయిన "సితా" నది కలదు. చైత్ర పూర్ణిమనాడు ఈ నది యందు స్నానమాచరించిన ఎడల వారికి గంగాస్నాన ఫలము లభించును. అద్దానికి తూర్పున ఇంచుమించు రెండు యోజనముల దూరమున "సుమనదా" నది కలదు. ఇచట జనక మహారాజు భైరవుని హితార్థము వృషధ్వజుని ఆరాధించి సుతీక్ష్ణ పర్వతముపై ఈ నది యొక్క అవతీర్ణము కావించెను. ఈ సుతీక్ష్ణ పర్వతమధిరోహించి, సుమనదా నది యందు స్నానమాచరించి, మాఘశుక్ల చతుర్దశి నాడు మహేశ్వరుని ఆరాధించిన ఎడల వానికి ఇహలోకమందు సర్వకామనలు తీరి పరలోకమందు పరమ శివుని చేరును. కామరూపము యొక్క నైఋతి కోణమందు గల ఉత్తర వాహినీ నదుల తూర్పున దేవి యొక్క పూజాపీఠమున్నది. మహారాజా! ఎక్కడ అంబికాశంభులు నిరంతరము ఉపస్థితులై యుందురో ఆ కామరూప నైఋతి ప్రదేశము గూర్చి నీకు తెల్పితిని. రాజా! హిమాలయములందుత్పన్నమై కామరూపము నందు పయనించు నదుల గూర్చి తెలిపెదను. వినుము. అగద నదికి ఊర్ధ్వమున "భద్ర" అను మహానది కలదు. అద్దాని యందు భాద్రపద శుద్ధ చతుర్దశి నాడు స్నానమాచరించిన ఎడల ఆ మానవుడు స్వర్గమునకేగును. దీనికి తూర్పున "సుభద్ర" అను పరమపుణ్య సరిత కలదు. అద్దాని యందు వైశాఖ శుక్ల తృతీయనాడు స్నానమాచరించిన ఎడల స్వర్గలోక ప్రాప్తి కలుగును. ఈ సరితకు పశ్చిమమున "మానస" అను మరియొక పుణ్యతమ నది కలదు. ఈ నదిని తృణబిందు మహర్షి మానస సరోవరము నుండి అవతరింపజేసెను. వైశాఖమాసమంతయు పూర్ణముగ ఈ నది యందు స్నానమాచరించిన ఎడల, ఆ జీవులు స్వర్గమునకేగి, అచటి నుండి విష్ణులోకమునకేగి ముక్తి నొందెదరు. హిమాలయ శిఖరము వద్ద "విభ్రాటము" అను బృహత్ పర్వతమున్నది. అటచ భూతనాధుడు ఎల్లప్పుడూ భైరవరూపమున నివసించుచుండును. ఇచటినుండి ఉత్పన్నమయిన పుణ్య సరిత "భైరవి". ఇయ్యది మానసానదికి తూర్పుదిక్కున ప్రవహించుచూ గంగాస్నాన పుణ్యఫలమును ప్రదానము చేయును. ఈ నది యందు వసంత ఋతువు నందు స్నానమాచరించిన ఎడల స్వర్గమున కేగవచ్చు. ఇచట కామాఖ్యాదేవి పూజనమొనర్చిన ఎడల అభిలిషతములు పూర్ణమగును. అంతేకాక ఇచటి మహామాయా పూజ ద్విగుణీకృత ఫలమును, జ్ఞానమును ప్రసాదించును. ఈ దేవగంగకు ఊర్ధ్వమున హిమాలయము నుండి ఉత్పన్నమయిన "వర్ణాసా" అను ఉత్తమ నది కలదు. ఇయ్యది మానస సరోవర సమాన పుణ్యఫలములొసగును. సుభద్ర నుండి వర్ణాసా పర్యంతము తెలుపబడిన నదులన్నియు హిమాలయముల నుండి ఉత్పన్నమై ఉత్తర గామినులై ప్రవహించుచున్నవి.

సుమనా నదికి తూర్పున, బ్రహ్మక్షేత్రమునకు పశ్చిమమున "రవిక్షేత్రము" అను దివ్య క్షేత్రమున్నది. ఇచట ఆదిత్య భగవానుడు సర్వదా నివాసముండును. భైరవుని కళ్యాణార్థమై బ్రహ్మ, ఇంద్ర, వరుణాది సమస్త దేవతాగణములు కామరూప మహాపీఠమందు స్థితిగతులైరి. ఇచటనే "తత్వము" అను పర్వతమందు ఆదిత్య భగవానుడు నివాసముండును. వీనికి తూర్పున "త్రిస్త్రోతా" అను నది కలదు. దీనికి వెనుకభాగమున "కాపోతము", మరియు "కరణము" అను రెండు కుండములు కలవు. ఈ కపోత, కరణ తీర్థములందు స్నానమాచరించి, తదుపరి తత్వపర్వతమధిరోహించి, సూర్య

భగవానునికి ఒక్కమారు పూజ కావించిననూ, ఆ జీవికి సూర్యలోకము ప్రాప్తించును. స్నాన మంత్రార్థము, "కాపోత, కరణ కుండములారా! మీరిరువురు సూర్యరశ్మి నుండి ఉద్భవించిరి. అమృతమయములయిన మీ జలములు అత్యంత పావనములు. దయచేసి నా పాపములు నాశనమొనర్పవలసినది." ఈ మంత్రము పఠించి కపోతకుండమందు స్నానమొనర్చి తదుపరి కరణ కుండమందు ఆచమనము చేసి అపుడు తత్వ పర్వతమధిరోహించి సుర్యోపాసన లేక పూజనమొనర్పవలెను. ఆదిత్య భగవానుని పరమ కామ ప్రదమయిన అంగబీజము "ఓం ఓం ఓం సహస్రరశ్మియై స్వాహా". సూర్య భగవానుడు సదా పద్మహస్తుడు, పద్మాసనాశీనుడు, మరియు పద్మగర్భుని వంటి ద్యుతిశాలి. ఆయన ద్విభుజుడై, సప్తాశ్వములు, సప్త కళ్ళెములు గల రథముపై ఆశీనుడై యుండును. సూర్యమండలము వర్తులాకృతి యందు యుండి, అష్ఠ దళాత్మకముగ యుండును. సాధకుడు చేతివ్రేళ్ళతో హృదయాది షడంగములను అంగమంత్రములతో న్యాసము కావింపవలెను. సర్వ న్యాసముల యందునూ వహ్నియుక్త ఉపాంత వ్యంజనమైన "హ" జతపరిచిన ఎడల అయ్యది సర్వఫలదాయకమయిన ఉత్తమమంత్ర మగును. హృదయము, శిరము, శిఖ, కవచము, నేత్రము, ముఖము, ఉదరము, వీపు, రెండు భుజములు, చేతులు, మోకాళ్ళు, పిక్కలు, కాళ్ళు, మరియు నడుము మొదలగు సమస్త స్థానములందు మంత్రమందలి ఒక్కొక్క అక్షరము చొప్పున న్యాసమొనర్పవలెను. ఉత్తరాతంత్రమందు తెలిపిన రీతినే సూర్యపూజా విధిని పూర్ణమొనర్చి, ఈశాన కోణమందు విద్యాది అష్ఠ ఆదిత్యులను ఉద్యాపన మొనర్పవలెను. ఈ పూజ యందు నిర్మాల్యధారిణి "తత్వచండిక" మరియు "మాధర్" మొదలగు వారు పార్శ్వగణములు. ఈ విధి విధానములతో భాస్కరదేవుని పూజనమొనర్చు సాధకుడు ఇహలోకమందు సమస్త కామనలను బడసి, సుఖియై, మరణానంతరము సూర్యలోకమునకు ఏగును.

ఈ భాస్కరమూర్తికి దగ్గరనే "శుభాచలము" కలదు. ఈ పర్వత శిఖరాగ్రమున ఒక ఉత్తమ శివలింగమున్నది. దీనిని అద్వితీయ వీర్యశాలి, మహాకాయుడు అయిన వానరుడు కాపలాకాయుచూ శంకరుని సేవించుచుండును. త్రిస్రోతా నది యందు స్నానమాచరించి, మానవుడు ఈ శుభాచలమును అధిరోహించి, ఈ శివలింగ దర్శనము కావించిన ఎడల ఆ మానవుడు ఇష్ఠ కామ్యార్ధ సిద్ధి నొందును. దీనికి తూర్పున "కుసుమమాలిని" అను నది కలదు. అద్దానికి పైన "క్షీరోదము" అను మరియొక పుణ్యసరిత సహితము కలదు. ఈ రెండు నదులు దక్షిణ వాహినులు. ఈ రెండు నదుల యందు స్నానమొనర్చుట ద్వారా మానవుడు శంకరధామమున కేగును. వీనికి తూర్పున "నీలా" నది కలదు. మహాష్ఠమి రోజున ఈ నది యందు స్నానమచరించిన పుణ్యాత్ములు శివలోకమునకేగుదురు. దీనికి తూర్పున "శివచండి" లేక "చండిక" అను గొప్ప నది కలదు. ఇయ్యది "ధవళము" అను మనోహర పర్వతమునుండి ఉత్పన్నమయినది. ఈ నదీ సమీపమున "గోలోకము", "శృంగి" అను రెండు శివలింగములున్నవి. వీటికి మధ్య ఒక క్రోసు దూరము ఇంచుమించు యుండును. సాధకులు చండికా నది యందు స్నానమాచరించి, ధవళ పర్వత మధిరోహించి, దక్షిణసాగరము వైపు వీక్షించుచూ గోలోక, శివలింగ దర్శనము చేయవలెను. తదుపరి ఆ పర్వతము దిగివచ్చి శృంగిలింగమునకు విధి విధానముగ పూజనమొనర్పవలెను. ఈ విధముగ చేయుట వలన జీవునికి అశ్వమేధయాగ ఫలము లభించి, ఇహమందు సర్వ కామనలను ప్రాప్తించి, మరణానంతరము శివత్వము నొందును. ఈ విధముగ నీకు దక్షిణ దిశగా ప్రవహించు నదుల గూర్చి తెలిపితిని.

ఈశాన్యకోణమందు "గంధమాదనము" అను పర్వతము కలదు. అచట "భృంగేశుడు" అను విశాల శివలింగము కలదు. అచటి నుండి పశ్చిమమునకు గల పర్వతమందు దేవి కుగామినియై ఒక బ్రహ్మ శిలారూపము ధరించి యున్నది. గంధమాదనమునకు చివర బృంగేశుని పద చిహ్నములు కలవు. అచటినుండి గంగాజలము ఉత్పన్నమగుచుండును. అచట "అంతరాళక"మను కుండము కలదు. అంతరాళక కుండమందు స్నానమాచరించి, ఆ జలమును పానము చేసి భృంగేశుని, మరియు బ్రహ్మశిల యందు ఉపస్థితమయిన దేవిని పూజన కావించిన సాధకులు "మహాభృంగ" మను

గణములకు స్వామి అగుదురు. స్నాన, పాన మంత్రార్థము "ఓ! అంతరాళమా! నీవు సాక్షాత్ శంభుని పాదముల నుండి ఉత్పన్నమై, సాక్షాత్ ధర్మస్వరూపమై యున్నావు. నీవు నన్ను వృషధ్వజుని పదములతో సంయోజితుని కావింపుము." ఈ మంత్ర పాఠమును పఠించుచూ, అంతరాళ కుండమందు స్నాన మాచరించి, కుబ్జ పీఠాంతరవాసి అయిన భృంగదేవుని దర్శనమొనర్పవలెను.

మణికూట, గంధమాదన పర్వతముల మధ్యన లౌహిత్యనది (బ్రహ్మపుత్ర) ప్రవహించుచున్నది. ఇయ్యది బ్రహ్మాగ్ని (బ్రహ్మ వీర్యము) నుండి ఉత్పన్నమయినది. వర్ణాసా నదికి దక్షిణమున లౌహిత్య సాగరమున్నది. దానికి తూర్పున మణికూట పర్వతమున్నది. ఇచటనే హయగ్రీవుడయిన విష్ణుమూర్తి విరాజమానుడై యుండును. జ్వరాసుర హయగ్రీవ దానవ వధానంతరము విష్ణు భగవానుడు హయగ్రీవ రూపము తో ఇచటనే క్రీడించుచుండును. ఈ మహానుభావుడు దేవ, దానవ, మానవ కళ్యాణార్థము ఇచటనే ఉపస్థితుడై యుండెను. పూర్వము జ్వరము చే పీడింపబడి విష్ణు భగవానుడు హయగ్రీవ రూపమున ఈ జ్వరాసురుని హతమార్చి, ఇచటనే సర్వలోక హితార్థము అగద స్నానము (Medical bath) ఆచరించెను. దాని వలన ఒక మహాశబ్దము ఉద్భవించెను. అందువలన హయగ్రీవ భగవానుడు ఈ తీర్థమునకు "అపునర్భవము" అని పేరిడెను. ఇచట స్నానమాచరించిన మానవునకు పునర్జన్మ యుండదు. అందువలననే ఇయ్యది అపునర్భవము. మణికూట పర్వతమందలి హయగ్రీవ భగవానుని పరిమాణము వంద వ్యోమములు. (వ్యోమము అనగా ఒక వ్యక్తి తన రెండు చేతులను ఇరువైపులా సాచిన ఎడల వాని మధ్యగల పొడవును వ్యోమమందురు.)

ఈ ప్రదేశమునకు తూర్పున "భద్రకామ" మను త్రికోణాకార పర్వతమున్నది. ఇచట "కాలహయ" శివలింగము విరాజమానమై యున్నది. దీనికి దక్షిణమున అపునర్భవ కుండము యున్నది. ఈ కుండ తటమున భద్రకామ పర్వతమందు "హరవీధి" యను ఒక బ్రహ్మ స్వరూప శిల కలదు. దీనిపై యోగజ్ఞుడయిన మహాదేవుడు ధ్యానాసక్తుడై అవస్థితుడై యుండును. ఈ మహాదేవ సంర్శనము కావించిన మానవుడు మరణానంతరము మోక్షము నొందును. ఇచట "గోకర్ణుడు" అను శివుడు శిలారూపమున విరాజిల్లు చుండును. ఇచటనే శివుడు అంధకునకు బంధువైన గోకర్ణుని వధించెను. గోకర్ణునికి ఈశాన్య కోణమున మహాదేవుడు "కేదార" నామమున లయప్రదుడై ఉపస్థితుడై యుండును. ఈ కేదారుడు మదన పర్వతముపై యుండి కమలాకరుని భోగమును ధరించుచుండును. ఇచటనే మహాత్ములకు ఆశ్రయస్థలమయిన కమలము యున్నది. ఎవరేని ఉత్తమజనులు అపునర్భవ జలములందు స్నానమాచరించి, గోకర్ణుని మరియు యోగజ్ఞుడయిన శివుని రూపము ధర్శించి, కేదార కమల దర్శన మాచరించి, మాధవుని సందర్శించి, తదుపరి కామదేవ దర్శనము గావించి, తిరిగి అపునర్భవ దర్శనము కావింపవలెను. ఈ విధముగ పీఠయాత్ర కావించిన సాధకుడు మందు ఏడు తరములు, తరువాతి ఏడు తరములు, తనతో పాటు పదిహేను తరములనుద్ధరించి స్వర్గమునకు గొనిపోవును. స్నాన మంత్రార్థము "ఓ! మహాదధీ! నీవు విష్ణు భగవానుని స్నానము నుండి ఆవిర్భవించిన అపునర్భవము అను జలములకు ఈశ్వరునివి. నీవు స్వర్గము కోసమై సంగము నుండి దూరమైతివి. నా పాపములను, దురితములను దూరమొనరింపుము". ఈ విధముగ స్నానమొనరించిన ఉత్తమ సాధకుడు మరి పునర్జన్మ నొందదు.

మహారాజా! హయగ్రీవ తంత్రమును నీకు ఇత:పూర్వమే తెలిపితిని. ఇపుడు ఆయన ధ్యాన రూపమును వర్ణించెదను. వినుము. ఆ మహానుభావుడు కర్పూరము మరియు మల్లెపూవు వలె శ్వేతవర్ణుడై యుండును. ఆయన చతర్భుజుడై, కుండలాలంకృతుడై, వివిధ భూషణ భూషితుడై, శ్వేతకమలమందు ఆశీనుడై యుండును. ఆయన దక్షిణ హస్తములందు పుస్తకము, శ్వేత కమలము ధరించి, వామ హస్తములందు వరదాభయ ముద్రలు దాల్చి, హృదయమందు శ్రీవత్స, కౌస్తుభధారియై, అప్పుడప్పుడు గరుడ వాహనము నధిరోహించి యుండును. ఉత్తరతంత్ర మందు తెలుపబడిన సమస్త పూజా విధి విధానములచే ఆయనను పూజించి, ఆ నిర్మాల్యమును విష్వక్సేనునికి సమర్పింపవలెను. ఇచట గరుడధ్వజుడయిన

విష్ణువు సర్వదా గంధర్వులతో క్రీడించుచూ, లోక కళ్యాణార్ధము ప్రచ్ఛన్నరూపము ధరించి శిలారూపియై యుండును. హయగ్రీవ మంత్రసిద్ధి రెండు లక్షల మంత్రజపము, తదుపరి నేయి, హల్వా, (యావకము), పాయసముల చే హోమము కావించి, పురశ్చరణ కావింపవలెను. ఒక్కమారు పురశ్చరణ కావించిననూ, సాధకులు ఇహలోకమందు ఇష్టసిద్ధి ప్రాప్తినొంది, మరణానంతరము విష్ణులోకము నొందెదరు. పూజనమొనర్చు సాధకులు పూర్వము తెలుపబడిన మంత్రములచే తత్పురుషాది పంచముఖములను, కామాది పంచమూర్తులను పూజింపవలెను. కాముడే తత్పురుష రూపుడు. యోగియే ఈశానుడు. గోకర్ణుడు అఘోరరూపి. కేదారుడే వామదేవుడు. కమలరూపము నందు ఉద్భవించిన మహేశుడే సద్యోజాతుడు. ఈ పర్వతమే కేదారము. శివగంగయే కాళీదేవి. హయగ్రీవునికి తూర్పున, కేదారమునకు పశ్చిమమున, 'ఛాయాభోగము" అను స్థానము కలదు. ఇచట "భోగవతీపురము" కలదు. ఏ వ్యక్తి కుతూహలమునకైననూ, పర్యటనకైననూ అపునర్భవ మణికూటమునకు పోవునో వానికి సర్వతీర్ధ ఫలము లభించును. జేష్ఠమాస శుక్లపక్ష అష్టమి లేక పౌర్ణమి నాడు అపునర్భవము నందు స్నానమాచరించి, సవిధి పూర్వకముగ విష్ణు దర్శనము కావించిన భక్తులకు సమస్త కుశలములు ప్రాప్తించి, మరణానంతరము విష్ణుసాయుజ్యము లభించును. ఎవరు జేష్ఠమాసము పూర్ణముగ నారాయణ దర్శనము కావింతురో వారు వారి సమస్త కులజన సహితులై విష్ణువు యందు లీనమగుదురు. ఈ మణికూడ స్థలము పరమ పావన స్థానము, వారణాసి కంటె పవిత్రము, సిద్ధ, విద్యాధరులచే అర్చితము. ఏ విప్రుడు మణికూట పర్వత విశేషములను పఠించునో, లేక వినునో, ఆతడు సమస్త వేద పఠనము కావించిన ఫలమును నిస్సందేహముగ పొందును.

**(శ్రీ కాళికా పురాణమందలి మణికూట మాహాత్మ్యము అను డెబ్బది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము)**

# డెబ్బది తొమ్మిదవ అధ్యాయము

**(తీర్ధ ప్రసంగము)**

ఔర్వ మహర్షి చెప్పదొడంగెను "మహారాజా! ఈ మణికూట పర్వతమునకు తూర్పున "దర్పణ పర్వతము" యున్నది. ఈ పర్వతముపై యక్షాధిపతి అయిన కుబేరుడు తన గణములతో నివాసముండును. దీని మధ్యభాగమున రోహిత మత్స్యాకారమున "రోహితము" అను పర్వతము కలదు. దీని స్పర్శ మాత్రముననే లోహములు స్వర్ణముగ మారును. దీనికి దగ్గరనే "దర్పణము" అను నదము కలదు. ఇయ్యది హిమాలయములందుఉద్భవించినది, మరియు ఫల ప్రదానమందు బ్రహ్మ పుత్రతో తుల్యమయినది. లౌహిత్య (బ్రహ్మపుత్ర) ఉద్భవించిన పిదప శ్రీహరి సమస్త దేవగణ సహితుడై సర్వతీర్ధ జలములచే ఆతనికి స్నానము చేయించెను. తత్కారణమున ఈపర్వత, నదములు పాపరహితమై, తమ మలినములను, పాపలమును విసర్జించి స్వచ్ఛముగ మారెను. అందువలన దేవగణములు ఈ నదమును దర్పణమని కొనియాడిరి. ఏ సాధకుడు కార్తీక శుద్ధ (శుక్ల) పాడ్యమి నాడు ఈ శ్రేష్ఠ నదమందు స్నానమాచరించి, దర్పణాచలమందు కుబేరుని పూజించిన ఎడల, ఆతడు వందలాది ఐశ్వర్యములను బడసి, మరణానంతరము బ్రహ్మ సదనమునకు చేరును. దర్పణ పర్వతమునకు తూర్పున "అగ్నిమాలా" పర్వతమున్నది. ఇయ్యది సర్పాకృతియందుండి, అద్దాని పొడవు, వెడల్పు, ఎత్తు సహితము తదనుగుణముగ యుండును. ఈ పర్వతపు అగ్ని జ్వలిత ఊర్ధ్వ భాగమందు సింధూరపుంజ సమానమైన మనోహర దారుశిలపై అగ్నిదేవుడు అవస్థితుడై యుండును. ఈ పర్వతమందు ఇప్పటికీ ఇంధన రహితముగ అగ్ని జ్వలించుచునే యుండును. భైరవుని హితార్ధము మరియు కామఖ్యాదేవి పరిసేవనార్ధము అగ్ని భగవానుడు తన వహ్నిగణములతో ఇక్కడ ఎప్పటి నుండియో స్థితిగతుడయ్యెను. లౌహిత్య నది యందు స్నానమాచరించి సాధకులు

అగ్నిమాలా పర్వతమధిరోహించి, అగ్నిదేవుని పూజించిన ఎడల వారు విష్ణు మందిరమున కేగుదురు. ఈ అగ్నిమాలా పర్వత సమ్ముఖమున వరుణ కుండము కలదు. అద్దాని తీరమందు "కంసకరము" అను పర్వతము కలదు. ఇచట జలాధిదేవత అయిన వరుణుడు నివసించు చుండును. ప్రాచేతస గణములు ఈ కంసకర పర్వతమును భక్తితో పూజించినవి. ఈ వరుణకుండమందు స్నానమాచరించి, ఈ కంసకర పర్వతమును విధి విధానముగ పూజించిన సాధకులు వరుణలోకమున కేగుదురు.

"క" కారమునకు "ఉ" కారము కలిపిన వాటిని అర్ధచంద్ర యుక్తము కావించిన అయ్యది కుబేరుని బీజాక్షరమయిన "కుం" అగును. "ప" నుండి సప్తమాక్షరమైన "ర" కు చంద్రబిందువు కలిపిన ఎడల అయ్యది అగ్ని బీజమయిన "రం" అగును. దీనితో అగ్నిని పూజింపవలెను. "మ" నుండి పంచమాక్షరమయిన "వ" కు చంద్రబిందువు లేక సోమ బిందువు కలిపిన అయ్యది వరుణుని బీజాక్షరమయిన "వం" అగును. ఈ బీజాక్షరముల చే వివిధ దేవతలను పూజింపవలెను. వరుణాచలము (కంసకరము) నకు తూర్పున వాయుకూట పర్వతమున్నది. ఇయ్యది ద్విభాగయుక్తమై, వాయుబీజాకారమండల యుక్తమై (పత్రి పుష్పము, Dandelein ) యుండును. వాయు లోకమున యున్న చంద్రుని నుండి వాయువు బయలుదేరి ఊర్ధ్వ, అధో భాగములు సంచరించును. ఇచట పూజనమొనరించు సాధకులు వాయులోకమునకు ఏగుదురు. వాయుగిరికి తూర్పున చంద్రకూట పర్వతమున్నది. ఇయ్యది త్రికోణాకారము కలిగి తామ్రము వలె ఎర్రని రంగు కలిగి యుండును. ఈ గిరి శిఖరమందు చంద్రమండలమున్నది. వ్యంజనములందలి ద్వితీయవర్గమందు తొలి వర్ణమయిన "చ" కారమునకు చంద్రబిందువు కలిపిన చంద్రబీజము "చం" ఉత్పన్నమగును. ఈ బీజాక్షరముతో చంద్రుని పూజింపవలెను. ఇప్పటికీ చంద్రుడు దేవతా, గ్రహసహితుడై, ప్రతి అమావాస్య నాడు ఈ పర్వతమునకు ప్రదక్షిణ మాచరించును. ఈ పర్వతమునకు తూర్పున సోమకుండ సరోవరమున్నది. ఇందు స్నానపానములాచరించిన మానవుడు కైవల్యము నొందును. కామాఖ్యా సేవనార్ధము నిశాపతి దివి నుండి భువికేతెంచినపుడు, ఆయన కిరణములచే జలములుద్భవించినవి. ఆ జలములచే ఇంద్రుడు పవిత్ర బ్రహ్మశిల మధ్యన ఇంద్ర చంద్రుల నడుమ ఒక కుండ నిర్మాణము కావించెను. ఇచట ఈ మంత్రము పఠించుచూ స్నానమాచరింపవలెను. మంత్రార్ధము "ఓ! చంద్రకిరణ సముద్భూతమయిన, మహోదధి రూపమయిన చంద్రకుండమా! నీవు చంద్రుని నుండి ప్రవహించు సుధాప్రవాహము యొక్క ఆహ్లాద స్వరూపిణివి. నీవు జీవుల పాపములు హరించుట యందు చంద్ర సమానవు. అందువలన నా కలుషములను హరింపుము." ఏ మనుజుడు చంద్రకుండమందు స్నానమాచరించి, చంద్రకూట పర్వత మధిరోహించి, చంద్రుని పూజించునో వానికి సుందర, అవిచ్ఛిన్న సంతాన పరంపర ఇహలోకమందు కలిగి, మరణానంతరము చంద్రలోకమునకేగి, తదుపరి పరమపదము ప్రాప్తించును.

చంద్రకూట పర్వతమునకు దగ్గరనే "నందనము" అను పర్వతము కలదు. కామాఖ్యా సేవాతురుడై దేవరాజు ఇంద్రుడు ఇచట నివసించును. ప్రతి అమావాస్య నాడు చంద్రుడు చంద్రకూట పర్వతము, నందన పర్వతములు రెండింటికీ మూడుమార్లు ప్రదక్షిణ మాచరించును. చంద్రకూట జలములందు స్నానమాచరించి, తదుపరి నందన పర్వతమధిరోహించి లోకపాలుడయిన ఇంద్రుని ఆరాధించు జనులు మహాఫలము నొందెదరు. నందన పర్వత తూర్పు ప్రాంతమందు "భస్మకూటము" అను మహా పర్వతము కలదు. ఇయ్యది సాక్షాత్ శివస్వరూపము. ఇచటికి చనిన జనులు ఉత్తమ శాంతినొందెదరు. భస్మకూటమునకు దక్షిణమున, సదా ఇంద్రుని ప్రసన్నము గావించు "ఊర్వశి" అను అమృతవల్లి అయిన దేవి స్థితిగతమయినది. తొలుత దేవతలు కామాఖ్యా దేవి యొక్క భోజనమునకై అమృతమును ఏర్పాటు గావించిరి. ఆ అమృతకలశమును వహించి ఊర్వశి అచట స్థితిగతమైనది. ఈ ప్రక్రియను పర్యవేక్షించుచూ మహాదేవుడు సహితము అచట అవస్థితుడై యుండును. ఊర్వశి కొంచెము కొంచెముగ అమృతమును తీసికొని కామాఖ్యా దేవి యొక్క యోని

మండలమందు అర్పించుచుండును. శిలల మధ్య సుధాధారిణి అయిన ఊర్వశి ప్రవహించుచూ భస్మకూట పర్వత మధ్యన చేరి అచట ముప్పది రెండు ధనువుల వెడల్పు, ఏబది ధనువుల పొడవు గల ఒక కుండము చేరి అద్దానిని నింపుచుండును. ఈ కుండమందు స్నానపానములాచరించిన మానవులు మోక్షలాభము నొందెదరు. ఇయ్యది కామాఖ్యా యోని మండలమునకు ఈశాన్య కోణమందు ఎల్లప్పుడూ ప్రవహించుచూ భస్మకూటము చేరును. ఊర్వశీ యోగిని చే నిత్యము ఈయబడిన అమృతము చే దేవి ఎల్లప్పుడూ ముదిత మనస్క యై యుండును.

భస్మకూట పర్వతపు ఈశాన కోణమందు "మణికూటము" అను లింగము కలదు. ఇయ్యది సద్యోజాత రూపము. ఈ లింగము యొక్క పూజ సద్యోజాత మంత్రముల తో కావింపవలెను. చంద్రతీర్థ జలములందు స్నానమాచరించి, తదుపరి ఇంద్ర చంద్రులను స్పర్శించి, అపుడు మణికంతేశ్వరుని దర్శించి, పిదప భస్మాచలమునకేగు సాధకులు ముక్తి నొందెదరు. చంద్ర భగవానుడు ద్విభుజుడై గద, వరదముద్రలు ధరించును. ఈయన శ్వేత వర్ణుడు, శ్వేత వస్త్రధారి, దశాశ్వములు పూన్చిన స్వర్ణరథమందు ఉపస్థితుడై యుండును. దేవరాజయిన ఇంద్రుడు ద్విభుజుడు, గౌరాంగుడు మరియు సహస్రనేత్రుడు. ఈయన దక్షిణ హస్తమందు అంకుశము, వామహస్తమందు వజ్రము ధరించును. భుజమునకు బాణ తూణీరములు, ధరించి, ఐరావతాసీనుడై, సదా మహేశ్వరీ సేవానిరతుడై యుండును. "వ" కారానంతర అక్షరము "శ" కు చంద్ర బిందువు కలిపిన అయ్యది ఇంద్రబీజము "శం" అగును. ఈ బీజము చే ఇంద్రుని పూజనమొనర్పవలెను. హిమాలయము నుండి బయల్వెడలిన ఒక సుందర సరిత "సుమంగళ". ఇయ్యది మణికూట పర్వతమునకు తూర్పున ప్రవహించును. ఎవరు మణికూట పర్వతమధిరోహించి, ఈ నదిని కేవలము దర్శించినచో వారు గంగాస్నాన ఫలము నొంది, స్వర్గమున కేగుదురు. మణికూట పర్వతమునకు తూర్పున "మత్స్యధ్వజము" అను కుల పర్వతము కలదు. శివుని నేత్రజ్వాలచే దహింపబడిన మన్మథుడు ఒక మత్స్య రూపమునొంది తపమాచరించి, వృషధ్వజుని ఆరాధించి, తద్వారా తిరిగి తన రూపము నొందెను. ఇచటనే దక్షిణమునకు ప్రవహించుచూ "శాశ్వతీ" నది కలదు. ఈ పర్వతమందు "కామరూపము" అను సరోవరము కలదు. శాశ్వతీ నదియందు స్నానమాచరించి, మత్స్యధ్వజ పర్వతమధిరోహించి, కామరూపము నందలి జలములను పానము చేసిన ఎడల ఆ సాధకులు పాప విముక్తులై, శుద్ధాంత: కరణులై, శివలోకమునకు ఏగుదురు.

గంధమాదనమునకు తూర్పున "సుకాంత" మను పర్వతము కలదు. ఇచటనే "ఇంద్రకుండము" లేక "వాసవకుండము" అను కుండము కలదు. ఈ కుండమునకు దక్షిణ భాగమున కూర్చొని పురాతనకాలమున శచీపతి అమృతపానమొనరించెను. వాసవకుండమందు స్నానమాచరించి, సుకాంత పర్వతమునధిరోహించు సాధకులు ఇంద్రునికి ప్రియులై ఇంద్రలోకము ప్రాప్తించెదరు. సుకాంత తూర్పున "రక్షకూట" పర్వతమున్నది. ఇచట రాక్షసులకు రాజయిన "నిఋతి" నిరంతరము నివాసముండును. ఈ నిఋతి విశాలకాయుడు. దక్షిణ హస్తమందు ఖడ్గము, వామహస్తమందు డాలు కలిగి ద్విభుజుడై ఒప్పును. ఈయన కృష్ణవర్ణమున యుండి, నల్లని వస్త్రములు ధరించి, నల్లని పర్వతము వలె ఒప్పుచూ, గాడిదపై విరాజమానుడై యుండును. చంద్రబిందు సహిత క్ష, హ, క "(క్షం, హం, కం)" నిఋతి బీజమగును. ఏ సాధకుడు రక్షకూట పర్వతమధిరోహించి, రాక్షసేశ్వరుడయిన నిఋతినీ, రాక్షసేశ్వరి అయిన చండికను పూజించిన ఎడల, వారికి ఇక రాక్షస భయముండదు. వానిని చూని రాక్షస, పిశాచ, భేతాళ, గణనాయకులందరూ విశేషముగ భయభీతులగుదురు. ఈ రక్షకూట పర్వతమునకు తూర్పున భైరవ రూపుడయిన మాధవుడు అవస్థితుడయ్యెను. ఆయన నామము "పాండునాథుడు". ఈయన భయంకర రూపి. ఈ పాండునాథుని పూజ ఉత్తరతంత్రా విధిని కావించి, విష్ణుమూల మంత్రమయిన అష్టాక్షరి "ఓం నమో నారాయణాయ" చే పూజింపవలెను. ఈయన ఎరుపు, తెలుపు మిశ్రమ వర్ణుడు. కుడి రెండు చేతుల యందు గద, పద్మములు, ఎడమ రెండు చేతుల యందు శక్తి, చక్రములు శోభించుచుండును.

ఉజ్వల మకుటధారియై, కుండలశోభితుడై, వక్షమందు శ్రీవత్సయుతుడై, ఎర్రని కలువ యందు ఆసీనుడై విరాజిల్లు చుండును. చతుర్విధ పురుషార్ధ సిద్ధికై పాండునాధుని ఈ విధముగనే పూజింపవలెను. పాండునాధునికి ఉత్తరమున దేవ గణముల స్నానార్ధమై బ్రహ్మచే నిర్మింపబడిన బ్రహ్మకూట సరోవరము కలదు. ఇయ్యది పది వ్యోమముల పొడవు, ఏబది వ్యోమముల వెడల్పు యుండును. ఈ క్రింది మంత్రమును స్మరించుచూ బ్రహ్మకూట సరోవరమందు స్నానమాచరించి పాండునాధుని సేవించిన ఎడల భక్తులు విష్ణుసాయుజ్యము నొందెదరు. మంత్రార్ధము– దేవలోకము నుండి దిగి వచ్చినది, బ్రహ్మ కమండలము నుండి వెలువడినవి, బ్రహ్మ కుండమునందు స్రవించుచున్న సర్వపాపహారకములైన జలములారా! నా సర్వ పాపములను దూరమొనర్చి, నాకు పుణ్యమాపాదించి, స్వర్గము నీయవలసినది.” బ్రహ్మకుండ జలములందు స్నానమాచరించి, శివభగవానుని పూజనమొనర్చి, తదుపరి వాయుకూట పర్వతమధిరోహించు మానవులు ముక్తి నొందెదరు.

పాండునాధుని తూర్పున “చిత్రహరము” అను విష్ణు భగవానుని పర్వతమున్నది. ఇచట విష్ణువు వరాహరూపము దాల్చి సదా సంచరించుచుండును. నీలకూటమందు సాక్షాత్ భగవతి కామాఖ్య నివాసముండును. దీనికి తూర్పున చతుర్ముఖ బ్రహ్మదేవుడు బ్రహ్మగిరి రూపమున నివాసముండును. ఈ బ్రహ్మ శైలమునకు తూర్పున నేలపైననే కామాఖ్యా దేవి నాభిస్థానము (మండలము) శుభమై, సుందరమై శోభించుచుండును. ఇచట పరమేశ్వరి ఉగ్రస్వరూపముతో రమించుచుండును. ఈ శుభస్వరూపిణిని ఇచట ఈ విధముగనే పూజింపవలెను. ఓ! ముని శ్రేష్ఠులారా! ఈ దేవి యొక్క బీజమంత్రమును తొలుతనే ఉత్తర తంత్రమందు తెలిపితిని. ఈమె రూపమును వినుడు. ఈ పరమేశ్వరి కృష్ణవర్ణ. పొడవయిన కాయము, పొట్ట, పలుచని శరీరము, ఎర్రని దంతములు, చతుర్భుజములు కలిగి మస్తకమందు జడ, కుడి చేతుల యందు కత్తెర, కపాలము, ఎడమ చేతుల యందు ఖడ్గము, నీలి కమలముతో విరాజిల్లు చుండును. ఈమె ఎడమకాలు శవము యొక్క తొడలపైననూ, కుడికాలు శవము హృదయము పైననూ యుంచి అట్టహాసము కావించుచుండును. ఈ దేవి కపాలమాల, నాగహారములతో శోభిల్లుచూ కామనలను పూర్ణము కావించును. ఈ దేవి యొక్క మండలము త్రికోణాకారమున యుండి మధ్యన హుంకార బీజముండును. ఈమె ద్వారపాలికలు మరియు యోగినీ గణములను పూర్వము తెలిపిన విధముగనే తెలియవలెను. ఊర్వశీ కుండమందు విధి విధానముగ స్నానమొనర్చి, పాండుశిలను దర్శించి, నీలకూట పర్వతమధిరోహించు మానవులు తిరిగి తల్లి గర్భమున ప్రవేశింపరు.

ఊర్వశీ స్థుతి “ఓ! ఊర్వశీ దేవీ! ఇంద్రలోకము నుండి అవరోహితవైన నీవు పరమ సుందరీమణివి. నీ జలములు అమృతమయములు, మరియు వారణాసి కంటె అద్భుతమయిన మహత్వము కలిగినవి. ఈ జలముల చే నన్ను పాప విముక్తుని కావింపవలసినది. ఓ! దేవీ! నీవు అమృత ప్రవాహమును ప్రవహింపజేయుచున్న పరిపూర్ణ అమృతమూర్తివి. దేవీ! నీవు నా హృదయమందు విరాజమానమై, నీ అమృతము తో నన్ను ఈనాడు అమరుని గావింపుము. ఓ! పురంధరప్రియా! లౌహిత్య హ్రదమందు సమ్మిళితమగు నీవు వారణాసి కంటె అధిక శ్రేష్ఠత కలిగి యుంటివి. దయచేసి నా పాపములు ప్రక్షాళణ మొనర్చవలసినది.” ఈ విధముగ ఊర్వశీ స్థుతి కావించి, ఊర్వశీ పవిత్ర జలములందు స్నానమాచరించు పవిత్ర భక్తులు విష్ణు లోకమునకేగుదురు. ఊర్వశీ స్వరూపము. ఈ దేవి స్వర్ణ కంకణధారియై, ద్విభుజయై, గౌరవర్ణి, శ్వేతవస్త్రధారిణి, పీనోన్నత స్థనద్వయయై, సర్వాంగ సుందరియై, అపాదమస్తకము సర్వాభరణ భూషితయై, అమృత ప్రదానమునకై తన రెండు చేతులతో ఒక స్వర్ణ పాత్ర గ్రహించియుండును. ఈ దేవి యొక్క మంత్రము “ఊం” అని ఉమాతంత్రమందు తొలుతనే తెలుపబడినది.

కామాఖ్యా పర్వత తూర్పు ద్వారమందు గణేశుడు మరియు సుందర అగ్నిభేతాళమూర్తి ఉపస్థితులై యుందురు. శంకర భగవానుడు తొలుత నుడివిన వీరిరువురి మంత్రములను నుడివెదను. వినుడు. “ఓం నమ: ఉల్కాముఖయేతి”. ఇది సిద్ధ గణేశుని మూలమంత్రము. ఈయన రూపము: ఈ స్వామి కరిరాజముఖుడు, త్రినేత్రుడు, లంబోదరుడు,

చతుర్భుజుడు, సర్ప యజ్ఞోపవీతుడు, శూర్పకర్ణుడు, ఏకదంతుడు, రెండు దక్షిణ హస్తములందు దండ కమలములు, రెండు వామ హస్తములందు లడ్డు, పరశువులు శోభించుచుండును. ఆయన అతిశయ బృహత్ కాయము చే రోదసి కుహరము భేదిల్లుచున్నది. స్కంధ, చరణ, బాహువులు సహితము అతి బలిష్ఠములై, స్థూలమై యున్నవి. ఈ స్వామి సుబుద్ధి, కుబుద్ధి సహితుడై, మూషికవాహనుడై యుండును. పంచవక్త్రమంత్రము ఏది యున్నదో, ఆ దివ్య మంత్రమునే ఈ గణపతికి సహితము ఉపయోగించి, విధి విధానముగ పూజింపవలెను. అగ్ని భేతాళుడు ద్విభుజుడు, విశాల ముఖుడు, రక్తనేత్రుడై భయంకర స్వరూపముతో యుండును. ఈ స్వామి దక్షిణహస్తమందు ఛురిక, వామహస్తమందు రుధిరపాత్ర ధరించి, కరాళ దంష్ట్రుడై, కృశ శరీరుడై, సర్వాంగములందు సిరలు (రక్తనాళములు) ఉబికి యుండును. శిరమందు జటలు ధరించి, ముఖమందు వికటాట్టహాసము కావించుచుండును. ఈ అగ్ని భేతాళుని మంత్రము – "ప" కారమందలి చతుర్వర్ణము "భ" కు అగ్ని బీజము కలిపి షష్ఠమ స్వర యుక్తము కావించిన ఎడల అయ్యది "భ్రూం" అగును. ఈ అగ్నిభేతాళ బీజమంత్రము సర్వత్ర భయనాశకము. ఈ అగ్ని భేతాళుని పూజించిన ఎడల సర్వ భూతములచే కావింపబడు భయములు నివారింపబడును.

నృపోత్తమా! శైలపుత్రి మొదలగు అష్టయోగినుల రూపము మరియు అష్టాక్షర బీజమంత్రములు ఇత:పూర్వమే వైష్ణవీ తంత్రమందు నుడివితిని. ఈ యోగినుల పూజ ప్రత్యక్షరబీజము, దుర్గాబీజము లేక నేత్ర బీజముతో కావింపవలెను. కాత్యాయినీ, పాదదుర్గల పూజ దుర్గాతంత్రము తోనూ, కాళరాత్రి యొక్క పూజ కాళరాత్రి తంత్రముతోనూ కావింపవలెను. వీరి రూపములు సహితము ఇత:పూర్వము తెలిపితిని. భువనేశ్వరీ పూజనము మహామాయా మంత్ర తంత్రములచే కావింపవలెను. ఏ దేవతకైననూ స్వరూపము మరియు మంత్రతంత్ర విధులు తెలుపని ఎడల వారిని దుర్గాతంత్రముతో పూజింపవలెను. ఈ దేవతలందరూ కామాఖ్యా సమాన ఫల ప్రదాయినులు. ఏ పుణ్య జీవులు ఒక్కొక్కరుగా ఈ యోగినులందరి పూజన మొనర్చెదరో వారికి సర్వయజ్ఞఫలము లభించును.

నాభి మండలమునకు తూర్పున భస్మకూటమునకు దక్షిణమున యున్న నీలశైలము గూర్చి ఇత:పూర్వమే ప్రతిపాదించితిని. ఈ పర్వతమునకు తూర్పున యమునికి ప్రతిరూపమయిన "కర్పట" పర్వతమున్నది. ఇచటనే నీలాంజన సమాన కృష్ణవర్ణము కలిగిన "యామ్యశిల" ఉపస్థితమై యున్నది. ఈ యామ్యశిల కర్పట పర్వతపు పై భాగమునయున్న సమతల భూమి యందు పంచవ్యోమముల విస్తృతమై యున్నది. నిత్యము హస్తమునందు యమదండమును ధరించియుండు సమవర్తి యముని ఇచట పూజింపవలెను. యముడు కృష్ణవర్ణుడు, ద్విభుజుడు, ఉజ్వల కిరీటధారి; ఈయన ఎల్లప్పుడూ వామహస్తమందు అసిపత్రము (ఛురిక) ధరించి, నల్లని వస్త్రధారియై, స్థూలములయిన కాళ్ళు కలిగి, దంతములు వెలుపలికివచ్చి, మానవులకు భయాభయములు ప్రసాదించును. ఈయన మహిషవాహనుడు. ఉపాంతములందలి ప్రధమ వర్ణమయిన "య" కు అర్ధచంద్రమును కలిపిన యమబీజమయిన "యం" అగును. ఇయ్యది యమునికి ప్రీతిప్రదము. ఏ మానవుడు కర్పట పర్వతమందు యమబీజముతో భక్తి పూర్వకముగ యమునికి పూజనమొనర్చునో, వానికి అపమృత్యుదోషము అంకురింపదు. కర్పట పర్వతమునకు తూర్పునకు పైన ఆగ్నేయ కోణమున "చిత్ర" పర్వతమున్నది. బ్రహ్మ పీఠమునకు దిగువన "బ్రహ్మాగ్రవ" పర్వతమున్నది. ఇచట నవగ్రహములు యదేచ్ఛ రూపములతో నివసించుచుందురు. ఈ పర్వతమందు ఎవరు గ్రహముల పూజనము ఒనర్చెదరో వారికి ఆపదలంటవు. సూర్య చంద్రుల రూప మంత్రములను పూర్వమే మీకు తెలిపితిని. ఇపుడు మిగిలిన గ్రహముల రూపమంత్రములను ఉల్లేఖించెదను. వినుడు.

**మంగళుడు (కుజుడు)–** ఈయన చతుర్భుజుడు. రక్తవస్త్రధారి. శూలము, శక్తి, గద ధరించును. ఈ స్వామి మేష వాహనుడు మరియు వరప్రదుడు. కామదేవుని బీజమంత్రమే కుజుని బీజ మంత్రము.

**బుధుడు –** ఈ స్వామి పీతాంబరధారి, మరియు పసుపు పచ్చని మాలలు ధరించి, పచ్చని అంగరాగములు, అనులేపనములు అలదుకొనును. బుధుని మంత్రము దుర్గాతంత్రము నందలి తెలుపబడిన నేత్ర బీజము నందలి మధ్య మరియు చివరి అక్షరములు కలిపినది. ఇయ్యది సమస్త కామనలు, మరియు ఫల ప్రదాయికమయిన శశిపుత్రుడయిన బుధ మంత్రమగును–"బ్రీం శ్రీం". ఈయన చతుర్భుజుడై శూల, ఖడ్గ, డాలు, గద ధరించి సింహవాహనుడై ఒప్పుచూ వరదప్రదాయకుడై యుండును.

**బృహస్పతి–** ఈ స్వామి స్వర్ణ వర్ణముతో భాసించుచూ, పీతాంబరధారియై, స్వర్ణపల్లకిపై అరూఢుడై యుండును. ఈయన చతుర్భుజుడై, నాలుగు చేతుల యందు అక్షమాల, కమండలము, పద్మము, వరదముద్ర ధరించును. బృహస్పతి సుందరుడు, సర్వజ్ఞుడు, దేవతలకు సహితము పూజ్యుడు మరియు గురువు. బృహస్పతి బీజము "ప" వర్ణమునకు చతుర్ధ స్వరము, షష్ఠమ స్వరము కలిసి గణేశ బీజమునకు ముడి వేయవలెను. అయ్యది బృహస్పతి బీజమంత్రము "పీంపూంగం".

**శుక్రుడు–** ఈయన సర్వదేవగణమాన్యుడు, మనోహర శుక్ల వర్ణుడు, శంఖనాగాశీనుడు, చతుర్భుజుడు; దక్షిణ హస్తములందు అక్షమాల, పుస్తకము; వామహస్తములందు వరద, అభయ ముద్రలు ధరించును. ఈయన దైత్యులకు గురుపుంగవుడు. శుక్రబీజమంత్రము, బృహస్పతి బీజమంత్రము యొక్క రెండక్షరములకు "ర" కారము కలిపి, సప్త స్వరయుక్తము కావించి చంద్రబిందు యుక్తమయిన "శ" కారము కలిపిన ఎడల అయ్యది శుక్రబీజ మంత్రమయిన "ప్రీం ప్రూం ప్రం శం" అగును. ఇయ్యది సర్వ కామనలను ఈడేర్చును.

**శనైశ్చరుడు–** అర్క పుత్రడుయిన శని ఇంద్రనీలమణి సన్నిభుడై, చతుర్బాహువుల యందు శూల, పాశ, ధనస్సు, వరద ముద్రలను ధరించును. ఈయన గృధ్రవాహనుడు. ఈయనను ఈ విధముగనే ధ్యానింపవలెను. సర్వ దోష హారకమయిన శని బీజమంత్రము "శం".

సర్వ గ్రహముల యొక్క ప్రధమాక్షరమునకు చంద్రబిందువు (ం) కలిపిన ఎడల అవి ఆయా గ్రహములకు అంగమంత్రములగును. ఉదా:సూర్యుడు–"సూం";చంద్రుడు–"చం"; మంగళుడు–"మం"; బుధుడు–"బుం"; బృహస్పతి–"బృం"; శుక్రుడు–"శుం" శని–"శం"; రాహువు–"రాం" కేతువు–"కేం". శాంతి మరియు పౌష్టిక క్రియల యందు బుద్ధిమంతుడయిన వ్యక్తి ఈ నవగ్రహ పూజనమాచరింపవలెను.

**రాహువు–** ఈయన కృష్ణవర్ణుడు మరియు సింహాసీనుడు. ఈయన చతుర్బాహువుల యందు ఒక్క ప్రక్క వరదాభయ ముద్రలు, మరియొక ప్రక్క కత్తి, డాలు కలిగి యుండును. రాహువు యొక్క బీజమంత్రము "క్ష హుం".

**కేతువు–** ఈయన ధూమ్రవర్ణుడు, విశాలనేత్రడు, శవ వాహనుడు, తోక ఆకారముగ యుండును. చతుర్బాహువుల యందు ఖడ్గము, డాలు, గద, ధనుస్సు యుండును. కేతువు యొక్క బీజమంత్రము "హుంక్ష".

ఈ విధముగ చిత్రపర్వతము పై నవగ్రహ పూజనమొనర్చిన వారికి సర్వ ఫలములు సిద్ధించును.

చిత్రకూటము యొక్క తూర్పున "కజ్జలము" అను ఉత్తమ పర్వతము కలదు. ఇచట విద్యాధరాది దేవతలు నివసించెదరు. ఈ పర్వత మందు కూర్చొని సకల దేవతలకు సమస్కరించిన ఎడల ఆ మానవునికి ఇహ జన్మమందు అతులిత సంపద, ధనలక్ష్మీ లాభము కలిగి, పరమందు స్వర్గప్రాప్తి కలుగును.

ఈ కుజ్జలాచలమునకు తూర్పున "శుభ" పర్వతమున్నది. పూర్వకాలమందు సురేశ్వరుడు ఇంద్రుడు శచీ సహితుడై ఇచట రమించువాడు. దీనికి తూర్పున యున్న కపిలగంగ యందు స్నానమాచరించిన మానవులు గంగాస్నాన ఫలము నొందెదరు. నరేశ్వరా! కామాఖ్యా నిలయమునకు తూర్పు మరియు దక్షిణములకు "బ్రహ్మబిలము" అను ఒక మహా సుడిగుండము కలదు. ఇయ్యది ఇరువది అయిదు యోజనముల పరిధి గలిగి, పరిభ్రమించుచూ, శ్వేత మేఘము వంటి నదిని ఉత్పన్నము కావించును. దేవభాష యందు "క" అనగా బ్రహ్మ. ఇయ్యది బ్రహ్మ బిలము నుండి వెలివడుట చేతనూ, గంగా సమాన ఫలము నొసంగుట వలననూ, "కపిల గంగ" అని పిలువబడినది. మంగళవారము నాడు ఈ నది యందు స్నానమాచరించిన ఎడల మానవులు తొలుత స్వర్గమునకు, పిదప బ్రహ్మ లోకమునకు ఏగెదరు. ఈ కపిల గంగను ఆక్రమించుచూ అతిశయ కృష్ణవర్ణము నున్న "దమనిక" అను నది కలదు. ఇయ్యది అత్యంత పాపదమనకారిణి, దీనికి తూర్పు భాగమున "వృద్ధా" యను పావన సరిత కలదు. ఈ సరిత సహితము గంగ వంటి ఫలప్రదాయిని. మాఘమాసమంతయు పూర్ణముగ ఈ వృద్ధా మరియు దమనిక నదుల యందు స్నాన మాచరించిన ఎడల వారు నిర్వాణ ఫలము (మోక్షము) నొందెదరు.

ఈ వృద్ధానదికి తూర్పున "పరాదేవి" అను ఉత్తమనది కలదు. ఇయ్యది దివ్యత్వము నందునూ, ఫల ప్రదాయకత్వము నందునూ యమునా సమానము. ఇయ్యది దక్షిణ పర్వతమందుత్పన్నమై, దక్షిణ సముద్రమందు కలియును. కార్తీకమాసమంతయు ఎవరు ఈ నది యందు స్నానమాచరించెదరో వారు ఇహమందు ఉత్తమ భోగ భాగ్యములనుభవించి, పరమందు మోక్ష లాభమునొందెదరు. ఈ నదీ మధ్యమున "దుర్జయ" మను పర్వతము కలదు. ఈ పర్వతము పై శివ సంభోగము చే ఉత్పన్నమయిన "భైరవదేవుడు", శరభరూప మధ్య ఖండమయిన "మహా భైరవుడు" ఉపస్థితులైరి. బుద్ధిమంతులయిన సాధకులు పంచవక్త్ర మంత్రముతో వీరిని పూజించిన ఎడల వారు శివలోకమును ప్రాప్తించెదరు. నీల పర్వత ప్రసంగమందు కామేశ్వరారాధనము గూర్చి ప్రస్తావించితిని. ఆ ఆరాధన ఈ దుర్జయ పర్వతమునందు కావింపవలెను. ఇచటనే "భైరవము" అను సరోవరము, "భైరవాంగా" అను నది కలవు. ఎవరు ఈ రెండిటి యందు స్నానమాచరించెదరో వారు నిశ్చయముగ శివలోకమున కేగుదురు. ఈ దుర్జయ పర్వతమునకు తూర్పున "వరాసనము" అను పురము కలదు. ఈ పురమునకు దక్షిణమున "క్షోభకము" అను మహాపర్వతము కలదు. ఈ పర్వతము యొక్క శిలాతలముపై పంచయోని రూపమున "పంచ పుష్కరిణి" యను పార్వతీదేవి ఉపస్థితమైనది. ఇచట సాక్షాత్ హిమాలయ పుత్రి పార్వతీ దేవి సేదతీరుచుండును. ఈ పంచ పుష్కరిణీ జలములచే పంచ వక్త్రుడయిన మహాదేవుని పూజింపవలెను. ఈ పర్వతమునకు తూర్పున "కాంతా" అను మహానది కలదు. ఇది తొలుత ఉత్తరమునకు ప్రవహించి, తదుపరి దక్షిణమునకు తిరిగి బ్రహ్మపుత్ర యందు కలియును. ఈ పర్వతలోయ యందు "మహాకుండము" అను దివ్యకుండమున్నది. ఇందు స్నానమొనర్చి దేవి యొక్క పూజనమొనర్పవలెను. ఈ విధముగ కావించిన మానవుడు పునర్జన్మ రాహిత్యము నొందును. ఈ పంచ పుష్కరిణిలు వకుళపుష్ప రూపమున శోభిల్లును. ఈ పుష్కరిణి ప్రచండమయిన సాధకుల కామనలను పూర్ణమొనరించును. ఉత్తమ సాధకులు ఈ పంచపుష్కరిణీ దేవిని త్రిపురా మంత్ర తంత్రములతో, లేక కామేశ్వరీ మంత్ర తంత్రములతో ఆరాధింపవలెను. ఈ పుష్కరిణీ దేవికి అయిదుగురు యోగినులు కలదు. వారే "ఉగ్రచండా, ప్రచండా, చండోగ్రా, చండనాయికా, చండా".

మనము క్షోభక పర్వతమందలి రక్త శిలాతలముపై యున్న పంచ పుష్కరిణిల గూర్చి ముచ్చటించుకుంటిమి కదా! ఈ శిలాతలమందు "హేరుకము" అను శివలింగము కలదు. ఇయ్యది పంచ పుష్కరిణిలకు తూర్పు మరియు దక్షిణ కోణములందు ఉపస్థితమైనది. ఈ శివలింగమును ఈ యోగినుల నాయకునిగా భైరవ మంత్రములచే పూజించుసాధకుడు స్వర్గమును ప్రాప్తించును. ఈ హేరుకుని నిర్మాల్యధారిణి "చండగౌరి". ఈ విషయములన్నింటినీ

పూర్వము మీకు వివరించితిని. వసంత ఋతువునందు కాంతా నదీ జలములందు స్నానమాచరించిన మానవుడు గుణరూప సమాన్వితమైన శివలోకమునకేగును. క్షోభక పర్వత ఈశాన్య కోణమందు "సంధ్యాచలము" అను ఊర్ధ్వము, ఉత్తమమైన పర్వతము యున్నది. పూర్వకాలమున ఇచటనే, వశిష్ఠ మహర్షి విమోచనమొందెను. ప్రాచీన కాలమందు బ్రహ్మ పుత్రుడయిన వశిష్ఠుడు మరియు నిమి చక్రవర్తి పరస్పర శాపములచే శరీరవిహీనులైరి. అంత బ్రహ్మ దేవుని ఉపదేశానుసారము ఈ నిర్జన కామరూప క్షేత్రమందలి సంధ్యాచలము పై వశిష్ఠుడు తీవ్ర తపమాచరించెను. ఆయనకు విష్ణుదేవుడు ప్రత్యక్షమై వరము నొసంగెను. ఆ వర ప్రభావము చే వశిష్ఠుడు సంధ్యాచల క్రింద ప్రాంతమందు ఒక కుండము నేర్పరిచి, దాని నుండి అమృతోత్పాదనము కావించెను. తదుపరి ఆ కుండజలమును త్రాగి, ఆ జలములందు స్నానమాచరించి, తిరిగి తన దేహమునొందెను. ఈ అమృత కుండము నుండే "సంధ్య" అను శ్రేష్ఠ సరిత ఉత్పన్నమయినది. ఆ సంధ్యానది యందు స్నానమాచరించు మానవులు నిర్లోగులై, దీర్ఘాయువులై ఒప్పెదరు. దీనికి తూర్పున "లలిత" అను సుందర సరిత కలదు. దీనిని తొలుత మహాదేవుడు శివుడు బ్రహ్మపుత్ర నది నుండి వెలికితీసెను. వైశాఖ శుక్ల తృతీయ (అక్షయ తృతీయ) నాడు ఈ నది యందు స్నానమాచరించిన మానవులు శివలోకము నొందెదరు. లలిత యొక్క తూర్పు తీరము నందు "భగవాన్" అను పర్వతమున్నది. అచట స్వయముగ విష్ణు భగవానుడు లింగ రూపమున వెలసెను. ఏ మానవులు శుక్ల ద్వాదశి నాడు లలితా సరిత యందు స్నానమాచరించి, భగవాన్ పర్వతమధిరోహించి, పరమేశ్వరుడయిన విష్ణువు యొక్క పూజనమొనర్చిన ఎడల, వారు సశరీరముగ విష్ణులోకమున కేగుదరు. ఈ నదుల యందు కొన్ని ఉత్తర వాహినులు, మరికొన్ని దక్షిణ సాగర గామినులు. ఇవన్నియు గంగాతుల్య పుణ్య ఫలదాయినులు. తొలుత కామాఖ్యా దర్శనము కావించి, ఊర్వశీ కుండ మందు స్నానమాచరించిన సాధకులు ముక్తినొందెదరు.

**(శ్రీ కాళికా పురాణమందలి తీర్థ ప్రసంగము అను డెబ్బది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# ఎనభైయవ అధ్యాయము

**(కామరూప వర్ణన మందలి నదీ, ద్వీపముల మహోత్మ్యము)**

సుందర నీల తరంగిత అయి మత్స్యధ్వజమను "శాశ్వతా" నది గూర్చి ఇత: పూర్వము తెలిసికొంటిమి కదా! అద్దానికి తూర్పున "దీపావతి" అను ప్రసిద్ధ నది కలదు. ఈ పుణ్యసరిత హిమాలయముల నుండి ఉత్పన్నమై, దీపకళిక అంధకారమును పటాపంచలు గావించునటుల ఈ పవిత్రసరిత పాపములను పారద్రోలును. అందువలన దేవతలు, మానవులు సహితము ఈ నదీమతల్లిని "దీపావతి" అని పేర్కొందురు. దీపావతికి తూర్పున "శృంగాటకము" అను పర్వతము ఉపస్థితమైయున్నది. అందు దేవాధిదేవుడైన మహాదేవుని దివ్యలింగము ప్రతిష్ఠితమై యున్నది. ఈ శృంగాటక పర్వతపుటంచుల నుండి ఉత్పన్నమయిన దివ్యసరిత "శుద్ధత్రిస్రోత". ఇయ్యది మిక్కిలి శివప్రియమై శృంగాటకము నుండి దక్షిణమునకు ప్రవహించి దక్షిణ సముద్రమున ప్రవేశించును. ఎవరేని ఉత్తమ జీవులు ఈ శుద్ధత్రిస్రోత యందు స్నానమాచరించి, శృంగాటక పర్వతమందలి శివలింగ పూజన మొనర్చిన ఎడల, వారు శుద్ధచిత్తులై, ఉజ్వల సుందర శరీరులై, ఇహలోకమందు సర్వకామనలను ప్రాప్తించి, నిర్యాణానంతరము శివలోకమును ప్రాప్తించి తదుపరి ముక్తి నొందెదరు. ఈ ప్రదేశమునందు ద్విభుజుడు, వృషభవాహనుడైన శివుడు ఉమాదేవితో నిరంతరము రమించుచుండును. ఇచట శివుని వామదేవ మంత్రము చేతనూ, చండికాదేవిని ఉమా మంత్రము చేతనూ పూజింపవలెను. ఈ తీర్థమునకు తూర్పున "వృద్ధవేదిక" అను నది కలదు. ఇచట స్నానమాచరించిన ఎడల వేదికా స్నానఫలము నొందెదరు. దీనికి

నికటమున హిమాలయముల నుండి వెలువడిన "భట్టారిక" అను మహానది యున్నది. దీనిని దేవగణములు సహితము ఉపాసించెదరు. ఏ జీవి చతుర్యుగములందు లేక నాలుగు యుగాదులందు ఈ పుణ్యసరిత యందు స్నానమాచరించునో ఆ పుణ్యజీవి సాక్షాత్ విష్ణుపదము నొందును.

ఓ! నరశార్దూలా! నాటక పర్వత శిఖరమందలి దివ్య సరోవరమే "మానస సరోవరము". స్వర్ణకమల యుక్తమయిన ఈ దివ్య సరోవరమందు మహాదేవుడు భగవతీ సహితుడై జలక్రీడలాడుచుండును. ఈ పర్వతపు మూడు వైపుల నుండి మూడు నదులుద్భవించును. ఇందు పశ్చిమ భాగము నుండి ఉద్భవించు పుణ్యసరిత "ధిక్కారిక". ఇయ్యది దిగ్గజముల ఘాతములచే ఉత్పన్నమయినది కావున ధిక్కారిక అని పిలువబడినది. పర్వతపు మధ్య భాగము నుండి ఉద్భవించిన పుణ్యనది "వృద్ధగంగ". ఇయ్యది సాక్షాత్ పరమేశ్వరుని చే కొనిరాబడినది. ఈ పుణ్యనది పవిత్రత మరియు ఫల ప్రదములందు సాక్షాత్ గంగానది తో తుల్యమయినది. ఇక ఈ శ్రేష్ఠ పర్వతపు తూర్పు భాగమునండి ఉద్భవించిన మహా పవిత్ర సరిత "సువర్ణశ్రీ". ఈ పుణ్యనది సహితము గంగా సమాన పుణ్యఫల ప్రదాయిని. ఒకనాటి స్నాన సమయమున పార్వతీదేవి శరీరమందలి స్వర్ణకణిక ఈ నది యందు పడి ఈ జలముల చే వహింపబడుచున్నది. అంతేకాక జలక్రీడా సమయమున భవానీదేవి శరీరముపై భవుని చే అలదబడిన చందనము నెమ్మది నెమ్మదిగ కరిగి ఈ నది యందు సువర్ణ సహితమై కరుగుచుండుట చే ఈ సర్వ శ్రేష్ఠ సరిత "స్వర్ణగ్రీవము" అని కూడ పిలువబడుచున్నది. ఓ నృపశ్రేష్ఠా! చైత్రకృష్ణ చతుర్దశి నాడు ఏ జీవి సంయక్ చిత్తుడై ఈ నది యందు త్రైకాలిక స్నానమాచరించునో, ఆ జీవి నిర్యాణానంతరము దీర్ఘకాలము దేవీగృహము నందు నివసించి, తదుపరి బ్రహ్మలోకమునకేగి, అచట చిరకాలముండి తదుపరి బ్రహ్మ గృహమున కేగును. పుణ్యక్షయము అయిన పిదప తిరిగి భూలోకమందు సార్వ భౌమునిగ జన్మించును.

బ్రహ్మపుత్రానదీ తీరమున వృద్ధగంగా జలములందు "విశ్వనాథుడు" అను శివలింగము, "విశ్వదేవి" అను పిలువబడు యోని మండల రూపిణి అయిన మహాదేవి స్థితిగతులై యుండిరి. పూర్వకాలమందు జగత్పతి అయిన విష్ణు భగవానుడు హయగ్రీవాసురునితో సమరమొనర్చి, ఆ దనుజుని సంహరించి, మణికూట పర్వతమునకు చనియెను. ఏ జీవి అష్టమీ, ద్వాదశి, మరియు చతుర్దశి తిథులందు ఉపవాసముండి శారదా మంత్ర, తంత్ర, పూజావిధి చే భగవతి దుర్గాదేవిని, హయగ్రీవ మంత్ర తంత్రముల చే గరుడధ్వజుని, మరియు కామేశ్వర మంత్ర, తంత్రములచే శంకరుని పూజించిన వారి పూజా ఫలము నెరింగింతును. వినుడు. ఈ జీవి మూడు కల్పములు కైలాసము నందు నివసించి, అచటి నుండి విష్ణులోకమున కేగును. అచట మూడు కల్పములుండి అచటి నుండి దుర్లభమయిన దుర్గాధామము చేరును. అచట మూడు కల్పములుండిన పిదప పృథివిపై వేదజ్ఞుడయిన బ్రాహ్మణ జన్మము నొందును. స్వర్ణశ్రీ నది యొక్క తూర్పున నిర్మల జలయుక్తమయిన "కామా" నది యున్నది. దానికి తూర్పున "శోమాశన" ఉపస్థితమై యున్నది. అద్దానికి తూర్పున "వృషోదక" నది ప్రవహించుచున్నది. దీనికి తూర్పున కామరూప పీఠ ఉపరిభాగమున మహామాయ, జగజ్జనని "ధిక్కరవాసినీ" రూపమున అధివసించి యున్నది. ఈ ప్రకారముగ మీకు నేను దక్షిణవాహినీ నదీ ప్రవాహముల గూర్చి వర్ణించితిని. ఈ నదులయందలి స్నానపానములు స్వర్గదాయకములు.

ధిక్కరవాసినీ సమీపమున "శ్వేతగంగ" లేక "శితగంగ" యను మరియొక పుణ్యసరిత ప్రవహించుచున్నది. ఇయ్యది ఎల్లప్పుడూ నీటితో నిండి ఎండుట అనునది ఎరుగదు. ఈ నది గంగాతుల్య ఫల ప్రదాయిని. ధిక్కరవాసినీ దేవి భూమి యందు ప్రతిష్ఠితమయినది. ఆ దివ్యజనని ఈ పుణ్యసరిత యొక్క అంత:సలిలములను ప్లావితము కావించి, విష్ణుదేవునకు తన ప్రత్యక్ష దర్శనము నొసంగినది. ఏ మానవుడు శితగంగ యందు స్నానమాచరించి, హరిహర బ్రహ్మల దర్శనము కావించి, తదుపరి లలితకాంతాదేవి పూజనమొనర్చునో వానికి పునర్జన్మ యుండదు. ఇచ్చోట శివుడు స్వయంభువుడై లింగరూపమున, బ్రహ్మ విష్ణువులు శిలారూపమున విరాజిల్లుచుందురు. ఇచట ధిక్కరవాసిని "తీక్ష్ణకాంత"

మరియు "ఉగ్రతార" అను రెండు రూపములతో విలసిల్లుచుండును. లలితకాంత అను పరాత్పర మంగళ చండికా రూపమే తీక్ష్ణకాంత. ఆ తల్లి కృష్ణవర్ణ, లంబోదరి మరియు ఏకజటాధారిణి. ఈ దేవి యొక్క అంగమంత్ర, అగ్నిమంత్ర, రూపములు తొలుత వివరింపబడినవి. పూర్వోక్త విధానముననే ఈమెకు పూజాపరిపాటి కావింపవలసినది. "రేఖే సురేఖే తథా తిష్ఠంతు" అనునది తీక్ష్ణకాంత యొక్క మండలన్యాస మంత్రము. ఈ దేవికి "నరాంతక, త్రిపురాంతక, దేవాంతక, యమాంతక, భేతాళాంతక, దుర్దరాంతక, గణాంతక, శ్రమాంతక" అను ఎనిమిది మంది ద్వారపాలురు కలదు. వీరిని ఒక్కొక్కరినీ పీఠమండలమునకు ఒక్కొక్క దిశయందు "వజ్రపుష్పస్వాహా" (నరాంతక వజ్రపుష్ప స్వాహా) అను మంత్రముతో పూజింపవలెను. పాత్ర, ఉపకరణ, స్థాన న్యాసములు, పూర్వోత్తర తంత్ర ప్రకారము కావింపవలెను. ఈ దేవి ఆరు యోగినులచే పరివేష్ఠితమై యుండును. వారు "చాముండ, కరాళ, శుభగ, భీషణ, భగ, వికట". వీరిని "భగవద్యేకజటే విద్మహే" అను మంత్రముతో పూజింపవలెను. తీక్ష్ణకాంతాదేవి యొక్క గాయత్రీ మంత్రము

**చాముండ హే భగవద్యేకజటే విద్మహే**
**వికట దంష్ట్రే ధీమహి తన్నోసారే ప్రచోదయాత్ ॥**

ఈ దేవి యొక్క నిర్మాల్య ధారిణి "వికట చండిక". ఈమెను మట్టిఉండల జపమాలతో కానీ, రుద్రక్షాల చే కానీ జపించవలెను. వత్సలారా! మీకు ఈ తీక్ష్ణకాంతాదేవి యొక్క విశేష పూజా విధానమును వివరించితిని. మిగిలిన ఉపచార, జప బలిదానములన్నియు కామాక్షీ దేవికి వలెనే చేయవలసినది. ఈమెకు సమర్పించు పానీయములందు శ్రేష్ఠము "మదిర". బలులందు శ్రేష్ఠము "నరబలి". నైవేద్యములు మోదక, నారికేళ, మాంస, వ్యంజనములు మరియు చెరుకురసము. వరప్రద అయిన లలితకాంతా దేవియే మంగళ చండిక. ఈ దేవి రక్తవర్ణ కమలాసీనయై మకుటకుండల మండితయై, రక్తవర్ణ కాషాయ వస్త్రధారిణియై, వరదాభయముద్ర ధరించిన ద్విభుజయై, గౌర వర్ణమున ప్రకాశించు చుండును. స్మితముఖీ, శుభాసన, నవ యవ్వన అయిన ఈ దేవి శుభాంగియై, లలిల కాంతులు వెదజల్లు చుండును. ఈ దేవి యొక్క మంత్రము ఏకాక్షర ఉమామంత్రమే! అద్దానిచే ఈ దేవిని పూజింపవలెను. ఈ లలితకాంత గాయత్రి

**నారాయణ్యై విద్మహే త్వాం చండికాయై తు ధీమహి**
**తన్నో లలిత కాంతేతి ప్రచోదయాత్ ॥**

ఇయ్యది ఇష్ఠసిద్ధి ప్రదమని తెలుపబడును. మంగళవారము, వసంతఋతువు, పంచమస్వరము ఈ దేవికి ప్రియములు. అష్టమీ, నవమీ తిథుల యందు ఈ దేవిని పూజించిన ఎడల సుకృతములు కలుగును. ఈ దేవి యొక్క నిర్మాల్యధారిణి "లలితచండిక". దూర్వాంకురములు, వేడిగా పొగలు చిమ్ముచున్న అన్నము ఈ దేవికి ప్రీతి ప్రదములు. మిగిలిన పూజా విశేషములన్నియు వైష్ణవీ పూజా విధానముననే చేయవలెను. బలి మరియు మిగిలిన ఉపచారములు మహామాయా పూజా విధిననుసరించి కావింపవలెను. ప్రతి మానవుడు తన శరీర హితార్థము తన రక్తమును అర్పింపవలెను. మహామాయ మంగళ చండిక యొక్క పూజ వస్త్రము, ప్రతిమ, లేక ఘటము నందు చేయవచ్చును. అంతేకాక మంగళవారము దూర్వాంకురముల చే ఈ దేవిని పూజించిన ఎడల ఆ సాధకునకు అభిలిషతములు ప్రాప్తించును. ధిక్కరవాసినీ దేవి యొక్క ఈ పూజాపరిపాటి ఎవరు శ్రవణము చేయుదురో వారికి అశుభములు ప్రాప్తింపవు. సూర్యుడు, శివుడు ఇరువురునూ "ధిక్కర" అని పిలువబడుదురు. ఈ దేవి వారిరువురి పై కూర్చొనును కావున ఆమెను "ధిక్కరవాసినీ" అని పేర్కొందురు. త్రిలోకముల యందు ఈమెతో సమానమయిన సుందరి లేదు. అందువలన ఈమె "లలితకాంత" అని పిలువబడును. ఈ దేవిని సహితము శంకర పూజా విధిని అనుసరించి పూజింపవలెను.

భేతాళ భైరవులారా! ఇపుడు బ్రహ్మ పూజావిధిని వినవలసినది. బ్రహ్మ మంత్రము "ప" నందలి తృతీయ వర్ణము "బ". అద్దానికి వహ్ని (ర) జోడించి, దానికి శేషవర్గము (అ) జోడించి, పిదప చంద్ర బిందువు జోడించిన ఎడల అయ్యది "బ్రాం" అను బ్రహ్మ మంత్రమగును. ఈ మంత్రము చే బ్రహ్మ దేవుని పూజించిన ఎడల ఆ జీవునకు ఇష్టకామనలు పూర్ణమయిన తదుపరి బ్రహ్మలోకము నొందును. చతుర్ముఖ బ్రహ్మదేవుడు ఎర్రని కమలమందాసీనుడై చతుర్ముఖుడు, చతుర్బాహువై, హంసవాహనుడై, రక్తవర్ణుడై, పొడవయిన శరీరము కలిగి పరిపుష్టాంగుడై విలసిల్లును. ఆయన పై ఎడమ చేతి యందు కమండలము, క్రింది ఎడమచేతి యందు అక్షమాల, పై కుడి చేతి యందు సృక్, క్రింది కుడి చేతి యందు సృవము ధరించును. ఆయన ఎడమ వైపు ఆజ్యస్థలి (హోమగుండము), ఎదరుగ సర్వదేవగణములు యుందురు. ఆయన ఇరువైపులా ఎడమవైపు సావిత్రి, కుడివైపున సరస్వతి, ఎదరుగ ఋషి గణములు యుందురు. బ్రహ్మదేవుని ఈ విధముగ చింతించి ధ్యానింపవలెను. బ్రహ్మయంత్రము – నలుప్రక్కలా నాలుగు ద్వారములు గల చతురస్రము (చతుష్కోణము) నందు అష్టదళ పద్మము ముద్రింపవలెను.

నాలుగు ద్వారముల యందు తూర్పు నుండి వరుసగా అక్షమాల, కమండలము, సృక్, సృవముల అంకితము కావింపవలెను. ఉత్తర తంత్రమున తెలుపబడినటుల సమ్మార్జనాది ప్రతిపత్తుల గావించి, యోగ పీఠమందు అంగికాది ఆధారశక్తులను పూజించి, అష్టదళ పద్మమందలి ఒక్కొక్క దళము నందు ఒక్కొక్కరిగా అష్టదిక్పాలకుల నావాహన చేసి పూజింపవలెను. పిదప బ్రహ్మ గాయత్రీ మంత్రముచే చతుర్ముఖ బ్రహ్మను పూజింపవలెను.

**ఓం పద్మాసనాయ విద్మహే హంసారూఢాయ ధీమహి**
**తన్నో బ్రహ్మన్ ప్రచోదయాత్ ॥**

ఈయన పూజోపచారములు పూర్వము వలెనే కావింపవలెను, కానీ కనుల యందు కాటుక నిషిద్ధము. ఈయన నిర్మాల్యధారి సనత్కుమారుడు. చతుర్ముఖ బ్రహ్మ దేవునికి ఎర్రని పట్టు వస్త్రము ప్రియము. పాయసము, ఘృతము, తిలలు కలిపిన అన్నము, ఆయన ప్రియభోజనము. ఎరుపు, రక్తచందనముల మిశ్రమము ఈయనకు ఇష్టము. చతుర్ముఖుని పూజించుటకు మందు ఈయన పార్శ్వమున గల శంకర, శ్రీహరులను, సావిత్రీ సరస్వతులనూ, ఆయన చేతులయందున్న సృక్ సృవములనూ, హంస, పద్మములనూ పూజింపవలెను. ఈయనకు సాష్టాంగ దండ ప్రణామములాచరించుట విశేష ఫలము. కమలబీజముల మాల ఈయన జపకర్మ యందు శ్రేష్ఠము. బ్రహ్మ పూజకు పౌర్ణమి, అమావాస్యలు శుభతిథులు. అంతేకాక ఈయనకు పాలతో అర్ఘ్యమీయవలెను." ఈ విధముగ శివుడు తన పుత్రులకు బ్రహ్మ పూజా విధిని ఎరింగించి తుదకు ఇట్లనియె "ఎవరికి, ఎక్కడ, ఏ నిర్దిష్ఠ విధి నిర్ణయింపబడినదో, అయ్యది కావించిన ఎడల ఆ పుణ్యజీవులు మోక్షమును ప్రాప్తించెదరు."

ఇపుడు వైష్ణవ పూజావిధి – రాజేంద్రా! విష్ణుదేవుని అంగమంత్రము ద్వాదశాక్షరి అయిన "ఓం నమో భగవతే వాసుదేవాయ". విష్ణు భగవానుని ప్రత్యంగ రూపము "దధి వామనము". పరమశివుని చే తెలుపబడిన శ్రీహరి ప్రత్యంగమంత్రము "ఓం నమోవిష్ణవే సురపతయే మహా బలాయ నమ: స్వాహా". బీజాక్షరములు, ప్రత్యంగ రూపము సహితమై పైన తెలిపిన మూడు మంత్రములను తెలిసికొనిన జీవుడు దేవ శరీరమును ప్రాప్తించి, పునర్జన్మ రహితుడగును. ఓ! భూపతీ! ఈ మూడు మంత్రములతో ఎల్లప్పుడూ, అన్నిచోట్లా విష్ణు భగవానుని ఉత్తరాతంత్రము నందు వివరింపబడిన పూజావిధిని పూజింపవలెను. రాజా! బీజమంత్ర సాధనయందు ఉపయోగింపబడు విష్ణుభగవానుని బీజమంత్ర రూపమును నీకు వివరించెదను. ఈ స్వామి పూర్ణచంద్రుని వంటి శ్వేతవర్ణుడై, కర్ణములందు కుండలములను, శిరమునందు సుందర మకుటమును, గళమందు మోకాళ్ళవరకు వ్రేలాడు వనమాలను కలిగి శరీరమందు పచ్చని పీతాంబరమును ధరించును.

ఆయన చతుర్భుజుడై కుడివైపు పై చేతి యందు గద, క్రింది చేతియందు వికసించిన కమలము, ఎడమవైపు పై చేతి యందు ఉగ్ర సుదర్శన చక్రము, క్రింది చేతి యందు శంఖము ధరించును. వక్షము నందు శ్రీవత్సము అను పుట్టుమచ్చ, కౌస్తుభమణి శోభించుచుండును. ఎడమ పార్శ్వమున క్రింద చేయివద్ద బాణములతో కూడిన అమ్ములపొది, కుడి పార్శ్వమున ఒర సహితముగ నందకమను ఖడ్గము నెలకొని యుండును. ఆయన కుడివైపు లక్ష్మీదేవి, ఎడమవైపు సరస్వతీ దేవి విరాజిల్లుచుందురు.

ఇపుడు ద్వాదశాక్షర మంత్ర రూపమును వర్ణించెదను. ఈ రూపము నీలి కమల దళముల వంటి శ్యామల వర్ణమున యుండి చతుర్భుజ సంయుక్తమై యుండును. ఇందు కుడివైపు హస్తము లందు పద్మము, గద, ఎడమవైపు హస్తములందు శంఖ, చక్రములు ఉపస్థితమై యుండును. మిగిలిన రూపమంతయు బీజమంత్ర రూపము వలె భాసిల్లును. ఇపుడు పరమ దరిద్ర నాశకమయిన అష్టాదశాక్షరముల ప్రత్యంగ మంత్రము గూర్చి తెలిపెదను. ఈ మూర్తి పూర్ణచంద్రుని వోలు శ్వేతవర్ణుడై దక్షిణ హస్తమందు దధ్యన్నము గల స్వర్ణపాత్ర, వామహస్తమందు అమృత భాండము ధరించి, పూర్ణచంద్రుని మధ్య పద్మాసనస్తితుడై, శ్వేత వస్త్రములు ధరించిన వామనరూపుడు, శుచిస్మిత ముఖారవిందము గల త్రిలోకేశ్వరుడు, భక్త జనుల కామనలను దీర్చు వరదాయకుడు అయిన తివిక్రమ దేవుని, విష్ణువును ధ్యానింపవలెను. ఈ మంత్రముల దహన ప్లవన క్రియలు ఇత: పూర్వము ఉత్తర తంత్రమునందు తెలిపిన విధి విధానముననుసరించి కావింపవలెను.

ఇపుడు శివ భగవానుని ద్వారా తెలుపబడిన మండలముల గూర్చి తెలిపెదను. నిత్యపూజకు పంచవర్ణ చూర్ణము ద్వారా రేఖాంకితము గావించి మండపములు నిర్మింపవలెను. నైమిత్తిక కర్మలకు కర్మభేదముననుసరించి మండల నిర్మాణమొనర్పవలెను. ఈ మండలము ఒక అడుగు నిడివి గల చతురస్రాకారమున యుండి, నలుప్రక్కలా నాలుగు ద్వారములు కలిగి, నాలుగు కోణముల యందు శంఖ పరివేష్ఠితమై యుండవలెను. ఎనిమిది దిక్కులా ఆయుధ సహితులైన దిక్పాలుర నేర్పరుపవలెను. ఈ వ్యవస్థ నంతటినీ ఒక పద్మాకారము నేర్పరిచి అందు యుంచవలెను. పంచచూర్ణములు వరుసగా తెలుపు, పసుపు, ఎరుపు, నలుపు, ఆకుపచ్చ వర్ణములయందుండవలెను. ఈ వర్ణములు వినా వేరొక వర్ణములు వాడరాదు. మండలములు నాలుగు, మూడు, రెండు, లేక ఒక అడుగు పొడవు యుండవచ్చును. అశ్వమేధ, రాజసూయాది యాగములందు యజ్ఞ గుండము నాలుగు అడుగుల కంటె ఎక్కువ నిడివి కలగినదై యుండవలెను. రాజా! ఎక్కడాకూడా కల్పోక్త పూజా విధిని అతిక్రమించకుండ, ఎక్కడ ఏమి చెప్పబడినదో అట్లే కావింపవలెను. ఈ మండలము మధ్య తెలుపు చూర్ణముతో గుండ్రని పద్మమును లిఖించి, అద్దాని కర్ణికను పసుపు వర్ణముతో చేసి, కేసరములను ఎరుపు వర్ణముతో చిత్రీకరించి, కమలము బయట ఎరుపు, పసుపు చూర్ణములతో నింపవలెను. వజ్రాయుధము, శక్తి, లోహదండము, ఖడ్గము, పాశము, అంకుశము, గద, శూలము, ఇవి వరుసగా ఇంద్రాది ఎనిమిది దిక్పాలుర ఆయుధములు. శివుడు, గౌరీదేవి, బ్రహ్మ, రాముడు, కృష్ణుడు వీరిని ఐదుగురినీ పూజింపవలెను. ఎట్టి పరిస్థితుల యందు శివ పార్వతులను పూజావిధి యందు విడదీయరాదు. వారు విడదీయబడిన ఎడల పూజ నిష్ఫలమగును. చూర్ణము చే నిర్మింపబడిన మండలము విచ్ఛిన్నమయినా, ఎగిరిపోయినా, రాశీభూతమయినా, అది మండల దోషము క్రింద పరిగణింపబడి పూజ నిష్ఫలమగును.

బలభద్రుడు, కాముడు (ప్రద్యుమ్నుడు), అనిరుద్ధుడు, నారాయణుడు, బ్రహ్మ, విష్ణువు, నరశింహుడు, వారాహుడు (వరాహస్వామి), వీరు ఎనిమిది మంది యోగులుగ పరిగణింపబడుదురు. ఇత:పూర్వము తెలుపు చూర్ణము తో నిర్మింపబడిన అష్టదళ పద్మమందు వీరిని ఎనిమిది మందిని ఆవాహన చేసి మధ్యన కర్ణిక యందు వాసుదేవుని నాయకునిగ నిక్షిప్తము (ఆవాహన) చేసి పూజింపవలెను. ఇపుడు అష్ట యోగినులు వరుసగా "ఉత్కర్షణీ, జ్ఞేయ, జ్ఞాన, క్రియ, యోగ, ప్రహ్వీ, ఈశానీ, అనుగ్రహీ." బలభద్రుడు, కాముడు, బ్రహ్మ మినహా మిగిలిన యోగులందరూ చతుర్భుజులు, మరియు శంఖ,

చక్ర, గదాధరులు. విధాత (బ్రహ్మ) రూపము ఇంతకుమందు వర్ణింపబడినది. బలభద్రుడు హల, ముసల, ఖడ్గ, చక్రములు ధరించి, పార్శ్వమున ఎల్లప్పుడూ గదా సహితుడై యుండును. ఆయన పార్శ్వమున ఎల్లప్పుడూ పద్మము యుండును. శంఖ చక్రములు వరాహుని దక్షిణ హస్తములందు యుండగా, నారశింహుని దక్షిణహస్తమందు చక్రము, వామహస్తమందు శంఖము ఉపస్థితమై యుండును. నరశింహుని మిగిలిన రెండు హస్తములు హిరణ్యకశిపుని విదీర్ణమొనర్చు చుండును. ఇపుడు నరోత్తముడయిన నారాయణుని వర్ణించెదను. నారాయణుని దక్షిణ హస్తములందు శంఖ, పద్మములు, వామహస్తములందు చక్ర, గదలు యుండును. అనిరుద్ధుని క్రింది దక్షిణ హస్తమందు గదాధారణ చేయును. వాసుదేవుని ఎనిమిది మంది యోగిజనులు వరుసగా స్వచ్ఛమయిన శ్వేతవర్ణము (తెలుపు), పసుపుపచ్చ, కాటుకవంటి నలుపు, నీలోత్పల శ్యామదళవర్ణము, ఎర్రని మేఘముల వంటి ప్రభ, తుమ్మెదల వంటి నలుపు, ఎరుపు, స్వర్ణవర్ణము కలిగియుందురు. ఈ యోగులతో పాటు యోగినులు సహితము తదనురూప వర్ణముతో యున్నారని తలచి ఇరువురినీ ధ్యానింపవలెను.

రాజా! ఇపుడు ఆధారశక్తి మొదలగు ఆసన దేవతలను, గ్రహములను, దిక్పాలురను, మండలమందు నిర్దిష్ట స్థానములందు ఆవాహనమొనర్చి, వారి వారి నిర్దిష్ట మంత్రముల చే ఉపాసింపవలెను. విష్ణు భగవానుని పైన తెలిపిన వివిధరూపములందే కాక ఆయన యొక్క అస్త్రాదికములను, హస్తముల యందు ధరించిన పద్మాది వస్తువులను కూడ పూజింపవలెను. ఈ వివిధ అస్త్రాధికములను నారద పాంచరాత్ర విధి విధానము ననుసరించి పూజింపవలెను. గరుడుడు సూర్యకాంతిని పోలియుండును. గద కృష్ణలోహ వర్ణముననూ, సరస్వతి శుక్ల వర్ణముననూ, లక్ష్మీదేవి స్వర్ణప్రభలతోనూ, చక్రము మధ్యందిన మార్తాండుని వలెనూ, శంఖము పూర్ణచంద్రుని వలెనూ, కౌస్తుభము సుందర రక్తవర్ణముతోనూ, శ్రీవత్సము అరుణద్యుతి కలిగి, వనమాల నానావర్ణ విరాజితమై, శరాసనము ఇంద్రధనువు వలెను, బాణములు విద్యుత్ ప్రభలతోనూ, వస్త్రములు స్వర్ణప్రభలతో, కుండలములు బాలసూర్యశోభతోనూ, శిరమున మకుటము సూర్యకాంతితోనూ శోభిల్లు చుండును."

రాజా! ఇపుడు స్వర్గమోక్ష ప్రదమయిన న్యాసమును తెలిపెదను. వినుము. తొలుత అంగన్యాస, కరన్యాసముల నొనర్పవలెను. అటుపిదప ద్వాదశాక్షరి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను మంత్రమందలి ఒక్కొక్క అక్షరమును కుడి చేతి బొటనవ్రేలితో మొదలుపెట్టి ఒక్కొక్క వ్రేలి యందు ఒక్కొక్క అక్షరమును న్యాసమొనర్చి, పదప అక్షరమును ఎడమ చేతి బొటనవ్రేలి నందు న్యాసమొనర్చి, చివరి రెండక్షరములను రెండు అరచేతులయందు న్యాసమొనర్చవలెను. తదుపరి హృదయము, శిరము, శిఖ, రెండు బాహువులు, నేత్రములు, ఉదరము, వీపు, రెండు భుజములు, చేతులు, పిక్కలు, పాదముల యందు ఈ ద్వాదశాక్షరిని న్యాసము కావింపవలెను. తదుపరి రెండు బొటనవ్రేళ్ళ యందు వాసుదేవతత్వమును న్యాసము చేసి మిగిలిన ఎనిమిది వ్రేళ్ళ యందు బలభద్రాది అష్ఠ యోగినులను బీజాక్షర సహితముగ న్యాసము చేయవలెను. అట్లే శిరము, నేత్రము, ముఖము, కంఠము, వక్షము, నాభి, గుహ్యము, జానువులు, పదద్వయము ఈ తొమ్మిది స్థానముల యందు వాసుదేవ సహిత అష్ఠ యోగుల బీజాక్షరములను న్యాసము చేయవలెను. ఇపుడు రెండు చేతులను జోడించి, రెండు రెండు వ్రేళ్ళను జతపరిచి, తిరిగి ఆ అంగుళుల యందు బీజ సహిత ద్వాదశాక్షరిని న్యాసమొనర్చి మిగిలిన రెండక్షరములను అరచేతుల యందు నిక్షిప్తమొనర్పవలెను. విద్వాంసులు అష్ఠాదశాక్షరముల మహా మంత్రమును (ఓం నమో విష్ణవే సురపతయే మహాబలాయ నమ: స్వాహా) మొదటి తొమ్మిది అక్షరములను పైన తెలిపిన తొమ్మిది స్థానముల యందు న్యాసము కావించి, మిగిలిన తొమ్మిది అక్షరములను చెవులు, పార్శ్వము, గుదము, లింగము, కటి, ఊరు (తొడలు), కాలివేళ్ళు యందు న్యాసమొనర్పవలెను. ఏ మంత్రమును ఏ తంత్ర విధానముతో సంధానపరచి పూజింపవలెనో, అద్దానిని అట్లే చేయవలెను. ఈ విధముగ చతుర్విధ న్యాసముల చే పూజించు మంత్రవేత్త లేక సాధకుడు పాపరహితుడై, పవిత్రాత్ముడై, సాక్షాత్ విష్ణురూపుడయి సంపూర్ణ పూజాఫలము నొందును. పూజావిధి ఆచరింపకుండా

కేవలము న్యాసము చేసినప్పటికినీ ఆ ధీర సాధకుడు విష్ణు సాయుజ్యమునొంది పరమ పదము ప్రాప్తించును.

విద్వాంసుడయిన సాధకుడు తొలుత యోగ పీఠమును ధ్యానించి తదుపరి తూర్పున గరుడుని, దక్షిణమున చక్రమును, ఉత్తరమున శంఖమును, పశ్చిమమున గదను, దక్షిణమున లక్ష్మీదేవిని, ఉత్తరమున కమలమును న్యాసమొనర్చి, పీఠమధ్యమున వనమాల, శ్రీవత్సము, కౌస్తుభమును, న్యాసమొనర్చి, దక్షిణమున శాంగధనువు, కరవాలము, వామభాగమున అమ్ములపొది, డాలు, మరియు సరస్వతీదేవిని న్యాసము కావింపవలెను. ఈ పూజ కావించినపుడు సాధకుడు విష్ణువు మరియు ఆయన యొక్క యోగి, యోగినీ, గ్రహ, దిక్పాలురను, పుటాది యోగముద్రలను, వేరువేరుగా ఎల్లరకు ప్రదర్శింపవలెను. అచ్ఛిద్ర దోష నివారణార్థము తొలుత చెప్పబడిన మంత్రములచే దోష నివారణ గావించి సూర్యునకు అర్ఘ్యమీయవలెను. విష్ణు నిర్మాల్యమును ధరించు మహనీయ దేవత "విష్వక్సేనుడు". ఈయన ఈశాన కోణమందు ఉపస్థితుడై యుండును. ఈయన శ్వేత పద్మాసీనుడై, చతుర్భుజుడై, శంఖ, చక్ర గదాదులు ధరించి, దీర్ఘమయిన గడ్డము, జటాజూటము కలిగి, శరీరము ఎరుపు, పసుపు వర్ణ మిశ్రమమై విరాజిల్లు చుండును. ఈయన ధ్యానమంత్రము "లౌం". ఈ ధ్యాన మంత్రము చేతనే ఈయన పూజన మొనర్పవలెను. బలభద్రాది ఇతర యోగి/యోగినీ జనుల విసర్జన మానసికముగ నొనర్పవలెను. ఏ సాధకుడు దిక్కరవాసినీ దేవి స్థానమందు చేయవలసిన విధి విధానములతో త్రిమూర్తులలో ఏ ఒక్కరిని పూజనమొనర్చిన ఎడల అతడు/ఆమె పరమపదము నొందును. ఓ! నృపసత్తమా! ఎక్కడెక్కడ విష్ణుదేవుని పూజన మొనర్పబడునో అక్కడక్కడ వైష్ణవ సాధకుడు, ఈ తంత్ర పద్ధతినే ఉపయోగింపవలెను. అంతేకాక అచట "దధివామనపూజ" సంక్షేపముగ అనగా హృదయాది అంగన్యాసము లేకుండా చేయవలెను. సంక్షేపము లేక విస్తారముగ వైష్ణవ తంత్రమందు ఎల్లప్పుడూ వాసుదేవ పూజనమొనర్పవలెను.

ఇపుడు విష్ణు భగవానునికి ప్రీతికరమయిన వస్తువులను నుడివెదను – దీపములందు ఘృత (నేయి) దీపము, చందనములందు మలయచందనము, తాగు పదార్థములయందు అర్ఘ్యము, భోజనపాత్రలందు తామ్రపాత్ర, భూషణములందు హార కిరీట, కుండలములు, స్నానపాత్రలందు శంఖము, ధూపములందు అగరుధూపము, వస్త్రములందు ఎరుపు, పసుపు లేక తెలుపు పట్టు వస్త్రములు, విష్ణుదేవునికి మిక్కిలి ప్రీతిప్రదములు. పుష్పములందు కదంబము, కుబ్జికము, జాతిమల్లి, మల్లి, మాలతీ, మరియు కమలములు, ఏకాంతసేవ యందు వేది; తీర్థ జలము; మంత్రములందు తద్విష్ణో! మరియు పురుషసూక్త మంత్రములు, మాలలందు పత్ర జీవమాల, తిథులయందు ద్వాదశి, ఋతువుల యందు వసంతము, తిను పదార్థములందు శాల్యాన్నము, హవిష్యాన్నము, హల్వా, పాయసము, నేయి, పొంగలి (ఖిచిడీ), పాలు; పత్రములందు తులసి, బిల్వము, అమలకీ (రాచ ఉసిరి), ఇవన్నియు సహితము శ్రీమహావిష్ణువునకు పరమ ప్రీతి ప్రదములు. ఈ విధముగ ఎవరు విష్ణుదేవుని నిరంతరము పూజించెదరో వారు తమ వంశము నందలి అనేక తరములను ఉద్ధరించి స్వయముగ విష్ణురూపుడగును."

ఈ విధముగ శంకర భగవానుడు తన పుత్రులయిన భేతాళ భైరవులకు కామరూప పీఠమును పరిచయము గావించి, వారితో కలసి కైలాస పర్వతమునకేగి, వారిని యథోచిత యోగమార్గమందు నియోజన కావించెను. తదుపరి తత్ఫలితముగ తొలుత దేవతలుగ యుండి శాప వశమున మానవయోనులందు పుట్టిన పార్వతీ పరమేశ్వర తనయులు, భేతాళ భైరవులకు శాపవిముక్తి కలిగినది. ఈ మహాఖ్యానమును ఏకాగ్రతతో వినిన వారికి ఏ విధమయిన శాపభయము, మరియు శారీరిక మానసిక రుగ్మతులు పొటమరించవు. వారికి పుత్ర, పౌత్ర ధనైశ్వర్యములు సిద్ధించి, అన్ని చోట్లా ప్రేమ, గౌరవములు లభించి, సకల కళ్యాణములు కలిగి దీర్ఘకాలము జీవించెదరు. ఈ కామరూప పీఠమును తెలిసికొను ఉత్తమ సాధకులు ఉత్తమ జ్ఞానులై పరమ నిర్వాణము నొందెదరు. ఎవరు కామరూప పీఠయాత్ర గావించి, సమస్త పీఠములను సందర్శించి, సమస్త దేవతలను పూజించెదరో, వారు తమతో పాటు పదితరముల పూర్వము, పది తరముల

తరువాత వారిని దివ్య జ్ఞానులను కావించి వారందరి సహితులై ముక్తిపథము నొందెదరు.

**(శ్రీ కాళికా పురాణమందలి కామరూప వర్ణనమందు దీపవత్యాది మాహాత్మ్యమను ఎనభైయవ అధ్యాయము సమాప్తము)**

# ఎనభై ఒకటవ అధ్యాయము

**(కామరూప మాహాత్మ్య వర్ణనము; వశిష్ఠ శాపము)**

ప్రాచీనకాలమందు కామరూప పీఠమందలి తీర్థముల యందు స్నాన, జలపాన, పూజనముల చే సర్వులు దేవతలై స్వర్గమున కేగుచుండిరి. కొందరు ముక్తి నొందుచుండిరి. మరికొందరు శివత్వము నొందిరి. రాజా! నరశార్దూలా! శివుని వర ప్రభావము వలన యముడు సహితము వీరిని తన లోకమునకు కొనిపోవుటకు అసమర్థుడయ్యె! శివ గణములందలి భయముచే యమభటులు ఆ దివ్య తీర్థమునకు పోజాలరైరి. ఇవన్నియు గమనించిన శమనుడు (యముడు) విధాతవద్దకేగి ఇట్లు మొరపెట్టుకొనెను "విరించీ! కామరూపమందు స్నానపానములాచరించి జనులు దేవీ గణముల యందు కానీ, ప్రమథగణముల యందు కానీ, సుస్థిరులగుచున్నారు. వారిని నియంత్రించు శక్తికానీ, ఆధిపత్యము గానీ నాకు లేదు. అందువలన నాకు నా వృత్తిని సక్రమముగ చేయు  యోచనను శలవీయ వలసినది." అంత చతుర్ముఖ బ్రహ్మ సరస్వతీ యములను తీసికొని వైకుంఠమున కేగి ఈ వివరమంతయు విష్ణు భగవానుని కెరింగించెను. అంత శ్రీహరి వారందరినీ తీసికొని పరమశివుని వద్దకేగి, శివుని చే సన్మానింపబడి తదుపరి ఇట్లనియె "శ్రీకంఠా! కామరూప క్షేత్రము సర్వతీర్థ, క్షేత్రముల కంటె విశిష్ఠమై, అచటికేతెంచిన జనులకు గణశ్రేణిని ప్రాప్తింపజేసి, శమనునికి నియంత్రణ లేకుండ చేయుచుండెను. మహాదేవా! ఎచట యముని నియంత్రణ చెల్లదో, ఆ ప్రదేశమునందు నీతినియమములు లేకుండును. అందువలన కామరూపమునందు శమనుని నియంత్రణ చెల్లునట్లు వరమీయవలసినది."  మహాదేవుడు వివరమంతటినీ ఆలకించి, కొంత తడవు శోచించి, వారి అభ్యర్థనను అమలుపరచుటకై వారిని వారివారి స్థానములకు సాగనంపి, తాను గణముల సహితుడై కామరూపము చేరెను.

అంత శంకరుడు తన గణములను, ఉగ్రతారాదేవిని ఉద్దేశించి అచటగల ప్రజలందరినీ వెనుకకు పంపవలెనని ఆదేశించెను. అంత గణములు మరియు అపరాజితాదేవి కామరూపమును రహస్యపీఠమొనర్చుటకై అచటి ప్రజలందరినీ అచటి నుండి వెడలగొట్టిరి. అంతేకాక సంధ్యాచలమందు స్థిరనివాసడయియున్న విప్రుడు, వశిష్ఠమునిని సహితము వెడలగొట్టుటకు ప్రయత్నించిరి. అంత ఆ మహాముని మిక్కిలి క్రోధితుడై "ఓ! భగవతీ! నేను మునిని అయినప్పటికీ నీచే వెడలగొట్టుటకు బంధింపబడితిని. అందువల్ల ఇకనుండి నీవు వామాచారము చే, వామ మంత్రతంత్రములచే పూజింపబడుదువు. ఈ మందబుద్ధులయిన శివగణములు మ్లేచ్ఛులవలె తిరుగుచుందురు. ఈ కామరూపము నందు నివసించువారందరూ మ్లేచ్ఛులగుదురు. మహాదేవుడయిన శివుడు సహితము నా వంటి తపస్వి, ఇంద్రియనిగ్రహుని సహితము వెళ్ళగొట్ట దలిచిన కారణమున ఆయన కూడా మ్లేచ్ఛ ప్రియుడై, భస్మ లిప్తాంగ శరీరుడై, అస్తికలు ధరించి యుండును. ఎంతవరకు విష్ణుదేవుడు ఇచటకు ఏతెంచకుండ యుండునో, అంతదనుక ఈ కామరూప పీఠము మదమత్తులయిన మ్లేచ్ఛులుచే రక్షింపబడును. కామరూప తంత్రము, మహాత్మ్యము ఎంత మాత్రము ప్రచారము చెందక గుప్తముగ యుండును. కానీ ఏ సాధకుడయిననూ అలతి ప్రచారము గల కామరూప తంత్రమును తెలిసిన ఎడల ఆతడు సమయము అనుకూలించినపుడు పూర్ణ ఫలము నొందును." ఈ విధముగ పలికి వశిష్ఠమహర్షి అంతర్ధానము నొందెను.

క్షణములో దేవతాభూమి అయిన కామరూపము మ్లేచ్ఛులచే నిండెను. ఉగ్రతారాదేవి వామాచారపూజిత అయ్యెను. శివుడు సహితము మ్లేచ్ఛసేవితుడయ్యెను. కామరూప క్షేత్రము వేదమంత్రహీనమై, చాతుర్వర్ణ రహితమై, క్షణములో యముని పాలనలోనికి ఏతెంచెను. తరువాతి కాలమందు విష్ణుభగవానుడు అచటికి ఏతెంచెను. ఆ సమయమున కామరూపము తిరిగి తన యధాశక్తిని సంతరించుకొని ఫల ప్రదాయిని అయ్యెను. కానీ ఆ సమయమునకు దేవ, మానవుల యందు పూర్వము వలె ఈ తీర్ధ లేక క్షేత్రము యొక్క దివ్యత్వము ఎరుకత లేకుండెను. ఆ సమయమున చతుర్ముఖ బ్రహ్మదేవుడు ఈ కుండములు – అపునర్భవకుండము, సోమకుండము, బ్రహ్మకుండము, ఊర్వశీకుండము మరియు ఇదివరలో తెలుపబడిన, తెలుపబడని నదీ సమూహములను గుప్తమొనర్చుటకై ఒక ఉపాయము నాలోచించెను. బుద్ధిమంతుడు, జామదగ్ని పుత్రుడయిన పరశురాముని సహాయము చే బ్రహ్మ, తన పుత్రుని (బ్రహ్మ పుత్ర) మహాముని "శాంతనునికి", ఆయన ధర్మపత్ని "అమోఘ" కు పుత్రరూపమున ఉత్పాదన మొనర్చెను. ఈ పుత్రుడు నదీరూపము ధరించి కామరూపము నందలి సమస్త తీర్ధములను, కుండములను సంపూర్ణముగ జలాచ్ఛాదితము గావించెను. అందువలన ఇపుడు ఈ తీర్ధములు ఎచటనుండునో తెలియకుండెను. కేవలము లౌహిత్యనది (బ్రహ్మపుత్ర) మాత్రమే కానబడును. ఓ! నరశ్రేష్ఠా! కేవలము వశిష్ఠముని శాపము వలననే ఈ తీర్ధముల గుప్తత సంభవించినది. ఎవరు ఈ కుండలముల గూర్చి తెలిసి, వాటి విశేషముల నరసి, ఈ నది యందు స్నానమాచరించెదరో, వారికి ఈ కుండములందలి స్నానఫలము లభించును. ఈ విధముగ సమస్త తీర్ధములను తన జలముల యందు ముంచి, జలమయము గావించి లౌహిత్యనది (బ్రహ్మపుత్ర) దక్షిణము వైపు ప్రవహించి దక్షిణ సాగరము నందు కలియును. మహారాజా! నీకు కామరూప మాహాత్మ్యమును గూర్చి తెలిపితిని. ఇంకనూ నీవు ఏమి తెలిసికొనదలచితినో తెలుపవలసినది."

**(శ్రీ కాళికా పురాణమందలి కామరూప మాహాత్మ్యము, వశిష్ఠ శాపము అను ఎనుబది ఒకటవ అధ్యాయము సమాప్తము)**

# ఎనుబది రెండవ అధ్యాయము

**(లౌహిత్య (బ్రహ్మపుత్ర నది ఉత్పాదనము)**

మార్కండేయ మహర్షి తిరిగి చెప్పదొడంగెను "సగర చక్రవర్తి ఔర్వ మహర్షి పలుకులు విని హర్షోత్ఫులచిత్తుడై తిరిగి ఇట్లు ప్రశ్నించెను. మహర్షీ! లౌహిత్య బ్రహ్మపుత్ర అమోఘా దేవి గర్భము నుండి ఎట్లు ఆవిర్భవించినది? కమలాసనుడు శంతన పత్నిని ఎట్లు సంయోగము కావించెను? చతుర్ముఖ బ్రహ్మ పితామహుడు కదా! ఆయన పర స్త్రీ సంగమము ఎట్లు కావించెను? ద్విజోత్తమా! నాకు అర్హత యున్న ఎడల ఆ సర్వమును నాకు ఎరిగింపవలసినది". అంత ఔర్వుడు "మహారాజా! నీకు సర్వమును ఎరింగించెదను. ఒకానొక మన్వంతరమునందలి హరివర్షము నందు "శాంతనుడు" అను జ్ఞాని, మహానుభావుడయిన ఋషి పుంగవుడుండెడి వాడు. తృణబిందు ముని ఆశ్రమమున హిరణ్యగర్భుడను ముని కుమార్తె అయిన "అమోఘ" ఆయన ధర్మపత్ని. శాంతనుడు అమోఘా సహితుడై ఒకప్పుడు కైలాస పర్వత చరియల యందు, ఒకప్పుడు చంద్రభాగానది ఉత్పత్తి స్థానమయిన లోహిత సరోవర తటమునందు, ఒకప్పుడు గంధమాదన పర్వతమందు నివసించుచుండెడివాడు. ఒకనాడు శాంతనుడు ఫక్వఫలముల కొరకై వనమునకేగెను. ఆ సమయమున పితామహుడు చతుర్ముఖ బ్రహ్మ అచటికేతెంచి, దేవకాంత వలె శోభించుచున్న అమోఘను కాంచి మదన మోహితుడై,

ఇంద్రియ నిగ్రహమును కోల్పోయి ఆమెను అనుభవించుటకు ఆమె వైపు పరుగెత్తెను. తనవంకకు పరుగులిడుచున్న విధాతను దూరము నుంచే వీక్షించి, అమోఘ భయభీతయై, తన ఆశ్రమము లోనికి చొచ్చి, కుటీరము చేరి, తలుపువైచి, క్రోధానిలయై బ్రహ్మతో ఇట్లనియె "నేను ముని పత్నిని. నేను స్వేచ్ఛా పూర్వకముగ ఈ లోకులు గర్హించు కార్యము చేయను. ఒకవేళ నన్ను బలాత్కారముగ అనుభవించ దలచితివేని, నిన్ను శపించెదను." అమోఘ పలుకులు వినిన విరించికి అచటనే రేత: పతనమయ్యెను. తక్షణము విధాత లజ్జితుడై తన వాహనము నెక్కి తన లోకమునకు చనియెను. విరించి వెడలిన పిదప శాంతనుడు తన ఆశ్రమము చేరి అచట గల పక్షి యొక్క పద చిహ్నములు, పృధివిపై బడి అగ్ని వలె తేజరిల్లుచున్న పితామహుని వీర్యమును చూచి, లోనికి ఏతెంచి అమోఘతో ఇట్లనియె "ఓ! శుభగా! ఇచట ఏమి జరిగినది? పక్షి పద చిహ్నములు మరియు ఈ తేజో వీర్యమునకు కారణమేమి?" అంత అమోఘ వ్యాకులచిత్త మరియు క్రోధాన్వితయై ఇట్లు బదులిచ్చెను. "హంస వాహనుడు, కమండలధారి, చతుర్ముఖుడు అయిన ఒక వ్యక్తి నా యందు సంభోగాపేక్ష చే నన్ను చేరెను. అంత నేను పర్ణశాల యందు ప్రవేశించి ఆ అకార్యమునకు ఆతనిని దూషించితిని. అంత ఆ వ్యక్తి వీర్య పాతమగుటచే మరియు నా శాప భయమున ఇచటి నుండి పారిపోయెను. ఓ! మహర్షీ! మీకు సమర్థత యున్న ఎడల దీనికి తప్పక ప్రతీకారమొనర్ప వలసినది. అందువలన పున: ఏ పరపురుషుడు నాయందు అటువంటి వాంఛను పెట్టుకొనడు." శాంతన మహర్షి అమోఘపలుకులు విని, ఆ వచ్చినది తప్పక చతుర్ముఖ బ్రహ్మయే యని నిర్ధారించుకొని. తదుపరి కార్యమునకై ధ్యానమగ్నుడయ్యెను. ఆయన తన ధ్యానమున "దేవతలు కేవలము జగత్ హితార్థము, తీర్థోత్పాదనమునకై కార్యములాచరించెదరు." అని తెలిసికొని, కనులు తెరచి తన భార్యతో ఇట్లనియె "అమోఘా! ఇది సాక్షాత్ చతుర్ముఖ బ్రహ్మ యొక్క దివ్య తేజస్సు (రేతస్సు). దీనిని నా అనుమతితో స్వీకరింపవలసినది. త్రిభువనముల హితార్థము, దేవకార్యము సంపన్నము కావించుటకు చతుర్ముఖుడు ఈ వీర్యమును మన ఇరువురి కొరకు ఇచట వదలి వెడలెను." అంత అమోఘ ఆ పలుకులు విని అత్యంత లజ్జితురాలై, తన పతికి ప్రణామములొనర్చి ఇట్లనియె "స్వామీ! దయచేసి నాయందు క్రోధము వలదు. నేను పరపురుషుల వీర్యధారణ చేయను. ఈ విషయమై మీరు మరియొక మారు అడుగవలదు. కానీ ఈ వీర్యపానము అత్యంత ఆవశ్యకమయిన ఎడల అద్దానిని మీరు సేవించి, దానిని నా యందు గర్భస్తము చేయవలసినది. శాంతనుడు యుక్తియుక్తమయిన తన ధర్మపత్ని పలుకులు విని, అదే సబబు అని తలచి, ఆ వీర్యమును తాను త్రావి, అద్దానిని తన భార్య యందు విడచెను. ఈ క్రియ చే కాలాంతరమున అమోఘ గర్భవతి అయ్యెను.

నెలలు నిండిన పిదప అమోఘ ఒక జలరాశికి జన్మనిచ్చెను. ఆ జలరాశి మధ్యన రత్నమాలాధారి, నీలాంబర వస్త్ర శోభితుడు, రత్నమయ కిరీటకుండలధారి, చతుర్భుజుడు, నాలుగు హస్తములందు పద్మము, పుస్తకము, ధ్వజము, శక్తి ధరించినవాడు, మొసలిపై కూర్చొని యున్న రక్తవర్ణ శోభితుడయిన ఒక మహా పురుషుని ఆ దంపతి కాంచిరి. లోక మంగళకారి అయిన శాంతనుడు ఆ బ్రహ్మ పుత్రుని, జలరాశిని తీసికొని ఉత్తరమున కైలాసము, దక్షిణ పార్శ్వమున గంధమాదనము, పశ్చిమమున ఔరుధి, తూర్పున సంవర్తకాది పర్వతశ్రేణుల మధ్యన ప్రతిష్ఠించెను. ఈ పర్వతముల మధ్య ఈ బ్రహ్మపుత్రుడు శుక్లపక్ష చంద్రుని వలె దినదిన ప్రవర్ధమానుడై సరోవర రూపమును సంతరించుకొనెను. ఒకానొక దినము చతుర్ముఖబ్రహ్మ ఈ కుండము వద్ద కేతెంచి, అద్దాని మధ్యన గల తన పుత్రుని వృద్ధి హేతువునకై సమస్త సంస్కరణలు కావించెను. దాని ఫలితముగ బ్రహ్మపుత్ర మరింత పవిత్రమై దీర్ఘకాలము యుండు శక్తిని సంతరించుకొనినది. క్రమముగ దేవతలు, జలపానము కావించి వెడలువారు. ఒకనాడు జమదగ్ని మహర్షి పుత్రుడయిన పరశురాముడు తన తండ్రి ఆజ్ఞచే మాతృవధయను అకార్యమాచరించి, తత్పాప నివారణార్థము తన తండ్రి ఆజ్ఞచే ఈ సరోవరమున కేతెంచి, స్నానాదులు కావించి, తన పాపమును పరిహారము కావించుకొనెను. తదుపరి లోక హితార్థము

ఈ జలమును తన పరుశువు చే ఉపయుక్త మార్గమొనర్చి భూమిపైకి తీసికొని వచ్చెను.

అంత సగరుడు పరమ మనోహరముగ సాగుచున్న బ్రహ్మపుత్రోత్పాదనమును ఆపి ఇట్లు ప్రశ్నించెను, "మహర్షీ! జమదగ్ని పుత్రుడయిన పరశురాముడు తన తల్లిని ఎందుకు వధించెను? ఆమె ఎవరి కన్యక? ముని పుత్రుడయిన పరశురాముడు అంతటి మహాబలి మరియు క్రూరకర్ముడెట్లయ్యెను? ఆయన తన అనితర యుద్ధ కుశలతచే క్షత్రియులను నిర్మూలించెను. మునిప్రవరా! ఇయ్యది గోపనీయము కాని ఎడల ఆ విషయమును సర్వమును తెలిసికొనగోరుచున్నాను." అంత ఔర్వ మహర్షి "మహారాజా! అయ్యది నీకు తప్పక తెలిపెదను. వినవలసినది. భృగు మహర్షి సాక్షాత్ బ్రహ్మ యొక్క పుత్రుడు. భృగువు కుమారుడు ఋచీకుడు. ఋచీకుడు యుక్త వయస్సు నొందిన పిదప వివాహార్ధము కన్యాకుబ్జము చేరెను. ఆయన అచట జహ్ను మహర్షి వంశమునందుత్పన్నమయిన నృప శ్రేష్ఠుడు, కుశికనందనుడు, "గాధి" మహారాజును కాంచెను. ఆ సమయమున గాధి పుత్ర సంతతికై తపమాచరించుచుండెను. భార్య సహితుడై తపమాచరించుచున్న ఆ మహీపతికి దేవకన్య వలె వెలుగొందుచున్న ఒక కుమార్తెకలదు. అంత ఋచీకుడు ఆ కన్యను తన భార్యగా గ్రహింపదలచి కన్యార్ధమై ఆ మహారాజును ప్రార్ధించెను. అంత గాధి "మహాత్మా! బ్రాహ్మణులకు కన్యాదానము కావించుట నాకు సమ్మతమే! కానీ మా కులాచారము ప్రకారము కన్యాశుల్కమును తీసికొందుము. అందువల్ల మా కులాచారము ననుసరించి తెల్లని వెన్నెల వలె వెలుగొందుచూ నల్లని కర్ణముల గల ఒక వేయి అశ్వములను మాకు ఈయవలసినది. అపుడు నేను తప్పక కన్యాదానము చేయుదును." అంత ఋచీకుడు "మహారాజా! నేను తప్పక అశ్వములను ఇచ్చెదను. నాకు కొంత తడవు వ్యవధి నీయవలసినది," అని పలికి కన్యాకుబ్జము నందలి గంగాతటమున కేగి సవిధి విధానముగ వరుణుని ప్రార్ధించి తనకు కావలిసిన వేయి అశ్వములను ఆయన వద్ద నుండి పొందెను. ఋచీకుడు ప్రార్ధించిన ఈ తీర్ధము ఇప్పటికీ అశ్వతీర్ధమను పేర ప్రసిద్ధి నొందినది. అంత గాధిమహారాజు అశ్వములను గొకొని లక్ష్మీ స్వరూప అయిన తన పుత్రిక సత్యవతిని ఋచీకమహర్షికిచ్చి వివాహము ఒనర్చెను.

ఋచీకుడు సర్వ శుభలక్షణ సంపన్న అయిన సత్యవతిని గొని తన ఆశ్రమమును వెళ్ళి, ఆమెతో విహరించుచూ ఆనంద డోలికల యందు ఊయలలూగుచుండెను. భృగుమహర్షి సహితము తన పుత్రుడు వివాహము చేసికొనెనని తెలిసికొని, కోడలిని చూచుటకేతెంచి, సత్యవతిని గాంచి పరమానంద భరితుడయ్యెను. ఋచీక సత్యవతులు యధాయోగ్యముగ ఆయనను పూజించి చేతులు జోడించి, ఆయన ఎదరుగ నిలబడిరి. అంత భృగు మహర్షి అత్యంత సంతుష్టాంగ తరంగుడై తన కోడలిని ఏదేని వరము ఎంత క్లిష్ఠమయినదయిననూ కోరుకొనమనెను. అంత సత్యవతి వేద పారంగతుడు, తపోనిష్ఠుడు అయిన కొడుకు తనకూ, అమిత విక్రముడయిన పుత్రుడు తన తల్లికి కలుగవలెనని కోరెను. భృగుమహర్షి "వల్లె" యని తపోనిష్ఠుడాయెను. తదుపరి కొంతసేపటికి ఆయన నిశ్వాసము నుండి చరువు (యజ్ఞ ప్రసాదము) నిండిన రెండు పాత్రలు ఉత్పన్నమయ్యెను. అందు ఒకటి శుక్ల వర్ణము, మరియొకటి అరుణవర్ణము కలిగినవి. అంత ఆ మహాతపస్వి తన పుత్రవధువును పిలచి "కళ్యాణీ! నీవు, నీ తల్లి ఋతుస్నాతలయిన పిదప ఈ చరువును భుజించి నీవు ఉదుంబర వృక్షమును, నీ తల్లి అశ్వత్థ వృక్షమును కౌగలించుకొనవలెను. ఈ అరుణ వర్ణపు చరువు నీ తల్లిది సుమా!" ఈ విధముగ పలికి వారిరువురినీ దీవించి తన స్వస్థలికి వెడలెను. అంత సత్యవతీ దేవి ఆ పాత్రల నిడుకొని తన పతి సహితయై, తన మాతా పితరుల వద్ద కేతెంచి ఈ విషయము నెరింగించెను. కానీ దైవ నిర్ణయములు చిత్రము కదా!

ఋతుస్నాత అయిన పిదప భ్రమ కారణమున సత్యవతి అరుణవర్ణపు చరువు నారగించి అశ్వత్థ వృక్షమును, ఆమె జనని శుక్లవర్ణ చరువు నారగించి ఉదుంబర వృక్షమును కౌగలించుకొనెను. కానీ దివ్యజ్ఞానికి తెలియని విషయములుండునా! భృగు మహర్షి తన దివ్య చక్షువుల చే సర్వమును గ్రహించి, అచటికేతెంచి తన కోడలితో ఇట్లనియె

“కళ్యాణీ! నీవు చరువు నారగించుట యందు, మరియు వృక్షాలింగన విషయమున తప్పిదము గావించితివి కావున నీకు క్షత్రియాచారము గల బ్రాహ్మణుడు, నీతల్లికి బ్రాహ్మణాచారములు గల క్షత్రియుడు ఉదయించెదరు.” అది వినిన సత్యవతి భృగుమహర్షిని అనునయ వినయ సంపత్తితో ప్రసన్నుని కావించి, తన పౌత్రుడు క్షత్రియాచారము గల బ్రాహ్మణుడగునట్లు, తన పుత్రుడు మటుకు సదాచారముగల బ్రాహ్మణుడగునట్లును తిరిగి ప్రార్థించెను. భృగుమహర్షి తన కోడలి పరిచర్యలకు, వినయ విధేయతలకు సంతసిల్లి అట్లే యని వరమునిచ్చెను. ఆ కారణముననే తదుపరి కాలమందు సత్యవతి పరమ తేజస్వి అయిన జమదగ్ని మహర్షికి, ఆమె తల్లి తపోనిధి అయిన విశ్వామిత్రునకు జన్మనిచ్చిరి. జమదగ్ని అతి త్వరలో చతుర్వేదముల యందు నిష్ణాతుడయ్యెను. వేదాంగమయిన ధనుర్వేదము అయనకు స్వత:సిద్ధముగ అబ్బినది. ఈ విధముగ ఆయన వేదవిద్య మరియు తపోబలము చే రెండవ సూర్యుని వలె వెలుగొందువాడు. విశ్వామిత్రుడు సహితము అతి శీఘ్రముగ చతుర్వేదములను అభ్యసించి, ధనుర్విద్యా పారంగతుడై చివరకు తన తపోబలము చే బ్రహ్మణ్యుడు, బ్రాహ్మణుడయ్యెను.

**(శ్రీ కాళికా పురాణ మందలి బ్రహ్మపుత్ర నది (లౌహిత్య) ఉత్పాదనము అను ఎనుబది రెండవ అధ్యాయము సమాప్తము)**

# ఎనుబది మూడవ అధ్యాయము

**(పరశురామ ఉపాఖ్యానము)**

ఇట్లు కొంతకాలము గడచిన పిదప మహాతపస్వి అయిన జమదగ్ని మహర్షి సర్వశుభలక్షణ అయిన విదర్భ రాజకన్యక రేణుకను పరిణయమాడెను. రేణుకాదేవి పరమ సాధ్వి. ఆమె తన భర్త వలన నలుగురు లోకప్రియులయిన పుత్రుల బడసెను. వారు వరుసగా “ఋష్ఠవాన్, సుశేణ, వసు, విశ్వావసు” అనువారు. కార్తవీర్య వదార్థము ఇంద్రాది దేవతల ప్రార్థనచే స్వయముగ ఆ ముని దంపతికి మధుసూదనుడే “రాముడు” అనుపేర ఆవిర్భవించెను. ఆయన పృథివీ రక్షణార్థము “పరశువు” సహితుడై పుట్టెను. ఆయన తన సహజ పరశువును ఎన్నడునూ విడనాడలేదు. ఈ రాముడు తన పితామహి (మామ్మగారి) తప్పిదము వలన బ్రాహ్మణుడై జన్మించియు క్షత్రియాచారము కావించి, క్రూరకర్ముడై చరించెను. రాముడు తన తండ్రివద్దనే ధనుర్విద్యా సహితముగ సమస్త వేదవిద్యల యందునూ నిష్ణాతుడయ్యెను.

కాలము ఎప్పుడూ ఒకే విధముగ యుండదు కదా! ఒకానొక దినము రేణుకాదేవి స్నానార్థము నదీ తీరమున కేగెను. అచట పరమ సుందరుడు, శశాంక సమానుడు అయిన చిత్రరధుడను మహారాజు తన అనురూప, యవ్వన, సౌందర్యవతులయిన స్త్రీ జనముతో జలక్రీడలాడుచుండుట కాంచి కామార్తయై ఆ మహారాజుతో సంభోగము నపేక్షించెను. ఆమె కొంత తడవు తనను తాను మరచి, వారందరినీ చూచుచూ కామ భోగాసక్త అయిన కారణమున ఆమె శరీరమంతయు స్వేదము చే తడచెను. అంత ఆ సాధ్వి తెప్పరిల్లి, తన తప్పును గ్రహించి, ఖిన్నవదనయై తన ఆశ్రమమున కేతెంచెను. కానీ మహా తపోనిధి అయిన జమదగ్ని మహర్షి ఆమెను కాంచి, ఆమె మనోవికారమును గ్రహించి, అగ్రహోదగ్రుడై, ఆమెను నిందించి, తన పుత్రులను రావించి ఆమెకు శిరశ్ఛేదము కావింపమని ఆజ్ఞాపించెను. తొలి నలుగురు పుత్రలు ఆయన ఆజ్ఞను విని జడులై, శిలాప్రతిమల వలె నిలచిరి. అంత మహర్షి కోపము వహించి “మీరు నా ఆజ్ఞను ఉల్లంఘించిన కారణమున మీరందరూ జడులై గోవులవలె జీవనము గడుపవలసినది” అని శపించెను. అంత కనిష్ఠుడైన రాముని గాంచి తిరిగి రేణుకా శిరశ్ఛేదము నాజ్ఞాపించెను. తన సోదరుల శాపము చే జ్ఞానరహితులు అగుట గని మహా

తేజస్వి అయిన రాముడు తన పరుశువుచే తన తల్లి యొక్క శిరమును ఖండించెను. అంత జమదగ్ని ప్రసన్నుడై "పుత్రా! నీకు మంగళమగుగాక! నీవు నా ఆజ్ఞను పాలించి, నన్ను అత్యంత ఆనందితుని కావించితివి. నీకు నచ్చిన వరము కొరకొనుము. తప్పక తీర్చెదను" అని పలికెను.

అంత పరశురాముడు "తండ్రీ! తొలుత నా తల్లిని పునర్జీవితురాలిని కావింప వలసినది. అంతేకాక ఆమెకు నా చే శిరశ్ఛేదము జరిగినదన్న విషయము విస్మృతమగుగాక! నా సోదరులందరూ శాప విమోచనమొంది పూర్వము వలె ప్రవర్తిల్లెదరు గాక! నాకు మాతృహత్యాదోషము వల్ల సంక్రమించిన పాపము ప్రక్షాళనమగుగాక! నాకు సమరమందు ఎల్లప్పుడూ విజయము, కల్పాంత పర్యంత దీర్ఘాయువు కలుగు గాక!" ఇవన్నియు విని జమదగ్ని మహర్షి సుచిస్మితుడై సర్వమును అనుగ్రహించెను. తక్షణము రేణుకాదేవి నిద్రనుండి మేలుకొనినటుల లేచెను. ఆమెకు తాను వధింపబడితినన్న ఎరుక లేకుండెను. పరశురాముడు సహితము తక్షణమే చిరంజీవిత్వము మరియు జయశక్తిని పొందెను. మాతృహత్యాపాప నాశార్థము జమదగ్ని మహర్షి "వత్సా! రామా! వరదాన మాత్రమున మాతృహత్యా దోషము తొలగదు. నీవు బ్రహ్మపుత్ర కుండమందు స్నానమాచరింపుము. అచట కేగిన తక్షణము నీ పాపము పటాపంచలగును." తండ్రి ఉపదేశానుసారము పరశురాముడు బ్రహ్మపుత్ర కుండమున కేగి తొలుత తన పరశువును ఆ నీటి యందు శుభ్రమొనర్చి, తదుపరి యథావిధిగా స్నానాదులు కావించెను. తక్షణమే తన శరీరము నుండి వైదొలగిన మాతృహత్యా పాపమును పరశురాముడు కనులార కాంచి, ఆ పరమతీర్థము ఎడల విశ్వాసము కుదిరి తన పరశువు చే ఆ జలములకు మార్గము నేర్పరిచెను. అంత పరమ పవిత్ర బ్రహ్మపుత్ర బ్రహ్మ కుండము నుండి బయలుదేరి కైలాసపర్వత నికటమునున్న లోహిత సరోవరమందు పడెను. తదుపరి పరశురాముడు తన కఠోర పరశు ఘాతముల చే దారి నేర్పరిచి ఆ జలములను తూర్పునకు ప్రవహింపజేసెను. కొంచెము దూరము ప్రవహించిన పిదప ఏతెంచిన "హేమ శృంగ" పర్వతమును పరశురాముడు తన పరశువు చే భేదించి బ్రహ్మపుత్రను కామరూపము వైపుకు ప్రవహింపజేసెను. విరించి స్వయముగ ఈ నదికి "లోహిత" మని పేరిడెను. లోహిత సరస్సు నుండి ఆవిర్భవించిన కారణమున ఈ నది "లౌహిత్య" మని పిలువబడినది. బ్రహ్మపుత్ర నది తన అనంత జలరాశిచే కామరూప పీఠమంతటినీ జలగర్భమొనరించి, అక్కడగల సమస్త తీర్థములను గోపనమొనర్చి దక్షిణ సాగరమువైపు నడచెను. పరమ దివ్య సరిత అయిన యమున సహితము బ్రహ్మపుత్ర సహితముగ ప్రవహించి, అద్దాని నుండి పన్నెండు యోజనములు విడివడి తిరిగి లౌహిత్య నది యందు కలియును.

ఏ మానవుడు జితేంద్రియుడై చైత్రశుక్ల అష్టమి నాడు ఈ లౌహిత్య నది యందు స్నానమాచరించునో ఆతడు బ్రహ్మ పథము నొందును. పవిత్ర చిత్తులై ఏ మానవులు చైత్రమాసమంతయు ఈ బ్రహ్మ పుత్ర నది యందు స్నానమాచరించిన ఎడల వారు తప్పక కైవల్యము నొందెదరు. మహారాజా! 'నీకు పరశురామ వృత్తాంత మంతటినీ వివరించితిని. ఏ మానవుడు నిత్యము ఈ ఉపాఖ్యానమును వినునో, ఆతడు చిరంజీవియై, నిత్య హర్షయుతుడై, మహాబలి అగును."

మార్కండేయుడు ఈ విధముగ పలికి "ఋషులారా! మీకు శంభుడు శరీరము గ్రహించుట, ఔర్వ సగర సంవాదము, భైరవోపాఖ్యానము, భృంగి మహాకాలోత్పత్తి మొదలగు వన్నియు తెలిపితిని. మంత్రమయము, అత్యంత ఫలదాయకము, సమస్త తంత్రముల యందు శ్రేష్ఠము అయిన ఈ మంత్రములను ఎవరు నిత్యము పఠించెదరో, ఆ వ్యక్తి ఉపనిషత్ జ్ఞానయుక్తుడై జగద్రక్ష కావించును.

**(శ్రీ కాళికా పురాణమందలి పరశురామోపాఖ్యానమను ఎనుబది మూడవ అధ్యాయము సమాప్తము)**

# ఎనుబది నాల్గవ అధ్యాయము

**(రాజనీతి)**

ఋషిగణము "మహానుభావా! మార్కండేయ మహర్షీ! నీవు సర్వమునూ తెలిపి మమ్ము సందేహ నివృతుల గావించితివి. గురుదేవా! మీ కథనానుసారము భృంగీ, మహాకాలురు భేతాళ భైరవులుగ మానవ జన్మమంది తిరిగి దేవత్వము సంతరించుకొనిరి. కానీ కైలాసమందు ఇంకనూ భృంగి, మహాకాలురు కలరు కదా! మరి వారెవరు? మాకు తెలియపరుచ వలసినది." మార్కండేయుడు "ఋషులారా! మీ పలుకులు సత్యములే! భృంగీ, మహాకాలురు మానవరూపము నొందిరి. కానీ మహేశుడు అంధకునికి భృంగి స్థానమునిచ్చెను. పూర్వము అంధకాసురుడు శివునితో విరోధించి విపన్నుడాయెను. తదుపరి ఆతడు శివారాధన కావించి ఆయన ప్రేమను తిరిగి పొందెను. అంధకుని పట్ల ప్రేమ కారణమున శివుడు అంధకుని భృంగి గా మార్చెను. బలి పుత్రుడయిన బాణుడు పరమ శివ భక్తుడు. శ్రీ కృష్ణ భగవానుడు ద్వాపరాంతమున ఆతని వేయి బాహువులు ఖండించి కేవలము నాలుగింటిని మిగిల్చెను. కానీ బాణుని అచంచల భక్తి కారణమున మహాదేవుడు ఆతనిని మహాకాలునిగ ఆవిష్కరించెను. అందువలన భృంగి, మహాకాల, భేతాళ, భైరవులను నలుగురు శివగణములుద్భవించిరి.

ఋషులు "మహానుభావా! భార్య, పుత్ర, ఆత్మ, మరియు గురువుపట్ల ఏ రీతిలో వ్యవహరింపవలెను? అంతేకాక రాజనీతి, సాధునీతి, సదాచారముల యొక్క నియమము లేవి?" మార్కండేయుడు "ఋషులారా! సగర చక్రవర్తి ఔర్వుని ఈ విషయమై ప్రశ్నించెను. నేను మీకు ఈ విషయమై వారిరువురి సంవాద విశేషములను వివరించెదను – "ప్రథమత: జ్ఞానవృద్ధులు, తపోవృద్ధులు, వయోవృద్ధులు, అసూయా వర్జితులు, ఉదార చిత్తులు, విప్రులు వీరిని సేవించవలెను. వీరి వద్ద నుండి శృతి, స్మృతి, నిత్యవిధులు విని తెలిసికొని ఆచరింపవలసినది. విజ్ఞులు అట్లే చేయుదురు. శరీరము రథము. పంచేంద్రియములు పంచాశ్వములు. ఆత్మ రథి. జ్ఞానము అశ్వములకు కట్టిన పగ్గములు. మనస్సే సారధి. అశ్వములను వినీతులు కావించి, సారధిని వశమునందుంచి, పగ్గములతో ధృడముగ నిగ్రహించి, రథము (శరీరము) ను నడుపవలెను. రథి క్రమశిక్షణ లేని అశ్వములు పూన్చిన రథమారోహించి, అశ్వములను నిగ్రహింపని ఎడల ఆ రథము కుమార్గమున నడచును. అట్లే సారధి రథిని మన్నింపక తన ఇష్టానుసారము రథమును నడిపిన ఎడల సంగరమందు సులభముగ ఆ రథి శత్రువుల చేజిక్కును. అందువలన రాజు తనకు అత్యంత భోగము లభించినప్పటికీ, ఎల్లప్పుడూ జ్ఞానమనెడి పగ్గముతో మనసును, ఇంద్రియములను వశీభూతమొనర్చుకొని, జ్ఞానపథమున పయనించి తనకు తాను హితము నొనర్చుకొనవలెను."

"మహారాజు తన ఇష్టానిష్టముల ననుసరించి భోగములనుభవించవచ్చు. కానీ వాని యందు లౌల్యము యుండరాదు. ఏవి చూచుటకు యోగ్యమో వానినే చూడవలెను. కానీ వాని యందు ఎంతమాత్రము నిమగ్నతకూడదు. ఏది వినదగినదో దానిని మాత్రమే వినవలెను. శాస్త్ర జ్ఞానము వినా వేరొకటి వినుటకు ధీరులు ఇచ్ఛగించరు. అట్లే ఘ్రాణ, త్వచ (నాలుక) లను కూడా విషయ వాసనల వెంట పరుగులెత్తకుండా తన వశమునందుంచుకొనవలెను. ఈ ప్రకారముగ ప్రవర్తించు రాజు జితేంద్రియుడని పేర్కొనబడును. ఈ జితేంద్రియత్వమునకు కారణము శాస్త్రానుశీలనము మరియు వృద్ధసేవ. ఈ రెండు గుణములు లేని రాజు శీఘ్రముగ శత్రువులకు చేజిక్కును. రాజునకు శాస్త్ర జ్ఞానమున్నప్పటికీ జితేంద్రియుడు కావలెను. ఇపుడు రాజు అభ్యసించ వలసిన గుణములు తెలిపెదను. అవి ధైర్యము, సాహసము, బుద్ధికుశలత, వాక్పటుత్వము, వివేచనాశక్తి, దక్షత, ఓర్పు, దానము, మైత్రి, కృతజ్ఞత, శాశనము నందు ధృడత్వము (శిక్షలు అమలు చేయునపుడు అలసత్వము లేకుండుట), సత్యము, శౌచము, క్షమ, పరేంగితావగాహన (ఎదుటివారి అంతరంగమును సూక్ష్మముగ

గ్రహించుట), చరిత్ర (శీలము), ఆపదలందు ధైర్యము, కష్టములందు ఓర్పు, గురు, దేవత మరియు బ్రాహ్మణ పూజ, ఈర్ష్య, క్రోధములు లేకుండుట; అంతేకాక మహారాజు యోగ్యాయోగ్యములందలి భేదములరసి, ధర్మార్థకామములందు నిరంతర జాగరూకుడై, అవసరమగునపుడు ఆ జాగరూకతను పాటింపవలెను. రాజు సామ దాన భేద దండోపాయములు తెలిసికొని సమయానుకూలముగ వాటిని పాటింపవలెను. అంతేకాక రాజు సామదానములు మరియు భేద దండముల సమీపత్వమును తెలిసి ప్రవర్తిల్లవలెను. సామము నుపయోగించు చోట భేదము మధ్యమమగును. దానము నుపయోగించు చోట దండము అధమము. దండమును ఉపయోగించు చోట దానము దానికంటె అధమము. సామము నుపయోగించు వేళ దండము అధమాధమము.

కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్య, హర్షము, దురభిమానము, ఈ గుణములు రాజును శత్రువు వలె నష్టపరచును. కానీ కొన్ని సమయములందు వీని అవసరము కలదు కూడా!! కానీ ఎట్టి పరిస్థితుల యందు లోభము, గర్వము ఈ రెండింటినీ దూరముగ యుంచవలె!!! రాజుల తేజము అధికార బలము చే తీవ్రముగ యుండును. అందువలన రోగి శరీరమును వదులునట్లు రాజు గర్వమును వదలవలెను. వేట, జూదము, పరస్త్రీ గమనము, మదిరాపానము, దూషిత ధన గ్రహణము, వాక్పారుష్యము, కఠినత్వము ఈ ఏడు దోషములను విసర్జింపవలెను. రాజు పరాయి స్త్రీలను, తనయందు రతిలేని స్త్రీలను నిశ్చయముగ వదలి సచ్చారిత్రము గల తన పత్నుల తోడనే సంభోగానందము ననుభవింపవలెను. పత్నులు రతిసుఖము ప్రసాదించి పుత్రోత్పాదన కావించెదరు. అందువలన ఎట్టి పరిస్థితుల యందు పత్నీపరిత్యాగము కావింపవలదు. అంతేకాక వారియందు అత్యంత ప్రేమానురాగములు కురిపించుచునే అధికాసక్తులు మటుకు కారాదు. వేట మొదలగు ప్రమాదకరమగు కార్యములు ఎల్లప్పుడూ త్యజింపవలెను. అట్లే జూదము సహితము వర్జితము. ఎందుకనగా జూద ప్రభావము చే సత్కర్మా చరణము నందలి ఆసక్తి నశించును. అన్యులు ద్యూత క్రీడనాడునపుడు రాజు వినోదార్థము వీక్షింపవచ్చు. కానీ స్వయముగ ఎప్పుడు పాల్గొనరాదు. జూదము తో సమానమయిన కర్మనాశకము జూదము వినావేరొకటి లేదు. నిరంతర మదిరా పానము చేయదగిన కార్యములు మాన్పించి, చేయదగని కార్యములు చేయించును. రహస్య మంత్రాంగ విషయములను మదాంధులై, వర్థ ప్రేలాపనల ద్వారా బహిర్గత మొనర్చును. అంతేకాక కలహము, సుకృతక్షయము, అర్థక్షయము కావించి శౌచ మంగళములను నాశనమొనర్చును. అందువలన రాజు మదిరాపానము పట్ల ఎల్లప్పుడూ అప్రమత్తుడై ప్రవర్తింపవలెను.

రాజు కళంక చరిత్రుల పట్ల, చోరులు, ఘాతకులు, ఆతతాయిల పట్ల ఎల్లప్పుడూ కఠోరత వహించి దండనీతిని ప్రదర్శింపవలెను. శ్రేష్ఠుడయిన రాజు కఠినత, దండము వీరిపట్ల తప్ప వేరొకచోట ఎట్టి పరిస్థితుల యందు మాటల యందు సహితము ప్రయోగింపరాదు. రాజు ఎల్లప్పుడూ సత్యపరాయణుడై, సత్యమును రక్షించుచూ క్షమ మరియు గంభీరతలను పరిస్థితుల కనుగుణముగ ప్రదర్శింపవలెను. అంతేకాక తన ప్రయాణమును, ఆసన, ఆశ్రయ, ద్వైధ, సంధి, విగ్రహము (యుద్ధము) లను సమయానుకూలముగ కావింపవలెను. ఏ జనపతి తన కోశాగారము, జనపదము, దండనీతి, వృద్ధి క్షయములను ప్రామాణికముగ ఎరుగడో, వాని రాజ్యమందు సుభిక్షత యుండదు. రాజు ప్రత్యేకముగ కోశాగారము (Finance), జనపదము (Governing), దండనీతి (భద్రతాదళము - Police & Military), ఈ మూడింటినీ ప్రత్యేకముగ ఒక్కొక్కరి ఆధీనము నందు కానీ, లేక ముగ్గురు ఆధీనము నందు కానీ యుంచవలెను. ఎప్పుడూ ఈ మూడింటినీ ఒక్కరి ఆధీనము నందు యుంచరాదు!!! మిత్ర, శత్రు, ఉదాసీనులు ఎవరని కూలంకషముగ విచారించి, వారి పట్ల తగురీతిగ వ్యవహరింపవలెను. రాజు ఎల్లప్పుడూ విజయకాంక్ష యందు, ధర్మ కృత్యములందు, అష్టవర్గ సంబంధ కార్యములందు, తన శరీర నిర్వహణ యందు నిరంతరోత్సాహము కలిగి యుండవలెను. మంత్రాంగము (ఆలోచన), యంత్రాంగము (కార్యాచరణ సిబ్బంది), అమాత్యులు, శత్రువులు, రాజ్యము, పుత్రులు, అంత:పుర

వ్యవహారములు యందు బుద్ధి కుశలత ఉపయోగింపవలెను. వ్యవసాయము, దుర్గ నిర్వహణ, వాణిద్యము, సేతుబంధనము, గజవాజి బంధనము, వంటశాలల అధికారము, సైన్య సంఘటితము, లోకుల పరిస్థితి గమనించుట, శూన్య గృహ వ్యవస్థల యందు వివిధ అధికారులను నియమించి, వారిపై గుప్తచరులను సహితము నియమింపవలెను. ఈ గుప్తచరులు ఈ అధికారులు చేయు కార్యాకార్యములను రాజుకు నివేదించెదరు. ఇంతేకాక వేరొక పది స్థానముల యందు గుప్తచరుల అవసరమున్నది అమాత్యులు, అధికారులు, మిత్రులు, కోశము, సైన్య సంపత్తి, సామంతులు, దుర్గము, స్వామి (రాజు) అను ఏడునూ రాజ్యమునకు సప్తాంగములని గురువచనము. ఇందు తనపై, దుర్గము పై తప్ప మిగిలిన వారందరిపై గుప్తచరుల నుంచవలె!! అంత:పురము, తన పుత్రులు, పుష్పమాల్యములు, పాకశాల, శత్రువుల, ఉదాసీనుల బలాబల పరీక్ష, ఈ అయిదింటితో కలిపి మొత్తము పద్ధెనిమిది విషయ వ్యవహారముల యందు గుప్తచరుల నుంచవలెను. ఏ విషయము నందు గోపనీయత అవసరమో, ఆ విషయములందు గుప్తచరులను నియోగించుట కర్తవ్యము.

నియుక్త గుప్తచరులు అన్యధా ఆచరించిన ఎడల, పైన తెలిపిన విధముగ వారిని వెంటనే పదవీచ్యుతుల కావించి దండింపవలెను. రాజు మంత్రుల సహితుడై ప్రదోష కాలమందు ఏకాంతముగ కూర్చొని గుప్తచరులతో సంభాషించి తక్షణమే తగిన చర్యలు తీసికొనవలెను. అంత:పురము, పుత్రులు, పాకశాల, మంత్రులపై నియమించిన గూఢచారులతో రాజు రాత్రియందు ఏకాంతముగ మాత్రమే సంభాషించి నిర్ణయములు తీసికొనవలెను. పై నాలుగు స్థానములు మినహా మిగిలిన స్థానముల యందు నియోగింపబడిన గుప్తచరులతో రాజు మంత్రుల సహితుడై సంభాషించి తగు నిర్ణయములు తీసికొనవలెను. ఎల్లప్పుడూ ఒకే వస్త్రము ధరించువాడు, ఉత్సాహహీనుడు, అందరికీ పరిచయస్తుడు, అతిదీర్ఘము, సన్నని ఆకారము కలవాడు, నిరంతరము వృధాగా సంచరించువాడు, రోగి, బుద్ధిహీనుడు, ధన, వైభవ, పుత్ర, స్త్రీహీనుడు, ఇటువంటి వారిని ఎన్నడూ గుప్తచరులుగ యుంచరాదు. రాజు గుప్తతత్వ నిర్ణయమందు తెలిపిన లక్షణములున్న వ్యక్తులనే గుప్తచరులుగ ఎన్నుకొనవలె! ఒకే ఒక గుప్తచరుడు యుండకూడదు. అనేకమంది యుండవలెను. రాజు ఏఏ క్రియలయందు నియోగించు గుప్తచరులు ఆయా క్రియలయందు నిష్ణాతులై యుండి, అనేక వేషములు వేసి సామాన్య జనులయందు కలిసిపోవుటకు సమర్థులై యుండవలెను. అనేక భాషలు మాట్లాడుట, ఇతరుల మనసు నందలి అభిప్రాయములను వారికి తెలియకుండ సేకరించుట, అలసట లేని శక్తిశాలురు, అత్యంత రాజభక్తి సంపన్నులు అయిన గుప్తచరులను రాజు స్వయముగ నియమింపవలెను. వ్యాపార విషయములందు, దుర్గ సంరక్షణ, ప్రకృతి వైపరీత్యముల ఎడ శక్తిశాలురయిన గుప్తచరులను, అంత:పుర కార్యములందు తన తండ్రివంటి వృద్ధ గుప్తచరులను నియోగింపవలెను. అంత:పుర ద్వారములందు వృద్ధులు, లేక నపుంసకులు, లేదా బుద్ధిమంతులయిన వృద్ధ స్త్రీలను నియోగింపవలెను.

రాజు కొన్ని పనులను ఒంటరిగ చేయరాదు. అవి ఎప్పుడూ ఒంటరిగ భుజించుట, శయనించుట, సంచరించుట, శౌచకర్మ కావించుట చేయరాదు, రాజుకు ఎప్పుడూ ఒక్కరు కంటె ఎక్కువ రాణులు యుండవలెను. రాజు ఒక్క ప్రక్క విశేష పరీక్ష చేయుచునే తన అమాత్య, పుత్ర, పుత్రీ, పత్నుల ఎడ అత్యంత ప్రసన్నత తో వ్యవహరింపవలెను. ధర్మార్ధ కామ మోక్షము లనెడి చతుర్విధ పరీక్షలచే పత్నీ, పుత్ర, అమాత్యులను ఆధారముగ చేసికొని, వారి యందు నిశిత పరీక్ష కావించుచూ ఆ పురుషార్ధములను పొందవలెను. రాజు అర్ధ కామములు విచారణ చే పత్నీ పుత్రులను, ధర్మ విచారణ చే బ్రాహ్మణులను, ధర్మార్ధ కామ విచారణ చే అమాత్యులను పరీక్షింపవలెను. అది ఎట్లనిన యజ్ఞ, దానములు ఇహలోకమందు రాజ్యాధి కారము నిచ్చును. అందువలన వానిని ఆచరింపవలసినదే! రాజధర్మాచరణము, అశ్వమేధాది యజ్ఞములు, రహస్య మంత్రాంగము, గుప్తచర నియోజనము ఎవరు కావింపరో ఆ రాజు పదవీచ్యుతుడై ప్రాణహాని నొందును. ఇందు సందేహము లేదు. ఓ రాజా! నీవు ఈ కార్యములన్నియు ఆచరింపుము. ఈ విధముగ మంత్రాంగము నెరపి, దైవజ్ఞులయిన బ్రాహ్మణులతో గుప్తముగ ఆలోచించి, వాస్తవికతను, ప్రజాలోచనను గ్రహించు ప్రయత్నమును రాజు సమాలోచన

చేయవలెను. ఒకవేళ మంత్రులు రాజ్యాభిలాష చే రాజు కంటె ధర్మాచరణ కావించినచో, రాజు వారి ధర్మాచరణమును విఫలము కావింపవలెను. రాజుకు హాని కలిగించుటకు ఎవరేని అభిచార హోమములు, ఇత్యాదులు కావించిన ఎడల, వారిని శిక్షించుట యందు రాజు ఈ నియంత్రణ పాటింపవలెను. ఈ అభిచారము బ్రాహ్మణుడు  కావించిన ఎడల వానికి దేశ బహిష్కారము, ఇతరులకు ప్రాణదండన కావింపవలెను. ఇది ధర్మ నిష్ఠ లేక ధర్మాచరణ విధి.

ఇక అర్ధ పరీక్ష లేక అర్థాచరణము. రాజు తన మంత్రి మరియు రహస్యాలోచనను తన యందు యంచుకొనగలుగు రాజపుత్రుల సహితుడై యున్నపుడు కోశాధ్యక్షుడు ఏతెంచి "మహాప్రభూ! ఈ విశేష ధనము మీ కొరకై తేబడినది. మీ అనుమతి యున్న ఎడల అద్దానిని మీ ఎడకు తీసికొని వచ్చెదను. మా జీవనములన్నియు దేవరవారి ఆధీనములు. మీ ఇచ్చానుసారము ఈ ధనమును ఉపయోగింపవలసినది," అని పలుకవలెను. అపుడు రాజు పుత్రులతో, అమాత్యులతో సంప్రదించి ఏఏ కార్యములు చేయగలమో, లేక చేయలేమో గ్రహించి, ఆ సందర్భముగ వారి వారి  మనోవాంఛితములను, కార్య దక్షతను కూలంకషముగ విశ్లేషించి నిరంతరము శోధించుచుండవలెను. కోశాగారమును హాని యొనర్చు వానిని ప్రాణదండన కానీ దేశ బహిష్కరణ గానీ చేసి కోశమును రక్షింపవలెను.

ఇక కామ పరీక్ష.  దాసీలను, శిల్పినీ గణములను, బుద్ధిమంతులు, ధైర్య శాలులైన స్త్రీలను అంత:పురము నుండి, ఇతర మంత్రి, సచివుల ఇండ్లనుండి బయటకు లోపలికి వెళ్ళు ఇటువంటి వృత్తుల యందలి స్త్రీలను రాజు తన రాణులను, ఇతర అంత:పుర స్త్రీలకు తెలియకుండ ఒంటరిగ కలుసుకొని వారి ద్వారా అంత:పుర మరియు ఇతర ప్రముఖుల గృహాంతరంగిక వ్యవహారములను తెలియవలెను. సుందర స్త్రీలను మంత్రి, సచివుల వద్దకు పంపి రాణులు మరియు ఇతర అంత:పుర స్త్రీలు వారియందు అనురక్తులై యున్నారని, ఒకవేళ ఈ మగవారికి వారితో సంబంధము ఇష్టము కలదేని తాము మధ్యవర్తుల వలె వ్యవహరింపగలమని పలికి వారి అంతరంగమును కనుగొనవలెను. అట్లే రాణివాసము నందుకూడ అంత:పుర స్త్రీలవద్ద కేగి, వారికి ఇతర రాజపురుషుల గూర్చి తెలిపి, వారి అంత:కరణము గూర్చి కూడా నిశితముగ పరీక్షించి తెలిసికొనవలెను. ఇట్లు రాజు ఈ కామనిష్ఠచే మంత్రి, సచివ, పత్నీ, పుత్రి, పౌత్రి, కోడలు, పుత్ర పౌత్రులు, ఇతర స్త్రీ పురుష సంబందీకుల గూర్చి కూడా నిశితముగ పరీక్షించి, కూపీతీసి, సర్వులగూర్చి, వారి అంతరంగము గూర్చి తెలిసికొనవలెను. వీరందరిలో ఏ ఒక్కరు తప్పు చేసిననూ, ఆ దోషులను విచారణ లేకుండ వధింపవలెను. ఒకవేళ ఈ దోషులందు  స్త్రీలు యున్న ఎడల వారికి దండన, బ్రాహ్మణులకు దేశభహిష్కరణ విధింపవలెను.

ఇక మోక్ష నిష్ఠ లేక మోక్ష పరీక్ష – ఒకవేళ దండార్హుడు అయిన వ్యక్తి సంపూర్ణ అహింసాయుక్తుడై, చాడీలు చెప్పుట మొదలగు దోషవర్జితుడై కేవలము మోక్షమార్గమందున్న ఎడల, అంతేకాక ఎవరు కేవలము క్షమయే తను ధ్యేయమయిన వారు ఏదేని దోషము కావించిన ఎడల రాజు వారిని త్యజింపవలెను. దండింపదగిన వారు మోక్షమార్గమున యున్న ఎడల వారు దండార్హులు కారు. ఎందుకనగా వారు సర్వము నందు బ్రహ్మము నే కాంచుచూ, సర్వత్రా సమబుద్ధి కలిగియుందురు. అటువంటి వారిని త్యజించుటే వారికి దండన.

ఈ విధముగ ధర్మార్థకామమోక్ష నిష్ఠ లేక నిజాయితీ పరీక్ష జరుపవలెను. ఇటువంటి సూత్రములెన్నియో శుక్రాచార్యుని చే సూచింపండినది. వీనిని నీతిశాస్త్ర గ్రంథముల నుండి గ్రహింపవలెను. రాజు శత్రువులతో కేవలము యుద్ధము జరుపరాదు. భూమి, మిత్రులు, ధనము మొదలగువాని లాభనష్టముల బేరీజు వేసిన అనంతరమే సమాలోచనము చేయవలెను. ఉత్తమ మహీపతులు తమ రాజ్యము యొక్క సప్తాంగములు (స్వామి (రాజు), సచివ, రాష్ట్ర, మిత్ర, కోశ, బల, దుర్గ) విస్తరించుకొనుచూ, నిరంతరము కోశమును సమృద్ధము చేసి కొందురు. రాజు ఎల్లప్పుడూ విద్యావిశారదుడు, వినీతుడు, విశేష నీతిజ్ఞుడు, సత్కులీనుడు, ధర్మార్ధ సంబంధ కార్యములందు కుశలుడు, అయి సరళ ప్రవృత్తి గల బ్రాహ్మణులను మంత్రులుగ వరింపవలెను. రాజు తాను సహితము సమాన జ్ఞానము కలిగి ఒక్కొక్కరితో విడివిడిగా

అవసరము ననుసరించి మంత్రాంగము నడుపవలెను. అనేకులతో ఒకేమారు మంత్రాంగము కూడదు. ఒక్కొక్కరితో కానీ, కొందరితోకానీ, అందరితో కానీ మంత్రాంగము నడుపునపుడు సురక్షితమయిన అంతరంగిక మంత్రణా గృహమునందే మంత్రాంగము నడుపవలెను కానీ వనమందు, ఆరుబయట, మధ్యరాత్రమున మంత్రాంగము నడుపరాదు. ఎట్టి పరిస్థితుల యందు పిల్లలు, కోతులు, షండులు, చిలుకలు, మైనా పిట్టలు (ఇవి తిరిగి వల్లించును), వికృతాకారులైన మనుష్యులు ఈ మంత్రాంగణా గృహపు దరిదాపులయందుండరాదు. రాజుల రహస్యములు బట్టబయలైనచో దాని వలన కలుగు పరిణామములను పరిష్కరించుటకు ఎంతమంది రాజన్యులు సరిపోరు. రాజు దండనీయులను దండింపవలెను. అదండనీయులను దండింపరాదు. ఒకవేళ ఏదేని రాజు దండనీయునికి దండము విధింపకున్ననూ, అదండనీయునికి దండము విధించిననూ, ఆతడు రాజయినప్పటికీ పాపము మూటగట్టుకొనును.

ఇపుడు దుర్గము గూర్చి తెలిపెదను. రాజు ఎల్లప్పుడూ శత్రువులు ఆక్రమింపలేని, అలంకరింపబడిన తోరణ సహిత హర్మ్యములు గల దుర్గము (కోట) యందు నిరంతరము నివసింపవలెను. దుర్గము లోపలి నుండి ఒక్క ధనుర్ధారి వెలుపలి వందమంది యోధులతోనూ, లోపలి వందమంది యోధులు వెలుపలి పదివేల మంది యోధులతోనూ సమరము చేయగలరు. అందువలననే దుర్గము విశేషమహత్త్వము కలదిగా తెలుపబడినది. దుర్గములు జలదుర్గములు, భూమి, వృక్ష, అరణ్య, మరుస్థల (ఎడారి), పర్వతస్థ దుర్గములని ఆరు రకములు. ప్రతిదుర్గము చుట్టూ కందకములు యుండవలెను. ఏ ఇతర ప్రకారములుగ యుండరాదు. మృదంగాకార దుర్గము నిరంతర కులనాశము కావించును. రాక్షసరాజు రావణుడు నాశనమగుటకు ఇదియొక కారణము. రాక్షసరాజు బలిచక్రవర్తి దుర్గము సాక్షాత్ అగ్నిదుర్గము. కానీ అయ్యది పక్షిరెక్కల ఆకారము కలిగినది. అందువలన అయ్యది శ్రీభ్రష్టమై, తోడేళ్ళచే ధ్వంసమొనర్చబడినది. శాల్వుని సౌభాగ్య నగరము స్వర్గమున యుండెడిది, మరియు స్వర్గతుల్యమయినది. అయ్యది పంచకోణాత్మకమగుటచే అదియును ధ్వంసము కావింపబడినది. ఇక్ష్వాకు వంశస్థుల రాజధాని అయిన అయోధ్య ధనుషాకారమున యుండెడిది. అందువలన ఆ పురి తన నరేశులందరికీ విజయమును సంప్రాప్తింపజేసినది. దుర్గము నందు దుర్గాదేవిని, ద్వారములందు దిక్పాలురను రాజు ఎల్లప్పుడూ పూజింపవలెను. అందువలన రాజు సర్వదా తన విజయము, సంపద, సమృద్ధ్యార్థము దుర్గ నిర్మాణము కావింపవలెను.

రాజు ఎన్నడూ భూసురులను అవమానించరాదు. అట్లు అవమానించిన ఎడల ఇహపర లోకముల రెండింటి యందునూ దు:ఖ భాజనుడగును. రాజు వారి పట్ల ద్వేషము బూని ఎన్నడూ వారి సొమ్ము నపహరింపరాదు. ఈ విధముగ బుద్ధిమంతుడు, తత్త్వజ్ఞుడు, ప్రమాదరహితుడు, గుణవంతుడై, చారులచే సర్వమును వీక్షించుచూ సర్వమును సంరక్షించు మహారాజు ఇహ పరముల రెండింటి యందును పరమసిద్ధి నొందును. రాజు తాను ఏ గుణముల చే విఖ్యాతుడయ్యెనో, ఆ గుణములు తన పుత్రులకు సహితము నేర్పవలెను. రాజు యొక్క విశృంకలత, స్వతంత్ర ప్రవర్తన దోష భూయిష్ఠముగ పరిణమించును. తన దోషములను నివారించుకొనుటకు రాజు తన భోజన, శయన, యాత్రాది పరివారములందు కొంతమంది క్రమశిక్షణ గల వృద్ధులను నియమించుకొని, తద్వారా తనను తాను నియంత్రించుకొనవలెను. రాజు పరస్త్రీల కామచేష్టల నుండి నిరంతరము తనను తాను వేరుపరచుకొని రక్షించుకొనవలెను. తన అధికారము చే పరస్త్రీలు స్వతంత్రముగ, నిరంకుశముగ ప్రవర్తిల్లనటుల చేయవలెను. ఈ విశృంఖలత్వము గల స్త్రీలు ఎల్లప్పుడూ హాని కారకులే!! అందువలన రాజకుమారులను, రాజకుమార్తెలను కూడా ఇదివరలో తెలిపిన కామ పరీక్ష ద్వారా వారి మనోగతముల తెలిసికొని, వారిని చెడు మార్గములందు పడకుండ అవరోధములు కల్పించి, ఉపయోగ కార్యములందు నియోగింపవలెను. అటువంటి స్వతంత్రాయుత లేక విశృంఖలత్వము గల స్త్రీలకు అంత:పురము నందు ప్రవేశము లేకుండ చేయవలెను.

మహారాజా! నేను శుక్ర, బృహస్పతుల రాజనీతి శాస్త్రము ద్వారా రాజు యొక్క నీతి, రాజపుత్ర, పుత్రికల ఆచార వ్యవహారములన్నింటినీ విశదీకరించితిని. ఈ విధముగ ఏ పృధివీపతి వ్యవహరించునో ఆతడు సర్వ సౌఖ్యముల నొందును.

**(శ్రీ కాళికా పురాణమందలి రాజనీతి యను ఎనుబది నాల్గవ అధ్యాయము సమాప్తము)**

# ఎనుబది ఐదవ అధ్యాయము

**(విశిష్ఠ సదాచార వర్ణనము; నీరాజన (ఆరతి లేక యుద్ధ పూర్వ శస్త్ర పరిశుద్ధక్రియ విధి)**

ఔర్వమహర్షి "మహారాజా! ఇపుడు రాజులు పాటింపవలసిన సదాచార వర్ణనము కావింతును. వినుము. సాధుపురుషులు లేక సజ్జనులు దోషముక్తులు. వారి బోధ "సత్" శబ్దము తో మొదలగును. వారు ఆచరించు విధులే సదాచారమని తెలుపబడును. గృహస్తులకు పురాణ, ఆగమ, సంహితల యందు ఏవి సదాచారములని తెలుపబడినవో, రాజులు సహితము వానినే పూర్ణముగ ఆచరింపవలెను. వేదపాఠము ద్వారా ఋషులను, హోమము ద్వారా దేవతలను, శ్రాద్ధ కర్మల ద్వారా పితఋలను, భోజనము ద్వారా ప్రాణికోట్లను తృప్తి నొనర్చవలెను. స్నాన, దంతధావన, మలోత్సర్గాది సామాన్య క్రియలన్నియు గృహస్తుల వలె ఆచరింపవలెను. రాజు చాతుర్వర్ణీయులను వారివారి కర్మములందు నియోగింపబడునట్లు చేయవలెను. ఎవరేని తన స్వకర్మ విడచి పరధర్మమును ఆచరించిన ఎడల, రాజు వానికి వంద ముద్రలు దండన విధించి, తిరిగి ఆతని స్వకర్మ యందు నియుక్తుని కావింపవలెను. ప్రతి సంవత్సరము ఏతెంచు విశిష్ఠ పూజలు తప్పక చేయవలెను. అవి – రాజు బలవృద్ధి హేతువుకై శరదృతువు మహాష్టమి నాడు దుర్గాదేవికి విశేషపూజన మొనర్చి, దశమి నాడు ఆమెకు నీరాజన మీయవలెను. పుష్యమాస తృతీయనాడు దేవికి పుష్పాభిషేకము గావించి, పంచమి నాడు శ్రీదేవి ని పూజించి, ధన ధాన్య వృద్ధి కొరకై శ్రీయజ్ఞ మాచరింపవలెను. జేష్ఠ మాస గంగాదశహరమందు విష్ణుయజ్ఞ మొనర్పవలెను. సూర్యుడు సింహరాశి యందు స్థితిగతుడై యున్న ద్వాదశి నాడు ఇంద్రుని పూజింపవలెను. ఇవియే కాక రాజు వ్యయాధికత యున్న ఇతర యజ్ఞములు సహితము కావింపవలెను. ఈ యజ్ఞముల చే రాజ్యము, సేన మరియు కోశాగారము వృద్ధి యగును. ఈ యజ్ఞములు చేయకున్న అనేక దుర్భిక్షములు, ఆదివ్యాధులు, మహామారిలు పొడసూపును.

శరదృతువు నందలి మహాష్టమి నాడు దేవీపూజ పూర్వోక్త విధి విధానముగ కావించి దశమి నాడు నీరాజన మొనర్పవలెను. దశమినాటి నీరాజన విధిని గూర్చి తెలిపెదను. వినుము. దీనిని కావించుట చే రాజులకు గజాశ్వములు వృద్ధి నొందును. ఆశ్వయుజ మాస శుక్లపక్షమున స్వాతి నక్షత్రము తృతీయా తిధి యందు యుండగా నీ నగరపు ఈశాన్యమున నీరాజనము కొరకు ఒక ఉత్తమ స్థలిని ఎన్నుకొనవలెను. తృతీయ నుండి ఎనిమిది దినముల అనంతరము అనగా దశమి నాడు ప్రాత:కాలమున నీరాజనమీయవలెను. ఒక గొప్ప బలము, సుందరత కల అశ్వమును గంధ పుష్ప వస్త్రాదుల చే తృతీయ (తదియ) నుండి పూజించుట ప్రారంభించి, దశమి నాడు ఆ అశ్వమును మండపమునకు కొనిరావలెను. ఆ సమయమున ఆ అశ్వపు చేష్ఠలచే శుభాశుభ ఫలితములను తెలియవచ్చు. ఆ సమయమున అశ్వము పారిపోయిన ఎడల శత్రురాజ్యము నుండి పరాభవము నెదుర్కొనవచ్చును. అయ్యది కన్నుల నీరు కార్చిన రాజకుమారుడు మరణించును. అశ్వము మండపము నందు ప్రవేశించుటకు నిరాకరించిన ఎడల మహారాణి కన్నుమూయును. అశ్వము ముఖము లేక ముక్కు రంధ్రముల నుండి ధ్వని వెలువడిన ఎడల కూడా అదియే ఫలితము!! మండపము చేరిన పిదప అశ్వము ఎటువైపు ముఖము నెత్తునో, రాజు ఆ దిశ యందు శత్రువులపై విజయము నొందును. అశ్వము ముందు

కుడికాలు పైకెత్తి ముందుకు సాగిన ఎడల రాజు సమస్త శత్రువులపై విజయము సాధించును. దశమి నాటి ప్రాత:కాలమున నీరాజన మర్పించుటకు కుదరని ఎడల ఆశ్వయుజ శుక్ల ద్వాదశి నాడు కానీ, కార్తీక పూర్ణిమ యందు కానీ నీరాజన మర్పింపవలెను.

రాజు తన నగరమునకు ఈశాన్య కోణమున తన చేతి పొడవున పదహారు అడుగుల ఎత్తు, పది అడుగుల వెడల్పున ఒక తోరణము నిర్మింపవలెను. దాని వెనుక ముప్పది రెండు అగుడుల పొడవు, పదహారు అడుగుల వెడల్పు గల ఒక మహామండప నిర్మాణము కావించి, దాని మధ్య యజ్ఞవేదిని నెలకొల్పవలెను. యజ్ఞవేది ఉత్తరమున శ్రేష్ఠమయిన అశ్వవేదిని సహితము నిర్మించి, అశ్వమును అచట స్థాపించి, పురోహితుని చే అద్దానికి పూజనమొనర్పవలెను. తోరణమును సాల, ఉదుంబర, లేక అర్జున వృక్ష శాఖలచే నిర్మించి, దానిని మత్స్య, శంఖ, చక్రాంకిత ధ్వజములు, స్వర్ణ రత్నములు, మరియు అనేక విధముల ఫలములచే అలంకరింపవలెను. యజ్ఞము యొక్క సఫలత మరియు అశ్వపుష్టి కొరకు అశ్వపు మెడకు జీడి (తుమ్మెద మామిడి Marketing nut), ఆవాలు కట్టవలెను. అంత పురోహితుడు వైష్ణవ మండలమును నిర్మించి నెయ్యి, తిలలు, పుష్పముల మిశ్రమము కావించి మంత్రోచ్ఛారణ చే దిక్పాలురను, నవగ్రహములను, విశ్వేదేవులను, విష్ణువును పూజింపవలెను. సూర్య, వరుణ, ప్రజాపతి, ఇంద్ర మరియు విష్ణువులకు ఒక సప్తాహము హోమము ఆచరింపవలెను. ధర్మార్థ కామమోక్ష పురుషార్థ సిద్ధ్యర్థం ఒక వేయి లేక నూట ఎనిమిది సార్లు పలాస, అత్తి, రావి, ఖదిరముల సమిధలచే పురోహితుని పురమాయించి హోమము చేయింపవలెను. మామిడిపండ్లను ఒక వస్త్రము నందు చుట్టి తోచిన బంగారు, వెండి, లేక మట్టితో ఎనిమిది కలశముల స్థాపించి అందు ఈ ఓషధులను – "అర్జున, పసుపు, శ్వేత, హరితల్, చందనము, కుష్ఠ, మైనాశిల, అంజన, నేలజీడి (కనకపాట), పూర్ణకేశ, గరిటికమ్మ, శతావరీ, వస (హైమవతీ), నాగకుసుమ, సోమరాజి, సుగుప్తిక, తుధ్య, కరవీర, తులసీదళ" మొదలగు వన్నింటినీ సర్వౌషధముల రూపములో ఆ కలశములందుంచవలెను. రాజు పరమ శాంతి కాముకుడై నీరాజన విధి యందు స్రుక్, స్రువముల పట్టి, సప్తాహ దీక్షతో యజ్ఞము దేవతా పూజార్థము కావింపవలెను. నీరాజన విధి పూర్ణమగువరకు రాజు రాత్రివేళయందు కేవలము గృహమునందే యుండవలెను. అంతేకాక గజాశ్వములను అధిరోహింపక వేరొక వాహనమును యానమునకుపయోగింప వలెను. మద్యము, పాయసము, హల్వా, లడ్డూ, వివిధ అన్న వ్యంజనములు, మరియు అనేక పదార్థములను దేవతలకు నివేదనమొనర్పవలెను.

ఏడవరోజు తోరణమందు ద్విభుజ మహాబాహువు, ఉజ్వల కవచధారి, శ్వేతవస్త్రధారి, వస్త్రము చే కేశబంధనము చేసినవాని, కుడిచేతి యందు ఖడ్గము, ఎడమచేతి యందు కొరడా కలిగి ఎడమవైపు తెల్లని గుర్రము కల రేవంతదేవుని ప్రతిమను గానీ, లేక కలశమందు స్థాపించి గానీ, సూర్య భగవానుని పూజావిధి ననుసరించి పూజింపవలెను. రేవంత పూజానంతరము అశ్వపాల, గజపాలురు గజాశ్వములను పూర్వపు వేదిపై విడివిడిగా వాని స్థానములందు నియమించవలెను. అంత పురోహితులు సుగంధాన్న పిండమును శాంతి మంత్రము పఠించుచూ ఈ గజాశ్వములకెదురు వచ్చెదరు. మహారాజు హోమకుండమునకు ఉత్తరమున వేదజ్ఞులు, అశ్వవిదులయిన బ్రాహ్మణ పండితులతో వ్యాఘ్రచర్మమందు ఆశీనుడై గజాశ్వపు చేష్టలను తిలకింపవలెను. ఆ మృగములందలి పూర్వము తెలిపిన లక్షణములను బట్టి భవిష్య నిర్ణయము చేయవలెను. ఈ సుగంధాన్నపిండమును ఆశ్వము తినిననూ, ఆఘ్రాణించిననూ సర్వకర్మసిద్ధి కలుగును. లేకున్న వ్యతిరేక ఫలములు కలుగును. అనంతరము పురోహితుడు ఘటజలము చే ఉదుంబర, మామిడి లేక వకుళ శాఖలను తడిపి ఆ జలము చే అశ్వ, గజ, రాజ, సైనిక, రథముల ప్రోక్షణ గావించి, పుష్టి యొనర్చి, ఇతర విప్రులతో కలసి శాంతి మంత్ర పాఠము చదువుచూ మిగిలిన జలముతో అశ్వమును తడుపును. దిక్పాల, ప్రమధులను వైష్ణవ మంత్రముల చే అనేకమార్లు ప్రోక్షణ కావించి స్వర్ణ దర్పణము చూపించి, ఆ తదుపరి మంత్రి, రాజపుత్ర, అమాత్య సైనిక గణములకు సహితము

దర్పణమును కంపించుచూ చూపింపవలెను.

మట్టితో శత్రురాజు యొక్క ప్రతిమను కావించి ఆతని వక్షమును ఆభిచార మంత్రములచే శూలమునుపయోగించి భేదింపవలెను. అదే సమయమున శత్రుప్రతిమ యొక్క కంఠమును ఖడ్గము చే ఖండింపవలెను. ఇంద్ర ఆదిత్యుల ద్వారా తెలుపబడిన భయానక అభిచార మంత్రముల ద్వారా అశ్వపు కళ్ళెములను బిగించి, ఆ మంత్రములు చదువుచుండగా రాజు ఆ అశ్వారోహణము గావించి ఉత్తర లేక తూర్పు దిశగా సమస్త సైన్య సమేతుడై వెళ్ళవలెను. ఋత్విక్కులు, పురోహితులు, ఆచార్యులు మొదలగువారందరూ అశ్వము వెనుక సావధానులై అశ్వమును పరికించుచూ శుభాశుభములు లెక్కవేయుటకు వెళ్ళవలెను. నానా వాద్యఘోషతో దిశలు నిండుచుండగా ఛత్రము వైచి రాజు మరియు అశ్వములను ధూపము నుండి రక్షింపవలెను. ఆ సమయమున ఉత్తర ద్వారమున బయటకు వెడలుచున్న రాజు బృందము చే భూమి కంపించును. ఈ విధముగ వారందరూ ఒక క్రోసు దూరము వెడలి తిరిగి వెనుకకు వచ్చి తూర్పుద్వారము ద్వారా నగర ప్రవేశమొనర్ప వలెను. తిరిగి రాజు యజ్ఞభూమి యందు ప్రవేశించి, పురోహితాది విప్రగణమునకు స్వర్ణ, గోగణ, తిలాది దక్షిణ నీయవలెను. ఈ విధముగ సైన్య నీరాజనమొనర్చి మహారాజు అచట లక్ష్మీలాభము నొందును.

ఇచట పురోహితుల చే గానము చేయబడిన మంత్రముల మంత్రార్థము. “ఓ! అమృతము నుండి ఉత్పన్నమయిన అశ్వమా! వాస్తవమునకు నీవు ఇంద్రుని వహించెదవు. ఆ సత్యకారణమున ఇపుడు నన్ను వహింపుము. ఏ సత్యము చే సూర్యుని, ఆయన పుత్రుడయిన రేవంతుని వహించెదవో, అదే సత్యము తో విజయాభిలాషినయిన నన్ను వహింపుము.” ఈ మంత్రముల చే మంత్రింపబడి అశ్వారూఢుడై రాజు రాజాంత:పురము చేరును. అచట రాణి రాజును పల్లకీనధిరోహింపజేసి, ఇతరస్త్రీలతో కలసి ఆయనను పూజించును. తృతీయాతిథి అనంతరము ఒకవేళ రాజుకు జనన మరణ శౌచ మొచ్చినప్పటికీ నీరాజనము శంక లేకుండ చేయవచ్చును. ఆ కాలమందు ఆయనకు ఆశౌచముండదు. ఇయ్యది నీరాజన విధి.

**(శ్రీ కాళికా పురాణమందలి నీరాజనమను ఎనుబది అయిదవ అధ్యాయము సమాప్తము)**

# ఎనభై ఆరవ అధ్యాయము

**(పుష్యస్నాన విధి)**

ఔర్వ మహర్షి “మహారాజా! నీకు పుష్యస్నాన విధిని గూర్చి తెలిపెదను. దీనిని తెలిసికొనినంత మాత్రమున విఘ్నములు నాశనమగును. పుష్యమాసమందు చంద్రుడు పుష్యా నక్షత్రాదిష్ఠుడయినప్పుడు మహారాజు కళ్యాణప్రదము, దుర్భిక్షాది నాశకము అయిన పుష్యస్నానాచరణ కావింపవలెను. “విష్టి, దుష్టకరణ, వ్యతిపాత, వైధృతి, వజ్రశూల, లేక హర్షణ యోగములందు పుష్య నక్షత్రయుతమయిన, తృతీయాతిథి కలిసిన మంగళ, శని లేక ఆదివారము నాటి పుష్య స్నానము సర్వదోష నాశకమగును. ఒకవేళ రాజ్యమందు గ్రహదోష కారణమున అతివృష్టి, అనావృష్టి వంటి ఆరు రకముల దుర్భిక్షములు యున్న ఎడల, రాజు పుష్యమాసముననే కాక, ఇతరమాసములందు పుష్యమీ నక్షత్రము ప్రవేశించినపుడు ఈ మంగళ స్నానము ఆచరింపవచ్చు. పితామహుడయిన బ్రహ్మ, ఇంద్రుడు మరియు దేవగణ శాంతి కొరకై ఈ విధి విధానమును బృహస్పతికి ఉపదేశించెను. ఈ పవిత్ర కార్యమునకు ఒక పవిత్ర స్థలమును ఎంచుకొనవలెను. ఈ స్థలము జంతువుల గిట్టలచే ఎగుడు దిగుడు కానిది, కేశములు, ఎముకలు, పుట్టలు, కీటకములు, క్రిములు, కంటకములు, అశుద్ధము శ్లేష్మము మొదలగు అపవిత్ర వస్తువులు, మరియు కాకి, గుడ్లగూబ, కుక్క, కొంగ, కాకోల,

గ్రద్ద, బకము మొదలగు పక్షులు, పక్షిఈకలు లేనిది, దుష్ట జంతువులు తిరుగాడనిది, హంస, కారండవాది శాంత జలపక్షులకు స్థానమయిన సరోవర తటమందు రాజు పుష్య స్నానము కావింపవలెను. రాజు పురోహిత, నానా వాద్య సహితుడై ప్రాత:కాలమున తూర్పుదిశగా పూర్వమే శుద్ధి చేయబడిన పైన తెలిపిన స్థలమున కేగవలెను.

ఆ ప్రదేశమందు పురోహితులు ఉత్తరదిశగా కూర్చొని సుగంధ చందన, కర్పూరాది ద్రవ్యములు కలుపబడిన జలములు, గోరోచనము, ఆవాలు మొదలగు ద్రవ్యములతో, "గంధద్వారా దురాదర్శా" ఇత్యాది మంత్రములతో ఆ స్థానమంతటినీ పవిత్రము కావించి దేవతా పూజనము మొదలు పెట్టవలెను. రాజు సహితము పురోహితులతో పాటు గణేశ, కేశవ, బ్రహ్మ, పార్వతీ, పశుపతుల మరియు అన్య దేవతల, దేవగణముల, మాతృకామండలి యందు ప్రతి ఒక్కరి పూజ చేయవలెను. తదుపరి మంగళాచరణము కావించి దేవతలకు పాయసము, ఫలములు, మృష్టాన్నములు, హల్వా, మోదకములు సమర్పింపవలెను. అక్షతలు, దూర్వాంకురములు ఆవాలు మొదలగువానిచే ఆ స్థలమును శుద్ధియొనర్చి "ఉత్తిష్ఠంతు భూత పిశాచా" అను మంత్రములతో శుద్ధి ప్రక్రియ కావింపవలెను. మంత్రార్థము – "ఈ పృథివీ పాలనమొనర్చుచున్న భూత గణములు దూరమగుగాక! మీతో మాకు విరోధము లేదు. మేము ఈ అవిరోధస్థితి యందు ఈ పుణ్య స్నానకర్మ కావించెదము." తదుపరి మహారాజు రెండు చేతులు జోడించి, దేవతలనావాహన కావించి "దిక్పాల, దేవతలు నా పూజా గ్రహణార్థము ఏతెంచి, వారివారి భాగములు గ్రహించెదరు గాక!" తదుపరి పురోహితులు పుష్పాంజలి సమర్పించి "దేవతలు ఈ స్థానమందు స్థితులై మరునాడు రాజుకు వరము లిచ్చెదరు" అని మంగళాశాశనము కావించెదరు. ఈ విధముగ స్థవము పఠించి, ఆ స్థలమునకు అన్ని రకములుగ రక్షచేసి, రాజు, మరియు పురోహితాదులు ఆ రాత్రి అచటనే నిద్రించి స్వప్నము నందు శుభాశుభముల నెరింగెదరు. మరునాడు పుణ్య స్నానోపరాంతము రాత్రి దు:స్వప్నము కాంచిన ఎడల హోమము గావించి, వంద గోవులను దానమొసంగవలెను.

స్వప్న ఫలితములు – స్వప్నమందు గోవులు, ఏనుగులు, భవనారోహణము కనిపించిన అయ్యది మంగళకరమై రాజ్య సంపద వృద్ధికి కారణమగును. పెరుగు, దేవతలు, స్వర్ణము, బ్రాహ్మణులు, వీణ, దూర్వాంకురములు, అక్షతలు, పుష్పఫలములు, ఛత్రము, చంద్రుడు, శంఖము, మిత్రులు కనిపించిన ఎడల తమ లాభము, శత్రుక్షయము కలుగును. గ్రహణ దర్శనము, సంకెలలచే బంధింపబడుట, మాంస భోజనము, పర్వత భ్రమణము, నాభి నుండి వృక్షోత్పత్తి, మృతుల గూర్చి రోదించుట, అగమ్యాగమనము, నూయి లేక బురద నుండి బయల్వెడలుట, నదీ పర్వతములందు పయనించుట, శత్రువులను వధించుట, స్వపుత్రమరణము, మధ్య రుధిరములచే స్నానము, పాయస భోజనము, మనుష్యుని పై అధిరోహించుట మొదలగునవి రాజునకు కళ్యాణ కరములు. ఇవన్నియు సుఖ ప్రదములు మరియు విపత్తి నాశకములు. స్వప్నమందు గాడిద, ఒంటె, మహిషము, మొదలగు మృగారోహణ రాజ్య నాశకములు. నృత్య, గీత, హాస్య అశుభ విషయములు పఠించుట అశుభప్రదము. రక్తవస్త్రము, ఎర్రని మాల ధరించుట, ఎర్రని లేక నల్లని స్త్రీని కామించుట లేక దర్శించుట మృత్యుప్రదము. నూతిలోనికి పడుట, దక్షిణమున కేగుట, బురదలో పడుట లేక స్నానమాచరించుట, మొదలగునవన్నియు భార్య లేక పుత్ర వినాశకములు. స్వప్నమందు రాజు తన పుట్టుకను గాంచిన లేక ఖంచన పక్షి గర్భనాడిని కరచుకొని ఎగురుట కాంచిన అయ్యది మహా కళ్యాణకరము.

మరుసటిరోజు ఉదయము – అ స్థలము నందు ఇరువది అడుగుల పొడవు పదహారు అడుగుల వెడల్పుగగల ఉ త్తమ యజ్ఞకుండము త్రవ్వించి, ఉదయముననే మాతృకా పూజనము, కుడ్యలాగ్రపూజ, వృద్ధి శ్రాద్ధము, నాందీముఖ శ్రాద్ధము ఆచరింపవలెను. చందనాగరు కస్తూరి కర్పూరములతో యజ్ఞమండల పూజనమొనర్చి తదుపరి "హ్రౌం శంభవే నమ: ; అస్త్రాయ హుం ఫట్" అను మంత్రములను ఆచట లిఖింపవలెను. మండల రహస్య మెరిగిన మంత్రవేత్తలు ఉన్నితో కానీ, పట్టుతో కానీ నేసిన దారములతో (సూత్రములతో) ఒక ప్రథమ స్వస్తిక మండలమును నిర్మించెదరు. ఈ

మండలము నాలుగు అడుగుల చతురస్రము. దానియందు ఒక అడుగు వ్యాసము గల కమలము నిర్మింపవలెను. మండలమునకు నాలుగు ప్రక్కలా అర అడుగు వెడల్పున ద్వారములు, పద్మమందు కర్ణిక, కేసరములు ఎరుపు, పసుపు, నీలము (నలుపు,) తెలుపు వర్ణములయందుండవలెను. శాలి చూర్ణము (శాలి బియ్యపుపిండి)చే కౌస్తుభ మండలము, ఆకుపచ్చని చూర్ణము చే అరడుగు ప్రమాణమున వేరొక మండలము ఏర్పరచవలెను. ప్రధానమండలము (నాలుగడుగుల చతురస్రము) పశ్చిమ ద్వార సమీపమున "పశ్చిమగామిని" అను వంద అడుగుల "తాళ వృక్షము"ను పాతవలెను. మిగిలిన ద్వారముల వద్ద అష్టదళ పద్మముల నేర్పరచవలెను. రజము లేక చూర్ణమును ఒక రజితపాత్ర యందు తీసికొని, ఆ పాత్రను కుడి చేతిలోనికి తీసికుని, ఎడమచేతి మధ్యవ్రేలు, ఉంగరపు వ్రేళ్ళతో రజమును ముందు ఉన్నిలేక పట్టు దారములతో చేసిన ప్రథమ స్వస్తిక మండలముపై, ఆ సూత్రముల మధ్య ముగ్గు వలె వేయవలెను. చూర్ణము చే మండలములు తయారయిన పిదప మండల సూత్రములను త్రెంపవలెను. తొలుత మండల పూజనమొనర్చి "భవాయనమ:" అను మంత్రోచ్చారణ గావించి, చేతితో చూపించి మండలమును అంకితమొనర్చవలెను. తదుపరి పుష్పములను మండలము వద్దయుంచి, విజ్ఞులయిన మంత్రవేత్తలు తమ అరచేతులతో ఆ రేఖలను సుతారముగ అలకి, వాటిని సమముగ, అవిచ్ఛిన్నముగ, తిన్నగా సీమను దాటకుండగా, రేఖలు కలువకుండగా కావింపవలెను. చూర్ణమును సూత్రముల మధ్య వేసి, తదుపరి సూత్రములను త్రెంపవలెనని తెలిపితిని కదా! ఈ చూర్ణపు రేఖల ఆధారముగ ఫలితము లెట్లుండునో తెలిపెదను. రేఖలు ఒకదానితో ఒకటి కలసిన కలహము, ఊర్ధ్వ రేఖలయిన విరోధము, రేఖలు అతిస్థూలమయిన వ్యాధి, అతి దగ్గరకు వచ్చిన పీడ, రేఖలు చుక్కలు చుక్కలుగ యున్న విపక్షులచే భయము, అతి సన్నములయిన అర్ధనాశము, ఛిన్నమయిన మరణము లేక ఇష్ట ద్రవ్యనాశము, లేక పుత్ర వియోగము కలుగును.

సాధకుడు ఈ మండల రహస్య మెరుంగక తన చిత్తమొచ్చిన రీతిని మండల నిర్మాణము కావించిన ఎడల పైన తెలిపిన విఘాతములన్నింటికీ బాధ్యత వహింపవలసియుండును. మండలములు పన్నెండు రకములు. అవి "విమల, విజయ, భద్ర, విమాన, శుభద, శివ, వర్ధమాన, దేవ, తార్క్ష, కామప్రద, రుచిక, ముష్టిక." స్నాన, యజ్ఞ భేదము ననుసరించి పండిత గణములు ఈ వివిధ మండలములను ఉపయోగించెదరు. ఈ మండలములను తెల్ల ఆవాలు లేక దూర్వముల చే నిర్మింపవలెను. దేవదానవులు సుధా నిమిత్తమై సముద్ర మంధనము కావించినపుడు వెలివడిన సుధాభాండము నుంచుటకై విశ్వకర్మ దేవతల యొక్క "కళ" మరియు "కళాంశము"లను గ్రహించి నిర్మించిన మండలమునే "కలశము" అని పేర్కొనిరి. ఈ కలశములు తొమ్మిది రకములు. అవి "గాహ్యా, ఉపగాహ్యా, మరుత, మయూఖ, మనోహా, ఋషిభద్ర, తనుదూషక, ఇంద్రియఘ్న, విజయ." ఓ! రాజా! ఈ తొమ్మిది కలశములు అన్ని వేళల (కాలముల) యందు శుభప్రదము. వీనికి ఇతర నామములు కలవు. "క్షితీంద్ర (గాహ్యా), సంభవ (ఉపగాహ్యా), పవన (మరుత), అగ్ని (మయూఖ), యజమాన (మనోహా), కేశసంభవ (ఋషిభద్ర), సోమ (తనుదూషక), ఆదిత్య (ఇంద్రియఘ్న), విజయ". ఈ తొమ్మిదవ కలశము మహాదేవుని స్వరూపమని తెలుపబడును. అందువలన ఈ కలశము పంచముఖి. ఈ కలశము యొక్క పంచ ముఖములందును పంచముఖుడయిన పరమేశ్వరుడు వామదేవాది ముఖములతో విలసిల్లును.

మండల మధ్యమునున్న కమల కర్ణిక యందు ఈ పంచముఖ కలశమును స్థాపించి, అద్దానికి తూర్పున క్షితీంద్ర ఘటము, పశ్చిమమున సంభవము, వాయువ్య కోణమున పవన ఘటము, ఆగ్నేయము నందు అగ్ని ఘటము, నైఋతి నందు యజమాన ఘటము, ఈశాన్యమున కోశ సంభవము, ఉత్తరమున సోమఘటము, దక్షిణమున ఆదిత్య ఘటము, స్థాపించి, ఆ కలశములపై క్రింది నీయబడిన దేవతలను ధ్యానింపవలెను. కలశ ముఖమందు విష్ణు భగవానుడు, గళమందు శంకరుడు, మూలమున బ్రహ్మ, మధ్యమ మందు మాతృగణములు ఉపస్థితమై యుండును. ఈ కలశమునకు దశ దిశల యందు ఇంద్రాది దేవతలు చుట్టిముట్టి యుండగా, కలశగర్భమున సప్త ద్వీపములు, సప్త సముద్రములు,

నక్షత్ర, గ్రహ, కులపర్వతములు, గంగాది నదులు, చతుర్వేదములు యున్నవి. ఆ కలశమును అట్లే ధ్యానింప వలె!!! ఇపుడు కలశము లందు యుంచు పదార్థములను తెలిపెదను. అవి "రత్నములు, ముత్యములు, పగడములు, ఇంద్రనీలములు, స్ఫటికములు, సర్వ ధాతువులు, బీజములు, పుష్పములు, ఫలములు, పోకలు, నిమ్మ, ఉదుంబర, మాతులుంగ, గజనిమ్మ, కాశ్మీర, మామిడి, దానిమ్మ, గోధుమలు, వరి బియ్యము, యవలు, తెల్లఆవాలు, నీవార ధాన్యము, గోరోచనము, చందనము, సుర్మా, జటామాంసి, కూటము, కస్తూరి, పత్ర చూర్ణము, రాల్ చెట్టు నుండి స్రవించు ద్రవము, చంపకము మరియు పారిజాత పత్రములు, శుద్ధ జలము, కాలశాకము, దేవీపర్ణము, వస, రాచఉసిరి, అడవిబాదం, దూర్వాంకుర గడ్డి, మోహనిక, భద్రా, శతమూలి, శతావరి, వర్ధనా, చంద్ర, సహదేవి, సరళ, పూర్ణకోశ, అశోక, రక్తిక, శిరశిక, అనల (జీడి చెట్టు), వ్యాపక, గజదంత, శతపుష్ప, పునర్నవ, బ్రాహ్మీ, దేవీ, శివా, రుద్రా, సర్వ సంధానిక ఇత్యాది ఔషధములు. వీటిని అన్నింటికీ కలశమునందుంచవలెను.

కలశమందు యథాస్థానముల యందు త్రిమూర్తులను పూజించి, విశేషముగ మహాదేవుని ఆరాధింపవలెను. శంభుతంత్రమందు ఉపదేశింపబడిన ప్రాసాదమంత్ర సహితమై నానా విధ నైవేద్యములను నివేదించుచూ శంభుదేవుని పూజింపవలెను. దిక్పాలకులను దిక్పాలఘటము లందు మాతృకలను మాతృకా ఘటములందు, నవగ్రహములను గ్రహ కలశములందు, ఈ విధముగ సర్వదేవతలను వారి వారి నియమిత గృహములందు (ప్రదేశము లందు), వేరువేరు ఘటములందు పూజింపవలెను. వారికి భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, తినుభండారములు, అనేక ఫలములు, పుష్పములు, హల్వా, పాయసము మొదలగునవి సమర్థత ననుసరించి, తెప్పించి, పుష్య స్నానార్థము ఆయా దేవతారాధనము కావింపవలెను. హోమము కావించిన మీదట మండలమునకు ఉత్తర భాగమున తొమ్మిది అడుగుల పొడవు, రెండడుగుల వెడల్పు, పది అంగుళముల ఎత్తుగల పీఠము స్థాపించి, వస్త్రయుక్తమయిన ఆ పీఠముపై చుట్టూ అలంకరణ వస్తువులు, పసుపు, కుంకుమ మొదలగు పదార్థముల నుంచవలెను. ఒకటి నుండి ఒక్కొక్క అంగుళము పెంచుచూ ఇరువది ఆరు అంగుళముల వరకు వృత్తము, చతురస్రము, పద్మము లేక త్రికోణాకారమున ఒక వేది తయారు చేసి, అద్దానిని ఆ పీఠముపై స్థాపించవలెను. ఇపుడు ఆ వేదిపై రత్నములు, రత్న భూషణములు, స్వస్తిక, గణేశుడు, లక్ష్మి, బిల్వవృక్షము, దివ్యాభరణములను యుంచవలెను. తదుపరి శుభాంగన, శుభదాయిని అయిన ఉమాదేవి స్నానార్థము ఆరడుగుల పరిమాణము కలిగి ధనుషాకారమున యున్న పీఠము చేయించి, దానిపై ఆరడుగుల వ్యాసముగల వృత్తాకారము, గుణయుక్తమయిన శయ్యను చేయించవలెను. లేని ఎడల స్వర్ణ, రత్న విభూషితమై, ఏనుగు లేక సింహపు ముఖము కలిగిన ఒకటిన్నర అడుగుల వెడల్పయిన దండాసన స్వరూప శయ్యను కూడా కూర్చవచ్చును. వస్త్రముపై వనములు చిత్రించి, అద్దానికి ఊలు మొదలగునవి జరి నేసి, ఆ వస్త్రములు శయ్యపై పరుచవలెను. ఉత్తమమైన శయ్య నాలుగు అడుగుల పొడవు, రెండు అడుగుల వెడల్పు యుండును. దీనిపై చంద్రాకారపు సింహాసనము మరియు పదహారు రకముల రంగురంగుల తలగడలు అమర్చవలెను.

రాజు కూర్చొను శయ్య, పైన తెలిపిన శయ్య కంటె జానెడు నిడివి ఎక్కువ యుండవలెను. మహారాజుకు సరికొత్త వాహనము, సింహాసనము, వస్త్రాది ఉపకరణములు సంగ్రహించి వానిని దేవికి ఉత్తరమున యుంచవలెను. ఆ వేదికి పశ్చిమమున మహారాజు ఒక పాదము పాదపీఠపై యుండి యజ్ఞకాష్ఠ నిర్మితము, స్వర్ణ రత్న జటితము, అర్ధ భాగము మహాస్తరణము చే ఆవరింపబడినది, గోవు, ఉన్ని, సింహ, శార్దూల చర్మము చే అలంకరింపబడిన శ్రేష్ఠమయిన ఆసనము పై రాజు విరాజమానుడై యుండవలెను. తొలుత ఈ క్రింది మంత్రములు చదువుచూ ఆయన శరీరమునకు నేతిని పూయవలెను. మంత్రార్థము "నేయి తేజోదాయకము మరియు పాప వినాశనమునకు పరమ సాధనము. ఇయ్యది దేవతలకు భోజనము, అంతేకాక దీనియందు సమస్త లోకము ప్రతిష్ఠితమై యున్నది. పృదివ్యంతరిక్ష దైవీ దోషములన్నియు

ఈ ఘృత స్పర్శచే దూరమగును.” ఈ మంత్రములు చదువుచూ ఘృతాభ్యంగనము కావింపవలెను. తదుపరి మంత్రవేత్తలయిన పురోహితులు కలశ సమూహములు, పుష్పములు, బియ్యపుపిండి మొదలయినవి ఉపయోగించి శరీరమునకు తత్వార్ధ సిద్ధి కలిగించు మంత్రముల ద్వారా మహారాజునకు అభిషేకమొనర్పవలెను. అభిషేక నిమిత్తము కలశములు ఎనిమిది, పదహారు, ఇరువది, లేక నూట ఎనిమిది, వాని కంటె ఎక్కువ కలశములు సహితము ఉపయోగింపవచ్చు. ఈ కలశములచే విజయ, కళ్యాణ ప్రదాయకములయిన శివ, విష్ణు, మాతృకా, దిక్పాల, గ్రహ మంత్రములచే రాజును అభిషేకింపవలెను.

అభిషేక మంత్రార్ధము – “మహారాజా! పురాతనమయిన సిద్ధులు, వసు, రుద్ర, ఆదిత్య, సాధ్య, మరుద్గణములు, దేవ వైద్యులయిన అశ్వనీ కుమారులు, త్రిమూర్తులు, ఈ దేవగణములందరూ నీకు అభిషేక మొనర్చుచున్నారు. దేవమాత అదితి, స్వాహా, లక్ష్మీ, సరస్వతి, కీర్తి, ధృతి, శ్రీ, సినీవాలి, కుహూ, దితి, సురస, వినత, కద్రువ, మొదలయిన దేవపత్నులు మరియు దేవమాతలు, అప్సరోగణము, సర్పులు మీకు అభిషేక మొనర్చుచున్నారు. నక్షత్ర, ముహూర్త, పక్ష, అహోరాత్రములు, సంధ్యలు, సంవత్సరము, నిమేషములు, కళ, కాష్ఠ, క్షణ, లవ మొదలయిన కాల అవయములన్నియు మీకు అభిషేకమొనర్చుచున్నవి. విమానమందు విరాజమానులై దేవగణములు, పదునాల్గుమంది మనువులు, నదీ సహితుడై సాగరము, మహాపర్వతములు, నాగులు, కిన్నెర కింపురుషులు, మహానుభావులయిన వైఖానసులు, ధృవ స్థానమందు స్థితిగతులయిన మరీచి, అత్రి, పులహ, పులస్త్య, క్రతు, అంగిర, పత్నీ సహిత వశిష్ఠుడు మొదలగు సప్తర్షులు, సనక, సనందన, సనత్కుమార, సనాతనులు, దక్ష, జైగీషవ్య, అభినందన, జాబాలి, కశ్యప, దుర్వాసో, దర్వనీత, కణ్వ, కాత్యాయిన, మార్కండేయ, దీర్ఘతమ, శున:శ్శేప, విధూరద, ఔర్వ, సంవర్తక, చ్యవన, అత్రి, పరాశర, ద్వైపాయన, యవక్రీత, పుత్రసహిత దేవరాతులే కాక ఇతర వేద పరాయణులు, తపస్వులు అయిన ఋషిగణము తమ పత్నీ పుత్ర శిష్యగణ సహితులై మీకు అభిషేకమొనర్చుచున్నారు. సర్వ వృక్ష, నదీ, పర్వత, పుణ్యతీర్ధ క్షేత్రములు, ప్రజాపతులు, పృధ్వి, మాతృకాగణము, గోవులు దివ్య వాహనములు, చరాచర లోకము, పితరులు, అగ్నులు, తారలు, మేఘములు, ఆకాశము, దిశలు, జలము, మరియు ఇవేకాక స్మరణ చే శుభములు వర్షించి పుణ్యము నాపాదించు ఇతర వస్తువులు, ఉత్పాతములను దూరమొనర్చుటకు మీకు జలాభిషేక మొనర్చుచున్నవి. ఇవేకాక ఇతర త్రిమూర్తులు మరియు ఇంద్రునికి సంబంధించిన మంత్రములు – “ఓం ఆపోహిష్ఠ, హిరణ్య సంభవాయ, సుర, మానస్తోకే, గంధద్వారా, సర్వమంగళ మాంగళ్యే, శ్రీశ్చతే” ఇత్యాదులు మరియు గ్రహ మరియు యోగినీ మంత్రములచే మహారాజుకు అభిషేక మొనర్పవలెను.

ఈ విధముగ అభ్యంగన స్నాన మొనర్చిన పిదప మహారాజు శరీరమును తుడుచుకొని, పొడియై, నూలు వస్త్రములు ధరింపవలెను. తదనంతరము మహారాజు ఆచమనము గావించి సుర, భూసుర పూజనము చేసి, మంత్ర జపము కావించి, అచట విస్ఫులింగములు వెదజల్లుచూ వెలుగుచున్న అగ్ని శిఖల మధ్య నిమిత్తానిమిత్తములు విచారణ కావింపవలెను. జ్యోతిష్కులు, అమాత్యులు, వందిమాగధులు, కంచుకి, నాగరికుల చే పరివేష్ఠితుడై మహారాజు తూర్యాది పుణ్య వాద్య ఘోష మధ్య బ్రాహ్మణుల ద్వారా పున: శాంతి పాఠము, ఆశీర్వచనము చేయించి, పూర్ణాహుతి గావించి, ద్విజులను అన్న, వస్త్ర, స్వర్ణ, రత్నమణి, మాణిక్యాదులతో సత్కరించి పూజా విసర్జనకు సమాయత్త మొనరింపవలెను. పురోహితులు శేష జలమును అమాత్య, చతురంగ బలములపై ప్రోక్షణ చేసి పునీతుల గావింపవలెను. ఈ విధముగ పుష్య, స్నాన మొనర్చి మహారాజు మూడు రాత్రుల పర్యంతము మాంస, మైధునములను వర్జించి, మాంగళ్యసేవనము కావించుచూ, శాంతచిత్తుడై గడుపవలెను. పుష్యమీ నక్షత్రము, తృతీయాతిధి కలిసినపుడు పార్వతీ పరమేశ్వర పూజనమొనర్చి, పాంచాలికా విహారము, బొమ్మల పెళ్ళిళ్ళు చేసి గృహమందు పార్వతీ పరమేశ్వర కళ్యాణము కావింపవలెను. రహదారుల కూడలి మరియు దేవాలయమును పతాకములతో అలంకృత మొనర్చిన ఎడల ఆ మహారాజుకు కష్టములంకురింపవు.

ఈ ప్రకారముగ శాంతియాగము, పుష్పాభిషేకమొనరించిన మహారాజు తన పత్నీ, మంత్రి, చతురంగబల సమేతుడై

ఇహపరములందు సుఖము ప్రాప్తించును. దీనికి మించిన యజ్ఞము, ఉత్పన్నము, శాంతి విధానము, మరియు కళ్యాణకరమయిన కార్యము మరియొకటి లేదు! లేదు!! లేదు!!!. ఈ విధి విధానముతో రాజ పురోహితుడు మహారాజు మరియు యువరాజు యొక్క అభిషేక మొనర్చవలెను. ఎవరేని రాజు తొలుత రాజ్యాభిషేకము ఒనర్చునపుడు ఈ విధిని పాటించిన ఎడల ఆతడు నిష్కంటక రాజ్య, సుఖ, భోగములు అనుభవించును. ప్రాచీన కాలమందు ఈ విధి విధానము సాక్షాత్ చతుర్ముఖ బ్రహ్మ ద్వారా ఇంద్రునికి ఉపదేశింపబడినది. ఈ విధముగ రాజ్యాభిషేకమొనర్చుకొనిన రాజు సంపూర్ణ ఇహపర సుఖము నొందును.

**(శ్రీ కాళికా పురాణమందలి పుష్య స్నానమను ఎనుబది ఆరవ అధ్యాయము సమాప్తము)**

# ఎనుబది ఏడవ అధ్యాయము

**(ఇంద్ర ధ్వజ పూజనము)**

ఔర్వుడు "ఓ! నృప శార్దూలమా! ఇపుడు "శక్రోత్థానము" అను ఒక దివ్య ధ్వజోత్సవమును గూర్చి తెలిపెదను. ఈ మహోత్సవము నాచరించుట చే నృపతులు ఎన్నటికీ పరాభవము నొందరు. సర్వ విఘ్నశాంతి కొరకై సూర్యుడు సింహరాశి యందున్నపుడు, ద్వాదశీ శ్రవణ నక్షత్రములు యోగించినపుడు రాజన్యులు సహస్రాక్షుని గొప్పగా ఆరాధింపవలెను. పూర్వ కాలమందు ఉపరిచర వసువను మహారాజు ఈ మహాయజ్ఞమును కావించెను. తొలుత రాజ పురోహితుడు వర్ష ఋతువు నందు శుక్లపక్ష ద్వాదశీ తిథి యందు మేళతాళ సహితుడై ఏగి, ఇంధ్ర ధ్వజ హేతువుకై ఒక వృక్షమును స్వీకరింపవలెను. అద్దానిని ఒక సంవత్సరము జాగ్రర్తగా సాకి, అటు పిదప మంగళోత్సవ పూర్వకమగా నరుకవలెను. కానీ ఈ వృక్షమును జాగ్రర్తగా ఎంచి స్వీకరింపవలెను. ఉద్యానములందు, మందిర, శ్మశానములందు, మార్గమధ్యమునందున్న వృక్షములు ఇంద్రధ్వజమునకు పనికిరావు. అనేక లతాయుక్తము, ఎక్కువగా గాయములు, తొర్రలు కలది, అగ్ని లేక జలము చే ధ్వంసమయినది, స్త్రీ నామము కలిగినది, అతి చిన్నది లేక సన్ననిది, ఇటువంటి వృక్షములను ఇంద్ర ధ్వజమునకు ప్రయత్న పూర్వకముగ విడువవలెను. అర్జున, అశ్వకర్ణ, ప్రియకము (లేప), ఉదుంబర, వట (మర్రి) వృక్షములు ఇంధ్ర ధ్వజమునకు శ్రేష్ఠములు. లేని ఎడల దేవదారు, సాల వృక్షములను సహితము గ్రహింపవచ్చు. మిగిలిన వృక్షములు ఏవియును వల్లదు.

అనంతరము ఇంతకుమున్ను స్వీకరించిన వృక్షము కడకు రాత్రి సమయమున ఏగి "యాని; ప్రతిగృహ్యాతామ్," మొదలగు మంత్రములు పఠించవలెను. మంత్రార్థము– "ఈ వృక్షము పై నివసించుచున్న ప్రాణులన్నింటికీ మంగళమగు గాక! ఈ ప్రాణులన్నింటికీ నమస్కృతులు. నాచే సమర్పింపండిన ఈ బహుమతులన్నియు స్వీకరించి, ఇంద్రధ్వజ నిర్మాణమందు నాకు సహాయమొనరింపవలసినది. ఓ! వృక్షరాజమా! మహారాజు ఇంద్రధ్వజ నిర్మాణహేతువుకై నిన్ను గ్రహించెను. నీకు కళ్యాణమగు గాక! దయచేసి నా ఈ పూజను స్వీకరింపవలసినది." ఆ మరుసటి దినము ఆ వృక్షమును ఖండించి అందు ఎనిమిది అంగుళముల వేరు, నాలుగు అంగుళముల చివరి భాగము, రెండింటినీ నీటియుందుంచవలెను. మిగిలిన వృక్షమును నగర ద్వారము వద్దకు తెచ్చి అచటనే ఇంద్రధ్వజమును చేయింపవలెను. ధ్వజము ముప్పది రెండు అడుగులు అధమము. నలుబది రెండు అడుగులు శ్రేష్ఠము. ఏబది రెండు అడుగులు శ్రేష్ఠతమము. ధ్వజమునకు నాల్గవ వంతు పొడవుయున్న అయిదుగురు ఇంద్ర కుమార్తెలను, వారికి సగము పరిమాణమున్న అయిదుగురు ఇంద్రమాతృకలను సాల వృక్షము నుపయోగించి చేయింపవలెను. పిదప రెండడుగుల పరిమాణమున్న యంత్రమునుంచ వలెను. భాద్రపద

శుక్ల అష్టమినాడు ఈ ధ్వజమును వేది వద్ద ప్రతిష్ఠింపవలెను.

భాద్రపద శుద్ధ ఏకాదశినాడు ఒక యజ్ఞము నారంభించి, ద్వాదశినాడు ఇంద్రార్ధమై ఒక విస్తృత మండలమును ఏర్పాటు చేయవలెను. తొలుత విష్ణుపూజనమొనర్చి తదుపరి ఇంద్రుని ప్రతిమను స్వర్ణ, కాష్ఠ, ధాతు, లేక మట్టితో కానీ చేసి, ఆ ప్రతిమను మండల మధ్యమున స్థాపించి, విశేష పూజనమొనర్చి, ఒక శుభ మహూర్తమున ఇంద్రధ్వజమును ఎగురవేయవలెను. తదుపరి "వజ్రహస్త నమస్తేస్తు" మొదలగు మంత్రములతో అయనను పూజింపవలెను. మంత్రార్థము – "వజ్రహస్తా! దేవశత్రువినాశీ! సహస్రాక్షా! పురంధరా! సర్వలోక కళ్యాణమునకై నా ఈ పూజను స్వీకరింప వలసినది. శ్రవణ నక్షత్రపు ప్రథమపాదమందు ధ్వజ రూపమున ఉత్థానులై యున్న మీరు నా ఈ పూజను గైకొన వలసినది. మహాప్రభో! మీకు నమస్కారము." ఈ విధముగ పలికి ఉత్తర తంత్ర మందు తెలిపిన మంత్ర తంత్రములచే దహన ప్లవనాది క్రియలు, పాయసము, బెల్లము, బియ్యము, భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, నైవేద్య పదార్థములు సమర్పించి శ్రీవృద్ధి హేతువుకై పూజన మొనర్పవలెను. కలశములందు దశ దిక్పాలురు, గ్రహములు, సాధ్యాది దేవతలు మరియు మాతృకల పూజన మొనర్పవలెను.

తదుపరి శుభ ముహూర్తము నందు వృద్ధులు, జ్ఞానులు, విప్రులు, పురోహితుల సహితుడై మహారాజు యజ్ఞవేది పశ్చిమమున మంగళకరమయిన ధ్వజసంస్థాపన భూమి వద్దకు ఏగవలెను. అయిదు రజ్జువులతో ఏర్పరుపబడిన యంత్రము, ముందు చేయబడిన పంచకుమారీగణము, పంచ మాతృకాగణము, బృహస్పతి మొదలయిన దిక్పాల గణములకు తంత్రమునందు తెలుపబడిన యథావర్ణముల వస్త్ర, చూర్ణ ధారణ కావించి, యథా స్థానములందు స్థాపింపవలెను. పిదప వానిని కింకిణీజాలము మరియు నానా రత్న భూషణములతో విభూషితుల గావించి, పుష్పార్పణము కావించి, సుగంధపదార్థములను అలది, నానా వస్త్రతోరణ యుక్త ధ్వజమును నెమ్మది నెమ్మదిగ ఎగురవేయవలెను. తదుపరి మండల మధ్యమున తొలుత పూజన మొనర్చిన ఇంద్రప్రతిమను తీసికొని వచ్చి, ధ్వజమూల మందు ప్రతిష్ఠించి, తిరిగి పూర్వపు మాదిరిగనే పూజింపవలెను. ఇంద్రునే కాక ఆయన సతి శచీదేవిని, పుత్రుడు జయంతుని, ఆయుధమయిన వజ్రమును, వాహనమైన ఐరావతమును, గ్రహ, దిక్పాల గణ దేవతలను, పూజించి పాయసము మొదలగు నైవేద్యములతో పూర్వము వలెనే తిరిగి పూజింపవలెను. తదుపరి పూజింపబడిన దేవతల నిమిత్తము హోమము ఆచరింపవలెను. పిదప మహాత్ముడయిన ఇంద్రునికి బలి ప్రదానము (నైవేద్యము) సమర్పింపవలెను. తిలలు, ఘృతము, అక్షతలు, పుష్పములు, దూర్వాంకురములతో వివిధ దేవతలకు వారి వారి నియమిత మంత్రములచే హోమము కావింపవలెను. అటు పిదప బ్రాహ్మణులకు భోజన ప్రదానము కావింపవలెను. ఈ విధముగ రాజు ప్రతి నిత్యము వేద పారంగతులయిన బ్రాహ్మణోత్తముల సహాయము చే ఏడు రోజులు పూజన మొనర్పవలెను. ఇంద్ర సంబంధిత యజ్ఞములన్నింటి యందునూ "త్రాతారమింద్రం" అను మంత్రమును పఠింపవలెను. ఇది శక్రునకు (ఇంద్రునికి) ప్రీతి పూర్వక మంత్రము. ఈ విధముగ శ్రవణ నక్షత్ర యుక్త ద్వాదశి మొదటి భాగమున మహారాజు స్వయముగ ఇంద్రుని స్థాపించి, ఇంద్రధ్వజ పూజన గావించి, భరణీ నక్షత్ర చివరి పాదమందు, రాత్రివేళ అద్దానిని విసర్జింప వలెను (పూర్ణము కావింపవలెను). రాజు ఇంద్రధ్వజ విసర్జన ప్రక్రియను నేరుగా గానీ, స్వప్నము నందు కానీ వీక్షింపరాదు. అట్లు చూసిన ఎడల ఆతడు ఆరు నెలలలో అపమృత్యువాతపడును. ఇంద్ర విసర్జన మంత్రములు "సాధ్య గమ్యతామ్" మొదలగునవి. మంత్రార్థము – "ఓ! పురంధరా! శతక్రతూ! మహేంద్ర ధ్వజా! సమస్త దేవ దానవ సహితుడవై ఈ బహుమతులు స్వీకరించి, మీరు మీ యథాస్థానములకు దయచేయవలసినది. సూతకము, మంగళ శనివారములు, భూకంపాది ఉత్పాతములు సంభవించినపుడు విసర్జనకూడదు. ఉత్పాతములు, విప్లవములు కలిగినపుడు ఏడు రోజుల పూజానంతరము మంగళ, శని వారములు విడచి మిగిలిన ఏ నక్షత్రమునందు ఐననూ విసర్జన కావింపవచ్చు. సూతకము వచ్చినపుడు ఆ సూతకము పూర్తయిన పిదప ఏ దినమయిననూ

విసర్జన కావింపవచ్చు. ఓ! నృపశార్దూలా! విసర్జనమయినంత వరకు ధ్వజమును అత్యంత జాగరూకత తో రక్షించుచూ, ఏ పక్షిజాలము సహితము అద్దానిపై కూర్చొనకుండా రక్షింపవలెను. ధ్వజమును ఎట్లు నెమ్మది, నెమ్మదిగా ఆరోహణము కావించిరో, అట్లే నెమ్మదిగ అవరోహణము కావింపవలెను. ఎట్టి పరిస్థితుల యందు ధ్వజము విరుగకూడదు. ఒక వేళ ధ్వజము విరిగిన ఎడల మహారాజు మృత్యువాత పడును. ఈ ధ్వజమును అలంకార సహితముగ రాత్రివేళ "తిష్ఠ, వినాశక" మంత్రముల ద్వారా జలములందు ముంచవలెను. మంత్రార్థము "ఓ! కేతనమా! మహాభాగా! ఒక వర్ష పర్యంతము నీవు సమస్త లోక విఘ్నములు వినాశన మొనర్చుచూ ఈ జలరాశి యందు నివసింపుము. ఈ ధ్వజమును స్థాపించినపుడు అనేక జన సమ్మర్ద మధ్యమున విశేష పూజ కావించినప్పటికీ, విసర్జనము మాత్రము ఏకాంతమున కావింపవలెను!!!

ఈ విధముగ ఏ మహీపతి మహాత్ముడయిన శచీపతి ని పూజనమొనర్చునో, ఆతడు చిరకాలము ఇహలోక రాజ్యసుఖము నొంది, అంత్యమున ఇంద్ర లోకమును ప్రాప్తించును. ఈ రాజ్యమందు ఎప్పుడూ దుర్భిక్షము, ఆదివ్యాధులు, అకాలమృత్యువులు అంకురింపవు. ఇంద్రునికి ఈతని కంటె ప్రియమయిన మహీపతి యుండడు. వేయి మాటలేల! ఈ మహీపతికి కేశవాది దేవతా ప్రముఖులు అనుకూలురై యుందురు. ఈ పూజనము సర్వ దోష నివారిణి, సర్వవ్యాధి మరియు దుర్భిక్ష నాశిని. అంతేకాక ఇయ్యది సమస్త సంసారమునకు ఆశ్రయము, సకల సౌభాగ్యదాయకము. ఇంద్రలోకార్థులు ప్రతి వర్షము నందు శరద్రుతువు నందు ఇంద్రధ్వజ పూజనమొనర్పవలెను.

**(శ్రీ కాళికా పురాణమందలి ఇంద్రధ్వజ పూజనమను ఎనుబది ఏడవ అధ్యాయము సమాప్తము)**

# ఎనభై ఎనిమిదవ అధ్యాయము

**(విష్ణు యజ్ఞము)**

ఔర్వుడు "మహారాజా! ఇపుడు జేష్ఠమాస దశమి నాడు చేయవలసిన విష్ణుయజ్ఞము మరియు అద్దాని విధి విధానములు వివరించెదను. వినుము. ప్రతి సంవత్సరము మహారాజు శ్రీ మహా విష్ణువు యొక్క ప్రతిమను బంగారము లేక ఏదేని ధాతువు, లేక పాషాణము లేక చెక్క తో కానీ శిల్ప శాస్త్రముననుసరించు మహనీయ శిల్పుల చే చేయించి వేద పారంగతులయిన పురోహితులచే విధిగా ప్రతిష్ఠింపజేయవలెను. ఈ ప్రతిమ ప్రయత్న పూర్వకముగ తొలుత తెలుపబడిన వాసుదేవ మంత్రముల సహాయముతో భక్తియుతముగ విష్ణుభగవానుని పూజన మొనర్పవలెను. బ్రాహ్మణ పూజానంతరము హోమగుండమధ్యమున వెలుగొందుచున్న పవిత్రాగ్నియందు వేలాది ఆహుతులు, నేయి సమర్పించి యజ్ఞమునాచరింప వలెను. తదుపరి పురోహితులు వాసుదేవుని పూజ, హోమములు కావించి ప్రతిమను మండలమందు స్థాపించవలెను. అనంతరము తను దక్షిణ హస్తముచే ప్రతిమ యొక్క రెండు బుగ్గలను స్పర్శించి, వాసుదేవ బీజమంత్రము తో కానీ "తద్విష్ణో" మొదలగు అంగ ప్రత్యంగ మంత్రములతో కానీ విష్ణ భగవానుని ప్రాణ ప్రతిష్ఠ కావింపవలెను. మంత్రవేత్తలు తమ హృదయముపై బొటన వ్రేలి నుంచి, నిరంతర మంత్రోచ్చారణ కావించుచూ ప్రతిమ యందు ప్రాణ ప్రతిష్ఠ కావింపవలెను. ప్రతిమల యందు ప్రాణ ప్రతిష్ఠ కావింపని ఎడల అవి కేవల ధాతుమయమ్మై యుండి చేతనత్వము లేక దైవత్వము నొందవు. దైవత్వ ప్రతిష్ఠాపనకై "ప్రాణా: స్వాహా" మొదలగు అంగ ప్రత్యంగ మంత్రములచే, వైదిక తంత్రములచే సర్వ ప్రతిమలు ప్రాణములు సంతరించుకొనును.

మంత్రవేత్తలు ప్రతిమా పూజనమునకు ముందు పూజాసిద్ధికై తమయందు ప్రాణప్రతిష్ఠ లేక ఆత్మార్పణ

కావించుకొందురు. ఈ ప్రక్రియ ప్రతిమా పూజనమునకు కాక వేరొక ఇతర ప్రయోగార్థము కావించిన ఎడల అయ్యది వారికి మృత్యుహేతువగును. ఈ విధముగ శ్రేష్ఠమయిన రాజన్యులు దశమినాడు విష్ణుభగవానుని పూజనమొనరించి, ప్రాణప్రతిష్ఠ కావించి పౌర్ణమినాడు ఆ ప్రతిమను స్థాపించెదరు. ఈ విధముగ ఇష్టి నొనరించిన రాజన్యులు సమస్త విఘ్నరహితులై, సర్వ కామనలను ప్రాప్తించెదరు. శ్రీ పంచమి నాడు లక్ష్మీదేవిని, ఐరావతమును అధిరోహించిన ఇంద్రుని, కుంద పుష్పములతో, అనేక నైవేద్యములతో పూజింపవలెను. లక్ష్మీ, ఇంద్రుల పూజావిధి, మంత్ర తంత్రములు, మండలములు, ఇదివరలో వివరింపబడిన రీతినే ఆచరింపవలెను. ఈ విధముగ పూజ చేసిన నృపతులకు శ్రీహీనత, హాని ప్రాప్తింపవు.

ఇపుడు రాజులకు వర్జింపవలసిన విషయములను నుడివెదను. వానిని వర్జించుట వలన లక్ష్మీ ప్రాప్తి కలుగును. రాజులు ఇంద్ర, శివ, విష్ణు, అగ్నిని పూజించిన పిదప దానమీయకుండ భుజింపరాదు. మహారాజు పురోహితులచే నిత్యాగ్నిహోత్రము చేయింపవలెను. అగ్నికార్యము చేయకుండ భోజనము చేసిన రాజు నరకమును ప్రాప్తించును. రాజు చుట్టూ ఎప్పుడూ రక్షణ లేకుండ, రాత్రి నిదురించినపుడు దీపము లేకుండ, స్త్రీలతో సహితము నిరంతరము ఒంటరిగ యుండరాదు. భోజనమునకు తరువాత కొబ్బరినీరు, రాచఉసిరి తీసికొనరాదు. మినుములు, వెలగ, మరియు మట్టి బుద్ధినాశకములు. వేప, అట్రుష, మామిడి ఇత్యాదులు బుద్ధి ప్రచోదకములు. అందువలన రాజు బుద్ధితో బుద్ధినాశక పదార్థములను వర్జించి, బుద్ధి ప్రచోదకములను స్వీకరింపవలెను. రాజు నిశిత పరీక్ష కావింపకుండ ఆసనమును స్వీకరింపరాదు. అంతేకాక ఆసనరహిత రథ, గజ, అశ్వాది వాహనములను అధిరోహింపరాదు. నిర్జన స్థానములందు ఒంటరిగ సంచరింపరాదు. మత్తు, మదము కలిగిన పదార్థములను భుజింపరాదు. అట్లే అష్టమినాడు మధు, మాంస భక్షణము సంపూర్ణముగ వర్జితము. రాజు తన తండ్రి బ్రతికియుండగా అమావాస్య, గయ శ్రాద్ధములు, తిలతర్పణలు కావింపరాదు. అట్లు చేసిన ఎడల ఆతడు పాపమును సంప్రాప్తించును. రాజు ఔరసపుత్రుడు (నిజభార్యయందు తనకు కలిగిన పుత్రుడు) జీవించి యుండగా, క్షేత్రజ్ఞ పుత్రుడు (పుత్రులు లేనపుడు తన భార్య యందు ఇతరులచే పుట్టబడిన బిడ్డ) లేక అన్యత్ర పుత్రులకు పితృశుద్ధికై రాజ్యాభిషేక మొనర్పరాదు. "ఔరస, క్షేత్రజ్ఞ, దత్త, కృత్రిమ, గూఢోత్పన్న, అపవిద్ధ" అను ఆరుగురు పుత్రులు పైతృక ధన భోగమునకు అధికారులై యుందురు. "కానీన, సహోఢ, క్రీత, పౌనర్భవ, స్వయందత్త, దాస" అనువారలు "పాంసులపుత్రులు" అనబడుదురు. ఒకవేళ మొదటి తరగతికి చెందిన పుత్రులు లేని ఎడల, ద్వితీయ వర్గీయులకు రాజ్యాభిషేకము చేయవచ్చు, కానీ పౌనర్భవ, స్వయందత్త, దాస పుత్రులను రాజుగ అభిషేకింపరాదు.

దత్తాది పుత్రులు అన్య గర్భ సంభూతులయినప్పటికీ, రాజు యొక్క గోత్రములు స్వీకరించి, సంస్కృతులై పుత్రత్వము నొందెదరు. ఏ పుత్రులయితే రాజు యొక్క గోత్రమును స్వీకరించి సంస్కరణమును పొందెదరో, వారు మాత్రమే పుత్రులనబడెదరు. ఆ కార్యము అవ్వనివరకు వారు పుత్రులుగ పరిగణింపబడరు. ఒకవేళ దత్తపుత్రుడు అయిదు సంవత్సరముల వయసు పైబడినప్పటికీ, ఒకవేళ రాజు ఆ బాలుని దత్తత చేసికొనదలచినచో, అపుడు కూడా రాజు ఆ బాలుని స్వీకరించి, పుత్రేష్టి యజ్ఞము చే శుద్ధి కావించి, అపుడే పుత్రునిగా స్వీకరింపవలెను. "పునర్భూ" (పతి మరణించిన పిదప తిరిగి వివాహము చేసికొనిన స్త్రీ) నుండి ఉత్పన్నమయిన పుత్రుడు పౌనర్భవుడు. ఈ పుత్రుని స్వీకరించు రాజు ఆ బాలుడు పుట్టగనే స్వీకరించి, వెంటనే పౌనర్భవస్తోమ యజ్ఞమాచరించి, జాతక సంస్కారములు కావింపవలెను. ఇటువంటి పుత్రుడు తండ్రికి ఏకోదిష్ఠ శ్రాద్ధకర్మమాచరింపవచ్చును. కాని పార్వణ విధానము చే శ్రాద్ధము వర్జము. ఏ స్త్రీ మూల్యము చెల్లించి కొనబడునో ఆమె దాసి అనబడును. ఆమె పుత్రుడు దాసీ పుత్రుడగును. ఈతడు అన్ని రకముల పుత్రుల యందు అధముడు. ఈతడు రాజ్యాధికారమునకు కానీ, శ్రాద్ధమునకు గానీ అర్హతనొందదు.

రాజు ధర్మశాస్త్ర గ్రంధములను, సంహితలను అయోగ్యులచే, వారి చిత్తము వచ్చిన రీతిని చదివింపరాదు. అట్లు లేని ఎడల రాజులు, రాజ్యాంగములు హీనమయి, రాజు తన తండ్రి సహితుడై, నరకమును ప్రాప్తించును. రాజు అయోగ్యుని నుండి మంత్ర గహణము చేయదలచిన ఎడల, ఆ మంత్రమును ఇరువురు బ్రాహ్మణుల నుండి కూడా గ్రహింపవలెను. రాజు అయోగ్యులను న్యాయవ్యవస్థ యందు నియోగింపరాదు. అట్టి ఎడల రాజు తన సహాయకుల సహితుడై, ఆయు:క్షీణతనొంది, తదుపరి తామిశ్రనరకము నొందును. రాజు చెమిటివారినీ, వికలాంగులను, పుత్రహీనులను, అజ్ఞానులను, జితేంద్రియత్వము లేనివారినీ, మురగుజ్జులను, దీర్ఘరోగులను తన రాజ పురోహితునిగ నియమింపరాదు. రాజు పిసినారుల, యాచకుల, బ్రాహ్మణుల ధనము హరింపరాదు. రాజు లోభమునకు వశుడై, అవసరము కంటె ఎక్కువ పన్నులు వేయరాదు. రాజు ఉన్మత్తము, కాముకము అయిన గజాశ్వములను అధిరోహింపరాదు. అట్లు చేసిన ఎడల ఇహపరములందు కష్టములు అంకురించును. రాజు తన ఆయు:నష్ట కార్యములు ఎన్నడునూ చేయరాదు. తన ధన మాన సంపత్తినంతటినీ ఉపయోగించి, ఎల్లప్పుడు తన ఆయుర్వృద్ధికి ప్రయత్నింపవలెను. "జీవన్ భద్రాణి పశ్యతి" – బ్రతికియంటే శుభములు బడయవచ్చు. రవి, శని, మంగళ వారములు (క్రూర వారములు (దినములు), షష్ఠీ, అష్టమీ తిధులందు, క్రూర వారములందు రాజు కాటుక ధరించుట, తాంబూల చర్వణము కావించుట మొదలగువవి వర్జము. రాజు అత్యంత సూక్ష్మమయిన సూర్య చంద్రులను (సూర్య, చంద్ర గ్రహణములను), ఎర్రని సూర్యుని (ఉదయాస్తమయముల యందలి సూర్యుని) చూడరాదు. దైవిక, ఆకాశాత్మిక, పృధివ్యాప్తిక ఉత్పాతములను ప్రయత్న పూర్వకముగ మహారాజు వీక్షింపరాదు. ఒకవేళ చూసిన ఎడల ప్రాయశ్చిత్తముగ మూడు దినములు భోజనము మానవలెను. రాజు ఎల్లప్పుడూ దూర్వాంకుర సహిత మంగళమయ రత్నధారణ కావింపవలెను. ఆయన ఎన్నడూ తాను నగ్నశరీరుడై యున్నపుడు బ్రాహ్మణులను దర్శింపరాదు. రాజు ఎన్నడునూ జలమందు తన ప్రతిబింబము చూడరాదు, పర్వములందు మాంసభక్షణ చేయరాదు; గాడిద, ఒంటెలపై ఎక్కరాదు; గర్భిణీ స్త్రీలతో సంభోగము చేయరాదు. రాజు నీతియుక్తుడై నిరంతరము తనను తాను రక్షించుకొనుచూ, తన శక్తిని పెంచుకొనుచూ, తన చతురంగ బలములనూ వృద్ధి నొనర్చుకొనవలెను. రాజు వీర్యనాశకమొనర్చు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములను, అత్యంత క్షార, తీపి, చేదు, పులుపు పదార్ధములను , విసర్జింపవలెను. కాంస్య, వెండి పాత్రలందు నిలువయున్న జలము, నదులయందు పారుచున్న నీరు, మూత్రమును విరివిగ పెంపొందించు పదార్ధములను వర్జింపవలెను. తామ్రము, ఇనుము, స్వర్ణము, తోలు, మరియు రంగు పాత్రల యందు నీరు వీర్యవృద్ధి కావించును. ఈ నీటిని ప్రయత్న పూర్వకముగ సేవింపవలెను. ఈ విధముగ ఆచరింపవలసిన కార్యములు ఆచరించుచూ, సదాచారపరుడయిన రాజు ఇహమందు సర్వసుఖములు పొంది పరమందు ఇంద్రలోకమున కేగును.

మార్కండేయుడు "శ్రేష్ఠముని సత్తములారా! ఈ విధముగ ఔర్వముని సగర చక్రవర్తికి వివిధ సదాచారములను తెలిపెదను. ఈ విధముగ తెలిపిన సదాచారములు సంపూర్ణములు. రాజనీతి, సజ్జనుల రీతి, వివిధ శాస్త్ర, ఇతిహాస, పురాణ సంహితల యందు తెలుపబడిన వన్నింటినీ ఔర్వుడు ప్రవచింపగా, బుద్ధిమంతుడగు సగరుడు వానిని సర్వమును విని ఆకళించుకొనెను. వీనినే కొన్నింటిని విష్ణుధర్మోత్తర పురాణమందు నేను తొలుత ప్రవచించితిని. విష్ణు ధర్మోత్తరమందు కొంచెముగ తెలుపబడిన సదాచారములందు మీకు సందేహములు, సంశయములు యున్న ఎడల, ఈ పురాణ మందు అవన్నియు సంశయ రహితముగ, విస్తారముగ విశదీకరింపబడినవి. ఏ విప్రుడు నిరంతరము ఈ కాళికాపురాణమును అభ్యాసము చేసిన ఎడల ఆతడు వేదాధ్యయనము కావించిన ఫలము నొందును.

**(శ్రీ కాళికా పురాణమందలి విష్ణుయజ్ఞమను ఎనబై ఎనిమిదవ అధ్యాయము సమాప్తము)**

# ఎనభై తొమ్మిదవ అధ్యాయము

**(భేతాళ భైరవ వంశ వర్ణనము)**

ఋషిగణములు మార్కండేయునితో "మహానుభావా! ఔర్వముని చే తెలుపబడిన రాజనీతి మరియు సదాచారములను మీ ముఖతా విని కృతార్థులమైతిమి. కానీ మమ్ము ఒక్క సందియము పీడించుచున్నది – "అపుత్రస్య గతిర్నాస్తి" పుత్రహీనులకు సద్గతులు లేవని వేదవాక్యము మరియు లోక విదితము. భేతాళ భైరవులు ఇరువురు తపస్సుకు ఉపక్రమించినపుడు వారికి వివాహమయ్యెనని మీరు తెలుపలేదు. అందువలన వారు పుత్రహీనులా! వారి వంశము కలదా! అట్లయిన వారి గతి ఏమైనది? దయచేసి తెలుపవలసినది." అంత మార్కండేయుడు "ఋషి సత్తములారా! మీరు పలికినది నిజమే! అపుత్రకులకు గతి లేదు. తన పుత్రుని గానీ, తన సోదరుని పుత్రుని గానీ, వ్యక్తి తన పుత్రునిగ భావించవచ్చు. భేతాళ భైరవులు మహాబలులు. వారికి పుత్రులు కలరు. వారి వంశములను వర్ణించెదను. భేతాళ భైరవులు తమ అభిమతమయిన సిద్ధిని ప్రాప్తించి, ఆనందమనస్కులై కైలాస శిఖరమందున్న శివమందిరమున కేగిరి. మహాదేవుని ఆజ్ఞను బడసి, ఆయన పార్షద ప్రవరుడైన నంది ఒక ఏకాంత నిర్జన ప్రదేశమందు వారిరువురికి ఈ విధముగ హితబోధ కావించెను – "మీరిరువురు శంకర పుత్రులయినప్పటికీ పుత్రహీనులు. పుత్రవంతులు సర్వత్రా సద్గతుల నొందెదరు. అందువలన మీరిరువురు పుత్రోత్పత్తికి ప్రయత్నింప వలసినది. పుత్రహీనులు పున్నామ నరకమందు పడి అవస్థలను అనుభవించెదరు. తపో, యజ్ఞ, దాన, ధర్మముల ద్వారా దానినుండి తప్పించుకొను ఉపాయము లేదు. కేవలము పుత్రోత్పత్తి వలననే దాని నుండి విముక్తి లభించును. మీరిరువురికి పర్వత నందిని గిరిజాదేవి స్థనపానము వలన మానుషభావమంతరించినది. ఆ కాత్యాయినీ దేవి పుత్రులు మనుష్యయోని నొందరు. అందువలన మీరు తగిన సుర రమణులను గ్రహించి, పుత్రవంతులై మహాదేవునికి ప్రీతి పాత్రులు కావలసినది."

భేతాళ, భైరవులు నందీశ్వరునికి వందనమిడి "మీ ఆజ్ఞానుసారమే మేము వర్తించెదమని" నుడివిరి. తదుపరి వారిరువురు నంది పలుకులను స్మరించుచూ సంచరించుచుండిరి. అంత ఒకనాడు భైరవుడు హిమాలయ పర్వత శిఖరమున అప్సరాశిరోమణి అయిన ఊర్వశీదేవిని చూచి, మిక్కిలి కామమోహితుడై తన కోరికను తీర్చమని ఆమెను ప్రార్థించెను. దేవ వేశ్య అయిన ఊర్వశి సహితము సంతసిల్లి తత్కార్యమునకు అంగీకరించెను. వారిరువురు కొంతకాలము కామోపభోగములు అనుభవించిరి. తత్ఫలితముగ సూర్య తుల్య పరాక్రముడయిన ఒక పుత్రుడు సద్యోగర్భముగ ఆవిర్భవించెను. ఊర్వశి ఆ కుమారుని అచటనే వదలి తన స్వస్థానమునకు చనెను. ప్రమథగణ ప్రధానుడయిన భైరవుడు తన పుత్రుని గాంచి, మిక్కిలి ఆనందించి, జాతక సంస్కారాదులు గావించి వానికి "సువేశుడు" అని నామకరణము చేసెను. సువేశుడు క్రమముగా పెరిగి సూర్య చంద్రుల వంటి కాంతి సంతరించుకొని విద్యాధరాధిపత్యము నొందెను. ఈ విద్యాధర రాజు సువేశుడు, గంధర్వరాజు ధృతరాష్ట్రుని పుత్రిక అయిన "పరమసుందరి" ని వివాహమాడెను. వారికి "రురువు" అను పుత్రుడు కల్గెను. రురువునకు మేనక యందు "బాహువు" అను పుత్రుడుదయించెను. బాహువునకు "తపనుడు, అంగదుడు, ఈశ్వరుడు, కుముదుడు" అను నలుగురు పుత్రులు కలిగిరి. కుముదుడు కనిష్ఠుడు మరియు పరమసుందరుడు. కుముదుని పుత్రుడు మహాబలి అయిన "దేవసేనుడు". ఈ దేవసేనుడు ఇలకేతెంచి మాంధాత కన్యక అయిన "కేశిని" ని వరించెను. అంత వారిరువురు శివనగరమయిన కాశికా పట్టణమునకేగి దేవదేవుడయిన పరమశివుని ఆరాధించిరి. పశుపతి వారి తపో పూజనములకు సంతుష్టుడై, వారి ఎదుట ప్రత్యక్షమై వరము కోరుకొనవలెను. అంత దేవసేనుడు మూడు వరములు కోరెను. అవి "ప్రభాకరుడు భువిని తన కాంతి చే ప్రకాశించునంత వరకు నా

వంశజులే కాశీ నగర (రాజ్యము) నేలవలెను. నా వంశస్థులందరూ ఎల్లప్పుడూ ప్రసన్న హృదయులై యుండవలెను. అంతేకాక ప్రభూ! మీరు ఎల్లప్పుడూ వారి ఎడల కృపాసింధులై యుండవలెను." శంకరుడు సంతోషించి "వల్లె" యని ఆశీర్వదించెను. అంత దేవసేనుడు శివాను గ్రహము వలన చిరకాలము కాశీ రాజ్యమును పాలించెను. కేశినీ, దేవసేనులకు వరుసగా ఏడుగురు పుత్రులుదయించిరి. వారు "సుమన, వసుదాన, ఋతుధృక్, యవన, కృతి, నీల, వివేక". వీరందరూ శీలవంతులు, సర్వ శాస్త్ర పారంగతులు మరియు వంశవర్ధకులు. కొంత కాలమునకు దేవసేనుడు రాజ్య భారమును తన పుత్రులకు అప్పగించి, తాను కేశిని సహితుడై విద్యాధర లోకమునకేగెను.

తదుపరి రాజపుత్రులందరూ తమ జ్యేష్ఠభ్రాత అయిన సుమనునికి రాజ్యాభిషేకము గావించి, మిగిలిన వారు ఆయనను అనుగమించిరి. సుమనుని పుత్రుడు మహాబలి, శాస్త్రార్ధ విశారదుడయిన "సుమతి". ఆతని మరి ఇద్దరు పుత్రులు "విరూపుడు, సత్య". సుమతికి ఒక కన్యక ఉద్భవించినది. సత్యకుమారుడు "డింఢిముడు". విరూపుని కుమారుడు "గాధి". గాధి పుత్రుడు "మిత్రుడు", మిత్రుని పుత్రుడు "కల్ప". కల్పుని పుత్రుడు "విజయుడు". విజయుడు విజృంభించి ఆ సమయమున పృధివీ జైత్రయాత్ర సలిపి సకల రాజన్య లోకమును పరాజితుల కావించెను. ఈ కల్ప పుత్రుడయిన విజయుడే ఇంద్రుని ఆజ్ఞ మేరకు శత యోజన పరిమాణము గల ఖాండవ వనమును నిర్మించెను. ఈ వనమునే పాండవ మధ్యముడు, సవ్యసాచి, అర్జునుడు అగ్ని దేవుని సంతోషార్ధము దహించెను. ఋషి గణములు "ఓ! తపోధనా! విజయుడు ఏ కారణార్ధము శతయోజన పరిమాణము గల ఖాండవ వనమును నిర్మించెను? దయచేసి తెలుపవలసినది." మార్కండేయుడు చంద్రవంశమందు పరమ సుందరుడు, ప్రతాపవంతుడు, ధీరోదాత్తుడు, అయిన సుదర్శనుడు అను నృపతి ఉదయించెను. ఆయన హిమాలయమునకు సమీపమున గల వనమును నాశము కావించి, అచట సాధారణముగ నివసించుచున్న సింహ, వ్యాఘ్ర, భల్లూకాది మృగములను, తపస్వులను సహితము పారద్రోలి వంద యోజనములు పొడవు, ముప్పది యోజనములు వెడల్పు గల "ఖండవి" అను బహు సుందర నగరమును నిర్మించెను. ఆ నగరము ఎత్తైన అంబర చుంబిత హర్మ్యములతో, లోతైన, వెడల్పయిన కందకములతో కూడి యుండెను. అంతేకాక ఆ నగరము అనేక పుష్ప వాటికలు, వనములతో నిండి, నాగరికులు, అప్సరసలు, వివిధ లోకులతో విలసిల్లు చుండెడిది. అచటి జనులు నిరంతరము ఉత్సవపు ఆనంద డోలికలలో ఓలలాడుచూ, ప్రసన్న హృదయులై, భోగ సంపన్నులై, దేవతలను సహితము తిరస్కరించునట్లు యుండెడివారు. సుదర్శనుడు భూమిని చేరి, హరి ద్వారము నందు గంగను బలవంతముగ ఖండవీ నగరము వైపు మళ్ళించెను. గంగ రాజుచే కావింపబడిన నియమిత మార్గమందు ఖండవి వరకు ప్రవహించి, తిరిగి "సీతా సరిత" యందు కలియును. సుదర్శనుడు పరిశర భూపతులంనందరినీ పరాజితుల గావించి, అనేక ధన రత్న రాశులను ఖాండవికి చేర్చి, దేశమును సుసంపన్నము కావించి సుఖముగ నివసించుచుండెను. అంతేకాక ఆతడు గెలిచిన రాజ్యములందలి ప్రజలను బల పూర్వకముగ ఖాండవీ నగరమునకు బదలాయించి, రణమందు దేవ, గంధర్వుల జయించి, దేవవృక్షము (కల్పతరువు), దేవ రత్నములు (కౌస్తుభము), దేవీ (అప్సరోగణము, దేవతా స్త్రీలను), ఓషధులను సహితము ఖండవీ నగరమునకు చేర్చెను.

సుదర్శనుడు అంతటితో ఆగక సాక్షాత్ విష్ణు భగవానునితో వైరము వహించెను. అప్పటికి సుదర్శనుడు దేవతా, మానవులకు అత్యంత అపకారము కావించుట చే విష్ణుభగవానుడు సుదర్శనుని నిగ్రహించుటకు ఉపాయమాలోచించి, వారణాసీ పతి అయిన విజయుడే ఈ కార్యమునకు సమర్ధుడని నిర్ణయించి, విజయునికి దర్శనమిచ్చి, ఆతనిని సుదర్శనుని పైకి ఉసిగొల్పెను. అంత మహాబలి అయిన విజయుడు చతురంగబల సమేతుడై సుదర్శనుని పై దాడి సల్పెను. మదోన్మత్తుడయిన సుదర్శనుడు సహితము ఏ మాత్రము వెనుకాడక, తన చతురంగ బలములు సమీకరించి విజయుని ఎదుర్కొనెను. తొలుత సుదర్శనుని సేనాపతి, పరాక్రమవంతుడయిన "రమణ్వానుడు" ఒక అక్షౌహిణీ సేనా సహితుడై,

బంగారు రథ మధిరోహించి విజయుని ఆక్రమించదలచెను. కానీ విజయుని సేనాపతి, సమర్ధుడు, శత్రు భయంకరుడు అయిన "సంజయుడు" రమణ్వానుని మధ్యలో ఎదిరించి, పోరాడి, నిలువరించెను. వారిరువురి నడుమ భయంకర తుముల యుద్ధము ఆరంభమయినది. అందు రమణ్వానుడు తొలుత హస్తిని చూచి గర్జించు పంచాస్యము వలె భీకర గర్జనలు కావించుచూ బాణవర్షము కురిపించి, ఇరువది బాణములతో సంజనుని ధనువును ఖండించి వేదించెను. అంత సంజయుడు వేరొక ధనువు ధరించి, నారి సారించి, ముప్పది బాణములతో రమణ్వానుని వేదించి, ఒక భల్ల బాణముతో ఆతని ధనువును ఖండించెను. అంతటితో ఆగక తిరిగి శరవర్షము కురిపించుచూ ఎనిమిది వందల ఏనుగులను, అరువది అయిదు వేల పదాతులను, మూడు వేల అశ్వములను ఒకేసారి అట్టడగించెను. అంత రమణ్వానుడు క్రుద్ధుడై వేరొక ధనువు స్వీకరించి సంజయుని రథసారధి కుత్తుక ఉత్తరించి, నాలుగు సాయకములతో ఆతని హయములను యమపురి కంపి, మరి అయిదు బాణములతో సంజయుని వేదించెను. అంత సంజయుడు చేతిలో గదాయుధము ధరించి, రథము నుండి ఉరికి రమణ్వానుని వైపు పరుగెత్తెను. తనను అతి వేగముగ సమీపించుచున్న సంజయుని రమణ్వానుడు అనేక సాయకములతో నిలువరించి శరవర్షము కురిపించెను. సంజయుడు తన గదను చక్రాయుధము వలె త్రిప్పుచూ, ఆ సాయకముల ఖండించి, అత్యంత లాఘవముతో మిక్కిలి వేగమున ఆ భయంకర గదాయుధమును రమణ్వానునిపై ప్రయోగించెను. ఆ దుర్భర తాకిడికి రమణ్వానుడడు కుప్పకూలెను. అత్యంత గాయపడి రథముపై కూలిన రమణ్వానుని పై లంఘించి సంజయుడు ప్రత్యర్ధి సేనానాయకుని సునాయాసముగ సంహరించెను. వనమందు తీవ్రమయిన మెరుపు చే ఖండింపబడిన సాలవృక్షము వలె సంజయుని గదా ప్రహారము చే మహీవీరుడయిన రమణ్వానుడు నేలపై బడెను.

రమణ్వానుని మృతిని కనులారా కాంచిన సుదర్శనుడు తీవ్రమయిన క్రోధ, శోకతప్తుడై, ప్రజ్వరిల్లుచున్న అగ్నివలె శోభించుచూ వ్యాఘ్ర హస్తి చర్మాలంకృతము, స్వర్ణ రచితము, యవన అశ్వయుతము, సింహధ్వజ శోభితము అయిన అదరము నధిరోహించి, అతి వేగముగ సంజయుని వైపు పయనించెను. ఆ సమయమున సుదర్శనుడు తన తీవ్ర బాణ ఘాతములచే సేనాగ్రభాగమునున్న ఒక అక్షౌహిణీ సేనను సింహము చిరుమృగముల వేటాడినట్లు సంహరించెను. సూర్యుడు అంధకారమును పటాపంచలు గావించునట్లు రెండు క్రోసుల విస్తీర్ణమున విస్తరిల్లిన ఒక అక్షౌహిణీ సేనను సంపూర్ణముగ విదీర్ణము గావించి, సంజయుని వద్ద కేతెంచి, ఆరు బాణములతో ఆయనను వేదించి, ఒక తీవ్ర సాయకము చే ఆతని ధ్వజమును ఖండించెను. సంజయుడు సహితము ఇరువది సాయకములతో సుదర్శనుని హృదయము గాయపరచి, ఒక తీవ్ర సాయకమును లలాటమందు నాటి, భల్ల బాణముతో ఆయన ధనువును ఖండించి, తదుపరి పది సాయకములతో ఆయన సారధిని హతమార్చెను. అంత సుదర్శనుడు వేరొక ధనువు ధరించి సంజయుని బాణవర్షమందు ముంచెను. వారిరువురి నడుమ పోరు తీవ్రమై ఇంద్ర బలి చక్రవర్తుల పోరు తలపించెను. అంత సుదర్శనుడు ఒక భల్ల బాణమునుపయోగించి సంజయుని ధనువును ఖండించి, సారధిని హతమార్చెను. అంత శత్రుంజయుడయిన సంజయుడు వేరొక ధనువు స్వీకరించి, స్వయముగ తన రథసారధ్యము తాను సలుపుచూ, సుదర్శనుని బాణవర్షమందు ముంచి, వేదించి ఆయన ధనువును తిరిగి ఖండించెను. అంత సుదర్శనుడు తన ధనుష్పాండిత్యమును ప్రకటించి, ప్రత్యర్ధి సాయకములత్రుంచి లాఘవముగ సంజయుని హయములను యమపురికంపెను. అంత సంజయుడు కుపితుడై డాల్కత్తులను ధరించి, అదరము నుండి దుమికి సుదర్శనుని పైకి పరుగెత్తెను. అంత సుదర్శనుడు అర్ధచంద్రాకారపు బాణముతో సంజయుని ఖడ్గమును రెండు ముక్కలు గావించి, ఒక భల్ల బాణముతో ఆతని డాలును సహితము తునియలు గావించెను. అంత సంజయుడు కుప్పించి ఎగిరి సుదర్శనుని రథ సారధిపై దూకి ఆతని క్రిందకు పడద్రోసెను. అంత సుదర్శనుడు తనకు అత్యంత సమీపమునున్న సంజయుని తన కరవాలము దూసి ఆతని శిరమును ఖండించెను. ఆ సమయమున

సంజయుడు ధరణిపై బడి వనమందు ఖండపరశువు చే నరుకబడిన పుష్పసహిత సాలవృక్షము వలె శోభిల్లెను. ఈ విధముగ సేనాపతులిరువురు తమ ప్రభుభక్తిని ప్రకటించి వీరస్వర్గము నలంకరించిరి.

సంజయుడు పంచత్వము నొందిన వెంటనే విజయుడు క్రోధమూర్ఛితుడై భూనభోంతరాళములు ప్రతిధ్వనించు మహాశంఖమును పూరించెను. ఆయన అదరము స్వర్ణ మయమై, వ్యాఘ్రచర్మ సంకులితమై, దివ్యమై యుండి అద్దానిపై అర్ధయోజనము పొడవుగల వృషభకేతనము రెపరెపలాడుచుండెను. ఆయన ఆ దివ్య రథమునధిరోహించి నలుదిక్కులా బాణవర్షము కురిపించుచూ దగ్గరకు వచ్చి సుదర్శమని ఎదుర్కొనెను. అంత శత్రుభయంకరుడయిన విజయుడు "నిలు నిలు" మని నినాదము చేయుచూ వచ్చి, సుదర్శనునిపై బాణ వర్షము కురిపించెను. సుదర్శనుడు సహితము వెనుకంజ వేయక మదపు టేనుగు వలె నినాదము చేయుచూ విజయుని పై తీవ్ర, తీక్షణ సాయకములు సంధించి, విడచి విజయుని ధనువును ఖండించి, ఆయన పక్కటెముకలపై తీవ్ర సాయకములు దింపి, బాధించి సింహనాదమొనర్చెను. విజయుడు వేరొక ధనువు గ్రహించి గ్రద్ద రెక్కలమర్చిన తీవ్ర సాయకములు సంధించి సుదర్శనుని హృదయమును భేదించి వేదించెను. తదుపరి విజయుడు పెదవులు క్రోధముతో అదురుచుండగా మిసమిస లాడుచున్న నాగకన్యక వలె మెరయుచున్నది, స్వర్ణ దండము కలిగినది, వాడి అయిన మొనకలది, తైలమునందు మునిగి యున్న ఒకానొక దివ్యశక్తి ఆయుధమును చేతబట్టి దానిని సుదర్శనుని వైపు బలముగ విసరెను. సుదర్శనుడు ఆ శక్తి ప్రహారము చే విచలితుడై, అధోముఖుడై, రథపు వెనుక భాగమున పడి మూర్ఛిల్లెను. ప్రత్యర్ధి మూర్ఛిల్లిన వెంటనే విజయుడు చెలరేగి ఆతని పార్శ్యమున్న సేనను క్షణముతో అట్టడిగించి సుదర్శనుని పదివేల రథ, గజములను, ఇరువది అయిదు వేల వేగవతి పోగల అశ్వసంపదను, రెండు లక్షల పదాతులను అతి స్వల్ప సమయముతో యమపురికి అతిధుల గావించెను. ఇంతలో సుదర్శనుడు మూర్ఛనుండి తేరుకుని, వేరొకధనువు ధరించి తిరిగి శరవర్షము కురిపించుచూ, ఒక భల్ల బాణము సంధించి విడచి, విజయుని రథసారధిని, హయములను సంహరించి, విజయుని హృదయమందు పది గ్రద్ద రెక్కల సాయకములను ప్రహరించి, వేదించి సింహగర్జన కావించెను. అంత రథము, తన ధనువు శిధిలమగుట గని విజయుడు ఒక భయంకర గదాదండము దాల్చి సుదర్శనుని పైకి పరుగెత్తెను. విజయుడు తన వద్దకు పరుగెత్తుట గాంచిన సుదర్శనుడు, వర్ష ఋతువు నందు పర్వత సీమపై విజృంభించి పడు వర్షపు చినుకుల వలె విజయునిపై నిరంతర బాణవర్షము కురిపించెను. విజయుడు ఆ తీవ్ర సాయకములు తప్పించుకొని, సుదర్శనుని సమీపించి, ఉగ్రగదాదండముతో ఆతని ప్రహరించెను. ఉన్నత పర్వత శిఖరము వజ్రాయుధపు ప్రహరణము చే విదీర్ణమగునటుల విజయుని గదాఘాతము చే సుదర్శనుని పంచ ప్రాణములు పంచత్వము నొందెను.

సుదర్శనుని దుర్మరణమును కనులారా గాంచిన ఆతని సేన భయభీతులై నలు దిక్కులకు పరుగులు తీసిరి. ఈ విధముగ సుదర్శనునిపై విజయము సాధించి, విజయుడు ఖండవీ నగరము ప్రవేశించి పర్వత రాశుల వంటి బంగారము, రత్నములు, ఇతర ఆభరణములు కాంచెను. అంతేకాక వికసించిన పద్మములు, హంస కారండవములు కుహు కుహు నాదములచే నిండిన శుద్ధ సరోవరములు, పర్వతముల వంటి స్వర్ణ రాశులు, ఘుంకారము చేయుచున్న తుమ్మెదల చే ఆశ్వాదింపబడుచున్న పుష్పములు గల దేవతా వృక్షములు, అంబర చుంబిత శ్వేత హర్మ్యములు, కైలాస పర్వత సదృశములయిన గజరాజములు, ప్రతి గృహము నుండి వెలివడుచున్న పద్మ సుగంధపు వాసనలు, చూచి విజయుడు "అహో! ఇయ్యది భువికవతరించిన అమరావతి వలె యున్నది" అని మది తలచెను. ఈ విధముగ విస్మితుడగుచున్న విజయుని వద్దకు దేవరాజు ఇంద్రుడేతెంచి, స్వాంతన నిచ్చి, మృదు మధురముగ ఇట్లు పలికెను "ఓ! నృపశ్రేష్ఠా! మహారాజా! తొలుత ఈ ప్రదేశము దేవ, గంధర్వ, యక్ష, మునిగణములకు ఆలవాలమయిన సుందరవనము. కానీ సుదర్శనుడు నాకు కడు అప్రియమొనర్చి, వారి నందరినీ ఇచటి నుండి బల పూర్వకముగ బయటకు గెంటి ఈ

"ఖాండవీ నగరము" ను నిర్మించెను. అందువలన ఓ! రాజా! నీవు పున: ఈ ప్రదేశమును వనముగ మార్చుము. ఈ ప్రదేశమున నేను నా మిత్రుడయిన తక్షకుని తో విహరించెదను. నీ వలన ఈ ప్రదేశము సుందరవనమై, దేవ, గంధర్వ, యక్ష, కిన్నెరులకాలవాలమై, మునులకు అతులిత తపోస్థానమై ఒప్పును". అంత విజయుడు దేవేంద్రుని పలుకులను గౌరవించి ఆ నగరమును తిరిగి సుందర వనముగ మార్చెను. అచటి జనులనుద్దేశించి "పురజనులారా! మీరందరూ మీ ఇచ్ఛవచ్చిన చోటికి పోవచ్చును. లేకున్న నా రాజ్యమయిన వారణాసీ పురమునకు రావలసినది." అంత కొంతమంది జనులు తమ తమ పూర్వ స్థానములకు, మిగిలిన వారు విజయుని అనుసరించి వారణాసీ పురమునకు చనిరి.

విజయుడు సుదర్శనుని చే గొనిరాబడిన దేవ వృక్షములు, దేవరత్న మణి, స్వర్ణ రాశులను తిరిగి దేవతలకు సమర్పించి వారిని ప్రసన్నుల కావించెను. మిగిలిన ధన రాశులను అశ్వ గజాది వాహనములపై, నౌకలపైకి ఎక్కించి వారణాసీ పురమునకు చేర్చెను. వంద యోజనముల పొడవు, ముప్పది యోజనముల వెడల్పు గల ఖాండవీ నగరమును శీఘ్రముగ విజయుడు వనముగ మార్చెను. ఇంద్రుని సమ్మతిచే చాలాకాలము తక్షకుడు తన గణముల సహితుడై అచట సుఖముగ యుండెను. వారి వలన ఆ వనము నిర్జనమయ్యెను. తిరిగి దేవ గంధర్వ అప్సరసలు అచట క్రీడించుట నారంభించిరి. పద్దెనిమిదవ మహా యుగమున ద్వాపరము యొక్క అంతిమమున అగ్ని దేవుడు బ్రాహ్మణరూపము ధరించి అర్జునుని అభ్యర్థించెను. బ్రాహ్మణునికి భిక్ష ప్రసాదింతుమని తెలిపిన మీదట ఆతడు తన నిజరూపమును వ్యక్త మొనర్చి ఈ విధముగ పలికెను "ఓ! పాండుపుత్రా! అర్జునా! నేను అగ్నిదేవుడను. నిరంతర యజ్ఞభక్షణ చే నాకు అజీర్తి గలిగినది. నాకు రోగ నివారణము కావింపవలసినది. ఓ! శ్వేతవాహనా! పశు, పక్షి, రాక్షసయుతమయిన ఈ ఖాండవవనము నాకు భోజనముగ ప్రసాదించిన ఎడల నా రోగము శమించును. పూర్వము విజయుడను మహారాజు ఖండవీ నగరమును నష్టమొనర్చి ఈ పురమును ఖాండవ వనము కావించెను. దేవతలు ఈ వనమును నాకే నిర్ధారించిరి. కానీ దేవరాజయిన ఇంద్రునితో విరోధము కారణమున నేను ఆ వనమును భక్షింపజాలకున్నాను. ఓ! మహాభాగా! అందువలన మీరు నాకు ఉపకారమొనర్చి నేను ఆ వనమును భుజించునట్లు చేయవలసినది." సవ్యసాచి దేవకీ పుత్రుడయిన శ్రీకృష్ణుని రక్షణలో ఆ పలుకులాలకించి ప్రాణుల సహితముగ ఖాండవవన దహనము కావించెను. అర్జునుని కృప చే అగ్ని స్వస్థుడై, ప్రసన్నుడై, అర్జునునికి గాండీవము, అక్షయ తూణీరములు, దివ్యరూపులయిన నాలుగు అశ్వములు పూన్చినది, హనుమంతుడు అధిష్ఠించిన కపిధ్వజాంకితమయిన మహారథము, తీక్షణమయిన ఖడ్గము, త్రిశూలము ప్రసాదించెను. వీటన్నిటి సహాయము తోనే కిరీటి శత్రుంజయుడయ్యెను.

ఈ విధముగ సుందరుడు, మహాయశశ్వి అయిన విజయుడు భైరవ వంశము నందుత్పన్నమై ఖాండవ వనమునకు కారకుడయ్యెను. విజయునకు "ద్యుతిమాన్, సౌమ్యదర్శి, భూరి, ప్రద్యుమ్న, క్రతు, తుండ, విరూపాక్ష, విక్రాంత, ధనంజయ, ప్రహర్ష, ప్రబల, కేతు, ఉపరిచర" అను పదముగ్గురు సంతతి కల్గిరి. ఇందు కనిష్ఠుడయిన ఉపరిచరుడు వీరుడు. ఆయన మహారాజై ప్రాచీన కాలమందు వారణాసీ పురమున ఒక లక్ష యజ్ఞము లాచరించెను. ఉపరిచర మహారాజు కావించిన యజ్ఞముల వంటి యజ్ఞములాచరించుట నభూతో నభవిష్యతి. వీరందరి సంతాన పరంపర చే మూడు లోకములు నిండినవి. ఓ! మునులారా! భైరవుని సంతానము గూర్చి మీకు వివరించితిని. ఈ కథనము వినినంత మాత్రమున పుత్రహీనులు పుత్రవంతులగుదురు. వారి యందు అపుత్రకులన్న భావము యుండదు. ఈ విజయ మహారాజు పవిత్ర చరిత్రను ఎవరు తెలిపెదరో వారు ఎన్నడు పరాభవము నొందరు. కేవలము విజయ పరంపర నొందెదరు. ఎవరు ఈ ఉత్తమ వర్ణనమును ఏకాగ్రతతో వినెదరో వారికి ఎన్నటికీ వంశనాశనము జరుగదు.

**(శ్రీ కాళికా పురాణమందలి భేతాళ భైరవ వంశ వర్ణనమను ఎనభై తొమ్మిదవ అధ్యాయము సమాప్తము)**

# తొంభైయవ అధ్యాయము

**(భేతాళ వంశ వర్ణనము; గ్రంథ సమాప్తి)**

మార్కండేయుడు "ముని గణములారా! ఇపుడు భేతాళుని వంశ వర్ణనము కావించెదను. దీనిని వినిన తక్షణము మానవులు పాప విముక్తులగుదురు. దక్ష ప్రజాపతికి "సురభి" అను కన్యక కలదు. ఈ సాధ్వి సర్వ లోకోపకారిణి మరియు గోవులకు తల్లి. ఆమె యందు కశ్యప ప్రజాపతి "రోహిణి" అను కన్యకనుత్పన్నము కావించెను. ఈ రోహిణి మానవులకు సర్వ కామ ప్రదాత. ఈ రోహిణికి పరమ తపస్వి అయిన శున:శ్వేపుని వలన మిక్కిలి శ్వేతమేఘచ్ఛాయా శరీరిణి, చతుర్వేదములు చతుర్పాదములుగ గలిగి, స్థనముల యందు ధర్మార్ధ కామములను స్రవించు కామధేనువను కన్య ఉత్పన్నమయ్యెను. ఈ కామధేనువు కాలక్రమమున పెరిగి పెద్దదై, స్వర్ణ శరీరయై యవ్వనావస్థకు చేరుకొనెను. ఆ సమయమున సర్వాంగ సుందరి అయిన కామధేనువు మేరు పర్వత చరియల యందు సంచరించు చుండగా భేతాళుడు ఆమెను చూచి మోహించెను. స్వయముగ శివపుత్రుడయిన భేతాళుని కాముకతను గ్రహించిన కామధేనువు పశుధర్మము ప్రకారము ఆ శివపుత్రునితో రమించెను. వారిరువురు ఒక్కరి యందలి ప్రీతితో ఒకరు రమించి, కామానుభవమునొంది, మిక్కిలి ప్రసన్నత తో ఆనంద డోలికలయందు ఊగిసలాడిరి. అంత ఆ ప్రక్రియ చే తదుపరి కామధేనువు గర్భిణియై, కాలక్రమమున ఒక వృషభమునకు జన్మనిచ్చెను. ఈ వృషభము అతి శీఘ్రకాలమున ఒక మహా వృషభముగ రూపాంతరమొందెను. వీపున గొప్పమూపురము, మెలితిరిగిన సుందరమయిన శృంగములు, చంచలమయిన కర్ణములు, రోమయుక్తమయిన బలమయిన తోక యుండి శ్వేత పర్వతము వలె శోభిల్లుచుండెను.

భేతాళుడు ఈ వృషభమునకు "శృంగ" మని నామకరణము చేసెను. ఈ శృంగుడు గొప్ప జ్ఞాని. ఆతడు మహాదేవుని భక్తుడై శివుని కొరకు తీవ్రతపమాచరించెను. శివుడు ప్రసన్నుడై ఆతని ఎదుట ప్రత్యక్షమై దేవతా శరీరమును, సుందరత, బలము, దీర్ఘాయువు, మరియు పృధివీధారణ కావించు శక్తి ప్రసాదించి స్వయముగ తన వాహనము కావించుకొనెను. ఈ శృంగమను మహా వృషభమే శివుని ధ్వజమందు కూడా విరాజమానుడయ్యెను. ఈ శృంగుడు అధిక సమయము మహాదేవుడయిన శివుని ధ్యానమందు గడిపి, అప్పుడప్పుడు వరుణుని గృహమునకు చని, అచట గల సురభి యొక్క రూప, యవ్వన సంపన్నలయిన కన్యలతో సురత క్రీడలు సలుపువాడు. ఈ విధముగ వరుణుని ఇంట అనేక గోరూపిణిలు ఉత్పన్నమై, వారి సంతానము, ప్రసంతానము చే గోవులు సంసారము నందు వ్యాప్తినొంది యజ్ఞక్రియలకు ఆదిమూలమయ్యెను. ఎందువలననగా ఘృతము (నెయ్యి) చేతనే దేవతలు సంతుష్టినొందెదరు. నేయి వలననే యజ్ఞాచరణము సంభవించును. ఈ సమస్త స్థావర జంగమాత్మక సంసారమంతయు యజ్ఞాధీనము. ఈ యజ్ఞమునకాధారమయిన ఘృతము గోవుల అధీనము. అందువలన సర్వము అననేల, సకల విశ్వము గోవు పైననే ఆధారపడి యున్నది.

అందువలన ఋషిసత్తములారా! ఈ ఆవులు భేతాళ వంశజులు, మరియు సర్వులకు ప్రియులు. ఎవరు ఈ భేతాళ వంశ వృత్తాంతము గూర్చి నిత్యము వినెదరో వారు అత్యంత సుఖము నొంది బలము నొందెదరు. వారి గోధనము, వైభవము ఎన్నటికీ నాశనము కాదు. భూత, ప్రేత, పిశాచాదులు వారి దరికి రాకుండా సాక్షాత్ భేతాళుడు వారిని స్వయముగ కాపాడును. ఈ విధముగ కాళి శంకరుని మోహింపజేయుట, ఆమె ఆవిర్భావము, ఆ తల్లి శివుని శరీరార్ధభాగము గ్రహించుట అను విషయములన్నియు సవివరముగ మీకు విశదీకరించితిని. "కాళికాయై నమస్తుభ్యం" కాళికాదేవికి నమస్కారము అనువ్యక్తికి ముక్తి కరతలామలకము. అంతేకాక ధర్మార్ధ కామములు వారి వంశము నందు ఎల్లప్పుడూ విలసిల్లును.

"కాళిక" అను ఈ పవిత్ర పురాణము మంత్ర, తంత్ర యుక్తము, శుద్ధము, మరియు జ్ఞానప్రదము. జనుల కామనల యొక్క పూర్ణత యందు సర్వ శ్రేష్ఠము. ఇయ్యది లోకమునందు మరియు వేదము నందు సహితము పరమ గోపనీయము. దేవ, గంధర్వ, సిద్ధులు సహితము ఈ పురాణము వినుటకు ఎల్లప్పుడూ ఉత్సుకత తో యుందురు. మహాత్ముడయిన వశిష్ఠ మహర్షి ఈ ఉత్తమ, అమృత తుల్య పురాణమును నా ద్వారా విని, పఠించెను. కానీ ఆ వశిష్ఠముని ద్వారా ఇయ్యది సమస్త దేవతా నిలయమయిన కామరూపమునందు గుప్తముగ దాచబడినది. అద్దానినే నేను మీ నిమిత్తమై ప్రకటనమొనర్చి ప్రవచించితిని. మీకు కూడ ఈ పవిత్ర పురాణమును శఠులు, చంచలచిత్తులు, నాస్తికులు, తమయందు నియంత్రణ లేనివారు, మరియు శ్రద్ధా భక్తి హీనులకు ఉపదేశింపరాదు.

ఈ కాళికా పురాణమును ఒక్కసారి పఠించిననూ, ఆ జీవులు తమ సమస్త కామనలను ప్రాప్తించి, మరణానంతరము అమరత్వము నొందెదరు. ఎవని ఇంటి యందు ఈ పవిత్ర పురాణము లిఖిత రూపమున యుండునో, వానికి విఘ్నములు ప్రాప్తించవు. శ్రేష్ఠ ద్విజులారా! సర్వ శ్రేష్ఠము, పరమ గోపనీయమైన ఈ తంత్రమును ఎవరు ప్రతి దినము పఠించెదరో, వారికి సర్వ వేదాధ్యయన ఫలము లభించును. వానికంటె కృతకృత్యులు వేరొకరు యుండరు. అంతేకాక వారు జగత్తు నందు బల, వీర్య, దీర్ఘాయు సంపన్నులై సర్వ సుఖములను పొందెదరు.

ఎవరు ఈశ్వరుడో, ఎవరు స్థితి, ప్రళయములు కావించుచున్నారో, ఎవరు జగత్తు యొక్క మిధ్య, అమిధ్య స్వరూపమో, యదార్ధమునకు ఈ జగత్తు సర్వము ఎవని స్వరూపమో, ఆ పరమాత్మకు నమస్కరించుచున్నాను. ఎవరు ప్రధాన పురుషుడో, ఎవరు యోగిజనుల హృదయమందు స్థితిగతుడై యుండునో, ఎవరు పురాణములన్నింటికీ అధిపతియో, ఆ విష్ణు భగవానుడు మీ యందు ప్రసన్నుడై కళ్యాణ కారకుడగు గాక! ఎవరు కారణములకు కారణమో, ఉగ్రుడు, పురాణ పురుషుడో, సనాతనుడు, నిరంతరుడు, అవినాశి మరియు సర్వులకు ప్రభువో, సర్వ శ్రేష్ఠుడు, పురాణములకు కర్త మరియు పురాణముల ద్వారా తెలియబడునో, ఆ పరమ పురుషునకు ఈ పురాణ సమాప్తి యందు నమస్కరించుచున్నాను. ఈ విధముగ ఎవరు ఈ సమస్త జగత్తును ధరించుచున్నదో, ఎవరు లక్ష్మీరూపమున మధుసూదనుడయిన విష్ణువును మోహింపజేయుచున్నదో, ఎవరు కాళి రూపమున శివునితో రమించుచున్నదో, ఆ యోగమాయ మీ సర్వులకు శుభము, మరియు వైభవములు ప్రసాదించుగాక.

**(శ్రీ కాళికా పురాణమందలి భేతాళ వంశ వర్ణనము మరియు గ్రంధ సమాప్తి అను తొంభైయవ అధ్యాయము సమాప్తము)**



# వర్ణ కవచము

అస్య వైష్ణవీ తంత్ర కవచస్య నారద ఋషి అనుష్టుప్ చంద:
కాత్యాయినీ దేవతా సర్వ కామార్ధ సాధనే వినియోగ: ॥

అ: పాతు పూర్వ కాష్ఠా యామాగ్నేయ్యాం పాతు క: సదా
పాతు చో యమ కాష్ఠాయాం దో నైఋత్యాం చ సర్వదా ॥

మాం పాతు తో సౌ పాశ్చాత్యే శక్తిర్వ్యాయర్వాదిగ్గతా
య: పాతుమాం చోత్తరస్యా మైశాన్యాం యస్ధథావతు ॥

మూర్ధ్ని రక్షతు మా సో సౌ చాహైమాం దక్షిణేతు క:
మాం వామచాహౌ చ: పాతు హృది టో మాం సదావతు ॥

త: పాతు కంఠదేశే మాం కట్యో శక్తి స్ధథావతు
య: పాతు దక్షిణేపాదే షోమాం వామపాదే తథా ॥





# యోగినీ కవచము

శైలపుత్రీ తు పూర్వస్య మాగ్నేయ్యాం పాతు చండికా
చంద్ర ఘంటా పాతుయామ్యాం మమభీతి వివర్ధనీ ॥

నైఋత్యేత్వథ కూష్మాండీ పాతుమాం జగతాం ప్రసూ:
స్కంధమాతా పశ్చిమాయాం మాం రక్షతి సదైవహి ॥

కాత్యాయినీ మాం వాయువ్యే పాతు లోకేశ్వరీ సదా
కాళరాత్రీ తు కౌబేర్యాం సదా రక్షతు మాం స్వయం ॥

మహాగౌరీ తథేశాన్యాం సతతం పాతు పావనీ ॥





# దేవౌఘ కవచము

నేత్రయోర్వాసుదేవో మాం పాతు నిత్యం సనాతన:
బ్రహ్మ మాం పాతు వదనే పద్మయోనిర్నయోనిజ: ॥

నాసాభాగే రక్షతుమాం సర్వదా చంద్రశేఖర:
గజవక్త్రం స్థనయుగ్మే పాతునిత్యం హరాత్మజ: ॥

వామ దక్షిణ పాణ్యోర్మాం నిత్యం పాతు దివాకర:
మహామాయా స్వయం నాభౌ మాం పాతు పరమేశ్వరీ ॥

మహాలక్ష్మి: పాతు గుహ్యే జానునేశ్చ సరస్వతీ





# దేవీ కవచము

మహామాయా పూర్ణభాగే నిత్యం రక్షతు మాం శుభా
అగ్నిజ్వాలా తథాగ్నేయ్యాం పాయిన్నిత్యం వారాసినీ ॥

రుద్రాణీ పాతుమాం యామ్యాం నైఋత్యాం చండనాయికా
ఉగ్రచండా పశ్చిమాయాం పాతునిత్యం మహేశ్వరీ ॥

ప్రచండా పాతు వాయువ్యే కౌబేర్యాం ఘోరరూపిణీ
ఈశ్వరీచ తథౌశాన్యాం పాతు నిత్యం సనాతనీ ॥

ఊర్ధ్వం పాతు మహామాయా పాత్వధ: పరమేశ్వరీ
అగ్రత: పాతు మాముగ్రా పృష్ఠతో వైష్ణవీ తథా ॥

బ్రహ్మాణీ దక్షిణే పార్శ్వే నిత్యం రక్షతు శోభనా
మహేశ్వరీ వామపార్శ్వే నిత్యం పాయాద్ వృషధ్వజా ॥

కౌమారీ పర్వతే పాతు వారాహీ సలిలేచ మాం
నారశింహీ దంష్ట్రిభయే పాతుమాం విపినేషు చ ॥

ఐంద్రీమాం పాతుచాకాశే తథా సర్వ జలేస్థలే
హా పాతుమాం తథౌవోర్వోర్మాయా రక్షతు జంఘయో: ॥





సర్వేంద్రియాణి య:పాతు రోమకూపేషు సర్వదా
త్వచిమాం వై సదా పాతుమాం శంభు పాతు సర్వదా ॥

నఖదంతకరోష్ఠాదౌ రాం మాం పాతు సదైవహి
దేవాది: పాతుమాం వస్త్రె దేవాంత: స్థన కక్షయో:
యేతదాదౌ తు య: సేతుర్బాహ్యే మాం పాతు దేహత: ॥





# అభేద్య కవచము

ఆజ్ఞా చక్రే సుషుమ్నాయాం షట్చక్రే హృది సంధిషు
ఆది షోడశ చక్రేచ లలాటాకాశ ఏవచ

వైష్ణవీ తంత్ర మంత్రోమాం నిత్యం రక్షంశ్చ తిష్ఠతు
కర్ణ నాడీషు సర్వాశు పార్శ్వ కక్ష శిఖాసుచ

రుధిరస్నాయు మజ్జాసు మస్తిష్కేషు చ సర్వసు
ద్వితీయాష్టాక్షరో: మంత్ర: కవచం పాతు సర్వత:

రేతోవాయౌ నాభిరంధ్రే పృష్ఠ సంధిషు సర్వత:
షడక్షర స్తుతీయోయం మంత్రోమాం పాతు సర్వదా

నాసారంధ్రే మహామాయా కంఠరంధ్రేతు వైష్ణవీ
సర్వ సంధిషుమాం పాతు దుర్గా దుర్గార్తిహారిణీ

శ్రోత్రయోహ్రూం షడిత్యేవం నిత్యం రక్షతు కాళికా
నేత్రబీజ త్రయం నేత్రే సదాతిష్ఠతు రక్షితుం

ఓం ఐం హ్రీం హ్రౌం నాసికాయాం రక్షంతీ చాస్తు చండికా
ఓం హ్రీం హూం మాం సదా తారా జిహ్వా మూలేతు తిష్ఠతు





హృది తిష్ఠతుమే సేతు జ్ఞానం రక్షితు ముత్తమం
ఓం క్షౌం ఫట్ చ మహామాయా పాతుమాం సర్వత: సదా

ఓం యుం స: ప్రాణాన్ కౌశికీ మాం ప్రాణాన్ రక్షతు రక్షికా
ప్రీం హూం సౌం భర్గదయితా దేహ శూన్యేషు పాతుమాం

ఓం నమ: సదా శైలపుత్రీ సర్వాన్ రోగాన్ ప్రమృజ్యతాం
ఓం ప్రోం స: స్పేం క్ష: ఫం స్త్రాయ సింహవ్యాఘ్ర భయద్రణాత్

శివదూతీ పాతు నిత్యప్రీం సర్వాస్త్రేషు తిష్ఠతు
ఓం ప్రీం ప్రీం సశ్చండఘంటా కర్ణఛిద్రేషు పాతుమాం

ఓం క్రీంస: కామేశ్వరీ కామనాభి తిష్ఠతు రక్షతు
ఓం ఆం హూం ఫడుగ్రచండా రిపూన్ విఘ్నాన్ విమర్దతాం

ఓం అంశూలాత్ పాతు నిత్యం వైష్ణవీ జగదీశ్వరీ
ఓం కం బ్రహ్మాణీ పాతు చక్రాత్ చం రుద్రాణీతు శక్తిత:

ఓం టం కౌమారీ పాతు వజ్రాత్ తం వారాహీతు కాండత:
ఓం పం పాతు నారశింహీ మాం క్రవ్యాదేభ్యాస్థథాస్త్రత:

శస్త్రాస్త్రోభ్య: సమస్తేభ్యో యంత్రేభ్యో నిష్ఠ మంత్రత:
చండికా మాం సదాపాతు యం సం దేవ్యై నమోనమ:

విశ్వాస ఘూతకేభ్యో మామైంద్రీ రక్షతు మన్మన:
నమో మహామాయాయై ఓం వైష్ణవ్యై నమోనమ: రక్షమాం సర్వభూతేభ్య:
సర్వత్ర పరమేశ్వరీ ॥



# అష్టాక్షర కవచము

ఆధారే వాయుమార్గే హృది కమలదళే చంద్రవత్ స్మేర సూర్యే
వస్తౌ వాహ్నౌ సమిద్ధే విశతు వరదయా మంత్ర మష్టాక్షరంతత్
యద్బ్రహ్మా మూర్ధ్ని ధత్తే హరి రవతి గళే చంద్రచూడో హృదిస్థం
తాం మాం పాతు ప్రధానం నిఖిల మతిశయం పద్మగర్భాభబీజం ॥.

ఆద్యాశేషా: స్వరౌఘైర్మమయవలవరైర స్వరేణాపి యుక్తై:
సునాస్వరా విసర్గై హరిహర విదితం యస్తహస్రం చసాష్టం
మంత్రాణాం సేతుబంధం నివసతి సతతం వైష్ణవీ తంత్ర మంత్రే
తన్మాంపాతుత్ పవిత్రం పరమ పరమజం భూతల వ్యోమభాగే
అంగాన్యాష్టై తథాష్టౌ వసవఇహ తద్వైవాష్టమూర్తిర్దళాని
ప్రోక్తాన్యాష్టౌ దథాష్టౌ మధుమతి రచితా: సిద్ధయోష్టౌ తథైవ
అష్టావష్టాష్ట సంఖ్యా జగతి రతికళా: క్షిప్రకాష్ఠాంగ యోగా
మయ్యష్ట వక్షరాణి క్షరతు నహిగణో యద్ ధ్రుదోయస్త్వమూషాం

# కామాక్షీ కవచము

ఓం కామాఖ్యా కవచస్య ఋషిర్బృహస్పతి: స్మృత:
దేవీ కామేశ్వరీ తస్య అనుష్టుప్ చంద ఇష్యతే వినియోగ: సర్వసిద్ధౌ తంచ శృణ్వంతు దేవతా:

శిర: కామేశ్వరీ దేవీ కామాఖ్యా చక్షుసీమమ
శారదా కర్ణయుగళం త్రిపురావదనం తథా
కంఠేపాతు మహామాయా హృది కామేశ్వరీ పున:
కామాఖ్యా జఠరే పాతు శారదా మాంతు నాభిత: ॥

త్రిపురా పార్శ్వయో: పాతుమహామాయాతు మేహనే
గుదే కామేశ్వరీ పాతు కామాఖ్యోరుద్వఏతుమాం
జానునో శారదాపాతు త్రిపురా పాతు జంఘయో
మహామాయా పాదయుగే నిత్యం రక్షతు కామదా ॥

కేశే కోటీశ్వరీ పాతు నాసాయాం పాతుదీర్ఘికా
భైరవీ దంత సంఘాతే మాతంగవతు చాంగయే
బాహ్వోర్మాం లలితా పాతు పాణ్యోస్తు వనవాసినీ
వింధ్య వాసిన్యంగులిషు శ్రీకామా నఖ కోటిషు ॥

రోమకూపేషు సర్వేషు గుప్తకామాసదావతు
పాదాంగులి పార్ష్ణిభాగే పాతుమాం భువనేశ్వరీ
జిహ్వాయాం పాతుమాం సేతు: క: కంఠాభ్యాంతరేవతు
ల: పాతు చాంతరే వక్ష ఇ: పాతు జఠరాంతరే ॥



సమీందు పాతుమాం వస్త్రావిందు బిందూంతరేవతు
తకారస్త్వచి మాంపాతు రకారోస్థిషు సర్వదా
లకార: సర్వనాడీషు ఈ కార: సర్వసంధిషు
చంద్ర: స్నాయుషు మాంపాతు విందు మజ్జాసు సంతతమ్ ॥

పూర్వస్యాందిశి చాగ్నేయ్యాం దక్షిణే నైఋతే తథా
వారుణే చైవ వాయువ్యాం కౌబేరే హర మందిరే
అకారధ్యాస్తు వైష్ణవ్యా అష్టోవర్ణాస్థ మంత్రగా:
పాంతు తిష్ఠంతు సతతం సమృద్భవ వివృద్ధయే ॥

ఊదద్వార్ధ: పాతు సతతం మాం తుం సేతుద్వయం సదా
నవాక్షరాణి మంత్రేషు శారదా మంత్ర గోచరే
నవస్వరంతు మాం నిత్యం నాసాదిషు సమంతత:
వాతపిత్త కపేభ్యస్తు త్రిపురాయాస్తు త్ర్యక్షరమ్ ॥

నిత్యం రక్షతు భూతేభ్య పిశాచేభ్యస్త దైవచ
తస్తేతూ సతతం క్రవ్యాదభ్యో మాన్నివారికౌ
నమ: కామేశ్వరీం దేవీం మహామాయాం జగన్మయీం
యాభూత్వా ప్రకృతిర్నిత్యం తనోతి జగదధ్యతామ్ ॥

కామాఖ్యా మక్షమాలా భయవరదకరాం సిద్ధ సూత్రైక హస్తాం
శ్వేతప్రేతో పరిస్థాం మణి కనకయుతాం కుంకుమాపీత వర్ణాం
జ్ఞానధ్యాన ప్రతిష్ఠామతిశయ వినయాం బ్రహ్మ శక్రాది వంధ్య మాగ్నౌ
బిందూంత మంత్ర ప్రియతమ విషయాం నౌమి సిద్ధ్యై రతిస్థాం ॥





మధ్యే మధ్యస్థభాగే సతత వినిమితా భావహావావళీయా
లీలా లోకస్య కోష్ఠే సకల గుణయుతా వ్యక్తరూపైక నమ్రా
విద్యా విద్యైక శాంతా శమన శమకరీ క్షేమకర్త్రీ వరస్యా
నిత్యం పాతాత్ పవిత్ర ప్రణవ వరకరా కామపూర్వేశ్వరీ న:

ఇతిహరకవచం తనుస్థితం శమయతి వై శమనం తథాయతి
ఇహ గృహాణా యతస్వ విమోక్షణే సహిత ఏష విధి: సహచామరై
ఇత్యయం కవచం యస్తు కామాఖ్యా యా: పఠేత్ బుధ:
సకృత్ తంతు మహాదేవీ త్వను వ్రజతి నిత్యాదా ॥



# త్రిపురా కవచము

ఓం త్రిపురా కవచస్యాస్య ఋషిర్దక్షిణా ఉచ్యతే చంద్రశ్చిత్రాహ్వాయం ప్రోక్తుందేవీ త్రిపురాభైరవీ ధర్మార్ధ కామ మోక్షాణాం వినియోగస్తు సాధనే.

యధాద్యా త్రిపురాఖ్యాయా బీజాని క్రమత: సుత నామతో వార్భవాదీని కీర్తితాని మయాపురా

తథా త్రిపుర భైరవ్యా బీజానామపి నామత: వాగ్భవ: కామరాజశ్చ తథా త్రైలోక్య మోహన:

అవతు సకల శీర్షం వాగ్భవే వాచముగ్రాం నిఖిలరచతి కామాన్ కామరాజో వతాన్మే

సకలకరణవర్గమీశ్వర: పాతునిత్యం తనుగత బహుతేజో వర్ధయన్ బుద్ధిహేతు:

కేటైస్తు పంచ బిరిదం గదితంహి యంత్ర మంత్రం తతోను సతతం మమతేజ ఉగ్రం

తేజోమయం మహతి నిత్య పరాయణస్థం తంత్రేహృది ప్రవితతాం తనుతాం సుబుద్ధిం

ఆధారే వాగ్భవ: పాతు కామరాజ స్థధాహృది

భృవోర్మధ్యే చ శీర్షేచ పాతు త్రైలోక్యమోహన:

వితితకులకళాజ్ఞా కామినీ భైరవీయా త్రిపురపురదహాఖ్యా సర్వలోకస్యమాతా

వితరతుమమనిత్యం నాభిపద్మే సకుక్షౌ గణపతివనితా మాం రోగహానిం సుఖంచ

యోగైర్జగంతి పరిమోహయతీవ నిత్యం జగార్తి యా త్రిపురా భైరవ భామినీతి

సాయంచ భావకలితా మమ పంచభాగే నాసాక్షికర్ణ రసనా త్వచి పాతు నిత్యం

ఆద్యాతు త్రిపురేయం యా మధ్యా యా కామదాయినీ

త్రిధాతు హ్యావతాం నిత్యం దేవీ త్రిపుర భైరవీ

ఉదయదిశి సదామాంపాతు బాలాతుమాతా యమదిశిమమ మధ్యా భద్రముగ్రం విదధ్యాత్

వరుణ పవన కాష్ఠా మధ్యతో భైరవీ మామవతు సకల రక్షాం కుర్వతి సుందరీ మే

మహామాయా మహాయోనిర్విశ్వయోని: సదైవతు సాపాతు త్రిపురా నిత్యం సుందరీ భైరవీచయా

లలాటే సుభగాదేవీ పూర్వస్యాందిశి కామదా నిత్యం తిష్ఠతు రక్షంతీ సదా త్రిపుర సుందరీ



భ్రువేర్మధ్యే తథాగ్నేయ్యాం దిశిమాం త్రిపురా చయా వర్ధయంతీ భగగణాన్ పాతు త్రిపుర భైరవీ
వదనే దక్షిణస్యాంచ దిశిమాం భగసర్పిణీ త్రిపురా యమదూతాదీన్ వారయంతీ సదావతు
కర్ణయో పశ్చిమాయాం చ దిశిమాం భగమాలినీ అయోనిజా జగద్యోనిర్బలా మాం త్రిపురావతు
అనంగ కుసమా కంఠే ప్రతీచ్యాం దిశి సుందరీ త్రిపురా భైరవీ మాతానిత్యం పాతు మహేశ్వరీ
హృది మారుతకాష్ఠాయాం దేవీ చానంగమేఖలా నాభావుదీచ్యాం దిశిమాం మాతంగీ త్రిపురాపరా
అనంగమదనాదేవీ పాతుం త్రిపురభైరవీ ఐశాన్యాం దిశి లింగేచ మద విభ్రమ మంథరా
వాగ్వాదినీ రక్షతు మాం సదా త్రిపుర భైరవీ గుదమేఢ్రాంతరే పాతు రతిస్త్రిపురభైరవీ
హృదయాభ్యంతరే ప్రీతి: పాతు త్రిపుర భైరవీ భ్రూ సానయోర్మధ్యదేశే నిత్యం పాతు మనోభవ:
ద్రావణీమాంగ్రహ: పాతువాణీ మాం దుర్గమూర్ధినీ క్షోభణోమాం సదాపాతు క్రవ్యాదభ్యో నిష్ఠభీతిత:
వశీకరణ వాణీ మామగ్నిత: పాతు రాజత: ఆకర్షణాహ్వయా వాణీమాం పాతు శస్త్ర ఘాతత:
మోహన: సర్వ భూతేభ్య: పిశాచేభ్యో జలాత్తథా నిత్యం పాతు మహాబాణస్త్వాన: కామముత్తమం
మాలామాం శాస్త్రబోధాయ శాస్త్రవాదే సదావతు పుస్తకం పాతుమనసి సంకల్పం వర్ధయన్ మమ
వర:పాతు సదాధామ్నిధామతేజో వివర్ధయన్ అభయంహ్యాభయమ్ ధత్తాం సర్వేభ్యో భూతి భావనం
ఊర్ధ్వాదోభావ భూతిస్థితతర కరణౌ రక్తకీర్ణాసుచక్రా కాలాగ్ని ప్రఖ్యారోచి: సకలసురగణైరర్చితా
ముండమాలా
జ్ఞాన ధ్యానైకతాన ప్రబల బలకరం తత్వభూత ప్రతిష్ఠం పాతాదూర్ధ్వ తథాద: సకల భయభృతో
భోగభీరోస్తు విద్యా
“హ:” పాతు హృదిమాం నిత్యం “స:” శీర్షేపాతునిత్యశ: “ర” పాతు గుహ్యదేశేమాం “సౌ:” పాతుకంఠ
పార్శ్వయో
రకారో మమనాడీషు శిర:పాతు సర్వదా శక్ర: పాతు సదాకాశో బ్రహ్మారక్షతు సర్వద:

విద్యావిద్యా భావినీ కామరూపా స్థూలసూక్ష్మ మాయయా ఆదిమాయా
బ్రహ్మేంద్రా ద్యైర్చితా భూతిదాత్రీ రక్షాం కుర్యాత్ సర్వతో భైరవీమాం
ఆద్యామధ్యా భావినీ నీతియుక్తా సంయక్ జ్ఞానజ్ఞేయ రూపాపరాయా
ఆదావంతే మధ్యభాగే చతారాపాయాద్ దేవీత్రైపురీ భైరవీ యా
యన్మంత్రభాగ తంత్రాణాం యంత్రాణామపి కేశవ:





బ్రహ్మ రుద్రస్య జానాతి తత్వ నాన్యో నమోస్తుతాన్

త్వం బ్రహ్మణి భవాని విశ్వభవితుర్లక్ష్మీ రతిర్యోగినీ

త్వం వాగ్మీ సుభగా భవాయుతయుగం మంత్రాక్షరం నిష్కతం

వర్ణాస్తే నిఖిలాస్తనా వచలితస్త్వం కామినీ కామదా

త్వం దేవీ త్రిపురే కవిత్వమమలం సౌభాగ్యముచ్చై: కురు

ఇదంతు కవచం దేవ్యాయో జానాతి సమంత్రవిత్

నాధయో వ్యాధయస్తస్య నభయం చ సదా క్వచిత్ ॥



